# ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక

[ఏబదిఐదవ సంవత్సరాది సంచిక]

విశ్వావసు : 1964 - 65



సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్





వెల రు. 7-50

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము


ఆదిలాబాద్
నిర్మల్
నిజామాబాద్
కరీంనగరు
వరంగల్లు
భద్రాచలం
కొత్తగూడెం
హైదరాబాద్
ఖమ్మం
నార్కెట్‌పల్లి
నల్గొండ
మహబూబ్‌నగరు
వనపర్తి
విజయవాడ
గుంటూరు
ఏలూరు
కొవ్వూరు
తాడేపల్లిగూడెం
కాకినాడ
నర్సాపూరు
భీమవరం
గుడివాడ
మచిలీపట్నం
తెనాలి
రేపల్లె
ఒంగోలు
చీరాల
కర్నూలు
అనంతపూరు
కడప
నెల్లూరు
తిరుపతి
చిత్తూరు
ఎక్స్‌ప్రెస్ సర్వీసులు
రాత్రి సర్వీసులు

సంచిక: **ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక** విశ్వావసు:

55 1964-65

# విషయానుక్రమణిక



## గమనిక:

75వ పుటలో ఉండవలసిన ఛాయాచిత్రం 211 వ పుటలోను, 211 వ పుటలో ఉండవలసిన ఛాయాచిత్రం 75 వ పుటలోను పొరపాటున పడినవి. దీనిని గమనించ ప్రార్థన.



బొంబాయిలో ఆంధ్రపత్రిక స్థాపన మొదలు ఆంధ్రపత్రికా కార్యాలయంలో అనవరతం అర్చనలు అందుకుంటున్న మహాగణాధిపతి.




తొలిసంచికలోని తొలిప్రకటన



స్థాపకులు:

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు



శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు, వారి సతీమణి శ్రీమతి రామాయమ్మగారు

(బొంబాయిలో ఉన్నప్పుడు)

# విన్నపము

[1910 సాధారణ సంవత్సరాది సంచికనుండి]

భగవదనుగ్రహమువలనను నాంధ్ర మహాజనుల యాదరణాతిశయమువలన నీ సంచిక బహిర్గతము గాఁజాలినది గ్రంథాదిని స్వకీయ విషయిక ప్రశంసను జేయుట సామాన్యము కార్యారంభమున సంభ్రమ విషాదములును, గార్యాంతమున స్వోత్కర్షాభిలాషయును జనించుట సహజము. విజయాఖ్య సార్థక నామధారియైన యర్జునునకు సైతము యుద్ధారంభాంతములందు విషాదాభిమానములు గలిగినవి కాని శ్రీకృష్ణుని హితోపదేశమువలన నీ విషాదాభిమాన భావనలు దొలఁగినవి. స్వల్పారంభములకును గార్య సాధనానుకూలంబులైన కారణంబు లనేకములు గాన వాటిని నిరూపించుట దుర్లభము. సామాన్యముగఁ గార్య పరిణతివలనఁ గారణ సంపత్తి యూహింపఁదగియుండును. కాని సహజ స్వాభిమానమువలనఁ గారణసంపత్తిస్వోత్కర్షముగఁ బరిణమించవచ్చును. గ్రంథారంభమునఁ బీఠికను వ్రాయుటకుఁగల ప్రయోజనము స్వకీయకార్యక్రమమును నిరూపించుటయును, నితరుల సహాయమునుఁ గృతజ్ఞతా పూర్వకముగ గ్రహించుటయును.

ఆంధ్రభాషయందు సంవత్సరాది సంచికలను ముద్రించుట కిదియే ప్రథమ ప్రయత్నము దీని ముద్రణము పుష్యమాసాంతమునం దారంభమై చైత్రమాసాదిని ముగిసినది సుమారు రెండున్నర మాసములలో ముద్రణము సాంతమైనది ఆంధ్ర ముద్రాక్షరశాలలు లేని బొంబాయినగరమునందుఁ బత్రికా నిర్వహణము కష్టతరముగ నున్నది పత్రికకుఁ దోడుగ స్వల్ప కాలములో నీ సంచికను ముద్రించుటకుఁగల వ్యయ ప్రయాసములఁ జదువరు లూహింపఁగలరు ఈ కార్యవేగమువలన నీ సంచికయందనేక లోపము లుండుట సహజము. సజనులు గుణగ్రహణులు దోషపరాఙ్ముఖులు వ్యాసలేఖకులు ఈ సంచికకుఁ బ్రధాన పోషకులు. వారి స్వార్థాభావ సహాయమువలన నీ కార్యము కొనసాగినది. కొన్ని వ్యాసములు సకాలమునఁ జేరినవి. కొన్ని విళంబముగఁజేరినవి. కొన్ని చేరనేలేదు చేరినవాటిలోఁ గొన్ని వ్యాసము లతిదీర్ఘములు. ఇందువలన ముద్రణాది వ్యవస్థలలో ననివార్యములైన లోపములు గలిగి సామ్యత్వాభావము గొంత యేర్పడినది. కాని దీనిలో ముద్రితములైన వ్యాసములు భాషాభిమానులచేతను, భాషాభిజ్ఞులచేతను వ్రాయఁబడుటంజేసి, యవి భాషాభివృద్ధికిని భాషా జ్ఞానాభివృద్ధికిని దోడ్పడఁగలవు ఆంధ్రదేశమునందు భాషాభిమానులు, విద్యావంతులు గ్రంథకర్తలు, సంఘ సంస్కరణ పరాయణులు మొదలగు పూజారు లనేకులు గలరు ఈ మహనీయుల సౌశీల్య సద్భావన లాంధ్రలోకాభివృద్ధికిఁ దోడ్పడుచున్నవి. ఈ సత్పురుషుల కృత పరిచయమును దృఢపరచుటయే ఈ సంచిక ప్రధానోద్దేశము ఆంధ్రుల యాదరణ పోషణవలన నాంధ్రపత్రిక దేశమునందంతట నల్లుకొనుచున్నది ఈ యాదరణానురాగ భావములను బలపరచుటకై ఈ సంచిక ముద్రింపఁబడి చందాదారుల కుచితముగా నియ్యఁబడుచున్నది. ఈ సంచికయందు 248 పుటముల వ్యాసములును, 126 చిత్రపటములును ముద్రింపఁబడినవి రెండు రూప్యముల చందాధనమునకుఁ బత్రికను, సంచికను నందఁజేయుచుఁ బత్రికవలనఁ బొందెడి లాభమును గ్రాహకు లూహింపఁగలరు. ఈ సాహసోద్యమ మనేక దురూహాపోహలకుఁ గారణముగా నుండినది. కాని వాటి నిరూపణ నిరసనము లిచ్చోట ననుపయోగములు. సుందర రూపముతోఁ బ్రత్యక్షముగానుండు నీ సంచిక యా దురభిప్రాయముల రూపుమాపఁగలదు. ఈ సంచికను గైకొనువారు దానియందుఁ గన్పట్టు లోపాలోపములఁ దెలిపిన నవి కృతజ్ఞతా పూర్వకముగ గ్రహింపఁబడును.

ఈ సంచికను బ్రచురించుటకుఁగల సామర్థ్య మాంధ్ర మహాజనుల సాహాయ్యమువలనఁ గలిగినది. వారిలో ముఖ్యు లిచటఁ బేర్కొనఁబడి వారలకు సవినయంబుగ వందనంబు లర్పించఁబడుచున్నవి 1 వ్యాసములను వ్రాసి పంపి భాషాభిమానమును వహించిన స్త్రీ పురుషులు, ముఖ్యముగ విజ్ఞాన చంద్రికా గ్రంథమాలకు సంపాదకులగు కొమర్రాజు లక్ష్మణరావుగారు వ్యాసములను వ్రాసియు, ఛాయా చిత్రపటముల నందజేసియు, కార్యోపక్రమణమును నిరూపించియును గడు ప్రయాసమున కోర్చి సహాయమును జేసిరి 2. రఘుపతి వెంకయ్య బ్రదర్సుగార్లు:—వీరు చెన్నపురిలో సుప్రసిద్ధులైన ఛాయా చిత్రకారులు. తమ కళానైపుణ్యమును జూపుచు ఛాయా చిత్రపటములనుండి సులభముగను సుందరతరముగను అతి శీఘ్రముగ ముద్రణాసాధనములను గల్పించి యిచ్చిరి. 3. ఆనంద ముద్రాక్షర శాలాధిపతులు:—4. వైజయంతి ముద్రాక్షర శాలాధికారులు:—5. భువనగిరి రంగయ్య శ్రేష్ఠిగారు —6. చిత్రకళా ముద్రణా యంత్రాధిపతులు:—7. ఛాయా చిత్రపట ప్రేక్షకులు:—తమ చిత్ర పటములను బంపినవారలు, ఇతరుల చిత్రపటములను సంపాదించి పంపినవారలు, ఛాయా చిత్రపట ముద్రణా సాధనములఁ బంపినవారలు:—8 తత్త్వ వివేచక ముద్రాక్షర శాలాధిపతులు:—వీరీ సంచికలోని మూడవవంతు పుటలను జిత్రపటముల నన్నిటినిఁ ద్వరలోఁజక్కఁగా ముద్రించి కార్యభారమును నిర్వహించిరి.

ఈ కార్య సాఫల్యమునకుఁ దోడ్పడిన మిత్రు లనేకులు గలరు. వారల సౌహార్ద భావమునకు వందనములు. చేరిన వ్యాసములలోఁ గొన్నిటి ముద్రించుట కవకాశము గలుగలేదు. ఈ వ్యాసలేఖకులు మన్నించుటకుఁ బ్రార్థితులు. ఛాయా చిత్ర పట ముద్రణా వ్యవస్థలలో లోపము లున్న మన్నింపఁ బ్రార్థితులు.

స్త్రీల చిత్రపటము లాలస్యముగాఁ జేరినందునఁ జివరను వేయ వలసి వచ్చినది. అర్జున విజయమునకు శ్రీకృష్ణాదులు గారకులు. ఆంధ్రపత్రికా విజయమున కాంధ్రులు గారకులు. బాల్యావస్థయందున్న నీ పత్రికయందు లోపము లుండుట సహజము. ఆంధ్రపత్రికయును యథాశక్తి దేశ సేవను జేయ యత్నించుచున్నది. ఈ బాలపత్రికం దమ పుత్రికా రత్నంబులుగ వారిచే పెంచి పోషించుట కాంధ్రలోకాలంకారులైన వరనారీమణులు ప్రార్థితులు. సాధారణ సంవత్సరమునఁ బరమేశ్వరుఁ డందరికిని శాంతి సంతోషములఁ బ్రసాదించునుగాక.

—పత్రికాధిపతి.

# PUBLISHERS' NOTE.

The Andhra Patrika, though comparatively young, is well received and patronized by the Telugu people. These contributions are published in a book form with a view to awaken more interest in the Telugu language in general and in the Andhra patrika in particular. With the kind help and co-operation of the Andhra people, the puplishers have been able to bring out the book in a short time and they take this opportunity of gratefully acknowledging their help and co-operation. Our thanks are specially due to those Telugu Scholars who readily contributed to this Number, to those ladies and gentlemen who accorded permission to print their pictures in this special Number, to Messrs.R Venkiah Bros, the well-known Photographers of Madras, who prepared many of the photo zinco blocks used in this book, to the Proprietors of the Vyjayanthi and the Ananda Presses and lastly to the Proprietors of the Tatwa-Vivechaka Press who printed the pictures with care and promptitude. The book is presented as a souvenir to the subscribers of the Andhra Patrika with a hope that the Andhra people will patronize the paper more liberally in future.

# ఆంధ్రపత్రికా ప్రశంసలు

**[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]**

మహామహోపాధ్యాయబిరుదాంచితులగు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మగారిచే వ్రాయఁబడినది.

కం. రంజించె నాంధ్రభాషా సంజీవని చెన్నపురిని—సమగనె బొంబా
యిం జెలఁగు నాంధ్రపత్రిక రంజించు ననేక విషయ రాజిం జనులన్.

గీ. ఆంధ్ర భాష సంజీవని యన్న డొప్పె వద్ది యష్టాక్షరి యనంగ నంత విప్పు
డాంధ్రపత్రిక యిద్ది పంచాక్షరిగను దగెడు శ్రీముఖి యది యిది తత్పుమధ్య.

కం. పూర్వదిశఁ బొడముటనొ వాఁ బూర్వాచారులనె యద్ది పారి వలరించెన్
పర్వాచార విచారణ నర్వాచీనులను గూడ వలరించు నిదే.

ఆ. అద్ది పౌర్ణమాసి నాంధ్ర సంజీవని పూర్ణచంద్రుపోల్కిఁ బొడముచుండె
నాంధ్రపత్రిక యిది యావిర్భవిలు బుధవారమందు వృద్ధి పరిఢవిల్ల.

ఉత్సా. అరయ నాంధ్రపత్రికయన నర్థ మిట్లు గ్రాహ్యమౌ
ధరణి నాంధ్రు లెల్ల దీనిఁ దప్పకయె గ్రహించి యే
పారయువలయు సార్థకాఖ్య బుద్ధిమంతులైన నం
చు రహి నిట వచించు రత్న సూరి బుధ హితంబుగన్

శా ఆసక్తిం గలిగించె భాష నది యాద్యంబౌట శ్రీయాంధ్రభా
షా సంజీవని స్వాఖ్య సార్థకముగా సర్వార్థ సంయుక్తిచే
వాసిం గాంచె నిదాంధ్రపత్త్రిక ప్రజా బాహుళ్యసమ్మోదకం
బై సంపత్సముదంచితంబునయి నిత్యశ్రేయముం బొందెడున్.

విశేషార్థములు —ఆంధ్ర భాషా సంజీవని, ప్రజోత్పత్తిసం॥ విజయదశమియందుఁ గలిగెను ఆంధ్రపత్రికా ప్రశంస పద్యషట్క మిద్ది ఇపుడు గల్గెను సౌ వి ద. సమ—లక్ష్మితోడఁ గూడినది ఇది, తత్పుమధ్య—ఆ గజలక్ష్మిని మధ్య భాగమునఁ గలది.

బాలకవి—భోగరాజు నారాయణమూర్తిగారిచే వ్రాయబఁడినది.

ఉ ప్రాలను దేనియల్ మధుపముల్ దమిఁదీరఁగఁ ద్రాగునట్లుగా
మేలగు ముద్దు మాటలను మీరు లిఖించు వినోద వార్తలన్
జాల ముదంబునం జదివి సంతస మొందరె యాంధ్రపత్రికన్ ?
బాలురు బాలికామణులు పండితవర్యులు పామరుల్ భువిన్.

సీ. సంఘ సంస్కరణాను సరణుల కెనలేని సంఘ సంస్కరణాను సరణగతులు
వాణిజ్య విషయ సద్వర్తుల కెనలేని వాణిజ్య విషయసద్వాక్యతతులు
చాతుర్యయుత కథా సక్తుల కెనలేని చాతుర్య యుత కథా సంచయములు
నఖిల వార్తా వినోదాత్మల కెనలేని యఖిల వార్తా వినోదాతిశయము

తెనగు నీ పత్రిక నయారే యిన్నిగతుల నెల్లవారి యుల్లములు రంజిల్లఁజేయ
నాంధ్రపత్రిక నెల్లరు నాదరింప వలదె భాషాభిమానులై వరలు నెడల?

గీ. ఇంగిలీషు పత్రికలను నెల్లవారు తెలిసికొనువారె తద్భాష దెలియకున్న?
నాంధ్ర భాషార్ణవంబున నమృతభాండ మటుల జనియించి యాలోప మణఁచె నిదియ

మత్తేభ విక్రీడితము

వెల యత్యల్పము, లాభ మత్యధికమౌ విన్నాణమా! మేల్; పదం
బుల ముద్దాడగ నొప్పు, నక్కరములా! ముల్యాలు, వ్యాసంబులా!
యొలుకుందేనెలు, వింతలా ! హృదయమం దుత్సాహ మొందించు; నిం
పలరంగా మన యాంధ్రు లెల్లరును దోడ్పై దీనిఁ గాపాడరే!

సీ. ఆంధ్రదేశంబున నఖిల గృహములకుఁ బచ్చతోరణమయి ప్రబలుఁగాక!
విద్యార్థులకును సద్విద్వజ్జనులకును కరభూషణంబయి గ్రాలుఁగాక!
కడువేడ్క మెప్పొంది కాంతామణులచేత వడి వడి ముద్దులు బడయుఁగాక !
ఆంధ్ర భాషాంగన కనయంబు విహరింపఁ బూలవనంబయి పొనఁగుఁగాక !

తే. గీ. వింత కథలకు నిలయమై వెలయుఁగాక ! వార్తలకుఁ బుట్టినిల్లయి వరలుఁగాక
చండకరుఁడును చంద్రుండు నుండుదాక ఆంధ్రపత్రిక ధరణిలో వలరుఁగాక !

అష్టావధాని రామడుగు శీతారామశాస్త్రిగారిచే వ్రాయఁబడినది.

అయ్యా, తాము వెలిపఱచిన యాంధ్రపత్రిక జూడ జూడ మిక్కిలి యానందకరంబై పండితపామరజనంబుల హృదయారవిందమ్ములకు నవనవోన్మేషశాలియగు నభోమణి పగిది విలాసకరంబయ్యె వెండియుం దీని వర్ణింప చతుర్ముఖ పంచముఖ షణ్ముఖాది సహస్రముఖులకైన శక్యంబు కాదని తలంచెద నైనను నా సామర్థ్యంబు కొలంది వ్రాసిన పద్యంబులు వాక్యంబులందు బ్రచురింప వేడెద

ఉ వారు కరాభిరామ నవ సారస గోరస సార పూరితో
దార విశేష చిత్ర విశద ప్రకట స్ఫుట భాసమావ శ్యం
గార చరిత్ర పద్య పద కల్ప పురాణ ధరామరేంద్ర న
చ్ఛాధర సుధీమణి ప్రథిత సుందర విగ్రహ శోభ నొప్పెడిన్

# లేఖలు

చిల్కలపూడి శ్రీరామలావుగారిచే వ్రాయఁబడినది

అయ్యా, దేశాభివృద్ధికై ఆవశ్యకములగు అంశములను బ్రచురపరచు మీ పత్రికా రత్నంబు గైకొను ప్రాముఖ్యత బొగడ యేరికి తరము? మీరు బ్రచుర పరచు యంశములన్నియు కొన్ని పత్రికలవలె దుర్బోధన లు చేయక ప్రజలకును, ప్రభుత్వమువారికిని మిగుల అనురాగము జనింపజేయు చున్నదనుట కేమియు నందియము లేదు మరియు నొక్కయద్భుత విష యంబు గలదు అదేమన యెల్లరకు అతి సులభముగా వశపరచు చందా మొత్తము బహుస్వల్పమైనందున అసగా రూ. 2—2—0లు మాత్రమే వెయ్యేల యీ పత్రికకుగల సర్వాంగ సుందరమగు రచన మరియొకదానికి గల దనుట అనాదరణీయము

ఆంధ్రపత్రిక ఎంతేనియు ఆంధ్ర సంతతికి మహోపకారి యని మనోవాక్కాయములచే నుడివెదను అయినను యొక కొదువ గలదు మన్నించెదరేని విన్నవించుకొనియెద. ఆ కొదువ తీర్చ మీరు పమకట్టుటే గాక ఆంధ్ర సంతతికి గూడ హితవు గలుగవలెను ఆ కొదువ నుడు ుట కెంతేని సంతసంబు సర్వజనులకు సమ్మదంబు అయ్యా, అదే మన తొందరలో దై ్వవారపత్రికగా మారి కొలదికాలములోనే దినపత్రి కగా మారునట్లుగా యొనర్చి సర్వేశ్వరుండు మీ పత్రికకుగల ఈ కొదువ దీర్చి సంరక్షించుగాత -

నందుల సుబ్బారాయశర్మగారిచే వ్రాయఁబడివది.

ఆర్య పుత్రుల కందరకు నానందదాయకంబైన నీ యాంధ్రపత్రిక భక్తి పరాయణులకు భక్తి మార్గమును వినోదాభిలాషులకు వినోదమును కలుగజేయుచు బాలురకు సయితము సుబోధకముగ నున్నదనుమాటయం దెంతమాత్ర మతిశయోక్తి లేదు మరియు పత్రికయంతయు ప్రకటన లతో నిండించి యొక్కొక్క వత్సరంబు కయిదారు రూప్యములను చందాలం గొను సంపాదకులవలె గాక రూప్యక ద్వితయమున కేబదిరెండు పత్రికలను బంపుచు పత్రిక ముద్రణాది వ్యయములకు సహితము జాలని స్వల్ప చందా నుగొని పాటుబడుచున్న యీ పత్రికాదిపతు లెంతయు వందనీయులు ఆంధ్రదేశీయులగు నా మిత్రులందరు నీ పత్రికా సుధా రసమును గ్రోలి యానందించుటకును పత్రికాభివృద్ధి కొరకును శ్రియ పతిని మిగుల ప్రార్థించుచున్నాడ

చించినాడ వేంకటరత్నశాస్త్రివారిచే వ్రాయఁబడివది.

విద్వజ్జనానందకందంబగు భవత్పత్రికా రత్నంబు మృదువచనముల చేతను నవరస సమన్విత పద్యంబులచేతను చారుని తీరున విదేశ సందేశం బులు చదువరులకు నుపదేశించుచు సంపూర్ణ మల్లికావల్లికా మతల్లికవలె నెల్లెడలం బెల్లుగ నల్లుకొనుచు చదువరులకు నక్కరకురాని విషయ మిసుమంతయునను గానరాక పలువిషయంబులు నుపదేశించుటంజేసి పత్రికా రాజమని పెక్కుమందిచే వక్కాణింపబడిన భవత్పత్రికా రత్నంబు నాకు గ్రమముగ నందుచున్నదనుటకు మిక్కిలి సంతసించుచున్నాను

# ఆంధ్రమహాజనుల కొక విన్నపము

[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]

ఈ భారత మహాఖండములోని ప్రజా సమూహములో దాదాపు రెండుకోట్లు జనులు ఆంధ్రులున్నారు. ఈ మన యాంధ్రుల కొక ప్రసిద్ధమైన భాషయు, నొక దేశమును గలదు. ప్రపంచమునంగల భాషలకెల్ల మాతృసమానమైనదని జగత్ప్రసిద్ధిఁ గాంచిన సంస్కృత మహాభాషతో సఖ్యమును గాంచియున్న మన యాంధ్రమును సాటిలేని భాషగాఁ జేయవలయునన్న యది యసాధ్యమైనది గాదు. భాషల యుచ్చనీచస్థితులనుబట్టియే యాయా జనుల నాగరికత తెలియవచ్చును గాన, మన మిప్పు డెంతటి నాగరికులమైనది లోపపూరితమైయున్న మన భాషయే వెలిపుచ్చుచున్నది. కావున విద్యాధికులైన మనదేశీయులు, ఆంగ్లేయాది వివిధ భాషలలోని సారమునంతను జీల్చి, పిప్పిచేసి, దానిని మన యాంధ్రములో నించి, దీనిని మించిన భాష లోకమున మఱియొకటి లేనట్లుచేయుట, వారికిఁ బ్రథమ కర్తవ్యమైనది. ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము మొదలగు సంఘములవారీ కార్యమును జేయఁబూనినారు గాని, వారు వేఱు వేఱుగఁ దమకుఁ దోచిన విధమున నిర్వర్తింప సాహసించుటవలన వారు చేయఁదలఁచిన మహోపయోగము త్వరలో సాఫల్య స్థితికి రాఁజాలదు. ఈ మహా ప్రయత్నమునకు ఆంధ్రదేశములోని మహాజనులగు ధనవంతులు, విద్యావంతులందఱు నేకీభవించి విద్యాపరిషత్తు నొకటి స్థాపించి, సక్రమముగాఁ బనిని జరుప నారంభించినఁ, గొద్దికాలములోనే శైశవావస్థలోనున్న మన భాష నవయువ్వన విలాసస్ఫూర్తితో వెలసి, మనదేశము నుద్ధరింపఁగలుగు ననుటకు సందేహముండదు. ఈ మహా ప్రయత్నమువలన విద్యాధికులయ్యును అర్జనాభావముచే బరితపించుచున్న ఆంగ్లేయ పట్టపరీక్షలలో గడితేరినవారికిని, సంస్కృతాంధ్ర పండిత నివహమునకును, గౌరవ జీవనోపాయము గలుగును. మనకుఁగావలసిన వస్తువులన్నింటిని మనదేశమే మనకొసఁగునంతటి ధన బల విద్యా సంపన్న మగును. ఈ మహత్కార్యమునకు ధన సహాయ మెట్లు గలుగునని మనవా రడుగవచ్చును. ప్రయత్నించిన అదియు సులభ సాధ్యమైనదే. తమ పవిత్ర జీవనములవలనఁ బ్రజల సంపూర్ణ విశ్వాసములఁ బడసిన మహాపురుషులు ప్రతి పల్లెను గలరు వారి ప్రోత్సాహమువలన నెవరికిని అంత బరువుగాఁ గానకుండునట్లు ప్రతియువారు, ప్రతి గ్రామముననున్న యార్జనపరుఁడైన ప్రతి ఆంధ్రదేశీయునియొద్దనుండియు సంవత్సరమునకు రూపాయ లేక అర్ధరూపాయ వంతున రాఁబట్టిన నా సొమ్ము లక్షల సంఖ్యకు వచ్చుననుటకు ననుమానము లేదు. కాని ఈ సొమ్మును భద్రపరిచి వివిధోపయోగ కార్యములకు వినియోగ పరచుటకు నుత్తరవాదియగు సభలోని సభికులందఱును అనుభవ పరిపూర్ణులును, విశ్వాసపాత్రులును, విద్యాధికులును, ధనవంతులును, గౌరవనీయులునుగా నుండఁగలిగిన, ధనము ప్రోఁగగు

టకుఁగాని, దానివలన దేశమునకు లాభము కలుగుటకుఁ
సందేహముండదు. అట్టి మహా పురుషులు మన దేశమునఁగల
అట్టి సత్పురుషులంద ఱేకీభవించి, సభలు చేసి ధనమును క్రో
రించి మన యాంధ్రదేశ పట్టణములలో విద్యావ్యాప్తికిని, వా
జ్యమునకును, బరిశ్రమములకును అనుకూలాతిశయమును గలి
యొక పట్టణము నేర్పరచి, యొక గొప్ప ధనాగారమును,
శ్రమ యంత్రశాలల నచ్చట స్థాపింపవచ్చును. ఇంతియుఁ
యర్హులైన విద్యాధికులను విదేశముల కంపి, వివిధ పరిశ్ర
విద్య వారికి నలవడఁజేయవచ్చును. విద్యాపరిషత్తును స్థాపి
గ్రంథ భాషాంతరీకరణ వ్యవహారమును జరుపుటకును, ముఖ
శ్యకమైన సంపూర్ణ నిఘంటువు నొక్కటిని రచింపఁజేయ
కునుఁ బనిఁ బూనవచ్చును. దీనివలన మన యాంధ్రులకు మ
పట్టణ మొక్కటి లేని లోపము దొలగును. బహువిధ పరిశ్ర
ములవలన బహుజన జీవనోపాయములకు మార్గము గలుగు
దీనివలన నాంధ్ర విశ్వ విద్యాలయ మొక్కటి తలచూపుట
కాశము కలుగును. దానినిబట్టి బహువిధ పరిశ్రమ కళాశ
లుత్పన్నము కావచ్చును పాశ్చాత్య పద్ధతి ననుసరించి, యాం
భాషలో సమస్త విద్యలును, సమస్త పరిశ్రమలును, విద్యా
లకు నేర్పుటకు మనకు వీలు గలుగును దీనినిబట్టి విద్యా
లల్పవయస్సులోనే, యల్ప ధన వ్యయముతోనే పాండిత్య
గడించి, తమ విద్యా ప్రభావమునుబట్టి తాము ప్రవేశించు
పరిశ్రమములోను, వ్యయ ప్రయాసలఁ దగ్గించి, లాభము నిన
డింపఁజేయఁగల నూతనాంశములను గనిపెట్ట సమర్థు లగుదు
కల్పనాశక్తి లేని లోపముచే బహుకాలముగాఁ గాంతిఁ దొఱఁగియు
మనదేశము మరలఁ దేజోవిరాజితమై మహోన్నతి గాంచు
ఆంధ్రభాషకుఁదోడు విద్యార్థులందఱికిని, ఆంగ్లేయ హిందీ భా
లలో అఖండ పాండిత్యమును, విధాయకముగఁ గలిగించిన,
మన దేశముననే కాక ప్రపంచమంతయు వారు సంచారము చేఁ
గలిగి, వివిధోపయోగ వార్తల సంగ్రహించి, మన దేశోన్నతికిఁ దో
పడుదురు. తప్పని పనిగా స్త్రీ పురుషుల నందఱిని నీతి వి
బలయుతులుగాఁజేసి యొక్కొక్క పరిశ్రమ విద్యలో వారికిఁ
శమును గలిగించిన, మన యాంధ్రులందఱును బురుషార్థ
లగుటవలన, వారిలో భూమికి బరువుగాఁదోచువా రెవ్వరుండ
ఇదంతయు ననుకూలురై, ప్రజాహితకారులై, న్యాయవంతు
సహనశీలురైన పాలకుల కాలములోఁ బ్రజలు చేయవలసిన
కాని రాజులు బలాత్కారపరచి చేయవలసిన పనికాదు. ఈ
మనకు ధనలోపము లేదు. దీనికై పాటుపడు సామర్థ్య లో
లేదు. కాని దేశ భాషాభిమాన లోప మొక్కటియే దీని కాటంక
యున్నది. ఆ యభిమానాగ్నియే ప్రతియాంధ్రుని హృదయ

లోను బుట్టి ప్రజ్వరిల్లిన మన కార్య సాఫల్యమునకు మన పాలకు లగు నాంగ్లేయుల సత్త్వభుత్వకాలముకంటె మంచి సమయము మనకు దొరకదు. ఈ కార్యసాధనవలననే మనము ప్రస్తుత బాల్యావస్థను బాసి, యువావస్థను బడయఁగలిగి "పుత్రం మిత్రవ దాచరేత్" అను నుడి ననుసరించి భావజ్ఞులగు మన పాలకుల మైత్రికిఁ బాత్రులు గాఁ గలుగుదుము బద్ధకంకణులై మన పాలకులు జేయఁబూనిన మేలుపనిని మనము ఫలింపజేసినవారల మగుదుము వారి పాలననుండి మనకు హిత మాచరింపనెంచిన పరమ దయాపరుఁడైన పరమేశ్వరుని యాజ్ఞను పాలించినవార మగుదుము. తక్కిన మన దేశ భ్రాతృవరుల కందఱికిని మనము మార్గదర్శకుల మగుదుము.

ఆంధ్రదేశ బాంధవులారా! ఇది యొక గొప్ప విషయము. ఈ విషయమును గురించి ధీమంతులును, విద్యావంతులునైన తమబోటులకు విశేషముగఁ దెలియఁజేయ నావశ్యక ముండదు. నూతన సంవత్సరాది దినమున, మన దేశోన్నతి కావశ్యకమగు నూతనాంశము నొక్కటిని, తమ యోచన కొరకుంచుట తన కర్తవ్యమని తలఁచి, మా యాంధ్రపత్రికా బాలిక, పై విషయమును దమ ముందటఁ బెట్టినది.

ఉ శీలము శాస్త్ర విద్యయును శేముషి నాఁబడు దివ్యభూషలన్
దాలిచినట్టి ధన్యులు వదాన్యులు నౌ తమ రాంధ్ర పత్రికా
బాలిక చేయు విన్నపము భవ్యమతిన్ దలపోసి చూచి దో
షాలిని బోనడంచి మన యాంధ్ర సతీమణి నుద్ధరింపరే.

# ఆంధ్రులు

**[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]**

ఆసేతు హిమాచల పర్యంతంబునుఁ బ్రాక్పశ్చిమ సముద్రముల నడుమనుఁ దనరారెడి భారతమాతా సంతతివార లనేక జాతీయులు తల్లులు స్వశరీర రసముచేఁ దమ బిల్లలఁ బోషింతురు. తల్లులకుఁ దల్లియగు దేశమాత స్వకీయ పరకీయ భేదములేక దేశవాసుల నెల్లరఁ గాపాడును. క్షీరసాగర మథనంబున దేవదానవులు గలుముల వేలుపునుఁ గాంచినటులు మహాసముద్ర మథనంబున భారతమాత ప్రభవించినది. కమలమునుండి మంగళ దేవత వలెఁ గమలాకారముగల లంకనుండి భరతఖండము వెలువడినటులఁ దోచుచున్నది. ఈ దేశమాత కున్నత నగరాజం బుత్తమాంగంబు వలెను, సముద్రశాఖలు బాహువులభంగిని, సుజల పూరితంబులైన నదీ నదంబులు ప్రాణాధారంబులైన రక్తనాళికల రీతిని నొప్పుచున్నవి. భరతఖండమున లేని సుఖ శీతోష్ణస్థితి వేరొక దేశమునందుఁ గనఁబడదు భూమి ఫలవంతమై సస్య సమృద్ధిని గలిగియున్నది. ఈ సుఫలత్వము స్వదేశ సంతానాభివృద్ధికినిఁ బర దేశీయుల రాకకును ముఖ్యకారణము.

హైందవు లార్యులనియు నార్యేతరులనియును రెండు విధములుగ నున్నారు కిరాతులు, భిల్లులు, చెంచులు, కోయలు మొదలగు వనచరు లాదిమ దేశీయులు. ద్రావిడు లార్యేతరులలో వేఱొక జాతీయులు. ద్రావిడు లాదిమ దేశీయుల నిర్జించి దేశము నాక్రమించుకొనిరి. ఆర్యులు ద్రావిడులను దక్షిణమునకుఁ బారదోలి యుత్తర భాగముల నాక్రమించుకొనిరి. ఆదిమ దేశీయులును ద్రావిడులును గాక నార్యేతరు లనేకు లీ దేశమును నివాసముగఁ గైకొనిరి ఆదిమ దేశీయులు ద్రావిడులవలనను నార్యులవలనను జయింపఁబడి హీన స్థితియందుంచఁబడిరి ఇదియ మన దేశమునందలి హీన జాతీయుల దుస్థితికిఁ గారణము. భరతఖండమునందలి దక్షిణ ప్రదేశములందు ద్రావిడులును నుత్తర దేశములం దార్యులునుఁ బ్రబలిరి. కాలక్రమమున నార్యులు దేశమునందంతట వ్యాపించి యార్యేతరులపైఁ దమ యాచార వ్యవహారములఁ బ్రసరింపఁజేసిరి. కాని దక్షిణాపథ మార్యావర్తమువలె నార్యులకు ముఖ్యస్థానము గాలేదు. మగధరాజ్య మార్యుల రాజ్యములలోఁ బ్రఖ్యాతిగాంచిన దక్షిణ రాజ్యము నడుమ దండకార్యణమును, దానిక్రింద ద్రవిడ రాజ్యములును వ్యాపించియుండెను. వింధ్యపర్వతములకు దక్షిణమునను ద్రవిడ రాజ్యముల కుత్తరమునను నాంధ్రులు దమ సామ్రాజ్యమును స్థాపించిరి రామాయణమునం దాంధ్రరాజ్యము దక్షిణ దేశములలో నొకటిగఁ బేర్కొనఁబడినది.

> "తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాంశ్చ కేరళాన్"*

దక్షిణ దేశమునందలి యాంధ్రదేశమునందు సయితము సీతను వెదకుమని సుగ్రీవుఁడు హనుమంతుని నాజ్ఞాపించెను. ఆంధ్ర నామ మెటుల గలిగినది విచారణీయము ఆంధ్ర, అంధ్ర, తెలుగు, తెనుగు పదములు పర్యాయపదములు త్రిలింగ దేశముల నడుమ నుండుటంజేసి తెలుగు దేశముగ నెంచఁబడినదని కొందరిమతము. భూమి నల్లగా నుండుటంజేసి తెనుగునాడు లేక తెనుగుదేశ మనఁబడినదని కొందరి మతము. ఆంధ్రు లార్యులా ద్రావిడులా యను సంశయము గలుగుట సహజము ఆంధ్ర ద్రావిడ భాషలకుఁగల సన్నిహిత బాంధవ్యమునుబట్టి యాంధ్రులును ద్రావిడులలో నొక శాఖగా నెంచఁబడవలయును రామాయణకాలమునాటికి దక్షిణమునం దార్యుల రాజ్యములు ప్రబలలేదు నందులు మగధరాజ్యము నేలునపు డాంధ్రులు స్వతంత్రులుగ నుండిరి. మౌర్యవంశజుఁడైన యశోకవర్ధనుని కాలమునం దాంధ్రులు మౌర్యసామ్రాజ్యములోనివారుగ నుండిరి. ఆంధ్రరాజులు 30 దుర్గములను, 1,00,000 పదాతులను, 2,000 ఆశ్వికులను, 1000 గజములను గలిగియుండిరి కృష్ణానదీతీరమునందున్న శ్రీకాకుళము వీరికి రాజధానిగా నుండెను. రాజ్యము కృష్ణా గోదావరుల నడుమను దూర్పు సముద్రమునుండి పడమటికనుమలదగ్గర గోదావరీ నదీతీరమునందున్న సుప్రసిద్ధమైన నాశికాక్షేత్రము వరకు వ్యాపించియుండెను కొన్ని సమయములందు దక్షిణమున పెన్నవరకును నుత్తరమున జగన్నాథమువరకును వ్యాపించి యుండినది

> "జగన్నాథా దూర్ధ్వభాగా దర్వాక్ శ్రీభ్రమరాత్మకాత్,
> తావదాంధ్రాభిధో దేశః ..."

అశోకవర్ధనుఁడు లోకాంతరగతుఁడైనపుడు వాని సామ్రాజ్యము విచ్ఛిన్నముకాగా నాంధ్రులు మరల స్వతంత్రరాజులైరి. ఆంధ్రులు రమారమి 550 ఏండ్లు క్రీ పూ. 300 నుండి క్రీ. త 236 వరకు నాంధ్రదేశమును బాలించిరి. ఈ రాజులలో నేడవ పురుషుఁడు హాలుఁడు దేశభాషలఁ బోషించెను. బృహత్కథ పైశాచీభాషలో వీని కాలమునందు రచియింపఁబడినది. క్రీ. త. 111 నుండి 138 వరకు నేలిన రెండవ విలివాయకురుఁడు శకబాహ్లిక యవన ఘూర్జరాదులైన పరదేశీయుల నోడించి కీర్తిశేషుండయ్యె యజ్ఞశ్రీ యనురాజు కడపటి యాంధ్రరాజులలోఁ బ్రసిద్ధికెక్కెను ఆంధ్రసామ్రాజ్యము క్రీ త 236వ సంవత్సరముతో విచ్ఛిన్నమాయెను పిమ్మట నారవ శతాబ్దమువర కాంధ్రుల చరిత్రాంశములు దెలియవు కొందరి మతమున నాంధ్ర రాజులు ద్రావిడులు, కొందరి మతమున వా రార్యులు కాని చోళ పాండ్య కేరళ దేశాధిపతులవలె నాంధ్రులును నార్యులు గారనుటయె యుక్తి యుక్తముగ నుండెడిని. ఆంధ్రదేశమున కుత్తరమున నార్యులును దక్షిణమున ద్రావిడులు నుండుటంజేసి ఈ యుభయ

జాతీయుల యాచార వ్యవహారముల కెక్కువ సంయోగ మీదేశమునం దేర్పడినది. వీరి యాచార వ్యవహారములును, భాషా విశేషములును, గుణశీలములును, నాకార విలాసములును దీని నిరూపించుచున్నవి. ఆంధ్రదేశమునందు దక్షిణ దేశమునకన్న బౌద్ధమత మెక్కువగా వ్యాపించినది. అమరావతి, భట్టిప్రోలు, గుడివాడ, జగ్గయ్యపేట మొదలగుచోట్లనున్న స్తూపములు దీనికి నిదర్శనములు. దక్షిణదేశమునందువలె నాంధ్రదేశమునందు పెద్ద దేవాలయములు లేవు. ఆంధ్రులు వర్తకమునకై సముద్రమును దాటి దూరదేశములకు వెళ్ళినటుల నిదర్శనము లనేకములు గలవు ఆకాలమునందు వర్ణభేద మింత పట్టుదలగా నున్నటులఁ దోచదు స్త్రీలు విద్యా స్వతంత్రములను గలిగియున్నటుల విజయసింహుడైన విలివాయకురునికై వానితల్లి బలశ్రీ చెక్కించిన శిలా శాసనములవలన నూహింపఁదగియున్నది. మూఁడవశతాబ్దము నడుమ నాంధ్రరాజ్య మంతరించినది తిరిగియాఱవశతాబ్దమువరకు నాంధ్రదేశ చరిత్రాంశములు దెలియవు ఆఱవ శతాబ్దమునుండి పదునొకొండవ శతాబ్దము దనుక నాంధ్రదేశమును చాళుక్యులు పాలించిరి. ఆంధ్రరాజులు తూర్పునుండి పశ్చిమమునకుఁ దమరాజ్యమును వ్యాపింపఁజేసినటులు చాళుక్యులు పడమటినుండి తూర్పువరకు రాజ్యమును వ్యాపింపఁజేసిరి. తూర్పుదేశమునందు వెంగిపురము రాజధానిగ నుండెను. రాజ్యాభివృద్ధియైనపిదప రాజధాని రాజమహేంద్రవరమునకు మార్పఁబడియె. చాళుక్య లుత్తర హిందూస్థానము నుండివచ్చిన రాజపుత్రులు, చంద్రవంశజులు వీరికాలమునం దాంధ్రదేశమున బౌద్ధమతము తగ్గి బ్రాహ్మణమతము హెచ్చినది. ఎల్లూరా ఎజెంటాలలో నుండు గుహావిహారములు వీరి రాజ్యవ్యాప్తిని బ్రాహ్మణమతాభిమానమునుఁ దెలుపుచున్నవి. ఈ రాజులలో నిరువదియేడవరాజగు రాజరాజనరేంద్రుడు నన్నయ భట్టారకునిచే నాంధ్రీకరింపఁబడిన మహాభారతమునకుఁ గృతిపతియై తెలుగుబాసకు మహోపకారమునుఁజేసి శాశ్వతకీర్తినిఁ గాంచెను పండ్రెండవ శతాబ్దమునం దాంధ్రదేశమును చోళరాజులు పాలించిరి. ఓరుగంటి సంస్థానాధీశులైన గణపతిరాజులు పండ్రెండు, పదుమూఁడు శతాబ్దములం దాంధ్రదేశమును మహావైభవముతోఁ బాలించిరి. ఈ వంశజులలోని రుద్రమదేవియును బ్రతాపరుద్రుఁడును సుప్రసిద్ధులు. కళింగరాజులైన గజపతులు పదునాల్గవ శతాబ్దమునం దాంధ్రదేశములోని కొన్నిభాగముల నాక్రమించుకొనిరి. రెడ్డులు నీ కాలములోఁ గొంత దేశమునకుఁ బాలకులైరి. పదునాల్గవ శతాబ్దమునం దాంధ్రదేశమునందు మహమ్మదీయులు నెలవుల నేర్పరచుకొనిరి. పదునాఱవ శతాబ్దారంభమున నాంధ్ర రాజ్యలక్ష్మి కృష్ణదేవరాయల వశవర్తిని యయ్యె. ఈ శూరాగ్రేసరుఁ డాంధ్రభాషాయోషామణినిఁ బోషించి చిరకీర్తినిఁగాంచెను. పిమ్మటనాంధ్రదేశము మహమ్మదీయుల వశమైనది. ఆంధ్రదేశమునం దాంగ్లేయుల పరిపాలనము పదునెనిమిదవ శతాబ్దమునంనందు ప్రారంభమై పందొమ్మిదవ శతాబ్దమునందు సుస్థిరముగా స్థాపింపఁబడినది.

దేశాభివృద్ధికిని భాషాభివృద్ధికిని సుస్థిరమైన సత్పరిపాలనము ఆవశ్యకము. రాజ్యలక్ష్మినిఁ గాపాడఁజాలినవారలె భాషాయోషనుఁ బోషింపనోపుదురు. పూర్వము భూపతులు పండితులఁ బోషించి విద్యాభివృద్ధినిఁ జేయుచుండిరి. ఈ సత్పరిపాలకులవలన సత్కవులు, శూరాగ్రేసరులు, మంత్రిపుంగవులు, దేశభక్తులు గౌరవింపఁబడుచుండిరి. ఆంధ్రులును నితర హైందవ జాతీయుల వలె దురాచారపీడితులై యజ్ఞానాంధకారములోఁబడి తమ యుచ్చస్థితినుండి దొలగిపోయిరి. ఆంధ్రుల గత వైభవము దేశాభిమానమునుఁ బురికొల్పనోపదా? వాగనుశాసనుఁడు, కవిబ్రహ్మ, ప్రబంధపరమేశ్వరుఁడు మున్నగు సార్థక నామధేయులచే రచియింపఁబడిన కావ్యరాజంబులు భాషాభిమానమును బుట్టింపఁజాలవా? నా జన్మభూమి, నా మాతృభాష, నా స్వదేశము అని యొకసారియైనను దలపోయని తేజోవిహీనుఁడైన కుక్షింభరుఁడుండునా? నవశక్తి దేశమునందంతట దన ప్రతాపమును వ్యాపింపఁజేసి దేశి భాషాభిమానుల మనంబుల దృఢముగ నాకర్షించుచున్నది. సాధువృత్తిని బూని దేశాభివృద్ధికై ఈ ప్రతాపమును నియమించుట దేశభక్తుల విధి కాలమునుబట్టి సాధన సంపత్తియును మారినది. దేశభక్తుల దేశసేవ ఈ సాధన సంపత్తి ననుసరించియుండవలయును. లేనియెడల ననిష్టములకుఁ గారణము గాఁగలదు. దేశారాధనమునకు దౌర్జన్య మీ కాలమున నెంతమాత్రమునుఁ బనికిరాదు. దౌర్జన్యమువలన దేశమునందు సంక్షోభము గలిగి దేశాభివృద్ధికి భంగము గలుగును. దౌర్జన్య మిహపరసుఖములనుఁ బాడుజేయును, ధర్మారంభమువలన నంతరాయములు నశించి విజయము సమకూరును

ప్రస్తుతము తెలుగుబాసను మాటలాడుజనులు రెండుకోట్లకుపైగాఁ గలరు. వీర లన్నిరాష్ట్రములందును వ్యాపించియున్నారు 1,50,00,000 తెలుగువారు బ్రిటిషు ఇండియాలోను, 50,00,000 నైజాము రాజ్యమునందునుఁ గలరు. బ్రిటిషు ఇండియాలోనివారు విశేషముగఁ దెలుగు మండలములలో నున్నారు కాని రామేశ్వరమునకునుఁ గాశికాపురమునకును, రంగూనునకును క్వెట్టాకును నడుమనున్న ముఖ్యపట్టణములందెల్లఁ దెలుగువారు గలరు. వీరల నందఱ నేకీభావులుగఁజేయుట కాంధ్రభాషకు శక్తి సామర్థ్యములు గలవు. భిన్నదేశములందుండు తెలుగువారి నేకజాతీయులనుగఁ జేయుటకు మాతృభాషయె తగిన బంధన సాధనము.

హైందవుల భాగ్యవశమున నాంగ్లేయులు హిందూదేశమునకు బాలకులై దేశమునందు శాంతిని స్థాపించి దేశాభివృద్ధినిఁ జేయుచున్నారు. వీరి సత్పరిపాలనము విద్యాభివృద్ధికిని వాణిజ్యాభివృద్ధికినిఁ బరిశ్రామికాభ్యున్నతికినిఁ దోడ్పడుచున్నది. ఆంధ్రులును మిగిలిన హైందవులు వర్ధిల్లుచున్నారనుట నిర్వివాదాంశము కాని వంగ మహారాష్ట్ర ఘూర్జర ద్రవిడాది దేశీయులవలెఁ దమ జనబాహుళ్యమునకుఁ దగినటుల వృద్ధిఁ జెందునటుల తోచదు. ద్రావిడులును మహారాష్ట్రులును ఘూర్జరులును నాంధ్రులకన్న సంఖ్యాబాహుళ్యమునఁ దక్కువగనున్నను శక్తి సామర్థ్యములం దాంధ్రులను మించియున్నారు. దీనికి ముఖ్యకారణము వారల యధిక విద్యాభివృద్ధి. తెలుగుదేశమునందు దక్షిణదేశముకంటెఁ గళాశాలలును బాఠశాలలును దక్కువగ నున్నవి చెన్నపురియందు దేశీయులచేఁ బ్రచురింపఁబడుచున్న యాంగ్లేయ దైనిక వార్తాపత్రికలు మూఁడును నాంధ్రేతరులచేఁ బ్రచురింపఁబడుచున్నవి విశేష వ్యాసముగల తెలుగు వార్తా

పత్రిక యొకటియును లేదు. ఇంతవర కొక యాంధ్రుఁడును నున్నత న్యాయాధీశుఁడు గాలేదు. ఉన్నత న్యాయవాది పదవినిఁ బొందియుండలేదు. మండలాధిపతియును గాలేదు. ఎల్లేపద్ది జానకిరామయ్య గారొకరు మాత్రము మండల న్యాయమూర్తిగ నుండిరి. వ్యవస్థా కల్పిత పౌరసేవా పరీక్షలలోఁ (Statutary Civil Service) గృతార్థులైనవారు గానరారు. స్త్రీల కుపయుక్తమైన యున్నతవిద్యాలయ మొక్కటియైన నాంధ్రదేశమునందు లేదు. చెన్నపురిరాష్ట్రమునకు రాజధానియైన చెన్నపురి తెలుగు మాటలాడువారికి దక్షిణ సరిహద్దు అయిన నది ప్రధాన నగరంబగుటంజేసి యాంధ్ర భాషా వ్యాపన కదియె ముఖ్యస్థానముగ నున్నది. అచ్చటినుండిగాని లేక వేరొక ముఖ్యపట్టణము నుండిగాని యాంధ్ర భాషా వ్యాపనకుఁ దగిన వ్యవస్థల నేర్పాటుఁ జేయవలయును ప్రజలు విద్యావ్యాపనకై పాలకుల సహాయమునె నమ్మియుండక స్వయంసహాయమును నమ్మి పని జేయవలయును పాలకులు సేయవలసిన పను లనేకములు. వారి యాదాయ మనేక కార్యములకై యుపయోగింపఁబడవలసియున్నది. ధనము వివిధ ప్రదేశములనుండి వచ్చుటంజేసి యన్ని ప్రదేశములవారి కొరకు వినియోగింపఁబడవలసియుండును. ఇందువలననె మిగిలిన దేశీయులును విద్యాభివృద్ధికై స్వయంసహాయము రెండువిధములఁ జేయఁదగియున్నది, మొదటివిధము ధనసహాయము. రెండుకోట్లకు పైగానున్న యాంధ్రులు నిశ్చలమైన భాషాభిమానముఁ బూనిరేని యాంధ్రకళాశాలకుఁ దగిన ధన మొక్క పెట్టునఁ బోగుగాఁగలదు. మహద్భావనాంకురంబులు మహత్కార్యములకు బీజములు. స్వల్పారంభంబులె మహత్కార్యములుగఁ బరిణమించును. ఆంధ్రదేశంబున విద్యావ్యాపనముజేసి సరసశబ్దార్థాలంకృతంబును మృదు మధుర గంభీరంబునునైన దేశభాషను నుద్ధరింపఁగోరని యాంధ్రు లుందురని నమ్ముట కవకాశము లేదు ఈ దేశ భాషాభ్యుదయము మనసకలారంభములకునుఁ బునాది. ఐకమత్యమునకు మూలబీజము. పరిశ్రామికాభివృద్ధికిఁ బ్రధాన సాధనము, వాణిజ్యాభివద్ధికిఁ జతురోపాయము, జ్ఞానాభివృద్ధికి సరళమార్గము, పురుషార్థ సాధనమునకుఁ జక్కని త్రోవ.

ఇపుడు ధనార్జనమునకును జ్ఞానాభివృద్ధికిని రాజ భాషయైన యాంగ్లేయభాష యభ్యసింపఁబడుచున్నది ఈ భాష యందుఁగల గ్రంథసామగ్రి వేరొకభాషయందుఁ గానరాదు. దీని యందుగల శాస్త్రగ్రంథములకుఁ బరిమితి లేదు. మతగ్రంథములకు మితి లేదు. కల్పనా కథల కంతము లేదు. చరిత్ర గ్రంథములకు గడువు లేదు. కావ్యనాటకములకు గణన లేదు. ఈ భాష విద్యార్థులకు బరనార్హమైనదైనను నాంగ్లేయభాష యెన్నటికిని దేశభాష గాఁజాలదు. సామాన్య జనులకు విద్యాసంపత్తి దేశభాష వలననె గలుగనున్నది గాన దేశభాషను వృద్ధిచేయుట భాషాభిమానులకుఁ బ్రథమ కర్తవ్యము.

స్వయంసహాయము నవలంబించుటకు రెండవ మార్గము స్వార్థత్యాగము విద్యాధికులందరును రాజకీయోద్యోగములను న్యాయవాదివృత్తిని నవలంబించుదురేని దేశహితార్థము కంకణమును గట్టుకొనువారుండుటకు వీలుండదు ఉపాధ్యాయవృత్తి నవలంబించుటవలనను ధనార్జనము తక్కువైనను దేశహితముఁజేయుట కెక్కువ వీలు గలదు. పునహాలో ఫర్గసనుకళాశాలోపాధ్యాయులు మహారాష్ట్రదేశమునకు మహోపకారమునుఁ జేయుచున్నారు. మచిలీబందరులో స్థాపింపఁబడుచున్న యాంధ్రజాతీయ కళాశాలోద్ధారకులు స్వయంసహాయమును నమ్మి స్వార్థ త్యాగదీక్షను వహించి పనిజేయుచున్నారు. ఆంధ్రదేశీయు లీ సదుద్యమమునకుఁ దోడ్పడి దీనిం బోషింపఁ బ్రయత్నింపవలయును ఇట్టి సదుద్యమములను బోషించుటయె దేశభక్తులకు భాషాభిమానులకు బ్రథమ కర్తవ్యము.

నైజాము రాజ్యమునందు ధన సంపన్ను లనేకులు గలరు. ఆ రాజ్యమునందు 50 లక్షల జనులు తెలుగు భాషను మాటలాడువారు గలరు. వారి యభివృద్ధికై యొక యాంధ్రకళాశాల నైజాము రాజ్యములో స్థాపించుట ముఖ్యము. ఈ రాజ్యమును బూర్వము గణపతిరాజులు పాలించి యాంధ్రభాషను పోషించిరి. ఇపుడీ రాజ్యము స్వదేశ రాజ్యములలో బ్రథమస్థానము నలంకరించుచున్నది సహజ సద్గుణాలంకారులును స్వదేశ భాషాభిమానులునైన శ్రీ నైజాముగా రీ యుద్యమమునకుఁ దోడ్పడవచ్చును.

ఆంధ్రదేశ బాంధవులారా! మన పూర్వపు యున్నతస్థితిని దలపోయుడు, భాషాభిమానులారా! భాషాభివృద్ధికై ఇతర రాష్ట్రీయులు సేయుచున్న ప్రయత్నములను గమనింపుడు. మనము చేయవలసిన యత్నములను యోచింపుడు. కవివరులచే రచియింపఁబడిన భారతాది గ్రంథరాజములలోని భాషాస్వారస్యమును మాధుర్యమునుఁ గ్రోలి చూడుడు. బ్రిటిషు పరిపాలనమువలన సౌలభ్యంబులైన సాధన సంపత్తినిఁ జేపట్టుడు. దయామయుఁడైన సర్వేశ్వరుని నమ్మి దేశ భాషాహితార్థమై పనిచేయుడు. సఫలీకృతమనోరథు లచిర కాలమునఁ గాఁగలరు.

—పత్రికాధిపతి.

# ప్రస్తావన

[1912 పరీధావి సంవత్సరాది సంచికనుండి]

ఇతర భాగములవలె నాంధ్రదేశమును నభివృద్ధినిఁ జెందుచున్నది. కానియభివృద్ధి యితర ప్రదేశములందువలె వేగముగా జరుగుచున్నటులు తోచదు విద్యయందును, వాణిజ్య పరిశ్రమల యందును ఆంధ్రులు వెనుకనుఁబడియున్నారు. వా రిపుడైనను మేల్కొని స్వజాతీయాభివృద్ధికై పాటుపడినఁగాని ప్రఖ్యాతిని గడింపనేరరు. తెలుగు దేశమునందు నిరుడె వ్వటిరీతిని మండల సభలు, శాఖాసభలు గూడినవి. నియోగి మహాజనులు, వైదిక బ్రాహ్మణులు, ఆర్యవైశ్యులు, విశ్వ బ్రాహ్మణులు, కమ్మ మహాజనులు మొదలగువారు దమ శాఖా సభలను జయప్రదముగ నడిపించిరి. సభల ప్రయోజనము స్వకీయ జాత్యభివృద్ధి. ఈ యభివృద్ధి మాటలవలనఁగాకఁ గ్రియారూపమునుఁ గైకొనినపుడుకాని ప్రయోజన మేర్పడదు. కులాభిమానులు ప్రతి సమావేశ సమయమునందును చందాలను వసూలుచేసి యా సొమ్మును దమ జాతివారి విద్యాభివృద్ధికయి వినియోగించవలసియుందురు. యవ్వనులకు స్వదేశమునందునుఁ బరదేశములందును విద్యను జెప్పించు భారము సంఘముపైఁ గలదు. ఈ విషయమై ప్రతి జాతివారును దమ భారమునుఁ బూనిన విద్యావ్యాపనయును సంఘాభివృద్ధియును నతి త్వరితముగఁ గాఁగలవు. ఇందుకు వ్యతిరిక్తముగా నీ సభలు కుల పక్షపాత సభలుగాఁ బరిణమించిన దేశానర్థమునకు మూలము గాగలవు. సంఘము నా మహోపద్రవమునుండి గాపాడుట దేశాభిమానుల విధి.

## విద్యావ్యాపనము

వంగరాష్ట్ర ద్రవిడ దేశములందువలెఁ దెలుగు దేశమునందు విద్య వ్యాప్తినిఁ గాంచుటలేదు. పునహా నగరమునందలి ఫర్గ్యూసను కళాశాలనుబోలిన కళాశాల యాంధ్రదేశమునందు లేదు. బందరు జాతీయ కళాశాల పోషణములేకను వృద్ధినొందుటలేదు. స్త్రీ విద్య మిక్కిలి హీనస్థితిలో నున్నది. బొంబాయి నగరమునందు యవ్వనవతులు పాఠశాలలకుఁ బోవుటను జూచినపుడు పరమాహ్లాదము గలుగుచుండును. తెలుగుదేశమునం దీ యువతులు నలుగురు పిల్లలకుఁ దల్లులై యుత్సాహమునుఁ గోల్పోయి వార్ధక్య స్థితియం దుందురు. బొంబాయి, కలకత్తా నగరములందీయువతీమణుల ముఖపంకజములనుండి తేజోవిలాసము లుట్టిపడుచుండును. వారు యువతుల కనురూపమైన పరమోత్సాహమును గలిగియుందురు. ఆంధ్రదేశమున కా మహద్దశ యెపుడు పట్టునో తెలియదు

విద్యాభ్యాసార్థ మాంధ్రు లితర రాష్ట్రవాసులవలెఁ బరదేశములకుఁ బోవుచున్నారు. వంగరాష్ట్రమునందువలె వారల బోషించుటకుఁ దగిన నిధులుగాని, ప్రోత్సహించుటకుఁ దగిన సంఘములుగాని లేవు. విద్యార్థుల పరదేశ గమనార్థ మొక నిధి నేర్పాటు జేయుట యవసరము మహారాష్ట్రులు (పైసా ఫండు) కానీ నిధిని స్థాపించి విద్యాభివృద్ధినిఁ బరిశ్రామికాభివృద్ధినిఁ జేయుచున్నారు. ఆంధ్రులు పరదేశమున కేగిన వారలను బహిష్కారముతో సత్కరించుచున్నారు. వారు స్వదేశమును స్వగృహమును వదలి విద్య నభ్యసించుటకై పరదేశములకుఁ బోవుచున్నారు. వారే భావి పౌరులుగా నున్నారు. విదేశవాసమువలన ప్రజ్ఞా పాండిత్యములను గడించుచున్నారు. ఆ విద్యాధికులు స్వదేశమునకు వచ్చినపుడు వారలను వెలివేలులపాలు చేయకుండుటయేగాక బరిపూర్ణాదరముతో సంఘమునందుఁ జేర్చుకొనుట యాంధ్రుల ముఖ్య విధి. శొంఠి రామమూర్తిగారు గత సంవత్సరమునందు పౌర సేవా పరీక్షలో నుత్తీర్ణులై యాంధ్ర దేశమునకు సత్కీర్తిని గడించిరి. ఈ కఠిన పరీక్షయందుఁ గృతార్థులైన యాంధ్ర బ్రాహ్మణులలో రామమూర్తిగారు మొదటివారు. రాగల నవంబరులో వారు స్వదేశమునకు వచ్చినపు డాంధ్రులు వారికి హృదయంగమంబైన స్వాగతంబు నొసంగుట యుచితము.

## సంఘ సంస్కరణము

సంఘమునందు మెల్ల మెల్లగా మార్పు లేర్పడుచున్నవి. మతములు మారుచున్నవి. నూతనాచారములు ప్రబలుచున్నవి ప్రాచీనాచారము లుద్ధరింపఁబడుచున్నవి. దేశమంతయు. బరివర్తనాయత్తమైనది. సంఘ సంస్కరణ విషయమువం దాంధ్రులు ద్రావిడులకు ముందంజను వేయుచున్నారు. కాని వారి సంస్కార ప్రియత్వము దృఢరూపము వహించలేదు అతి బాల్య వివాహములు, కన్యాశుల్కములు, వరశుల్కములు స్వచ్ఛంద విహారమునుఁ జేయుచున్నవి. అతి బాల్య వివాహములు సంఘాభివృద్ధికి వేరు పురుగులుగా నున్నవి. దుర్బలత్వమునకు, వ్యాధిగ్రస్తతకు, నల్పాయుష్యమునకు నీ వివాహములు పుట్టినిల్లులు. వీటి యుపసంహారమునుఁజేసి ప్రాచీనార్యాచారావలంబనము నవలంబించుటయే చేయఁదగిన సంస్కరణములలో మొదటి సంస్కరణము. రజస్వలానంతర వివాహములు పూర్వము శాస్త్ర సమ్మతములై యాచరణయం దుండెడివి. ఇపు డీ యాచార మపరూపమైనది. దాని యపరూపమే సకలానిష్టములకును గారణమైనది. ఈ దురాచారము నుపసంహరించుటకై దేశమునందటను వివాహ సంస్కరణ మండలులు స్థాపింపఁబడుచున్నవి. సంఘ సంస్కరణాభిమాను లందఱును నీ మండలులందుఁజేరి సంస్కరణ ప్రతిజ్ఞనుఁ బూనుట ముఖ్యము విజ్ఞాన చంద్రికా గ్రంథమండలికి వ్యవస్థాపకుఁడైన శ్రీ ఆచంట లక్ష్మీపతి గారు హిందూ వివాహ సంస్కరణముయొక్క చెన్నపురి శాఖకు గార్యదర్శులు. గత వత్సర వృత్తాంతములలో వారి వివాహ మెన్ని

కను గాంచినది. శ్రీమతి రుక్మిణమ్మగారి పరిణయము పురాణ ప్రసిద్ధ రుక్మిణీ కల్యాణమువలె జనాదరణమును గాంచినది. బొంబాయియం దిట్టి వివాహము ఇంకొకటి జరిగినది. ఆ పరిణయమునం దొక యాంధ్ర బ్రాహ్మణుఁడు మహారాష్ట్ర నారీమణిని వివాహమాడెను. శ్రీమతి తారాబాయిగారు మెట్రిక్యులేషన్ పరీక్షయందు నెగ్గి ఉపాధ్యాయినిగా నెల కేఁబది రూప్యములను గడించుచున్నది. పెండ్లియాడిన కోటంరాజు పున్నయ్యగా రాంధ్ర పత్రికాభివృద్ధికై పాటుపడుచున్నారు. బాల్య వివాహములు పోయి యిట్టి యవ్వన వివాహములు ప్రబలుట శ్రేయస్కరము.

గత వత్సరమునం దాంధ్ర భాషాచరిత్రమునం దొక నూతన యుగ మేర్పడినది. భాషాభివృద్ధికై చెన్నపురియందు "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" స్థాపింపఁబడినది. ఆ పరిషత్తునకు శ్రీ పిఠాపురము రాజాగారు అగ్రాసనాధిపతి. జయంతి రామయ్యపంతులుగారు కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు. పురాణం నాగభూషణంపంతులు, వేదము వెంకటరాయశాస్త్రి, ఆచంట లక్ష్మీపతిగారలు కార్యదర్శులు. ఈ పరిషత్తుయొక్క ముఖ్యోద్దేశము 'తెలుగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు అభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట" అయియున్నది. పరిషత్తును స్థాపించుటవలన నాంధ్ర భాషకుఁగల యొక గొప్ప కొరత తీరినది. కార్యనిర్వాహక సభ్యులు శ్రద్ధాళువులై కార్యమును నిర్వర్తించిన భాషాభ్యుదయమునకై ఈ పరిషత్తు మహోపకారమును జేయఁగలదు. గత సంవత్సరమునందు దానికి వెనుకటి సంవత్సరమునందువలె రమారమి 600 గ్రంథములు దెలుగు భాషయందుఁ బ్రచురింపఁబడినవి. వాటియందు ముప్పాలు పద్య రూపమును వహించినవి. శేషించినవి గద్యరూపమును గైకొనినవి. గ్రంథ ప్రచారణీ సంఘము లభివృద్ధినిఁ జెందినవి. ఆ సంఘములు నూతన గ్రంథములను బ్రచురించుచు భాషా సేవను యథాశక్తిని చేయుచున్నవి. నిరుడు కవివరులందఱును తమ ప్రజ్ఞా పాండిత్యములను శ్రీ పంచమజార్జి రాజరాజేంద్రుని రాజ్యాభిషేచన మహోత్సవమును వర్ణించుటకై వినియోగించిరి. నానావిధములైన పద్యములు, పాటలు, శతకములు, గ్రంథములు శ్రీ జార్జి చక్రవర్తిని ఢిల్లీ దర్బారును వర్ణించుచుఁ బ్రచురింపఁబడినవి. కొన్ని పద్యము లీ సంచికయందు హైందవుల రాజభక్తికిని, నాంధ్రుల కవిత్వాభిమానమునకును, కవిత్వాభినివేశమునకును నిదర్శనములుగా ముద్రింపఁబడినవి. విద్యావ్యాప్తినిఁ గాంచిన పాశ్చాత్య దేశములయందు వచన గ్రంథము లధికముగను పద్య గ్రంథములు స్వల్పముగను రచియింపఁబడుచుండును. గ్రంథకర్తల విద్యాభినివేశనము జనసామాన్యమునకుఁ గల గ్రంథపఠనా సక్తియును దీనికిఁ గారణములు. తెలుగు గ్రంథకర్తలు తమ పాండిత్యమును వచన రచనలకై యధికముగా నుపయోగించిన జ్ఞానము వ్యాపించి భాషాభ్యుదయమును దేశాభ్యుదయమునుఁ గాఁగలదు. గత వర్షమునం దాంధ్రలోకమునందు గవుల కలహములు ముదిరినవి. ఈ కలహములు పక్షపాత భావమునుఁ బెంపొందించినవి. యుక్తాయుక్త విచారమును వెనుక నుంచినవి. తుదకు జాతి ద్వేషాభిమానములుగాఁ బరిణమించినవి. భాషా యోష నియోగి వైదికభేదమును బ్రాహ్మణ శూద్రపక్షపాతమును బూనక దన బిడ్డలను సమాన భావములతో సంభావించుచున్నది. ఈ దురవస్థనుండి భాషాభిమానులు భాషను గాపాడవలసియుందురు.

### గ్రామ్య గ్రాంథిక భాషలు

గ్రామ్య గ్రాంథిక భాషా వివాదములు పెరుగుచున్నవి. విద్యాధికుల ప్రయత్నము లాంగ్లేయభాషయందు సాహిత్యమును సంపాదించుటకై వినియోగింపఁబడుచున్నవి. సాహిత్య లాభార్థము గాకున్నను ఉదర నిమిత్తమైనను నాంగ్లేయభాష యభ్యసింపఁబడుచున్నది. ఆంగ్లేయభాష పరిపూర్ణత్వమునొందిన రాజభాష. రాజకీయ కార్యాలయములం దీ భాష వాడుకయం దున్నది. న్యాయ సభలయం దీభాష యుపయోగింపఁబడుచున్నది. శాస్త్రీయ విద్య నభ్యసించుట కీ భాషాపాండిత్య మవసరమగుచున్నది. విద్యాధికు లీ భాషను పది పదునాల్గేం డ్లభ్యసించుచున్నారు. పల్లెలయందును ఇంగ్లీషుమాటలు తలవని తలంపుగా ముచ్చటలందుఁ జేర్చఁబడుచున్నవి. ఆంగ్లేయ భాషయందుఁ బ్రవేశము గలవారి సంభాషణములు సగ మింగ్లీషు మాటలతోను సగము తెలుగు పదములతోను నిండియుండును. కారణమింటనుఁ దెలుగు వాడఁబడుచున్నది. పాఠశాలయం దింగ్లీషు నేర్పఁబడుచున్నది. ఆంగ్లేయఁ భాషనుఁ దప్పులు లేకుండను మాటలాడుట, వ్రాయుట యవసరము. ఆ యవసరము తెలుగుభాష విషయమై లేదు. ఇట్టి యవసరము గలిగినపుడె జనులు దేశ భాషల నభ్యసింతురు. వాటిని జక్కగ మాటలాడను వ్రాయను నేర్చెదరు. మహారాష్ట్ర దేశమునందు మధ్యతరగతి పాఠశాలలోఁ జదువంతయును మహారాష్ట్ర భాషయందుఁ గఱపఁబడుచున్నది. మహారాష్ట్రులు ముచ్చటలాడునపు డింగ్లీషు పదప్రయోగములు దక్కువగా వారి ప్రసంగములయందుఁ గానవగును. ఆంధ్రులకు జన సమూహమునఁ దెలుగుభాష నభ్యసించుటకుఁ దగిన యవసరము గలుగలేదు. పూర్వమునుండియును వాడుక భాషకును గ్రాంథిక భాషకును సన్నిహిత సమావేశ మేర్పడియుండలేదు. ముందెపుడైన గలుగ నున్నదేమో తెలియదు.

సంస్కృతభాషా చరిత్రమును బరిశీలించిన సంస్కృతము కేవలము గ్రాంథిక భాషగాను ప్రాకృతము వాడుక భాషగాను నుండినవని స్పష్టమగుచున్నది. విద్యావంతులు ముఖ్యముగా బ్రాహ్మణ మతాభిమానులు తమ గ్రంథములను సంస్కృత భాషయందు వ్రాయుచుండిరి. అవి సామాన్య జనులకు దుర్భేద్యముగ నుండెను. బౌద్ధులు సామాన్య జనులకుఁ దెలియుటకై దమ గ్రంథములను బ్రాకృత భాషయందు వ్రాయుచుండిరి. తెలుగుభాష కీ స్థితి యవసరమేమో విచారణీయము.

నన్నయ భట్టారకుని కాలమునుండియును వాడుకభాషయును గ్రాంథిక భాషయును వేరు వేరుగా నుండినవని యొప్పుకొనవలసియున్నది. ఆ కాలమునందును సంస్కృత పద జటిలమైన గ్రాంథికభాష గ్రంథస్థముగ నుండియుండును. 100 కి 98 వంతున జదువను వ్రాయను నేర్చినఁ ఇంగ్లండునందు సయితము గ్రాంథిక భాషకును వాడుక భాషకును సంపూర్ణ సమావేశ మేర్పడలేదు. కాని విద్యావంతులు గృహములందు మాటలాడు భాషకును, వ్యవహారములందు వాడుకజేయు భాషకును. విద్యాలయ

ములందు నేర్చుకొనుభాషకును విశేష వ్యత్యయ ముండదు. విద్యావిహీనుల విషయములో నాంధ్రదేశమునందువలె వ్యత్యయము గలదు. ఈ వ్యత్యయము విద్య వ్యాపించినకొలది యంతరించుచున్నది. ఆంధ్రదేశమునందును నాంధ్రభాష యభ్యసింపఁబడిన కొలది వాడుక బాషకును గ్రాంధిక భాషకునఁ గల దూరము తగ్గి యువి సన్నిహిత సాహచర్యమును వహించగలవు ఇపుడు కేవలము గ్రంథస్థమైన భాష యపుడు సామాన్యజన ముఖస్థము గాఁగలదు సామాన్య జనుల విద్యా వివేకముల పెంపున వారి ముఖస్థమైన భాష గ్రంథస్థము గాఁగలదు ఈ ఫలప్రాప్తికిఁ జిరకాలము పట్టవచ్చును. కాని ఈ సన్నివేశమునకై భాషాభిమానులు పాటుపడ కలిగియుందురు. విద్యా ప్రవీణులు వాడుక పదములను దమ పుస్తకములందునుఁ జేర్చుటవలన నీ సంయోగమునకు మార్గదర్శకులు గాఁగలరు. నిర్దుష్టముగ నాంధ్ర భాషయం దొక లేఖనైనను వ్రాయు శక్తి సామాన్యులకు లేదు విద్యాధికుల కుండవచ్చును. అర్ధానుస్వారములను, శకటరేఫలను, కళలను, ద్రుత ప్రకృతికములను, సరళములను, సంధులను బూర్తిగా నుపయోగించుచు వ్రాయు వాడుక తగ్గుచున్నది. కాని నింద్యమైన వాడుకభాష యంతయును నేవిధమున జూచినను గ్రాంధిక భాషగా మారనేరదు. విద్యావ్యాపనమువలన నింద్యమైన గ్రామ్య మనింద్యముగా మారగలదు. గ్రాంధికభాషయందలి యనవసర నియమములు మారగలవు. కొండమీదఁ గూర్చున్న గ్రాంధిక భాషకును పల్లపుభూమియందు నిలిచియున్న వాడుకభాషకును విద్యా వ్యాపనవలన సమాన ప్రదేశమున సమావేశ మేర్పడఁగలదు. ఆంధ్రదేశమునందు రవీంద్రనాధునివంటి భాషా నిర్మాణకుడు పుట్టినఁగాని ఈ సంయోగము గలుగుటకు వీలు గలుగదు. అంతవరకును ఈ రెండు పక్షముల వారును తగవులాడుచుండుట సహజము. ఉభయ పక్షములందును లోపము లుండువచ్చును గాని వారి యుద్యమములు భాషా సేవకై యని యొప్పుకొనవలసియున్నది.

## వ్యా స ము లు

వంగ మహారాష్ట్ర దేశములందు విద్యావంతులు పత్రికా నిర్వాహకులకు సంవత్సరాది సంచికలను బ్రచురించుటకై విశేష సహాయమునుఁ జేయుచు భాషాసేవనుఁ జేయుచున్నారు. ఉన్నత న్యాయాధీశులు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, ఉద్యోగస్థులు, డాక్టరులు దమకెంతటి తొందర పను లున్ననుఁ దీరికనుఁ గల్పించుకొని సంచికలకు వ్యాసములను వ్రాయుచున్నారు. మాసిక మనోరంజని సంధ్యావర్తమాని మొదలగు వార్తా పత్రికల సంవత్సరాది సంచికలకు సర్. గణేశనాయణ చంద్రావార్కరు, ఘాఘాగారు మొదలగు దేశాభిమానులు వ్యాసములను వ్రాసి, దేశమునకు మహోపకారమునుఁ జేయుచున్నారు ఆంధ్ర మహాజను లీ విషయమున వెనుకంజవేయుట శోచనీయము. సంవత్సరాది సంచికను బ్రకటించుటకుఁగల ప్రయోజనము విద్యావంతుల యభిప్రాయములనుఁ బ్రచురించి సామాన్య జనుల కుత్సాహ వివేకములను బుట్టించుటయియున్నది. విద్యావంతుల వ్యాసములే ఈ సంవత్సరాది సంచికకు సుభూషణములు. ఆయలంకారములు లేని సంచిక రాణింపనేరదు. ముందైనను విద్యావంతులు, దను యమూల్య విద్యాభరణంబులచే నీ సంచిక నలంకరించి మాతృభాషను బోషించుటకు బ్రార్థితులు.

ఈ లోటుపాటును నివారించుటకును వ్యాస లేఖకులకుఁ బ్రోత్సాహమును గలిగించుటకును నీ సంచికయందు ముద్రించిన వ్యాసములలోఁ గొన్ని వ్యాసములకు బహుమతు లొసంగఁబడినవి. ఆ వ్యాసము లంత యుత్తమములు గాకున్నను వ్యాసలేఖకులు దమ శక్తి కొలది వ్రాసి పంపినందులకు సంతసింపవలసియున్నది. వ్యాసలేఖనమునకు ముప్పది విషయములు నిర్ణయింపఁబడినవి. వాటిలోఁ బదియేడు విషయములను గురించి మాత్రము వ్యాసములు వ్రాయఁబడినవి. రాజ్యాంగ వ్యవహారములను గురించి యెవరును వ్రాసియుండలేదు. నూరు వ్యాసములకుఁ బైగాఁ బంపబడినవి. ఆంగ్లేయ పరిపాలనాలాభములను గురించి వ్రాసిన వ్యాసములు విస్తారముగఁ గలవు ఆ వ్యాసములన్నియును బరీక్షింపఁబడి బహుమానములకుఁ దగిన వ్యాసములు నిర్ణయింపఁబడి ముద్రింపఁబడినవి. రెండు వ్యాసములు సమానముగా నున్నపుడు బహుమానము పంచఁబడినది బహుమతు లొందిన వ్యాసములు, విషయానుక్రమణికయందుఁ దెలుపఁబడినవి.

సంచికయందు 40 వ్యాసములు ముద్రింపఁబడినవి. వ్యవసాయ పరిశ్రమల గురించిన వ్యాసములు 10, రాజకీయ విషయములగురించినవి 6, సంఘస్థితికి సంబంధించినవి 10, ఆరోగ్యము, సంగీతము, చరిత్రము, భాషాస్థితి మొదలగు విషయములకు సంబంధించినవి 14ను గలవు. ఢిల్లీనగర చరిత్రము, ఢిల్లీ దర్బారు, సంస్థానముల చరిత్రములు విపులముగ వ్రాయఁబడినవి. శ్రీ పంచమజార్జి రాజేంద్ర రాజ్యాభిషేచన వర్ణములను గురించిన పద్యములు 200లు ప్రచురింపఁబడినవి వ్యాసములందు దేశాభ్యుదయమున కవసరములైన విషయములనుఁ జేర్చుటకు యత్నముచేయఁబడినది. దేశాభిమానము, భాషాభిమానము, వ్యవసాయము, పరిశ్రమలు, రాజ్యాంగములు, సంఘస్థితి, దేశ చరిత్రము, స్త్రీల స్థితి మొదలగు విషయములను గురించిన వ్యాసములు గలవు. చదువరులు, వ్యాసములందలి లోటుపాటులను నిర్ణయింప నోపుదురు.

## చి త్ర ప ట ము లు

శ్రీ రాజదంపతుల ఢిల్లీ రాజ్యాభిషేచన మహోత్సవము దేశ చరిత్రమునం దొక సుప్రసిద్ధేతిహాసము. దేశమంతయును నా మహోత్సవమయమైనది రాజభక్తి భరితంబులైన సత్కార్మలన్నిచోట్లను ననుష్ఠింపఁబడినవి. శ్రీరాజదంపతులకు హృద్గత రమణీయంబైన స్వాగతంబొసగఁబడినది. రాజులు, మహారాజులు, శ్రీమంతులు, రాష్ట్రపాలకులు, సైనిక బృందంబులు దర్బారునకై ఢిల్లీ నగరమునందు గుమిగూడిరి. శ్రీ పంచమజార్జి రాజరాజేంద్రుని, శ్రీ మేరీ రాజ రాజేశ్వరిని, రాజ కుటుంబమును, రాజాగమనమును, బొంబాయి ఢిల్లీ నగర ప్రవేశములను, ఢిల్లీదర్బారును, వేటాడుటను, కలకత్తావినోదములను, స్వదేశగమనమునుఁ దెలుపు చిత్రపటములు 50 గలవు పురాతన సుప్రసిద్ధ సంస్థానాదీశుల చిత్రపటములు 55 గలవు. ప్రాచీన ఢిల్లీ నగర పరిస్థితిని దెలపు చిత్రపటములు 12 గలవు. హిందూదేశ పాలకులను జూపు పటములు 24 గలవు. సామ్రాజ్య శాసన సభయొక్కయు, మద్రాసు, బొంబాయి రాష్ట్రముల యొక్కయు సభా పటములు గలవు సుప్రసిద్ధులైన మహాజనుల

చిత్రపటములునుఁ జేర్చఁబడినవి. చీనాదేశ పరివర్తనమువలన సుప్రసిద్ధినిఁ గాంచిన చీనాదేశనాయకుల పటములునుఁ జేర్చఁబడినవి. జాతీయ సభాధ్యక్షుఁడైన విష్ణునారాయణధరుగారి పటము సైతమును గలదు. మొత్తమున 172 చిత్ర పటములు ముద్రింపఁబడినవి. చిత్రపట వీక్షణమువలనఁ జదువరులు దర్బారు వైభవ మాహాత్మ్యములను నూహింపనోపుదురు.

## స్వవిషయము

దైవకృపవలన మూడవ సంవత్సరాది సంచిక బహిర్గతమైనది. పత్రికా నిర్వహణము కష్టసాధ్యము. దేశ భాషా పత్రికా నిర్వహణ మత్యంత కష్టసాధ్యము ఆంధ్రేతర రాష్ట్రమధ్యను నాంధ్ర పత్రికా నిర్వహణము దుస్సాధ్యము. సామాన్యముగా దేశీయ వార్తా పత్రికా నిర్వాహకులకు లాభము పూజ్యము. గౌరవము శూన్యము. భార మధికము. విషమావస్థలవలన విషాదము జనించుట సహజము. నిరుత్సాహము గల్గుట నిశ్చయము. విషాద, నిరుత్సాహములు రక్షింపవు. ప్రజ్ఞావాదములు నిరుపయోగములు. రంధ్రాన్వేషణము సుకరము. గుణగ్రహణము దుష్కరము. చేసినది కొంచెము. చేయగలిగినది విస్తారము. తప్పు లెక్కువ. ఒప్పులు తక్కువ. సంగతి సందర్భము లిటు లుండగా స్వవిషయక నివేదన మసంగతము.

మూడేండ్లుగ నాంధ్రపత్రిక క్రమము తప్పక ప్రచురింపఁబడుచున్నది. మూడు సంవత్సరాది సంచికలు గ్రాహకుల కందింపఁబడినవి. ఈ సంచికలకై వేలకొలది రూప్యములు వ్యయమైనది. మూడవ సంచిక యందలి దర్బారు పటములను, సంస్థానాధీశుల పటములను సమకూర్చుటకయి వందలకొలది రూప్యములు వ్యయమైనవి. ప్రచురణభార మధికమైనది. ఆంధ్రదేశ భాషాభ్యుదయముల కీ ప్రయత్నము లిసుమంతయైననుఁ దోడ్పడిన ప్రయ భారములు నిష్ఫలములుగాక సఫలము లగునను నాశ నూతనోత్సాహమునుఁ బుట్టించుచున్నది.

ఆంధ్రుల యాదరణ పోషణములవలన నాంధ్రపత్రిక దిన దినాభివృద్ధినిఁ జెందుచున్నది రాజులు, విద్యావంతులు, సామాన్యులు బీదలు, భాగ్యవంతులు, స్త్రీలు, పురుషులు పత్రికను దమ యుదార సంకల్పములచేతను, వ్యాసములతోను, చందాలవలనను బోషించుచున్నందులకు వారల కనేక వందనంబులు. ఆంధ్రపత్రికాభివృద్ధి యితర ఆంధ్రపత్రికలతోఁ బోల్చినపు డాశ్చర్యముగనుండినను నది విశేషముగాదని యంగీకరింపవలసియున్నది. ఆంధ్రభాష దేశ భాషలందు మూడవదిగ నున్నది. మాధుర్యమున మొదటిదిగ నున్నది. ఇతర భాషలందు 2,000 చందాదారులుగల వార్తాపత్రికలును, దైనిక పత్రికలును నుండగా నాంధ్ర భాషయందు మంచి వ్యాపకముగల వార్తాపత్రిక లేకుండుట శోచనీయము. ఇదియే ఢిల్లీ దర్బారునం దాంధ్రపత్రికల పరాభవమునకు ముఖ్య కారణము ఈ కొరతను దీర్చి పత్రికా వ్యాపనమును జేయుట కాంధ్రులు ప్రార్థితులు. సంవత్సరాది సంచికనుఁ జదువువారందఱును గట్టి పట్టునుఁబట్టిన నచిరకాలమునం దాంధ్రపత్రిక విశేష వ్యాపకమును గలిగి దేశ భాషాభ్యుదయమున కింతకన్న నెక్కుడుగఁ దోడ్పడు గలదు ఆంధ్రదేశ బాంధవులు పూర్వమువలె ముందును దమ యుదరాశ్రయముతో నాంధ్రపత్రికను సన్మానించుటకు బ్రార్థితులు. ఆంధ్రపత్రికాభివృద్ధికై పత్రికా నిర్వాహకులకును, గ్రాహకులకును, బ్రోత్సాహము నొసంగుటకు సర్వేశ్వరుని యపార కృప దోడ్పడుగాత!

## వందనములు

చందాదారులకును, వ్యాసములను వ్రాసిన వారలకును, ఛాయా చిత్ర పటముల నంపిన వారలకును, నితర పోషకులకును ననేక వినతులు. సంచికయందలి చరిత్రాంశములన్నియును సుప్రసిద్ధాంగ్లేయ చరిత్ర గ్రంథములనుండి సమీకరింపబడినవి. ఇంపీరియల్ గెజటీర్, పురుషోత్తమ విశ్రామ మౌజీగారి దర్బారు చిత్ర పుస్తకము, ఢిల్లీ చరిత్ర గ్రంథములు మొదలగునవి విశేషముగ నుపయోగింపఁబడినవి ఈ గ్రంథోపకృతి కృతజ్ఞతా పూర్వకముగ స్వీకరింపఁ బడుచున్నది ఛాయా చిత్ర పటములను ముద్రించుటకు దగిన పట ఫలకములను జేసిన శిల్పకారులకును, సంచికను ముద్రించిన తత్త్వ వివేచక ముద్రాక్షర శాలాధిపతులకును, నితర విధముల సహాయమును జేసిన వారలకును వందనములు.

పరీధావి నామ సంవత్సరమునందు సకల జనులును సదాశా సంపన్నులై మనోవాంఛా ఫలసిద్ధిని బొంది సుఖించెదరుగాత! సకల ప్రపంచమునకును నీశ్వరుడు శాంతి సుఖములనుఁ బ్రసాదించెడుగాత! హిందూదేశము ధన ధాన్య సమృద్ధిని గలిగి యాంగ్యపదమై వర్ధిల్లుగాత!

—పత్రికాధిపతి.

# దేశోద్ధారకుని తుది రచన

[1938 బహుధాన్య సంవత్సరాదిసంచిక ప్రస్తావన]

ఓన్నమః ప్రణవార్థాయ శుద్ధ జ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీ సచ్చిదానంద పరమాత్ముని లీలా విలాస విలసితమైన విశ్వమునందు ఒక చాంద్రమానాబ్దము గతించినది. బహుధాన్య సంవత్సరము ప్రారంభమైనది గత సంవత్సరేతి వృత్తమును వ్రాయ సంకల్పించుటగాని, వర్తమాన సంవత్సర ఫలమును గుణింపబూనుటగాని దుష్కరము. మహాకాలము అనంతమైన ఈ చిత్ర విచిత్రమైన ప్రకృతి లీలలను సర్వత్ర ప్రకృతి ప్రత్యక్షముచేయుచున్నది. ఆత్మపరాయణులైన ధీమంతులు సత్యాన్వేషణమును ప్రపంచోద్ధరణమునకు వినియోగపఱచుచున్నారు. స్వార్థపరాయణులైన అజ్ఞానులు పరపీడన పరాయణులై ప్రపంచ విలయమునకు వినియోగపడుచున్నారు.

## ధర్మాధర్మ సంరంభము

ప్రవృత్తియందు ధర్మాధర్మములకును, పరార్థ స్వార్థములకును సంరంభము సహజమై ధర్మసంస్థాపనము సంభవమగుచున్నను యుగలక్షణములను యధార్థముగ గ్రహించుట దుర్లభము. ప్రపంచమంతయును శాంతిసంకల్పమును జేయుచు మహాసంగ్రామ ప్రయత్నములను చేయుచున్నది. అబిసీనియా, చీనా, స్పెయిను సంగ్రామములు ప్రత్యక్ష ప్రమాణములు.

శాంతిస్థాపనమున కేర్పడిన నానాజాతి సమితి శాంతిస్థాపనమునకేకాక ధర్మ నిర్ణయమునకును నిరర్థకమైనది. ప్రపంచమునందు ధర్మసందేహము సంభవించినప్పుడెల్ల మహాసామ్రాజ్యములు తమ మతమును చెల్లుబడి చేసుకొనుచున్నవి. కొన్ని సమయములందు ధర్మనిర్ణయములను చేసినను, నిర్ణయములు కాగితములమీద కలవుగాని క్రియారూపమును తాల్చలేదు. కారణము స్వార్థపరాయణత్వమునందుగల ప్రతిష్ఠ ధర్మమునకు కలుగకున్నది. ఆసన్నముగనున్న మహాప్రళయమును నివారించుట ఎవరికిని సాధ్యము కాదు. ఇది స్వకర్మానుఫలము. నాయకులు సంగ్రామ కర్మల నారాధించుచున్నను ప్రజలు శాంతిని కోరుచున్నారు.

## బహుధాన్య సంవత్సరము

సంవత్సరాదిని ప్రజలు శాంతి సంకల్పము చేసి, శాంతి సౌఖ్యములను సాధించుటకు భగవంతుని కోరుట ఆచారమైనది. పంచాంగశ్రవణ మీ సనాతనాచారమును స్మరింపజేయుచున్నది బహుధాన్య సంవత్సరమునకు శుక్రుడు రాజు, బుధుడు మంత్రి, కుజుడు సేనాధిపతి. పంచాంగము గుణించిన సంగ్రామము ఫలించుటకు ఎంతకాలము పట్టునది దైవాధీనము, కాలగర్భమునందు కలదు. ప్రజలందరును శాంతిస్థాపనమునకును, సంగ్రామ నివారణకును హృదయ పూర్వకముగ ప్రార్థనలను చేయుదురు గాక!

## గాంధిజీ

గాంధిమహాత్ముడు శాంతిసంరంభమునందు ప్రదర్శించిన అపూర్వమైన సత్యాగ్రహ సాధనమును ప్రజలు మాటలందుగాక సంకల్పమందును, క్రియలయందును చూపుటకు తపస్సును చేయుట ధర్మము. చిరకాల సంవర్ధితమైన పశుబలారాధన స్థానమును సత్యాగ్రహము ఆక్రమించుటకు చిరకాలాభ్యాసము అవసరము. ఆయుధ నిర్మాణ, ధారణ, విక్రయ సాధనమునను జీవయాత్రను గడపుచు తన్మూలమున శ్రీమంతులు, బలవంతులు, దురభిమానులునైన పాశ్చాత్య ప్రజలకును వారి ప్రవృత్తులకును నిది సులభసాధ్యము కాదు. మాటలయందు జపాను అవలంబించిన చీనా సంగ్రామమును తీవ్రముగ ఖండించుచు, క్రియలయందు జపానుకు ఆయుధములను అమ్ముచున్న యూరపు రాజ్యముల నీతి ధర్మ విరుద్ధము. ఇట్టి క్లిష్ట పరిస్థితులయందు శాంతిస్థాపనమునకు 35 కోట్ల భారతీయుల ధర్మబలమును శతవిధముల వినియోగించుట తగియున్నది. అపూర్వమైన నిర్బంధములవలన కృశించియున్న భారతీయులకు కర్తవ్యమును నిర్ణయించుటయే అసాధ్యముగ నున్నది. భారతీయ భౌతికబలము కృశించినను నిత్యమైన ఆత్మబలము క్షీణింపక అఖండముగ ప్రకాశించుచున్నది. ఆత్మ సంస్మరణమును జేసి గాంధిమహాత్మునివలె ప్రజలు ఆత్మశక్తిని నారాధించి తాము తరించి ప్రపంచమును తరింపజేయుటకు పాటుపడుట కర్తవ్యము. గాంధిమహాత్ముడు అపూర్వమైన మహాపురుషుడు. ప్రపంచోద్ధరణమునకు అవతరించిన మహానుభావుడు. కేవలము దైవబల సంపన్నుడైన మానవుడు. రాజకీయ, సాంఘిక, మతాది విషయములయందు ఆయన సత్యాగ్రహ సమర సాధనమునను పొందిన విజయములు ధ్యాన, మననయోగ్యములు. ప్రపంచ చరిత్ర మారంభమైన తరువాతను దుర్బల భిక్షుకు డొకడు చేయగల్గిన యపూర్వ పరివర్తనమును పాశ్చాత్య రాజ్యములు గ్రహించుట భావి యోగక్షేమములకు ప్రయోజనకరము. ప్రపంచ భావి పరిణామము ఏ రూపము దాల్చినను గాంధి మహాత్ముడు బోధించిన అహింసా, ధర్మ, సత్యములు ప్రతిష్ఠను బడయగలవు.

## కాంగ్రెసు విజయము

గతించిన సంవత్సరమునందు కాంగ్రెసునకు అఖండము, అపూర్వమునైన విజయము కలిగినది. ఇది సత్యాగ్రహ ప్రభావము. నిరంకుశ ప్రభుత్వము నిర్వాంతపోయినది. ఆబాలగోపాలము కాంగ్రెసు పతాకమును, వందేమాతరము గీతములను దేశమునందంతటను ప్రకస్తృమ చేసినది. ఇది ప్రజా హృదయమునం దంతర్గతమైన పరమోత్సాహమును, ప్రభుత్వ హృదయమందలి భయభ్రాంతులను లోకమునకు ప్రత్యక్షము చేసినది. కాంగ్రెసు నాయకులు మంత్రిపదవులను స్వీకరించి కొన్ని రాష్ట్రములందు ప్రభుత్వమును నిర్వహించుచున్నారు. సంపూర్ణ స్వాతంత్ర్య స్థాపనమునకు ఇది ప్రథమ సోపానము ప్రజలు స్వరాజ్య ప్రభుత్వమునందు రంధ్రాన్వేషణమును చేయక సకల విధముల పోషించుట కర్తవ్యము. కాంగ్రెసు మంత్రుల ధర్మశీలము గతించిన స్వల్పకాలమందే సువ్యక్తమైనది. గతించిన ఇరువదియైదేండ్లయందును దేశమునందు సాంఘిక, రాజకీయ,మతాది సకల విషయములయందును సంప్రాప్తమైన మహాపరివర్తనము భావ్యభ్యుదయమునకు శుభసూచకముగ నున్నది. ఈ మహాపరివర్తనసిద్ధికి ప్రాణ మానధనములను సమర్పించిన త్యాగమూర్తులకు జోహారులు.

## ఆంధ్రాభ్యుదయము

1910 కీలక సంవత్సరమున మా మొదటి సంచిక ప్రచురింపబడినది. బహుధాన్య సంవత్సరమునందు 29 వ సంచిక వెలువడుచున్నది. గతించిన 30 ఏండ్లనుండియు ప్రజాహృదయమునందు గల్గిన మహా ప్రబోధమును సంవత్సరాది సంచికలు దిఙ్మాత్రముగ సూచించుచున్నవి. ఆంధ్రుల సాహిత్య, కళా, మత, సాంఘిక రంగములందు చిరకాలాగతములైన పూర్వాచారములను, నిర్బంధ నిర్మాణములను విసర్జించి నవీన మార్గములను అవలంబించిన విధమును కావ్యములు, గీతములు, విమర్శనములు, పరిశోధనలు, చరిత్రాంశములు విశదము చేయుచున్నవి. సాహిత్యమునందు కల్గిన అపారమైన వికాసమును ప్రచురితములైన కావ్యములు, గీతములు విశదము చేయుచున్నవి. నవీన రచనలు ప్రజాదరణమును బడయుచున్నవి. ముప్పదేండ్లకు పూర్వము పరిహాసపాత్రములైన అప్పారావుగారి ముత్యాలసరములు నేడు ప్రజాదరణమునకు పాత్రములగుచున్నవి. ప్రాతపద్ధతులను క్రొత్తరీతులను ఖండించుట ధీమంతుల లక్షణము కాదు. విమర్శనము చేయుటకు సకల జనులును అధికారులు సంగీతకళయందును ఆంధ్రుల యభినివేశమును గానసభలు, గాన కళాశాలలు, పండిత సత్కారములును విశదము చేయుచున్నవి. కళారంగమునందు చిత్రకారు లవలంబించిన నూతన విధానము చిత్ర ప్రపంచమునందు ప్రశంసలను బడసినది హరిజనోద్యమము, పునర్వివాహములు విశాలములైన ప్రజా హృదయములను వెల్లడి చేయుచున్నవి. ఆంధ్రులు అస్వతంత్రస్థితియందున్నను స్వయంసహాయమునను రాజకీయ రంగమునందును స్వాతంత్ర్య ప్రియత్వముననుగల విధమును సత్యాగ్రహ సమరము విశదము చేసినది. నిరంకుశ ప్రభుత్వమునందు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము సాధ్యము కాకపోయినను స్వరాజ్య ప్రభుత్వమునందు సాధ్యము కానున్నది. నూతన సంవత్సరమునకు సరిగ మద్రాసు ఎసెంబ్లీ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతను అంగీకరించినది. ప్రజలు చిరకాలమునుండి పాటుపడుచున్న రాష్ట్ర నిర్మాణమునకు యావచ్ఛక్తిని వినియోగించి తీర్మానము కార్యరూపమును దాల్చుటకు ప్రయత్నించుదురుగాక ఆంధ్రాభ్యుదయమునకు సకల విధముల పాటుపడి ప్రజాదరణమునకు పాత్రుడైన మహాపురుష వీరేశలింగముగారికి జోహారులు.

ఆంధ్రాభ్యుదయమునకు పాటుపడిన సకల మహా జనులకును కృతజ్ఞతావందనములు గత సంచికలకును బహుధాన్య సంచికకును ప్రచురణమునందు సహాయము చేసిన మిత్రులకు వందనములు. నా స్వల్పమైన సేవకు ప్రజలు చూపిన గౌరవ ప్రేమాదరణ సత్కారములకు కృతజ్ఞుడను. సచ్చిదానంద పరమాత్మ సకల లోకములకును సకల జనులకును శాంతి సౌఖ్యములను ప్రసాదించుగాక!

# ఏఁబదివేల బేరము

శ్రీయుత క రామానుజరావుగారిచే వ్రాయఁబడినది

[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]

చెన్నపట్నణమందలి షాహుకారుపేట లక్ష్మికి నివాస స్థలము సూర్యోదయము మొదలు రాత్రి పంద్రెండు గంటలవఱకును, ఆ వీధిలో నింటింట లక్ష్మి తాండవ మాడుచుండును ఆ వీధిలో ధనవంతులగు కోమటుల యొక్కయు, వారికంటె ధనవంతులగు గుజరాతీలయొక్కయు, వారికంటె నెక్కుడు లక్ష్మీపుత్రులగు మార్వాడీలయొక్కయు నిండ్లుండుటచే వర్తకమునకు ఆవీధి పుట్టినిల్లనుటకు సందియము లేదు రవలు కెంపులు మొదలైన విలువగల రాళ్లు మానికలతో గొలుచునట్టి వర్తకు లచ్చట నున్నారని చెప్పినచో నచ్చటి ప్రతియింటను రూపాయిలు, కాసులు, సవరనుల మొదలైన వెండి బంగారు నాణెము లెల్లప్పుడును ఘల్లు ఘల్లు మనుచుండు నని వేరుగ జెప్పవలెనా?

ఒకనా డుదయమున ఏడుగంటలవేళ జగజీవనలాల్ షాహుకారు యొక్క నాలుగంతస్థుల మేడయెదుట రెండు గుఱ్ఱముల కోచిబండి యొకటి వచ్చి నిలిచెను ఆ బండిలో వెనుకప్రక్క నొక పురుషుఁడును, అతనిభార్యయు గూర్చుండియుండిరి వారికి నెదుట నైదారు నెలల పిల్లవాని నెత్తుకొని యొకదాసి కూర్చుండియుండెను బండికి వెనుక చిత్రమైన దుస్తుల ధరించిన గుఱ్ఱపువాం డ్రిద్దరు నిలిచియుండిరి బండికి ముందుభాగమున నెత్తుగనున్న యాసనముపై కోచిమన్ అనగా గుఱ్ఱములను తోలువాఁడును, వానిప్రక్కన మరియొక సేవకుఁడును గూర్చుండియుండిరి బండి వచ్చి నిలిచినతోడనే వెనుకనున్న గుఱ్ఱపువాం డ్రిద్దరును దిగి ముందుకు వచ్చి గుఱ్ఱపు కళ్లెములను పట్టుకొని నిలువబడిరి ముందు నున్నతాసనముపై గూర్చున్న సేవకుఁడు దిగి యొద్దకు రాగానే యజమానుఁడు తన జేబులో నుండి తన పేరుగల విజిటింగ్‌కార్డు నొకదానినితీసి వానికిచ్చెను వాడు ఆ యింటి గుమ్మములో కూర్చున్న సేవకుని చేతి కిచ్చి నీ యజమానున కీ కార్డు చూపుమని వానిని లోనికిం బంపెను జగజీవనలాల్ ఆ కార్డును చూచుకొని రాజా ఆఫ్ నర్సాపూర్ అని చదివి తత్తరపాటుతో లేచి బండి యొద్దకు వచ్చెను ఈ వర్తకుఁడు గొప్ప రాళ్ల వర్తకుఁడని విఖ్యాతిఁజెందిన వాఁడు రవ్వలు, కెంపులు, పచ్చలు, వైడూర్యములు మొదలైన విలువలేని మాణిక్యముల వర్తకమే ఎల్లప్పుడును చేయుచుండును. పుష్యరాగముల వంటి తక్కువ వెలగల రాళ్లనుగాని, వెండి బంగారములనుగాని ముట్టనే ముట్టఁడు అతని పద్దులన్నియు వేలు లక్షలుగల సంఖ్యలతో నిండియుండును గొప్ప గొప్ప రాజులు మహారాజు లితనియొద్ద లక్షలకొలఁది వెలగల రాళ్లను నమ్మికగా తీసికొని పోవుచుండిరి ఆ రాజులకు తగిన మర్యాదలుచేసి వారిని సంతోషపఱచి, వారెక్కుడు రాళ్లను గొనునట్లు చేయు సామర్థ్య మీ ముసలిషాహుకారునకుం గలదు అందుచేతనే ఒకానొక రాజు వచ్చెనని తెలిసినతోడనే మన షాహుకారు తత్తరపాటుతో లేచి ఎదురేగెను అతఁడు బండి సమీపమునకు వచ్చినతోడనే, అచ్చట నిలుచున్న సేవకుఁడు బండి తలుపు దీసెను బండిలోనుండి జమీందారుగారు దిగివచ్చి షాహుకారుతో షేక్‌హాండుచేసి "మీరేనా జగజీవనలాలు షేట్జీగారు?" అని యడిగెను అందు కాతఁడు 'చిత్తమని' తలయూపఁగా "నేఁడు బహు సుదినము ఎన్ని దినముల నుండియో యనుకొనగా నేఁడు మీ దర్శనము లభించినది కుబేరుని తరువాత తామే కుబేరులని వినియున్నాను"

"చిత్తము మీవంటి రాజాధిరాజుల యనుగ్రహ ముండ నేను రుఁడనే లోనికి దయచేయుఁడు" అని మాట్లాడుకొనుచు వారిద్దరును ల పోయిరి వారివెంటనే జమీందారుగారి భార్యయు, పిల్లను నెత్తు దాసియు, షాహుకారు నింటిలోనికిఁ బ్రవేశించిరి సాధారణముగా జ దారుల భార్యలకు ఘోషా యున్నప్పటికిని ఈ జమీందారుఁడు ఇం ఫాషన్ గలవాడగుటచే తన భార్యకు ఘోషా లేకుండ జేసినట్లు కాన చున్నది ఘోషామాత్రము లేదుకాని, ఈమెకు వంటిమీఁద నగలుమ మపరిమితముగా నుండెను మెడలోనున్న సూర్యహారమే యొక పది చేయవచ్చును చంద్రహారమే పదియ్యైదువేలు చేయవచ్చును. కాళ్ల బంగారపు పాంజేపులు అయిదువేలయిన కరీదు చేయవో? అట్లే బుజముపై నిద్రించుచున్న బాలునికిని మిక్కిలి విలువగల నగలు వె బడెను

వారందరును లోనికి వెళ్లిన తరువాత, ఆ షాహుకారు, మేడప గొప్ప గొప్ప రాజులకొరకై వెలగల కుర్చీలతోను, సోపాలతోను, పటం తోను, అలంకరింపఁబడిన హాలులోనికిఁ దీసికొనిపోయి జమీందార నొక కుర్చీమీఁదఁ గూర్చుండఁబెట్టి అతని భార్యకు కొంచెము చాటున యొక స్థలమును కూర్చుండుటకు చూపించెను తానును జమీందార నెదుటనున్న యొక కుర్చీమీఁదఁ గూర్చుండి యిట్లు సంభాషింపఁ దొడఁ

జగ—"అయ్యా, మీరు మా ఇంటికి వచ్చుట సుకలిత విశేష తమ రాజధాని ఏ జిల్లాలోదండి?"

జమీం—"మా సంస్థానము గోదావరి జిల్లాలో నున్నది మి గౌరవముగల సంస్థానము ఇతర జమీందారులకులేని యనేక గౌరవ మాకు కలవు మేము కలెక్టరును చూచుటకు వెళ్లునపుడు పదిహేను గులు కాల్చెదరు వెండి కుర్చీలమీదగాని మేము కూర్చుండము నే నింగ్లీషు ఎడ్యుకేటెడ్ జంటిల్‌మన్ అయినందున ఈ పిచ్చి ఆచార పాటింపను టట్ నాన్సెన్సు అని మా ఆడవారి ఘోషాకూడా తీసివే అంతా నొక్కసారిగా తీసివేసిన బాగుండదని మావాండ్రు మగవారి నెద కూర్చుండక కొంచెము ప్రక్కగా కూర్చుండుదురు సంస్థానమునకు పే పోగా మూడులక్షల ఆదా కలదు ఈ సంగతుల కేమిగాని నిన్నటి జయపురము మహారాజుగారు మీవద్దనుండి కొన్న లక్ష రూపాయిల హిరి చూచితిని వారికి నాకు మిక్కిలి స్నేహము బాల్యమునుండి ప్రక్కన పెరిగినట్లు పెరిగినాము"

జగ—"చిత్తము మహారాజులంగారికి నాయందు మిక్కిలి హము ఈ సంవత్సరము వారు నావద్ద ఎంతలేదన్నా పది లక్షల జ కొన్నారు"

జమీం—"రవ్వలంటే మీవద్దనే రవ్వలు, ఏమి ఆ కాంతి వరకు రవ్వ లనేకము కొంటినిగాని ఇట్టి వెన్నఁడును చూడలేదు మీవద్ద అట్టి రవ్వలు గలవా?"

జగ—"ఎన్ని వలయునో కలవు కొనువారుండిన రవలకేమిత తెప్పించెదనా" అని యడిగి జమీందారుగారు తలయూపగానే లేచి

బోయి సేవకునిచే నొక పెద్ద ట్రంకు పెట్టెను పట్టించుకొనివచ్చి బల్లమీదపెట్టి దానిం దెఱచి రవల పొట్లము నొకటి వెనుక నొకటి తీయుచు జమీందారుగారికి చూపఁదొడఁగెను ఆతఁడు ఇవి బాగున్నవవి బాగుండలేదనియు, అవి బాగున్న వివి బాగుండలేదనియు జెప్పుచు దీని వెలయెంత దానివెల యెంత అని యడుగుచు "మీరు మిక్కిలి సత్యసంధులని జయపుర మహారాజుగారు నాతో జెప్పినంతనే వచ్చితిని క్రమమైన వెల జెప్పవలయును సుమా" యని నడుమ నడుమ ననుచు తనకు చక్కగ గానుపించిన వానిని భార్యవద్దకు తీసుకొనివెళ్లి చూపుచు మరల దెచ్చుచు ఒక గంటవరకు రవల బేరము చేసెను తుద కేబదివేల వెలగల రవలను బేరము చేసి విడిగా తీయించెను వర్తకుఁడు ధర కొంచె మధికముగా జెప్పుచున్నను మన జమీందారుమాత్రము వాని ధరలు చక్కగ నెరింగిన వాడగుటచే మోసపోలేదు షాహుకారు జమీందారుగారి రత్న పరీక్ష జానమునకు మిక్కిలి యాశ్చర్యమందుచు నడుమ నడుమ ఆతనిని పొగడుచుండెను

ఇట్లుసిసలు పరిచిన రవల నన్నిటిని చిన్నచిన్న పొట్లములుగాగట్టి ఆ పొట్లముల నన్నింటిని జమీందారుగారు తన యొద్దనున్న పెద్దమనీ బాగ్‌లో పెటి దానిని తన జేబులో నుంచుకొని షాహుకారుతో నిట్లనియె

"అయ్యా అప్పనగా నాకు చీఁదఱ కొన్న సరుకులకు వెల వెంటనే ఇయ్యవలయునని నా తాత్పర్యము మేము ఇంటినుండి బయలుదేరునప్పుడు మీవద్దకు రావలెనని యనుకొనలేదు. రేపు రావలెనని తలంచితిమి. ఈ త్రోవన నేడు మరియొకచోటికి పోవుచుండగా నిదియే మీ ఇల్లని మా బండివాఁడు చెప్పెను అందుచే మిమ్ముల చూడవలెనని యాగితిమి సరే చూచినందుకు లాభమేయ్యైనది మొదట నిచ్చుటకి వచ్చెదమని తలంపనందున పైకము వెంట తేలేదు నేను ఇంటికివెళ్లి పైకము తీసుకొని వచ్చెదను అంతవరకు మనవాం డ్రిక్కడనే యుండెదరు తండియార్పేటవరకు మనవాళ్లను తీసుకొని వెళ్లవలసిన పనియున్నది కావున ఇప్పుడు వీరి నింటికి తీసికొనిపోవుట యెందుకు" అని చెప్పి యాతడు వెంటనే లేచి భార్యతో నే వచ్చువరకు నీ విక్కడనే యుండుమని చెప్పి కోచిబండి నెక్కి వెంటనే వెళ్లిపోయెను భార్యాపుత్రులను తన ఇంటనే యుంచి వెళ్లుటకు జమీందారుగారొక కారణము చెప్పినను, జగజీవనలాలు మాత్ర మా కారణమును నమ్మక, జమీందారుగారు మిక్కిలి మర్యాద గలవాడగుటచే తన నమ్మకమునకై వారిని తన యింట దించిపోయెనని తలఁచి, ఆతని యుక్తికిని, మర్యాదకును మిక్కిలి సంతసించెను

జమీందారుగారు వెళ్లి అరఘంటయిన తరువాత వాని సేవకుడు పరుగెత్తుకొని మేడమీదికి వచ్చి "దొరసానిగారూ? ఖజానా తాళపు చేతులుగుత్తి మీవద్దనే యున్నదట దొరగారు మరచి ఇంటికి వెళ్లినారు తొందరగా తీసుకొని రమ్మని పంపినారు నా చేతి కిచ్చిన నేను త్వరగా వెళ్లెదను ప్రొద్దెక్కుచున్నది పైకము తెచ్చి షాహుకారుగారి కిచ్చి మనము తండియార్పేట వెళ్లవలసియున్నది" అని తొందరగా పలికెను అంత నామె తాళపు చేతులగుత్తి తీసి వానిపైవేసి తొందరగా పొమ్మని యాజ్ఞాపించెను. వాడు పదియడుగులు వేయగా మరల వానిని బిలిచి ఏమో యాలోచించి 'గుత్తినిటు తే' యని తీసికొని "దినములు మంచివి కావు. ఈ దినములలో ఎవ్వరిని నమ్మకూడదు లక్షలకొలఁది ధనమున్న ఖజానా తాళపుచేతులు వీని కిచ్చి పంపిన వీఁడేమిచేయునో? ఇదివఱకు వీఁడు నమ్మిక కలవాఁడేగాని ధనముఁ జూచిన ఎట్టివారికి దుర్బుద్ధి పుట్టక మానదు ఏమండీ షాహుకారుగారూ నిజమేనా" అని యడుగగా నాతఁడు "నిజమే నిజమే డబ్బునెడల బహుజాగ్రత్తగా నుండవలెను" అని గంభీర వాక్కుతో తలయూపెను అంత నామె "అట్లయిన నేనే తాళపు చెవులగుత్తిని తీసుకొనివెళ్లి పైకము తీసుకొని మేమిద్దఱము వచ్చెదము నేను వచ్చువరకు అబ్బాయి పాల కేడ్చునేమో కావున కొంచెము పాలిచ్చి వెళ్లెద"నని "సీతా సీతా" యని తన దాసిని పిలిచెను.

అంతవర కా దాసి పిల్లవానిని జోలపాడి నిద్రబుచ్చుచు మేడక్రింద నొంటరిగా నుండెను దాని జోలపాట మాత్రము పైకి చక్కగ వినబడుచుండెను యజమానురాలు పిలిచినతోడనే యది పిల్లవానిం దీసికొని యజమానురాలివద్దకు వచ్చెను. పిల్లవాని శరీరమంతయు నగలతో నిండియుండెను ముఖముమీఁదగూడ రవల పతకములు, కెంపుల పతకములు, పచ్చల పతకములు వ్రేలాడుచు ముఖమును కప్పివేసియుండెను ఆపిల్లవానిని తెచ్చియిచ్చినతోడనే యామె వానికి పాలిచ్చి యొక చిన్నపరుపు దెప్పించి యచ్చట వేయించి వాని నచ్చట బరుండ బెట్టి భద్రమని దాసికిఁజెప్పి తన శరీరము మీఁది యేబది యరువదివేల విలువగల నగలనుతీసి యా పిల్లవాని ప్రక్కనే యుంచి "మీ నమ్మికకొరకు వీని నిక్కడ నుంచుచున్నానని" షాహుకారుతో చెప్పెను అంత నాతఁడు నవ్వి "కోటి వెలగల మీ కుమారునే ఇచ్చట నుంచుచున్నపుడు వేరె నగలుంచవలయునా?" ఒకరిపై నొకరికి నమ్మికలేనియెడల కలియుగ మెట్లుసాగు"నని "మీరు వెళ్లుటకు నా కోచిబండిని లెప్పింతునా?" యని యడిగెను అందుపై అచ్చటనున్న సేవకులు "అక్కరలేదు నేను నడిచి వచ్చిన తాళపుచేతిగుత్తి తీసికొనివచ్చుట కాలస్యమగునని నా యజమానుఁడు నన్ను కోచిబండిమీదనే పంపెను అది వాకిట సిద్ధముగా నున్నది" అని చెప్పెను అంత నా యజమానురాలును, సేవకుఁడును బండిలో నెక్కి వెడలిపోయిరి

యజమానురాలు వెడలిన కొంతసేపటికి యా దాసి షాహుకారు వద్దకు వచ్చి "అయ్యా బీదదానిని నన్ను మరవకుడు మా దొరవారు మీ యొద్ద నెన్నో రాళ్లు కొన్నారు మీకింత లాభమైనప్పుడు నాకు కొంచెము యీనా మియ్యకూడదా? దొరసానిగారితో చెప్పి ఇంకా రాళ్లు కొనునట్లు చేసెదను" అని పెక్కుమాటలు చెప్పి ఎప్పు డెవ్వరి కేమియు నియ్యని లుబ్ధాగ్రేసర చక్రవర్తియగు జగజీవనలాలుయొద్దనుండి యొక రూపాయి బహుమానము వడసెను రూపాయి చేతిలో పడగానే అది " అయ్యా మాది శూద్రజన్మము కల్లుగాని, సారాగాని త్రాగనిది యుండలేము మా దొరగారికి, దొరసానిగారి కీ పేరన్న గిట్టదు నెలదినములనుండి లేక చచ్చిపోవుచున్నాను వారు వచ్చువరకు ఈ ప్రక్క యంగడిలోనికి పోయి మీరు దయ చేసిన రూపాయిలో పావలా సారా త్రాగివచ్చెదను నిముసములో వచ్చెదను. అంతవరకు చిన్న ధొరగారిని కొంచెము చూచుచుండుడి నిద్రలో ఏడ్చునేని కొంచెము జోకొట్టుడి" అని చెప్పి దాసి సారాయి అంగడికొరకు వెలుపలకు వెడలిపోయెను

జగ్గజీవనలాల్ షాహుకారు తన కా దినమున మంచిలాభము వచ్చెనని సంతసించుచు జమీందారుగారి రాక కెదురు చూచుచుండెను పదిఘంటలాయెను పదునొకండు ఘంటలాయెను, పండ్రెండు ఘంటల సమయమై 'ధమ్మ'ని పిరంగిమ్రోత వినఁబడెను దాసిగాని, జమీందారుగాని, అతని భార్యగాని, సేవకుఁడుగాని తిరిగిరారైరి షాహుకారుకు గొంత సంశయము పుట్టఁదొడఁగెను కాని కడుపున పుట్టిన బిడ్డను, ఇంత ధనమును విడిచి వారేల పోయెదరని యాతఁడు కొంతవరకు సమాధానము చేసికొనెను ఇంతలో నొంటిగంటయ్యె రెండు వేసిరి అప్పటికైనను, ఎవ్వరు తిరిగిరాలేదు పరుండి నిద్రబోవుచున్న పిల్లఁడైనను లేవలేదు కొంత యేడ్వనైనను, యేడువలేదు అయ్యో! పాపము పిల్లవాఁడు ఆహారములేక సొమ్మసిలెనేమో యని షాహుకారు ఆ పిల్లవానియొద్దకు పోయి వాని నెత్తుకొని చూడఁబోవనేమి యాశ్చర్యము! వాడు పిల్లవాఁడుకాఁడు అది పిల్లవానియంత యాకారముగల యొక జాతి బొమ్మ!! అందు కా షాహుకా రాశ్చర్యపడి తమ సేవకుల నందరిని పిలిచి దానిని చూపెను. తుదకు వారందరును అదియొక మోసమని తెలిసికొని "మోసమైన మనకేమి మనరాళ్ల వెలకంటె మించిన నగ లున్నవి వారెక్కడకుఁ బోయిన మనకేమి" యని తలచి నగలకు మదింపు వేయసాగిరి ఒక్కొకనగ తీసి చూచిన కొలదిని అవి గిల్టునగలేగాని నిజమైనవికావని స్థిరపడెను ఆ నగలన్నియు నూరు రూపాయలకంటె నెక్కుడు వెలచేయవు ఇదంతయుజూచి జగజీవనలాలు గుండె కొట్టుకొని యేడువసాగెను పోలీసువారి కీ సమాచారమును తెలిపిరి రహస్యపు పోలీసువారు కొందఱును జగజీవనలాలు సేవకులు కొందఱును మారువేషములతో నర్సాపురమువెళ్లి విచారించి నర్సాపురపు జమీందా రీ సృష్టియం దెచ్చటను లేడని నిశ్చయించి తిరిగి వచ్చిరి.

ఎంతమంది జమీందారులనో మోసపుచ్చిన తనను ఈ బూటకపు జమీందారు మోసపుచ్చెకదాయని చింతించుట తక్క జగజీవనలాలుకు మరి యే యుపాయమును లేకపోయెను.

# పొట్టచీల్చి బిడ్డను తీయుట

మ-రా-రా-శ్రీ ఆచంట లక్ష్మీపతి, బి. ఎ. ఎం. బి. సి. ఎం. గారిచే వ్రాయబడినది

[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]

పై శీర్షికను చదువునప్పుడు అందుండు చీల్చు అను పదమును చూచినతోడనే మీకు ఒక విధమయిన భయమును, సంశయమును కలుగవచ్చును

ఏలయన పొట్టచీల్చిన తరువాత తల్లి బ్రతుకునా! ఏమి ఈ సాహసపుపని అని భయమును, పొట్టలోపల జీవించియుండెనో లేదో, భూమి మీద పడిన తర్వాత ననేక గండములు గడచి జీవించునో లేదో యను సంశయాస్పదమయిన కూనకొరకై తల్లి పొట్టను చీల్చుట తగునా? అని సంశయమును, కలుగవచ్చును

ఈ క్రింద వ్రాయఁబోవు వ్యాసమును చదువువారికి అట్టి భయమును సంశయమును తీఱునని తలంచుచున్నాను తగిన శస్త్రవైద్యుని ... చ్చుట యనగా గజ్జి కురుపును చిదుపుటకంటె సులభము ఏలయనగా మనము గజ్జి కురుపును చిదిపినప్పుడు కొంచెమయిన నొప్పియుండకపోదు శస్త్రవైద్యులు పొట్ట చీల్చునప్పుడు లేశమును నొప్పియుండదు

పాశ్చాత్య వైద్యశాలలయందేమి, ఇప్పుడు మన చెన్నపట్టణమునందేమి, లెక్క లేకుండ నిట్టి శస్త్రక్రియలు (ఆపరేషనులు) ప్రతివారమును జరుపఁబడి అనేకుల తల్లులును, బిడ్డలును పునర్జన్మము నొందింపఁబడుచుండుటచే పొట్టజీల్చుట యన్నంతమాత్రమున భయపడు మా చదువరులకు ఈ వైద్య వృత్తాంతమును కొంతవరకు తెలుపవలసియున్నది. పల్లెలనక పట్టణములనక ప్రతియూరియందును శిశువులు ఎందఱెందఱో




1.వ పటము



2 వ పటము

పుట్టుచున్నారు వేయింటికి 970 మంది తల్లులు వైద్య సహాయము లేకయె పురుడు పోసికొందురు కాని ఈ క్రింద వివరింపఁబోవు సృష్టి వైపరీత్యములచే కొందఱును, తెచ్చిపెట్టుకొన్న సుఖవ్యాధులు మొదలగు వాని కారణములచే కొందఱును తమంతట తాము సుఖప్రసవము కాఁజాల కున్నారు

సృష్టి వైపరీత్యములు ఎట్లు కలుగునని తెలిసికొనవలెనవిన జననావయవములయొక్క శాస్త్రజ్ఞానము కొంతవఱకు కావలసియున్నది

పై (1వ) పటములో చూపఁబోవు ప్రకారము స్త్రీయొక్క జననావయములు నిర్మింపఁబడియున్నవి అందు అండకోశము అనునవి కోడిగుడ్ల ఆకారముగనుండు రెండు కాయలవంటి అవయవములు ఒక్కొక్కటి బాదంకాయంత ఉండును ఇవి స్త్రీయొక్క పొట్టలో బొడ్డున కిరువైపులను వెన్నెముకవైపు గోడ నంటియుండును ఇందు స్త్రీబీజము లుద్భవించి పెరుగుచుండును. స్త్రీబీజములు ఒక్కొక్క అండాశయములో సాధారణముగా ప్రతినెలకు ఒక్కొక్కటి పక్వమగును అట్లు పక్వమయిన స్త్రీబీజము అండాశయమును పగల్చుకొని బైటపడును ఇట్లు బయటపడినప్పుడు దీని ప్రమాణము అంగుళములో 250 వ వంతు ఉండి గుండ్రముగా నుండును.

తక్షణమే ఈ స్త్రీబీజము అండనాళమని చెప్పబడు గొట్టములో ప్రవేశించును ఎట్లనగ ఈ గొట్టముయొక్క కొనయందు పాము నాలుకల వలెనుండు చిన్న చిన్న అంచులు వ్రేలాడుచు ఎల్లప్పుడు ముందుకు వెనుకకు కొట్టుకొను చుండును ఇట్లు కొట్టుకొనుచుండు అంచులయొక్క కదలిక వలన ఆ చుట్టుప్రక్కలనుండు ప్రదేశములో ఒక విధమయిన సుడిగుండ మేర్పడును అండాశయమును పగల్చుకొని బయలుపడిన స్త్రీ బీజము ఈ సుడిలోబడి అండనాళముగుండ పోవుచుండును ఇట్లు పోయి అది గర్భకోశమునందు జేరును ఈ సమయమునందు స్త్రీయొక్క గర్భ సంబంధమయిన అవయవములయందు నెత్తురు అధికమయి కొన్ని రక్తనాళములు పగిలి ఋతుస్రావ మేర్పడును ఎడమప్రక్కనుండు అండకోశములో క్రమక్రమముగా పెరుగుచున్న నాలుగు స్త్రీ బీజములను చూడుడు ఈ స్త్రీ బీజములు తమంతట తాము పిండములు కానేరవు స్త్రీ పురుష బీజముల సంయోగము పిండోత్పత్తికి ఆధారమయియున్నది పటములో పురుషుని యొక్క రేతస్సులోనుండు పురుష బీజములు స్త్రీయొక్క జననావయవములగుండ ఈదుకొనుచు పోవుచున్నవి చూడుడు ఈ పురుషబీజములు స్త్రీబీజములకంటె మిక్కిలి చిన్నవి అతి చురుకయినవి వీనియందు రెండు ముఖ్యభాగములు కలవు

1. కొంచెము లావుగనుండు మొదటి భాగము తల

2 అతిసూక్ష్మమయిన పొడుగాటి వెనుకభాగము తోక

ఈ తోక నిరంతరము మిక్కిలి వేగముతో నాడుచుండును దీని సహాయముచే నీ పురుష బీజములు అతి చురుకుగ నీదుకొని పోవుచుండును ఈ పురుష బీజములనే క్రిందితరగతి జీవులను గూర్చి వ్రాయునపుడు జీవశాస్త్రమునందు సూక్ష్మ బీజములని వ్రాసియుంటిమి స్త్రీ బీజములను స్థూలబీజము లందురు

(విజ్ఞానచంద్రికా గ్రంథమాల, 3వ గ్రంథము జీవశాస్త్రము 2 వ కూర్పు 128 వ పుట చూడుడు)

ఇట్లీదుకొనిపోవు పురుష బీజములు స్త్రీ బీజముల కొరకై వెదకికొనుచు గర్భకోశముగుండా పోయి పోయి తుదకు ఏదో యొకటి, ఋతుస్రావమైన కాలమున అండకోశమునుండి బయలుదేరి అండనాళముగుండ వచ్చుచుండెడు స్త్రీ బీజమును చేరి దానియందు ప్రవేశించి దానితో నైక్యమగును ఇట్లైక్యము చెందలేకపోయిన పురుషబీజము లన్నియు నాశము జెందును 1 వ పటమును చూడుము ఇట్లు ఐక్యమగుటచే నేర్పడిన సంయుక్త బీజమే పిండమగును ఇట్లు స్త్రీ పురుష బీజము లైక్యమగుటయే పిండోత్పత్తి యనబడును ఈ తరుణమున నీ పిండము ఏకకణము ఇదియే చీలి చీలి అనేక కణములయి ఒక్కొక్క కణమునుండి ఒక్కొక్క భాగము పుట్టి మానవ శరీరమంతయు నిర్మింపబడుచున్నది

ప్రతి అండకోశమునుండి నెలకొక స్త్రీ బీజము పుట్టునని చూచియుంటిరి గదా ఇందు ఏ స్త్రీ బీజమునందైనను పిండోత్పత్తి అయినచో రెండవ స్త్రీబీజము పెంపుమాసి నశించిపోవును ఒకానొకప్పుడు ఇరువైపులనుండు రెండు అండకోశములనుండి వచ్చు రెండు స్త్రీ బీజములును ఏక కాలమున రెండు పురుష బీజములతో నైక్యమైన ఎడల రెండు పిండము లుత్పత్తియగును. ఈ రెండును వృద్ధిపొందినచో ఇద్దరు కవల పిల్లలు పుట్టుదురు 2 వ పటమును చూడుడు

ఇదిగాక పిండోత్పత్తి కాకపూర్వము అరుదుగా స్త్రీ బీజము చీలి కణవిభాగము నొందినట్లయిన అందు ఒక్కొక్క కణము ఒక్కొక్క పురుష బీజముతో నైక్యమయి అనేక పిండములు, ఉత్పత్తి అగుటయు కలదు.



3-వ పటము

ఇ ట్లేర్పడి యొకానొకచో ఆరుగురు పిల్లలు ఒక్కసారిగా పుట్టిరి అట్టి విచిత్రమయిన కానుపునకు పుట్టిన శిశువుల పటము లిందు బొందుపరచబడి నవి 3 వ పటము చూడుము

మనదేశమునందు సరియయిన లెక్కలు లేకపోవుటచేత ఇట్టి జన దము లెన్నియో జరుగుచున్నను మనకు తెలియకున్నవి కాని ఉన్నత దశయం దున్న దేశముల వారందరు వీని లెక్కలు వేసియున్నారు ఇంగ్లండు దేశ ములో 2,85,219 జననములలో 3,718 కవలపిల్లలు పుట్టిరి-అనగా $76\frac{1}{2}$ జననములకు ఒక్కొక్క కవల పిల్లల జత పుట్టుచుండును

ముగ్గురు పిల్లలు ఒక్కటిగా పుట్టుచుండుట ఇంగ్లండు దేశములో "చర్చిలు" అను నాయన 430 టిని లెక్కవేసియున్నాడు ఆయన లెక్క ప్రకారము 6,000 జననములలో ఒక్కటి చొప్పున ముగ్గురు పిల్లల కానుపులు తేలెను

నలుగురుపిల్ల లొకసారిగాపుట్టు ప్రసవములు 3, 71, 126 కాన్పు లకు ఒక్కటి కనపడుచున్నది

అయిదుగురు పిల్లలు గలవి కూడ నున్నవి గాని అంతగా లెక్కకు రాలేదు

ఒకసారిగా ఆరుగురు పిల్లలు పుట్టిన ప్రసవములనుగూర్చి ఇద్దఱు వ్రాసియున్నారు ఆ 1888 సం లో వెస్సాలి (Vassali) అను నాతడు ఒక జననమునుగూర్చి వ్రాసియున్నాడు అందు నలుగురు మగ పిల్లలును ఇద్దరు ఆడపిల్లలును ఏక ప్రసవమున జన్మించిరి ఆరుగురు పిల్లలు పుట్టిన మరియొక ప్రసవమునుగూర్చి ఆ 1903 సం రం మేయినెల 27 తేదీని కెర్, కుక్‌మెన్ (Kerr and Cookman) అను వారలు ఆఫ్రికాలో అక్రా (Accra) అను గ్రామమునందు చూచినట్లుగా వర్ణించియున్నారు ఆ పుట్టిన ఆరుగురిలో అయిదుగురు మగపిల్లలు, ఒకతె ఆడుది అందరుపిల్లలును పుట్టినప్పుడు బ్రతికియుండిరి

ఈమెకే మొదటి కానుపున నల్గురు పిల్లలును, రెండవ కానుపున ముగ్గురు పిల్లలును, మూడవ కానుపున ముగ్గురు పిల్లలును, నాల్గవ కానుపున ఆరుగురు పిల్లలును పుట్టినట్లు వ్రాసియున్నారు ఈ నాల్గవ కానుపునందు పుట్టిన పిల్లలయొక్క పొటోగ్రాపు పటములు 3 వ పట ములో చూపఁబడినవి

పయిన జెప్పిన ప్రకారము ఏక ప్రసవమున ఏర్పడు పెక్కు పిల్లలు వేరువేరుగా పుట్టిన ఎడల తల్లికి అపాయము లేకుండ సుఖ ప్రసవము కావ చ్చును కాని ఒకానొకప్పుడు ఈ శిశువులన్నియు ఒండొంటితో నైక్య మయి 4, 5 పటములలో చూపిన ప్రకారము వికార రూపము లేర్పడ వచ్చును.

ఇదిగాక సామాన్యముగ కన్పట్టు సృష్టి వైచిత్ర్యములలో ముఖ్య మయినది మరియొకటి కలదు



4 వ పటము



5 వ పటము

స్త్రీబీజము పక్వమై అండకోశమును విడిచిన తరువాత ఎప్పుడయి నను పురుష బీజముతో నైక్యమయి పిండముగా నేర్పడవచ్చును ఇది క్రమ ముగా గర్భకోశమునందు జేరినచో నచ్చట శిశువునకు తగిన పోషణగల్గి వృద్ధినొందును కాని అరుదుగా నీ స్త్రీబీజము అండనాళములో ప్రవే శింపకపూర్వముగాని అండనాళముగుండా పోవునప్పుడుగాని పురుష బీజ ముతో జేరి పిండోత్పత్తి నొందిన యెడల నాపిండ మక్కడనే పెరిగి గర్భ కోశమును చేరకయే దారిలో చిక్కుకొనవచ్చును

అండనాళములో ప్రవేశింపక పూర్వము స్త్రీబీజము పిండోత్పత్తి నొంది యచ్చటనే నిలిచిపోయినచో నా పిండము గర్భకోశమునకు వెలుపలనే పెరుగును అట్టి పిండము చక్కగ వృద్ధిపొందినను అది వెలుపలకువచ్చు మార్గములేక పొట్టలోనే పెరిగి తల్లిప్రాణమును తీయును

లేదా అండనాళములో నెక్కడయినను పిండము చిక్కుకొనునెడల నిదే ప్రకారము వృద్ధి అయిన పిండమునకు వెలుపలకు వచ్చుటకు మార్గము లేకపోవును 1 వ పటము చూడుము

ఇదిగాక శిశువు క్రమముగా పెరిగినను తల్లియొక్క గర్భకోశము నందుగాని, గర్భమునుండి వెలుపలికివచ్చు మార్గమునందుగాని, ఏవయి నను ఆటంకములున్నచో శిశువు వెలువడుట కష్టతరము

ఇట్టివి జాతిభేదముగల స్త్రీ పురుషులకు కలుగు సంకరపు దాంప త్యములలో చాల యుదాహరణలు కనపడుచున్నవి.

ఎట్లన్న ఆజానుబాహుడగు ఐరోపియనునకును మిక్కిలి పొట్టిదగు ఒక నీగ్రో స్త్రీకిని కలుగు దాంపత్యమున జన్మించు శిశువు తండ్రియొక్క బీజబలముచేత పెద్దదిగా నుండవచ్చును అట్టి పెద్ద శిశువు తన తల్లి యొక్క చిన్న గర్భకోశమునుండి చిన్న మార్గములద్వారా జన్మించుట దుర్ల భము

ఇట్టి స్త్రీ నొకతెను నే నుండుపేటలో చిరకాలమునుండి చూచు చున్నాను ఈమె ప్రతి ప్రసవమునకును వైద్యశాలకుఁబోయి కడుపు కోయిం చుకొని బిడ్డను తీయించుకొని సుఖముగ వచ్చుచుండును ఈమెయొక్క ప్రసవములను మూడింటిని నే నెరుగుదును పిల్లలును సురక్షితముగా నున్నారు తల్లియు ఇంకను కనుచు పెంచుచున్నది

ఇట్టివియే అనేకములు ప్రతి సంవత్సరమునను ఇచ్చటి వైద్యశాలలో చూచుచుందుము.

ప్రసవము కష్టముగా నుండునను అనుమానముగల స్త్రీలు ముందుగనే వైద్యశాలలకుంబోయి పరీక్షించుకొందురు. కడపటి ఋతుస్రావమయిన తేది సరిగా చెప్పిన ఎడల వైద్యుఁడు లెక్కవేసి నీకు ఫలానానెల ఫలానాతేదిని ఇన్ని గంటలకు ప్రసవ సమయమని చెప్పును. అనగా కడాపటి ఋతుస్రావము కనుపించినతేది మొదలు సాధారణముగా 280 దినములు లెక్కించిన ఆనాడు ప్రసవ దిన మగును. ఎట్లన జనవరి 1 తేదిని ఋతుస్రావమయిన యెడల అక్టోబరునెల 7 వ తేది ప్రసవ దినమగును.

ఆ తేదినాటికి కొద్దిరోజులకు పూర్వమే అట్టి స్త్రీ వైద్యశాలకు పోయియుండును. వైద్యుఁడు పరీక్షించి శిశువు పరిపూర్ణ పక్వమైనదో లేదో జననమొందుటకు తగిన స్థితిలో నున్నదో లేదో తెలిసికొనగలఁడు. ఇట్లు తెలిసికొని ఫలానాతేది ఇన్ని గంటలకు ఈమె బిడ్డను జనన మొందింపవలయునని వైద్యుడు ఏర్పాటు చేసికొనును.

ఇది తన ఇష్టప్రకారము పగటిపూటం ఏర్పరచుకొనును. ఏలయన ప్రసవ సంబంధమయిన నొప్పులు వచ్చువరకు కాచుకొని యుండవలసి వచ్చినచో ఒకానొకప్పుడు అది రాత్రులయందు తటస్థమయిన దీపపు వెలుగున శస్త్రవైద్యము చేయుట కొంచెము కష్టముగా నుండును. కావున శస్త్రవైద్యుఁడు కొంచె మించుమించుగా చూచుకొని తన ఇష్టము వచ్చిన దినమున శస్త్రము (ఆపరేషన్) చేయుటకు ఏర్పాటు చేసికొనును.

ఆరోజున ఆ స్త్రీని ఉదయముననే స్నానము చేయించి ఆపరేషన్ బల్లమీద వెల్లకిలగా పరుండబెట్టుదురు. పిమ్మట శస్త్రవైద్యుడు స్త్రీ యొక్క బొడ్డున కొకవైపున కడుపు పొడుగున 8 అంగుళముల కోతను పెట్టి గర్భకోశమును పయికితీసి దానిని ఆరంగుళముల కోతచే చీల్చును. వెంటనే అదివరకు నిశ్శబ్దముగానున్న గర్భకోశమునుండి కావు కావుమనుచు బిడ్డ పయికి తన్నుకొనివచ్చును. ఈ సమయమున చూపరులు ఎట్టివారయినను ఇట్టి సృష్టి వైచిత్ర్యమునుజూచి ఆశ్చర్యపడకమానరు.

అంతట శస్త్రవైద్యుడు గర్భకోశమునందు శేషించియుండు మావి మొదలగు పదార్థములను తీసివేసి చక్కగ తుడిచి గర్భకోశమును, పిమ్మట పొట్టను అవలీలగ కుట్టివేయును.

ఇట్లు ప్రసవమునొందిన తల్లియు జన్మించిన శిశువును లేశమయినను సంకటమునొందక సురక్షితముగా నుందురు. నేను చూచినంతవఱకును విన్నంతవఱకును శస్త్రవైద్యుఁడు తరుణమందు ఈ ఆపరేషను చేసినచో అపాయము ఎంతమాత్రమును మాతాశిశువులకు కలుగనేరదని దృఢపర్చంగలను పరికించిచూడుడు. ఇతర దేశములందు అనేకులు స్త్రీలును పురుషులును ఇట్టి వైద్యమును గ్రహించి లెక్కలేని ప్రజల ప్రాణములను కాపాడుచున్నారు.

మనదేశములోనో, ఇంతటి ముఖ్యమైన వైద్యశాస్త్రమును ఎరుకల సాపి చేతికిచ్చి అనేక ప్రాణముల కోలుపోవుచున్నాము. మన ఘోషా పద్ధతుల ననుసరించి మనదేశమునందలి తల్లులకు నా వైద్యులు ఎంత యగత్యమో వేరుగ వ్రాయనక్కరలేదు.

తల్లుల దుర్బలత్వ మన్ననో అతిబాల్య వివాహాది దురాచారములచే తరతరములను హెచ్చుచున్నది. చిన్న చిన్న తల్లులు పెద్ద పెద్ద బిడ్డలను కనవలసి వచ్చుచున్నది. ప్రథమ ప్రసవమున మరణము అధికమగుచుండుటయే దీనికి నిదర్శనము. కావున మంత్రసానితనము చేయుట యనునది ఒక లోపముగా నెంచక, నీచముగా నెంచక దేశహితము గోరువారు తమ ఆడుబిడ్డలకు చక్కగ విద్య గరిపించి గొప్ప గొప్ప శస్త్రవైద్యులుగా జేసి అనేక ప్రాణములను కాపాడుట విధియైయున్నది.

మొదటి నాలుగు పటములును జెల్లెటుగారి ప్రసవ శాస్త్రమునుబట్టి వ్రాయఁబడినవి. 5 వ పటము చెన్నపట్టణ వైద్యకళాశాలకు సంబంధించిన ప్రదర్శనశాలలో ద్రావకములో నిలువయుంచబడినయొక పిల్లయొక్క ప్రతిమ. అట్టివి అనేకములు ఈ కళాశాలలో నున్నవి. కళాశాలాధిపతిగారి యనుమతి పొంది ఎల్లవారును వీనిని చూడవచ్చును. 5 వ పటములోని పిల్ల చెన్నపట్టణములో పుట్టినది. జననమొందిన కొద్ది దినములలోనే మృతినొందెను. ఈ పటము మా మిత్రులగు రామ పుదువాల్ బి. ఎ. యల్. యమ్. యస్. గారిచే వ్రాయఁబడినది.



మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నశర్మగారు భారతమార్తాండ పండిత గట్టులాల్‌గారు పూండ్ల రామకృష్ణయ్యగారు



మండపాక పార్వతీశ్వర శాస్త్రులవారు



పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు



మహామహోపాధ్యాయ గంగాధరశాస్త్రిగారు

మహామహోపాధ్య కొక్కొండ వేంకటరత్నశర్మగారు —వీరు గొప్ప ఆంధ్ర పండితులు. ఉభయభాషా కోవిదులు చెన్నపురి రాజధాని కళాశాలలోను, రాజమహేంద్రవరము కళాశాలలోను ప్రథమాంధ్రోపాధ్యాయులుగా నుండి ప్రస్తుత ముపకారవేతనము బొందుచున్నారు బిల్వేశ్వరీయాది బహు గ్రంథకర్తలు ఆంధ్రులలో మహామహోపాధ్యాయ బిరుదు వందినవారిలో వీరు ప్రథములు ద్వైతమతావలంబులుగ నుండి యద్వైతమును స్వీకరించినవారు

భారత మార్తాండ పండిత గట్టులాల్ —ఘూర్జరదేశమునఁ గృష్ణమతమును స్థాపించిన వల్లభాచార్యులు వెలనాటి తెనుఁగు బ్రాహ్మణుడు ఆయనతోబాటు గుజరాతి దేశమునకుఁబోయి యచ్చటనే నిలిచిపోయిన యాంధ్ర బ్రాహ్మణ కుటుంబమునకుఁ జేరిన వాడితడు. స్ఫోటకముచేఁ జిన్ననాడే యంధుడయినను సంస్కృతమున నఖండ పాండిత్యమును గడించి సకల శాస్త్ర పండితుడని పేరుపొంది, పెక్కు రాజ సన్మానములను, భారత మార్తాండయను బిరుదును బడసెను ఇతఁడు ఘటికాశత గ్రంథ నిర్మాణమునకును, శతావధానమునకును, ఆశుకవిత్వమునకును ప్రఖ్యాతుఁడు ఇతఁడు గతించి యారేడు లయినవి

పూండ్ల రామకృష యైగారు —వీరు నెల్లూరువాసులై, ఆంధ్ర భాషాభిమానము గలిగి, "అముద్రిత గ్రంథ చింతామణి" యను నొక మాస పత్రికను స్థాపించి, యంతవరకముద్రితములై యుండిన యాంధ్రగ్రంథములను ముద్రించియు ననేకాంధ్రగ్రంథములపై విమర్శలం బ్రకటించియు నాంధ్ర భాషా సేవం జేసి కీర్తిశేషులైరి

మండపాక పార్వతీశ్వరశాస్త్రులవారు —వీరు బొబ్బిలి యాస్థాన కవీశ్వరులుగ నుండి, బహు గౌరవనీయులై కీర్తిశేషులైన కవిశిఖామణి ఈయన రమారమి 80 గ్రంథములు రచించిన మహాకవి చతుర్విధ కవిత్వమును మృదు మధుర నిరర్గళధారతో జెప్ప గలిగిన సామర్థ్యము వీరియం దుండినది 150, 200 చరణములుగల యుత్పలమాలికలను జెప్పుటయందు వీరిని మించినవారు మరియొక్కరు లేరు. వీరు వినయ సౌశీల్యాది గుణసంపత్తిని గలిగియుండిరి 1897 వ సంవత్సరమున వీరు పరలోకప్రాప్తిని గాంచిరి

పులుగుర్త లక్ష్మీనరసమాంబ —ఈమె మహిళా కళాబోధిని మొదలగు నాంధ్ర కావ్యములను రచియించి, సావిత్రియను చక్కని మాసపత్రికను రెండు సంవత్సరముల వరకును బ్రకటించిన యాంధ్ర విదుషీమణి ఈమె నివాసస్థలము కాకినాడ భర్తపేరు పులుగుర్త వేంకటరత్నంపంతులుగారు ఈ వనితామణి విద్యావతియగుటకు వీరే కారకులగుటచే వేంకటరత్నముగారు శ్లాఘాపాత్రులు

మహామహోపాధ్యాయ గంగాధరశాస్త్రిగారు —ప్రస్తుతము కాశీ క్షేత్రములో మిక్కిలి ప్రఖ్యాతిఁబడసిన యాంధ్రులు వేషమును, ఆచారమునుబట్టి వీరు మహారాష్ట్రులుగఁ గానవచ్చినను, వీరి పూర్వులు గోదావరిజిల్లాకుఁ జేరినవారగుటవలన నాంధ్రులనుటకు సందేహము లేదు పేరు పెంపెక్కిన కాశీ సంస్కృత పాఠశాలలో సాహిత్య వేదాంతాది శాస్త్రములకు మహోపాధ్యాయులుగ నున్నారు వీరి విద్యకును, సౌజన్య సంపదకును దొరతనమువారు మెచ్చి, 1887 వ సంవత్సరము మహా మహోపాధ్యాయ బిరుదును 1903 వ సంవత్సరము సి ఐ ఇ బిరుదు నిచ్చిరి

[ఈ ఛాయా చిత్రాలు 1910 సాధారణ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి సం ]

# ఔరంగజేబు
# తన గురువునకు వ్రాసిన యుత్తరము

మ-రా-రా-శ్రీ కే. వి. లక్ష్మణరావు ఎం. ఎ. గారిచే వ్రాయఁబడినది.

[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]

ఔరంగజేబు నెడల నెన్ని దుర్గుణములున్నను అతఁడు గొప్ప విద్వాంసుఁడని చెప్పక తప్పదు అతనికి భాషా పాండిత్యమును, లౌకిక వ్యవహార జ్ఞానమును, దూరదృష్టియుఁ గలవు అతని యక్షరములు ముత్తియముల వలె ముద్దులు మూటఁగట్టుచుండెను తనయొద్దకుఁ బంపబడిన ముఖ్యమైన యర్జీల కన్నిటికిని, అతఁడు స్వహస్తముతో బ్రత్యుత్తరములు వ్రాయుచుండెను అతనికి చిన్ననాఁడు చదువు చెప్పిన ముల్లాసాలె అనునతఁ డొకప్పుడు తనకు గొప్ప యుద్యోగ మీయుమని యర్జీ పంపఁగా, అందుకు బాదుషహా ఈ క్రింది విధమున బ్రత్యుత్తర మంపెను

"మీరు నాకు అనావశ్యకమైనట్టి అరబ్బీభాష నేర్పుటయందుఁ బెక్కు సంవత్సరములు నిరర్థకముగ గడిపి కోమలమైన నా బుద్ధిని, తీక్ష్ణమైనట్టి నా స్మరణశక్తిని వ్యర్థపుచ్చితిరి జీవితమునం దెన్నడును ఉపయోగపడని భాష రాజపుత్రులకు నేర్పుటకు పది పన్నెండు వత్సరములు వెచ్చించుటయు, ఆ భాషయందు నన్ను వైయాకరణిగను, ధర్మశాస్త్రజ్ఞునిగను చేయ యత్నించుటయు నెంత హాస్యాస్పదములు ఉపయోగమైన విద్యలును, జ్ఞానమును బాలకులకు వారి వారి బుద్ధి ననుసరించి చిన్ననాఁడు నేర్పుటయందు కాలము గడుపుటకు మాఱుగా మా గురువులవారగు మీరు మా బాల్యమును వ్యర్థపుచ్చిరి గదా? అయ్యో! భూగోళజ్ఞానమా ఏయును లేదు పోర్చుగలు, హాలండు, ఇంగ్లండు మొదలగు దేశములు కొన్ని కలవనియు, అవి ఆ యా స్థలములందు కలవనియు, నాకు నేర్పితిరా? ఆ దేశములు ద్వీపములా, ద్వీపకల్పములా, సమభూమియందున్నవా, లేక ఎత్తుస్థలములందున్నవా యన్న సంగతులు నాకు తెలియవలదా? చీనా, పారసీకము, పెగు, తార్తారి మొదలైన దేశముల రాజులు హిందూదేశపు బాదుషహా యొక్క పేరు విని గజగజ వణకెదరని నా ఎదుట మీరు చేసిన ముఖస్తుతి వలననే దేశ దేశ చరిత్రములన్నియు నాకు దెలిసిన వనుకొంటిరా? ఈ జగత్తుమీదనున్న వేరు వేరు రాజ్యము లెవ్వి? అందలి ఆచార విచారములు, రాజ్యవ్యవహారములు, మతములు నెట్టివి? ఆ యా రాజ్యములను గల సంపత్తులును, విపత్తులును, ఆ యా దేశము సంపద్విపత్తులలో, ఆ దేశస్థుల యొక్క ఏ యే గుణావ గుణములవలన ఎట్టి యెట్టి మార్పులు గలిగినదియు, ఎట్టి మహత్కారణములచే గొప్ప రాజ్యములు తలక్రిందగునదియు అనుమహద్విషయములు చరిత్రాధ్యయనము లేకయే మా కెట్టులు తెలియగలవు? ఈ విషయములు మాకు నేర్పితిరా? రాజపుత్రులు పైని వర్ణింపబడినట్టి యత్యంతావశ్యకములగు వివిధ విషయములను నేర్చుకొని జ్ఞానసంపన్నులై తమ బుద్ధిని వికసింప జేయవలయును కావున రాజపుత్రుల యొక్క జ్ఞానార్జనకాలమగు బాల్యదశయందలి యొక్కొక్క క్షణము మిక్కిలి విలువగలదియని యెఱింగి నా బాల్యదశను మీరు చక్కగ వినియోగపఱచితిరా? మీరు నాకు లేనిపోనట్టియు, బుద్ధిని భ్రమింపఁజేయునట్టియు లౌకిక వ్యవహారమునకు నిరుపయోగకరమైనట్టియు పర భాషాజ్ఞానము గఱపుటయందే కృతకృత్యులమైతిమని తలంపలేదా? మొదట పరకీయ భాష నొకదానిని నేర్పి దాని మూలముగా శాస్త్రములు, ధర్మ వివేచనము, న్యాయనీతి మొదలైన యావశ్యకములైన విద్యల నేర్పుట సులభమని తలంచితిరా? ఈయావశ్యకములగు విద్యలన్నియు మీరు నాకు నా మాతృభాషలోనే నేర్పియుండకూడదా? "నేను ఔరంగజేబునకు తత్త్వజ్ఞానశాస్త్రమును నేర్పెదను" అని మీరు నా తండ్రియగు శహాజహానుబాదుషహాగారితో నొకప్పుడనియుంటిరి మీ రనేక సంవత్సరములకు బ్రహ్మ, ఆకాశము, ఖటపటములు మొదలైన నీరస శబ్దములచే నేదోయొక విషయము నాకు బోధింప యత్నించినట్లు నాకు జ్ఞాపకమున్నది ఆ విషయమును గ్రహింపవలయునని నేను పెక్కు పర్యాయములు యత్నించితిని కాని యందువలన నా జ్ఞానభాండారమునకును, రాజ్యకర్తృత్వమునకును, ఏమిలాభము కలిగినది? మీరు తేప తేప యుచ్చరించుచున్నందున నీరసములును, పలుకుటకు కఠినములును అగు ఖటపటాది పదములు కొన్ని నాకు జ్ఞాపకమున్నవి కాని వానితో సంబంధించిన, విషయచర్చ మాత్రము నేను ఎప్పటిదప్పుడు మరచిపోవుచుంటినని మీరెఱుఁగరా? నేడు ఆ విషయ చర్చ జ్ఞాపకమున్నను దానివలన నాకు ప్రయోజన మేమి? ఇట్లు మీరు కోమలమైనటువంటి నా బుద్ధిని, చురుకుదనమును వ్యర్థము చేసిరిగాదే? నిజముగా నిరుపయోగములైనను మీరు ఆవశ్యకములని తలచిన ఈ విషయములు మీరు నాకు నేర్పినందున మీకు మాత్ర మొక లాభము కలిగినది మూఢులును, అజ్ఞానులునగు మావంటివారికి మీరు సర్వజ్ఞులనియు, సర్వ శాస్త్రపారంగతులనియు, అత్యంత పూజ్యగురువర్యులనియు, నిరర్థక గౌరవ భావమును కొంతకాలమువఱకుఁ బుట్టింపఁగలిగితిరి. అందువలన పెక్కుదినములవఱకు మీ మాటను మేము మన్నించుట తటస్థించెను రాజులను వ్యర్థముగా స్తుతించుట, సత్యమును తలక్రిందుచేయుట, నక్క వినయములు నటించుట యను గుణములు మాత్రము మీయందుఁ జక్కగ వసించుచున్నవి. మిమ్ముల నేను నా రాజసభయందు, ఒక సరదారునిగ నియమింపవలయునని మీరు కోరితిరిగదా మీయొక్క ఏ గుణమునుఁజూచి నేను మీ కా పదవి నొసగవలయును? మీరు నాకు రాజకీయ, సైనిక, వ్యావహారిక విద్యలలో నే విద్య నేర్పితిరని మిమ్ముల నేను గౌరవింతును? నన్ను నావశ్యకములైన విద్యలలో బారంగతునిఁజేసి యుండిన యెడల సికందరు (అలగ్జాండరు) బాదుషహాకు పరమపూజ్య గురువర్యుఁడగు మహా విద్వాంసుఁడైన అరిస్టాటుల్ ఎడల గల పూజ్యభావమునే చూపియుందును అట్టి యుపయోగకరములగు శిక్షగాని, లాభకరములగు విద్యలనుగాని నేను మీవలనఁ బడయలేదు. కావున మీ విషయమై గౌరవముగాని, పూజ్యభావముగాని నాకు లేదు మీరు వచ్చిన త్రోవనే వెళ్లుఁడు మీ పల్లెటూరిలోనే దేవునిస్మరణఁ జేసికొనుచు కాలము గడుపుడు మీరు నా రాజసభలో బ్రవేశింపఁగూడదనియు, మీరెవరోయిచ్చటి వారెవరికిని తెలియఁగూడదనియు నా యభిప్రాయము"



గరికపాటి సుబ్బారాయడుగారు



వీరేశలింగం దంపతులు



శంకరా రాధ్యులుగారు

గరికపాటి సుబ్బారాయడుగారు బి. ఎ. :—రాజమహేంద్రవరపు కళాశాలలోఁ జదివి బి. ఎ. పట్ట పరీక్షలో గడితేరినవారిలో గరికపాటి సుబ్బారాయడుగారు మొదటివారు. వీరు దొరతనము వారి విద్యా వ్యాపన శాఖలోఁ బ్రవేశించి, క్రమ క్రమాభివృద్ధినిగాంచి ఇప్పు డాంధ్రుఁ డెవ్వడు నింతవరకుఁబొందని ఇన్‌స్పెక్టరాఫ్ స్కూల్స్ ఉద్యోగము నందున్నారు. వీరు కృష్ణా, గుంటూరు, నెల్లూరు మండలములలోని పాఠశాలలను బరీక్షించుచుందురు. వీరిక్రింద జాలమంది అసిస్టెంట్లు, మరియు సబ్ ఇన్‌స్పెక్టర్లు గలరు.

రావు బహద్దరు కందుకూరి వీరేశలింగంపంతులుగారు :—సత్యాన్వేషణమే పరమోద్దేశముగాఁగల ఈ మహనీయుడు సంఘ మత సంస్కరణములకును, ఆత్మ త్యాగమునకును ఆంధ్రదేశములోనివారికి మార్గదర్శియనుటకు సందేహములేదు. వీరికి గద్యతిక్కన యని బిరుదు గలదు. వీ రాంధ్రభాషకు జేసిన మహోపకారమెట్టిదైనదని వీర గ్రంథములే వేనోళ్ల శ్లాఘించుచున్నవి. వీరు వ్రాసిన ప్రహసనములు, నాటకములతో ఆంధ్రదేశీయులను నీతి మార్గ ప్రవిష్టులనుగా జేసి దేశమునకు మహోపకారమును జేసినారు. గద్య పద్యాత్మకమైన వీరి ప్రబంధములు మహదద్భుత రచనాశైలిని గలిగి, పండిత పామర జనరంజకముగా నున్నవి. స్త్రీ విద్యాభివృద్ధికొరకును, వితంతూద్వాహములకొరకును దీక్ష వహించి పని చేసినవారు. రాజమహేంద్రవరములోనున్న హితకారిణీ సమాజమునకు దమ సర్వస్వమును ధారవోసి పరోపకారమే తమ జీవిత సర్వస్వమని జగమునకు జాటించినవారు.

శ్రీ శంకరారాధ్యులు :—వీరు దక్షిణ హైదరాబాదులోనున్న యారాధ్య బ్రాహ్మణులలో 'ప్రముఖులై' శైవ సాంప్రదాయకులను కోమట్లకు గురువులైయున్నారు. విద్యా గుణ సంపన్నులు. దాన ధర్మ నిరతులు. ఆంధ్రభాషాభిమానులు.

[ఈ ఛాయా చిత్రాలు 1910 సాధారణ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి. సం.]

---

ప్రస్తుతకాలమందు బాల బాలికా విద్యను గుఱించియు, జాతీయ విద్యను గుఱించియు మనదేశమునందు కొంత యత్నము జరుగుచున్నది. ఇందును గుఱించి పాడుపడుచున్న మహనీయుల కీ యుత్తరములోని రెండు మూడు సంగతు లాదరణీయములు. బాల బాలికలకు బోధింపఁబడు విషయములు వారికి, వారి జీవిత కాలములో నుపయోగకరముగా నుండవలయును. కేవలము పాండిత్యము జూపుటకై అనుపయోగకరములగు విషయములు వారికి నేర్పి వారిచే గుడ్డిపాఠము చేయించి కాలము వ్యర్థపుచ్చుట, వారికిని, దేశమునకును హానిప్రదము. బాలురకు శాస్త్రములన్నియు వారి మాతృభాషలోనే నేర్పవలయునుఁగాని పరభాషలో నేర్పుట కేవలము ద్రావిడ ప్రాణాయామమని ఔరంగజేబు ఉత్తరమువలన మనవారు ముఖ్యముగా నేర్చుకొనవలయును. మొదట పరభాష నభ్యసించుటకు బాలుర కాల మెంతయో వ్యర్థమగును. అట్లు పరభాష వచ్చినతరువాత, ఆ భాషలో శాస్త్రముల నభ్యసించుటకంటె మొదటనుండియు స్వభాషలోనే శాస్త్రాధ్యయనము చేసిన యెడల బాలుర కెంతయో కాలము, శ్రమయు కలిసి వచ్చునుకదా? తెలివిగల పిల్లవానికి ఇంగ్లీషుభాష చక్కగ నభ్యసించుటకు సుమారు ఆరేడు సంవత్సరములు పట్టును. అప్పటి కా బాలునకు ఇంగ్లీషులో గ్రంథావలోకనము చేయుటకును, శాస్త్రాభ్యాసము చేయుటకును అధికారము కల్గును. ఇట్లు పరభాషాధ్యయనమునకై ఏడెనిమిది సంవత్సరములు వ్యర్థమగుచున్నవి. దేశభాషలలో శాస్త్రములఁ జెప్పిన యెడల నీ ఏడెనిమిది సంవత్సరములలో నెన్నియో విద్యలలోఁ బారంగతుఁడు కావచ్చును. ఇప్పుడు మనదేశమందు ఇంగ్లీషువారి ప్రభుత్వ మున్నందునను, ఇంగ్లీషుభాషలో గ్రంథభాండార మసంఖ్యముగ నున్నందునను ధనముగలవారు కొంద ఱా భాష నభ్యసించుట యావశ్యకమే. మేము వలదనము. కాని సకల శాస్త్రజ్ఞానమును, ఇంగ్లీషు భాషయను గదిలో బెట్టి తాళమువైచి, ఏ. బి: సి.డి. అను తాళపుచెవిని సంపాదించుటకు ఎనిమిది సంవత్సరములు ముక్కుపట్టుకొని తపస్సు చేయనివారలకు జ్ఞానభాండారములోని సొత్తును కొల్లగొట్టు నధికారము లేదనియు, విద్యా మహిమయు మాతృభాషా ప్రభావమును తెలియని దూరదృష్టివిహీనులు తప్ప మరెవ్వరును చెప్పఁజాలరు. జ్ఞానార్జనమార్గము లన్నియు పరభాషయొక్క యధీనమునందుండుటకంటె దేశము పాలించి మూరీభవించిన యజ్ఞానాంధకారము మఱొకటి కలదా? కావున స్వభాష మూలముననే జ్ఞానార్జనము చేయవలయునని ఔరంగజేబు నుత్తరములోనున్న విషయమును నా జాతీయ పాఠశాలాధ్యక్షులు గమనింపవలయును. అట్లు చేయక వారు ఇంగ్లీషు భాషనే జ్ఞాన సాధనముగాఁ బెట్టిరేని ఔరంగజేబు తన గురువును నిందించినట్లు రాబోవుతరమునందలి విద్యార్థులు తమ యాయుష్యములోని పది సంవత్సరములు పాడుచేసినందులకు మనలను నిందింపక మానరు.

# ఆయుర్వేదము

ఆయుర్వేద మార్తాండ భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యులు ఎ.వి.ఎస్. గారిచే వ్రాయఁబడినది

[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]

ఆయుర్వేద మన నెద్దియో, ఎపుడది యుత్పన్నమైనదో, అందుంగల విశేషంబు లెవ్వియో, అందలి ప్రయోజనంబు లెవ్వియో, ఈ మొదలగు విషయములనన్నియు విపులముగ దెలిసికొనుట యత్యావశ్యకమై యున్నను ప్రకృతము గ్రంథ విస్తరణభీతిచేత కొన్నిటిని మాత్రము సంక్షేపముగా వ్రాయుచున్నాఁడను

## ఆయుర్వేద శబ్ద నిరుక్తి

ఆయు వేద అను రెండు పదములచే నిమిడియుండు "ఆయుర్వేద" అను సమస్తపదమునకు "ఆయుఃవిందతి వేత్తివా ఆయుర్వేద" అను వ్యుత్పత్తిచేత ఆయువును (అనగా,

"శరీరేంద్రియ సత్వాత్మ సంయోగాధారి జీవితం,
నిత్యగ శ్చానుబంధశ్చ ంయోగా దాయు రుచ్యతే"

అను ప్రమాణంబు ననుసరించి శరిర, ఇంద్రియ, సత్వ, ఆత్మలు, ఒకటిగఁజేరి యుండుటయె ఆయువు) పొందుట, దెలిసికొనుటయె ఆయుర్వేదమని దెలియుచున్నది

## ఆయుర్వేదమునకు ప్రాచీనత

"ఋగ్వేద స్యాయుర్వేద ఉపవేద" అను వ్యాసకృత చరణ వ్యూహోక్తిచేత ననాదికాలమున పరమాత్మముఖమునుండి వెలువడినట్టియు పలుదేశములయందలి చరిత్రకారులచేత ప్రథమ రచనలని ఉద్ఘోషింపఁబడుచున్నట్టియు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేదము లనెడి నాలుగు వేదములలో మొట్టమొదటిదియగు ఋగ్వేదమునకు ఆయుర్వేదము ఉపవేదమని దెలియుచున్నది

అనాదియగు ఋగ్వేదమున కుపవేదమగుటచేత ఋగ్వేద అథర్వవేదాదుల యందు "య అ 6 మ 22 సుమిత్రయాన ఆప ఓషధయ స్సంతు" యజుర్వేదమునను "త్రిర్నో అశ్వినా దివ్యాని బేషజా" అని 1—3—4 ఋగ్వేదమునను "సవ్య మాయు రేతి య ఏవం విద్వా నుష్ణిహాా కురుతే" అనియు వైద్య ప్రతిపాదకములగు శ్రుతులు పెక్కులుగాఁ గానంబడుటచేతను ఈ ఆయుర్వేదముకూడ నతి ప్రాచీనతమమని యూహింపఁ దగియున్నది

## ఆయుర్వేదమున కుపవేదత్వ నిర్ణయము

మొట్టమొదట మహర్షులు పారలౌకికసుఖావహములగు శ్రుతులన్నిటిని ఋగ్యజుస్సామా థర్వ సంహితలుగ సమకూర్చినపిదప నిహసుఖముల నన్నిటిని బోధించెడు మిక్కిలి నెక్కుడుగనుండు మిగిలిన శ్రుతులలో చికిత్సాద్యారోగ్య భాగ్యముల కనుకూలించిన శ్రుతి సముదాయమున కాయుర్వేదమనియు, గానమునకు సంబంధించిన శ్రుతులకు గాంధర్వవేదమనియు, ఈ రీతి ధనుర్వేదాయుర్వేద గాంధర్వ వేదాదులు నాలుగనియు దెలియుచున్నయది ఈరీతి నాలుగు వేదముల యనంతరము సమకూడిన యాయుర్వేద గాంధర్వవేద ధనుర్వేదస్థాపత్య వేదములు నాలుగింటికి నుపవేదములనియు తదనంతరములగు జ్యోతిషాదులకు వేదాంగములనియు నామధేయముల ఋషిపుంగవులు వ్యవహరించిరని దెలియవచ్చుచున్నది అట్లుగానిచో ఋగ్వేదాదులయందు వైద్య ప్రతిపాదకములగు శ్రుతులు లేకపోయి యుండవచ్చును

అట్టి శ్రుత్యాత్మకమగు నాయుర్వేదము నానుపూర్వికముగా ఋగ్వేదాదులవలె గానరాకున్నను ఋగ్వేదాదులయందు చికిత్సా బోధక శ్రుతులు తఱచుగఁ గానంబడుటచేతను శ్రుత్యాత్మకమగు నాయుర్వేదము కూడ నున్నట్లు లూహింపవలెను.

## ఆయుర్వేదోపదేశ పరంపర

తాదృశ శ్రుత్యాత్మకంబగు నాయుర్వేదంబును పరమాత్మ చతుర్ముఖునకును, చతుర్ముఖుండు దక్షప్రజాపతికిని దక్షుండు అశ్వినీ దేవతలకును, అశ్వినేయులు సహస్రాక్షునకును, ఇంద్రుండు ఆత్రేయులకును, ఆత్రేయులు అగ్నివేశులకును, అగ్నివేశులు భేడ జాతూకర్ణ ధన్వంతరి చరక సుశ్రుతులు మొదలగువార్లకును, క్రమప్రాప్తంబుగ నుపదేశించినట్లు పరంపర దెలియుచున్నది.

ఈ యాయుర్వేదము శ్రుత్యాత్మకమగుటచేతను, సర్వజనులకును దెలిసికొనుటలో దుర్ఘటమైనదగుటచేతను, శస్త్రచికిత్స, కాయచికిత్స, రసాయనచికిత్స మొదలగు చికిత్సలన్నియు పరస్పరముగ సంకలితముగ నుండుటగని చతుర్ముఖుండు గూఢమగు శ్రుత్యాత్మకమగు నీ యాయుర్వేదమును ప్రత్యేక ప్రత్యేకము లగు శస్త్రచికిత్స, కాయచికిత్స, బాలచికిత్స, నేత్రశ్రోత్రాది చికిత్సాదుల నాచరించుటలో వైద్యులకు నధికమగు సౌకర్యంబు లుండునట్లును సర్వజన సుబోధంబుగ

1 శల్యతంత్రము (Surgical treatment)
2 శాలాక్యతంత్రము (Eye diseases etc)
3 కాయచికిత్స (General diseases)
4 భూతవిద్య (Mental diseases)
5 కౌమారభృత్యము (Management of children)
6 అగదతంత్రము (Texicology)
7 రసాయనతంత్రము (Science of Reguvoration)
8 వాజీకరణతంత్రము (Science of Aphrodisiacs)

లను ఎనిమిది విధములుగ విభజించి లక్ష శ్లోకములు గలిగి వేయి అధ్యాయములుగ నేర్పడిన "బ్రహ్మసంహిత" యను గ్రంథమును వెల్లడి పరిచినట్లు సుశ్రుతాది గ్రంథములనుండి తెలియవచ్చుటయేగాని ఆ యానుపూర్వికమగు గ్రంథము మాత్రము ఈ ప్రాంత్యములఁ గానరాకున్నది

## శల్యతంత్రాదుల వివరము

1 శల్యమనఁగా —నానావిధములగు గడి, కొయ్యలు, రాళ్లు, ఇసుక, ఇనుము మొదలగు లోహములు, పెంకులు, ఎముకలు, వెంట్రుకలు, గోళ్లు మొదలగునవి శరీరమం దనేక కారణములచే ప్రవేశించి, వివిధ రూపములుగ గలుగంజేయునట్టి బాధలను, చీము మొదలగువానిచే గలుగు బాధలను, సింహాస్యము, కాకముఖము, మొదలగు యంత్రములచేతను, వృద్ధిపత్రము, తీక్ష్ణాగ్రము మొదలగు శస్త్రములచేతను, క్షారము, అగ్ని మొదలగు ఇతర సామగ్రులచేతను, బాధనివారణ రూపములగు చికిత్సలను బోధించు భాగము

2 శాలాక్యమనఁగా —భుజములకు మీదనుండు చెవులు, ముక్కు, ముఖము, నేత్రములు మొదలగు వానియందు పుట్టిన వ్యాధుల నుపశమింపజేయు చికిత్సలను దెలుపు భాగము

3 కాయచికిత్సయనఁగా —సర్వ శరీరమందు బుట్టెడు జ్వరము, అతిసారము, రక్తపైత్యము, క్షయము మొదలగు వ్యాధుల ప్రతీకారములను వివరించు భాగము

4 భూతవిద్య యనఁగా —దేవ, అసుర, గంధర్వ, యక్ష, రక్ష, పితృ, పిశాచ, నాగ, గ్రహాదులు మొదలుగాగల దుష్టగ్రహములచే పీడితులయిన వారలయొక్క పీడా విప్రత్యుపాయ చికిత్సలను విభాగము చేయుభాగము.

5 కౌమారభృత్య మనఁగా —బాలుర సంరక్షణ, తల్లుల చనుబాలయొక్క దోషాదోషముల విభాగము, పాలచే వచ్చెడి బాలుర రోగములు మొదలగువానినిఁ దెలుపుచు వాని ప్రతీకారములను వివరించు భాగము

6 అగదతంత్ర మనఁగా —పాములు, తేళ్లు, సాలెపురుగులు, ఎలుకలు మొదలగు వాని విషములు వసనాభి, శంఖపాషాణ మొదలగు కందమూల పత్ర ధాతువిషములు, ఆ విషములు గలిగించు దోషములు విభాగములు మొదలగునవి తెలిసికొను నుపాయములను ఆ యా దోష ప్రతీకారములను, ప్రత్యేక ప్రత్యేక పదార్థములను కలుపుటచే గలుగు విష దోషాదులను వివరించు భాగము

7 రసాయన తంత్రమనఁగా —ముదిమిని బోగొట్టి ఆయుస్సును బుద్ధిని బలమును వృద్ధిపరచి రోగములను నివర్తిచేయునట్టి ఔషధములను నిరూపించు భాగము.

8 వాజీకరణ తంత్రమనఁగా —అల్పమయిన, దోషములచే దుష్టమయిన, క్షీణమయిన రేతస్సుగలవారలకు ఆప్యాయము, ప్రసాదము, ఉపచయము వీనిని గలుగజేయు నిమిత్తమును, సంతోషమును గలుగజేయు నిమిత్తమును, ఏర్పడినట్టి ఔషధ భాగము.

ఇటు లెనిమిది విధములుగ విభాగము చేయఁబడిన శాస్త్రమందు చికిత్సకు ఎన్ని విధములగు, సాధన సామగ్రులగు నంగము లావశ్యకములో యవి యన్నియు లోపము లేకుండునట్లు పైనెనిమిది తంత్రములుగ నేర్పాటుచేసి ఇతర వైద్య శాస్త్రకారుల యొక్క సాహాయ్య మవలంబించకయే, పెక్కు గ్రంథ రత్నంబులు ఋషి పారంపర్యముగ రచియింపఁబడి యున్నయవి

పై నెనిమిది విధములగు నంగములతో చేరిన చికిత్సా శాస్త్రమునం దనేక గ్రంథములు గానవచ్చుచున్నను, వైదిక కాలమున నార్యులకుంగల జ్ఞానమును దెలియంజేయు శ్రుతు లనేకములున్నను ప్రకృతియందు శస్త్రచికిత్స కాయచికిత్సాదులను బోధించు శ్రుతులను కొన్నిటిని మాత్ర ముదాహరించుచున్నాఁడను

## శల్యతంత్ర బోధక శ్రుతులు

"యజ్ఞస్య శిరోచ్ఛిద్యత తే దేవా అశ్వినా వబ్రువన్ భిషజౌ వై స్థ ఇదం యజ్ఞస్య శిరః ప్రతిధత్త మితి తతో వై యజ్ఞస్య శిర ప్రత్యధత్తాం" యజు 6—4—9 యజ్ఞపురుషుని శిరస్సు భేదింపఁబడినపుడు దేవతలు దేవవైద్యులని విఖ్యాతిగాంచిన యాశ్వినేయులను యజ్ఞపురుషుని శిరస్సును మరలసందానము చేయుడని యానతిచ్చినచో వారలు వారి శస్త్రక్రియాకౌశలముచే యజ్ఞపురుషుని శిరస్సును సంధించిరని

"సద్యో జంఘాం ఆయసీం విశ్పలాయై"

విశ్పలయను స్త్రీకి కాలువిరిగిపోయినపు డినుముతో జేయబడిన కాలును అర్థరాత్రి కాలమునందె ఆశ్వినేయులు సంధానముచేసిరనియు ఋగ్వేద ప్రథమాష్టకమున,

"తస్మా అక్షి నాసత్య విచక్ష ఆధత్త మదస్రా భిషజా ధవాన్"

అటులె మరియొక సమయమున కనుబోయినవారికి వేరొకటిదియగు కన్నును దెచ్చి యమర్చి యాశ్వినేయులు చికిత్స చేసిరనియు

శిరస్సంధాన అక్షిసంధాన శ్రుతులచే బోధితములగు విషయములచేత, శాలాక్య తంత్రమందలి శస్త్రకర్మయొక్క నైపుణ్యము బోధించుచున్నది మరియు జంఘాసంధాన బోధితమగు శ్రుతిచేత శల్యతంత్ర సామాన్యమగు శస్త్ర కౌశలము తేటపడుచున్నది

"యువం చ్యవాన మశ్వినా జరంతం పున ర్యువానం చక్రథు శ్శచీభి" ముదిమితనము ననుభవించుచున్న చ్యవనుడను ఋషిని మీ చికిత్సా కుశలతచేత మరల యౌవనవంతునిగఁ జెసిరని నా యాశ్వినేయులతో చెప్పిరనియుఁ దెలియవచ్చుటచేత రసాయన తంత్ర నైపుణ్యము అధికముగఁ గొనియాడఁదగియున్నది

## కాయచికిత్సా బోధక శ్రుతులు

"నక్తం జాతా స్యోషధే" అధ 1—5—23 రాత్రులయందు బుట్టిన పసుపు, గుంటకలగర, పాపర, నీలి అనునోయోషధు లారా మీరు నా శరీరమునందలి కిలాసము (బొల్లి) పలితము (తలనెరియుట) పోనడచి మరల స్వాభావికమగు రూపమును గల్గింపుడు

"త్రిర్నో అశ్వినా దివ్యాని భేషజా
త్రిధాతు శ్శర్మ వహతం శుభస్పతి" ఋ 1—34—6

ఓ అశ్వినేయులారా! శుభకరంబులగు నౌషధుల కధిపతులగు మీరలు దేవలోక భూలోకములయందుఁ బుట్టిన యోషధులను మూడేసిమార్లు మా కొసంగుడు అట్టి మూడు విధములచేత వాత, పిత్త శ్లేష్మంబులను మూడు ధాతువులను సుఖము నొందింపుడు బృహస్పతి పుత్రుండగు శంయుడు అనువానికింగల సౌఖ్యమును నా కుమారునికిం గల్గింపుడు

"వాత ఆవాతు బేషజం శంభుమయో భునో
హృదే ప్రణ ఆయూంషి తారిషత్" ఋ 8—8—44

వాయుదేవుండు రోగమును శమింపజేయునదియు, హృదయమునకు సుఖమును గల్గించునదియునగు నౌషధము నిచ్చుగాక దానంజేసి మాకు అనంతంబగు నాయువు వృద్ధినొందుగాక.

ఇట్లు కిలాసనాశక, త్రిదోషశామక, హృదయ సుఖజనక చికిత్సా విశేషము కాయ చికిత్సయందలి గౌరవము నుద్ఘోషించుచున్నవి

ఇటుల వైదిక కాలమునందు ఋగ్వేదాదులు శస్త్రచికిత్స, కాయచికిత్స, ఊర్ధ్వాంగ చికిత్సాది బోధకమగు ఆర్యవైద్య శాస్త్రముయొక్క అభివృద్ధి నుద్ఘోషించుటచేత నార్యులు శస్త్రచికిత్స, కాయచికిత్స, నేత్రశ్రోత్రాది చికిత్సలయందు నేర్పరులు కారని ఎవరు చెప్ప సాహసించెదరు

ఈరీతి వైదికకాలముననె నెక్కుడు అభివృద్ధిగాంచిన నీ యాయుర్వేద చికిత్సలు ఋషి పరంపరగ నభివృద్ధినిఁ బొందుచున్నవనుటకు రెండువేల వత్సరములపుడు విరచితములగు జగద్విఖ్యాతమైన చరక సుశ్రుత వాగ్భటాది గ్రంథములయందుంగల రోగ నివర్తక రూపములగు ఓషధులును వానిచేఁ జేయంబడు నౌషధములను గురించియు చిరకాలమునకు పూర్వమె యార్యులు మిక్కిలి గౌరవమును పొందిరనుటయు, ఔషధములచే రోగములను కుదుర్చుటయందు మిక్కిలి నిపుణులనుటయు ఆబాలగోపాలము సుప్రసిద్ధముగా నిగర్శనములుగ నున్నయవి మరియు సర్ విలియం హంటర్ అను సుప్రసిద్ధ హూణ చరిత్రకారుడు "భారతీయు లాయుర్వేఔషధములయందును ఓషధి తత్వ నిరూపణమందును చిరకాలమునకు బూర్వమె ఖ్యాతిగాంచిరనియు" వెండియు "హిందువుల పదార్థ తత్వశాస్త్రమును మనము దానివలన పొందిన యుపకారమును బట్టి చూచిన యెడలను, ఉబ్బస రోగములకు నల్ల యుమ్మెత్త ఆకుయొక్క పొగను పీల్చుట పక్షవాత, అజీర్ణ వ్యాధులకు ముషిణిని ఉపయోగించుట మొదలగు హిందువుల పురాతన చికిత్సలను ఐరోపాఖండమున వైద్యశాస్త్రజ్ఞులు నవీనముగ నవలంబించిరనుసంగతిని మనము జ్ఞప్తికి దెచ్చుకొనిన యెడల వారి చికిత్సలలో ననేకము లమూల్య గుణములు గలవిగా నుండుట స్పష్టమగుచున్నది" అని లండన్ నగరమునందలి కింగ్స్ కాలేజిలోనుండు మిస్టర్ జే యఫ్ రోవె యం డి ఎఫ్ ఆర్ అండ్ యల్ ఎస్ అను ఓషధితత్వ శాస్త్ర పండితును నుడివెను ఈరీతి పాశ్చాత్య వైద్యవరులు కాయ చికిత్సల నుద్దేశించి యుద్ఘోషించుచుండుటచేత నార్యులు ఔషధములచే చికిత్సలను వేయుటలో మిగుల సమర్థులనుట మిక్కిలి పురాతన విషయమై నదగుటచే నా కాయ చికిత్సను గురించి ముచ్చటించుట ప్రకృతము మాని యక్కాలమున వారికిం గల శస్త్ర చికిత్సయందలి నేర్పరితనము ఉత్కృష్టత విస్మృతమగుటచే ప్రకృతము లుప్తమైన ఆ శస్త్రచికిత్సను మాత్రము వెల్లడించు నుద్దేశముతో శస్త్ర చికిత్సకు నవశ్యకముగ సంబంధించిన యంత్రములు, శస్త్రములు, క్షారములు, మొదలగు వానిని వానిభేదములును వాని ప్రయోజనములు మొదలగువానిని సంక్షేపముగ వ్రాయుచున్నాఁడను

## శస్త్రచికిత్స ఎనిమిది విధములు

"శస్త్రకర్మా ష్టవిధం త ద్యధా"

1 ఛేద్యం నరకతగినది
2 భేద్యం రెండుగా చీల్చతగినది
3 లేఖ్యం గీరతగినది
4 వేధ్యం గుచ్చతగినది
5 ఏష్యం వెతగతగినది
6 ఆహార్యం బైట వెడలింపతగినది
7 విస్రావ్యం స్రవింపచేయతగినది
8 సీవ్యం కుట్టదగినది

అని శస్త్రాదులచే చేయఁదగిన కృత్యముల నెనిమిది విధములుగ సుశ్రుత సూ అగ్రోపహరణీయాధ్యాయమున వివరింపఁబడెను

## యంత్రములు

"యంత్ర శత మేకోత్తరం" సుశ్రుత సూ అ 7 అను వాక్యముచేత యంత్రములు నూటనొకటనియు, (యంత్రమనగా అనేక కారణములచే చర్మమున, మాంసమున, నెముకలలోను గుచ్చుకొని మనస్సును శరీరమును విశేషముగ బాధించెడు శల్యములను— అనగా ఇనుప మేకులు ముళ్ళు ఎముకలు సీసపు రవలు మొదలగునవి—బయలకి వెడలదీయుటకు సాధనములైనవి యంత్రములని) అందు

| | | | |
|---|---|---|---|
| 1 | స్వస్తికయంత్రములు | 24 | మొత్తము 101 |
| 2 | సందశయంత్రములు | 2 | |
| 3 | తాలయంత్రములు | 2 | |
| 4 | నాడీయంత్రములు | 20 | |
| 5 | శలాకాయంత్రములు | 28 | |
| 6 | ఉపయంత్రములు | 25 | |

ఈరీతి నా నూట యొక యంత్రముల నారువిధములుగ నాయా చికిత్సల సౌలభ్యముకొరకు నేర్పరుపఁబడెను

మరియు ఆ యంత్రము "తాని ప్రాయశో లౌహాని భవన్తి తత్ప్రతి ప్రతిరూపకాని వా తదలాభే" "వ్యాలానాం మృగపక్షిణాం ముఖై ర్ముఖాని యంత్రాణి ప్రాయశః సదృశాని తస్మా త్సామాన్యా దాగమా దుపదేశా దన్యయన్త్రదర్శనా ద్యుక్తిత శ్చ కారయేత్" ఆ యంత్రములు శాస్త్రప్రకారముగను ఆచార పరంపరగను వ్యాలము మృగములు పక్షులు మొదలగు వాని ముఖముల యాకృతినిం బోలినవిగను, ఇనుము మొదలగు లోహములతోగాని వానికి ప్రతిరూపకములగు దంతములు కొయ్యలు మొదలగు వానితోగాని చేయవలెననియు "సమాహితాని యన్త్రాణి ఖరశ్లక్ష్ణ ముఖానిచ, సుదృఢాని సురూపాణి సుగ్రహాణిచ కారయేత్" అను వాక్యముచేత గరుకైన నునుపైన ముఖములు గలవిగను బలముగలవిగను చూచుట కందముగను పట్టుకొనుటకు సుఖకరముగను యంత్రములు నిర్మాణము చేయవలెనని తెలియవచ్చుచున్నది.

## స్వస్తికాది యంత్రముల ప్రమాణము

"స్వస్తికాని అష్టాదశాంగుల ప్రమాణాని సింహ వ్యాఘ్ర తరక్షు ఇత్యాది ముఖాని మసూరాకృతిభిః కీలకైః రవబద్ధాని మూలేం కుశవ దావృత్తవారాణ్యగ్ర న్యస్థినివిష్ట శల్యోద్ధరణార్థ ముపదిశన్తి"

స్వస్తిక యంత్రములు పదునెనిమిది యంగుళముల పొడుగును, సింహము, ఎలుగుగొడ్డు, చిరుత మొదలగువాని ముఖములంబోలి ముఖములను గలవిగను చిరుసెనగ బద్దలవలె నుండెడి కీళ్లతో బంధింపబడినవిగను మొదళ్లు అంకుశమువలెనె వంగినవిగను నుండవలెను ఇట్టి ఈ యంత్రములను ఎముకలయందు గుచ్చుకొనియున్న ఇనుపమేకులు మొదలగు శల్యములనుం దీయుటకై ఉపయోగించవలెనని తేటపడుచున్నది స్వస్తికాది యంత్రములవలెనె సందంశ యంత్రము లారు అంగుళములు గలవిగను మాంసము, సిరలు, నరములు వీనియందు లగులుకొన్న శల్యములను నాకర్షించుట కుపయోగింపవలెననియు జెప్పంబడెను నాడీ యంత్రము లనేక ప్రకారములై యవిగను ఏకముఖ ఉభయ ముఖములుగలవిగను స్రోతో మార్గములు పట్టునంతటి లావు గలవిగను స్రోతస్సులయందలి గ్రుచ్చుకొనియున్న శల్యములను గ్రహించుటయందును స్రోతోరోగములను బరీక్షించుటయందును ఆ యా కార్యములకు అనుకూలమగు దైర్ఘ్యముగలవిగను నుండవలెనని బోధపడుచున్నవి తాలయంత్రములు పనిరెండు అంగుళములు గలవిగను చేపలయొక్క పొలుసులవలె నుండునట్టి కొనలు గలవిగను చినిర్మించెవులయందలి ముక్కునందలిగల శల్యముల వెలికిదీయుటయందు వినియోగింపవలెననియు గోచరమగుచున్నది

శలాకాయంత్రములయొక్కయు, ఉపయంత్రములగు దారములు, చంత్రులు, చర్మములు, నారలు, బట్టలు క్షారములు మొదలగు వానిని వివరముగ జెప్పబడెను. మరియు

"స్వబుధ్యా చాపి విభజే ద్యత్ర్త కర్మాణి బుద్ధిమాన్,

అసంఖ్యేయ వికల్పత్వాత్ శల్యానా మితి నిశ్చయః"

అను ప్రమాణము ననుసరించి శల్యములస్థితి సంఖ్యాతీతములగుటచేత ననుభవజ్ఞుడగు బుద్ధిమంతుడగు వైద్యుడు, ఆ యా సమయోచితముల ననుసరించి యంత్ర కర్మలను నేర్పరచుకొనవలెనని చెప్పుచుండుటచేత, యంత్రములచే గలుగు దోషములు మొదలగునవి రాకుండునటులను యంత్ర ప్రక్రియలయందు మిక్కిలి సౌలభ్యమును క్రియాకుశలతయును సూచించుచున్నది

## శ స్త్ర ము లు

"వింశతి శస్త్రాణి తద్యథా"

1 మండలాగ్రము, 2 కరపత్రము, 3 వృద్ధిపత్రము, 4 నఖశస్త్రము, 5 ముద్రిక, 6 ఉత్పలపత్రకము, 7 అర్ధధారము, 8 సూచీ, 9, కుశపత్రము, 10 ఆటీముఖము, 11 శరారీముఖము, 12 అంతర్ముఖము, 13 ఆర, 14 వేతసపత్రక, 15 బడిశము, 16 శంకులు, 17 ఏషణి, 18 త్రికూర్చకము, 19 కురారిక, 20 వ్రీహిముఖము ఈరీతిగ సుశ్రుత సూత్ర 8 అధ్యాయమున మండలాగ్రాది శస్త్రములు ఇరువదియని జెప్పంబడెను

## శ స్త్ర స్వ రూ ప ము

మరియు వాగ్భటమున అవే శస్త్రములు

"షడ్వింశతి స్తుకర్మార్థై ర్ఘటితాని యథావిధి
శస్త్రాణి రోమవాహీని బాహుల్యే నాంగులాని షట్
సురూపాణి సుధారాణి సుగ్రహాణి చ కారయేత్
అకరాలాని సుధ్మాత సుతీక్ష్ణావర్తితే యసి
సమాహిత ముఖాగ్రాణి నీలాంభోజ చ్ఛవీనిచ
నామానుగత రూపాణి సదా సన్నిహితాని చ
స్వమానార్ధ చతుర్థాంశ ఫలా న్యైకైకశోపి చ
ప్రాయో ద్విత్రాణి యుంజీత తాని స్థానవిశేషత"

అను ప్రమాణములచేత శస్త్రములు ఇరువదియారు విధములనియు అవి విధ్యుక్త ప్రకారమున బాగుగా కాచబడిన ఉక్కుతో సుప్రసిద్ధులగువారిచే చేయబడినవిగను రూపమునందు మిక్కిలి మనోహరముగను మంచి పదునుగలవిగను రోమవాహినులును పట్టుకొనుటయందు రమ్యముగను వంకరలు లేనివిగను చక్కని ముఖములు మొదళ్లు గలవిగను నల్లకలువలవలె తళతళయను మెరుగు గలవిగను నా యా పేరులకుతగు నాకారములు గలవిగను, వాని ప్రమాణములలో సగముగాని నాల్గవవంతుగాని వాడిగలవిగను దైర్ఘ్యముచేత నారంగుళముల పొడవు గలవిగను ఒక్కొక రకములో రెండు మూడు గలవిగను నుండవలెనని దెలియుచున్నది

ఇటుల శస్త్రములరీతిని, ఆకృతిని, కాంతిని, కొలత మొదలగువానిని వివరముగ వర్ణింపబడెను.

## పదునుయొక్క భాగము, స్వరూపము, పరిమితి

"తత్ర ధారా భేదనానాం మాసురీ లేఖనానా మర్ధమాసురీ వ్యధనానాం విస్రావణానాం చ కౌశికీ భేదనానా మర్ధకౌశికీతి"

భేదన కర్మయం దుపయోగించెడు శస్త్రములకు పదునైన కొన చిరు సెనగబద్ద ప్రమాణముగను, లేఖన కర్మయం దుపయోగించెడు శస్త్రములయొక్క పదునైన కొన చిరు సెనగబద్దలో సగముండవలెననియు, గుచ్చుటకు స్రవింప జేయుటకు ననుకూలములగు శస్త్రములయొక్క కొనలు, వెంట్రుకవలెనుండవలెననియు, భేదనయోగములగు శస్త్రములయొక్క పదునైన కొన వెంట్రుకలో నర్ధభాగము గలవిగ నుండవలెననియు దెలియవచ్చుచున్నది

## పా య న సం స్కా ర ము

పాయనమనగా పా, పానె అను ధాతువువలన బోధకమగు నర్థముచేత శస్త్రములను నిప్పులోకాలిచి క్షారద్రవ, తైల, ఉదకములయందుంచుట లేక క్షారద్రవ తైల ఉదకములయందు శస్త్రములనుంచి బాగుగా కాచుటయని తెలియవచ్చెడు భేదనాది క్రియలు జేయునపుడు యా యా యవయవ ప్రదేశములును మాంసాది వస్తువులును ననుసరించి భిన్న భిన్న శస్త్రముల నుపయోగింపవలెననియు నట్లుపయోగించునపుడు శస్త్రములకు "పాయన" అను సంస్కారమును జేయవలెననియు నా పాయన సంస్కారముచేత శస్త్రములకు కిలుకు మొదలగు గుణములె గాక, కర్మలయందు విశేషోత్కర్షము కూడ గలుగునని చెప్పబడెను

"తేషాం పాయనా త్రివిధా క్షారోదక తైలేషు తత్ర క్షారపాయితం శరశల్యాస్థిచ్ఛేదనేషు ఉదకపాయితం మాంసచ్ఛేదన భేదన పాటనేషు తైలపాయితం సిరావ్యధన స్నాయు చ్ఛేదనేషు" క్షారపాయనముచేత బాణములు శల్యములు అస్థి వీని భేదన కర్మలయందు సౌకర్యమును ఉదకపాయనముచేత మాంసముయొక్క భేదనమందును పాటనమందును సౌకర్యమనియు తైలపాయనముచేత సిరలయొక్క స్నాయువులయొక్క భేదనమునకు హితమనియు, శస్త్రములకు పాయనము మూడు విధములుగ విభజింపబడెను

ఈరీతిగ పాయన సంస్కారము చేయుటచేత శస్త్రములకుంగల దోషముల పోవుటయెగాక కర్మలయందు సౌకర్యమును నాధునిక శస్త్ర వైద్యులాచరించెడు క్రిమిజాల నాశకము కూడ సూచించుచున్నటుల తెలియవచ్చెడి

## ఇరువది విధములగు శస్త్రములకు కర్మలయందు వినియోగము

మండలాగ్ర కరపత్రములు, భేదన లేఖన కర్మలయందును వృద్ధిపత్ర నఖశస్త్ర ముద్రిక ఉత్పలపత్రిక అర్ధధారలు భేదన భేదన కర్మలయందును, సూచి కుశపత్ర ఆటీముఖ శరారీముఖ అంతర్ముఖ త్రికూర్చకములు స్రవింపచేయు కర్మయందును, కురారికా వ్రీహిముఖ ఆరా వేతస పత్రములు వ్యధనకర్మయందును, బడిశ దంత శంఖువులు అహరణ కర్మయందును, ఏషణ అనులోమన కర్మలయందును, సూచులు కుట్టుటయందును నుపయోగింపవలెనని దేటపడుచున్నది

ఇట్లు శస్త్రముల యాకృతియు కర్మ సౌకర్యమును వాని వినియోగమును విపులముగ వర్ణింపబడెను

## శస్త్రకర్మయందు నైపుణ్యము

సుశ్రుత చికిత్స అ 14 "బద్ధగుద స్రావిణిచ స్నిగ్ధస్విన్న స్యాభ్యక్తస్యాధో నాభే ర్వామత శ్చతురంగుల మపహాయ రోమరాజ్యా ఉదరం పాటయిత్వా చతురంగుళ ప్రమాణాని అంత్రాణి వినిష్కృత్య నిరీక్ష్య బద్ధగుదస్య అంత్ర ప్రతిరోధకరం అశ్మానం వాలంవా పోహ్య మలజాతం వా తతో మధు సర్పిభ్యా మభ్యజ్య అంత్రాణి యథాస్థానం స్థాపయిత్వా బాహ్యం వ్రణ ముదరస్య సీవ్యేత్" బద్ధగుద పరిస్రావిణియను నుదర రోగములయందు స్వేద స్నేహ భ్యజంసకర్మల నాచరించిన పిదప రోగియొక్క బొడ్డుకు రోమరాజికిని ఎడమ ప్రక్కన నాలు గంగుళములు విడిచి పొత్తి కడుపును చీల్చి లోననుండెడు అంత్రమును నాలుగంగుళముల పరిమితిని మాత్రము వెలికిలాగి అంత్రమందు ప్రతిరోధకముగ నుండునట్టి రాళ్ళనుగాని వెంట్రుకలనుగాని చక్కగ దెలిసికొని యనంతరము అంత్రమును భేదన పూర్వకముగ రాళ్లను వెంట్రుకలను వెలికుదీసి లేక ప్రతిరోధముగనుండు మలమునుగాని వెలికిదీసి పిదప శస్త్ర కర్మ విధుల ప్రకారము క్షాళనాదు లొనరించి వ్రణహరమగు తేనె నెయ్యితోడ నా అంత్రములను చక్కగ పూసి మొదట తీయబడిన ఆ అంత్రముల స్థలమునసే దిరిగియుంచి పుండుతో గూడిన చీల్పబడిన ఉదర చర్మమును సూచీశస్త్రముచేత కుట్టివేయవలెను

ఇదేరీతి పరిస్రావిణియను నుదర రోగమునందు కూడ "శల్యముద్ధృత్య అంత్రస్రావాన్ సంశోధ్య తచ్ఛిద్రాంతం సమాధాయ కాలపిపీలికాభి దంశయేత్ దష్టేచ తాసాం కాయా నపహరేత్ న శిరాంసి తత పూర్వవత్ సీవ్యేత్ సంధానంచ యథోక్తం కారయేత్" మీద చెప్పినట్లు అంత్రములను వెలికి వెడలించి ఆహారాదులద్వారా లోన ప్రవేశించిన రాళ్ళు గోళ్ళు మొదలగు శల్యములను వెలికిదీసి చిల్లులుబడి కారుచుండెడి అంత్రమును చక్కగ శోధనచేసి చిల్లులతోగూడిన ఆ అంత్రమును నెప్పటి స్థలముననుంచి అంత్రమందుగల రంధ్ర సామాన్యము కరుచుకొని యుండుటకై నల్ల గండుచీమలను దెచ్చి ప్రతి

రంధ్రమునకును ఒక్కొక్క చీమను కరిపించి, యాచీమలు కరుచుకొనినతోడనే వాటితలలు గాక మిగత శరీరములను తీసివేయవలెను. అనంతరము బద్ధగుదమందు చెప్పిన ప్రకారము నుదరమును కుట్టవలెను

## అప్రకమ ప్రసవములయందు శస్త్రకర్మ

వాగ్భటము శారీర అ 2
"హస్తపాద శిరోభి ర్యో యోనిం భుగ్నః ప్రపద్యతే
పాదేన యోని మేకేన భుగ్నో న్యేన గుదం చ యః
విష్కంభో నామ తౌ మూఢౌ శస్త్రదారణ మర్హతః
మండలాంగులి శస్త్రాభ్యాం తత్ర కర్మ ప్రశస్యతే
వృద్ధిపత్రం హి తీక్ష్ణాగ్రం న యోనా వవచారయేత్"

గర్భాశయమందలి శిశువుయొక్క చేతులు పాదములు శిరస్సు వేర్వేరు కాలముల యందు మర్మస్థానముఖమును పొందుటచేతను, లేక ఒక కాలుమాత్రము నిర్గమనద్వారము నుండి బయలు వెడలుటచేతను విష్కంభమను మూఢగర్భసంజ్ఞను పొంది శస్త్రకర్మకు నర్హములైనవనియు అట్టి శస్త్రకర్మ క్రూరమగు వృద్ధిపత్ర తీక్ష్ణాగ్రములను శస్త్రములచేతగాక మండలాగ్రమనెడి శస్త్రముచేత శస్త్రకర్మ మాచరింపవలెననియు సూచించుచున్నది

మరియు "పూర్వం శిర కపాలాని దారయిత్వా విశోధయేత్, కక్షోర స్థాలుచిబుకే ప్రదేశే న్యతమే తతః, సమాలంబ్య దృఢం కర్షేత్ కుశలో గర్భశంకునా, అభిన్న శిరసం త్వక్షి కూటయో ర్గండయోరపి" మొదలు శిరస్సంబంధమగు కపాలమును చీల్చి బహిఃప్రదేశమునకు దీసి శోధింపవలెను పిదప కుశలుడగు వైద్యుడు చంకలు ఎదురురొమ్ము గడ్డము మొదలగు ప్రదేశములలో నెద్దానినైనను గర్భశంకువను యంత్రము నుపయోగించి యా యా యవయవములను బైటికి దీసివేయవలెను

శిరస్సు ఛేదింపనప్పుడా శిశువుయొక్క యక్షికూటమున గర్భశంకును ఉపయోగించి వెలికిదీయవలెను మరియు "బాహుం ఛిత్వాంససక్తస్య వాతాధ్మాతోదరస్యచ, విదార్య కోష్ఠమంత్రాణి బహిర్వా సంనిరస్యచ, కటీసక్తస్య తద్వచ్చ తత్కపాలాని దారయేత్" భుజ శిరస్సు అడ్డుపడి వాతముచేత పొట్టఉబ్బి యుండునపుడు బాహువులను దెగనరికి కడుపును పేగులను చీల్చి వెలికి దీసివేయవలెననియు, పిరుదులు తగులుకొన్నయెడ తొడలను నరికి ఆ తుండ్లను పైరీతిగనె వెలికిదీయవలెననియు బోధించుటయేగాక "యద్యద్వాయు వశాదంగం సజ్జేద్గర్భస్య ఖండశః, తత్త చ్ఛిత్వా హరే త్సమ్యక్ రక్షేన్నారీంచ యత్నతః" అప్రకమ ప్రసవములయందు వాతముచే యే యే భాగము నిర్గమన ద్వార నిరోధమును చేయునో యా యా భాగమును తునక తునకలుగా నరికి బైటికి దీసివేసి ప్రయత్నముచే గర్భిణిని సంరక్షింపవలెనని బోధించుచున్నది

శస్త్ర చికిత్సల కనుకూలమగు యంత్రములు శస్త్రములు క్షారములు మొదలగునవి వివరముగ చెప్పుటచేతను వాని వాని స్వరూపములను భేదములు మొదలగునవి నిరూపించుటచేతను శస్త్ర చికిత్సలకు గావలసిన యావశ్యకమగు సామగ్రుల నన్నింటిని శస్త్రకర్మకు పూర్వమె నిలవ చేసికుని యుంచవలెనని సుశ్రుత సూ 8 అధ్యాయమున బోధించుటచేత నిక్కాలమువారలవలెనె పదార్థముల నన్ని వకటొతూరి జేర్చి యుంచుకునునటుల తెలియవచ్చుచున్నది అటుల గ్రహింపబడిన యంత్ర శస్త్రాది సామగ్రులను నాయావ్యాధి భేదములచేత నా యా శస్త్రములను యంత్రములను నుపయోగింపవలెననెడి విధులు చూడ వారి వారి సంపూర్ణానుభవజ్ఞాన గరిమచేత నేర్పాటు చేసినట్లూహింపవలసినట్లున్నది

మరియు పైనుదాహరణముగ గనపరచిన యుదరరోగ శస్త్రకర్మను అప్రకమ ప్రసవములయందలి శస్త్రకర్మను విచారించిచూడ నిక్కాలపు మత్సర రహితులగు శస్త్ర చికిత్సా విశారదులచే గొనియాడబడునట్లున్నవిగాని కేవల హాస్యాస్పదములుగా నున్నట్లు గానరావు మరియు నా శస్త్ర చికిత్సలలోగూడ రాచకురుపులు, అశ్మరి, అర్శోరోగము, అంతర్విద్రధులు, నేత్రవ్యాధులు, గళరోగములు మొదలగువానియందు వారికింగల శస్త్ర చికిత్సా నైపుణ్యమును చూడ గడచిన రెండువేల సంవత్సరములకు పూర్వమె యింతటి యంత్రశస్త్ర సామగ్రితో చికిత్సా సౌకర్యమునకై యా యంత్రశస్త్ర సామగ్రులలో భేదములు కల్పించి తదనుకూలముగ శస్త్రకర్మలు గూడ నెనిమిది విధములని నిర్ణయించి శస్త్రకర్మల నాచరించుచు ప్రపంచమునకు మేలుజేయుచుండుట నిక్కాలపువారలకు మిగుల నాశ్చర్యమనుటకు సందేహమేమియులేదు

ఆకులు అలములచేత మానములను కాపాడుకొను చుండిరను చరిత్రకారు లుద్ఘోషించు నా యనాగరిక కాలముననె మన ఆర్యులు శస్త్ర చికిత్సలయందు ఇక్కాలపు శస్త్ర చికిత్సలకన్న నున్నత స్థానము నందినట్లు పై వాక్యముల నెరుంగదగు

మరియు శస్త్ర యంత్రాది సామగ్రులచేతను, శస్త్రకర్మలయందలి నిపుణత చేతను కూడికునియున్న నాయుర్వేద శస్త్ర చికిత్సలే లుప్తముగాక క్రమముగ పరంపరలచే లక్ష్య లక్షణములతో నింతకాలమువరకు ననుసరించుచుండి వచ్చిన యెడల నెంతటి మహోన్నత పదవి యందుండుదుమో జెప్పజాల

మరియు సుశ్రుత సూత్రస్థానమందలి 1 7 18 20 21 22 23 24 25 26 27 అధ్యాయములను, చరకమున చికిత్స 13 వ అధ్యాయమును, వాగ్భట సూత్ర 26 27 28 29 30 అధ్యాయములను వకతూరిఅయినను చదివి, పురుషుడు ఆర్యులకు శస్త్రచికిత్సయందు ప్రవేశములేదను బుద్ధిమాలిన్యమును నిశ్చయముగ విడనాడగలడని దృఢముగ చెప్పగలను

ఇట్లు సమగ్రమగు ననాదిశస్త్ర చికిత్సల నన్నిటిని జుగుప్సాకరములనిదలచి యన్యాయముగ నిరక్షర కుక్షులగు మంగలులపాలుచేసిన మనబుద్ధి వైచిత్ర్యమున కేమనవచ్చును

## రసశాస్త్రము, ప్రయోజనము

మరియు నార్యులు అష్టాంగ విశిష్టమగు చికిత్సా శాస్త్రమున నిపుణులైనదిగాక రసశాస్త్రమున కూడ సమర్థులైనట్లు నాగార్జునాది మహసిద్ధులచే విరచితములగు "రసార్ణవ రససిద్ధి మన్థాన భైరవ రససారములు" మొదలగు గ్రంథములవల్ల తాంత్రిక యుగమున మహోన్నతదశయందున్నట్లు పెక్కు చరిత్రములనుండి వెల్లడియగుచున్నది ఆ తాంత్రిక వైద్య ప్రతిపాదకమగు గ్రంథములలోని విషయములు కేవల రోగ నివృత్త్యుపాయములను బోధించుటయెగాక ప్రాపంచికోపయోగములగు మహదైశ్వర్యప్రాప్తికి హేతువగు వజ్రవైడూర్యాది రత్నములయొక్కయు సువర్ణముయొక్కయు నిర్మాణమును చెప్పుటతో తృప్తినొందక ఐహిక సుఖానుభవానంతరము శాశ్వతమగు పరసుఖమునకు కూడ మార్గదర్శియగు నా పాదరసమునుండియే లోహసిద్ధితోపాటు దేహసిద్ధి కూడ కాగలదనియు తద్వారా జీవన్ముక్తియనియు సిద్ధాంతపరచిరి.

## ర స శా స్త్ర వి వ ర ణ ము

రసశాస్త్రము రసఖండ చికిత్సాఖండ రసాయనఖండ మంత్రఖండ వాదఖండములని యైదు విధములుగ విభజింపబడెను అందు రసఖండము, అభ్రకము—వైక్రాంతము మొదలగు ఖనిజ పదార్థములు బంగారు, వెండి, ఇనుము, మొదలగు లోహములు, వజ్రములు వైడూర్యములు, ముత్యములు మొదలగురత్నములు వీనియొక్క యుత్పత్తిభేదములు స్వరూపము మొదలగువానిని వర్ణించుచు పై పదార్థములు చికిత్సోపయోగమగునట్లు వాని శుద్ధి మారణ సత్వపాతన ద్రుతులను నాలుగువిధ పరిణామములను శోధనమారణాదుల కావశ్యకమగు యంత్రములు మూసలు మొదలగు వాని లక్షణములు వాని పరిభాషలను బోధించు భాగము

చికిత్సాఖండము—శోధన మారణ సత్వపాతనద్రుతులచే పరిణామరూపమగు అభ్రక సువర్ణ లోహాది పదార్థములచేతను తత్తద్రోగ నాశకమగు ఔషధముల బోధించుభాగము

మంత్రఖండము—మంత్రములచే జ్వరాదిరోగ శామకమును, అపస్మారాది మానసిక రోగనాశకమును బోధించుభాగము

వాదఖండము—వజ్రములు, వైడూర్యములు, పద్మరాగము మొదలగువానిని నిర్మాణముచేయు విధానమును బంగారు, వెండిని చేయు విధానమును బోధించు భాగము.

రసాయనఖండము—వ్యాధి సామాన్యమును బోనడచి ముదిమి రాకుండునటు లౌషధ ప్రయోగముల ఖేచరాది గమనమున కనుకూలమగు ఘుటికా ప్రయోగములను, దేహసిద్ధి, జీవన్ముక్త్యుపాయములను బోధించుభాగము.

ఈరీతి నైదు ఖండములను విస్తరమగు విషయములతో పెక్కు గ్రంథములు వ్రాయబడియున్నవి.

పై వాదఖండ, మంత్రఖండ, రసాయన ఖండమునందలి విషయము లిక్కాలపు వారికి నతిశయోక్తులుగ దోచుచున్నను, ప్రకృతము మనము వినెడి చూచెడి విషయములలోనగు ఫాల్స్ డైమండ్సు, జర్మన్ సిల్వర్, కన్నడియన్ గోల్డ్, ఆకాశయానము మొదలగునవి జ్ఞప్తికి దెచ్చుకొనిన వాని నతిశయోక్తులని యూహింపజాలరని తలచెదను.

మిగత రసఖండ చికిత్సా ఖండము విషయమై సర్వజన సామాన్యముగ నిర్వివాదాంశమె ఈ రసశాస్త్ర వి యములను గురించి డాక్టర్ పి సి రాయ్‌గారు వ్రాసిన హిందూ కెమిస్ట్రీ, యను పుస్తకమును చూచిన చక్కగ విశదముగాగలదు

## కాయచికిత్సయొక్క యౌన్నత్యము, క్షీణ్యము

ఆర్యులు చిరకాలమునకు పూర్వమె, చికిత్సా శాస్త్రమున మిగుల ఖ్యాతిగాంచిరనియు, అనాశ్రితోత్పత్తిగలవారనియు పాశ్చాత్య విద్వద్వైద్య ప్రకాండు లనేకులు ఒప్పుకొనిన యభిప్రాయములలో గొన్నిటిని సూచించెదను లండన్ కింగ్సు కాలేజితో నుండు ఎం డి యస్ ఆర్ అండ్ యల్ యస్ ఉపపదధారులగు ఓ యఫ్ రోవెదొరవారను నోషధి తత్వశాస్త్ర పండితు లిట్లు సెలవిచ్చిరి "ఇప్పటి వైద్యశాస్త్ర శాఖలుగానున్న యనేక విషయములను గురించి హిందువు లాదికాలమందునే యనేక విధములగుచికిత్సలను ప్రయోగములతో గనిపెట్టిరని గూడ జూపజాలిన హిందువులనైపుణ్యము వారిశాస్త్రముయొక్క ప్రాచీనతయు, అనాశ్రితోత్పత్తియు దెలుపుచున్నవని నా యభిప్రాయము" మరియు ప్రొఫెసర్, హొరెస్ హెమాన్, విల్సన్, సర్ హంటర్ విలియం, కర్నల్ క్లార్కు ఐ యం యస్ సర్జన్ జనరల్ కలకత్తా, కర్నల్ కింగ్ ఐ యం. యస్ సర్జన్ జనరల్ బర్మా మొదలగు పాశ్చాత్య వైద్య పుంగవులు కూడ స్తుతించుటకు నవకాశమును బొందిన యాయుర్వేద చికిత్సాశాస్త్రము ఇతర శిల్ప శాస్త్రములవలెనే యనేక కారణములచేత క్రమ క్రమముగ క్షీణించుచు వచ్చెను

అట్లు క్రమ క్రమముగ క్షీణించుచు వచ్చినను చికిత్సా శాస్త్రమనునది యితర తర్క వ్యాకరణాది శాస్త్రములవలెగాక ప్రాణి సామాన్యమునకును నాధారభూతమగు శరీర సంరక్షణ కత్యావశ్యక మైనదగుటచేత లుప్తదశను బొందుచున్నదైనను ఆర్యవిద్యల యందు ప్రేమంగల కొందరగు దేశీయులచేతను నా యా కాలవములయందలి ప్రభువరుల చేతను నా యాకాలమున కొంత కొంత గ్రంథ రచనలోడ గాపాడుటచేత నిక్కాలము నకు నిట్టి హీనస్థితితోనైనను చూచుట కవకాశమైనది

## ఆయుర్వేదోజ్జీవనము

ఈరీతి క్షీణదశనొందుచున్న యాయుర్వేద చికిత్సా శాస్త్రము శ్రీ మన్మహారాజ శ్రీ శ్రీ శ్రీ విక్టోరియా చక్రవర్తినిగారియొక్క రాజ్యారంభ కాలమునుండి శ్రీ రాజ్ఞిగారి రాజ్య తంత్రాది ప్రజ్ఞలచేతను నా యా దేశములయందు సంస్కృత విద్యలభివృద్ధి చేయుటచేతను నాయుర్వేద చికిత్సల కాటపట్టై విలసిల్లుచుండెడు కలకత్తానగర వాస్తవ్యులగు నాయుర్వేద శిరోమణులని విఖ్యాతిచెందిన శ్రీ శ్రీ శివరత్నకుటమూలమణి కవిరాజ ద్వారకానాథసెన్ కవిరత్నము, ఆయుర్వేద విశారద కవిరాజ విజయరత్నసేన్ కవిరంజనలవంటి మహనీయులకు మహామహోపాధ్యాయులను రాజకీయగౌరవబిరుదము లొసగుటచేతను తిరిగి నాయుర్వేద మంకురితమై నలుదిశల నల్లుకొనుట కవకాశమైనది బెంగాల్, హిందూస్థాని, మహారాష్ట్ర, ఆంధ్ర, కర్ణాట, ద్రావిడాది దేశభాషలలో నాయుర్వేదీయ గ్రంథములగు చరక సుశ్రుతాదులు భాషాంతరీకరింపఁబడుటయేగాక నాంగ్లేయభాషయందుకూడ భాషాంతరీకరింపబడి పెక్కు గ్రంథములు ముద్రితములై యున్నవి

చిరకాలమునకు పూర్వము అనగా ఎ డి 400 న అరబ్బువారు సుశ్రుతమను విఖ్యాత వైద్యశాస్త్రమును వారి యరబ్బి బాషయందు మున్ముందు పరివర్తనము చేసిరనియు దానినుండి గ్రీకు దేశీయులు వారి స్వభాషకు మార్చుకొనిరనియు మనలకు జరిత్రలవల్ల దెలియుచున్నటులె ఇక్కాలపు శాస్త్రాభిమానులగు మహనీయులు నాయుర్వేదీయ గ్రంథములను వారి వారి స్వభాషలలో మార్చుకొనుటచేత కేవల భరతఖండ వాసులకేగాక ఇంగ్లాండు మొదలగు దేశీయులు కూడ దెలుసుకొనుటకు అవకాశమైనది

## కలకత్తా రాజ్యమున నాయుర్వేదాభివృద్ధి

ఈవిధముగ నభివృద్ధికి వచ్చుచున్న నాయుర్వేదీయ చికిత్సలను బంగాళాదేశమునందు గత సంవత్సరమున గీర్తిశేషులైన యాయుర్వేద నిధియనంబరగు మహామహోపాధ్యాయ కవిరాజ ద్వారకానాథ సేన్ కవిరత్నమువారి సాక్షాద్గురువర్యులును సర్వ తంత్ర స్వతంత్రులును చరక చతురాననులని ఖ్యాతిగాంచిన శ్రీ గంగాధర కవిరాజులవారు వంగదేశమున నవతరించి చరక సుశ్రుతాది గ్రంథములకు చక్కని వ్యాఖ్యానములు రచించి దేశమునకు మహోపకారమును చేసినదేగాక శాస్త్ర సామాన్యమున వారికింగల యసమాన పాండిత్యముచేత తర్క వ్యాకరణసాంఖ్య ధర్మశాస్త్రాదులకు కూడ వ్యాఖ్యానముల రచించి శాస్త్ర సామాన్యమును శిష్యులకు బోధించినదెగాక అభిమానశాస్త్రమగు నాయుర్వేద శాస్త్రము నిక్కాలపు ఆయుర్వేద మహోపదేశములకు ఖ్యాతిగాంచిన పై మహామహోపాధ్యాయులవార్లకును రాజేంద్రకవిరాజ్ మొదలగువార్లకును లక్ష్యలక్షణములు బోధించుటచేతను వారి శిష్య పరంపరలనుండి బంగాళా దేశమందును నా ప్రాంత్యదేశములయందును నాయుర్వేదము వ్యాపించుట కవకాశము గలిగి యున్నతస్థితికి వచ్చుచున్నయది

## బొంబాయి రాజ్యమున నాయుర్వేదాభివృద్ధి

బొంబాయియందు గడచిన 13 సంవత్సరములుగ భారత భూషణ ఆనరెబిల్ డాక్టర్ సర్ బాలచంద్ర కె టి యల్ యం జే పి డాక్టర్ దేశముఖ్ యం డి డాక్టర్ పోపట్ రాం యల్ యం యస్ జే పి మొదలగువారలచే నొక యాయుర్వేద విద్యాలయమ్ము స్థాపింపబడి యందు లక్ష్య లక్షణ పురస్సరముగ నాయుర్వేదమును బోధించుటకు తోడుగ పాశ్చాత్య చికిత్సలయందలి యనాటమీ లోనగు భాగములను కూడ జేర్చి బోధించుటవలన నాయుర్వేద ప్రచారము బొంబాయియందును నా ప్రాంత్యములయందును వ్యాపించుచున్నది

మరియు పై యాయుర్వేద విద్యాలయమున నుత్తమ పరీక్షయం దుత్తీర్ణులైనవారితో కొందరగు స్వదేశ సోదరీమణులు కూడ నుండుటచే నాయుర్వేద ప్రచార మధికముగ నున్నదని వేరు చెప్పనక్కరలేదు

మరియు నీ యాయుర్వేదమును నింక నెక్కుడుగ వ్యాపింపచేయవలెనని బద్ధకంకణులైన డాక్టర్ సర్ బాలచంద్ర కే టి గార్ల ఆయుర్వేద మహోపాధ్యాయ శంకర దాజి శాస్త్రీపదెగార్లయొక్కయు, ప్రోత్సాహబలముచేతను బొంబాయి నగర సమీవమందు గోదావరీ మహానదికి జన్మస్థానమనదగిన పంచవటీ క్షేత్రమను ప్రసిద్ధిచెందిన నాసికపురమునందు శ్రీ శ్రీ శ్రీ దర్భాంగ సంస్థానాదీశులగు హానరెబిల్ రామేశ్వరసింగ్ మహారాజులవారి పరిపోషణ మనుసరించిన శ్రీ సయాజీ యాయుర్వేద విద్యాపీఠమను నొక మహాసభను స్థాపించి ఈ సభాముఖమున నా యా ప్రాంత్యముల కల యాయుర్వేద వైద్యులకును, వైద్యములకును మిగుల ప్రోత్సాహము చేయుటచే నాయుర్వేద చికిత్సలు శాస్త్రము కూడ బొంబాయియందును మధ్యరాష్ట్రమందును శాఖోపశాఖలతో నల్లుకొనుట కవకాశమైనది

## చెన్నరాజధానియందలి యాయుర్వేదాభివృద్ధి

చెన్నపురియందు శ్రీ కన్యకాపరమేశ్వరీసభాసదులు 12 సంవత్సరములకు పూర్వమాయుర్వేద వైద్యశాలను 7 సంవత్సరములకు పూర్వ మాయుర్వేదకాలేజిని స్థాపించి తద్వారా రోగార్తులకు రోగపరిహారమును చేయుచుండుటయేగాక పంజాబ్, బెంగాల్, హైదరాబాద్, మైసూర్, తంజావూర్ మొదలగు దూరదేశములనుండి వచ్చి విద్యాభ్యాసముచేయు విద్యార్థులకు విద్యార్థివేతనము లొసగి యాయుర్వేద మును లక్ష్య లక్షణ పూర్వకముగ బోధించుటకుతోడు డాక్టర్ శృంగారవేలుమొదల్యార్, యమ్ ఆర్ సి పి అండ్ యస్ గార్లయొక్కయు, డాక్టర్ యన్ వెంకటసామినాయుడుగారు, యం బి సి యం గార్లయొక్కయు సాహాయముచేత నాంగ్లేయ చికిత్సయందలి యనాటమీ, ఫిజియాలజీ, మిడ్వైఫరి, మెటరియా మెడిక, హైజిన్, కెమిస్ట్రి, ఫిజిక్సులలోటి కూడ నాయుర్వేద విద్యాదానము చేయించుటచేతను, ఆనరబిల్ జస్టిస్ వి కృష్ణసామయ్యార్ బి ఎ బి ఎల్ గార్ల చెన్నపురిలో శాఖాసాలలుగు మైలాపూరునందు నాయుర్వేద వైద్యశాల పాఠశాలలను స్థాపించి, చికిత్సా దాన వైద్య దానములు చేయుటచేతను, చెన్నరాజధానియందు నాయుర్వేదము వ్యాపించి నలుదిశల నల్లుకొనుచున్నది

## కేరళ దేశమున నాయుర్వేదాభివృద్ధి

మలయాళ దేశమందలి అనంతశయనము కొచ్చి కొళిగోడు మొదలగు సంస్థానాస్థాన వైద్యవరులచేతను, నా యా సంస్థానాధీశులచేతను నెనిమిది వత్సరములకు పూర్వము "ఆర్యవైద్య సమాజము" అను నొక వైద్యసభను స్థాపించి దానినుండి విద్యాభ్యాసము చేయువార్లకు సాహాయ్యాదులచే విద్యాదానము చేయుచు సంవత్సరమున కొకతూరి నా ప్రాంత్యపత్తనములో నొక పత్తనమున నా వైద్య సామాజికులు చేరి ఉత్తీర్ణులగు విద్యార్థుల కుత్సాహజనకమగు బహుమానముల నిచ్చుచు వైద్యవరులకు సమిత సంతోషమగునట్లు ననేక విషయములను చర్చించుచు నార్య వైద్యము నభివృద్ధి జేయుచున్నారనుటచేత మలయాళదేశమందుగూడ నాయుర్వేద మభివృద్ధి యగుచున్నది

## కర్ణాటక దేశమున నాయుర్వేదాభివృద్ధి

దక్షిణాపథమందలి యార్య విద్యలకెల్ల ముఖ్యస్థానమని ఖ్యాతికెక్కిన కర్ణాట రాష్ట్రమునకు రాజధానియైన మహీసూరు నగరమున శ్రీ శ్రీ కృష్ణరాజ ఒడయార్ బహద్దూర్ జి సి ఎస్ ఐ మహారాజులుంగారిచేత నిర్వంలో నన్ని శాస్త్రములను నుద్ధరింప నుద్దేశించి మహ పాఠశాలను స్థాపించి శాస్త్ర సామాన్యముల నభివృద్ధికి తెచ్చినటులె యాయుర్వేదమును కూడ నభివృద్ధి చేసినదె గాక ప్రకృతము తత్పోభ్యధికముగ నభివృద్ధి జేయదలచి యందుకై యొక యాయుర్వేద కాలేజిని గత సంవత్సరమున స్థాపించి యందు విద్యార్థులకును నాయుర్వేద విద్యాభ్యాసముతోపాటు అనాటమీ, ఫిజియాలజీ వగైరా ఆంగ్లేయ చికిత్సా భాగముల బోధించి యందుత్తీర్ణులైనవారి ద్వారా వారి రాష్ట్రమునందలి కుగ్రామ సామాన్యమున కూడ నాయుర్వేద చికిత్సా ప్రచారమునం జేయ బద్ధకంకణులైన శ్రీ మహారాజులవారియెడల మనమందరము కృతజ్ఞతగలవారలమై యుండవలెను ఆయుర్వేద ప్రచారమునకు మార్గదాయకులైన శ్రీ మన్మహీసూరు మహారాజులంగారివలెనే యా యా సంస్థానాధిపతులు గూడ వారి వారి రాజ్యమున నాయుర్వేద కళాశాల వైద్యశాలలు స్థాపించి ప్రచారము చేసినచో నాయుర్వేద మతిశీఘ్రములో సర్వత్ర వ్యాపించుననుట కావంతయైనను సందేహము గలదా

## సర్వత్రాయుర్వేదాభివృద్ధి

మరియు బరోడా జయపూర్ గ్వాలియర్ ఉదయపూర్ కాశ్మీర్ మొదలగు రాజ్యములయందు ఆ యా సంస్థానాధిపతులచేత సంస్కృత విద్యలన్నియు నభివృద్ధి చేయబడుచున్నటులే ఈ యాయుర్వేదశాస్త్రము మాత్రము విద్యార్థులకు బోధపరిపింపబడుచు కేవలము శాస్త్రమును మాత్ర మభివృద్ధి చేయింపబడుచుండునటుల దెలియవచ్చుచున్నది ఐనను బరోడా మొదలగు రాజ్యాధిపతులు లక్ష్య లక్షణ ప్రధానమగు నీ చికిత్సా శాస్త్రమును లక్ష్యమును బోధింపకపోవుట కడుశోచనీయము

## అధికముగ నశించిన యాయుర్వేదాంశములు

చికిత్సాశాస్త్రము కేవల పఠనమాత్రము చేతను కేవలాభ్యాసము మాత్రము చేతనుకూడ, ప్రయోజనము లేనిదగుటంజేసియు కేవల ఔషధైకసాధ్య చికిత్సలుమాత్రము కొంతవరకు లక్ష్య లక్షణములగు పరంపరలు గానవచ్చుచున్నవి కేవల శస్త్రసాధ్య చికిత్సలకు మాత్రము లక్షణము కొంత దెలియుచున్నను నభ్యాసభాగము కేవల సుశ్రుత గ్రంథమందలి చరిత్ర మాత్రావశిష్ట మై యున్నది మరియు, ప్రత్యేక స్వతంత్ర చికిత్సలని ప్రసిద్ధిజెందిన, కన్నులు, చెవులు, ముక్కు, గొంతు మొదలగు, శాలాక్య చికిత్సలలో లక్షణ జ్ఞానము కొంతయుండినను నభ్యాస పరంపర సుప్రసిద్ధుండగు విదేహ మహారాజుగారి లోడనే గతించినట్లుండుటచేతను స్వప్నావస్థయందుకూడ మన వారికి నేత్రాదిశాలాక్య తంత్ర చికిత్సలు ప్రత్యేక చికిత్సలని గోచరము గాకుండుట యాశ్చర్యము గాదు

మరియు ప్రసవ శాస్త్ర శారీర శాస్త్ర విష శాస్త్రాదు లన్ననో యాయుర్వేదము మున విపులముగనున్నను నయ్యవి ఇక్కాలపు వైద్యబ్రువుల కాకాశ మీమాంసగా దాచు చున్నయవి

ఓషధి తత్వశాస్త్రము గుణపాఠములన్ననో ఆటవిడుపు పద్యములబోలి వల్లించు టలో పర్యవసానమగుచున్నవి

రసశాస్త్రమునందలి ఐదు ఖండములలో చేరిన ఖనిజ పదార్థములు వాని శోధన మారణాదులలో కొంతజ్ఞానమున్నను యంత్రాది నిర్మాణములు వానినుండి రసశోధ నాదులు, రసాయన నిష్కఘుటికా నిర్మాణము, వాదఖండమందలి రత్నాది నిర్మాణము మొదలగు ప్రక్రియలు కైవారములను జూపెడు భట్రాజుల వాక్యావళులకన్నను నీచ స్థితిలోనున్నయవి

## ఆ యు ర్వే ద మ హి మ

చిరకాలమునకు పూర్వము లక్ష్యలక్షణములతో ప్రఖ్యాతినిగాంచిన చికిత్సాశాస్త్ర ము ప్రకృతము పెక్కు విషయములయందు మనవారికింగల జ్ఞానము లుప్తముగా నున్నను, కేవల మౌషధ సాధ్యవ్యాధులలోగూడ యత్కించిత్ జ్ఞానముగల చికిత్సకు లనువారిచే నుపయోగించెడు సామాన్యపు మందులు క్రూరములగు వ్యాధులను నివర్తి చేయుటలో నద్వితీయములని సుప్రసిద్ధ పాశ్చాత్య వైద్యవరులచేగూడ గొనియాడబడు చుండ నాయుర్వేదము యొక్కయు యందలి చికిత్సాతిశయములయొక్కయు మహిమను వర్ణింపజాలను ఈ రీతి చికిత్సాబ్రువులచేత నుపయోగింపబడు మందులయందలి యోష ధులకే ఇట్టి గౌరవమున్న నార్య వైద్యమును సాకల్యముగ లక్ష్య లక్షణములతోడ నభ్య సించినచో నూటి కొక వ్యాధియైనను విఫలము నొందదని యూహించుట యబ్బు రమా

## ఆయుర్వేదము నభివృద్ధి చేయుమార్గములు

చిరకాలమునకు పూర్వము మిక్కలి ఖ్యాతిగాంచిన శస్త్ర చికిత్స ప్రసవ చికిత్స మొదలగు చికిత్సలను తిరుగ వృద్ధిచేయవలెనన్నచో పరస్పర మాత్సర్యములు విడనాడి పాశ్చాత్యులవలెనే గురుముఖమున లక్ష్య లక్షణములుగ ఆయుర్వేద చికిత్సల నభ్య సించి మనలకు కేవల మభ్యాస భాగములో లుప్తమై గగన కుసుములంబోలియున్న శస్త్రాది చికిత్సల నన్నిటిని ప్రకృత మాయా ప్రత్యేక చికిత్సలయందు లక్ష్య లక్షణము లచే ప్రసిద్ధి జెందిన పాశ్చాత్య వైద్యపుంగవుల సాహాయ్యముచే నభ్యసించిన నాయు ర్వేద శస్త్రాది చికిత్సా భాగములన్నియు నచిరకాలములోపలనే మహోన్నతికి దేగల మనుటకు సందేహములేదు

ఇట్లు పాశ్చాత్య చికిత్సకుల సాహాయ్యముచే నభ్యసించి అంతటితో తృప్తింజెందక ప్రతి క్షణకాలమున నాంగ్లేయ వైద్యవరులు నవీన నవీన విషయముల నెట్లు ఊహ లచే గనుగొని లక్ష్య లక్షణములతో సిద్ధాంతపరచుచుందురో యటులె "ఆచార్య స్సర్వ చేష్టాసు లోక ఏవహి ధీమతః" అను షుక్రాచార్యోక్తిని స్మరించుచు మహాజనుల పద్ధ తుల నవలంబించి నవ నవ విషయములయందు బుద్ధిని ప్రవేశింపంజేసి క్షణకాలమును కూడ వృథా వ్యయము చేయక విద్యార్జనయం దాసక్తులుగానుండుట ముఖ్యకర్తవ్యమైన దిగా నెంచుకొని ప్రత్యహము దాముజేయు నభ్యాస సంపత్తిచేత సంపాదించిన క్రొత్త క్రొత్త విషయములను ప్రచార పత్రికల మూలమున ప్రచురపరచి పలుదేశములయందలి పండితుల చర్చ కవకాశముం గలుగంజేసి సిద్ధాంతములను గ్రంథరూపముగ నేర్పరచు టయు విద్యార్థులకు పాఠ్య ప్రవచనములచే వెల్లడి పరచుటయు నత్యావశ్యకముగ జేయు టచే నాయుర్వేదము తిరిగి మహోపదకిని రాగలదని నొక్కిచెప్పగలను

## ఆయుర్వేదాభిమానులకు విజ్ఞాపనము

ఓ భారతీయులారా, యార్యసంతతివార్లమైన మనము మన దేశ కాల, ఆచార, ప్రకృతి, మొదలగువానికి కొంచమైనను విరోధము లేకుండ మనదేశముయొక్క శీతోష్ణ స్థితుల ననుసరించి నిరామయుడగు భగవంతుని నిర్హేతుక జాయమానకటాక్షముచేత సృజించిన ధర్మార్థకామ మోక్షములనెడు చతుర్విధ పురుషార్థములకు సాధనభూతమైన నీ స్థూలభూతమున కనుకూలమగు శస్త్రాది చికిత్సాంగములతో రాజిల్లెడు నాయుర్వే దము నభివృద్ధిజేయుటలో తగు సర్వ ప్రయత్నములుగలవారలై యా యా పట్టణముల యందు నాయుర్వేదాభివృద్ధికై స్థాపించియున్న యార్యవైద్యశాల కలాశాలల నభివృద్ధి కిం దెచ్చుచు లేనిచోట్ల వైద్యశాల కలాశాలలను స్థాపించుచు శిథిలములగు నాయుర్వే దీయ గ్రంథములను ముద్రించుచు సాధ్యమగునంతవరకు నా యా దేశ భాషలలో సులభ శైలిని గ్రంథముల రచించి ప్రచారము జేయుచు మన సోదరీ సోదరులకు నీ యాయు ర్వేదముం గరపి మన యావజ్జీవితకాలము దృఢగాత్రులమై యాయురారోగ్యముతో నుండు నటు లాశీర్వదించుచుండెడి యా పరాత్పరునియందు కృతజ్ఞతగలవారలమై యుండవలెనని సకల సహృదయ విధేయుడనై విన్నవించుచున్నాడను.



కొటికలపూడి సీతమ్మగారు



శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారు :—ఈమె ఆంధ్రమున సలక్షణ మృదుమధుర కవిత్వమును జెప్పనేర్చిన వనితామణి. ఈమె కాపుర స్థలము రాజమహేంద్రవరము.

తిరుపతి వేంకటేశ్వర కవులు:— వీ రిరువురును శతఘంటా కవులు వీరియాశుకవితా నైపుణ్యము మహోద్భుతమైనది. వీ రనేక గ్రంథమునకు గర్తలు సామాన్యజనులును, గొప్ప సంస్థానాధిపతులును వీరి శక్తిసామర్థ్యములకు మెచ్చి యనేక బహుమతు లొసంగియున్నారు. వీరు మంచి యోగ్యతగలవారు. సంస్కృతమునను, నాంధ్రమునను సమానప్రజ్ఞ వీరికి కలదు.

[ఈ ఛాయా చిత్రాలు 1911 విరోధికృత్ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి. సం.]



తిరుపతి వేంకటేశ్వర కవులు

# చమత్కార చంద్రిక

### మ. రా. రా. శ్రీ మంగిపూడి వేంకటశర్మగారి విరచితము

### [1911 విరోధికృత్ సంవత్సరాదిసంచికనుండి]

ఆ. వె. కుతిక నలుపుగాని శితికంఠుఁడా గాఁడు
పాము గాదు నెమలిపక్షి గాదు
గంతులిడుచు నడుచుఁ గా ని కప్పయుఁ గాదు
దీనిభావ మేమి? తెలుపరయ్య!

గీ. వెలయు వర్ణత్రయంబున వృక్ష మొకటి
మొదటి వర్ణద్వయంబునఁ బొదలు గజము
అమరు జంబీర మంత్యద్వయంబు వలన
వృక్ష మేదియొ ? తెల్పుడీ ! విబుధులార !

ఆ. వె. కనులు మూఁడు గల్గి యెప్పుడుఁ గ్రతుభుజుండును గాఁడు
వాలముండుఁ గాని పాము గాదు
తీర్థసేవ సేయు దేవభక్తుఁడు గాఁడు
దీని భావమేమి తెలుపరయ్య!

తే. గీ. పక్షివర్యుండు పరగుఁ బంచాక్షరముల
వాని తలఁదీయఁ క్షుద్రదేవత జనించు
వాని తలఁదీయఁ దక్కెడ జాను మీరు
వాని ప్రథమాక్షరముఁ దీయఁ దనరు నృపతి.

ఉత్తరములు:— . ఊరపిచ్చుక. . దానిమ్మ. . చేప . కపోతరాజు.

# హ రి క థ

. మ. రా. శ్రీ అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారిచే వ్రాయఁబడినది

**[1911 విరోధికృత్ సంవత్సరాదిసంచికనుండి]**

ఆస్తిక్యమును ధర్మాధర్మములును సర్వజన మనోరంజనముగ నృత్య గీతవాద్యములతో నుపన్యసించుట హరికథ యనఁబరగు అట్టియౌపన్యాసికుఁడు కథకుఁడనఁబడును దైవభక్తియు సత్యము భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు దేవుని గొల్చి తరించిన ప్రహ్లాదాది పరమ భాగవతుల చరిత్రములును సావిత్రీ ప్రముఖ పతివ్రతా చారిత్రములును హరిశ్చంద్రాది వీర చరితములును దెల్పినచో మంచి యభివృద్ధి యగునని వాల్మీకి వేదవ్యాసుఁడు మొదలగు మహర్షులు కావ్య పురాణేతిహాసంబులఁ బన్నిరి నారదుఁడు దొట్టి పరమ మునులు భగవన్నామ సంకీర్తనము సేయుచు నాడుచు బాడుచు లోకులం దరింపఁజేసిరి

శ్లో. వీణావాదన తత్వజ్ఞః శ్రుతి జాతి విశారదః,
తాలజ్ఞ శ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి.

అను యాజ్ఞవల్క్య స్మృతివచనానుసారముగ యోగముచేతను సంగీతము చేతను దక్క వేరు మార్గమున మోక్షము సాధింపరాదనియు యోగముకన్న నిరపాయమగు సంగీతావలంబనముచేత,

శ్లో. గాయం శ్చరిత్రాణి రథాంగపాణేః
నృత్య న్నిరస్తాఖిల కర్మబంధః,
నిరంకుశ స్సర్వసమో విరాగీ
కైవల్య మభ్యేతి ముకుందభక్తః.

అను నారద స్మృతి ప్రకారము సర్వ వస్తువులయందు వాసుదేవభావనచే మనోవాక్కాయ కర్మములచే దేవుని భజించుచు సర్వజనులకు దైవభక్తిని బోధింపఁదగు మోక్షసాధనము సంగీతముకన్న వేరులేదని రూఢిగ దెలిసిన పురందర విఠ్ఠలాది వాగ్గేయకారు లి క్కలియుగమున గీత ప్రబంధములు విరచించి యాడుచు బాడుచుం బరులఁ దరింపచేసి తాము తరించిరి.

శ్లో. తస్య గీతస్య మాహాత్మ్యం కే ప్రశంసితు మీశతే,
ధర్మార్థ కామమోక్షాణా మిద మేవైకసాధనమ్,

అను శాస్త్రముంబట్టి వాగ్గేయకార సత్తముఁడగు వాల్మీక మహర్షి శ్రీ మద్రామాయణ మను గీత ప్రబంధ మొనరించి కుశలవులచే జగదాహ్లాదకరంబుగఁ త్రేతాయుగంబునఁ బాడించెను. భరతముని ప్రముఖుల నాడికాలమున "శివస్తుతౌ ప్రయోజ్యాని మోక్షాయ విదధే విధిః" అని బ్రహ్మ రచితములగు మద్రకాది గీతములను శివసన్నిధిం బాడిరి కలియుగమునందు ప్రాచీనులలో సుప్రసిద్ధులగు వాగ్గేయకారులు జయదేవుఁడు గీతగోవిందమును, నారాయణతీర్థులు శ్రీ కృష్ణ లీలా తరంగములును, దీక్షితులు కృతులును విరచించిరి ఆంధ్ర భాషయందు గూడ క్షేత్రయుఁడు, రామదాసు, త్యాగరాజు, సుబ్రహ్మణ్యకవి, గోగులపాటి కూర్మన్న మొదలగు మహానుభావు లుభయ తారకముగ గీత బంధముల గావించి ప్రఖ్యాతి వడిసిరి కొద్దికాలమునుండి మహారాష్ట్రము మొదలగు పెక్కు దేశంబులలో సంగీత సాహిత్య విశారదులు కొందరు జీవనార్థమై కథకవృత్తి నవలంబించి హరిభక్త వేషంబుల ధరించి దైవభక్తిని ధర్మాధర్మములను జనులకు బోధించుచు పౌరాణికులు కథకులు భాగవతులు దాసులు మొదలగు సంజ్ఞలం బరగుచున్నారు

శ్లో. విష్ణుభక్తా ఏవ విప్రా నానావేదవిదా అపి,

యను స్మృతివాక్యము చొప్పున సూతాది కథకులం దలంచి బ్రాహ్మణేతరులు గూడ కథకులై యుచిత సత్కారములు వడయుచున్నారు. హరికథా శ్రవణమువలన శ్రోతలకు నిఖిల శ్రేయోభివృద్ధియగును. కథకులకు గూడ ధర్మార్థ కామ మోక్షములు లభించును శ్రుతి స్మృతి విజ్ఞానము, శబ్దాను శాసనజ్ఞత, అభిధాన ప్రవీణత, ఛన్దః ప్రభేద వేదిత్వము, అలంకార కౌశలము, రసభావ పరిజ్ఞానము, దేశస్థితిచాతురి, నానాభాషా వైశద్యము, సర్వకాకు విశారదత్వము, కలాశాస్త్ర నైపుణి, తూర్యత్రితయ చాతుర్యము, హృద్య శారీర శాలిత, లయతాల కలాజ్ఞానము, ప్రభూత, ప్రతిభోద్భూతభాక్త్వము, సుభగ గేయత, దేశీరాగాభిజ్ఞత్వము, వాక్పటుత్వము, సభా విజయ సామర్థ్యము, రాగద్వేష పరిత్యాగము, ఉచితజ్ఞత, స్వార్థ త్యాగము, అనుచ్ఛిష్టోక్తి నిర్బంధము, నూత్న ధాతు వినిర్మాణదక్షత, పరచిత్త పరిజ్ఞానము, ప్రబంధ ప్రగల్భత, ద్రుతగీత విరచనా నైపుణి, పద్యాంతర విదగ్ధత, త్రిస్థాన గమనప్రౌఢి, వివిధాలప్తి నిపుణత, విశేషావధానశక్తి, రమ్యరూపము, స్వేచ్ఛా సంచారము, స్వతంత్ర జీవనమును, వాగ్గేయకారుఁడగు మత్తమ కథకుని లక్షణములు

సీ. ఘనశంఖమో యన గంఠంబు పూరించి మేలుగ శ్రుతిలోన మేళగించి
నియమము తప్పక నయఘనంబుల బెక్కు రాగ భేదంబుల రక్తిగొల్పి
బంతు లెగిర్చిన పగిది కాలజ్ఞతన్ జాతి మూర్ఛన లొప్ప స్వరము పాడి
చక్కని నృత్యము సర్వ రసానుకూలంబుగాగ నభినయంబు చేసి
స్వకృత మృదు యక్షగాన ప్రబంధసరణి
వివిధ దేశంబులం బిన్న పెద్దలుగల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమానమేల.

# ఆంధ్రుల కొక విన్నపము

### మ. రా. శ్రీ తాపీ ధర్మారావు బి. ఏ. గారిచే వ్రాయఁబడినది

### [1911 విరోధికృత్ సంవత్సరాదిసంచికనుండి]

లోకంబునఁ బ్రాకటదశం బొంది విఱ్ఱవీగుచున్న భాషావమితింజూచి మన యాంధ్రంబునందుఁగానమి, నమిత విషాదమునుఁబొంది, పొందికగా నమర్చు శక్తి లేకుండుటం జేసి చేయునదిలేక శోకంబు ద్విగుణీకృతంబుగా నెంత వంత నందుచువార లనేకులుంట మీ రెఱుంగనిదియా? అట్టివారల కిప్పు డటనట కానుపించు భాషోద్ధరణోద్యమంబులం గాంచినంత దిగ్విజయంబుఁ జేసినట్లు సంతోషం బుప్పొంగు గదా మనభాష—కాదుకాదు—యింక నెక్కడిభాష భా, యనినంత నభిమాని నయనంబులనుండి బాష్పధారలు వెల్లిగురియుచుండ, నాంధ్రు లే పదమునకుఁ బదమితికి నాల్గుమాటలు వల్కనుద్యమించి, చేతగాక దేహీ యని యితర భాషల యాచించుచుండ నిదియొక భాషయా? ఇదియే బాస యని మనవారు వేయు వేసంబులు వాసిగాంచునా? హా! ఆంధ్ర భాషామతల్లీ, నీ కెట్టి ప్రాప్తివచ్చినది ఇది నీ యుపయోగానర్హతా, యాంధ్రుల దౌర్భాగ్యమా, లేక మా సోమరితనమా? లేకున్న నాంధ్ర భాషావసకుతూహల మానసులారా, తొల్దొల్త నే భాషాగీతంబు లంగనామణులు వాడ నుయ్యాలల నత్యంత సుఖంబున శయనించివారమో, పిదప నే భాష మన తల్లి దండ్రులు బుడుతా, నాయనా యని మన మనంబులుప్పొంగ బిలిచినారలో, ఇంకను నే భాష ననందర్భంబులగు రెండు పదంబులు దడబడనుడివి జనకుల కాహ్లాదంబును మనకు మోదకలాభంబును జేయజాలితిమో యే భాష మృదుత్వంబునకు రెండవ ఇటాలియనని వన్నెకెక్కెనో యట్టి మనయాంధ్రబు ప్రహేయస్థితి నుంట యేమి? అక్కటా కృష్ణా గోదావరీ పుణ్యనదీ జలాసిక్త వసుంధరాభాగవినిర్భిన్నంబై నన్నయ తిక్కనాది విజ్ఞాన ప్రవీణులచే సానపెట్టఁబడి, యల్లసాని పెద్దమాత్యునిచే మెరుంగునంది, మ్లేచ్ఛకులాటవీ దహనదక్షుండగు కృష్ణరాయల యుష్ణీషంబున నగ్రస్థానబున వెలింగెడి యాంధ్రభాషారత్నంబు మన చేతులంబడి చమురెక్కి, మేటుల మని క్రింది మీదుసఁగానక త్రుళ్ళిపడెడు నితర భాషా కల్పితరత్నంబులకు నోటువడియుంటం గాంచినందులకు విచారమందని వారుందురా? ఎంత జింతించిన నేమి? ఆంధ్రంబున మాటలాడఁ దొడగినంతఁ దొట్రుపా టొదవుటయు, నాల్కయాడకుంటయు, హుమ్మనిపూని నోర్దెఱచినంత నీరెలుంగుపడుటయు, నాలుగు పుట్లకు జెమ్మటలుగ్రక్కి దేహమంతయుఁ దొల్లింటి పటుత్వమువీడి వడవడ వడంకుటయు, భయమ్మున జరణంబులు వీరంబుగతి నుండుటయు, లోనుగాగల మరణ చిహ్నంబులు గానరా, హా! ణ భాషా రసాయనంబునకు గరంబు లొగ్గుటఁ జూచినంత మనభాష ప్రహేయస్థితి నున్నది యన నోపదా? సంస్కృతంబునకు ముద్దు చెల్లెలనఁదగియున్న యాంధ్రంబునకుఁ దెంపరినై కనుగానక ప్రహేయంబను నభిధేయంబ నొసంగిన నన్ను క్షమింప వేడికో లవసరంబగునా కాదుకాదు—నిక్కంబుగ నది ప్రహేయమే ధీచాతురినెట్టి యూహాలు మనోగతంబులుగనున్నను వాని వెలిగ్రక్క గ్రుక్కిళ్లు మ్రింగుట హీనముగాదో, మన పూర్వులుఁ ద్రొక్కినదారినే పాడినపాటఁ బాడెడి బానిసవృత్తి దీనత్వంబుఁ దోఁపదో, ఇతర భాషలనున్న యుద్గ్రంథంబులలోని చమత్కారోహలంగాంచి మనలేమికిఁ గుందుట దిక్కుమాలినతనంబుగాదో, మన గ్రంధంబులలోని రసంబ నెల్లరకు నెరుక సేయఁదగు దగువిమర్శకులు గలుగమి గ్రంధంబు లొకమూల ధూళిధూసరితంబులయి యుంట గాంచినంత వచ్చు దుఃఖ పరంపరలు ప్రహేయస్థితిం దెలుపవో, మాతృ భాషేతరంబగు హూణంబున బెక్కు చరణంబు లొక్క మొగిఁ గంఠగతంబులుగ నుండ, బొట్టజీర్చినను తెలుగు పదంబులు గానరాని యాంధ్ర బి ఏ లను జూచినంత దమంతఁ దాము వచ్చు నిశ్వాసంబులు లఘుత్వంబు వెల్లడి సేయవో, వేయేల దెలుంగన్నంత నాంధ్రులే పెదవి విఱిచి (after all that is not a good language) యనుమాట నయితము హూణంబుననే నుడివినంత జెంతనుండి వినుచున్న యాంధ్ర భాషాభిమానుని హృదయంబునందలి ఖేదంబు నెఱుకసేయ వదనంబున గూడెడు స్వేదకణజాలంబు ప్రహేయంబనుమాట జాటదో, మీర యెఱుంగుదురు

ఇట్టి లోపంబులం గుర్తెఱింగి కొందరు భాషా సంస్కరణ కుతూహల ప్లవమాన మానసులు లేచి, భాషా సంరక్షణంబునకుం గంకణంబు గట్టుకొని శ్రీహరీ, దాని రూపుమాప గ్రామ్యంబునుం దెచ్చిరి ఆర్యులారా, భాషను జీవిత భాషగ నుంపవలయుననుట నిక్కువంబే, దానిలోపంబుల సవరింపవలయుననుట వత్యంబే, భాషా సంస్కరణము కర్తవ్యమే కాని యిదియా సంస్కరణము, యెద్దానిని మన మాంధ్రంబునకు వేరు పురుంగనవలెనో దానిని స్థాపించుటయా తెలుంగునకు సంరక్షణము ఇందుకు దెలుంగన నేమియో ఎఱుంగని హూణ భాషాభిముఖ్యం డెన్నింటి జెప్పినన్సరే, ఆజ్ఞానంబుననో, సుజ్ఞానంబుననో పలువు రీతఁ డన్నిభాషల నేర్పరి యన్నంత ననత్యయశో గర్వ పర్వతాధిరూఢుండయి ద్రవిడుఁ డెన్ని యసందర్భ ప్రలాపంబు లాడినన్సరే, తద్వాక్యానుసారంబుగ జనిననతి సులభంబుగ గ్రంధకర్త నామంబు నందవచ్చునని యేమో వల్లెయని మనవారలు గ్రామ్యపద భూయిష్ఠంబగు గారడి పొత్తంబు లెన్ని యల్లినన్సరే, నా యూహకంబును జూడ వ్యాకరణయుక్తమే మేటియని తోచెడివి ఎవ్వారినిఁ జూచి మనవారలు గ్రామ్యంబు వ్రాయమంచిదియని కేరుచున్నారలో, ఆయాంగ్లేయులపొత్తంబులు మనమెఱుంగనివియా? అందు చిరజీవితంబులగు గ్రంథంబుల నెంత గ్రామ్యమున్నదో మనకుదెలియదా? గంజాము వారి పొత్తంబులకొండల నడుమను, విశాఖపురివారి కావ్యంబులసంద్రంబునను, గోదావరి కృష్ణా జిల్లాలవారి గ్రంధంబులనదులలోను గలుపు నీ గ్రామ్య పూహాయే మన నన్నయాదులకుం గలిగియుండిన నెంత సంతాపకరముగ నుండును వారి యర్థంబులెల్ల మన కనర్థంబులుగాగ వారి భారతము భారతమమయి యుండును కదా వారి మనంబుల నిట్టి దురూహ వొడమనీయనందుకు దైవమున కంజలి నిదే సేయుచున్నవాడ

మనవారల కిప్పుడున్న హూణపద యాచనావృత్తి మాన్చుకొననున్న చక్కనిత్రోవ యొక్కటియే—యుపన్యాసంబులను వృద్ధి సేయుటయు, భాషాంతరీకరణంబులం బురికొల్పుటయు దీనిం దుదముట్ట గ్రహించినం గలుగులాభం బింతింతనరాక యుండుననిన నాతో నేకీభవించువార లనేకు లుండుటకు సంశయంబు లేదు దీనం గలుగు ముఖ్యాంశంబు, మన యూహల నాంధ్రంబున నలుప సమర్థుల మగుచు నాంధ్ర వాఙ్మయంబును వృద్ధి చేయఁజాలినవార మగుదుము ఇట్టి భాషాంతరీకరణోపన్యాసంబుల వలననే కదా ఐరోపాదేశ భాషలన్నియు వృద్ధికి వచ్చెనని చెప్ప యందు నేనంతయు నిమిడ్చితినని భావించెద

పిదప మనకండ్లకు గట్టి నట్లగుపడునవి ప్రస్తుతము 'సీరామసేవ' యయియున్న నవల నాటకంబులు ఇయ్యవి యసంఖ్యాకంబులయి దిన దినముం బ్రవర్ధమానంబగుటం గాంచి యెంతయు సంతసింతునుగాని, ఇంచుక పరిశీలించిచూడ నింత యానందంబకారణం బగునేమో యని తోఁచుచుండును వీలనన నీ పొత్తంబుల గధావస్తు చమత్కారంబులకును, జిలిబిలి పద్యంబులకును, శృంగార రంగంబులకును జూచుచున్నారలేకాని పాత్రల మనః ప్రదర్శనంబున కింతయుఁ జూచుట గానకున్నారము ఆంధ్ర మహాజనులారా పాత్రలతో సమంబుగ రంగంబునకు వచ్చి తన యూహల వెల్లడిజేయు కవింగల నవలయందును, రంగంబున గానరాకయే తెర మరుంగునుండి పాత్రల నాడించుచు సమయానుసరణంబుగ దన యూహల బ్రచురించు కవింగల నాటకంబునను కథయే ప్రధానమయ్యెనేని సంధ్యాకాలాది వర్ణనలనుచు, కవి యూహలనుచు, విశేషాంశంబులనుచుం జదువరుల కాలంబును వ్యర్థము చేయుచు, నెన్నియో డొంక తిరుగుడులం దిరిగి తాఁబచ్చి మమ్ముంగూడఁ జంపనేల? వ్రాయువానికి శ్రమ వ్యయమును, చదువరులకు కాలవ్యయమును, నచ్చువేయువారలకు ధన వ్యయమును గలిగింపక "అనగనగ నొకరాజ"ని తిన్నగ కథలం జెప్పరాదా అటుగాక నవలలనియు నాటకంబులనియు నూతన నామంబులం గల్పించి, పేరుబెద్దయు, నూరుదిబ్బయుం జేయనేల? ఆ కథా చమత్కారంబులును జిలిబిలి పద్యంబులును చదువరుల మనంబుల నాల్గడుగులయిన లేవనెత్తఁ జాలకున్న వానివలనంగల ప్రయోజనంబు లేమి? కాన నింక నో కవీశ్వరులారా, గ్రంథకర్తలారా, ఇంక మీ కల్పనలను కథలను మాని యొక్కింత విషయ నైజములయందు (Incident and character) మీ దృష్టి నిలుపుడు నిలిపి మీచే వ్రాయఁబడు గ్రంథములయందలి పాత్రల నైజ విషయంబుల పరస్పర సంపర్కంబుం జూడుడు చూచి నైజంబుల వృక్షంబుల గతిం బెంపుడు ఆ విధమున మనః ప్రదర్శనంబు (Potrayal of mind) గావింపుడు అట్టి మనః ప్రదర్శనంబునకే మీరు బూనిరేని మీ కథలెంత పురాతనంబులయినను, నవీనుల మనంబులకంటె మీచే గోరఁబడు జయంబు మీకగును. లేదేని మీ కథా చమత్కార మెంతయుండినను, మీ కల్పన లెంత స్తవనీయంబులయినను రాను రాను విప్రనారాయణుని సద్భావంబట్లు పటుత్వంబు (56వ పుట చూడుడు)


వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు బహదర్‌గారు


మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు


సర్ సాలార్‌జంగ్‌గారు

రజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారు:—పదునేడవ శతాబ్దమునందు త్రిలింగ దేశమునందుండుండు రాజమండలిలో నగ్రగణ్యుడై నవరత్నస్థగిత కిరీటాధిపతియై త్రిలింగదేశమును పాలించిన ఈ నృపచంద్రుడు కార్యశూరులని ఘనతగాంచిన కమ్మకుల భూషణుడు. క్షాత్రదక్షుడని జగత్ ప్రఖ్యాతి వడసిన జగ్గక్ష్మాపతికిని పతివ్రతా శిరోమణి యగు అచ్చమాంబకును సుతుడు. శ్రీ శ్రీ వేంకటాద్రీంద్రుడు శైశవమునుండియు భాషాభిలాషచే ప్రబలి షోడశవర్షంబుల ప్రాయము వచ్చువరకు సంస్కృతాంధ్ర తురుష్క భాషలయందు గృతార్థుడగుటయేగాక రాజ్యాంగ తంత్ర నైపుణ్యమునం దతిప్రసిద్ధి వడసినవాడయి ఇద్ధాత్రీంద్రుడు తమ పూర్వుల కనాళీ రాజధానియగు లక్ష్మీనృసింహాసనాధిపత్యము వహించి ప్రజాక్షేమమే తన క్షేమముగా నరసి పరిపాలించుచు నూతన రాజ్య స్థాపనయం దభిలాషియై సామోపాయములచే దనశక్తి సామర్థ్యములను బరపి మలరాజు, యార్లగడ్డ, వత్సవాయి, ఇమ్మనేని, కల్దిండి, జూవవు, మానూరు, అశ్వారావు, మాణిక్యరావు, వెలుగోటిరావు మొదలయిన రావుల రావించి మన్నించి రాజ సమ్మేళన సభల స్థాపించి, నూతన రాజనీతి పద్ధతుల నేర్పరచి, ఆ రాజబృందమువలన సమస్తయశః ప్రశస్తిం జెంది, శ్రీమాన్ మహారాజ రాజాధిరాజ రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయుడు బహదర్ మన్నెసుల్తాన్ మన్నెహంవీర మన్నెరాయ ముస్తుభాన్నగర్ ముస్తుజాన్నగరు వీరశంకర బసవవీర ప్రతాపరాజ మార్తాండ గండర గండాద్యతనభోజమహారాజ బిరుదాంకితుండంచు ప్రఖ్యాతి వడసి కమ్మ రాష్ట్రమును స్థాపింప కుతూహలాయత్తచిత్తుడై, జగ్గయ్యపేట, అచ్చమ్మపేట మొదలుగాగల నూతన పురంబుల నిర్మించెను. విద్యాధికుడగుటచే రాజ్యాంగములన్నిటిలో విద్యాపోషణయే ముఖ్యాంశముగ గైకొని, వివిధ దేశ విద్వద్ధురీణుల బిలిపించి, పోషించుచు కవివరులను రావించి గౌరవించుచు భోజరాజాంధ్ర భోజరాజుల యనంతరము భాషా యోష పోషణ శూన్యమై యున్నదని యూహించి. ఆ యా విద్వన్మణులలో నుభయభాషా విద్వత్కవి నవరత్నముల నేర్పరచ్యితన ప్రధాన రాజధానియగు అమరావతీ పట్టణంబున సభా భవనమున కెదురుగా విద్యాభవన మేర్పరిచి అందు భాషాయోషను కవిరత్నములచే నలంకరించి, విద్యావిహీనతచే నంధకార బంధురముగనుండు నాంధ్ర ప్రపంచమును ప్రచండ తాండవముగ ప్రకాశింపజేసివివిధ దేశ విద్వద్ధురీణులుచే రచించిన ప్రబంధముల కృతి నొందెను.

మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు:—వీరు విజయనగరమం లోని సంస్కృత కళాశాలలో ప్రధానోపాధ్యాయులు. మహాపండితులగుటచేత దొర తనమువారు మహామహోపాధ్యాయ యను బిరుదమునిచ్చి గౌరవించిరి.

నవాబు సర్ సాలార్‌జంగ్‌గారు:—పందొమ్మిదవ శతాబ్దమున హిందూదేశమునకు గిర్తిని గణించిన రాజనీతిజ్ఞులలో సాలారుజంగ్‌గారినిఁబోలినవారు లేరు. వీరి దూరదృష్టి సిఫాయిల తిరుగుబాటు సమయములో నైజాము రాజ్యమును రక్షించినది. ఈ మహనీయుడు 1853 నుండి 1883 వరకు నిజామురాజ్యమునకు మంత్రిత్వము వహించిరి. ఈ కాలములో నీ మంత్రిపుంగవునిచే రాజ్యతంత్రములలో ననేకమైన మార్పులు చేయబడినవి. రాజ్యాదాయభివృద్ధి చేయబడినది. విద్యాలయములు స్థాపింపబడినవి. వైద్యశాలలు గల్పింపబడినవి. న్యాయసభ లేర్పరుపబడినవి. రాజ్యాంగములన్నియును బ్రిటిషు రాజ్యమునందువలె స్థాపింపబడి ఈ యమాత్యవర్యుని ప్రజ్ఞాకౌశలముచే బాగుగ నడిపింపబడినవి. ఇటీవల బ్రిటిషు పరిపాలకుల కొసంగబడిన బీరారు రాష్ట్రమును నైజామునకు రాబట్టవలయునని వీరు విశేషముగ శ్రమపడిరి. సర్ సాలార్‌జంగ్‌గారి ప్రభుభక్తియును, దూరదృష్టియును, రాజనీతి పరిజ్ఞానమును, సత్యప్రియత్వమును, స్వాతంత్ర్యమును శ్లాఘనీయములు. ఈ మహనీయుడు 1883 లో కీర్తిశేషుండయ్యె.

[ఈ ఛాయా చిత్రాలు 1911 విరోధికృత్ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి. సం.]

---

వీడవలసి వచ్చును. మనః ప్రదర్శనంబైన నీ పటుత్వ తిరోధానముండదు. ఏలనన మనంబు మారునట్టిదికాదు: ఇయ్యదియే జనసామాన్యాంశము (Universalelement). అయ్యది దేశకాల భేదంబులకు నెడమియ్యక, జాతి విరోధంబులకు లొంగక, వర్ణ భేదంబులకుఁ బట్టువడక మానవుల ననుసరించు గుణ సముదయంబగుట నే దేశంబులఁ జూచినను ఎట్టి కాలంబుల పరీక్షించినను, ఏజాతి నడుమనుండినను, ఆయా దేశకాల వర్ణంబులకుం దగి, ఎల్లరచే మెప్పునందును. ఎవని సమాధి దూర దేశంబులో నున్నది కదా యని దేశీయులెల్ల నెప్పుడు విచారింతురో అట్టి డాంటి (Dante) యను నిటాలీయునకు సర్వోత్కృష్టమగు పదవియు, నెవని మాహాత్మ్యంబు వాగడ నేనోళ్ళచిలువకయినను దరముకాదో, ఎవనికి లోకమంతయు దన నిజస్థితిం జూపెనో, అట్టి షేక్స్పియరను (Shakespeare) హూణునకు లోకముయొక్క మెప్పును, ఎవని చరిత్ర • యాంధ్రుల కెల్లరకుం గరతలామలకంబో, యెవని ధీతేజంబు సమర్థింపనలవికాక దైవతావతారంబని యెన్నఁబడెనో, యెవని కసాధ్యమగు కార్యము గల్గుట కల్లయో అట్టి కాళిదాసునకు సుజ్ఞాను లిచ్చిన యుత్తుంగ స్థానంబును, ఈ జన సామాన్యాంశమే యిచ్చెను.

ఇంక వాఙ్మయంబునకు అప్రకటిత ప్రాకటితంబులగు సృష్టి వైచిత్రంబులను, ప్రకృతియందలి బహుత్వంబుననుండు నేకత్వమును జనుల కెరుకసేయు గవి యెంతయగత్యమో, కవి యందలి స్వారస్యంబుం దెలిసికొనుమార్గంబు జూపు విమర్శకుండును నంత యగత్యమనియే నా యూహ. రత్నగర్భయగు సంద్ర మున్నంత నరియా? దాని లోతు పల్లముల నెఱింగి, ఎంతయో శ్రమకోర్చి, నీటమున్గి ముత్యంబుల జనుల కిచ్చునాతఁడు లేకున్న నా రత్న గర్భవలని లాభ ముండునా! ఇంత పరోపకారియగు విమర్శకుండు మొన మొన్న మనము జూచిన తిట్టు నాల్క వారిలో నొక్కఁడయియుండనోపఁడు గదా. విమర్శకునకుఁ దిట్టుటతో నేమియు లేదు. ఎద్దానియందైన నంద మున్నయెడల దాని నితరుల కెఱుక సేయుటయే వాని కార్యము. విమర్శ వలని లాభంబుల వేరుగ జెప్పక, మనలో మేటియగు షేక్స్పియరు 17 వ శతాబ్దమున వ్రాసిన వాడయ్యు 19 వ శతాబ్దంబున కోలెరిడ్జి (Coleredge) యను కవి విమర్శ వ్రాయునంత దనుక నింత మెప్పును బడయలేదని చెప్పి యీ దృష్టాంతమే నేఁజేయు పనినెల్లం జేయు ననుకొనియెద.

కాన నో యాంధ్ర మహాజనులారా! ఆంధ్రంబునుండి ప్రహేయంబను దానిం దొలఁగ ద్రోయ నిలువుడు, గ్రామ్యమును దూరంబున నునుపుడు, మనః ప్రదర్శన, నైజ నిర్మాణాది జన సామాన్యాంశము కొరకు జూడుడు. విమర్శల వర్ధిల్లజేయుడు. అట్లు జేసి మా వందనము లందుడు.



వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు



దాసు శ్రీరాములు పంతులుగారు



పైడా రామకృష్ణయ్యగారు

కీర్తిశేషులయిన వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు — వీరు చెన్నపురిలో ప్రసిద్ధి కెక్కిన సంస్కృతాంధ్ర గ్రంథ విక్రేతలుగనుండిరి అనేక గ్రంథములను ముద్రింపిచిరి సంస్కృతాంధ్రములలో మంచి పండితులని పేరు వడసిరి

దాసు శ్రీరాములు కవిగారు — దాసువారి కుటుంబము కృష్ణా గోదావరి జిల్లాలలో నెక్కువ ప్రఖ్యాతిని గాంచినది శ్రీరాములుపంతులుగారు విద్యాధికులకు వారుగురు పుత్రుల జనకుడు ఆంధ్ర భాషాకోవిదుడు ఆంధ్ర దేవీ భాగవతము మొదలగు గ్రంథములను రచించెను వీరు మృతిగొంది కొన్ని సంవత్సరములయినవి

పైడా రామకృష్ణయ్యగారు — వీరు కాకినాడలో గొప్ప వర్తకులు ధర్మదాత రావు బహద్దర్ కందుకూరి వీరేశలింగంగారికి స్త్రీ పునర్వివాహములు చేయుటకయి 30 వేల రూపాయలిచ్చినారు వధూవరులకు మరికొంత ధనమిచ్చుచుండెడివారు. స్వపట్టణమందు గూడ చాల ధర్మకార్యము లొనరించినారు

[ఈ ఛాయా చిత్రాలు 1911 విరోధికృత్ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి. సం.]

# హిందూ స్త్రీల ప్రస్తుత స్థితి

## శ్రీమతి మామిడన్న కామేశ్వరమ్మగారిచే వ్రాయఁబడినది

### [1911 విరోధికృత్ సంవత్సరాదిసంచికనుండి]

లోకమునందు ప్రతి వస్తువును మార్పు చెందుట ప్రకృతి ధర్మము మార్పు జెందని వస్తువు లోకమున లేదు స్త్రీలయందును నట్లే మార్పు కలిగినది మొదట నణువులు చేరి క్రమ క్రమముగ బొమ్మరాళ్లయి, చిన్న మెట్టలై, చట్టులై, పెద్ద గుట్టలై, కొండలై, పర్వతములైనవి గదా! వెనుకటి చీమదూరని చిట్టడువులును, కాకిదూరని కారడవులును ఇప్పుడు సుందరములగు మందిరములచేతను సువాసనగల చక్కని పుష్పముల నిచ్చు చెట్లచేతను ఔషధరాజముల నిచ్చుఓషధుల చేతను జీవనాధారములగు ధాన్యములు పండు పంటపొలములచేతను సద్భుతమగు మార్పు చెందినవి వెనుకటి స్థితిని జూచియుండిన మానవుండు ఇంతవరకు బ్రదికియున్నచో నీ యద్భుతమగు మార్పుఁజూచి యాశ్చర్యమును బొందక మానఁడు సమస్తమునకును కాలము ప్రధానము ప్రస్తుతము స్త్రీ విద్యయందును నట్టి మార్పే కలిగినది విద్య నభివృద్ధిపరుప పాటుపడినవారే లోకమునకు నిజమగు నుపకారము చేసినవారు వారి యుద్దేశమునకు ఫలము కలుగుచున్నది ఈ కాలమందు యే పట్టణములు పల్లెటూళ్లు చూచినను అందరు కాకున్న కొందరైనను చదువురాని స్త్రీలు లేరు ఇప్పటి స్త్రీ వెనుకటికాలపు స్త్రీలవలెగాక విరామము గలిగినపుడు పుస్తకముఁ జదువుకొనును, వీణ ఫిడేలు హార్మోనియము వాయించును యంత్ర సహాయములన బట్టలు కుట్టును పత్రికలకు వ్యాసములు వ్రాయును, మెడ పట్టీలల్లును, పరీక్షలకు చదువును స్త్రీలు చదువుకొనగూడదను మధ్యకాలపు మాట మరపునకు వచ్చినది ఎచ్చట చూచినను స్త్రీ సమాజములు హెచ్చి మంచి చెడ్డలు ముచ్చటించుచున్నారు.

ఐకమత్యము నభివృద్ధి చేసికొనుచున్నారు. ఉపన్యాసములు చదువుచున్నారు పత్రికలకు వ్యాసములు వ్రాయుచున్నారు ఇంతేకాక హిందూ సుందరి, సావిత్రి మొదలగు పత్రికలను చూచినచో నెంతమంది సుందరీమణులు చక్కని వ్యాసములు వ్రాయుచున్నారో మనకు తెలియుచునేయున్నది ఈ కాలమందు స్త్రీలు పత్రికాధిపత్యమును చక్కగ నిర్వహింపఁగలుగుచున్నారు. సభలయందు చక్కని ఉపన్యాసముల నిచ్చుచున్నారు మృదు మధుర కావ్యములు రచించుచున్నారు లంకాయాగము, కుశలవుల కథ మున్నగునవి మనోహరముగాఁ బాడి యానందించుచున్నారు ఇట్లనేకమంది స్త్రీలు హృదయరంజకముగా నుండు చరిత్రములను జదివి కాలము సద్వినియోగమునకుఁ దెచ్చుచున్నారు. ప్రస్తుతపు స్థితి చూడగా పూర్వపు సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి మున్నగువారివలె నీ స్త్రీలోకము కొద్దిరోజులలో నున్నత స్థితికి రాగలదను ధైర్యము కలుగుచున్నందుల కెంతయు సంతసింపవలసియున్నది ఇందుకు తోడ్పాటుగా పట్టణములలో జనానా పాఠశాలలుంచుటయు కొందరు స్త్రీలు బోధకురాండ్రుగా పల్లెలకేగుటయు అవసరమై యున్నది ధనము లేమిచే నేకార్యమును కొనసాగనేరకున్నది ఇట్టి ప్రయత్నములు ధనవంతులగు బురుషుల సహాయమునను విద్యావతులగు స్త్రీల ప్రోత్సాహమునను నెరవేరవలయును. బోధకురాండ్రుగా రాబోవువారి వ్యయమును ప్రతి గ్రామమున విల్వయుంచు ధర్మాదాయపు సొమ్ము ఖర్చులను భరించిన యెడల బాగుగ నుండును

సోదరీమణులారా! లోకోపకారులు స్త్రీవిద్యాభిమానులునగు మీరు చెప్పుట మాత్రమెగాక పైఁ జెప్పిన సంగతులను గమనింప బ్రార్థితులు.


గాజుల లక్ష్మీనరసుశెట్టిగారు


ఆర్ వెంకయ్యానాయుడుగారు


కూచి నరసింహం పంతులుగారు


డొక్కా సీతమ్మగారు


బాలకవి బాలాంత్రపు రామచంద్రసత్యనారాయణ


శ్రీమతి మొసలికంటి రామాబాయమ్మగారు

గాజుల లక్ష్మీనరసుసెట్టిగారు—వీరి చరిత్ర విపులముగ నాంధ్రపత్రికలో నొక పర్యాయము ముద్రింపబడినది చెన్నపురి కాపురస్థుడు. వ్యాపారమువలన చాలాధనము నార్జించెను. ఆకాలములో దొరతనమువారి చర్యలను న్యాయము తప్పినప్పుడు నిర్భయముతో ఖండించుచు సీమలోని పై యధికారులకు సయితము విజ్ఞాపనముల బంపుచుండెను.

ఆర్ వెంకయ్యానాయుడుగారు—ఈయన చెన్నపురియందు సుప్రసిద్ధమగు రూపపటముల ఉత్తమ కార్యస్థానము గలవాడు చిత్రచాతురియు గలవాడు స్వశక్తివలన ధనమార్జించి చెన్నపురిలో పెద్దవారయిన ఆంధ్రులలో వెంకయ్యగారొకరు

కూచి నరసింహముపంతులుగారు—వీరు పిఠాపురములోని రాజాగారి హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా నున్నవారు వీరివద్ద ననేకమంది చదువుకొని ఆంధ్రదేశమున నున్నతోద్యోగములలో నున్నారు

డొక్కా సీతమ్మగారు—గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా మండపేట గ్రామవాసినియగు అనపపిండి భవానీశంకరుడుగారి పుత్రికయు, రాజవోలు తాలూకాలోని లంకలగన్నవరము కాపురస్థుడగు డొక్కా జోగన్నగారి భార్యయునగు డొక్కా సీతమ్మగారు 60 ఏండ్లు జీవించి, 1909 వ సంవత్సరము 27 ఏప్రిలుతేదీని స్వర్గస్థురాలయ్యె ఆమె దివారాత్రములు జాతిమత వివక్షణ లేకుండ నన్నప్రదానము చేసి, తాను వినినంతవరకు క్షుద్బాధ నెవ్వరికిని గలిగింపదయ్యె స్వసుఖమును లేశమపేక్షింపక యామె చేయుచుండిన యన్నప్రదానము మండలమందంతట ప్రసిద్ధమై యెడ్వర్డు సార్వభౌముని పట్టాభిషేక సమయమున నామెకు దొరతనమువారు గౌరవ సూచకముగ పట్టము నొసగిరి ఆమె కిద్దరు పుత్రులు గలరు వారు తల్లియొక్క గౌరవమును క్రియాపూర్వకముగ నిప్పటికిని నిలుపుచున్నారు ఆమె పుత్రిక లిరువురు నామె బ్రతికియున్నప్పుడే మృతులైరి

బాలకవి బాలాంత్రపు రామచంద్ర సత్యనారాయణ—ఈ బాలుడు పదునేను సంవత్సరములు మాత్రమే జీవించెను ఈ పిన్న వయస్సుననే రుక్మిణీకల్యాణము, ద్రౌపదీ స్వయంవరము, శ్రీరామవిజయము అను చరిత్రములు గల గ్రంథముల వ్రాసెను శైశవమున నింతటి మేధానిధియగు బాలుకుని జీవితము బాలకుల కెల్ల నాదర్శముగ నడునోపును

శ్రీమతి మొసలికంటి రామాబాయమ్మగారు—ఈమె చెన్నరాజధానిలో ననేక చోట్ల డిస్ట్రిక్టు మునసబు పనిని చేసిన నాభి రామమూర్తిపంతులుగారి పుత్రిక కృష్ణాజిల్లా కంతేరునం దిపుడు ప్రచురింపబడుచున్న హిందూసుందరిని పది సంవత్సరములు నడిపినది మాతృభాష ఓఢ్రమే యయినను, సంస్కృతాంధ్ర భాషలయం దీమెకు మంచి పాండిత్య మున్నది సంగీతమును జక్కగా బాడగలదు ఈమె పాడు కృతులు సకల్పితములు తెలుగు భాషలో జక్కగా నుపన్యాసము లిచ్చుచుండును ఈమెచే స్థాపింపబడిన స్త్రీ సమాజములు ఆంధ్రదేశమందు వర్ధిల్లుచున్నవి గృహకర్మ నిర్వహణమునం దీమె కత్యంత శ్రద్ధ కలదు వంటలక్క యను గ్రంధ రచన కీమె చాల సహాయపడినది స్త్రీ విద్యాభివృద్ధికై ఎంతయు పాటుపడుచున్నది

[ఈ ఛాయా చిత్రాలు 1911 విరోధికృత్ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి సం]



[ ఈ ఛాయాచిత్రం 1912 పరీధావి సంవత్సరాది సంచికలో ప్రచురించినది. సం ]




[ఈ ఛాయా చిత్రాలు 1912 పరీధావి సంవత్సరాది సంచికలో

బ్రిటీషు రాజకు

# నేటి తేట తెలుగు

రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు బి. ఎ. ఎల్. టి.

[1913 ప్రమాదీచ సంవత్సరాదిసంచికనుండి]

“అనావశ్యకములయిన నిర్బంధములను దీసివేసి భాషను సుసాధ్యము చేయుట పరమ ప్రయోజనకరము భాషాభివృద్ధిని బట్టియే జనుల నాగరికతయు నభివృద్ధి చెందుచుండును కనుక “జనుల యభివృద్ధినిగోరు దేశాభిమానులందఱును ముందుగా “నాంధ్ర భాషను మంచిస్థితికి దీసికొని వచ్చుటకై ప్రయత్నింపవలెను “మనవారు దేశ భాషలు మంచిస్థితిలో లేవా యని యడుగవచ్చును “లేవనియే మేము దృఢముగా చెప్పగలము (పండితులు) “తమ పాండిత్యమును కనబఱుప జూచుచున్నారే కాని జనుల”కు తెలివిని గల్పుటకై లేశమయినను బ్రయత్నింపకున్నారు”—కం వీరేశలింగము పంతుల గారి బంగారపు పలుకులు

మన దేశములో బ్రిటిషుగవర్నమెంటువారు సర్వజనసామాన్యముగా చదువు చెప్పించడానికి మొదలుపెట్టి రమారమి అరవై సంవత్సరాలు అయినది ఇంతకాలమూ పండితులు పాత తెలుగునే పుస్తకాలు వ్రాసి ఫస్టుక్లాసు మొదలుకొని ఎమ్ ఏ క్లాసదాకా చదివిస్తున్నారు పండితులే తెలుగు పాఠాలు చెప్పుతున్నారు పండితుల తెలుగు ఎంతమట్టుకు వృద్ధిపొందినది? ఈ పాత తెలుగు ఎంతమంది మాటాడగలరు? తెలుగువారిలో ఇంగ్లీషు పుస్తకములవల్లనా, తెలుగు పుస్తకములవల్లనా, వ్యాపించినంతమట్టుకయినా ఇప్పుడు విద్య వ్యాపించినది? ఈ అరవై సంవత్సరములలో, ఎంతమంది ఇంగ్లీషు, అన్యభాష అయినా, చదవడము, వ్రాయడము, మాటాడడమూ కూడా నేర్చుకున్నారో చూడండి పాత తెలుగు పండితులయినా పొరబాట్లు లేకుండా వ్రాయలేరే!

తెలుగు కాంపొజిషన్ గురించి సెనిటులో మొన్న మొన్న చర్చ జరిగినప్పుడు ఏమన్నారు విద్యాధికార్లు? తెలుగు పరీక్షలో నెగ్గిన బి. ఏ లు తెలుగున లకణముగా ఒక కథ అయినా వ్రాయలేరట! మద్రాస్ గవర్నమెంట్‌వారున్ను తమ జి వో లో ఈ సంగతే చాటించినారు ఇండియా గవర్నమెంటువారున్ను, దేశభాషలలో విద్య వ్యాపించవలసినంతమట్టుకు వ్యాపించలేదు అనిన్ని, ప్రజలకు లోక వ్యవహారములో తెలివితేటలు కలిగించె విద్యలు దేశభాషలలో చెప్పలేదు అనిన్ని, ఇంతకాలమూ విద్యావ్యాపకమునకై చేసిన ప్రయత్నము, పెట్టిన కర్చు ఇంచుమించుగా వ్యర్థమైనది అనిన్ని, ఇకమీదట వాడుకలో ఉన్న భాషలలోనే తెలివి కలిగించే విద్యలు నేర్పడానికి ప్రయత్నము చేయవలసినది అనిన్ని వ్రాసి, రిజలూషన్ ప్రకటించి ఉన్నారు

జనాభా లెక్కలలో వేసినట్టు, తెలుగున సంతకము చేయగల వారందరూ చదువు వచ్చినవారే అని ఒప్పుకొన్నా, తెలుగువారిలో చదువుకొన్నవారు వేయింటికి 75 గురు మాత్రమే అంటే, వేయింటికి 925 గురు తెలుగువారు సంతకమైనా చేయలేరు అన్నమాట తెలుగువారి అందరిలో బ్రాహ్మణజాతివారు గదా విద్యా గురువులు ఈ బ్రాహ్మలు తెలుగు వారిలో నూటికి ముగ్గురే ఉన్నారు వీరికి విద్య నేర్చుకోడానికి ఎన్నెన్నో సుళువులు ఉన్నవి మొదటి సంగతి, అక్షరాభ్యాసము వారికి విహితకర్మ ఇంతేకాక, బ్రాహ్మల పిల్లలకు ధర్మానికి అనేకమంది సాయము చేస్తారు అనేక తరాలనుండి విద్యాభ్యాసము బ్రాహ్మణ వంశములలో వేరునాటుకొని ఉన్నది పిల్లలు తమ పొట్ట పోషించుకోడానికి కూలీ నాలీ చేయనక్కరలేదు స్వగ్రామము, స్వగృహము విడిచి దూరదేశాలకు పోయి పది పండ్రెండు సంవత్సరాలు వేరే చింతలేకుండా చదువుకోవచ్చును ఇన్ని సుళువులుగల బ్రాహ్మలలోనే చదువురానివారు, ఇంకా నూటికి అరవైమంది ఉన్నారు ఇకను ఇతర జాతులమాట చెప్పేది ఏమున్నది? ఒక కార్డుమీద చిన్న ఉత్తరమయినా వ్రాయలేనివారు, రెయిల్వే టికెట్‌మీద ఏ వూరి పేరున్నదో చదువుకోలేనివారు, వెయ్యింటికి 925 గురు ఉన్నప్పుడు, తెలుగు జాతులవారు నాగరికులని చెప్పడానికి నాలుక తిరుగుతుందా? యూరపు ఖండములో ఈ కాలములో న్యూస్‌పేపరు చదవలేనివారిని కిరాతులుగా ఎంచుకొంటారు అంతమట్టుకు చదవడము వ్రాయడము సర్వ సామాన్యమయినవి నలుగురు పండితులు నాలుగు సంస్కృతపు ముక్కలు, నాలుగు పాత తెలుగు ముక్కలు వల్లించి, రెండు బండిరాలు, రెండు అరసున్నలు, రెండు బండమాటలు, పెట్టి పాత గొడవలు రెండు పురాణాలు తెలిగించగానే, తెలుగుభాష వృద్ధిలోనికి వచ్చినట్టేనా? ఓనమా అయినా రాని కోట్లకొలది తెలుగు వారందరూ తెలివిగలవారున్ను నాగరికులున్ను అయినట్టేనా? అథమపక్షము నూటికి ఏభైమంది అయినా పుస్తకము చదివి అర్థము చేసుకోగలవారు తమ అభిప్రాయములను స్పష్టముగా వ్రాయగలవారు ఉండవద్దా.

నాగరికజాతిలో పూర్వకాలములో చదవడము వ్రాయడము అరుదే అప్పటి లోక వ్యవహారమునకు ఇవి అంతగా అవశ్యముకావు తెలివితేటలు కలిగించే ఇతర సాధనములు, ఉన్నమట్టుకు అందరికీ సామాన్యముగా ఉండేవి బహుస్వల్పముగా ఉండేవారు చదువు వచ్చినవారు, ఎవరో నలుగురు దేవతలలాగు పురాణము చెప్పినా వారే పంచాంగము చెప్పినా వారే తక్కిన జనులలో విద్యవల్ల కలిగె ఎక్కువ తక్కువలు ఆకాలములో ఏవీ లేవు ఇప్పటి లోక వ్యవహారమయితే ముక్కాలు మువ్వీసము కాగితముమీదనే జరుగుతూ ఉన్నది వ్రాయలేనివారు, వ్రాసినది చదువలేనివారు ఎంత వెనకపడుతున్నారో ఎంత నష్టము పొందుతున్నారో చూడండి పూర్వకాలములో రామావధానులు, రామినాయుడు, మంగలి గురవడు, చాకలి సరవడు, గొల్లకోనారి, మాదిగ వెంకడు అందరూ ఒకటే ఎవరయినా ఉత్తరాలు వ్రాయనూ అక్కరలేదు, చదవనూ అక్కరలేదు, రసీదులూ లేవు సంతకాలూ లేవు మునుపు అధికార్లు నోటి మాటలతోనే వ్యవహారాలన్నీ పరిష్కరించేవారు ఇప్పుడో? అర్జీలు, సమనులు, ప్లెయింటులు, వాఙ్మూలాలు, నోటీసులు డిక్రీలు, నకళ్లు, మనిఆర్డర్లు, రెయిల్‌వే టికెట్లు, మందుల కేటలాగులు, ధరవరలపట్టీలు, ట్రేడు డైరక్టరీలు, రిపోర్టులు, గెజట్‌లు, మ్యూనిసిపల్ కౌన్సిల్ ప్రొసీడింగ్సు, న్యూస్ పేపర్లు, పాంప్లెట్లు, పుస్తకాలు, బులిటిన్లు మొదలయినవి ఎన్ని ఉన్నవో చూడండి కొంచెము చదవడము, వ్రాయడము వస్తే, లోక వ్యవహారములో ఎన్ని సంగతులు తెలుసుకోవచ్చునో చూడండి తెలివే ప్రధానమైతే నేటి తేట తెలుగులోనే తెలివి సులభము కాదా?

ఈకాలములో రామావధానులుగారి మనుమడు బి ఏ బి ఎల్ అయి ప్లీడరీ చేస్తాడు లేదా స్కూల్ ఫైనల్‌దాకా చదువుకొని హెడ్ గుమస్తా అవుతాడు రామినాయుడు మనుమడు డిప్టీకలక్టరు అవుతాడు లేదా పోలీసు ఇన్‌స్పెక్టర్ అవుతాడు (తెలుగులో పాండిత్యముచేత కాదు సుమండీ) అయితే మంగలి వెంకడు, గొల్ల గోపాలుడు, చాకలి సరవడు ఇప్పటికీ రామావధానులు, రామినాయుడు తాత ముత్తాతలంత సత్యకాలపు వాళ్లే ఇప్పుడు ఇంగ్లీషు బళ్లలో జాతి భేదము లేకుండా అందరికి సరిసమానముగా చదువు చెప్పబట్టిగాని, బ్రాహ్మణ పండితులకే విద్యాధికారముంటే బ్రాహ్మణేతరులలో విద్య ఈ మాత్రమయినా వ్యాపించునా? తెలుగుదేశములో విద్య ఇంత తక్కువగా ఉన్నప్పుడు విద్య ఎడల నిజమైన అభిమానము గలవారు చేయవలసిన పని ఏమిటి? విద్యవల్ల కలిగే ఫలము, లోక వ్యవహారానికి పనికివచ్చే జ్ఞానమా? లేక కేవలము శబ్దజాలమా? ఏదో ఒకటి వల్లించడమా? వల్లించినదానిలోని విషయము తెలుసుకోడమా? జ్ఞానము కలిగించే సాధనము ఎంత సుకరముగా ఉంటే అంత మంచిది గదా! మాటకు, ఇప్పుడు కాసీయాత్ర చేసేవారు రెయిల్ బళ్లు ఎక్కిపోతున్నారు కారా? రెయిల్‌బండికంటె ఎడ్లబండి ఎక్కిపోతే ఎక్కువ పుణ్యమని, అంతకన్న కాలినడకను పోతే మరింత పుణ్యమని ఇంకా రోడ్డుమీద దొర్లుతూ పోతే మరీ ఎక్కువ పుణ్యమని, మన పౌరాణిక పండితులు మనకు హితోపదేశము చేసినా, ఎంతపుణ్యము దొరికితే అంతే ఆయెను అని, వారూ మనమూ మెయిల్‌బండిమీదనే పోతున్నామా, లేదా? పైకిమాత్రం అంటారు శాస్త్రిగారు బుగ్గిలో దొర్లుతూ పోతే బొందెతోనే స్వర్గానికి పోతామని వ్యవహారములో ఆ మాట మీద విశ్వాసం మనకూ లేదు వారికీ లేదు వాదానికిమాత్రం శాస్త్రం ఒప్పుకోవలెనట! అలాగునే ఉత్తవాదానికి పాత తెలుగు, నిత్యమూ వ్యవహారములో నేటి తేట తెలుగు!

పూర్వము వేదములలోని భాష లోకులు మాటలాడుకొనే రోజులలో, ఇప్పుడు బొబ్బిలి పాటలాగు, వేదములు అందరికీ బోధపడేవి రానురాను ఆ భాష మారి, తుదకు వాడుకలేక ఎవరికీ తెలియకుండా అయినది ఇట్లా మారి ఏర్పడిన కొత్తభాషే సంస్కృతము భారతము పంచమవేదమని చెప్పి, పూర్వపు ఇతిహాసములు అన్నీ ఇమిడ్చి, అందరికీ తెలిసేటట్టు అందరూ వాడుకొనే భాషలోనే తర్వాత తేటగా వ్రాసినారు ఆ భాషను వ్రాసినవారు, పూర్వ భాషతో కలపక, తమకాలపు వాడుకను అనుసరించే వ్రాసినారు వాడుకలో ఉన్న భాషకు మార్పు కలగడము అనివార్యము గనుక ఆ సంస్కృతము కూడా కాలక్రమమున మారి, ప్రాకృత భాషలు ఎన్నో ఏర్పడినవి ఆ భాషలలో గ్రంథాలూ పుట్టినవి అయితే ప్రాకృతములూ, సంస్కృతమూ కలిపి ఏకభాషగా ఎవరూ చేయలేదు సంస్కృతములో వ్యాకరణము వ్రాసినవారు అయినా వాడుకలో ఉన్న భాషనే పరీక్షించినట్టు అనేక నిదర్శనములు ఉన్నవి శబ్దముల రూపభేదముల అంగీకరించినారు స్వరము ఏర్పరిచినారు తూర్పు దేశమువారు ఈలాగు ఉచ్చరిస్తారని, ఉత్తరదేశమువారు



చెవేంద్ర వేంకటచలం పంతులుగారు



బిషప్ అజరయ్యాగారు



రావుబహదూర్ బయ్యా నరసింహేశ్వరశర్మగార

చేవేంద్ర వేంకటాచలం పంతులుగారు —నోబిలు దొర యొక్క దైవభక్తిచే సమ్మోహితులై క్రైస్తవమతము స్వీకరించిన బ్రాహ్మణులలో కీర్తిశేషులగు శ్రీ చేవేంద్ర వేంకటాచలం పంతులుగా రొకరు వీరు ఎఫ్ ఎ పరీక్షయందు గృతార్థులైన పిమ్మట గవర్నమెంటుద్యోగమున బ్రవేశించి, తమ శక్తి సామర్థ్యముల వలనను, కార్యదీక్ష వలనను, న్యాయబుద్ధి వలనను, క్రమముగా డిప్యూటీ కలెక్టర్ హోదా వహించి, యనేకుల కనేక విధములైన యుపకారము లొనర్చిన దయార్ద్రహృదయులు తిరి పరోపకార నిరతికిని, దీనరక్షణ పరాయణత్వమునకును, పండిత సన్మానమునకును మిఫీ లేదు వీరి గృహ మెప్పుడును ఆంగ్లేయాంధ్ర గీర్వాణ పండితులచే నిండియుండెడిది. దానకర్ణులును, భక్తిపరాయణులును నగు వేంకటాచాలం పంతులుగారు 1907 మార్చి 7 వ తేదీని మృతినొందిరి.

అతి పూజనీయులగు మ-రాధిపతి అజరయ్యగారు — వీరు తిరునల్వేలి జిల్లాకు చెందిన స్వదేశ క్రైస్తవులు ఎఫ్ ఏ పరీక్షలో గృతార్థులయిన పిమ్మట క్రైస్తవమత వ్యాపనార్థమై చాల కృషి సలిపిరి తరువాత దేశీయ క్రైస్తవమత వ్యాపక సమాజము నకు జెందినవారయి ఉత్తరమునకు వచ్చి నిజాం రాజ్యములోని డోర్ణకల్లును ముఖ్య స్థానముగా నేర్పరచుకొని ఆ రాష్ట్రమందును మరి యితర చోటులను ఉన్న చర్చి ఆఫ్ ఇంగ్లండునకు జెందినవారి కందరికిని గురువుగా నున్నారు ఈయన గడచిన జనవరి మాసమందు బిషప్‌గా కలకత్తాలో జేయబడిరి ఈ గొప్ప పదవి నందుటకు మొట్టమొదటి భారతీయు డీయనయే

గౌ రావుబహదూర్ బి నరసింహేశ్వరశర్మగారు —వీరు విశాఖపట్టణము, గంజాం జిల్లాల పక్షమున పూర్వమును, ప్రస్తుతమును చెన్నపురి శాసన నిర్మాణ సభా సభ్యులుగ నున్నారు ఈ పనియందు దేశీయుల పక్షమును వహించి వీరి విధ్యుక్త ధర్మములను జక్కగా నిర్వహించుచున్నారు వీరు ధనమును సత్కార్యములకు ధారాళ ముగా వినియోగించుచుందురు ఈ సంవత్సరము జరుగు ఆంధ్ర మహాజనసభ కధ్యక్షు లుగా నెన్నుకొనబడుట వలననే మనవారికి వీరియందున్న గౌరవాదరణములు వ్యక్తీక రింపబడుచున్నవి

[ఈ ఛాయా చిత్రాలు 1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి సం ]

---

ఈలాగు ఉచ్చరిస్తారని, లోకములో వాడుక ఈలాగు ఉన్నది, ఛందస్సు (అనగా వైదిక భాష)లో ఈలాగు ఉన్నది, అని, ప్రత్యేకముగా పాత భాష కొత్తభాష, అని రెండు భాషలు ఉన్నట్టుగా చూపించినారు

పాతవి పట్టుకొని పాకులాడేవారు కొందరు, కొత్తవి కొనియాడేవారు కొందరు ఎప్పుడూ ఉంటారు పాతగిల్లినకొద్ది పరిచయము తక్కువ గౌరవము ఎక్కువ, దూరమైనకొద్ది దృషి సూక్ష్మము అవుతుంది రామాయణముకన్నా, శాస్త్రముకన్నా వేదము గొప్పది శాస్త్రిగారికన్నా అవధానులు గొప్పవారు తెలుగు రామాయణముకన్న సంస్కృత రామాయణము చదివితే పుణ్య మెక్కువ తెలుగు పండితులకన్న సంస్కృత పండితులు ఎక్కువ గొప్పవాళ్ళ మనుకుంటారు తెలుగు పండితులు కూడా తమకు సంస్కృతములో పాండిత్యము ఉన్నా లేకపోయినా ఉన్నట్టే నటిస్తారు పాత తెలుగు పండితులు కవిత్రయమును ప్రమాణముగా ఉంచుకొని సంకర తెలుగు వ్రాసేవారిని తక్కువగా చూస్తున్నారు కొత్త తెలుగు వ్రాసేవారిని చూచి వారూ వీరూ ఆక్షేపిస్తున్నారు· పల్లెటూళ్ళలో రవిక తొడుక్కొంటే సాని, పట్నములో కోటు తొడుక్కొంటే దొర సాని, అని ముసలమ్మలు అన్నట్టే

ప్రస్తుత విషయమునకున్ను పైనచెప్పిన మాటలకున్ను సంబంధ మేమిటంటే — మొదటి తెలుగు కవులు తమ వ్యవహారములోఉన్న తెలుగుభాషను వ్రాసినారు వారి తెలుగు కాలక్రమమున మారినది ఎంతో కొంత దానికిన్ని ఇప్పుడు వాడుకలోఉన్న తెలుగుకున్ను భేదము ఉండబట్టి పాత భాషలో చెప్పిన వాక్యముల అర్థము, ఆ భాష బాగా చదువుకొన్న పండితులకుగాని స్పష్టముగా తెలియడము లేదు పాత భాషలో కల్పించిన వేదముల లోని సారము కొత్త సంస్కృతములో భారత రామాయణములు వ్రాసి చెప్పినట్టుగా, పాత తెలుగులో వ్రాసిన పుస్తకములలోని విషయములు సర్వ సామాన్యముగా తెలిసేటట్టు చేయవలెనంటే, కొత్త తెలుగు అనగా ఇప్పుడు వాడుకలోఉన్న భాషలో తిరిగి చెప్పవలెను గదా కొత్త విద్యలు నేటి తేటతెలుగులో కాగితముమీద వ్రాస్తే సులభము కావా? ఈలాగు చేయడము అన్ని దేశములలోను అన్ని భాషలలోను జరుగుతున్నది కాదా? పది పదిహేనువారు పాలగిల్లిన ఇంగ్లీషులో కీస్తుమత గ్రంథములు మాటి మాటికి కొత్త కొత్త ఇంగ్లీషులో వ్రాస్తున్నారు కారా? మనదేశములో కూడా పూర్వము అదే సంప్రదాయము గదా ఇందులో వైపరీత్యము ఏమి ఉన్నదని పండితులు రణగుణ ధ్వని చేసి ఆకాశము బద్దలు కొట్టుతున్నారు.

విద్యలు కూడా కలకాలము ఒక్కరీతిని ఉండవు ఉండలేదు విద్యలు అన్నీ అందరికి సామాన్యముగా ఉండవు లోక వ్యవహారము మారినప్పుడు దానితో కూడా అందుకు ఉపయోగించే విద్యలూ మారుతవి ఇప్పుడు సివిల్ కోర్టులలోను, క్రిమినల్ కోర్టులలోను పూర్వపు స్మృతులు పనికివస్తవా? పూర్వపు ధనుర్విద్య ఈ కాలపు యుద్ధమునకు పనికివస్తుందా! పూర్వపు నియమాలు ఈ కాలములో చెల్లుతవా? లోక వ్యవహారము లక్ష విధములు నాగరికత ఎక్కువ అయినకొద్ది ఈ లోక వ్యవహారము శాఖోపశాఖలుగా భిన్న భిన్నమై దుర్బోధము, దుర్లభము అవుతుంది శాస్త్రములు, కళలు లెక్కకుమీరి పెరుగుతవి ఇవి అన్నీ నేర్చుకోడము అందరికీ సాధ్యమా? సర్వజన సామాన్యమైన విద్యవల్ల తెలిసేవి—వ్రాయడము, చదవడము, కొంతగణితము, దేశచరిత్ర, భూగోళ వివరము, జగత్తు ఉత్పత్తి వృద్ధి బోధించే శాస్త్రము, రాజ్యపరిపాలన, ప్రజల నడవడి, దేహారోగ్యము మొదలయినవి ఈవిద్య ఎంతో కొంత వచ్చిన పిమ్మట ప్రజలు తమ తమ వ్యాపారమునకు ఉపచరించే విద్యను గ్రహించవలిసి ఉన్నది కడుపుకూటి కోసము దినమంతా శ్రమపడవలసినవారి అందరికీ అన్ని శాస్త్ర విద్యలు స్వాధీన మవుతవా? పాత తెలుగు పాండిత్యము పౌరాణికులకు పాత తెలుగు కవులకు కావలెను, లేదా భాషాతత్త్వము తెలుసుకొనేవారికి కావలెను, గాని అందరికీ ఎందుకు? అందరూ సంస్కృతము నేర్చుకోరేమి? వేదములు బ్రాహ్మలయినా చదవరేమి? దేశభాష అయిన సంస్కృతముకన్న మ్లేచ్ఛభాష అయిన తెలుగు ఎందులో ఎక్కువ?

పూర్వకాలమున మనదేశములో పుట్టిపెరిగిన విద్యలలో ఎన్నో రూపుమాసిపోయినవి నిలిచినవయినా అన్నీ ఇప్పటి లోక వ్యవహారమునకు అనుకూలముగా లేవు లోకముతో కూడా మార్పు చెందనిది ఏదీ వృద్ధి పొందదు లోకమును అనుసరించి మారినవి వృద్ధిపొంది, మారని వాటిని అణగదొక్కి నిర్మూలము చేయకమానవు ఇది లోక ధర్మము మనుష్యులు మృగములే కాదు, చెట్లు, చేమలున్ను, రాజ్యములు, వ్యాపారములు, భాషలు, విద్యలు కూడా కాలానుగుణముగా మారని ఎడల వృద్ధిపొందవు మార్పునుబట్టే వృద్ధి పుట్టినవాడు పుట్టినట్టే కర్రబొమ్మవలె ఉండునా? జంతువులకు జీవము ఎటువంటిదో, అటువంటిదే భాషకు వాడుకా, విద్యకు లోకవ్యవహారముతో సంబంధమున్ను

పూర్వకాలమున మనదేశములో ద్విజులే గదా విద్యలు నేర్చుకొనేవారు వారిలో నయినా అందరూ కారు సర్వ సామాన్యముగా ప్రజలందరికోసము ఉద్దేశించి ఏ రాజున్ను



...వారి వలిపాలవవల్లనే మనకు కలిగినది ..., పండితమ్మన్యులున్నూ, నిజము ... చేసినారు విద్యను పండితులు ... ప్రబోధలూ, కథలూ, చరిత్రలూ ... ఒందాను చెసి, ఫస్టుక్లాసు మొద ..., పండితులు వెదాలు, శాస్త్రాలు ... ఉద్ది వినిపించకుండా ఎవాడ్చ ...లలో విద్య చెప్పవెనెస్స సంగతి ... ఒక మానవు వెనకుపడానికి యీరాం ప్రపంచములో కూడా సూటు నాలుగు వందల సంవత్సరముల క్రిందటివంకు కృత్రిమభాషలో ... గ్రంథములు వ్రాయడము విద్య చెప్పడము అచారముగ ఉండెది ఆయినను ఆ కాలములో సంసారములో విద్యావంతులు అరుదు సన్యాసులుగా ఉండేవారు వారు మాత్రము ... కాలము పుస్తకముల కరిగి పూని పఠించి, ఆ కృత్రిమభాషా, అందులో వ్రాసిన గ్రంథాలు నెర్చుకొనిగినేవారు మనదేశములో పూర్వ సంప్రదాయము ప్రకారము తెలుగు భాష నేర్చుకొనేవారు ఓనమాలు నేర్చుకొన్న వెంటనే సంస్కృతములో వ్రాసిన బాలరామాయణము, తర్వాత అమరము, ఆంధ్రము, శబ్దాలు, సంస్కృత కావ్యాలు, నిఘంటువులు ఈ వరసను చదువుకొని ప్రబంధాలు ఆరంభించే వారట! ఇదే అనులోమమార్గమట! వేదము వెంకటరాయశాస్త్రిగారు గ్రామ్యాదేశ నిరసనములో ఈ పద్ధతిని ఎంతో కొనియాడుతూ వ్రాసినారు ఈ చొప్పున తెలుగు చెప్పక పోవడముచేతనేనట తెలుగుపిల్లలకు తెలుగు బాగా రాకపోవడము! భళాభళీ! నిజము! శాస్త్రిగారు సెలవిచ్చిన సంగతి వాస్తవమే! ప్రతి తెలుగువాడు తెలుగు పండితుడు కావలె నంటే, ఇదే ఉత్తమమయిన పద్ధతి అయితే ఇప్పుడు "గ్రాంధికశైలిని", "వ్యాకరణ శైలిని" నిర్దుష్టముగా వ్రాస్తున్నామని ప్రగల్భాలు పలుకుతూవున్న ఎమ్ ఏ పండిట్లు, బి ఎ పండిట్లు, ఎఫ్ ఏ పండిట్లు అనులోమముగా శాస్త్రిగారు చెప్పిన పద్ధతిని తెలుగు అభ్యసించినట్లు కనబడదు అంతా హుళక్కి పండితులే పండిట్ వావిలకొలను సుబ్బారావుపంతులువారంతటివారు "సందేహనివర్తి" అని, "నిరోగము" అని సంస్కృతములున్ను "బుజావు చేయుట", "మాటల ధోరణి", "అట్టైన వారిని మీకు జక్కగి దెలియునా?" "మేము విజయు వీళ్ళుద్రోచియుః జావడయె", "త్రోసెడిపిల్లి", "తీసిపైచినది", "చిగిచివేయుము" అని అసంస్కృతాలు, సంకరాలు, పాత—కొత్త తెలుగులు కలిపి, పిసికి, ప్రయోగించినారు వీరు గుండెలు కుళ్ల వర్ణించినారట, సంస్కృత నిఘంటువులున్ను వ్యాకరణములున్ను! నేను ఈలాగున వ్రాయడము వీరి దోషములు ప్రకటించడానికి కాదు ఎంతో అభిమానము, పూనిక కలిగి రాత్రింబగళ్లు పడ ఎల్లించి, పుట్టినది మొదలు సంస్కృతము, తెలుగు చదువుతూ, గ్రంథములు రచిస్తూ, అధ్యాపకవృత్తిలోనే కాలక్షేపముచేస్తూ ఉన్న వీరికే చక్కగా స్వాధీనము కాలేదే భాష, ఈ కాలపు బడులలో చదివే పిల్లలకు పట్టుపడడము కష్టముకాదా అని అడుగడానికి లెక్కలు, హిష్టరీ, జియాగ్రఫీ, నేచర్‌స్టడి, డ్రాయింగ్, ఇంగ్లీషు మొదలగునవి ఎన్నో నేర్చుకొంటూ పదింట నొకటిగానున్న తెలుగు పాఠములు అనులోమపద్ధతిని వల్లించడము బడిపిల్లలకు ఏలాగున వల్లపడుతుంది? సంస్కృత విద్యార్థులను చూస్తున్నాము కామా? ఏలాగు రఘువంశము వల్లిస్తున్నారో! దినానికి ఒక శ్లోకము చొప్పున వ్యాఖ్యానముతో కూడా చదివి ఒప్పచెప్పుతారు గురువుగారికి ఈలాగున చెప్పుమంటే మన పండితులు తెలుగువిద్య చెప్పి తెలివి పుట్టిస్తారట మన తెలుగుపిల్లలందరికీ! దినానికి అరవై గడియలు "గ్రామ్య" తెలుగు వాడుతూ, వాదానికి గ్రాంధిక తెలుగు మంచిదని చిందులు తొక్కుతున్నవారు, తమ పిల్లలకు ఈ రీతిగానే చదువులు చెప్పించి లాభము చూపించ రాదూ? ఒక్కొక్క కాలేజీకిన్ని, ఒక్కొక్క హైస్కూలుకున్ను, ఒక్కొక్క తెలుగు పండితుడే కదా ఉన్నాడు తక్కిన మాస్టరులలో ఒక్కడయినా తెలుగు టెక్స్టుట్ పాఠము చెప్పలేడుగదా! ఏమి గతి? ఈ మాస్టర్లందరు తాము నేర్చుకొన్న మరి ఏ సబ్జక్టు పాఠము చెప్పమన్నా చెప్పడానికి తయారుగా ఉంటారు తెలుగు చెప్పుమంటే మాత్రము తమకు రాదని వెనక తీస్తారు కారణము ఏమిటి? తెలుగు గ్రంథాలలోని తెలుగు ఈ తెలుగు మాస్టర్లు నిత్యమూ వాడుకొంటూఉన్న తెలుగు కాదు అది వేరే భాష ఇంగ్లీషుగ్రంథాలలోఉన్న ఇంగ్లీషు బోధపడని ఇంగ్లీషు మాస్టర్లను చూచినారా ఎక్కడయినా? లక్షల కొలది అచ్చుపడుతున్నవి ఇంగ్లీషు పుస్తకాలు ఏవో ఫిజిక్స్ కెమిస్ట్రీ వంటివితప్ప, సాధారణముగా ఏ పుస్తకము పడితే ఆ పుస్తకము చదవగలడు ప్రతి ఇంగ్లీషువాడున్ను, ఇంగ్లీషు వారిదాకా ఎందుకు? ఇంగ్లీషు నేర్చుకొన్న తెలుగువారే చదవగలరు తెలుగు బి ఏ గారు తాను పరీక్షకు చదవని పుస్తకము ఒకటి స్వతంత్రముగా చదవగలరా? ఒక కొత్త పద్యానికి "పదచ్ఛేదము" చెప్పగలరా? నా మాటలు అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు అనేరు కొందరు, గాని నా అనుభవమునుపట్టి నాకు వాస్తవముగా తోచిన సంగతులే వ్రాస్తున్నాను వేదము వేంకటరాయశాస్త్రిగారిని అడగండి, ఆయన నామాట కాదనరు చూడండి ఇప్పుడు గ్రంథకర్తలుగా పేరుపొందినవారు అనేకమంది ఎంత తంటాలుపడి గిజగిజ గింజుకొంటున్నారు కారు వారి తెలుగు పూర్వపు వ్యాకరణ సూత్రములను అనుసరించి ఉన్నదని భ్రమపడుతున్నారుగాని దోషములు ఎన్నో ఉన్నవి ఇప్పటి గ్రంథములలో నిర్దుష్టమైనది, ఒకటి అయినా నాకు కనబడలేదు మధ్యకవులు, ఆధునిక కవులు వ్రాసిన కావ్యములలోనే అనేకమయినవాటిలో లక్షణ విరుద్ధములయిన ప్రయోగములు ఉన్నవి అని రాయబహద్దరు వీరేశలింగముపంతులుగారే విమర్శించి చెప్పినారు ఆ పంతులు వారి గ్రంథములలోనూ ఉన్నవి కొన్ని పూర్వ లక్షణాలకు విరుద్ధమైన ప్రయోగములు ఇంతమందికి ప్రమాదము కలగడానికి కారణము ఏమిటంటే బాగా పరిచయముగల స్వభాషలో గ్రంథములు వ్రాయక పరిచయము లేనట్టిదిన్ని, పాణిని వ్యాకరణమువంటి విపులమయిన లక్షణము లేనట్టిదిన్ని, పూర్వకవుల కావ్యములే శరణగా గలదిన్ని, అయిన ఒక కృత్రిమ భాషలో వ్రాయడమేను స్వభాషలో వ్రాయడము స్వగ్రామములోను, స్వగృహములోను తిరుగడమువంటిది గదా బొంబాయివంటి పెద్ద పట్నములో కొంతకాలము కాపురమున్న తర్వాతకూడా, మన వ్యవహారముతో సంబంధించిన స్థలములతో మాత్రము పరిచయము కలగవచ్చునుగాని, తక్కిన భాగములు కొత్తగానే ఉంటవి మాపుగాని, ప్లానుగాని పట్టుకొనిచూస్తే ఎలాగురూ గొప్పవనుకొనే స్థలములు మాత్రము పోల్చుకొవచ్చును, గాని తక్కినవి లన్ని తెలియవు వ్యాకరణము ప్లానువంటిది నిఘంటువు పట్నములోని వస్తువుల పట్టీవంటిది ప్లానూ, పట్టీ, పట్నము స్వరూపము తెలియచేసినా పట్నములో కాపురముండి నాలుగు మూలలా తిరిగేవారు వ్యవహరించినట్లు స్వేచ్ఛగా స్వతంత్రించి లోవతప్పకుండా కొత్తవాళ్ళు తిరగిలేరుగదా?

అట్లే భాషలో మనోభావములు వ్యక్తపరచడము కూడాను 'నాకు ఆకలి వేస్తున్నది', 'నాకు ఆకలి అవుతున్నది', 'నాకు ఆకలిగా ఉన్నది' అనే వాక్యములు వాడుకలో ఉన్నవి అందరమూ వాడగలము 'నాకు ఆకలి గదిరినది', 'నాకు ఆకలి వొడమినది', 'నే సక్షుత్పీడితుండను'—అనే వాక్యములు చెవులకు కొత్త 'నాకు ఆకలి వేస్తున్నది' అనడానికి మారుగా 'నాకు ఆకలి వైచుచున్నది' అని ప్రయోగించడము హాస్యాస్పదముగా ఉంటుంది ఏ గ్రంథములలోనూ అట్టి ప్రయోగములు కనబడవు అట్టివి కల్పించి వాడినందుచేత నైజధర్మము చెడి భాష కృత్రిమమైనది అవుతుంది కర్రబొమ్మకూ జీవములో ఉన్న మనిషికీ ఎంత భేదమో అంత భేదముంటుంది అట్టి కృత్రిమభాషకున్నూ, వాడుకలో ఉన్న భాషకున్నూ కంటి చూపులో కనబడేటట్లు నోటిమాటలో వినబడవలెను మనోభావము

ఎంతో శ్రమపడితేనేగాని కృత్రిమభాష పట్టుపడదు పోనీ, ఇంత శ్రమపడి నేర్చుకుంటే, లాభమేమైన ఉన్నదా? ఈకృత్రిమభాష లోకవ్యవహారములో ఎవరైనా మాట్లాడుతున్నారా? లేదు సభలలో వాడుతారా? లేదు కోర్టులలో ప్లీడర్లు ఈ భాషలో వాదప్రతివాదములు చేస్తారా? లేదు అసెసర్లకు అడ్రెస్ ఈ భాషలో ఇస్తారా? లేదు జడ్జీలు మునసబులు ఈ భాషలో విమర్శ చేస్తారా? లేదు తీర్పులుకాని రాజీనామాలుగాని ఈ భాషలో వ్రాస్తారా? లేదు బడిలో మాస్టర్లు పాఠాలు బోధపరిచినప్పుడు ఈ భాష వాడుతారా? లేదు పౌరాణికులు ఈ భాషలో పురాణములకు అర్థము చెప్పుతారా? లేదు గనుక ఈ భాషలో పాండిత్యము లోక వ్యవహారానికి ఎందుకూ బనికిరాదు పండితులకే అది ప్రయోగించడములో ప్రమాదము సంభవిస్తూవుంటే, సాధారణులు ఈ భాషనేర్చి కంపోజిషన్, కవిత్వము కూర్చగలరా? ఇంత దుస్సాధ్యమైనభాషను ప్రతి తెలుగు పిల్లవాణ్ణి నేర్చుకొమ్మని బలవంత పెట్టడముచేతను, అందులో వ్రాసిన పుస్తకములే చదువమనడముచేతను, ప్రజలలో విద్య వ్యాపించడములేదు ప్రైమరీ స్కూళ్లలో మాస్టర్లకే కాదు, హైస్కూళు కాలేజీలలోఉన్న మాస్టర్లకైనా ఈ గ్రాంధిక తెలుగు రానప్పుడు వారివద్ద చదువుకొనే పిల్లలకు ఆ భాష ఎట్లు వచ్చేను? ఇంగ్లీషు కథల పుస్తకము కులాసాగా చదువురాడుగాని విజయవిలాసము, మనుచరిత్రము ఎవ్వడూ ముట్టుకోడు తెలుగంటే అసహ్యము గదా! బాగా ఆలోచించండి దురభిమానము విడవండి నిజము కనుక్కోండి తెలుగు పుస్తకమంటే తెలుగు పిల్లలకే అసహ్యమెందుచేత? తొమ్మిదిఏళ్ళ ఈడుగల తెలుగు పిల్లలు నూరు ఇంగ్లీషు కథల పుస్తకాలు చదివినారు అతిశయోక్తి కాదు

అవిచ్ఛిన్నముగా సంప్రదాయానుసారము కవులు అందరూ నన్నయ కాలము మొదలుకొని నేటివరకూ వాడుకచేస్తూ వచ్చిన భాషను విడిచి, గ్రామ్యభాషను గ్రంథములు వ్రాయడము ఉచితముకాదని వాదించే వారి వాదములో అనేక దోషములున్నవి భాషమారదు అని వాదిస్తారా? ప్రత్యక్షముగా కనుపడుతున్నదానికి విరుద్ధము గదా! భాష మారకూడదని వాదిస్తారా? ఈ విధి ఎక్కడనున్నదో మొదట చెప్పవలెను వ్యాకరణము చదువుకుంటే భాష చక్కగా వస్తుందంటే అనుభవానికి విరుద్ధము ఏ దేశములో అయినా గొప్ప కవులు వైయాకరణులు కారు వ్యాకరణములోని సూత్రము ఒకటి అయినా రాకుండా చక్కగా వ్రాయగలవారు అనేకులున్నారు గ్రామ్యమనగా అధమజాతుల వాడుక ఇప్పటి ఉత్తమ జాతుల వాడుక గ్రామ్యము కాకూడదు ఒక వేళ గ్రామ్యమనగా పూర్వభాషా సంప్రదాయమునకు విరుద్ధము అయినది అంటే, నన్నయవాడుకకు భిన్నముగానున్న తిక్కన వాడుక, నన్నయ తిక్కనల వాడుకకు భిన్నముగా ఉన్న పెద్దన వాడుక, ఇట్లు పూర్వకవుల వాడుకకు భిన్నముగా ఉన్న తర్వాతి కవుల వాడుక గ్రామ్యమని చెప్పవలెను అప్పుడు గ్రామ్యమందు దోషమే ఉండదు మంచిగాని చెడ్డగాని ఔచిత్యముగాని అనౌచిత్యముగాని ఏ పదమునకూ శాశ్వతమైన లక్షణము కాదు ఒక ప్రదేశములోగాని, కాలములోగాని, అనుచితమైనది మరిఒక ప్రదేశములోగాని, కాలములోగాని, ఉచితమవును ఇది అన్ని భాషల చరిత్రములలోను కనబడుతున్నది మాటలకు గౌరవము ఆ మాటలు ఆడేవారిని బట్టి ఉంటుంది "సని" ఏమి పాపము చేసుకున్నది? "ఇల్లాలు" ఏమి పుణ్యము చేసుకొన్నది? "బూడు కుడుపు" ఎందుచేత గ్రామ్యమైనది? "మనుగుడుపు"కు అంత గౌరవమేం? కన్నెంకోసము కాటికిపోయినా, "కాటికిపోయినాడు" అనకూడదు గదా నెల్లూరిలో "బొక్క" అంటే తప్పులేదుగాని, ఉత్తరజిల్లాలలో అశ్లీలము ద్రౌపది నడిచినడిచి అలిసిపోయినప్పుడంటే, "అలసి


శ్రీ పరకాల మహాదేశికస్వామి సార్వభౌములవారు


కావలి వెంకటపతిరావుగారు


పి. వి. కృష్ణస్వామిశెట్టిగారు

శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలస్వామి సార్వభౌములవారు :—వీరు పూర్వాశ్రమమున మైసూరు రాజ్యమునకు జేరిన హొసదుర్గమున జన్మించిరి. వీరలు బాల్యమున శాస్త్రము నభ్యసించి, తమ విద్వద్గరిమచే నైజాము రాజ్యమున జేరిన వనపర్తి సంస్థానమునకు ఆస్థాన విద్వత్పదవిని బొందిరి. శ్రీ స్వాములవారికి వేదాంతాది శాస్త్ర ప్రతిభకు తోడు సాహిత్యమునందును, ఆంధ్రమందును, కన్నడమందును అపార పాండిత్యము గలదు. శ్రీవారలు ఇప్పటికి అలంకార మణిహారము శ్రీనివాస విలాసములను మొదలగు గొప్ప గ్రంథములను, హంస సందేశము, పాదుకా సహస్రము మొదలగువానికి గొప్ప వ్యాఖ్యానములు రచించి చిన్న చిన్న సంస్కృత, తెనుగు, కన్నడ గ్రంథములు లెక్కకు మీరినవి రచించిరి. శ్రీవారి కవితా ప్రౌఢిమ, వాక్య రచనయు అప్రతిహతము. వర్ణనాతీతము. శ్రీవారి కవిత్వమునకై పూర్వాశ్రమమున కవి గండభేరుండ, కవి రసన కంఠీరవ అను నిరుపమాన బిరుదములు బడసిరి. శాంత శమదమాది గుణ గరిష్ఠులగు నీ విద్వత్పుంగవులు గడచిన 25 సంవత్సరములపుడు శ్రీమాన్ మైసూరు మహారాజులవారికి ఆచార్యపీఠమగు శ్రీ బ్రహ్మతంత్ర పరకాల మఠమున సంయమి పదవి నలంకరించి శ్రీ మన్మహారాజులవారికి ఉపదేశ గురువు లయిరి. ఇప్పటికి శ్రీవారికి 75 వర్షములు గలవు. దేశమందంతటను గొప్పగా సన్మానింపబడుచున్నారు.

కావలి వేంకటపతిరావుగారు :—వీరు నియోగిబ్రాహ్మణులు. బి. ఎల్. పరీక్ష మొట్టమొదట చెన్నపురిలో బెట్టినప్పుడు కృతార్థులయిన వారిలో వేంకటపతిరావుగారొకరు. అత్యధిక మేధాశక్తిగల దేశాభిమాని. అయిదు సంవత్సరములు చెన్నపురి హైకోర్టులో న్యాయవాదిగా నుండి సుమారు నాలుగు లక్షల రూపాయ లార్జించెను. ఈయన 32 వ యేటనే—1812 వ సం. లో— మృతినొందియుండకున్నచో నాంధ్రులలో నత్యున్నత గౌరవము నొందవలసినవాడే. ఈయన యకాల మరణము ఆంధ్రులకు గొప్ప లోపమును గలిగించెను.

పి. వి. కృష్ణస్వామి శెట్టిగారు బి. ఏ. బి.ఎల్ :—ఈయన చెన్నపురిలో నను వైశ్య శిఖాణి. న్యాయవాదిగా నున్న దినములలో సగము అభియోగము లీయనకున్న మిగిలిన సగ మితర న్యాయవాదులకును వచ్చుచుండెడివి. అంత ధర్మశాస్త్రము పరిజ్ఞానము గలదు. చెన్నపురిలో వైశ్యులచే చేయబడిన అనేక ధర్మములకు సభాధి నాయకులుగా నున్నారు. శ్రీ కన్యకా పరమేశ్వరీ దానములను మంచి స్థితికి తెచ్చిన దీ మహనీయుడే. ఇప్పుడు వృత్తిని మానుకొని వయోతీతులగుటచే సుఖముగా కాలము గడుపుచున్నారు.

[ఈ ఛాయా చిత్రాలు 1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినవి. సం.]

---

నది, దానిని మోచికొని తెమ్ము'' అని ధర్మరాజు తమ్మునితో చెప్పినట్టు ఇపుడు ఎవడైనా ''ఆవిడను మోసుకొని తెచ్చినాడు'' అనవచ్చునా?

అయితే, వాడుకలో ఉన్నభాష ఒక్కలాగు ఉన్నదా? ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్కమాదిరి ఉంటుందే. అది అందరికీ తెలుస్తుందా? అని కొత్త తెలుగుకోసము కొట్టుకొనేవారిని కొందరు ఆక్షేపిస్తున్నారు. గ్రాంధికభాష మాత్రము ఒక్కమాదిరిని ఉన్నదా? చూడండి. 1.సంధి విషయములో కొన్నిచోట్ల బహుళమటు, కొన్నిచోట్ల వైకల్పికమటు, కొన్నిచోట్ల తరచటు. 2. సరళాదేశము పండితుల ఇష్టము. విహితముకాదు. వాడు సూ (చూ)చె. వాడు వో (పో)యె. 3. ఉయ్యెల మొ. రమారమీ పది భిన్న రూపములు, ఒకరిత మొ. రమారమీ అరవై; తెప్ప, తేప మొ. వాటికి ఎన్నిటికో రెండేసి ఉన్నవి రూపములు. 4. బహువచన రూపములు అనేక రీతులు; కొడవండ్లు మొ. 5. ద్వితీయా విభక్తి రూపములు. ఉ. కంసునిన్, కంసునిఁ, కంసుని, కంసున్, కంసుఁ, కంసుం! చతుర్థి విభక్తి ప్రత్యయములు కి, కిన్. 6. వర్తమానకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మకాలము అన్నీ ఒక్కటే. 7. నన్ను నలిగి, నాపై నలిగి అని సకర్మక అకర్మమక అర్థములు. 8. ప్రేలును—ప్రేలాడును అని అనుబంధము కలిగిగాని లేక గాని. 9. అనియెను, అనెను, అనితిని, అంటిని.10.ప్రతిమాటకు అర్థభేద లేని పర్యాయ పదములు అనేకములు. 11. ఒకే మాటకు అనేక అర్థములు. 12. శబ్దపల్లవములు—ఇటువంటి వ్యత్యాసములు ఎన్నో ఉన్నవే గ్రాంధిక భాషలో! వీటిలో పదోవంతు అయినా ఉండునా ఈ కాలపు నాగరికుల తెలుగు భాషలో భేదములు? పోనీ, తక్కువకాదు, ఎక్కువే ఉన్నది వ్యత్యాసము అని ఒప్పుకొన్నా లోక వ్యవహారములో ఉండి, నోటను పలుకుతూ, చెవికి వినబడుతూ ఉన్న భాష ఏదైనా గ్రహించడము, మాటలాడడము బహుసులభము. బరంపురములో తెలుగు పిల్లలు ఓఢ్రము మాట్లాడగలరు. చెన్నపట్నములో అరవలకు తెలుగు వస్తుంది. బళ్ళారిలో తెలుగులకు కన్నడము వస్తుంది. అందరికి ఇంగ్లీషు వస్తుంది. ఆలాగునే గుంటూరు తెలుగువారు, కర్నూలు తెలుగులో భిన్నరూపము వాడుకలోఉంటే, నేర్చుకొంటారు. నేర్చుకొంటున్నారు. బొత్తిగా ఒకరిమాట ఒకరికి తెలియనంత వ్యత్యాసము ఉన్నదా గుంటూరి తెలుగుకూ, కర్నూలు తెలుగుకూ? ఉంటే ఇక్కడివారు అక్కడా, అక్కడివారు ఇక్కడా ఉద్యోగాలు చేస్తున్నారుగదా ఏలాగు కార్యాలు నిర్వహించుకొని వస్తున్నారండీ? నా అనుభవాన్నిపట్టిచూస్తే తెలుగుదేశమంతటా చదువు నేర్చినవారందరూ మాట్లాడేభాష ఇంచుమించుగా ఒకటేభాష. దిగువ జాతులవారికి చాలామందికి ఈ భాష వాడుకభాష కాకపోయినా, బాగా తెలుస్తుంది. ఇది సులభముగా మాటలాడడము నేర్చుకోగలరు. నేర్చుకుంటున్నారు కూడా. గొప్పవారిళ్లలో నౌకర్లుగా ఉన్నవాళ్ళ- చాలామంది తమ యాజమానులు మాట్లాడినట్టే మాటలాడుతున్నారు. ప్లీడర్లవద్దకు తరుచుగా వెళ్లే క్లైయంట్లు నాగరికభాష మాట లాడడము అలవాటు చేసుకొంటున్నారు. ఇట్లే ఆఫీసులలోను, కోర్టులలోను, దేవుడిగుళ్ళవద్ద, బజారులోను, మీటింగులలోను, అన్ని జిల్లాల తెలుగు మాటలు అన్ని జాతుల తెలుగు మాటలు కలిసి సాపెక్కుతున్నవి. ఉత్తమజాతుల వాడుకభాషకు గౌరవము సహజము. గనుక అది వ్యాపిస్తున్నది. భేదా లుంటేనేమి? రైల్‌బండిలో అరిగిపోతున్నవి ఎగుడు దిగుళ్లు అన్నీ. ఇదే కొత్త తెలుగు నేటి తేట తెలుగు; వ్రాస్తూఉన్న నా తెలుగు; చదువుతూఉన్న మీ తెలుగు.

తేటతెలుగుభాష అన్ని విధములా యోగ్యమైనది. అందరికీ సాధ్యమైనది. మాదిగ వెంకడు మొదలుకొని వెంకటావధానులవరకున్ను వెయ్యింటికి 75 గురు మాత్రమే ఓనమాలు వచ్చినవా రున్నప్పుడు గ్రాంధికభాష వచ్చినవారు 5 గురైనా ఉందురో, ఉండరో! అయితే నాగరికుల తెలుగు, తేటతెలుగు లోక వ్యవహారములలో ఇప్పుడు వాడుతూ ఉన్నవారే వెయ్యింటికి అధమపక్షము నూరుగురైనా ఉంటారు. అది తెలుసుకో గలిగిన వారు వెయ్యింట మున్నూరుగురైనా ఉంటారు. క్రమ క్రమముగా వాడుక ఎక్కువయి అంతకంతకు దిగువ జాతులకు అది వ్యాపిస్తుంది. ఈ తేటతెలుగులో తెలివి కలిగించే విద్య అందరికీ సర్వసాధారణముగా చెప్పితే సరస్వతి తెలుగుదేశములో తాండవమాడదా? కొద్దికాలములోనే తక్కిన దేశములతోపాటు మన తెలుగుదేశము

కూడా నాగరికము కాదా?

ఎవరికీ సాధ్యముకాని, పసలేని పాత తెలుగులోనే అభిప్రాయాలు వ్యక్తపరచవలెనన్న పిచ్చి ప్రయత్నాలు చేస్తూ ఉండబట్టి భాషకు ఏ విధమైన అభివృద్ధి లేకుండా ఉన్నది; గాని మనకు సులువుగా బోధపడుతూవున్న మన తెలుగునే ఆదరించిన ఎడల ఎంత ఉపచరిస్తుందో చూడండి. ఇండస్ట్రియల్ రిఫార్మర్లు, పొలిటికల్ రిఫార్మర్లు, సానిటరీ రిఫార్మర్లు, అగ్రికల్చరల్ రిఫార్మర్లు, ఎడ్యుకేషనల్ రిఫార్మర్లు, లిటరరీ రిఫార్మర్లు, ఈ తేట తెలుగున లెక్చర్లు నోటను ఫెళ్లుమని ఉరిమించవచ్చును గదా. పొంపట్లు పుస్తకాలు కురిపించవచ్చును గదా. విద్యలు పారించవచ్చును గదా. తెలుగువారి బుద్ధి సారవంతమై ఎట్టి పంట పండునో ఎవరు చెప్పగలరు?

పండితులారా! మీ దురభిమానము విడిచిపెట్టండి. దేశమంతా విద్య కావలెనని మొర పెట్టుకొంటూ ఉన్నది. సులభముగా వచ్చే తేట తెలుగులోనే విద్య నేర్పడము సులభమైనప్పుడు పాత భాష నేర్చుకొంటేనేగాని విద్య సంపాదించడానికి వల్లకాదు అని మీ రెందుకు అడ్డు పెట్టుతారు. మీరు గ్రామ్యులు కారుగదా? మీ నోటను వచ్చేమాట అశ్లీలము కాదు గదా! మీరు నిత్యమూ వాడుకొనే భాష శంఖములో పోసిన తీర్థమువంటిది. అదే అందరికి ఇచ్చి ఉద్ధరించరాదా?

---



బొంబాయిలోని తెలుగు విద్యానిధికి కార్యనిర్వాహక సభ్యులు :— ఈ నిధి 1909 లో స్థాపింపబడినది. 25,000 రూ. లు మూలధనమున్నది. బొంబాయిలో నొక భాగమగు కామాటి పురమందున్న తెలుగువారిలో ధనాఢ్యులీ ధనమును వారి జాతివారి యొక్క బిడ్డల చదువుకయి దాన మొసంగిరి. ఈ పాఠశాలలోను మహారాష్ట్ర భాషయేగాని తెలుగు చెప్పబడుటలేదు.

నామములు : (ఎడమప్రక్క నుండి కుడి ప్రక్కకు జదువవలయును) నేలమీద కూర్చున్నవారు—విఠోబ కె. పిపల, రాజారాం సి. కుమార్, షంకర్ ఆర్. జిల్కర్ (ఆనరరి సెక్రటరి), డాక్టర్ గంగారాం ఇ. గంధం.

కుర్చీమీద కూర్చున్నవారు :—ఉప్పు శాయన్న, రాజు బాబాజి, షివాజి ఎల్. జయ (ఆడిటర్), రావుబహదూర్ ఎల్లప్ప బాలారాం (ప్రెసిడెంటు), శంభాజీ మల్హాజీ గంగ్లె (ట్రెజరర్), మాధవరావు మహాదేవ ఖండ్రె, రావుసాహెబ్ మానాజీ రాజూజీ (వైస్ ప్రెసిడెంటు), శాయాజీ నాగూజీ (వైస్ ప్రెసిడెంటు) గారలు.

నిలుచున్నవారు :—గణపతిరావు గంటూర్, రామయ్య ఎల్. కోల్‌పేక్ (ఆడిటర్), ప్రభాజీ ఎస్. నాథి, లింగు ఎన్. ఘంట, షంకర్ ఎస్. పర్షా, లక్ష్మణరావు వి. కాలేవర్, డాక్టరు వి. జి. అకూలా, అబ్బాజి, శాయన్న పానడె, షంకర్ ఎస్. గంగ్లె (ఆనరరీ సెక్రటరి), వెంకటరావు ఎస్. కోడెల్, శాయన్న శాంతిజాకు గార్లు.

[ఈ ఛాయా చిత్రం 1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలో ప్రకటించబడినది. సం.]

# స్త్రీలకు గావలసిన విద్య

కొండ వెంకటప్పయ్య పంతులుగారు బి. ఏ; బి. ఎల్.

[ 1913 ప్రమాదీచ సంవత్సరాదిసంచికనుండి ]

శిల్పకారుని హస్తలాఘవమునంజేసి మొండిగా నుండు బండయైనను జగన్మోహనాకృతి వహించినట్లును, కొరగాని గులకరాయిగా గనుపించు శిలావిశేషము సానబట్టుటచేత వజ్రమయ తేజఃపుంజంబు విడంబించినట్లును, తొలుత నేమియు దెలియని ప్రాకృత జనుండయినను విద్యాప్రభావమువలన మహాపురుషుండగుచున్నాడు అందుచే బుద్ధి ప్రకాశించుటకు విద్య యావశ్యకమని స్పష్టమగుచున్నది అట్టి బుద్ధి పురుషులకువలెనే స్త్రీలకును సామాన్యమగుట ఎరింగి స్త్రీలకును విద్య గరపుట యవసరమని మనదేశమున నిప్పుడనేకు లంగీకరించుచున్నారు కాని యీ మత మింకను సర్వజన సమ్మతము కాదయ్యెను

పూర్వము లోకమునం దన్నిదేశములలోపల విద్యలయందు ముందంజ వేసిన ఈ భరతఖండమున స్త్రీలకు విద్యనేర్పుట యనావశ్యకమును అనర్థదాయకమును అని దలంచెడివార లుండుటెంతయు విస్మయమును విషాదమును గల్పించుచున్నది గత కాలమునందు ప్రజాభిమానములేని పరరాజుల దండయాత్రలకు లోనయి స్వతంత్రములను గోలుపోయి పరతంత్రులుగా మనుచుండిన జనులకు బుద్ధులు వెనుకబోవుటయు వారి విశాల హృదయంబులు హ్రస్వంబులగుటయు సహజము

ప్రాక్తనులగు మహర్షి యుగములలో స్త్రీలు విద్యా వైదుష్యము సముపార్జించి పేరోలగంబులందు సయితము తమ పాండిత్యము ప్రదర్శించిరని తెలియుచున్నది జనక చక్రవర్తి యెదుట విద్యా విశారదులగు మహామునులమధ్య వేదాంత విద్యాకోవిదుండును బ్రహ్మిష్ఠుడునగు యాజ్ఞవల్క్యునితోడ గార్గేయియను యోషిద్రత్నము వేదాంత ప్రసంగము సల్పెనను బృహదారణ్య కథ యొక గొప్ప నిదర్శనము ఆదిశంకరులకును మండన మిశ్రునకును జరిగిన మత సిద్ధాంత వివాదములందు జైమినియు వేదవ్యాసులును ఒల్లని మాధ్యస్థమును భర్తాజ్ఞబడసి మండనమిశ్రుని భార్య యుభయ భారతి యనునామె వహించెనను శంకర విజయగాథయును నొక రీతి దృష్టాంతమే మరియును కాళిదాసాది మహా కవికృత గ్రంథములందు శ్లోకరచనా చమత్కృతియు, చిత్రలేఖనా నైపుణ్యమును నీతిబోధనా సామర్థ్యమునుగల యువతులు వర్ణింపబడి యుండుటచేత స్త్రీలకు విద్యాభ్యాసము ఆకాలమున నరిది గాదని తోచెడివి

క్రీస్తు శ 8 వ శతాబ్ద ప్రాంతమున రచియింపబడిన రాజశేఖర సూక్తిముక్తావళి వల్లభదేవ సుభాషితావళి మొదలగు గ్రంథములందు మోరక విజ్జిక * మొదలగు సీమంతినులచే లిఖియింపబడిన శ్లోకము లుదాహృతములయియున్నవి ధనదదేవుని శార్ఙ్గధరపద్ధతియందు—

శీలా విజ్జా మారులా మోరికాద్యా
కావ్యం కర్తుం సంతి విజ్ఞా స్త్రియోపి,
విద్యాం వేత్తుం వాదినో నిర్విజేతుం
విశ్వం వక్తుం య ప్రవీణ స వంద్య

అని వ్రాసియుండుటచేత ఆ దినములలో కావ్య కర్తృక సామర్థ్యముగల ప్రసిద్ధ స్త్రీలుండిరనియు వారు గౌరవపాత్రులుగా నెంచబడుచుండిరనియును స్పష్టమగుచున్నది

క్రీస్తు శ 12 వ శతాబ్దమునాటి భోజచరిత్రయందు విద్వత్కుటుంబ స్త్రీలును మాఘపత్నియును సమస్యా పూరణమున నుడివిన శ్లోకములు గన్పట్టుచున్నవి పూర్వులగు నాంధ్రయువతులలో రుద్రమదేవి రాజ్యభారము వహించెను నాయకురాలు అశ్వారూఢయై రణరంగమున నిలిచి తన సేనల పురిగొల్పుచు శత్రువీరుల నెదిర్చెను కుమ్మరి మొల్లయును తరిగొండ వెంగమయును కవిత్వము నుడివిరి కీర్తిశేషురాలైన శ్రీ బండారు అచ్చమాంబగారు రచియించిన అబలాసచ్చరిత్రయందు విద్యావతులును, గుణవతులును, ధైర్యవతులును, యశోపేతులునగు హిందూసుందరీమణు లనేకులు పేర్కొనబడి యున్నారు

కాబట్టి పూర్వకాలమున మనదేశమున స్త్రీలు విద్యా స్వాతంత్ర్యము కలిగియే యుండిరనియును కాలక్రమమున దేశమునం గలిగిన యుపప్లవములవలన నయ్యది యంతరించెననియును స్పష్టమగుచున్నది

ఈకాలమున అన్యదేశపు స్త్రీలు విద్యాబుద్ధులందు దేరి స్వకుటుంబ పాలన సమర్థత వహించి సంఘోపకర్తలుగా నుండుటయును ఒకానొక హిందూసుందరియును విద్యా వైదుష్యము సంపాదించి కీర్తిమతియగుటయును తెలిసికొని కొందరు మన వారిప్పుడిపుడు స్త్రీలు విద్యాభ్యాసమువలన ప్రయోజకురాండ్రు కాగలరని నమ్ముచున్నారు కాని స్త్రీలకు విద్య నేర్పుట యుక్తమనెడి వారయినను స్త్రీ లభ్యసింపవలసిన విద్యావిషయములంగూర్చి భిన్నాభిప్రాయులై గా నున్నారు

కొందఱు తెలుగుభాష చదువను వ్రాయను నేర్చిన చాలు నందురు మరికొందఱు సంస్కృతాభ్యాసము చేయుట యుక్తమండ్రు ఇంకను కొందఱు ఆంగ్లేయ భాష నభ్యసించు టావశ్యకమందురు కాని స్త్రీ లేయే భాష లభ్యసింపవలయునో ఏ యే శాస్త్రములు చదువవలయునో ఏ యే విషయములందు వారలకు జ్ఞాన మావశ్యకమో నిర్ణయించుట సుకరము కాదు బుద్ధివైశద్యమాలోచించినయెడల స్త్రీలు పురుషులకు వెనుకబడువారుకారు. స్త్రీలలో కవులును, గణితశాస్త్ర ప్రవీణులును, వైద్య విద్యా విశారదలును, రాజ్యపరిపాలనాసమర్థులును కలరు ఇకను ధైర్యము, పట్టుదల, మొదలగు గుణంబు లెన్నితిమేని యుద్ధభూమునందు అమేయ పరాక్రమము జూపిన యువతులు గలరు ఇట్లు వివిధ విద్యా విషయ సామర్థ్యములందు ప్రవీణలగువారు తమ జీవితములవలన హిందూదేశ పూర్వ చారిత్రమును అన్యదేశపు చరితలను అలంకరించిరని చరిత్ర పరిచయము గలవారెల్లరకును విశదమే

మానవులకు పుట్టుకతోడనే యుత్పన్నములయిన మనోవృత్తి బీజాంకురములు కొనలు సాగినకొలది ఆవరణ బలమువలన క్రమముగనో నక్రమముగనో పెరిగి స్వభావ చేష్టలకు కారణభూతము లగుచున్నవి మనోవృత్తులు సుశిక్షితములయిన యెడల సుశీలమున యోగ్యప్రవర్తనయు ప్రాదుర్భవించును అట్లుగానిచో దుర్మార్గమునకు బాలుపడును. స్త్రీలకును పురుషులకువలెనే మనోవృత్తుల శిక్షా విశేషంబునంజేసి గుణ విశేషంబులు కల్గుచున్నవి కావున వారలకు విద్యా ప్రయోజనములును శిక్షావిధి ననుసరించియే యుండుననుట స్పష్టము కావున విద్యవలన దొసగు పొసగుననుట వెఱ్ఱి మంచి చురుకుదనమును దిట్టతనమును గలిగిన స్త్రీలు సద్గుణముగలవారయ్యెనేని ఎంతటి విద్యలయిన నేర్వగలరు ఎంతటి మహత్కార్యములయిన సాధింపగలరు

విద్యమానమగు ప్రపంచమునందు స్త్రీ పురుష జీవితాదర్శములలో వ్యత్యయము విమర్శించి తదాదర్శ పోషకములగు విద్యలు ముఖ్యముగా గఱపవలయును స్త్రీలకందఱకు ఒకపాటి లోక విజ్ఞాన మావశ్యము గావున నట్టి తెలివిని గలిగించు శాస్త్ర విషయము లభ్యసించుట ముఖ్యము

నిత్యము ఇంద్రియ గోచరమగుచు జీవితముతోడ నిరంతర సంబంధముగల భౌతిక విషయములు జ్ఞానేంద్రియముగల స్త్రీలకును పురుషులకును విమర్శనీయములే అట్టి జ్ఞానములేనివారలు పురుషులైనను స్త్రీలైనను కేవలము పశుప్రాయులనుటకు సంశయములేదు కూపస్థ మండూకములుగా నుండక విశాలమగు నీ విశ్వమునుగూర్చి యొకపాటి జ్ఞానము గలుగుటకు భూగోళ ఖగోళముల స్వరూపము లించుకయైన నెఱుంగవలయును తమ వంశమునందలి పూర్వుల చరితంబు లెఱింగినట్లు తమ దేశ చరిత్రను గూడ కొంతవఱకైన తెలిసియుంబడుట యవసరము. ఇంతటి సామాన్య జ్ఞానము స్త్రీల కందఱకు నత్యావశ్యకము

మఱియును మనదేశమున స్త్రీలు వివాహితలయి గృహిణులుగా నుండవలసిన వారగుటచేత గృహ పరిపాలనా విధులును, ఆరోగ్యశాస్త్రమును, శిశుపోషణ క్రమమును, బాల శిక్షా పద్ధతులను, పాకశాస్త్రమును, గృహోపాంత వన నిర్మాణ రీతులును చక్కగా నేర్చియుండవలయును.

---

*విజ్జిక రచియించిన శ్లోకము.

కవే రభిప్రాయ మశబ్దగోచరం
స్ఫురంత మార్ద్రేషు పదేషు కేవలం,
వదద్భి రంగైః కృతరోమ విక్రియై
ర్జనస్య తూష్ణీం భవతో యమంజలి.



ఎడింబరోలోని ఆంధ్ర విద్యార్థులు :— వీ రందరును వివిధ విద్యల నార్జించుటకయి గ్రేటు బ్రిటనుకు వెళ్లియున్నారు. ఇంతమంది యాంధ్రుల నొక్కచోట సమకూర్చి తీయబడిన ప్రథమ చిత్రపట మిదియే. ఈ యాంధ్రపత్రిక సంచికకయి మా ప్రతినిధి ఈ పటమును బంపియున్నారు.

నామములు :—(ఎడమప్రక్క నుండి కుడిప్రక్కకు జదువవలయును.) పి. వి. రమణమూర్తి, సి. వి. ధర్మారావు, డి. లక్ష్మణస్వామి, కె. గోపాలరావు, సి. వేంకటరావు, కోన సీతారామరావు, బి. పి. బాలకృష్ణ నాయుడు, ఎన్. వి. ఎల్. నరసింహారావు, ఎస్. జగన్నాథరావు, సి. కృష్ణారెడ్డి, ఎం. వి. కృష్ణారావు, రాజాఎం. వి. ఎస్. చలపతిరావు, జి. వి. కృష్ణారావు, పి. హెచ్. రామిరెడ్డి, ఎం. రామస్వామి, ఎం. రామచంద్రరావు, డి. గోపాలకృష్ణయ్య, సత్యనారాయణరావు, టంగుటూరి జానకిరామయ్య, బి. ఎన్. విజయదేవ, బి. సూర్యనారాయణ శెట్టి బి. ఎ., వి. కె. ఎం. కృష్ణన్, సి. ఎస్. భాస్కర్, ఎం. నారాయణరావు.

[ఈ ఛాయాచిత్రం 1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలో ప్రచురించినది. సం.]

---

నీతియును దైవభక్తియును స్త్రీలకు అవసరములే గావున నీతిబోధకములగు గ్రంథములును మతవిషయక గ్రంథములును కొన్ని చదివి గ్రహించుటయేగాక పావనులగువారల చరిత్రలును తెలిసికొనవలయును.

అంగనలకు సహజోత్పన్నములగు మార్దవ సౌకుమార్యాది గుణ విశేషంబులను వ్యక్తీకరింపదగిన విద్యలు నభిమాన విద్యలుగా నవలంబించుట యుక్తము. స్త్రీలు సామాన్యముగ కంఠస్వారస్యము మాత్రమే గాక భావప్రకాశమునందును సహజ సామర్థ్యము కలవారగుటచేత సంగీతము నభ్యసించుటవలన హృద్యముగను భక్తిరస ప్రధానముగను గానముచేసి ఆనందము కల్గింప జాలుదురు. అటులనే చిత్రలేఖన నైపుణ్యమును వారు సంపాదింపదగినదే. దయయును, సహనమును, ఆదరణయును వారలకు నుగ్గుతో పోసినవగుటచేత వైద్యవిద్య నేర్చి ఔషధ సేవనము పథ్యపానములను సమయానుకూలముగ నొసంగి రోగపీడితులగువారిని కాపాడు పోషణక్రమము నెరుంగుట మిక్కిలి యుక్తము. మన దేశమున స్త్రీలు పురుష వైద్యులకు తమ వ్యాధులను వెల్లడించుటకు నమ్మతింపక మానుషమునకై క్రూరవ్యాధుల పాలబడి తమ సౌఖ్యమును ప్రాణములను గోలుపోవు చున్నారు. బంగాళా దేశమునందు కొందరు స్త్రీలు ఐరోపా మొదలగు దేశములందు వైద్యశాస్త్రము నభ్యసించి తమతోడి యువతులకు చికిత్సలు జేయుచున్నారు. అటి వైద్యవిద్యాభ్యాసమువలన స్త్రీలు మితిలేని మేలుచేసిన వారగుదురు.

మరియును బాలికా పాఠశాలలో స్త్రీలు ఉపాధ్యాయినులుగా నుండుట యవసరము. మగ పిల్లలకును ఆడుబిడ్డలకును స్త్రీలు ఉపాధ్యాయినులుగా నుండుటవలన విద్య బాగుగా నబ్బును. జపానుదేశమునందు బాలికలకును కొంతవఱకు బాలురకును స్త్రీలే యుపాధ్యాయినులుగా నుండుటవలన ఆ దేశమున విద్య శీఘ్రకాలములో నభివృద్ధి చెందినది. ఉపాధ్యాయినులుగా నుండుటకు ఉపాధ్యాయశిక్షా శాలలలో పరీక్షలయందు తేరినవారు కావలయును. కావున కొందరు యువతులు అట్టి శిక్షాలయములందు బోధనా విధులను నేర్వవలయును.

ప్రస్తుతమున స్త్రీ విద్యాభిమానులగు వారుపట్టణములలో క్రైస్తవమతావలంబికలగు పాశ్చాత్య వనితలచేత తమ గృహములం దాడువారలకు విద్యాభ్యాసము చేయించుచున్నారు. మతాంతరులతోడ సంపర్గము వలదని కొందరట్టి ఏర్పాటు లంగీకరించుటలేదు. కావున స్వదేశ స్త్రీలే విద్యాబోధకులుగా నేర్పడి ఇండ్లలో స్త్రీలకు విద్య గరపుటకు బూనిన యెడల నిరాక్షేపణగ నట్టి విద్యా వ్యాపకమార్గములు విరివిగా సాగగలవు.

ఆంధ్ర భాష మాతృభాషయగుటచేతను సంస్కృతభాష మహోన్నతమగు నార్యభాషగానుండి యనేక యుద్గ్రంథములు గలిగి మన పూర్వుల సుజ్ఞానమున కాలవాలముగా నుండుటచేతను ఆంగ్లేయ భాష రాజభాషగానుండుటయేగాక ఆధునిక విజ్ఞానము బడయుటకు ముఖ్యసాధనముగా నుండుటచేతను మన యాంధ్రుల కెల్లరకును ఈ మూడు భాషలు అభ్యసనీయములే కావున వారి వారి సామర్థ్యము కొలది వారికి వలనగు భాషల జదువవలయును.

మన సంఘమున బాలికలు పిన్నవయస్సునందే సామాన్యముగ వివాహితలగుచుంటచేత వివాహానంతరము కొలది కాలములోపలనే పాఠశాలల వదలుచుండుట వలనను అటుపిమ్మట వారికి విద్యా వ్యాసంగమున కవకాశము లేకుండుటచేతను యువతులగువారు చదువుకొనుటకు దగిన విద్యాశాలలు లేమింజేసియు ప్రస్తుతము స్త్రీల విద్య మిక్కిలి హైన్యదశలో నున్నది.

1911 వ సంవత్సరములో నడచిన జనసంఖ్య లెక్కలవలన చెనపురి రాజధానిలోరిన తెలుగుజిల్లాలలో నుండు స్త్రీలలో 100 కి నొక్కరు మాత్రమే చదువుకొనినవారు కనుపడుచున్నారు. బడికిపోవు నీడుగల పిన్నవారలలో గంజాము, విశాఖపట్టణము, బళ్ళారి, అనంతపురము జిల్లాలలో 100 కి మువ్వురు మాత్రము గలరు. కడపలో నూర్గురికి నలువురును, కర్నూలు, నెల్లూరు మండలములలో నయిదుగురును, కృష్ణామండలమునందు పదునొకండ్రు చొప్పునను నున్నారు. తెలుగు జిల్లాలన్నిటిలో సెకండరి పాఠశాలలు బాలికల నిమిత్త మేర్పడినవి అయిదు మాత్రమే. కావున మిక్కిలి కొఱతబడియున్న స్త్రీ విద్య నభివృద్ధిచేయుటకై వయస్సు వచ్చినవారు సయితము నిరాక్షేపణగ విద్యాభ్యాసము చేయుటకు తగిన పాఠశాలలు నిర్మాణముచేసి యందు కేవలము ప్రాథమిక విద్యతో సరిపుచ్చక ఉన్నతవిద్య నేర్పుటకు తగిన యొనరు లేర్పరచవలయును. ఉన్నతములగు జాతీయాదర్శములతో నుత్తమములగు ఆధునిక విజ్ఞాన విశేషముల సందర్భానుసారముగ సమ్మేళనముజేయు విద్యాపద్ధతుల నవలంబించి లౌకిక పారమార్థిక

జ్ఞానము లభివృద్ధిజేసి ప్రజ్ఞావతులుగా జేయుటయేగాక సదాచారపరులుగను సంఘమునకు నుపకర్తలుగను జేయవలయును

స్త్రీలెప్పుడును పరభృతలుగానుండక స్వతంత్ర జీవనము చేయుటకు తగిన పరిశ్రామిక విద్యలు నేర్పవలయును

పాశ్చాత్యవిద్య లభ్యసించినను మనవారు పాశ్చాత్యుల జీవితాదర్శముల నాదరింపదగదు నవనాగరికత జెందిన పాశ్చాత్య దేశములవారు లౌకికాభివృద్ధియందు లక్ష్య మెక్కువయుంచి ధనద్రవ్యాదులకై కడలేనిపాట్లు పడుచుందురు. వారలలో తల్లి బిడ్డలకును, తండ్రి కొడుకులకులను, అన్నదమ్ములకును, అక్క చెల్లెండ్రకును ఆదరణ సౌహార్దంబులు మనయందువలె గాఢములు గావు వారలకు వివాహ సంబంధము కొన్ని సందర్భములందు విడగొట్టుకొనదగిన కట్టుబాటు అట్టి యాదర్శముల ఔన్నత్య లోపములవలన గాబోలు పట్టపరీక్షలందు తేరిన పాశ్చాత్య యువతులలో వివాహము మానివేయుపద్ధతి ప్రబలమగుచున్నది మహోన్నతములగు కార్యములసాధించుటకయి విద్యాదయితలగువారు పావనమును అనుపమానమునగు బ్రహ్మచర్యము వహించి వైవాహికస్థితి అంతరాయమని యెంచి దానిని విడనాడినను వందృ్యలే కాని కేవలము స్వచ్ఛందవృత్తి నభిలషించి సంసారము శృంఖలమను తలంపుతో నవి యొల్లక విద్యాప్రౌఢిమచేత స్వతంత్ర జీవనము స్వస్వాధీనము గదా యని విఱ్ఱవీగుచు నిరంతరము కన్యలుగా నుండుట శ్లాఘనీయముగాదు వివాహము జాత్యభివృద్ధిహేతువగుటంజేసి దానిని కేవలము స్వతంత్ర సౌఖ్యమునకయి విడనాడుట మానవజాతి నిర్మూలనంబునకు కారణమగు కావున అట్టి యభిప్రాయముల కెడమియ్యక మనదేశపు స్త్రీలేమి విద్యలు నేర్చినను పైని నుడివినట్లు మహోన్నత కార్యకలనంబులకై నిర్దుష్టముగ బ్రహ్మచర్యంబు బూనినప్పుడు దప్ప లేనియెడల వైవాహిక వృత్తి నిరసింపదగదు స్వచ్ఛమై, అవిచ్ఛిన్నమై, ఇహలోకవిధికి గూడ నతీతమయి, పరమపవిత్రమై, పతియే సర్వంబను నిశ్చయాత్మకబద్ధమయి, వర్ధిల్లు గాఢానురాగము చేత నిరంతరాత్మత్యాగ స్వరూపమగు ఆర్యగృహిణీ ధర్మము నేటికిని సర్వదేశముల వారికిని శ్లాఘాపాత్రముగ నుండుటకు హిందూ స్త్రీల దృఢవ్రతమె కారణము కావున అట్టి ధర్మము నెప్పటికిని కాపాడుదురు గాక!

మరియు దైవవిధింజేసి భర్తృవిహీనలైన యువతులు వేనవేలు మనదేశమునం గలరు వీరు అవివాహ నిష్ఠాబద్ధులై తమ జీవితములను బంధుగృహసేవనంబుల ధారబోయుచున్నారు అట్టివారలకు విద్యాధిక్యత కలుగజేసి విద్యాబోధకులుగ నుండుటకు నవకాశము కల్పించితిమేని అనతికాలములోపల మన దేశమున ప్రతిగృహమును సరస్వతీ సదనమును ఇందిరామందిరమునయి విలసిల్లును



బొంబాయి సాంకేతిక విద్యాలయములోని ఆంధ్ర విద్యార్థులు — వీరు బొంబాయిలోని విక్టోరియా టెక్నికల్ ఇన్‌స్టిట్యూటునందు కర్మ విద్యల నభ్యసించుచున్నారు వీరి నామములు —కూరుచున్నవారు (ఎడమప్రక్క నుండి కుడి ప్రక్కకు జి రంగారావు, వి హనుమంతరావు, జి రామమూర్తి, సి. హెచ్ మల్లిఖార్జునరావు. నిలబడి యున్నవారు — కె తిరుమలరావు, సి హెచ్ రంగారావు, సి వి నరసింహము గార్లు

[ఈ ఛాయాచిత్రం 1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలో ప్రచురించినది. సం]

# స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

ఇప్పుడు

## సేవింగ్స్ మరియు టరమ్ డిపాజిట్లు

మీద

## హెచ్చు రేట్లలో వడ్డీ యిస్తుంది



ఇతర వివరములకు

బ్యాంకు యొక్క 108 ఆఫీసులలో

దేనితో నైనా సంప్రదించండి.

**పి.సి.పి. కాఫీయొక్క ప్రాధాన్యతదినదినాభివృద్ధిగాంచుచున్నది.**

మరచిపోవద్దు! సువాసనగలఈఒక్క కాఫీ మాత్రమే

మనస్సును ఉత్తేజపరచును.

**పి.సి.పి** స్వచ్ఛమైన గుణమునకుగుర్తు

**పి.సి.పి** రుచియేప్రధానమైన పరీక్ష!

మించిపోయిన మరలరాదు తప్పిపోయినక్షణము మరలతిరిగిపొందలేరు.

**ప్లాంటర్సు కాఫీ ప్రాపగాండా** అరండల్‌పేట గుంటూరు-2.



మా

కాతాదార్లకు

శ్రేయోభిలాషులకు

హృదయపూర్వక

అభినందనలు!



# కీర్తిశేషులగు

# బెల్లముకొండ రామరాయ కవీంద్రులు

## [ఒక గుంటూరు మండల వాసి]

### [1914 ఆనంద సంవత్సరాదిసంచిక]

సీ. అనవరతాన్న విద్యా దానతృప్త విద్యార్థివిరాజద్గృహాంగణుండు
వ్యాకృతి తర్క వేదాంత మీమాంసాది రమణీయశాస్త్ర పారంగతుండు
సకల విద్వజ్జన స్తవనీయ విషయ విభాసితా ప్రతిమాన భాష్యకర్త
సరస సంస్కృత కావ్య చంపూముఖ శతాధిక గ్రంథ నిర్మాణ కలితయశుఁడు
విమత దుర్వాది కానన వీతిహోత్రుఁ డాత్మ విజ్ఞానవర్తి సత్యవ్రతుండు.
హొరి బెల్లముకొండ వంశాబ్ధి విధుఁడు రామరాయ కవీంద్రుండు ధీమహితుఁడు.

శ్రీ పండిత కవిచక్రవర్తి శా॥ శ 1797 వ సంవత్సరమునకు సరియగు (హూణశకము 1875) యువసంవత్సర మార్గశిర బహుళ అమావాస్యా సోమవారము రాత్రికటక లగ్నమున జనించెను గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాలోచేరిన పమిడిపాడు (ప్రైడిపాడు) వీరి జన్మభూమి తండ్రి మోహనరాయుఁడు తల్లి హనుమాయమ్మ ఋగ్వేది ఆశ్వలాయన సూత్రుఁడు వీరి పూర్వులు సుమారు 7, 8 తరములనుండి మంచి పాండిత్యము గలవారు వీరికి 3 అగ్రహారములును, పెక్కు గ్రామములందు మాన్యములును గలవు ఇవన్నియు పూర్వు లార్జించినవియే 7 వ యేట వీరికి పితృవియోగము తటస్థించెను బాల్యమునందు రాజకీయ విద్యయగు హూణభాషను కొంతవఱకుఁ జదివిరిగాని, వీరి మాతామహి మాత్ర మందుల కంగీకరింపక కుల క్రమాగతమగు పాండిత్యమున కంతరాయము వాటిల్లకుండ తమ మనుమనికి సంస్కృత విద్యను, వీరికి సమీపజ్ఞాతియగు బెల్లముకొండ సీతారామయ్యగారి దగ్గఱఁ జెప్పించెను బాల్యమునుండియు అసమాన ధారణాశక్తి కలిగియుండి ఒక్క పర్యాయము వినినదానిని వెంటనే మఱల వొప్పజెప్పుట మన రామారావుగారికి మంచినీళ్ల ప్రాయమై యుండెను ప్రథమమున రఘువంశ కావ్యమున 40 శ్లోకములను మాత్రము గురువులవా రన్వయించి బోధించిరి గాని తరువాత పంచకావ్యములను వారే స్వయముగ అన్వయించి అర్థమును చెప్పుచుండిరఁట 16 వ యేట నైషధము మురారి మున్నగు గ్రంథములను తామే స్వయముగ పఠించి విద్యార్థులకుఁ బాఠములు చెప్ప మొదలిడిరి 17 వ యేట వల్లభరాయస్తవము మున్నగు గ్రంథముల రచింప మొదలిడిరి 18 మంజరులుగల సముద్ర మథనమను చంపూకావ్య మా సంవత్సరమునందే రచించిరఁట 19 వ సం. వివాహమాయెను 20 వ యేట పురిఘళ్ల రామశాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రి యను సోదరులగు పండితుల తమ ఇంట నిల్పుకొని తర్కవ్యాకరణముల నభ్యసించిరి వేదాంతశాస్త్రమును తామే స్వయముగ నభ్యసించి శ్లోకరూపముగ ఉపనిషదర్థమును సంగ్రహించి వ్రాసిరి సిద్ధాంతకౌముదికి శరద్రాత్రి యను పేర విపులమయిన వ్యాఖ్యాన మొనర్చిరి ఆంధ్రులలో మాధవాచార్యుని తరువాత ఇట్టి సర్వతోముఖమగు పాండిత్య శక్తి కలిగి ఇన్ని గ్రంథములను రచించిన పండితకవి మఱొక్కఁడు పుట్టియుండలేదనుటయే వీరి మహిమను తెలుపఁగలదు



కీ॥ బెల్లముకొండ రామరాయ కవీంద్రులు

#### దినచర్య

వీరు సుమారు జాము ప్రొద్దుండుగా లేచి శరీర వ్యాయామ మొనర్చి 200 దండెములుతీసి ఊరి వెలుపలనుండు బావియందు చన్నీళ్లలో స్నానము చేయుచు కంఠదఘ్నమగు జలమునందు నిలుచుండి సహస్ర గాయత్రి జపించి బ్రహ్మయజ్ఞ మొనర్చి గృహంబునకు వచ్చి విద్యార్థులకు పాఠములుచెప్పి మఱల స్నాన మొనర్చి సహస్ర గాయత్రిని సలిపి విద్యార్థులతోపాటు భుజించుచుండువారఁట

#### గ్రంథరచనము

వీరు కావ్యములను, వ్యాఖ్యానములను, ఖండనములను, స్తోత్రములను కలిపి దాదాపు 148 గ్రంథములను రచించిరి ఈ గ్రంథములు వ్యాకరణశాస్త్రమునందును, అలంకారశాస్త్రమునందును, వేదాంతశాస్త్రమునందును, ధర్మశాస్త్రమునందును గలవు కావ్యములందును, స్తోత్రములందును, భాగవతచంపు వ్యాఖ్య, మురారినాటక వ్యాఖ్యలందును వీరు గనంబఱచుచు వచ్చిన కల్పనలు, యమకములు, వ్యంగ్యార్థవినిర యము మున్నగు విషయములు పాఠకులకు విస్మయావహములనుగ నొనర్చును ఎట్టి శాస్త్రీయగ్రంథమునుగాని కావ్యమునుగాని వ్రాయుచున్నను ఒక్క యక్షరమునైనను కొట్టి వ్రాయువారు కారు

#### స్వభావము

గర్వ మన్న పి రెట్టిదో ఎఱుంగరు తమ యాదాయమునంతయు విద్యార్థుల భోజనాదికమునకును యాచనకై సంచరించు విద్వాంసుల సత్కారమునకును సెలవు చేయుచుండువారు ఏమాత్ర మవకాశము లభించినను గ్రంథములను వ్రాయుచు ఆరోగ్యావహమగు శరీర వ్యాయామమును కొంతకాల ముపేక్షించిరి

దాన వీరికి దేహము దుర్బలమయి వ్యాధి సంభవించెను కొంతకాలము వేద్రాద్రియందు తప మొనర్చిరి మిత్రుల బలవంతముమీఁద వ్యాధికై ఔషధసేవఁ జేసిరి కాని వ్యాధి కుదురలేదు తరువాత గీతాభాష్యార్కప్రకాశ మనుపేర శంకర గీతాభాష్యమునకు సుబోధమగు వ్యాఖ్యానమును రచించిరి ఇతర మతములవారు గీతాభాష్యమునందుఁ గనంబఱచిన దూషణములకు సమాధాన మీ గ్రంథమునఁ జూపినటుల మఱొక్క గ్రంథమునఁ జూపియుండలేదు ఈ గ్రంథమును వ్రాయునపుడు వ్రణములేచి శస్త్ర



ఆంధ్రమాతాశీర్వచనములు

[ఈ ఛాయా చిత్రం 1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలో ప్రచురితమైనది సం]



ఎడ రామదాసుగారు

హరిభక్తులు, గ్రంథకర్త, ఆంధ్రదేశమంతట శిష్యులు గలరు

[ఈ ఛాయా చిత్రం 1914 ఆనంద సంవత్సరాది సంచికలో ప్రకటించినది సం]



కల్హారి జగన్నాథరావుగారు

[ఈ ఛాయాచిత్రం 1915 రాక్షస సంవత్సరాది సంచికలో ప్రచురితమైనది సం.]

చికిత్స చేయవలసి వచ్చెను వైద్యుడు శస్త్రముచేత వ్రణమును కోయుచుండుగా వీరు లేఖినిచేత భాష్య వ్యాఖ్యానమును వ్రాయుచుండువారట పల్నాడు తాలూకాయం దున్నవారిలో పలువురు వీరియొద్ద విద్య నభ్యసించినవారే పలువుర కోరిక ననుసరించి అష్టావధాన శతావధానములను రెండు మూడు పర్యాయము లొనర్చిరట 18 మందికి నిషేధాక్షరియు, ముప్పురకు వ్యస్తాక్షరియు అవధానమునందు చెప్పెడివారట శతావధానులగు శ్రీ జూపూడి హనుమచ్ఛాస్త్రిగారును ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారును వీరి శిష్యులని మాత్రము నేను ఎఱుంగుదును తక్కినవారిని బాగుగా నెఱుంగను వీరు "శాంకరా శాంకర భాష్య విమర్శన" మను పేరుతో శ్రీ భాష్యమునందు రామానుజాచార్యులవా రొనర్చిన శంకర భాష్య ఖండనమునకును సమాధానము వ్రాయుట కుపక్రమించిరి కాని యాంధ్రులయం దిట్టి పండిత కవీంద్రుని నుంచుటకు భగవంతునికి ఇష్టములేక కాఁబోలు ఈ ప్రమాది సం కార్తిక శు 9 యందు బ్రహ్మదేవుఁడు తన లోకమునకు కొనిపోయెను

## వీరి గ్రంథములలో ముద్రించినవి

1 రుక్మిణీ పరిణయ చంపువు, సవ్యాఖ్య 2 గరుడ సందేశము, సవ్యాఖ్య 3 హయగ్రీవశతకము, సవ్యాఖ్య 4 వేదాంత కౌస్తుభము 5 కందర్ప విలాసము 6 కృష్ణ లీలాతరంగిణి

## ముద్రణమునందున్న గ్రంథములు

గీతా భాష్యార్క ప్రకాశము— ఈ గ్రంథ ప్రాశస్త్యమును గాంచి గుంటూరు పౌరులు ముద్రణమునకుఁగాను 2 వేల రూప్యముల నిచ్చిరి ఈ గ్రంథముద్రణానంతరము క్రమముగ గ్రంథములన్నియు వెలువడఁగలవు.

## 2

## జూపూడి హనుమచ్ఛాస్త్రిగారు

శా తల్లీ! భారతమాత! నీ కడుపునన్ దారిద్ర్య విచ్ఛిత్తిగా
ముల్లోకంబులలోన వీడనఁగ భూముల్ పట్టరాకుండ మా
యుల్లాసంబు చెలంగఁ బుట్టునతఁ డాయుర్దాయ నిర్భాగ్యుఁడై
కల్లోలం బొనరించె లోకముల నీ కా శోక మెచ్చుం గదా!

సీ. వైరి ముఖాబ్జముల్ వాడి వత్తులు గాఁగ
వాక్య చంద్రికలను బరపు విధుఁడు
సప్తోత్తర చతుర్దశ దశక కృతి కృతి
చాతుర్య హృదయాబ్జ సరస సరసి
వివిధావధాన ప్రవీణ శిష్యగ్రహీ
తదిగంతకీర్తి కాంతావిభుండు
రామానుజాచార్య రచిత గీతాభాష్య
ఖండనతుషిత శంకర విభుండు
రామ రాయాఖ్య కవి సార్వభౌముఁ డకట!
భౌతికంబును విడనాడి బ్రహ్మపదము
నంది విజ్ఞానమయమును బొందెనయ్యొ
హైందవుల దురదృష్టమో యనఁగ నేఁడు.

సీ శ్రీ భాష్యఖండనఁ జేయు దొడంగితి
రామ రాయ కవీంద్ర! వ్రాయవేమి?
శతవధానీ! యని సాకూతిఁ బిల్చెదే
శిష్యవత్సల కోప చిహ్నమేమి?
పుత్త్రులు లేరన్నఁ బౌత్త్రము ల్చూపింతు
విపుడు చూపింపఁగా నేఁగనేమి?
కలిత భాష్యార్క ప్రకాశముద్రణపత్ర
మిదె తప్పు చూడంగఁ గదియ వేమి?
గురువు దైవం బటం చనుకొనెడు మమ్ముఁ
దనయుఁ డా రాముఁ డనుకొను తల్లిగారి
యాజ్ఞవల్క్య గురుండుగా నరయు భార్య
విడిచి పోయితె? కవివర్య! విజ్ఞధుర్య!

మ కవితావల్లిక కాలవాలమయి లోకఖ్యాతుఁ డౌ నాకుసం
భవుఁడేఁగెం, దరువాత నీరిడియెఁ దా భవ్యాత్ముఁ డా వ్యాస మౌ
నివరుం, డయ్యె నువఘ్న మంతటను వాణీ రూపుఁ డా కాళిదా
సు, వసంతాకృతి వీవు దోఁప వీఁక సంశోషింపదే సత్కవీ!

## 3

## చావలి వేంకటకృష్ణయ్యగారు

ఉ. ఏగతి సంస్కృతం బికను వృద్ధిగనున్ మన కొండవీట? వే
ఱేగతి బీదకుఱ్ఱలకు నేర్పెడు శాస్త్రము లభ్యసింపఁగా?
సాగునె వేఱుచోట నిటు సత్రము? పాండితి యేపురంబులో
నే గురునొద్దఁ గల్గు? వచియింపుము, మాగతి యేమి కావలెన్?

ఉ ఏరిని జూచుకొంచు వహియింతు మిఁకన్ గరువంబు మేము? వే
ఱేరికి నబ్బు నీ ప్రతిభ? యేరికినైనను నేర్పియుంటివో?
నేరిచికోఁగ వీలగునె నీ దశ? జ్ఞానధునీక! నిన్నుఁబోల్
వారు జనించుమాట శతవత్సరముల్ గతియించుమీఁదఁగా!

చ అభినవ శంకరుండవు రవంతయున న్నిటఁ బొల్లు లేద, యా
సభ బెజవాడలోనఁ గడు శాంతియు దాంతియు దోఁపఁ బల్కితీ
వు 'భువిని బాడబుల్ గనగఁబోలదు భేదము'లంచు నీకు నే
మి భయము? తత్త్వవేత్తలను మేటివి, నీ కెటు గల్గు భేదముల్?

ఉ జ్ఞానము గల్గ నాత్మకుఁ బ్రసాదము బ్రహ్మమునందు నైక్యమున్
మానవ దేహమున్ వదలి మానుగఁ బొందుట యంచు నేర్పదే?
యా నియమంబునే సతము నాత్మను నిల్పి చరించుచుంటి వీ
వో నయశీల! తుచ్ఛమగు యోజన సుంత యెఱుంగకుండఁగన్!

మ. మునుమున్ వ్రాసితి మీఁది పద్యముల నీ పోఁకన్ విచారించుచున్
మనమం దుండెను నమ్మకంబు సుత సంతానంబు ప్రాప్తించు నీ
కనుచున్, వ్రాయఁగ జాలనైతి, అది సత్యంబయ్యె నీనాఁటి కో
యనఘా! ధన్యుఁడవైతి, వన్వయము భవ్యంబై విడంబించుతన్!

# భాష, భావము, సంగీతము

## కోపల్లి హనుమంతరావు పంతులుగారు ఎం. ఏ., బి. ఎల్

### [1914 ఆనంద సంవత్సరాదిసంచికనుండి]

ప్రతిభాషయందలి వాఙ్మయమును సాహిత్యము, శాస్త్రము అను రెండు శీర్షికల క్రింద నిమిడియుండును భావప్రధానమై, రసభరితమై, వివిధాలంకార శోభితమై, హృదయరంజకమగునది సాహిత్యము అభిప్రాయ ప్రధానమై తత్త్వ నిరూపణోద్దేశమై మనస్సునకు ధర్మ నిశ్చయముం జేయునది శాస్త్రము

**సాహిత్యము**, శాస్త్రము—ఈ రెంటికిని తగిన భాష ఆవశ్యకము కాని శాస్త్ర సందర్భమునందు భాష అభిప్రాయమునకు వాహనమని చెప్పనగును. ఇందు అభిప్రాయము వెల్లడి యగుటయే ముఖ్య విషయము స్పష్టత, కరకుతనము, నిర్మలత్వము శాస్త్ర శైలియందు మిగుల ప్రశంసనీయములు ధర్మశాస్త్రములు, ప్రకృతి శాస్త్రములు, తర్కమీమాంసా శాస్త్రములు మొదలగు సర్వశాస్త్రములును మనుష్యుల మేధాశక్తిని సమాధానపఱచి నిశ్చయము కుదుర్చునంతవఱకును ఈ శీర్షికయందుఁ జేర్పవచ్చును.

సాహిత్యమునందు భాషాప్రయోజన మింతకన్న చాల నెక్కుడు భాష సాహిత్యమున కొక అలంకారము నిచ్చు వలువ యనినఁ జాలదు కళా సౌందర్యమునకు శరీర సౌష్ఠవ మెటులో అటులే సాహిత్యమునకు భాషయు సుందర స్వరూపమువంటిది. భావము ప్రాణము. భాష విగ్రహము ఈ రెంటి సమ్మేళనమువలన సర్వజన మనోమోహనమగు లావణ్యమావిర్భవించుచున్నది. ఇట్టి కవి సృష్ట లావణ్యమునందు అంగసౌష్ఠవము నెంచి, కళా విభ్రమములను వేర్వేఱదీసి, గుణ సంపదను గుర్తించి, భావ నిరూపణమును జేయునది సాహిత్య విమర్శనము.

క. తను వగు శబ్దార్థంబులు,
ధ్వని జీవ, మలంక్రియా వితానము సొమ్ముల్,
తనరు గుణంబులు గుణములు,
ఘనవృత్తులు వృత్తులౌర! కావ్యేందిరకున్.

అను సాహిత్య లక్ష్మీవర్ణనమందు లోపము వెదుకరాదుగాని, భావమునకును భాషకును చాలినంత భేద గుణ నిరూపణమును జేసినట్టు కనఁబడదు కొంతవఱకును కావ్యప్రకృతియందు వెనుక మన మెన్నినట్లు భావ భాషల కత్యంతమైత్రి నిజమని మన మొప్పుకొనవలయునుగాని, భావ సౌభాగ్యమును, భాషాసంపదయును వేర్వేరని యెంచని యెడల, సత్కవిత్వము వర్ధిల్లనేరదు ఇట్లెంచుచు రెంటికిని తగు పొందికతో సమాశ్రయము చేయుటయే మహాకవుల నేర్పరితనము ధ్వని మాధుర్యమునుండి సహాయము గోరక, చిత్రాలంకార నైపుణ్యముఁ జూపకుండియు, భావ సారస్యమువలననే రస ముప్పతిలం జేయు శక్తి మహాకవుల కుండవచ్చునుగాని జనహృదయము నంటినతోడనే కరఁగించు సామర్థ్య మీ కవిత్వములో నంతగ నుండదు, కనుక ఇది యొక లోపముగ నెంచక తప్పదు ఇటులే పద లాలిత్యమును, చిత్రరచనా కౌశలమును ఎంతయుండినను అర్థగౌరవము లేని కవిత్వ మెన్నటికిని రాణింపనేరదు. ఈ న్యాయము ఆధునికాంధ్ర కవుల యం దుదాహరణీయము. ప్రబంధము లనుపేర బయలువెడలిన లెక్కలేని నూతన గ్రంథములు శబ్ద ప్రపంచమునందలి మాధుర్యమునంతను కొల్లవెట్టినవనుటకు సందియములేదు. ఏ దేశ సాహిత్యమునందును కేవల సంగీతమునందుఁగాక శబ్దజాలమునం దీ శ్రావ్యగుణమును, కర్ణేంద్రియము నిట్లు కరగించు శక్తియు అనూహ్యములు. భాషా ప్రభుత్వ మింత చేత నుండియు, హృదయరంజకముగాని కవిత్వముఁ జూచిన భావగౌరవము యొక్క విలువ ఎంతయో తేటపడవచ్చును. ఈ విషయ మిం దించుక సవిస్తరముగా విచారించెదము

పదముల పొందిక యననేమి? ఇందు విశేషమేమి? కవిత్వ మందలి శబ్దలాలిత్యమునకును సంగీతమునందలి శ్రావ్యగుణమునకును సంబంధమేమి? ఈ ప్రశ్నలకు తగిన యుత్తరముల ప్రయత్నించెదము శబ్ద మన రెండు విషయము లిం దిమిడియున్నవి. ఒకటి ధ్వని ఇట్టి ధ్వనికి జనసంకేతముగా వచ్చినయర్థము రెండవది శబ్దములు ఒండొంటితో చేరుటవలన ధ్వని తరంగమగును ఇట్టి చేరికవలననే వేర్వేరు భావకళికలన్నియుఁ గలసి పూర్ణ భావ స్వరూప మేర్పడును సరసధ్వనిమైత్రివలన శ్రావ్యరవ ముత్పన్నమగుచున్నది అర్థము పొందిక వలన రస ముప్పతిల్లును. ధ్వనిమైత్రివలన వచ్చు శ్రావ్యరవమునకును, అర్థము పొందికవలన వచ్చు రసోత్పత్తికిని, సత్కవిత్వమం దొక విశేషసంబంధ మున్నది.

శబ్దమునకు జనసంకేతార్థము గాక ధ్వనివలన స్ఫురించు సారస్యము కొంతయున్నది ఇట్టిది కవిత్వమునందువలె శబ్దజాలములు చేరిన ప్రతి సందర్భమునను ధ్వనిప్రవాహమునందు తేటపడును సంకేతార్థమునకును, ధ్వని సారస్యమునకును కుదురు మైత్రియే సత్కావనము నందలి యొక ముఖ్య లక్షణముగ పరిగణింపఁబడుచున్నది. శౌద్రరస వర్ణనమందు ధైర్య విక్రమములను, కోపోద్రేకమును తెల్లమగునట్లు పరుషాక్షరములును, సంయుక్త ధ్వనులునుగల పదజాలము లుపయోగపడుటయు, భక్తి కరుణ మోహము మొదలగు సౌమ్యభావముల వర్ణనములయందు సరళధ్వను లెక్కుడుగ నుపయోగపడుటయు, ఎల్లరకును దెలిసిన విషయమే. చక్కని కవిత్వశైలిని పరీక్షించినకొలఁదిని, అప్రయత్నముగనో యనునట్లు సందర్భించు ధ్వనిభావమైత్రి రసవంతమగు పట్టుల నెల్ల అనేకముగ వెల్లడి యగుచుండును ఇట్టి ధ్వని భావ మైత్రివలన నుద్భవిల్లు హాయియు ఆహ్లాదమును చవిఁజూచువార లెఱుంగవలయునేగాని చెప్పి తెలుపుట దుర్లభము అందులో ఆంధ్రకవిత్వమునందలి ధ్వనిమాధుర్యమును భాషాసంతతివారు దక్కఁ బరులెవ్వరైన తెలిసికొనఁగల్గుదురా యనునది గొప్ప సంశయము. అచ్చ తెనుఁగునందలి సౌమ్యము కొంత, గీర్వాణమందలి గాంభీర్యము కొంత, అన్య భాషా పదములను వశీకరణము జేసికొను ధారాళత్వ మొక కొంత, అంతయుఁజేరి సకల కళావిభ్రమమును, సర్వ రసస్ఫూర్తియు ధ్వనివితానమునఁ బ్రసరింపఁ జేయఁజాలు ఆంధ్ర శబ్దజాలములను బోలినవి, ప్రకృతిప్రపంచమునందలి చిత్రస్వర మాధుర్యము దక్క, మానుష కల్పిత మేదియు గానరాదు. ఇంత శ్రావ్యము గావుననే ఇటీవలి యాంధ్రకవు లందఱును ధ్వని మాధుర్య మోహమున మునిఁగి తీయని పదముల నోలలాడుచు, అర్థ గౌరవమన నేమియో మఱచి తమ నేర్పరితనముతో సంప్రీతులై యున్నట్లూరకున్నారు ఇదియు నొక గొప్ప విపత్తే. సాహిత్యమందలి ధ్వనిమాధుర్యము పదార్థము నాశ్రయించియుండునది అర్థమును విడవాడిన మాధుర్య మెందుకును కొఱగాదు వ్యర్థపద

ముల యల్లి కలో నిజమైన సారస్యమే లేదు అదియొక విధమైన చాతుర్యము. గణ నిర్ణయము కొలగాని పని, వేఱుకాదు భావమును వ్యక్తీకరించు పదములు సజీవరేణువులు ఇవి కవిత్వ సరళిని జేరినపుడు ప్రాణ సహిత లావణ్యము బయల్పడును అట్టి లావణ్యమునకు ధ్వని మాధుర్యమొక క్రొత్త కళ

ఇది చాల ముఖ్య విషయము సంగీతమునందలి ధ్వని మాధుర్యముతోడ పోల్చి చూచిన, కొన్ని క్రొత్త విషయములు తెలియఁగలవు సంగీతమునందు ధ్వనియే ప్రధానము మధురమైన స్వరమునుండియే రస ముప్పతిలును ఇది ప్రకృతి ప్రపంచ లక్షణము ప్రకృతియందు రూపలావణ్యమున్నటులే ధ్వని మాధుర్యమును నున్నది రసోత్పత్తికి రెండును సమమే ఈ ధర్మమును బట్టియే పిపీలికాది సర్వజంతువులును గానమాధుర్యమునకు లోనగుట లోకప్రసిద్ధము

మానవులలో సంగీతమునకును, వాగ్జాలమునకును ప్రథమములో నెట్టి సందర్భమును నుండియుండెడిది కాదు అనఁగా, ప్రస్తుతము సంగీతమెక్కువగా నేరువని అనాగరికులలో సంగీతమునం దొక ధ్వని విలాసమే గాని భావ సారస్య మేమియు లేదు కాని గానవిద్య యెక్కుడైన కొలఁదిని పదముల కూర్పువలన భావోదయము గావించి భావమును సంగీతమున తగు రాగములఁజేర్చి రసవిస్ఫురితముఁ గసనేర్చిరి ఇట్టి యభివృద్ధిఁగాంచిన పట్టుల సంగీతమన, పదగుంభనమువలనఁ జేరరాని రసావిర్భావమును సూచించుచున్నది మానవ హృదయమునందు భాషాతీతమగు భావమును, భావాతీతమగు రసమును లోలోన నెక్కడనో యణఁగియున్నది జనహృదయమును భేదించి రసప్రవాహము వెలివడునట్లు చేయు అద్భుతశక్తి మహాకవులకును మహా గాయకులకును మాత్రమే గలదు గోటిమీటునకు మ్రోఁగు తంబుర తీఁగెవలెనే జనహృదయము వారి చిత్రకల్పనలకు నిరంతరమును చలించుచుండును ఒకమాట, ఏ సందర్భమున ఏ కవి వాక్కునుండి వెడలినదో, మనోమర్మభేదియై మానవలోకము నంతయు అనంతశోకవారి లో తల్లడిల్ల జేయఁగల్గును ఒక కీర్తన, ఏ గాయకుఁడో, ఏభక్తుఁడో తన శారీరమును జేర్చి, సృష్టివిధానమున కనువగు లయంగూర్చి, నటరాజేశ్వరుని తాండవ పారవశ్యమును వెల్లడి చేయుచు పాడిన శైలితో, కాలాంతమువఱకును ప్రతిధ్వనుల నింపఁగల్గును

ఇట్లు సర్వసృష్టియం దంతర్గర్భితమగు భావమును, భావ ప్రకటనమునకు వలయు భాషా ప్రాగల్భ్యమును, భావమును భాషయును లయముఁజెందు రవమాధుర్యమును, జేరి ఏకరసస్ఫూర్తిగాంచినపుడే నిఖిల రసామృతమూర్తియగు సర్వేశ్వరుని యారాధనము మానవచిత్తమునందు సఫలత నొందఁగలదు

---

# శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల చరిత్ర

## క. మార్కండేయశర్మగారు

**[1914 ఆనంద సంవత్సరాదిసంచికనుండి]**



శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితులు

భారతఖండము పనాతనధర్మమునకు జన్మభూమి సనాతన ధర్మరహస్యములు శ్రుతిస్మృతులు అందు ప్రతిపాదింపఁబడియుండును ఈ సనాతన ధర్మములను అందరు యథాశాస్త్రముగాఁ జేయుచున్నయెడల దేశీయులు సకల క్షేమములను పొందుదురని ఋషు లభిప్రాయపడిరి. ఈ కథానాయకుఁడును అట్టి తలంపు గలవాఁడే శాలివాహన శకము సం. 1742 నకు సరియగు ప్రమాది సం జ్యేష్ఠ శుద్ధనవమినాఁడు శ్రీ దీక్షితులవారు జన్మించిరి. తండ్రి ఘంటయ్య, తల్లి చిన్నమ్మ కృష్ణ యజుర్వేద శాఖాంతర్గతమగు ఆపస్తంబ సూత్రము. భారద్వాజసగోత్రము ఆర్వేల నియోగిశాఖకు చేరినవారు వీరి జన్మభూమి రేపల్లె కొంత కాలము తండ్రిదగ్గఱను, ఇతరుల దగ్గఱను సాహిత్యాలంకార తర్క వ్యాకరణ శాస్త్రములు పఠించిరి. వీరి కపుడు 16 సం వయస్సు. వీరికి ఆయేటనే వివాహ మాయెను. కొంత కాలమునకు భార్య మరణించెను విద్యయందు వీరు చెందుచున్న యభివృద్ధిని గాంచి సహింపరానివారిలో కొందరు వీరికి శత్రువులయిరి అట్టి శత్రువుల నిర్బంధముచేత ఈ దీక్షితులవారి పురోహితుఁడు సగము కర్మ చేయించి తక్కిన సగము సభయందు నీవు క్షమాపణమును కోరినఁగాని జరుపనని బెదరించెను గ్రంథ సహాయముచేత దీక్షితులవా రా కర్మను నెరవేర్చుకొనిరి వీరి సాహసమును గాంచి మిత్రులును, శత్రువులును పలువు రేర్పడిరి. ఆ కాలమునందు సుప్రసిద్ధులగు కృత్తివెంటివారి సాహాయ్యము వలన నియోగిబాలుర నేర్పఱిచి స్మార్తకర్మలను బోధించుచు వారిని వెంటఁబెట్టుకొని దక్షిణదేశమునకుఁబోయి 18 మాసములుండి వేదమును, శ్రౌతప్రయోగమును, పూర్వోత్తర మీమాంసలను చక్కఁగ నభ్యసించిరి వీరు దక్షిణదేశమునకుఁబోయి యున్నపుడు అజినమేఖలాది బ్రహ్మచర్య చిహ్నములతో ప్రకాశించుచున్న వీరి విద్యార్థులను, వారు సలుపుచున్న అగ్నికార్యాది ఆశ్రమాచార నియమములను అచటి పండితులు చూచి హర్షించియు 'ఇట్టి కీర్తిని బాల్యమునందే వహించినాఁడు. ఎటులైనను పరాభవింత'మని తర్క వ్యాకరణములందు వాదమునకు వచ్చి యోడిపోయి వేదాంతమునందు మరల వాదమునకు వచ్చి యోడిపోయినవారలై మరల సఖ్యమును వహించి "అద్వైత మతస్థాపక" యను బిరుదము నిచ్చి సత్కరించిరి.

తరువాత శ్రీ దీక్షితులవారు స్వదేశమునకు వచ్చి రేపల్లెయందును బందరునందును పాఠశాలల నేర్పాటుచేసి శ్రౌత స్మార్త సాహితీ తర్క వ్యాకరణాది పాఠములను బోధించు నేర్పాటు చేసిరి దాదాపు 200 విద్యార్థులు విద్యాభ్యాసమును చేసిరి ఉద్గ్రంథములగు భాష్యాది గ్రంథములను మాత్రము తాము బోధించుచు తక్కిన పాఠములను సమర్థులగు శిష్యులచేతఁ జెప్పించుచుండిరి. వైష్ణవులు, వైదికులు మున్నగువారివలెనే నియోగులును యాజనాదికమును నిర్వహించుకొనుట శాస్త్రీయమని శ్రీ దీక్షితులవారు బోధించుచుండిరి షోడశకర్మలును చదివిన కొందఱు విద్యార్థులను సమీప గ్రామములకుఁ బంపి నియోగి బ్రాహ్మణులకు ఉచితముగ విద్యను బోధించి అచటివారలను పరస్పరము యజనయాజనాదులు నిర్వహించుకొనుటకు సమర్థులనుగఁ జేయుచుండిరి

### వీరు వ్యాపింపఁజేసిన యంశములు

1 ఆశ్రమాచార నియమము లవలంబించి విద్యను చదువవలయును.

2 ఆవశ్యకమగు మంత్రజాతము ప్రథమమున సార్థకముగ చదివి పిదప ఇతరాధ్యయనము చేయవలయును

3 యథోక్త మంత్ర ద్రవ్యాది సంపత్తు ప్రకృతమున లభించుట లేదు గావున యజ్ఞములను పిష్టపశువుతో చేయవలయును గాని ప్రత్యక్షముగ పశువులను హింసింపరాదు

4 నాస్తికబుద్ధితో మతాచార ధర్మములను పరిత్యజించినవారి ఆశౌచమును శిష్టులు విడువవలయును.

5 శాస్త్రవిరుద్ధమగు నాచారమును విడువవలయును.

వీనిని ఆచరణమునందు పెట్టుచున్న కాలమునందు శ్రీ దీక్షితులవారికి బంధువులందును, నియోగులందు పలువురును, వైదికశాఖయందు కొందఱును శత్రువులుగా ఏర్పడిరి వీరిలో కొందఱు సమయము లభించిన దీక్షితులవారిని చంపవలయునని వేచియుండిరి. కొందఱు వ్యవహారములచిక్కులు తెచ్చిపెట్టిరి చిట్టచివఱకు పుష్పగిరి స్వాముల వారి సమీపమున ఆ పీఠమునం దున్న పండితులతోను, ఇతర పండితులతోను శాస్త్రచర్చలు జరిగి, శ్రీ దీక్షితులవా రావర్చు

శాస్త్ర విధిప్రచారము ఈకాలమున ఆచరించవలసినదే అయినను అలసు లగువారు చేయజాలరు అని స్వాములవారు నిర్ణయించిరి ఈ శాస్త్రార్థము సుమారు 40 దినములు జరిగెను శ్రీ దీక్షితులవారికంటె 20 వర్షములు ఎక్కువ పెద్దవారును, 2, 3 శాస్త్రములందు పాండిత్యము కలిగిన ప్రసిద్ధ గ్రంథకర్తలునగు నిత్యానందనాథులు మున్నగువారు తామొనర్చిన గ్రంథములందు శ్రీ దీక్షితులవారిని కులాచార్యునిగను, దక్షిణామూర్త్యవతారముగను స్తుతియొనర్చిరి.

శాస్త్రములందా యా యాశ్రమములకు విధించిన మతాచారములను యథాశాస్త్రముగ నాచరించువారలే శ్రీ దీక్షితులవారికి మిత్రులును, బంధువులును అయియుండిరనిన స్వభావోక్తి యగును శ్రీ దీక్షితులవారు పరమహంసాశ్రమము స్వీకరించి చిదానంద సరస్వతి యని ప్రసిద్ధినంది శ్రీముఖ సం. కార్తిక శుద్ధ నవమియందు సిద్ధిని పొందిరి వీరి శిష్యకోటిలో శ్రౌతము కోటీశ్వరశాస్త్రి, ఆనందరావు, నరసింహశాస్త్రి, విజయరామశాస్త్రి అనువారు సుప్రసిద్ధులు వీరొనర్చిన స్వధర్మాచరణ ప్రచారణమును శ్రీద్వైతాద్వైత మతస్థాపన కోటీశ్వరశర్మశాస్త్రిగారొనరుచున్నారు. గుంటూరునందు శ్రీ మందపాటి వేంకట లక్ష్మినారాయణరావు గారిచేత చిదానందాశ్రమమనుపేర శ్రీ దీక్షితులవారి కొక మఠము కట్టబడినది ఇచట శాశ్వతముగ నొక పాఠశాలయు, గ్రంథభాండాగారమును ఏర్పరుచుటకుగాను కృషి జరగుచున్నది.

శ్రీ దీక్షితులవారొనర్చిన గ్రంథములలో చాలవరకు మాకు లభించినవి వానిసంఖ్య దాదాపు 25 ఇందులో ప్రధానములగువాని నామములు కొన్ని ఇచ్చుచున్నాడను.

1. వేదపదసూచి, 2 ప్రమాణసూర్యోదయము, 3 విశ్వపత్యసురవిజయము, 4 మంత్రప్రశ్నపదము, 5 స్మార్తానుక్రమణిక, 6 రక్షోవిజయము, 7. విధవాపునరుద్వాహఖండనము, 8 నియోగమత సిద్ధాంతదీపిక మున్నగునవి.

వీరి జీవిత చరిత్రమును గురించి సమగ్రముగ తెలియంగోరువారు గుంటూరు చిదానందాశ్రమసంఘమువారు ప్రచురించిన దీక్షిత చరిత్ర గాంచునది

# దేశచరిత్రలు-నవలలు

తణికెళ్ల వీరభద్రుడుగారు బి. ఎ (ఆనర్సు)

**[1915 రాక్షస సంవత్సరాదిసంచికినుండి]**

స్వదేశ చరిత్రను నేర్చియుండుట ప్రతి మనుజునకు నత్యావశ్యకము. అట్టి దేశచరిత్ర పరిజ్ఞానము దేశాభ్యుదయమునకు మిక్కిలి సహకారి పూర్వమం దెట్టి వీరప్రధానులు మనమాతృదేశము నలంకరించిరో, ఏయేరాజ్యము లభివృద్ధిచెందెనో, వాని నెంతటి మహా చక్రవర్తులు పాలించిరో తెలిసియుండుట సంతోషదాయకము అంతేకాక, అట్టి పుణ్యదేశమున కేల ఇట్టి క్షీణదశ యబ్బినదో గ్రహించుట మిక్కిలి యుపయోగకారి. మన ప్రాచీనుల ఘనతనుగూర్చి వినినప్పుడును, హైందవ వీరుల పరాక్రమమును ఆర్యవనితల మానరక్షణమును దేశభక్తుల స్వార్థ త్యాగమును గుఱించి చదివినప్పుడును, ఒడలు పులకరించి మనయం దొక నూతనశక్తి జనించును ఇట్టి మహా పురుషుల సంతతివారమని మది యుప్పొంగ, మన జాతీయాభివృద్ధి కవకాశము కలదని యాశ పుట్టి, ఆత్మశక్తియం దొక వింత నమ్మకము కలుగును. ఆ యాత్మవిశ్వాసమునకును దేశాభ్యుదయమునకును పరస్పర సంబంధము కలదు అట్టి స్వజాతీయ విశ్వాస ముద్భవించినపుడే మనకు మన ప్రాచీనుల పావన చరితములందు మరింత కౌతూహలము కల్గుటయు, మనము సదా వారి నామోచ్చారణము సేయుచు హృదయములందు నూతన బీజములు నాటుటయు తటస్థించును ఆధునికాంధ్ర దేశస్థితినిగూర్చి ఇంచుకసేపు యోచన సేయువారికి 16—వ శతాబ్దమందు ఇంగ్లాండుదేశ మెట్లుండెనో జ్ఞప్తికి రాకమానదు ఆంగ్లదేశము పరరాష్ట్రములతో పోరు సల్పుచు, స్వదేశ రక్షణమునందు ప్రాణత్యాగమున కుద్యుక్తులయిన యాంగ్లశూరులు తమ దార్ఢ్యమునుగూర్చి సంతసించునపుడు, వారికి తమ పూర్వికుల చరిత్రములు వినవలెనని యాశ పొడముటయు, కవీశ్వరులును నాటకకర్తలును సమయము చూచి గ్రంథములను వ్రాసి దేశ చరిత్రను నేర్పి, దేశభక్తిని హెచ్చించుటయు మనకు తెలిసిన యంశమే అవ్విధముననే మన యాంధ్రదేశమందుఁగూడ స్వదేశ చరిత్రను తెలిసికొనవలెనని మితిలేని యాతురత జనించినది ఇట్టి విదాహమునకు చికిత్స యేది యన, తగిన గ్రంథములు చరిత్రలు వ్రాయఁబడుటయు, మన ప్రాచీనుల పరాక్రమాది పుణ్యగుణములు వేనోళ్ల ఘోషింపఁబడుటయు తప్ప వేఱులేదు

దేశచరిత్రను ప్రజకు వాఙ్మయ రూపమున తెలియఁజేయుట త్రివిధము ఏదో యొక మహాశూరుని సాహసకృత్యముగాని, యొకానొక యుద్ధముగాని వర్ణించి పద్యకావ్యము వ్రాయవచ్చును అట్టి కావ్యము లింగ్లీషులో వాల్టరు స్కాటు అను దేశభక్తుఁ డొకఁడు వ్రాసెను గాని మన భాషయం దున్నట్లు గాన్పింపవు శివాజీవంటి మహారాజుయొక్కగాని, పద్మినివంటి మహా పతివ్రతయొక్కగాని పవిత్ర చరిత్రము కథగాఁగల కావ్యము హృదయమును రంజింప, మన మనస్సు పరిశుద్ధతనొంది యొకింతసేపు ప్రాపంచిక విషయముల మఱచుటయు, మనయం దొక విధమయిన భక్తి జనించుటయు, మన ప్రతినాళమందును పవిత్రరక్తము ప్రవహించుటయు సహజము చరిత్రను చిన్న కథలుగాఁదీసి కావ్యములు రచించుటకు నాటకములును నవలలును నుచితములు నాటకమునకును నవలకును నొక భేదము గమనింపవలెను నవలయందు గ్రంథకర్త తానే కథను జెప్పును పాత్రములను వర్ణించి తన యభిప్రాయమును వెల్లడి చేయుచుండును నాటకమందన్ననో గ్రంథకర్త మనకు గోచరముకాఁడు అతని యభిప్రాయము గ్రహింపవలసినదేకాని తనంతట తాను తెలియఁజేయఁడు పాత్రలుచేయు కార్యములను బట్టియు వా రాడు పల్కులను బట్టియు మనము పాత్ర సంపోషణక్రమము నెఱుఁగఁగలము నాటకకర్త ప్రతి విషయమును ప్రత్యక్షముగా రంగస్థలమున చూపును నవలాకారుఁ డయినచో నొకా నొక పురుషునిఁగాని, పట్టణమునుగాని వర్ణించినపుడు ప్రతి విషయమును విశదముగా చెప్పవలెను ఇట్టి భేదములు కొన్నియున్నను మనము నవలలను నాటకములను ప్రస్తుత సందర్భమున సమదృష్టితోఁ జూడవచ్చును నవలయందయినను ఒక పురుషునిఁగాని యొకస్థితినిగాని వర్ణించునపుడు గ్రంథకర్త దానిని జాగరూకతతో చిత్రించి, నాటక రంగస్థలమున దిదృక్షుఁ డేలాగు పాత్రమునుగాని మఱి పట్టణమునుగాని చూడఁగలుగునో యా విధముననే పాఠకుఁడు తన మానసిక నేత్రముతో స్పష్టముగా చూడఁగల్గులాగున, వర్ణింపవలెను. అట్టి వర్ణనమును నాటకోచితమని వాడవచ్చును ఈ నడుమ ప్రకటింపఁబడిన "విజయనగర సామ్రాజ్యము"లోని వర్ణనలు చిత్రముగాను స్వాభావికముగాను నున్నవి జగన్మోహినీ విజయసింహుల పరస్పర ప్రేమమును జ్ఞప్తియం దుంచుకొని ఈ క్రింది వాక్యములను తిలకింపుఁడు —

"అంత నామె కన్నులనుండి బాష్పములు మౌక్తికజాలమువలెఁ గ్రిందబడఁజొచ్చెను. దానిని మన విజయసింహుఁడు కనిపెట్టెను అతని హృదయము నీరాయెను అతనికేమియు దెలియలేదు అతఁడేమి సేయను బ్రయత్నింపలేదు కాని యప్రయత్నముగాఁ జేతి రుమాలుతోఁ గూడిన యాతని మంజులహస్త మా జగన్మోహిని కనులను దుడువ నారంభించెను రెండవ హస్త మా సౌభాగ్యశాలియొక్క కేశపాశమునఁబడి కాలజలమువలెఁ బ్రకాశించుచున్న యాకేశపక్షమున మెఱుపుదీవియవలె బ్రకాశింపఁజొచ్చెను అతని హృదయము జల్లుమనియెను అతనికి నిముసమువరకు స్మృతిలేదు అది యుభయత్ర నట్లేయుండెను ఆమె మాటలాడుటకుఁ బ్రయత్నించెను కాని మాట రాలేదు, ఎట్టకేల కిట్లనియెను"
(పుట 62)

ఇట్టి వర్ణనమే నాటకోచితము ఆ సుందరుఁడు జగన్మోహిని కనులను రుమాలుతోఁ దుడుచుటయు వారు మాటాడలేక చేష్టలు దక్కి బొమ్మలవలె నిలువఁబడుటయు రంగస్థలమందలి ప్రదర్శనమువలె స్పష్టముగా కండ్ల యెదుట కాన్పించుచున్నది ఈ శైలిసౌలభ్య మేమి! ఈ వర్ణన మెంత స్వాభావికము! దీర్ఘ సమాసములును పదగుంభనమ్మును శైలి యగునని యూహించుజను లెంతటి వెఱ్ఱివారు !

చరిత్ర గ్రంథములు కావ్యము లనిపించుకొనుట కొక గుణము ముఖ్యముగాఁ గావలసియున్నది దానినే మనము కవనమని పిలువవచ్చును కవనమున్నచోఁ గావ్యమగును ఈ కవితా చమత్కృతియే ప్రతి గ్రంథమునకును ప్రాణము చరిత్రలయందువలె, చెప్పిన యంశములు వట్టి పొడిమాటలతోఁ జెప్పక, ఉపమావాద్యలంకారములుగల శైలితో హృదయరంజకముగా వర్ణించినచో నట్టి గ్రంథము రసపూరితమగును మఱియు దేశ చరిత్రయందు విఖ్యాతి చెందిన యొకానొక పురుషుఁడు వర్ణింపఁబడినను, మనుష్యమానసము చిత్రింపఁబడి మానవులకు తరణోపాయము చూపఁబడినను, అట్టి గ్రంథము కావ్యమే యగును అందుచేత నవలలు కావ్యములు కావచ్చునుగాని చరిత్రలన్నియు కావ్యములు కావు. విమలాదేవి యను నవల ఔరంగజేబు జీవిత చరిత్రను కొంతవఱకు తెలియఁజేసిన మాట వాస్తవము ఆ నవలయం దితర సుగుణములు కలవు గనుకనే యది కావ్యమయినదికాని ఔరంగజేబు చరిత్రనుగూర్చి వ్రాయఁబడిన పుస్తకము లన్నియు కావ్యములా?

చరిత్ర నవలలను మూడు తరగతులుగా భాగింపవచ్చును (1) చరిత్రయే కథాభాగముగాఁ గలవి కొన్ని వానియందు చరిత్రాంశములకు తప్ప మాఱు విషయములకు చోటుండదు (2) మఱికొన్ని నవలలు పేరునకు మాత్రము చరిత్రాత్మకములుగాని నిజముగా శృంగారము ప్రేమ మొదలగు నంశములే వాని కథాభాగముగా నేర్పడును చరిత్రాంశము వట్టి విషయేకాని నవలాకారుని దృష్టియంతయు జవ్వనుల యనురాగమును వారి సౌఖ్యమును గూర్చియే యుండును హూణభాషయందు వాల్టరు స్కాటుయొక్క నవలలిట్టివియే "హేమలత" యందలి కథ రాజపుత్రస్థాన చరిత్రయయినను, హేమలతా ముదనసింహుల ప్రేమానుబంధమే ముఖ్యముగా దోఁచును. (3) మఱికొన్ని నవలలందు చరిత్రాంశము ముఖ్యమయినను, ఇతర కథలు నితర విషయములును లేకపోవు చరిత్రయే ముఖ్యభాగముగా నేర్పడును "విమలాదేవి", "రాణీసంయుక్త", "సగుణ", "విజయనగర సామ్రాజ్యము"— ఇవి యట్టివని చెప్పవచ్చును విమలాదేవియందు విమలావిజయసింహుల ప్రేమయు, ఇందిరాదేవి చమత్కృతులును మిక్కిలి యానందమును గల్పించునుగాని మొగలాయి చక్రవర్తితో రసపుత్రవీరులు పోరు సల్పిన విధమును, ఆ క్షత్రియశూర శిఖామణులు తమస్వాతంత్ర్యమును గాపాడుకొనిన విధమును నవలయందలి ముఖ్యాంశమని చెప్పుటకు సందేహమేమి? మఱియు విజయనగర సామ్రాజ్యమందు ఆంధ్రసామ్రాజ్యమును ఆంధ్ర పరాక్రమమును ఆంధ్రదేశభక్తియు వర్ణించుటయే గ్రంథకారుని ముఖ్యాభిప్రాయమని తోఁచును. కథను రెండు భాగములుగా విభజింపవచ్చును రామరాజును తురుష్కులు మోసపుచ్చుట కెన్ని కపటోపాయములు బన్నిరో, వారిబారినుండి చక్రవర్తిని దప్పించుట కాతని మిత్రు లెట్లు స్వార్థత్యాగము చేసిరో, తుద కెట్లే సామ్రాజ్య మస్తమించెనో కథకు ముఖ్యభాగము. జగన్మోహినీ విజయసింహులకును, స్వర్ణ

కుమారీ రాధాకుమారులకునుగల ప్రేమానుబంధము రెండవభాగ మయియున్నది ఈ రెండు కథలకును పరస్పర సంబంధము కలదు అది యంతయు నేల? ఆంధ్రుల ఔన్నత్యమును శూరత్వములు బాహుపరాక్రమమును శ్లాఘించుటయే గ్రంధకర్త ముఖ్యోద్దేశమయినచో, సదా దేశాభిమానము గలిగి తమ భర్తలను ఆంధ్రమాత సేవకయి స్వార్థత్యాగము సేయుమని పురికొల్పుచు పురుషవేషముతో యుద్ధభూమికి తామును బోయి తమ నాథులవెంటఁ దోడు నీడవలెఁ దిరుగుచు, వారితోఁబాటు శత్రుక్షయము సేయుచు, తుదకు వారితో నేకకాలమందె సమర రంగమునఁ బ్రాణములు విడిచిన యా వీరవనితల చరిత్ర నవలాకారుని ప్రధానోద్దేశమునకును భిన్నము కాదే! ఆంధ్రయువజనులే కాక యువతులు కూడ మాన రక్షణమందును దేశరక్షణమందును ప్రాణములు గోల్పోయిరను విషయము కవి ప్రథమోద్దేశమునకు సహకారియయి యాంధ్రశూరత్వమును వేనోళ్ల జాటుచున్నది

చరిత్రాత్మకమగు నవల వ్రాయునపు డొక విషయము మఱువఁదగినది కాదు గ్రంధకర్త దేశచరిత్రను వాఙ్మయరూపమున దేశీయులకు గఱపుటయే యుద్దేశముగా నూహించినచో దేశ చరిత్ర ననుసరించియే వ్రాయుట మంచిది ముఖ్యాంశములు చరిత్రాధారముల ననుసరించి వర్ణించిన తర్వాత కొన్ని చిల్లర మార్పులను పాత్రోచితముగా చేయవచ్చును కథను రసవంతముగా చేయుటకు కొన్ని విషయములను మార్పవలసివచ్చును కాని మన యభిప్రాయమునుబట్టి చరిత్రను మార్చఁగూడదు ప్లాసీ యుద్ధమునుగూర్చి నవల వ్రాయునెడల సురాజాదౌలాను దూషింపవలసియుండును క్లైవు సాహసవంతుఁడనియు సురాజాదౌలా దుర్మార్గుఁడనియు నెల్లరకును తెలిసిన యంశమేకాని క్లైవునందుఁగల యభిమానవముచే నతని లోపములను గుణము లన వచ్చునా? బ్రిటీషు ప్రభువులు వచ్చుటచే దేశము వృద్ధిచెందెనుగాని మీర్జాఫరు తన రాజును మోసపుచ్చుటను గప్పిపుచ్చవచ్చునా? మనకు చరిత్రజ్ఞానము ప్రధానమయినది కనుక, సాధ్యమయినంతవరకు చరిత్ర భాగమును కథలో నింపుట మంచిది సగుణ యను నవల యొకటి నూతనముగా ప్రకటింపఁబడినది కథ మహారాష్ట్రదేశపు చరిత్ర 19—వ శతాబ్దమునందలి మహారాష్ట్ర దేశస్థితియు, మహారాష్ట్ర ప్రముఖులు హెూల్కారు, సింధియా, బాజీరావు మొదలగువారి చరిత్రములునుపూర్తిగా నందు చర్చింపబడినవి ఆనవలయం దితర కథలు లేకపోలేదు సగుణకును పాండురంగహరికిని గల యనురాగము ముఖ్యమయినది అదికాక వలసినంత హాస్యరసము కూడ ఆ నవలయందుఁ గలదు ఫజాఖానను తురుష్క బాలుని చేష్టలును, వాని చరిత్రమును మనకు హాస్యమును గలుగఁ జేయునుగాని యతఁడు ప్రధాన కథకు కూడ నావశ్యకమయిన పాత్రమే షేక్స్పియరు కవి సార్వభౌమునిచే రచియింపఁబడిన చరిత్ర నాటకముల పద్ధతి పరిశీలించినవారి కీ సంగతి బోధపడఁగలదు నాల్గవహెన్రీ నాటకమున రెండు కథ లున్నవి చరిత్ర భాగము ప్రధానమయినది హాస్యరసము నిచ్చు రంగములన్నియు రెండవ కథకు చెందినవి కాని హెన్రీ యువరాజు రెండు కథలకును ముఖ్యుఁడగుటచే రెండింటికిని సంబంధము కలదు క్రమముగా వీనికి పరస్పర సంబంధము హెచ్చ, రెండవకథ మొదటిదానితో నైక్యమగుటయు, దానికి సహకారి యగుటయు చూడఁగలము వివిధ రసములున్నచోఁగాని గ్రంధము సంతసము నీయదు కనుక నొకటికంటె వెక్కుడు కథలను గలిపినను అవి యన్నియు నొక ఫలమునే సూచించుచున్నయెడల, చాల బాగుగా నుండును చమత్కారముతో వ్రాయబడిన నవలనుగాని నాటకమునుగాని స్తంభములమీఁద మోపఁబడిన ప్రాసాదముతోఁబోల్పవచ్చును హర్మ్యము క్రుంగకుండుటకు ప్రతి స్తంభము నెట్లవసరమో నాటకమం దన్ని యంశములు నవశ్యకమయియుండుట మంచిది

పాత్రపోషణము నవలకు ముఖ్యమయినది మన నవలాకారు లనేకులు నవలయందు పాత్ర సంపోషణక్రమమన నెట్టిదో యెఱుగరు అదికాక కథాభాగమం దెక్కువ శ్రద్ధ చూపి, పాత్రములనుగూర్చి యోచన చేయనే చేయరు కథ యద్భుత కృత్యములతో నిండియుండవలెనని కొందఱి యభిప్రాయము కథాభాగమం దెక్కువ యభిరుచి చదువరులకుఁ గల్పింపవలెనని యెంచి పాత్రపోషణమును గుఱించి శ్రమపడరు చరిత్ర ననుసరింపవలెను మఱికొన్ని చిల్లర మార్పులను చేయవచ్చును కథానాయకునియందు లోకమందలి సద్గుణములన్నియు మూర్తీభవించెనని వ్రాయు నాచారము కలదు లేక మఱియొకఁడు దుర్మార్గుఁడాయెనా ప్రపంచమందలి సర్వ దుర్గుణములును నతనియందే వాసము చేయుచున్నవని చెప్పుదురు కథానాయకుఁ డెంత ఘనుఁడయినను మనుష్యుఁడే యని జ్ఞప్తియం దుంచుకొనవలెను లేనిచో వింత సంగతులనుజూచి యద్భుత పడి ఇది కల్లయా నిజమా యని చదువరులు సంశయ మొందవచ్చును వారును మన వలెనే మనుష్యులనియు, నట్టివారు మనదేశమందుండిరనియు సూచించుచుండుట యుచితము సన్మార్గులకంటె దుర్మార్గులను వర్ణించుట కష్టతరము వారి యూహలు వారి యుద్దేశములును విశదము సేయవలెను అది యేల? వారి హృదయమంతయు మన కండ్ల ఎదుట నైపుణ్యముతో చిత్రింపఁబడిన ఛాయాపటమువలె నుండవలెను ఈ విషయముననే కవి జాగరూకత వహింపవలెను ''విమలాదేవి ' కంతకును నయనపాలుని పాత్ర స్వభావోద్భవము, మిక్కిలి కష్టమయినదని చెప్పనివా రెవరు? చరిత్ర నవలయందు నూతన పాత్రములుకూడ కల్పింపవచ్చును ''విమలాదేవి'' యందలి ఇందిరయే దీనికి దృష్టాంతము

చరిత్రాత్మకమగు నవలలవలని ప్రయోజనము లెవ్వి యని ఎవరయినను ప్రశ్నింపవచ్చును మన పూర్వికు లేకారణములచే క్షీణదశకు వచ్చిరో తెలియఁగలదు ఏ కథ చదివినను సంఘీభావము బలమనియు,నొక కుటుంబమున గృహకలహము పుట్టినచో నాకుటుంబ మభివృద్ధి చెందుట కల్ల యనియు మనకు స్పష్టమగును ఇట్టి నీతులు బోధపడి ముందునకు మార్గ మేర్పడవచ్చును ఈ సందర్భమున నొక్క విష యము కొంచెము విచారమును కలుగుజేయుచున్నది వ్రాయఁబడిన నవలలన్నియు హిందువుల ఔన్నత్యమును జాటుచు, తురుష్కుల దుష్కార్యములను గూర్చి దూషించుచున్నవి తురుష్కులలో సత్పురుషులగు చక్రవర్తుల చరిత్రలలోని భాగములను గూడ నవలలుగా మార్చి హిందువులకును తురుష్కులకును పరస్పరానుబంధమును సూచించు నవలయే, మన మందఱము నిత్యము ప్రార్థించు హిందూ మహమ్మదీయ సమ్మేళనమును సమకూర్చినదగును చరిత్రనవలలవలని ఫలములు రెండు కావ్యములను జదువుటవలను గల్గు నానందము మొదటి ఫలము రెండవది దేశ చరిత్రను తెలిసికొనుటయు, దానివలనఁ గలుగు లాభమును మనపూర్వ చరిత్ర మనకుఁ దెలిసినఁగాని మనకు ముందు రాఁబోవు సౌఖ్యమందు నమ్మకము కలుగదు దేశసేవ చేసినఁగాని దేశాభ్యుదయమున కవకాశము లేదు మనకు మన శక్తి తెలిసినఁగాని మనము దీనులమనియే ఎంచుకొందుము అప్పుడు మన యత్నములు నిష్ఫలములని వెతఁజెందుదుము మన దాక్ష్యమందు విశ్వాసము కలిగినఁగాని మన మేపనిని నెఱవేర్పఁజాలము హనుమంతుఁడు మహాబలశాలియయ్యును దన సామర్థ్యము తన యెదుట వర్ణింపఁబడినపుడే ధైర్యమూనుటయు, సప్తసముద్రములను దాఁటుటయు సంభవించినది మన శక్తి తెలియవలెనన్న మన ప్రాచీనుల ఔన్నత్యము మనకుఁ దెలియవలెను మానవజాతికి శిరోభూషణములగు వీరాగ్రేసరులను పతివ్రతాతిలకములను గూర్చి చదివినపుడే మన మనస్సు పవిత్రమయి యా మహా పురుషుల సంపర్కముచే నానందమును బొందుటయేకాక, మనయందు దేశభక్తి జనించును గాఢమయిన దేశభక్తి ప్రతిమనుజునియం దున్నఁగాని దేశము బాగుపడనేరదు గదా! ప్రపంచమందలి దేశము లన్నింటిలో మనదేశము ప్రాముఖ్యము వహింపవలెనన్న, ప్రజలందఱు నెంతకాలము పాటుపడి ఎన్ని కష్టముల కోర్చి ఎంత స్వార్థత్యాగము చేయవలెను? తర్వాతఁ గద దేశమునకు సౌఖ్య మబ్బుట? ''న మాతుః పరదైవత'' మను మంత్రమును మనము నిత్యమును స్మరింపవలెను గదా! ముప్పదిమూడు కోట్ల ప్రజలకేమియు గొఱంత లేకుండ సమస్త సౌఖ్యముల నిచ్చి మన ఈప్సితముల నెఱవేర్చు కామధేనువయి, మనకు జన్మమిచ్చిన హైందవరాజ్యలక్ష్మి మనకు దేశమాత గదా! ఇట్టి పుణ్య దేశమంధు జన్మమొంది సకల సౌఖ్యములతోఁ దులదూఁగుచు ''ఇది నాయది. నా జన్మభూమి'' యని మది నుప్పొంగని మానవుఁ డెవడు? తల్లి బిడ్డలకు కష్టములు సంభవించిన కొలంది పరస్పరప్రేమ హెచ్చినట్లు మాతృదేశమునకయి స్వార్థ త్యాగముఁ జేసినపుడే మన కామెయందలి భక్తి వేయి మడుంగు లధికమగును ఇట్టి నిజమయిన దేశసేవ ఎంతటివారికి లభింపవలయు? ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'' యని వాక్రుచ్చిన మాతృసేవా తత్పరుఁ డెంత యనుభవశాలియో కదా!

# యూరపుఖండ
# ఘోరఖండన భాస్వద్రత్నోపళము

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నశర్మగారు

**[1915 రాక్షస సంవత్సరాది సంచికనుండి]**

మానవు లందఱు మహిచరు లగుటన్—మహినే యుద్ధ మొనర్తురు గా!
ఈ నవాహవంబున నన జలచరు—లింక వియచ్చరులై రహహా!
పూనికి నందందే పోరుం బోరిఁ—బొనరింతురు వేగులు, తీఁగెల్
గానఁబడవు నవి వేఁ గాకస మిటఁ—గాంచ మహాయుద్ధ మిదె కదా!

జయాపజయములు దైవికములె యై—సమకొనుఁ దుద, నిప్పటి యూహల
ప్రయోజనము లేనివి యనుచుం జె—ప్పనొ, నైన, నే నుడివెద సం
దియు మేటికిఁ? గైజరున కందఱుం—దెలియఁగ శత్రులు, మిత్రులు గా
నయమున న్జార్జిచక్రవర్తికి—న్జయము సిద్ధమని యననగుఁ గా!

సాయపడిరి యాస్ట్రియావారి కని—జర్మను, లింగ్లిషువా రన్నన్
దోయము వా రగు ప్రాన్సువారికిని—దుర్బలులగు బెల్జియనులకున్,
న్యాయం బియది యగుట నందఱు స—హాయులైరి ఈ పక్షమునన్;
శ్రేయం బిదె కద దైవము దోడగు—సిదము జయ మాంగ్లేయుల కౌ

హైందవు లాంగ్లేయులతోఁ గూడి మ—హాహవముం జేయుటఁ జూడన్
భోందగుఁ గృష్ణార్జునులు గూడుకొని—పోరికిఁ దొడఁగినయ ట్లహహా!
సందేహంబుం గలదే జయ మిట—సమకొనుటకు, ధర్మం బెందుం
బొందుపడునొ యందే మేల్గలు పగుఁ; బోలుం గద శాంతియె మేల్తై

అప్రార్థితు లయ్యును సమయజ్ఞత—నాంగిలేయులకు సహాయులునై,
దీప్రప్రవిదారణముఁ జలుపుటం—దెలిసి వారలు కృతజ్ఞతతో
క్షిప్రముగనె తమతో సమానులుగఁ—జింతించి సమస్వాతంత్ర్యం
బే ప్రసిద్ధముగ నొసఁగవలయుటన్—హిత మిది హైందవులకు నెందున్

తన దొరునిది బలతారతమ్యమును—దలఁపక, వృషభము వ్యాఘ్రముతో
నని సేసి వినాశముఁగాంచె, నటులె—యక్కట! యేమఁ గహా!
ఘనమగు భల్లూకంబు న్మార్కొనె, కనునె గెలుపు? గడు గాసిపడున్,
నుఁగొన నఖిల మృగంబుల సింహము—ఖ్యాతిగ గెల్చి జయముఁ గాంచున్.

ఫ్రెంచివార లింగ్లీషువారలును—ప్రేముడిఁ గూడుటఁ జూడఁగ
త్ర్వాంచిత చందన కర్పూరంబులు—వలనొప్పఁగ బొందినయట్లౌ
గాంచన్ జర్మను లాస్ట్రియనులు వే—డ్కం గూడుట రసమును బులుసున్
మించి కలసినట్లగపడు నెవరికి;—మేలగు రష్యావారె ధ్రువుల్

సర్వ విధంబుల స్వతంత్రశక్తికిని—జనుట బ్రిటిషు ప్రభుతయె సూర్యం,
డుర్విఁ బ్రజాప్రభుతచేతఁ జంద్రుని—యోజం దోఁచురు ప్రాన్సు, మహా
గిర్వంబునఁ గౌర్యంబున జర్మను—ఖ్యాతిగ నంగారకుఁ డన నౌ,
గుర్వాభము రుష్యా సామ్రాజ్యము,—గౌలలు సర్వియా బుధభంగిన్.

ఆలమునకు మూలంబగు నాస్ట్రియ—యౌ శని, జర్మను పక్షమునం
దాలోచింపక చేరెగాన శు—క్రాచార్యుండగుఁ దుర్కీ, వే
యేలా? యాంగ్లేయ ప్రభుత్వ మను—నిద్దబలుండు జనార్దనుఁడే
కేల దర్పగౌనె, జపాను రాహువు,—కేతువు బెల్జియ మనఁగ జనున్

నెపోలియనువలెఁ బ్రపంచ జయమున—నెగడఁ గడఁగన ట్లెగ్గె యగున్,
విపులబలు లయిన యాంగిలేయులే—ఫ్రెంచివారితోఁ గలసిరి స
త్ప్రాంతరంగులు గావున, వారలు—నేరక చేరినఁ గడు లగ్గె
నిపుడు విపులకున్ హిత మిది, కైజరె— యెనవయవలె నశోకుని కాంతిన్.

భూమిఁ గంసునికి గెలుపబ్బెనె శ్రీ—పురుషోత్తమునికె గొల్పొదవెన్,
భీమశక్తి శల్యునికిన్ జయమయ్యెనె—భీమాగ్రజుండు యుధిష్ఠిరుఁడే
శ్రీమంతుఁడు విజయము హరికృపఁ గనెఁ,—జెందునె కైజరు గర్వితుఁ డా
స్వామి హరికృపన్? ధర్మిష్ఠుండగు—జార్జి చక్రవర్తి విజయుఁడౌ.

అయనయ సంపన్నుండు స్నీతి—న్యాయ ధర్మ పరిపాలకుఁడున్
దయావీరుఁ డాయోధనవీరుఁడు—తంత్రావాప విశారదుఁడున్
గ్రియా ప్రధానుఁడు కైజరు లోఁగొని—కీర్తనీయ శాంతిం జేతన్
జయార్జునుం డఁట జయముం బ్రాంతియె—జార్జి చక్రవర్తి విజయుఁడౌ

తేటగీతి

శ్రీ మహామహోపాధ్యాయ నామ బిరుద—రత్న కొక్కొండ వేంకటరత్నశర్మ
సముదితం బినరత్నావళ మిది భీమ—భండననివారకము శాంతిభద్రదంబు.

సమర శాంతిరస్తు సర్వేజనాః సుఖినో భవంతు



కాశీనాథుని బ్రహ్మయ్యలింగం అయ్యవార్లుగారు
[ఈ ఛాయాచిత్రం 1915 రాక్షస సంవత్సరాది సంచికలో ప్రచురితమైనది సం]



అక్కన్న మంత్రి



మాదన్న మంత్రి

[ఈ ఛాయా చిత్రాలు 1916 నళ సంవత్సరాది సంచికలో ప్రచురించినవి. సం]




ఆంధ్రపత్రికా భవనము—మద్రాసు [ఈ ఛాయాచిత్రం 1917 పింగళ సంవత్సరాది సంచికలో ప్రకటించినది సం.]

# నాట్యసుందరి

బసవరాజు అప్పారావుగారు బి. ఏ.

[1918 కాళయుక్తి సంవత్సరాదిసంచికనుండి]

ఆడవె ఆడవె
అన్నులమిన్నా,
ఆడవె లే నడు
మల్లల్లనాడన్.
ఆడెడు నీ నడుమందము గాంచిన
అల్లాడవె ప్రేమము లోకంబుల్?
ఆడవె ఆడవె
అన్నులమిన్నా.
పాడవె పాడవె
భామామణిరో,
పాటలాధరము
బాగులు గుల్కఁగ

వలపుఁజిల్కా నీ పాటల విన్నన్
పరవశ గాదే ప్రకృతి యెల్లన్?
పాడవె పాడవె
భామామణిరో!
చూడవె చూడవె
సుందరవదనా,
సోగకన్నులను
సోలఁగ ప్రేమము
సొంపు లొల్కఁ నిన్ జూచినంతనే
చుక్కలు సైతము సోలవె ప్రేమన్?
చూడవె చూడవె
సుందరవదనా.



ఆంధ్రపత్రికా కార్యనిర్వాహకులు. [ఈ ఛాయాచిత్రం 1917 పింగళ సంవత్సరాది సంచికలో ప్రచురించినది సం.]

# ఆంధ్రకవుల యుపరాధములు

**శతావధానులు రామకృష్ణకవులు**

[1918 కాళయుక్తి సంవత్సరాదిసంచికనుండి]

ఆంధ్ర లోకోపకారము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగుఁ
జేయుచున్నాఁడు సరియె, బడాయి గాక
తొలుత సంస్కృతపద్య మెందులకుఁ జెపుఁడి!

క. నారాయణభట్టారకుఁ
గూరిమి సహపాఠిఁ బేరుకొని కొండాడన్
నేరిచిన నన్నపార్యుఁడు
వీరిఁడి గా క్షేమి? కొలఁడు విద్యాగురునిన్.

ఉ. వీర్యము సర్వముం జెదుర వ్రేటుగ దక్కిన మూఁడొ నాలుగో
విర్యములట్టి పద్యములఁ మేల్మినె పోలుపనొ నధర్వణా
చార్యుని భారతంబు విని స్పైఁపక నన్నయ చేసినట్టి దు
ష్కార్యముఁధీరగౌరవముఁగాల్పదె? విక్కమయేనియొక్కెఁడన్.

తే. సరసకవిరాజు మంత్రి భాస్కరునికన్న
నెక్కుడగువాఁడ నని కదా యెఱ్ఱప్రెగడ
మఱలఁ దెనిఁగింపఁబూనె రామాయణంబు
నూరుఁబేరును లేకుండ నూరక చెడ.

తే. పామరుఁడువోలెఁ దిక్కన సోమయాజి
వెఱచి యాంధ్రీకరింపక విడిచినట్టి
భారతమ్మున వ్రేల్పెట్టఁబట్టికాని
యెఱ్ఱప్రెగ్గడ బండార మెవ రెఱుఁగరు?

క. మన యెఱ్ఱన హరివంశముఁ
దెనిఁగించినవాఁడు మంచిదే నాచన సో
మన యుత్తర హరివంశము
గనుఁడీ! యది యెంత చక్కఁగా నున్నదియో.

తే. అచ్చతెనుఁగు పదంబుల నిచ్చకొలఁదిఁ
బుచ్చి తలతిక్కయన్వయమ్ములను బెట్టి
పాడుచేసెను నన్నయభట్టు దారి
యుభయకవిమిత్రు లహ! తిక్కయొజ్జగారు.

తే. తనకు సంస్కృతభాషలోఁ దగిన శక్తి
లేమి మొఱఁగఁగఁ దిక్కనసోమపీథి
యచ్చొ బిగఁబట్టి యొక శ్లోక మల్లెఁగాక
యుభయ కవిమిత్ర బిరుద మే ప్రభు వొసంగె?

క. తనమాట తనకె తెలియక
చని యొక సాలీని వాక్య సందర్భంబున్
విని యర్థ మెఱింగిన తి
క్కన పాండిత్యంబు వేఱ యడుగఁగ నేలా?

క. కొమ్మన కొమరుని కయితకుఁ
గుమ్మరి గురవయ్య లేఖకుం డట! యిదియె
ల్లఁ బారాశర్యన కొక
కొమ్ము గలుగు వేల్పు వ్రాయుఁ గుదిరిన లాగో?

తే. గురుకుల క్లిష్టుఁడయి విద్యఁ గఱవఁబోక
సహజ పాండిత్యుఁడ నటంచు సంబరపడు
పోతనామాత్యు నే రాజు పూజ సేయు?
దేవరల దయ్యములను గీర్తింపకేమి?

క. ఏ కాలమందుఁ గాని
వ్యాకరణాదులఁ బ్రశస్తి వడసిన కవులం
లేకొండ్రు వ్రవులు కొండ్రె యు
వాకు లివి చవాకు లిన్ని పలికెడువారిన్?

ఆ. పాడి కవిత్వ మల్లు పోతరాజును లేఁడు
నేఁడు పిలిచి గౌరవింపరాని
హాలికుఁడయి రేఁగి యవనీశ్వరులఁ దిట్టె
నక్క ద్రాక్ష పండ్ల నామడి గతి.

తే. రావు సర్వజ్ఞ సింహ భూరమణుతోడ
బావ శ్రీనాథ కవిసార్వభౌముఁ డేమొ
చెప్పి తత్కరుణాపాత్రుఁ జేయుపిదప
భోగినీదండకము నాఁడె పోతరాజు.

ఉ. ఊరును బేరులేక పడియున్న తటిన్ మడిగట్టుకొన్నటుల్
నేరుము లాడుచుండెద రనేకులు, లభ్యము గాఁగ వెట్టి క
క్కూరితి కేవి పెద్దపడి కొంచెపుఁ గార్యము లాచరింతు, రీ
తీరు ప్రపంచమందు గలదే మన పోతన వెన్న వేటికిన్?

తే. ఆంధ్ర కవిచక్రవర్తుల కందఱకును
నీ పలుకు చాలు మేలుబంతియగుఁగాక!
తెలుఁగుసేతయె కా? స్వతంత్రించి నీవు
చేసినది యేది? శ్రీనాథ! చెప్పుకోఁగ.

ఆ. మధ్యవళ్లు పెట్టి మంజరీ ద్విపదఁ
ల్నాటి వీరచరిత నాఁ బెనచితి
వది స్వతంత్ర కావ్యమని యేరు మెచ్చుకొ
నంగవలెనొ? కమలనాభపౌత్ర!

తే. ఎఱచిఁ దినువార లేనియు నెమ్మె మెడకుఁ
గట్టుకొందురె? శ్రీనాథ కవివరేణ్య!
సానికూఁతుల తగుల మీసామునకును
బలికితివి నీ స్వభావము బయలుగాను!

తే. టంకములఁ దీర్థ మాడి కడాని గిన్నె
లందు భోజన మొనరించి యందలంబు
లెక్కి తిరిగిన గొప్ప కవీశ్వరుండె
యౌను శ్రీనాథుఁడు, గుణాఢ్యుఁ డగునొ? కాఁడొ?

తే. ప్రౌఢమాలికచేఁ దాళపత్ర పుస్త
కాటవుల సర్పపుందెరువాట్లు గొట్టి
కొఱఁతబడు నని కుకవిని గొపరి తిట్టె
పెద్దన యొనర్చినట్టి తప్పిదము నదియె.

తే. మారన కథా విధానముఁ జాఱలాడి
కోరి శ్రీనాథు తెరువులు గొల్లగొట్టి
మనుచరిత్రం బొనర్చి పెద్దన గడించె
నాంధ్ర కవితా పితామహుండన్న బిరుదు

ఆ. మనుచరిత్ర మందుకొని రాజా పెద్దన
పల్లకీఁ దన కేలఁ బట్టియెత్తె
నడిగినట్టు లగ్రహారంబు లిడె ముక్కు
తిమ్మనార్యుకంటె దిట్టఁ డనియె?

తే. తనకు నంతఃపురమునకు మనము లందు
వెడమడుగు పుట్టముద్దు లొల్కెడు నుడులను
పారిజాతాపహరణంబుఁ బల్కి మాన్పి
నట్టి తిమ్మన ఋణము రా జెట్లు తీర్చు?

తే. కృష్ణరాయఁడు చేసిన విష్ణుచిత్త
కావ్యమందలి భావము శ్రావ్యమె యగు
నెన్ని మార్లు పఠించిన నెఱుకపడని
నట్టి పాషాణ పాక మెవ్వండు సదువు?

తే. శ్లేష కావ్యంబుఁ జేసి విశేషయశముఁ
గనిన పింగళి సూరన గడుసువాఁడె
కావి, శుభ మస్తని యదేమి? గారుడంబుఁ
దెలుఁగుఁ జేసినవాఁడు వైదికుని వగిది.

కవనధోరణి కల్పనా గౌరవంబు
శబ్ద సౌష్ఠవమును లెస్స సంబరంబె;
బోగపుఁబడంతులా కలాపూర్ణ కథకు
వెత్తిన ప్రధాన నాయిక? లెంత తప్పు!

తే. తగనీ గర్వంబునం జేసి తన్నుఁ దానె
పొగడుకొనువాఁ డటంచుఁ జెప్పుదురుగాక,
నాలి పలుకులు రావు తెనాలిరామ
కృష్ణకవి నోట బంగారు గిలకదీట.



ఆంధ్రపత్రికా యంత్రశాల     [ఈ ఛాయాచిత్రం 1917 పింగళ సంవత్సరాది సంచికలో ప్రచురించినది సం ]

తే ఒకఁడు స్వప్న ప్రకారము నుగ్గడింప
నెల్లవారలకుఁ గలలె తెల్లవార్లు
నవ్వుదు రను తలంపు లే దెవ్వరికివి
పేరుకొన నేమిటికి నట్టి బీద కవుల?

తే దేవతా ప్రార్థనంబునఁ దేశ నగర
రాజవర్ణనములు కథా రచన యంత
త్రొక్కి విడిచిన పుంతయే దిక్కుమాలి
కవనముం జెప్పఁదగిన ప్రజ్ఞానిధులకు.

,, గానట బీనట వేలువు
బాసంబతియించి యాంధ్ర భాషా గ్రంథా
ఖ్యానము లేకయె తెలుఁగులు
జేసెద మనుచుంద్రు బుధులు పిగ్గఱుఁగ రొకో?

తే పూర్వకవిరాజులకు నిది భూషణంబొ
దూషణమొ యనుకొనుఁడు మీ తోఁచినట్లు
నన్నయాదుల పట్ల మాకన్నఁ గూర్మి
గలుగువారలు లేరు జగమ్మునందు

తే. మద్రనగరాంధ్ర విద్వత్సమాజ దత్త
మాత్మ విషయ ప్రియా లబ్ధ రత్న ఖచిత
హేమబిరుదాభిరాములు రామకృష్ణ
రచయితలు పీఠపురయువరాజ గురులు.



[ఆంధ్ర మహాజన సభ—ధర్మశాల, రంగూను.]

కీర్తిశేషులయిన దివాను బహదూర్ వి. నాగమయ్యగారు — నాగమయ్యగారు ఆంధ్ర నియోగి బ్రాహ్మణులు తిరునల్వేలి జిల్లా యందలి తామ్రపర్ణీ నదీ తీరమున గల వీరరాఘవపురము వీరి జన్మస్థానము వీరు 1850 వ సంవత్సరము డిసెంబరు నెలలో జనన మందిరి ఇరువది సంవత్సరము లయినను నిండకపూర్వమే చెన్నపురి విశ్వవిద్యాలయపు బి ఏ పరీక్షలో కృతార్థులైరి వీరు కొంతకాలము తిరువాన్కూరు మహారాజాగారి యున్నత కళాశాల యందు ఆంగ్ల చరిత్ర, గణితశాస్త్రము మొదలగు వానిని బోధించు పండితులుగ పనిచేసి దివాన్ సర్ టి. మాధవరావుగారి కాలములో తహస్సీలుదారుపదవికి నియోగింపబడిరి తమ బుద్ధి విశేషముచేతను వ్యవహార జ్ఞానముచేతను కొలదికాలములో దివాన్‌పేష్కారుద్యోగముమ పొంది అప్పుడప్పు డయిదు పర్యాయములు దివామగ గూడ పనిచేసిరి వీరికి రాజకీయ వ్యవహారములయందుః గల నిపుణతను బ్రిటిషు ప్రభుత్వమువారు గ్రహించి, దివాను బహదూర్ బిరుదము నొసంగిరి ఈయన జనాభా లెక్కలు తయారు చేయుటకై నియమింపబడి తమ పనిని కడు శ్లాఘనీయముగ వెలువేర్చెను. లండను నగరమున నున్న చరిత్రకారుల సంఘమువారు వీరిని తమసంఘమునం దొక సభ్యునిగ జేర్చుకొని గౌరవించిరి మహారాజాగారి యానతిచొప్పున 1904వ సంవత్సరమునం దారంభించి, రెండు సంవత్సరములలో తిరువాన్కూరు దేశ సంగ్రహ చరిత్ర మను మూడు సంపుటముల మహా గ్రంథము ను ఆంగ్లభాషలో రచించిరి వీరి పూర్వులు కృష్ణాతీర వాసులు, బొప్పూడి గ్రామ వాస్తవ్యులు. వీరు 1916 వ సంవత్సరము జూను నెలలో ఆకస్మికముగ నే రుగ్మతయు లేకయే మరణించిరి



దివాన్ బహదూర్ వి నాగయ్యగారు బి. ఎ.



రావు బహద్దరు పిట్టి త్యాగరాయశెట్టిగారు

పిట్టి త్యాగరాయశెట్టిగారు:— బ్రాహ్మణేతరోద్యమమునకు మూలవిరాట్టువారు జస్టిసు, ఆంధ్రప్రకాశిక, ద్రావిడన్ దైనిక పత్రికలను స్థాపించి బ్రాహ్మణేతరోద్యమమునకు విశేషముగా కృషి చేయుచున్నారు గొప్ప వర్తకులు, వాణిజ్య వ్యాపారములయందు వారికున్న అనుభవము అపారము చెన్నపురి శాసనసభ్యులుగ నుండిరి అనేక సంవత్సరముల నుండియు మునిసిపల్ కమీషనరుగా నున్నారు దక్షిణ ఇండియా వ్యాపార సంఘమున కధ్యక్షులు.

[ఈ ఛాయాచిత్రాలు 1918 కాళయుక్తి సంవత్సరాది సంచికలో ప్రచురించినవి సం]



సార్జెంటు ఎస్.వి రెడ్డినాయుడుగారు, దక్షిణాఫ్రికా దివాన్ బహద్దరు పానుగంటి రామారాయణంగారు

సార్జెంటు ఎస్ వి రెడ్డినాయుడుగారు :—— ఈయన డిప్యూటీ తహశీల్దారుగానుండిన సుంకరి ఆళ్వారుదాసు నాయుడుగారి మూడవ కుమారులను, లేట్ సుంకరివెంకటరెడ్డి సుబేదారుగారి మనమలునై యున్నారు ఈయనవయస్సు 22 సంవత్సరములు వీరు వివాహమైన కొలంది దినములలోనే ఈస్టు ఆఫ్రికాకు సైనికుడుగా పోవ నియ్యకొనిరి వీరు కలకత్తాలో నుద్యోగము చేయుచు బి ఎన్. రైల్వే సైనికుడుగా చేరి కొలంది దినములలో కార్పొరల్ పదవి నొందిరి. ఒక సంవత్సరము గడచిన పిమ్మట సార్జెంటుగాఁ జేయఁబడి, ఇప్పుడీ పదవియందు దేశమును కొలుచుచున్నారు వీరు తఱచుగా విశాఖ పట్టణపు టాంధ్ర అడ్వకేటువకు తూర్పు ఆఫ్రికా సంగతులనువ్యాసమూలముగాఁ బంపుచుందురు. రెడ్డి నాయుడుగారు యుద్ధరంగమున నిరంతరముఁ బోసక్క లేదు వీరికి తీరుబడి యున్నప్పుడు సంఘ సేవకై పాటుపడుచుందురు చదువురాని యాంధ్ర సైనికుల కుత్తరములు వ్రాసిపెట్టుట గాని, చదివి వినిపించుటగాని, యితర రంగముల ముచ్చటలు చెప్పుటగాని చేయుచుందురు ఈ సంఘసేవకై నాయుడు గారు మన యాంధ్ర నాయకులను దోడ్పడుమని హెచ్చరించుచున్నారు విశాఖపట్టణమందు ఎస్ రంగ మన్నారుగారు, కాకినాడయందు డీ వీ యన్ ప్రకాశ రావు పంతులుగారు, బెజవాడలో అ వేంకటరమణయ్య పంతులుగారు తమ శక్తికొలంది పాటుపడుచు కావలసిన వార్తాపత్రికలు, కవరులు, కాగితములు మొదలగున ప్రోవుచేసి తూర్పు ఆఫ్రికాకు పంపుచున్నారు నాయుడుగారు పూనికిమై కార్యము సాధించి తిరిగి త్వరలో దేశమునకు వచ్చెదరుగాక!

పా రామారాయణంవారు —వీరి ఆంధ్రభాషా పాండిత్యము లెస్స ఎం ఎ పరీక్షయందు కృతార్థులయిరి సామ్రాజ్య శాసనసభలో సభ్యులుగాను, విశాఖపట్టణములో జరిగిన ఆంధ్రమహాజనసభ కగ్రాసనాధిపతులుగాను నుండిరి ఇప్పుడు బ్రాహ్మణేతరోద్యమ వ్యాపనమునకయి యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు పానగల్లు జమీందారులు



ఆంధ్ర మహాజనసభ—నాటకశాఖ, రంగూను

[ఈ ఛాయాచిత్రాలు 1918 కాళయుక్తి సంవత్సరాది సంచికలో ప్రచురించినవి. సం ]



దక్షిణాఫ్రికాయందలి యాంధ్ర సిపాయిలు [ఈ ఛాయా చిత్రం 1918 కాళయుక్తి సంవత్సరాది సంచికలో ప్రచురించినది సం.]

# హైందవ చిత్రలేఖనము

పోడూరి రామచంద్రరావు గారు

**[1919 సిద్ధార్థి సంవత్సరాదిసంచికనుండి]**

హైందవ విద్యాధికులు ప్రాచీన హైందవ చిత్రలేఖనముంగూర్చి యత్యల్పజ్ఞానము గల్గియున్నారు వారి లలిత కళాతత్త్వజ్ఞానము ఉత్తమాధమముల విభేద మెఱింగించి పూర్వ కళా నైపుణ్యమునుండి ప్రస్తుత కళాభ్యాసమును గుర్తింపఁగల సామర్థ్యమును గల్గినదిగా కున్నది అట్టివారికి చారిత్రకమైన విమర్శనాత్మకమైన వర్ణనతోఁ గూడిన ఈ వ్యాసము బుద్ధి వికాస కారణమగునని నమ్ముచున్నాను మొన్న మొన్నటి వఱకు హిందూదేశమునఁ జిత్రలేఖనమను కళ యున్నదను మాటయే పశ్చిమ ఖండవాసులు నమ్మకుండిరి అట్టితఱి అజంతాలోని సుధాఫలకములమీది చిత్తరువులు ప్రాచీన హైందవ కళౌన్నత్య ప్రకటనమునకు హేతువు లయ్యెను అకృతమతులకు సామ్యమును మఱుఁగు పఱచి భేదమునే సూచించునట్టియు, వీనికిఁగల సంబంధమును స్థిరపరుపగలదియు నగు నొక సూక్ష్మవిషయము గనఁబడుటయేకాక, దానియందు బద్ధాదరులు గూడ నగుట తటస్థించినది బౌద్ధధర్మము భారతీయ కళావస్తు నిర్మాణమునకు నూత్న తేజ మొసంగినదని చెప్పవలసియున్నది.

ఆ ధర్మము చరిత్రాత్మకమైనది. దాని యాదిమ చరిత్రమంతయు కవులకన్న శిల్పులకే వర్ణనార్హమై యుండెను దాని సాంప్రదాయములన్నియు చాలవఱకు సచిత్రములు. ఏకాశయములుగల భిన్న దేశీయులకు సర్వ సామాన్యములగు వ్యవహార సాధనము లలవడనప్పుడు కళావాక్కే సహజమైన సాధనము క్రీ శ. 67 వ సంవత్సర ప్రాంతమున కశ్యపమదుంగుఁడను భారతీయ మతగురువు మింగ్టి చక్రవర్తి కోరికపై నసంఖ్య చిత్రకళావస్తువులతోఁ గూడ పయనమైపోయెను ఆకాలమునుండియు హిందూదేశమునుండి చైనా జపాను దేశములకు శిల్పులు పరంపరగఁ బోవుచుండిరి వారిలోఁ గొంద ఱచటనే నివాసముల నేర్పఱచుకొని శిల్పవృత్తియందే కాలముఁ గడుపుచుండినట్లు ప్రమాణములు గలవు 8 వ శతాబ్దారంభమున నిర్మింపఁబడినదనుకొను జపానులోని హెూరింజి దేవళమునందలి సుప్రసిద్ధ చిత్రపటమును గూర్చి చెప్పుచు బినియన్ అను నతఁడు ఇది పూర్తిగ భారతీయ శిక్షణ సమన్వితమనియుఁ బాత్రౌచిత్యమునందును, జీవస్ఫురణమందును, విపులమై సునిబద్ధమైన యాకార విశేషములయందును అజంతా గుహలలోని చిత్రములను స్మరణకుఁ దెచ్చుచున్నదనియు, వ్రాకుచ్చియున్నాఁడు. ఏడవ శతాబ్దమందలి నారయుగమునందలి చిత్రములను గూర్చి డిల్లన్ అను నతఁ డీ యభిప్రాయమునే ఇచ్చియున్నాఁడు రిక్కెట్సు అను నతఁడు 15 వ శతాబ్దమునసాండిన తోజా సంబంధపు శిల్పమునందు గూడ నీ సూచనలనే స్పష్టముగ వక్కాణించుచున్నాఁడు.

అజంతాలోని చిత్రములు 100—628—వ సంవత్సరములనాఁటివని చెప్పవచ్చును. ఇందలి కడపటి పటము 626—628 వ సం ల మధ్యదని పారసీకరాజైన

ఖుస్రుపర్వీజు వొద్దనుండి వచ్చిన రాయబారులను భారతీయ నృపాలుఁడగు 2 వ పులకేసి గౌరవించుటయే దృశ్యముగ దెలుపుచున్నది ఈ చారిత్రక కథను విడిచివైచినను, ఈ మందిరములందేమి, ఇతర మందిరములందేమి పారసీకదేశముయొక్కయు భారతదేశముయొక్కయు చిత్రకళలకు గల సాదృశ్యమును సూచించు లక్షణము లనేకములు గలవని బ్రౌను చెప్పుచున్నాఁడు 7— వ శతాబ్దమున భరత వర్షమున బౌద్ధధర్మము నశించినప్పుడే ఈ కళ గూడ అంతరించినట్లు కనఁబడుచున్నది తరువాత వేయి సంవత్సరములకుఁ గూడ భారతీయ చిత్రము లెచ్చటను నిదర్శనమునకైను గావరాకున్నవి కాని భారతీయ కళను గుఱించి సాక్ష్యమిచ్చు నాధారములేవియు లేకుండినను భారత పరిసర దేశములందలి కళాపరిశీలనము కొంతవఱకు సాహాయ్యకారి గావచ్చును క్రీస్తు ననంతరము తొలి శతాబ్దములలో యవన, భారత, పారసీక, చీనా నాగరకతలకు కూటస్థానమగు తూర్పు టర్కీ కోటూరులో సామ్యవిశేషముచేత అజంతా శిల్పులలో నొకని చేతిపనియై యుండు ననఁదగిన పటము లెస్సియో స్టీన్‌లీ కాగూలి పరిశ్రమచే వెల్వడి యున్నవి

ఈ విధముగ 10 వ శతాబ్ది పర్యంతము నామమాత్రావశిష్టమై ఈ కళ భారత ఖండమున 16 వ శతాబ్దపు ద్వితీయ భాగమున నక్బరు చక్రవర్తి కాలములో తిరిగి తలయెత్తెను ఆతని కుమారుఁడును విలాస పురుషుఁడునునగు జహాంగీరు కాలములో సున్నత దశను పొందెను ఈ మొగలాయి ప్రభువులందఱు రసికాగ్రేసరులగుటచే వారి రాజ్యకాలములో నన్నివిధముల శిల్పములును వృద్ధి పొందుచువచ్చెను అబ్దుల్ ఫజల్ అను నతఁడు ఈ కాలపు చిత్రకళా వ్యవస్థను గుఱించి యెంతయో ప్రౌఢముగ నుపన్యసించుచు సందర్భవశమున నక్బరు చక్రవర్తికి ఈ శిల్పులయందును వారి శిల్పకళా దక్షతయందును గల యాత్మాభినివేశమును దెల్పియున్నాఁడు ఈచక్రవర్తియొక్క ఆదర్శభావమే కల్మాల్, షిరాజ్, టాబ్రిజ్, సమర్కండ్ ప్రాంతములనుండి అనేకుల నీ దేశమున కాకర్షించెను. రాను రాను ఈ కళ, మొగలాయీలు కాలక్రమమున నీ దేశీయులలో కలిసిపోయినట్లే, భారతీయకళతో నేకీభావము నొందెను విదేశీయ శిల్పులతోఁబాటు హైందవ చిత్రకారులను గలసి పని చేయుచుండిరి రసికాగ్రేసరుఁడైన చక్రవర్తియు వారల సహజనైపుణ్యమును గ్రహించి తగున ట్లవకాశములు గల్పించుచు వచ్చెను ఉదారుఁడును సుజ్ఞానుఁడునగు నీ శ్రేణి నికటమున వీరలు కలసి మెలసి పని చేయుచుండుటచే నిరుతెగలవారును ఒండొరుల యనుభవజ్ఞానము నుపయోగించుకొనుటకు సంసిద్ధులై యుండుటచేతను పరస్పరానుకూలమైన ఈ స్థితిగతులలో, నీ యుభయ మార్గముల సమ్మేళనమే కళాభివృద్ధికి కారణమైనదనుటయు ఈ యానుకూల్యారంభమునుండియే మొగలుల శిల్పకళా సాంప్రదాయము లుద్భవించినవనియును పాఠకులకు విస్పష్టము కాఁగలదు.



పెర్సీ బ్రౌను తన పుస్తకములో 'రాజపుత్ర యుగము' అను శీర్షికతో వ్రాసిన రాజపుత్ర కళాసాంప్రదాయము ఈ మొగలాయి సాంప్రదాయమునకు సమకాలికమై దానిని చాలవరకు పోలియుండెను కాని, బ్రౌనుగారు రాజపుత్రుల కళాప్రయోగ విషయమున విశుద్ధ భారతీయమగుటచేత, అజంతాలోని పురాణవస్తు సమాగతమేయని వాదించుచున్నారు వీనియందు రాజపుత్రుల వ్యక్తిత్వమును నాగరకతయును ముద్రితములై యున్నట్లు, నేటివఱకు తెలియనగుననియు నీ సంధికాలమున రాజపుత్రస్థానములోని హిందూ చిత్రకళా సాంప్రదాయమును చెక్కుచెదరకుండఁ గాపాడిన దిదియే యనియు జెప్పుచున్నారు రాజపుత్రులకును మొగలాయిలకునుగల సౌహార్దమును ఒక నాగరకత మఱియొకరి నెట్లు ప్రేరేపించినదియుఁ జూచినపుడు రాజపుత్రుల చిత్రకళ, బౌద్ధుల పురాణశైలికన్న సమకాలికమైన మొగలాయి శైలినే యనుకరించినట్లు తోఁచుచున్నది బ్రౌను దొరగారు ఈ దేశీయ విద్య మొగలాయిప్రభుత్వమునందే తిరిగి తలసూపుచున్నదనియు, నంతకుపూర్వము దానిస్వరూపమెట్టిదో తనకు తెలియరాదనియు జెప్పుచున్నారు.

పిమ్మట రాజపుత్రకళకు జయపూరు సంస్థాన మాట పట్టాయెను అచటినుండియు, రాజపుత్రస్థానములోని ఇతర పట్టణములనుండియుఁ గ్రమ క్రమముగ నీ విద్య మొగలాయి ఆస్థానమును జేరి 17 వ శతాబ్దమున నొక్కొక్క సమయమున ఢిల్లీ, ఆగ్రా, లాహోరు మొదలగు నొక్కొక్క పట్టణమును దత్తద్దేశ భేదముల నందుచు, మొత్తముమీఁద రాజపుత్ర కళా లక్షణములతోడనే వెలయుచుండెను మొగలాయి ప్రభుత్వము క్షీణించుటతోడనే భారతదేశమున నీ విద్యయు క్షీణింపఁజొచ్చెను మఱియు 1760 సం లో నీ ప్రభుత్వము ముగిసినపుడీ విద్య చాల క్షీణదశయందుండెను ఢిలీ, లక్నో పట్టణములలో కొందఱు శిల్పు లింకను నీ వృత్తి నాధారముఁ జేసికొనియుండిరి కాని వారి కల్పనలు జీర్ణించిన కళయొక్క యనుకరణములు మాత్రమే యని చెప్పవలయును ఈసమయమునఁ గులవిద్యయం దభిమానముగల కొందఱు శిల్పులు పాటలీపుత్రమునకు వచ్చి క్రొత్తమార్గములం ద్రొక్క మొదలిడిరి కాని వారి పనియందించుక గుణముండినను భావరహితమై యుండెను

దక్షిణదేశములో నీ కళ ఉత్తరదేశమునకన్న భిన్న మార్గములలో పెంపొందెను 17 వ శతాబ్దప్రారంభముననే దక్షిణమునఁ బారసీక శైలి యొకటి యనుసృతమైనది అచ్చటికి అప్పుడప్పుడు హిందూస్థానమునుండి శిల్పుల కుటుంబములు వచ్చి చేరుచుండెను వారి సంతతివారు నేటికిని హైదరాబాదు, నెక్కొండలలోఁ గానవచ్చుచున్నారు. ఇంకను దక్షిణమునకు పోయినకొలఁది ఈ చిహ్నము లనేకములు గానఁగును వీనినిబట్టి చూడఁగా నివి ప్రత్యేకముగ పుట్టి పెరిఁగినట్లే తోఁచుచున్నది కాని ఉత్తర దేశపు విద్యతో సన్నిహిత సంబంధము కలదనియే సాంప్రదాయకులు చెప్పుచున్నారు ఇటీవలనే ఈ విద్యలు రెండు విధములై తంజావూరునందును, మైసూరునందును వెలసెను

తంజావూరులోని శిల్పులు 18 వ శతాబ్ద్యంతమునఁ దొలుదొల్త హిందూస్థానమునుండి వచ్చినవారే! వారి సంఖ్య క్రమ క్రమముగ వృద్ధి నొందినది తంజావూరి రాజులలోఁ గడపటివాఁడైన శివాజీ కాలమున (1833—1855) దంత, దారువుల రెంటియందును సుప్రసిద్ధమైన పనిని జేయు 18 కుటుంబములవారై యుండిరి శివాజీ మరణానంతరము ఈ కులమంతయు చెదరిపోయెను కాని నేటికిని తమ కులవిద్యను ఆశ్రయించియున్న కొలఁది కుటుంబములవారు మాత్రము "బజారుపట"ములను వ్రాయుచున్నారు

మైసూరులోని శిల్పిసంఘము 19వ శతాబ్దానంతరమున రాజా కృష్ణరాజ ఉడయార్‌వారి ప్రభుత్వములో ఉన్నత దశను పొంది 1868 వ సం లో నాయన మరణించినపు డంతటితో నడుగంటెను ఇట్లే చిత్రకళ అంతకంత కధోగతిఁ జెందుచు పూర్తిగ శిథిలమగునట్లుండెను కాని పెర్సీ బ్రౌన్ ఇట్టి కృపణదశ కళయొక్క పునరుద్ధారణకు ప్రతికూలము కాదనియు నూత్న శక్తి యేది యేది ఉద్భవించినచోఁ గళాజీవనమును మఱల వికసింపజేయనగుననియు నుడువుచున్నాఁడు వంగదేశమున నిటీవలఁ బొడసూపినది ఈ నూత్న శక్తియే కదా!

ఈ నూతనోద్యమమునకు అవనీంద్రనాథఠాకూరు నాయకుఁడు ఈయన ఇతర విద్యారంగములలో ప్రసిద్ధిఁ గాంచిన యొక విద్వత్కుటుంబమున జనియించెను సునిశితమైన సహజకళా పాండిత్యము గలవాఁడు మోహన విగ్రహుఁడు ఈయన కొందఱు శిల్ప యువకులను తన చుట్టుఁ జేర్చికొని పనిని ప్రారంభించెను కొలఁది కాలములోనే వీరలకృషి యెంతో సాఫల్యము నొందినది ఈ యభినవ మండలివారు చేయుపని ఏదో యొక గ్రుడ్డి యనుకరణముగాని అథవా అనేక శైలులపై నాధారపడిన యొక కృత్రిమ సృష్టిగాని గాదు అట్లుగాక వారల చిత్రములు మొత్తముమీఁద నభిమాన సంకల్పముల కనువైన వ్యక్తియొక్క ఆత్మాశయముల దృఢముగఁ దెలుపగల స్వాతంత్ర్యమును గల్గియున్నవి ఈ సంఘమువారు చేయుపనియంతయు సాంప్రదాయ మార్గములనే సమున్నత మనోభావములను చిత్రించుటయందు శిల్పకునికిఁగల యవ్యాజమైన కుతూహలమునే తెల్పుచున్నది ఈ సంఘమును స్థాపించుటలో హిందూదేశము కళావ్యాప్తి కాలమున నేమార్గము ననుసరించెనో ఆ మార్గమే కొంతవఱకు అవలంబింపఁబడినది

ఈ నూతనోద్యమ మిప్పు డభినందింపఁబడుచున్నను జను లింకను గుణ గ్రహణపారీణులైనఁగాని నిజమగు లాభము నొందఁజాలదు బ్రౌను, భారతీయుల గుణ గ్రహణ శక్తి ఈ విషయమున పరిపక్వము నొందలేదనియు, ఈ జ్ఞానము పరిణతి నొందిననే ఈ కళ గూడ నేమాత్రమైన పరిణామము నొందఁగలదనియు నభిప్రాయపడుచున్నాఁడు ఈ రెండు శక్తులును ఎప్పుడు కలసి పనిఁజేయుట కారంభించునో అప్పుడే భారతీయ కళా పునరుద్ధారణ మాసన్నమైనదని తలంపవచ్చును

# నన్నయభట్టు వంశపుకవి - గోపాలుని రామకవి

బారిష్టరు ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు

[1919 సిద్ధార్థి సంవత్సరాదిసంచికనుండి]

నేను గుంటూరు కాలేజిలో చదువుకొనుచుండఁగా ఫిరంగిపుర వాస్తవ్యులగు లేటు చిలకా కృష్ణయ్యపంతులుగారు నన్నయ్యభట్టు మహారాష్ట్రుఁడని గురుజాడ శ్రీ రామమూర్తిపంతులుగారు వ్రాసిరనియు అది సరికాదనియు నన్నయ్యభట్టు వంశమువారు గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాలో నున్నారనియు చెప్పియుండెను ఈ కృష్ణయ్యగారి కింగ్లీషు రాకున్నను సంస్కృతాంధ్రములలోఁ దగుపాటి సాహిత్యమును ఆంధ్రదేశపు పూర్వచరిత్రలోఁ జక్కని యభినివేశమును తనరకపు పండితులకంటె నెక్కువ విశాలదృష్టియుఁ గలిగియుండెను. దీని విషయమై విచారణ చేయవలయునని కృష్ణయ్యగారి కభిలాష యుండెనుగాని వారి కకస్మాత్తుగా మరణము సంభవించుటచే ఆ విచారణ యంతట నిలిచిపోయెను కృష్ణయ్యగారి మేనల్లుఁడు ప్రస్తుతము నరసారావుపేటలో ప్లీడరుగనున్న నడింపల్లి జగన్నాథరావుపంతులుగారు ఈ విషయమై కొంత విచారించి గోపాలుని రామకవిచే రచింపఁబడిన గ్రంథము నొక ప్రతిని సంపాదించియుంచినారు. గోపాలుని వంశమున నితర కవులుఁ గలరనియుఁ దెలియవచ్చినది జగన్నాథరావుగారు ఈ విషయమున నింకను కృషిచేసి ఈ తాలూకాలో తమకుఁ గల పరపతి నుపయోగింతురని తలంచెదను ప్రస్తుతము రామకవినిగూర్చి తెలియవచ్చినంతవఱకు వ్రాయుచున్నాను.

ఇప్పుడు దొరకిన ప్రతి కొండవీటి కాగితములపై వ్రాయఁబడి మిక్కిలి శిథిలమైయున్నది వినుకొండ తాలూకా ముప్పాళ గ్రామములో గోపాలునివారి గృహమునందు మరియొక తాళపత్రప్రతి గలదఁట అది దీనికంటె పూర్వపుదని వింటిను ఈ కాగితపు ప్రతిలో మూఁడు గ్రంథములు వ్రాయఁబడియున్నవి ప్రతివిలేఖకుఁడు గోపాలుని కృష్ణయ్య దీని మూలగ్రంథము ఇప్పటికిని గలదని వింటిని

## 1 పారిజాతాపహరణము

ఈ ప్రతిలోని మొదటి గ్రంథము పారిజాతాపహరణమను యక్షగానము ఇది వీధి నాటకముల ఫక్కి నుండును కృతికర్త కృతిభర్తల పేర్లు లేవు దీని మొదటి పుటలు పోయినవి.

## 2 ద్రౌపదీస్వయంవరము

రెండవ గ్రంథము ద్రౌపదీ స్వయంవరము ఇది మూఁడాశ్వాసముల ద్విపద ప్రబంధము దీనిలోని

"మదనూరి పురవాసు మూర్తివిలాసు
సదమలగుణశాలి సత్యసంశీలి
పుట్టనామాత్యసత్పుత్రుండు నీతి
బట్టినఁ దగ వీరభద్ర సత్కవిని"

అనుదానివలన కవిపేరు వీరభద్రుఁడని తెలుచున్నది మఱియు,

వసుధలోపల సూర్యవంశంబునందు
పొసఁగ జన్మించిన పుణ్యపురుషుండు
కరుణాపయోనిధి గాంభీర్యమూర్తి
ధరలోన నెన్నఁగ దగినట్టి ఘనుఁడు
రమణతో శ్రీ కనకరాజు చెన్నప్ప
క్రమముతోడుత నన్నుఁ గరమర్థిఁ బిలిచి.

అనియు,

మేరుధీరుఁడు బుద్ధి మించినవాఁడు
సకల పురాణముల్ సకల శాస్త్రములు
సకల విద్యలు నెఱుఁగు జాణశేఖరుఁడు
గండర గండాంకగండభేరుండ
దండిబిరుదాంకుఁడై తనరారువాఁడు
పరఁగ సరస్వతీభండారమునకు
ఇరవొంద నెఱిఁగిన యినకులోత్తముఁడు

అనియు కవి కృతిభర్తను గూర్చి వ్రాసియున్నాఁడు కవిని గూర్చియు కృతిభర్తను గూర్చియు ఇంతకంటె నిప్పుడు తెలియదు.

## 3. చిత్రాంగదా పరిణయము

ఇదియొక పద్యకావ్యము కవి గోపాలుని రామకవి కావ్యము అహోబళ నరసింహస్వామి కంకితము ఇది కొంచెము ప్రౌఢముగా నున్నది ఇప్పుడు దొరకిన ప్రతిలో రెండవ యాశ్వాసము కొంతవఱకే వ్రాయఁబడియున్నది చివర పద్యము పూర్తిగనయినను వ్రాయఁబడియుండలేదు కాలము నిర్ణయించుటకు సరియయిన యాధారములు కనఁబడవు గ్రంథములోని విషయములనుబట్టి కవి మిక్కిలి ప్రాచీనుఁడు కానటు తోఁచుచున్నది.

కవి యాదియందు త్రిమూర్తులను వారి భార్యలను విఘ్నేశ్వరుని హనుమంతుని తార్క్ష్యుని కుమారస్వామిని కౌమోదకీ ఖడ్గ శార్ఙ్గములను పూర్వబుధులను స్తుతించియున్నాఁడు షష్ఠ్యంతములు గలవు గురుఁడీ విధముగా స్తుతింపఁబడియున్నాఁడు

క. పొంగుచు తారకయోగ వి
ధిం గల లక్ష్యానుభవము దెలుపుచు మహరా
జాంగవిధుని మదుగ్గురు నర
సింగని శివరామఘనుని సేవింతు మదిన్

ఈ ఘనుఁ డెవ్వరో మన కింకను తెలియవలసియున్నది. కవిస్తుతి:

సీ. రామాయణార పూర్ణవివేకి వాల్మీకి
విశ్రుతాశుకవి ప్రవీణు బాణు
విమల సాలంకార విఖ్యాతి భవభూతి
మానిత శబ్ద సమాజు భోజు
మూర్ఖ విత్సన్నతమోరవి భారవి
కవితాచణోల్లాసు గాళిదాసు

సహజోపమానవిస్తంద్రుఁ జోరకవీంద్రుఁ

నుత్ప్రేక్ష్య కవితామయూఖు మాఖు

నా మనంబునఁ దలపోసి నన్నపార్యు

సోము భాస్కరభీమాది సుకవిజనులఁ

బ్రణుతి గావించి శ్రీనాథు రంగనాథుఁ

బోతనార్యుల స్మరియించి పూజఁజేతు.

పై పద్యమున శ్రీనాథుఁడును పోతనార్యుఁడును స్తుతింపఁబడి యుండుటచే కవి 15—వ శతాబ్దికి తరువాతి వాఁడనుట నిశ్చయము. ఏకాలమువాఁడో నిశ్చయముగఁ జెప్పవీలులేదు.

చ. అటఁజని కాంచె పాండుసుతుఁ డభ్రనటీవరతానవాన వి
స్ఫుటకలషడ్జ గాన భవ భూరి భయార్తి విలీన గూఢపా
త్పటల జుఘ్రుక్ష కేళి కల ధర్షణ హేతు తరంగ రంగదా
ర్భటపటు నిర్ఝరీవిశద భవ్య విశాలము శీతశైలమున్.

ఈ పై పద్యమును అల్లసాని పెద్దనయొక్క "అటఁ జని కాంచె భూమిసురుఁడు " అను పద్యముతోఁ బోల్చిన యెడల వీరిలో నొకరు రెండవవారి ననుసరించియుందురని చెప్పవచ్చును

మన కవి పెద్దన ననుకరించిన యెడల పెద్దనకు తరువాతివాఁడు అనఁగా 16—వ శతాబ్దిలోనివాఁడో తరువాతివాఁడో అయిన నెంచవలసి యున్నది ప్రస్తుతము కవికాల విమర్శనము నింతటితో విరమింతము.

కవివంశము

కవి ఆశ్వాసాంతమున నిట్లు వ్రాసియున్నాఁడు.

గద్య ఇది శ్రీ మదహోబళ లక్ష్మీనరసింహ కరుణా కటాక్ష వీక్షణ విచక్షణా క్షీణ మహిమా కలిత లలిత కవితా విలాస మృదు మధుర వచన రచనా విలాస గోపాలయాన్వయాంభోనిధి సంపూర్ణ రోహిణీ కళత్ర మౌద్గల్యసగోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర యోగానందయామాత్య పుత్ర సరసనన్మాన రామాభిదాన ప్రణీతంబైన చిత్రాంగదా పరిణయం బను శృంగార కావ్యంబునందు ప్రథమాశ్వాసము సంపూర్ణము

దేవతాదిస్తుతు లయిన తరువాత నీ విధముగా నున్నది

వ మద్వంశక్రమం బభివర్ణించెద.

మ. వివిధామ్నాయ పురాణశాస్త్ర పటిమావిత్పన్నుఁ డధ్యాత్మ మా
ర్గవిశేష ప్రతిపాదమానసుఁడు సాంఖ్యస్థైర్య నిష్ఠానుయో
గవినోదానుభవ ప్రమోదుఁడు తపోగ్రజ్వాలి మౌద్గల్యమౌ
నివరేణ్యుండు ప్రకాశమందె ధరిణిన్ విజ్ఞానపారీణుఁడై

క. ఆ మౌద్గల్యసగోత్ర ల
లాముఁ డనుపొగడ్త గని యిలన్ శబ్దపటి
ష్ఠ మేయదక శికా
కాముఁడు నన్నయ జనించె గణనాగణుఁడై .

సీ. తగ నంధ్రశబ్దచింతామణి పంచప
రిచ్ఛేద నియతి నిర్మించె మొదల
గణవర్ణకూట లక్షణ శుభాశుభ ఫల
శిక్షా ప్రబంధముల్ చేసె నాది
కవి జనాళికిఁ జమత్కార కల్పనలను
మించి జాడల నేర్పరించెఁ దొలుత
సంస్కృతం బంధ్ర భాషాయుక్తి సాధించి
నిర్దిష్టనామముల్ నిలిపె రూఢి
భారతామ్నాయ పాథోధిపటిమఁ దెలిసి
వేడ్క నీఁద నపేక్షించి విబుధు లెల్ల
నౌర! నన్నయభటు విద్యలకు రట్టు
కుకవి వాకట్టు సత్కవి కోటగట్టు.

క. ఆ నన్నపార్య వంశాంభోనిధి సంపూర్ణచంద్రు పోలికను దయా
నూనగుణాలంకారుఁడు దీనిధి గోపాలుఁ డమిత తేజుఁడు పుట్టెన్

సీ. చిన్న యీడున జను లెన్న వ్యాకరణాది శాస్త్ర పరిజ్ఞానచణతఁ గాంచె
సకల వేద పురాణ సంహితౌచిత్యార్థ వాచక ప్రజ్ఞాప్తి వన్నె కెక్కె

తత్ప్రజుడై సాంఖ్యతారకప్రఖ్యాత రాజవిద్యా ప్రచారములఁ బబలె
లయమొప్పఁగా మంత్రలయహఠాదులను యోగాభ్యాసరూఢిదేహంబుమఱచె
దీక్ష లొప్పు నహోబల తీర్థమందు
నృహరినిం గూర్చి పెక్కునా ళ్ళాహారహంబు
తపము గావించి మెప్పించి తగిన వరము
లందె గోపాలు చార్య మహాత్ముఁడగుచు

క ఆ వంశము న ననేకులు ప్రావిర్భవ మంది రెలమి పారంపరయా
ధీవర్యులు గుణధుర్యులు ప్రావీణ్యులు రాజకార్యపరతాగణ్యుల్.

ఉ లాలిత పాకశుద్ధి శుభ లక్షణ లక్ష్య సమృద్ధి నవ్యవా
గ్జాలవిధంబులై న రసకల్పిత మాధురి శబ్దధోరణీ
లాలనయుక్తి సాధకవిలాసము తో భళి మెచ్చవచ్చు గో
పాలునివారి యిల్లునికిపట్టు గదా కవితామతల్లికిన్

సీ సకల రాజాస్థాన జనమనోరంజన
ప్రచుర శేఖరులు గోపాల్నివారు
ప్రత్యక్ష బాహాట పాంచాలనట సాధ్య
ప్రచుర శేఖరులు గోపాల్నివారు
హితజనపాలనోచిత కార్య కృత కృపా
పారీణమతులు గోపాల్నివారు
..... ..... ... ..... ..... .....
ప్రకటయోగానుభవులు గోపాల్నివారు
అట్టి గోపాల్నివారిలో నలఘు విభవ
దిక్ప్రభుస్థానపాళి సందీప్తహేళి
రమ్యగుణహేళి సూరపరాజమౌళి.

శా. నానాయుక్తిబల ప్రవీణతల విన్నాణంబుగా రాజసం
స్థానామాత్యవిధుల్ రచించి బుధ పోష్యస్థావ్య సంపాదనా
హీనస్థాపన నేర్పుతోంచి వికటించేవారి సుగ్రాడె యో
గానందుండు నియోగి నైపుణత లాహా చెప్ప నాశ్చర్యముల్!
..... ..... ..... ..... ..... ....

వ. (యోగానందునివలన) ఆమెకు రామన వెంకన యన నాత్మ జాలు సంభవం బందిరందులో రామ కవివర్యుండ్సదా హరి సత్కృప్రాపకటాశీ ప్రలబ్ధ పారక చణుండ.

పై పద్యములవలన కవి తాను నన్నయ భట్టారకుని వంశమున జనించినట్టు స్పష్టముగఁ జెప్పియున్నాఁడు.

వినుకొండ తాలూకాలోని ముప్పాళ మొదలగు గ్రామములయందును దరిశి తాలూకాలోని కొన్ని గ్రామములయందును మౌద్గల్యసగోత్రులును ఆపస్తంబసూత్రులునగు గోపాలునివారు అనేకు లున్నారు.

నన్నపార్యుడు ఆదిపర్వములో తన్నుఁ గూర్చి

సీ. తన కుల బ్రాహ్మణు ..... .. ..
లోకజ్ఞు నుభయ ..... ... ..

అని చెప్పుకొనియున్నాఁడు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు నన్నపార్యుఁడు "తన కుల బ్రాహ్మణు" అని వ్రాసికొనియుండుటచేతను భట్ట బిరుదాంకితుఁడగుటవలనను వైదికశాఖవాఁడనియు, గురుజాడ శ్రీ రామమూర్తి గారు పై పద్యమున నన్నయ్య "లోకజ్ఞు" అను విశేషణము నుపయోగించుకొని యుండుటచే వైదిక లౌకికములు రెండునుఁ గలిగియున్నాఁడనియు, అందువలన నతఁడు చాళుక్యులతో నేతెంచిన మహారాష్ట్ర బ్రాహ్మణుఁడై యుండనోపుననియు వాదించియుండిరి. కాని, అవి వట్టి యూహలు శ్రీనాధునకును భట్టు అనియు ఆచార్యుఁడనియు బిరుదములు గ్రంథములవలనను శాసనములవలనను స్పష్టముగా నున్నవి గోపాలుని వారు ఇప్పటికిని నన్నయ సంతతివారమని చెప్పుకొందురు. రామకవియు నట్లే పైఁ జెప్పినట్లు వ్రాసియున్నాఁడు. ఈ గోపాలుని వారు ఆర్వేల నియోగులు వీరు పాకనాటిశాఖకు చెందియుందురు.

(పై పద్యములలో లేఖక ప్రమాదములు సవరింపలేదు)

# ది కె. సి. పి. లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీసు : 38, మౌంట్ రోడ్ మద్రాసు-6
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు & వర్క్సు : పి. బి. నెం. 2278,
తిరువత్తియూరు, మద్రాసు-19.
టెలిఫోన్ 52201 (5 లైనులు) తంతి · FABRIKATER
మేనేజింగ్ ఏజెంట్స్ వి రామకృష్ణ సన్స్ ప్రైవేట్ లిమిటెడ్.
ఛైర్మన్ శ్రీ వి రామకృష్ణ, I C S. (రిటైర్డ్)

| | |
|---|---|
| చెల్లింపబడిన మూల ధనము . | రు. 3,00,00,000 |
| పిలువబడి, చెల్లింపబడిన మూల ధనము ; | రు. 1,11,93,840 |
| రిజర్వులు ; | రు 1,97,73,668 |




S A

సెంట్రల్ వర్క్‌షాప్స్, మద్రాసు-19 నందు తయారగునవి.

మెస్సర్స్ ఫైవ్స్ లిల్లీ—కెయిల్, పారిస్, ఫ్రాన్స్‌వారి సహకారముతో
పంచదార మరియు సిమెంటు పరిశ్రమలకు
కావలసిన పూర్తి యంత్ర పరికరములు

మెస్సర్స్ ఇమ్‌కో కార్పొరేషన్, సాల్ట్ లేక్ సిటీ, యు ఎస్.ఏ. వారి
సహకారముతో రోటరీ వాక్యూమ్ ఫిల్టర్లు.

విల్‌హెల్మ్స్ బర్గర్ మేష్కినెన్ ఫ్యాబ్రిక్ హిన్‌రిచ్స్ & సోహ్నె, హాంబర్గ్
వారి సహకారముతో ప్లేట్ వర్కింగ్ మెషినరీ.

సల్ఫ్యూరిక్ ఆసిడ్ మరియు సూపర్ ఫాస్ఫేట్
యంత్ర పరికరములు, ఇతర భారీ పరిశ్రమలకు,
అన్ని రకములైన స్టీల్ కాసింగులకు యంత్రములు.

వుయ్యూరు, కృష్ణా జిల్లా, ఆంధ్రప్రదేశ్‌నందు తయారగునవి
పంచదార, కన్‌ఫెక్షనరీ మరియు డినేచర్డ్ స్పిరిట్.

మాచర్ల, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్ నందు తయారగునవి:
పోర్ట్‌లాండ్ సిమెంట్.

# ఏకలిపి

కొమాండూరి శఠగోపాచార్యులుగారు, బి. ఎ. (ఆనర్సు)

**[1919 సిద్ధార్థి సంవత్సరాదిసంచికనుండి]**

ఏతన్మహాభరతఖండమున కనేకులు సంగ్రహప్రపంచమని పేరిడిరి. ఇందు, గల నైసర్గిక స్వరూప వైచిత్రియేకాక జనుల జాతి మత భాషాదులయందలి వివిధ భేదములును మఱి యే ఇతర దేశమునందును కానరావని చెప్పవచ్చును. ఇట్టి భేదములన్నియు నేక దేశమునందు కూడియుండుట తారతమ్య చర్చ చేయఁబూనుకొను కొందఱు విద్వాంసులకు మిక్కిలి యుపయోగకారి యగుట యథార్థము కాని, వానిలోని కొన్ని వైషమ్యములు మన జాత్యైక్యమునకు భంగకరములుగా పరిణమించుచున్నవి ఇతర దేశములలో కూడ నక్కడక్కడ కొన్ని విషయములందు భేద వైషమ్యము లున్నవి కాని, అన్ని విషయములందును విచిత్రత యొక్క మన దేశమున మాత్రమే సమకూడి జాత్యైక్యమునకు హానికరములగుటకు పరస్పరము సహాయము గావించుచున్నవి వానిలోని కొన్ని సమస్యలు పరస్పర సంబంధము కలవగుటవలన వానిని పరిష్కరించుట దుస్సాధ్యముగా నున్నది కాని, యొక్కొక్కటి పరిష్కృతమైన కొలది ఇతర సమస్యలను పరిష్కరించుట సులభతర మగును.

కొంతకాలమునుండి ఏక భాషను వ్యాపింపఁజేయుటకు మన దేశమున ప్రయత్నములు జరుగుచున్నవి నాగరి ప్రచారణీసభ మొదలగు కొన్ని సంస్థలు హిందీ భాషను సాధ్యమైనంతవఱకు సర్వవ్యావహారిక భాషగా చేయుటకు ప్రయత్నించుచున్నవి ఈకార్యమునందలి కష్టములనేకు లెఱిగియే యున్నారు ఈ విషయమున మనదేశము యూరపు ఖండముతో పోల్పఁబడుచున్నది కాని యూరపు ఖండమునం దంతటను (ఒకటి రెండు దేశములందు తప్ప) జనులందఱు నొక్క లిపినే వాడుచున్నందున వారొకరి భాష నింకొకరు నేర్చుకొనుట సులభము అదిగాక, యూరపు ఖండము ఏకదేశము కాక అనేక దేశములు కూడియున్నందున అచ్చట కొన్ని యంతర్దేశీయ వ్యవహారములకు మాత్రమే యేక భాష కావలసియున్నది అంతవఱకే కావలయునన్నచో ప్రస్తుతము మనదేశమున నింగ్లీషుభాష ఈ కార్యమును నిర్వర్తించుచునే యున్నది భరతఖండ మేక దేశమైనందున మన రాజకీయ సాంఘిక మత సారస్వతవృద్ధికై మన కేకభాష కావలసియున్నది మొదట దేశమున నేక లిపి ఏర్పడినఁగాని యేక భాషావ్యాపన సౌకర్యము కలుఁగదు ఏకలిపియే యున్నచో, అన్ని ప్రాంతములవారును సామాన్య భాషనుగాని తమ ప్రాంతములందలి మఱియొక భాషను గాని నేర్చుకొనుట సులభసాధ్య మగును.

మన దేశమున ప్రస్తుతము మున్నూటికి మున్నీసము జనులకే లిపి జ్ఞానమును లేదు జన సామాన్యములకు తప్పక చదువను వ్రాయను నేర్చుట కిప్పుడే ప్రయత్నములు ప్రారంభింపఁబడుచున్నవి ఇట్టి తరుణముననే యేకలిపిని నిర్ధారణచేసి వ్యాపింపఁజేయుటకు తగిన ప్రయత్నములు సలుపవలయును

ప్రస్తుతము హిందూదేశమున సుమారు 10 ముఖ్య లిపు లుపయోగములో నున్నవి అందు ఇంగ్లీషుభాషకై యుపయోగింపఁబడు రోమనులిపి యూరపుఖండపుది అరబ్బీ మొదలగు తురుష్క భాషల లిపియే ఉర్దూ భాషకును లిపిగా నేర్పడినది తక్కిన వానిలో ముఖ్యమైనది దేవనాగరి బంగాళి, గుజరాతి, తెలుగు మొదలగునవన్నియు దీనిని పోలినవే

ఇందు దేవనాగరి నేకలిపిగా చేయుటకు కొంతకాలమునుండి ప్రయత్నము చేయఁబడుచున్నది కీర్తిశేషులగు శారదాచరణమిత్రగారి యధ్యక్షతక్రింద నీ యుద్దేశముతో కలకత్తాలో నేకలిపి విస్తార పరిషత్తు స్థాపింపఁబడి, అనేక ఘనుల ప్రోత్సాహముతో దేవనాగర్ అను బహుభాషి మాసపత్రికను ప్రకటించుచుండెను కాశి, కలకత్తా మొదలగు నగరములందు స్థాపింపఁబడి హిందీ భాషా వ్యాప్తికై కృషి చేయుచున్న సభలకు దేవనాగరి నేకలిపిగా చేయుట కూడ ముఖ్యోద్దేశమైనందున వానికి నాగర ప్రచారిణీ సభలని పేరువచ్చెను దేవనాగరి యిప్పుడు మనదేశమునం దన్నిటికన్న నెక్కువ విరివిగా వ్యాపించియున్నదగుటచే అదియే యేక లిపి యగుటకు పీలుపడునా యను విషయమును మన మిప్పుడు నిష్పక్షపాతబుద్ధితో విమర్శింపవలసి యున్నది దేవనాగరి హిందీ, మహారాష్ట్ర భాషల లిపి ఈ జనులు సుమారు పది కోట్లుందురు (కాని, వీరిలో మిక్కిలి స్వల్పసంఖ్యాకులు మాత్రమే లిపిజ్ఞానము కలవారని మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును) అదిగాక, సంస్కృతమునందలి యనేక ప్రాచీన గ్రంథములు నాగరిలిపిలోనే యచ్చుపడియుండుటవలనను నాగరి సంస్కృతపు స్వకీయలిపిగా నెంచఁబడుటవలనను అది పవిత్రముగా నెంచఁబడి సంస్కృత భాషాజ్ఞు లనేకులచే నేర్చుకొనఁబడుచున్నది. అందలి యక్షరముల యేర్పాటును వాని వరుసయు శబ్ద శాస్త్ర విహితముగా నున్నవి కాని, దేవనాగరిజాతి లిపులలో, అందు ముఖ్యముగ నాగరిలో, అనేక లోపములు కూడ కలవు ఈ లిపిని వ్రాయుట కష్టసాధ్యము శీఘ్రముగ వ్రాయుటకు వీలుపడదు ఈ లిపిలోని ప్రత్యక్షరము నొక కట్టడమువలె నుండును దీనికన్న గుజరాతి బంగాళి తెలుగు మొదలగు లిపుల నెక్కుడు సులభముగ వ్రాయవచ్చును. ఈ యన్ని లిపులలోను సంయుక్తాక్షరములను కలిపి వ్రాయుపద్ధతి యుండుటవలన వాని గుణితమును నేర్చుకొనుట కష్టము అది ముఖ్యముగ కోమల మనస్కులగు బాలురకు శ్రమను కలిగించును వాని యచ్చులు సిద్ధముచేసి కూర్చి ముద్రించుటయు వ్యయ ప్రయాసకరము ఇందువలననే దేశ భాషలందు టైపురైటింగు యంత్రములు వ్యాపించుట దుస్తరమయ్యెను ప్రస్తుతకాలమునందు వివిధ వ్యాపారాలయములందును కచేరీలయందును టైపు యంత్రములు ప్రాముఖ్యము వహించుచున్న విషయ మందఱకును తెలిసియేయున్నది సౌలభ్యమును మాత్రము విచారించినచో నాగరియు నితరము లగు దేశీయలిపులు నేకలిపి యగుట కనర్హములని తోచక మానదు ఉర్దూలిపియు మిక్కిలి క్లిష్టమను సంగతి యందఱకును విదితమే ఇఁక పాశ్చాత్యలిపియగు రోమనక్షరముల విషయము విమర్శింపవలసియున్నది లిపివంటి విషయమును విమర్శించునప్పుడు జనసౌకర్యమునే ముఖ్యముగా నెంచుకొని, ఆత్మీయతాభిమానమును విడువవలయును. ఎంత క్లిష్టమైనను సౌకర్య రహితమైనను మన దేశీయలిపియే మనకుండవలయునని తలంచుట తప్పు లిపి యనునది మానవుల యభిప్రాయ రూపమైన భాషను పరస్పరము పరోక్షమున గూడ తెలియఁజేసికొనుట కేర్పడిన ముఖ్యోపకరణము ఇందు పవిత్ర జాతీయతా సమస్యలు లేవు ఉపకరణములకు అందము గాని పూజ్యత గాని ముఖ్యము గాదు సౌకర్యమే ప్రధానము ప్రస్తుత కాలస్థితిని బట్టి యుపయోగము తగ్గిన ప్రాంతయుకరణమును విడిచి సుగమమును సుకరమునునగు నూతనోపకరణమును గ్రహించుట పురోభివృద్ధి కోరు వారికెల్లరకు కర్తవ్యము రోమనులిపి యిప్పుడు ప్రపంచమునం దన్ని ఖండములలోను విశేషముగా వ్యాపించియున్నది నాగరికతగల ఇతర దేశములందు సంచారము చేయుటకును ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకును రోమను లిపి యత్యుపకారి యగుటయేకాక మిక్కిలి యవశ్యముగ కూడ నున్నది యూరపు ఖండమునం దొకటి రెండు దేశములలో తప్ప తక్కిన యన్ని దేశములలోను రోమను లిపియే స్వల్ప భేదములతో వ్యవహరింపఁబడుచున్నది అందు ముఖ్యముగ ఆధునిక నాగరికతకును విజ్ఞానమునకును ఆలవాలములని ప్రసిద్ధి చెందిన ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ దేశీయు లీ లిపినే వాడుదురు వారి వాఙ్మయమంతయు నిందే లిపిబద్ధమైనది నవీన ప్రపంచ మనఁబడు నమెరికాఖండమంతట నీ లిపియే వ్యాపించియున్నది ఆఫ్రికాఖండమందలి ప్రధాన భాగములలో రోమన లిపి ఇతరలిపులను తరిమివేయుచున్నది ఆస్ట్రేలియా మొదలగు పెద్దపెద్ద ద్వీపములు కూడ పాశ్చాత్యుల వలస రాజ్యములుగానున్నందున అచ్చటను రోమను లిపియే యుపయోగములో నున్నది నవీన సులభోపకరణములను గ్రహించి త్యాజ్యములను విడిచెడి స్వదేశాభివృద్ధి తత్పరులగు జపానీయులు క్లిష్ట మగు తమ దేశీయ లిపిని విడిచి రోమను లిపిని గ్రహింప నిశ్చయించిరనియు, తమ పాఠశాలలందంతటను వా రీ లిపినే బాలురకు నేర్పుచున్నారనియు తెలియుచున్నది జపాను, చీనా దేశముల లిపి యొక్కటియే యగుటవలనను చీనాలో కూడా పాశ్చాత్య సంపర్కము వ్యాపించుచుండుటవలనను అచ్చట కూడ రోమనులిపి వేగముగా వ్యాపించుచున్నది అందుచే అచిరకాలముననే చీనావారును రోమను లిపినే గ్రహింతురని తలఁపవలసియున్నది మనదేశమున కూడ రోమనులిపినే ముఖ్యలిపిగా గ్రహింపవలసి యుండుటకు కారణములు కలవు దేవనాగరి మొదలగు దేశీయ లిపులు చీనా, జపానుల లిపియంత క్లిష్టము కాకపోయినను సులభతరమగు రోమను లిపి మనకు నుపాదేయమగుటకు కారణాంతరములు కలవు తమ యేఁబదికోట్ల ప్రజల కొక్కటియే లిపియున్నను తాము స్వతంత్ర దేశములైనను చీనా, జపానులకు రోమను లిపి గ్రహణమే యుక్తతరమగునప్పుడు, మన దేశమున కూడ కాలక్రమమున రోమను లిపియే వ్యాపకలిపి యగుటకు సందేహ ముండదు 31 కోటి భారతీయులును భిన్న ప్రదేశములం దాయా

లిపుల నుపయోగించుచున్నారు ప్రస్తుత మెక్కువ వ్యాపకముగల దేవనాగరి తదితరము లగు గుజరాతి, బంగాళి మొదలగు సులభతరలిపుల స్థానము నాక్రమింపఁజాలదు మహమ్మదీయులు దేవనాగరిని గ్రహించుటకు కొంచెమైన నిష్టపడరు ఇక మన మదరాసు రాష్ట్రమున ముఖ్య ద్రావిడభాషలగు తెలుగు, అరవము, కన్నడము, మళయాళము వేర్వేరు లిపులు కలిగియున్నవి దక్షిణ కన్నడమున మహారాష్ట్రము (నాగరియు) గంజాము ప్రాంతమున నొక్కముసు కొంతమంది తురకలచే ఉర్దూను వ్యవహరింపఁబడుచున్నవి ఇట్టి స్థితి గలుగుటకు కలుగు క్లేశ మనుభవైకవేద్యము రాజకీయ స్థితి కూడ విచారణీయము ప్రస్తుతము మన దేశములోని ముఖ్య భాగమంతయు ఆంగ్లేయుల సంపూర్ణాధికారములో నున్నది మన రాజ్యాంగవేత్తలు తమకు ప్రస్తుతము గోచరించినంతవఱకు ఇంగ్లండుతో మనకు కొంతవఱకు శాశ్వత సంబంధ ముండక తీరదని నిర యించియున్నారు అందువలన నాంగ్లేయుల వ్రాయుచున్న రోమను లిపి మన దేశమున వ్యాపింపక తప్పదు ఇదివఱకే నగరములందలి విద్యాధికులు మాత్రమేకాక అక్షరజ్ఞానముకల జానపదులలో చాలమంది రోమనులిపి జ్ఞానము కలిగియున్నారు ఇరువదియాఱక్షరములు మాత్రమే యగుటవలన ఒక్క దినములో నెవరైనను నేర్చుకొనవచ్చును అందువలన ముందు ముందు ఈ లిపి ఇంకను వేగముగ వ్యాపించుటకు సందేహములేదు

రోమను లిపిలోని కొన్ని గుణదోషములను మన మిప్పుడు గమనింతము రోమను అక్షరములను సంయుక్తములనుగా (గుణితముతో) వ్రాయు పద్ధతి లేనందున మన దేశీయ లిపులలోని ముఖ్యదోష మందు లేదు అచ్చులుగాని హల్లులుగాని విడి విడిగానే వ్రాయఁబడను అందువలన అచ్చుకూర్పు టైపుయంత్రము సులభము లగును ఇట్టి సదుపాయము లనేకములు కల్గును మన దేశీయభాష లన్నిటికిని రోమనులిపి వ్యవహారము సౌఖ్యావహమై యేక లిపి సిద్ధిని కల్గించును మఱియు, దేశీయులు సులభముగ నాంగ్లాది పాశ్చాత్య భాషలను నేర్చుటకును, అట్లే పాశ్చాత్యులు మన దేశ భాషలను నేర్చుటకును సులభమార్గ మేర్పడును ఈ లిపిని గ్రహించుటవలన మనకు అపవిత్రతగాని ఆంగ్లభూతులగుటగాని సంభవించునని తలఁచుట కేవలము పొరపాటు అన్యభాషను స్వభాషగా నుపయోగించుటవలన జాతీయతకు కల్గు హాని యన్యలిపిగ్రహణమాత్రమున కలుగదు అందువలన లేనిపోని మనస్సంకోచము నుంచుకొనక మన దేశీయు లీ యుద్యమమునకు వెంటనే కడంగుట దేశహితకరము

దేశీయ భాషలకు రోమను లిపి నుపయోగించుట కప్పుడప్పుడు స్వల్ప ప్రయత్నములు చేయఁబడుచు వచ్చెను. అనేక సంస్కృత గ్రంథము లిప్పుడు పాశ్చాత్యులు సులభముగా చదువుకొనుటకై రోమను లిపిలో ముద్రింపఁబడియున్నవి భాషా సంబంధమగు గవర్నమెంటు జనాభా లెక్కలు రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారి ప్రచురణములు మొదలగువానియందు దేశీయ భాషా వాక్యములకు రోమనులిపి వాడుబడుచున్నది ఇప్పటికిని లిపిబద్ధములుకాని కొన్ని మన దేశ భాషల సంబంధమగు పుస్తకములు రోమను లిపి యందే ప్రకటింపఁబడుచున్నవి హిందూస్తానీభాషను నేర్చుకొనుట కుపయోగించు కొన్ని పుస్తకములు కూడ ఈ లిపిలో కలవు కాని, ఈ యత్నములు కొన్ని తాత్కాలిక స్వల్ప సౌకర్యములకొఱకు ముఖ్యముగా నైరోపియనులచే నవలంబింపఁబడిన ప్రక్రియయే గాని యేకలిపి వ్యవహారార్థము కాదు స్థిరముగా మనము రోమను లిపిని గ్రహించుచో అందు వలసిన కొన్ని మార్పులను చేసికొని జనానుమోదకముగ నుండునట్లు వానిని ప్రకటింపవలయును అట్టి యుద్యమము మన దేశీయులచేతనే స్థాపింపఁబడి వ్యాపింపఁజేయఁబడవలయును దీనికి పాశ్చాత్యులు కూడ మనకు తోడ్పడిన యెడల వారి సహాయమును మనము గైకొనవచ్చును కాని, వారి యంగీకారమును పడయుటకై వారి లిపిలో నిప్పుడుండు లోపములను కూడ మనము కొని తెచ్చిపెట్టుకొనఁగూడదు ప్రస్తుత మాంగ్లాది భాషల రోమను లిపియందలి యనేక లోపములు పాశ్చాత్యులకు తెలిసియేయున్నవి వీనిని తొలఁగించుటకు వారిలోని విద్వాంసులు కొందఱు తమ యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు కాని, ఈ విషయమున వారికి పరస్పర మైకమత్యము లేకపోవుటవలన శతాబ్దములనుండి యానుపూర్వికముగ వచ్చుచున్న ఈ లోపములను సవరించుట ఇంకను జయప్రదము కాకున్నది ప్రస్తుతము మహారణ సంబంధమగు సమస్యలందు మగ్నులై యున్న పాశ్చాత్యు లీ విషయము చర్చించి సవరించుకొనుట తటస్థింపదు ఇప్పుడు పూర్తిగా వారి సహాయము నపేక్షించుటకును వీలులేదు అందలి దోషములను మనమే సవరించుకొని మన దేశీయములగు గుణములనందుఁ జొనిపి స్వీకరించుట కర్తవ్యము ఇప్పుడు ప్రతి సంవత్సరము కూడుచున్న సామాన్య భాషా సమావేశమునుగాని ప్రత్యేకసర్వహిందూదేశ సభయందుఁగాని ఈ సమస్య చర్చింపఁబడిన బాగుగ నుండును కాని, యెంత యుపయోగకరములగు మార్పులైనను మన దేశమున సర్వజనామోదమును బడయుటను సంగతి మన కనుభవసిద్ధము కనుక, ఈ యుద్యమము ప్రత్యేక వ్యక్తుల యుత్సాహ కార్యముల వలననే నెఱవేరవలసియున్నది వార్తాపత్రికా నిర్వాహకులును గ్రంథముద్రాపకులును దేశీయ భాషలకు ప్రస్తుత మెంత స్వల్ప భాగముననైనను ఈ లిపి నుపయోగించి పరీక్షించిన జయప్రదము కావచ్చును ఇంగ్లీషులోని యక్షర విన్యాసము (స్పెల్లింగు)ను గూర్చిన కష్టములును ఉచ్చారణయందు కల్గు వైషమ్యములును మనకు సంబంధించినవి కావు. ఈ క్రింద సూచించిన కొన్ని నియమము లాలోచింపఁదగినవి



ఆకారపు భద్రయ్యగారు



కోరాడ రామచంద్రశాస్త్రులుగారు



నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిలవారు

ఆకారపు భద్రయ్యగారు:—వీరు నైజాము రాష్ట్రీయులు. వరంగలునందలి శబ్దాను శాసనాంధ్ర గ్రంథాలయ సంస్థాపకులు. ఉదార స్వభావులు. దాన నిరతులు.

కోరాడ రామచంద్రశాస్త్రులుగారు:—ఈయన సుప్రసిద్ధులగు కోరాడ లక్ష్మణ శాస్త్రి పుత్రులు. ఈవంశీయులు శ్రీశైల భ్రమరాంబికానుగ్రహీత సర్వతంత్రస్వతంత్ర పాండితీ ధురీణులు. రామచంద్రశాస్త్రులుగారు అప్రతిమమగు పాండిత్యముగలవారును బ్రహ్మశ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రులుగారికి సమకాలికులునూ ఛాత్రులునై యున్నారు. ఈయన మచిలి బందరు చేరి అచ్చట నోబిలు కాలేజిలో పండిత పదవి నధిష్ఠించి, నిశ్చింతులై సంస్కృతాంధ్రములయందు తమకుగల యనర్గళ పాండితిని ప్రకటించుచు, మృదుమధుర రచనలతో నింపగునట్లు సుమారు నలువది గ్రంథములు రచించిరి. వీరి స్వగ్రామము తొలుత గోదావరిజిల్లా అమలాపురం తాలూకా కేసనకుఱ్ఱు అయినను, క్రమముగా నీ పండితవంశము బందరునందు స్థిర నివాస మేర్పరచుకొనియెను. ఈయన వెనుకటి యువ సంవత్సరమున జన్మించి శార్వరి వత్సరమున పరలోకగతులైరి. ప్రస్తుత మీ మహాకవి గ్రంథములలో ఘన వృత్తాది గ్రంథములు ముద్రితములై ప్రచారమున నున్నవి.

నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులవారు:—తెనాలి సంస్కృత కళాశాలలో పండితులుగ నున్నారు. వ్యాకరణశాస్త్రమున గొప్ప పండితులు. భగవాన్ బాలగంగాధరతిలక్ గారి గీతారహస్యమును ఆంధ్రీకరించి ఆంధ్రదేశమునకు గొప్ప సేవ చేసియున్నారు.

[ఈ చాయా చిత్రాలు 1919 సిద్ధార్థి సంవత్సరాది సంచికలో ప్రచురించినవి. సం.]

పెద్దవి, చిన్నవి యను రెండు భేదము లీ యక్షరములందు కారణాంతరములవలన కలిగి, వ్యాకరణానుసార మింగ్లీషు భాషయం దుపయోగింపఁబడుచున్నవి. మన కిట్టి యావశ్యకత యేమియు లేనందున వానిలో నొకదానిని మనము విడువవచ్చును. అందు చిన్న యక్షరము లెక్కువ సులభములై విరివిగ వ్యాపించియున్నవి. అందువలన చిన్న యక్షరములనే మన ముపయోగించుకోవలసి యుండును.

రోమనులిపియందు అచ్చు అక్షరములు వేఱు, వ్రాత యక్షరములు వేఱు. మన దేశీయాక్షరములం దట్టి భేదము లేదు. వ్రాయునప్పుడు సౌకర్యము కొఱకు కొన్ని స్వల్పము లగు మార్పులను ఎవరికి వారు చేసికొనినను అని నియమబద్ధములు కావు. ఈభేదమును మనము తెచ్చిపెట్టుకొనుట యనావశ్యకము. అచ్చక్షరములను వ్రాయుట కష్టమైనందున పాశ్చాత్యులు వ్రాత యక్షరములను వేఱుగ నిర్మించుకొనవలసి వచ్చినది. రోమను లిపియందు ఈ రెంటికిని మధ్యస్థముగా నుండు 'ఇటాలికు' అక్షరములను ఈ రెండింటి స్థానమునను గ్రహించుట మంచిది. మన దేశమునందు అక్షరములను కోలగా వంచి వ్రాయుటగాని అట్టి యక్షరములను ముద్రించుట గాని యాచారమునందు లేదు. కనుక, ఈ ఇటాలికు అక్షరముల నొరిగియున్నట్లుకాక నిట్టనిలువుగా వ్రాతయందును అచ్చునను వ్యవహరింపవచ్చును. ఇందువలన ఆంగ్లేయులవలెనే ప్రతియక్షరమును నాల్గు విధములుగా పెట్టుకొను కష్టము తొలఁగును.

ప్రస్తుతము రోమను అక్షరముల వరుస నియమ రహితముగ నున్నది. అచ్చులును హల్లులును మిశ్రీభూతము లగుటయేగాక ఉచ్చారణ స్వభావమునుబట్టి దేశీయాక్షరములవలె వరుసగా నేర్పరుపఁబడకయున్నవి. ఈ యక్షరములను మనము దేశీయాక్షరములవలె క్రమమైన వరుసనే యుంచుకొనవచ్చును.

రోమ నక్షరముల పేర్లు కూడ సరిగ లేవు. చాల హల్లులు ఇకారముతో చేర్చి యుచ్చరింపఁబడుచున్నవి. మన దేశమున సాధారణముగ నకారముతో కలిపి యుచ్చరింపఁబడును. సరిగా చూచిన హల్లుల యుచ్చారణకు అచ్చులను కలుపనక్కఱలేదు. సులభముగా నుచ్చరించుటకు కలుపఁబడును. ఇది గాక, ఏకారోచ్చారణగల యక్షరమును 'ఇ' యని చెప్పుటయు గకారమునకు 'జి' యనుటయు కలదు. మన మిట్లు పెట్టుకొనక మన పద్ధతినే యుచ్చారణకు తగినట్లు పేరు పెట్టుకొనుట మంచిది.

ఒకే యుచ్చారణకు రెండక్షరము లుండుట వ్యర్థము. అట్టివానిలో నొక దానిని విడిచియో, మరియొక సంజ్ఞనిచ్చియో సవరించుకొనవలయును. k వలన క కారమును s వలన సకారమును ద్యోతితమగుచున్నందున c కి చకారోచ్చారణ కల్పించుట చాల యుక్తము. ఈ పద్ధతిని రాయల్ ఏషియాటిక్ సొసైటీవా రవలంబించిరి. ch వలన ఛకారోచ్చారణము కల్గును. ch వలన చకారమును సూచించుట శబ్ద శాస్త్రదుష్టము.

ఇట్లే కొన్ని యక్షరములు రెండు మూడు సంజ్ఞలకు వాడఁబడుచున్నవి. అందువలన సందిగ్ధత కల్గును. g ని గకారమునకే యుపయోగించి j ను మాత్రమే జకారమునకు వినియోగపరచుట యుక్తము. f వలన హిందుస్థానిలోని ఫకీరునందలి ఫకారమును ఇట్లే z వలన జమీనందలి జకారమును తెలుపవచ్చును. a, e, i, o, u ఇట్టి యచ్చుల కొక్కొక సంజ్ఞను మాత్రమే ఈయవలయును. ai వలన 'ఐ' యును ou వలన 'ఔ' ను తెలుపవచ్చును. khతో "ఖ"ను, gh తో 'ఘ'ను తెలుపుట సరియైన పద్ధతి. జ్, ణ్ మొదలగువానిని n మొదలగువానికి పైనో క్రిందనో చుక్క మొదలగు వానిని చేర్చి తెలుపు నాచారము గలదు. ఇట్లె శ్, ష్ లను s కు గుర్తులను చేర్చి సూచింపవచ్చును. అనుస్వారమునకై m n లకు చుక్క చేర్చి వ్రాయవచ్చును. h కి గుర్తు చేర్చిన విసర్గము ద్యోతిత మగును. ఉచ్చారణ సామీప్యము కలవానికి భిన్న భిన్నాక్షరములను పెట్టుటకన్న ఒక యక్షరమునకే భిన్న సంజ్ఞలు చేర్చి తెల్పుటవలన ఆయక్షరముల సంబంధము కూడ తెలియుచుండును. తెలుఁగున కొన్ని యొత్త్వక్షరములకు మన మట్లు చేయుచున్నాము. జ్,ణ్ మొదలగునవి సంయుక్తాక్షరము లగుటచే వానికి ప్రత్యేకాక్షరము లక్కఱయే లేదు.

అంకెల విషయమున కూడ వివిధ భాషలవారు మనదేశమున వేఱు వేఱు గుర్తులనే యుపయోగించుచున్నారు. ఇంగ్లీషు అంకెలు సులభమైనవే యగుటవలన వానినే పెట్టుకొనవచ్చును. తెలుఁగున ఈవఱకే ఈ యంకెలు చాలవఱకు వ్యాపించియున్నవి. (అరబ్బీ యంకెలని పిలువఁబడు నివి మొట్టమొదట హిందూదేశమునకే సంబంధించినవి.)

కావలయు మార్పులను చేసికొని రోమను అక్షరములను దేశ భాషల కుపయోగించుట మిక్కిలి లాభకారి గనుక ఇది తప్పక పరీక్షింపవలసిన విషయము. వార్తాపత్రికా నిర్వాహకులు తమ పత్రికలయందు ఎంత స్వల్పభాగమునైన ఇందులకై వినియోగించియు గ్రంథ ప్రచారకులు చిన్న చిన్న సర్వోపయోగి పుస్తకముల నీ లిపియందు ముద్రించియు సహాయము చేసిన నిది శీఘ్రముగ వ్యాపింపఁగలదు. ఈ లిపి సమస్య పరిష్కృతమైన, భాషా సంబంధమగు కొన్ని ఇతర సమస్యలు కూడ సులభముగా పరిష్కరింప వీలు కలుగును. ఇందువలన హిందీ, ఉర్దూ, బంగాళి మొదలగు మిశ్రిత సమీప భాషలకు అన్యోన్య సంబంధము హెచ్చుటయు దేశభాషలందు ఒకే విధమగు సాంకేతిక పారిభాషిక పదముల నుపయోగించుటయు సులభముగా నుండును.

# వావిలాల కూచెన్న

ఒంగోలు వేంకటరంగయ్యగారు బి. ఏ. బి. ఎల్.

[1919 సిద్ధార్థి సంవత్సరాదిసంచికనుండి]

ఆంధ్రుల ప్రతిభ అన్ని శాస్త్రములలోను విద్యలలోను కళలలోను మహోన్నత నైపుణ్యముఁ జూపియున్నది మగధరాజ్యమువఱకు సామ్రాజ్యమును సాగించిన పూర్వపు టాంధ్రులు తెలుఁగువారు కారనువారు తమ సిద్ధాంతమును స్థాపించుకొను భారమును వహించియున్నారు ఆదికాలము నుండి ప్రసిద్ధముగ నాంధ్ర సారస్వతమునం దెల్ల "ఆంధ్రము", "తెలుగు" అనునవి పర్యాయ పదములుగ వాడఁబడుచున్నవి నన్నయభట్టు కృతమై, మన కిపుడు నిలిచియుండు భారత భాగములు "ఆంధ్ర" శబ్దము "తెలుఁగు"నకు పర్యాయపదముగ ప్రయోగింపఁబడినట్లు తోఁపదు కాని "ఉభయ కవిమిత్రుఁ"డని తిక్కన సుద్దేశించినపుడు సంస్కృతాంధ్రకవి యని సంప్రదాయానుసారముగ నర్థకల్పన చేయఁబడుచుండె ఆదిపర్వ ప్రథమ భాగమున నన్నయ ప్రశంసలో "ఉభయభాషా కావ్య రచనాభిశోభితుఁ" డన్న యెడ సంస్కృతాంధ్రములుగాక వేరుభాషలని చెప్పనగునా? వలను కాదు "ఆంధ్రము" "తెలుఁగు" పర్యాయపదము లనుటకు "భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ" తెలుఁగుబాస వినిర్మించిన తిక్కశర్మ నన్నయభట్టారకుని "ఆంధ్ర కవిత్వ విశారదుఁ"డని స్తుతించియుండుట కంటెను వేఱు ప్రమాణ మక్కఱ లేదు. ఆంధ్రమునకు "తెనుఁ" గను పే రెట్లు ఏ కాలమున వచ్చినదో అన్వేషింపవలసి యున్నది

ఇట్లు ఆంధ్రులలో—తెలుఁగువారిలో నందము—ఆపస్తంబ కుమారిలభట్ట ప్రభృతి వేదమూర్తులను నన్నయ తిక్కనాది కవిసమ్రాట్టులను ఇంకను సమధిక నిరతిశయ ప్రజా భూషితులయిన మహాపురుషులను నిజాం లెపెంగియే యున్నారు. నాకు తెలిసినంతవఱకును ఎవ్వరుగాని ప్రస్తావింపని నూతన నామమొకటి నేఁడు స్మరణకు వచ్చుచున్నది పేరు చెప్పిన నెఱుఁగా యుందురు కాఁబోలు జ్యోతిషిక శిరోమణి "వావిలాల కూచెన్న" యను గణిత విద్యాపారంగతుని పేరు ఎచ్చట డాఁగియుండెనో! "ఆత్మానం మానుషం మన్యే" యని జపించుచుండు మనకు, పాశ్చాత్య విద్వద్బ్రహ్మ "భవా న్నారాయణో దేవ" యని ఉద్ఘోషించినను నిజబోధరూపమయిన స్వరూప జ్ఞానము కలుగకున్నది

వావిలాలవారు తెలుఁగు జిల్లాలయం దంతట నున్నారు వీరు తెలగాణ్యపు బ్రాహ్మణులు ఇప్పటి వావిలాలవా రెవరును ఈ కూచన్నగారి పేరును వినినట్లు గనఁబడదు. 1825 సంవత్సర ప్రాంతములందు గంజాముజిల్లాలో సైనికోద్యోగమున నుండిన వారన్‌గారు మన జ్యోతిష సిద్ధాంతములనెల్ల మన దైవజ్ఞుల వలన నేర్చి అసదృశ ప్రజ్ఞాశాలురై "కాలసంకలిత" మను గొప్ప జ్యోతిష గ్రంథము నింగ్లీషున వ్రాసియున్నారు మిలిటెరీ అధికారి యెచ్చటనో భారతీయ జ్యోతిషశాస్త్ర మెచ్చటనో!! ప్రాయశః ఐరోపియను విద్వాంసులు జీవయాత్రకగు విద్యనే గాక అభిమాన విద్యలు వినోద విద్యలని కొన్నిటిని అభ్యసించి వానియం దపార ప్రజ్ఞను సంపాదించియున్నారు తెలుఁగు సారస్వత మిట్టిదని కొలఁదిగనైను దెలిసికొనుటకు ప్రోత్సాహము దిక్కయి యుండెను కవి జీవితములు ఈవల వెడలినవి ప్రోత్సాహకర్త చార్లస్ ఫిలిప్ బ్రౌను జిల్లా జడ్జి లౌకిక న్యాయాంజలి యను మూఁడు సంపుటముల గ్రంథమును కర్నల్ జేకబు అను మఱియొక మిలిటెరి యుద్యోగి ప్రకటించియున్నాఁడు. కలకత్తా మింటులో నుద్యోగిగ నుండిన విల్సను సంస్కృత నాటకముల నన్నిటిఁ జదివి ఆంగ్లీకరించియున్నాఁడు ఇట్టి యుదాహరణము లెన్నిటినైనఁ జెప్పనగు జీవయాత్రా పరమగు ఉద్యోగవిద్యగాక అభిమాన విద్యా కళల నభ్యసించి వన్నెయు వాసియుఁ గాంచినవారు మనవారిలో నెంద ఱుందురు? పూర్వకాలమున మనవారు రాజకీయోద్యోగులయ్యు శాస్త్ర పరిచయము గలిగి కృతిపతులై యుండిరి సాళువ తిమ్మరుసు (అప్పాజి) అగస్త్య భారతమునకు వ్యాఖ్యానము వ్రాసియున్నాఁడు "ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాస" కర్త గణపవరపు వేంకటకవి తంజావూరు రాజగు ముద్దళగిరి భూపాలునియొద్ద సేనాధిపతిగ నుండెను ఆంధ్రకవితామహుఁడగు పెద్దన కృష్ణరాయల సామ్రాజ్యమున నన్నియూరునందు (దక్షిణ ఆర్కాటుజిల్లా) అధికృతుఁడై యుండెను విద్యారణ్యులవారి చరిత్ర మెఱుఁగనివారు లేరు అళియ రామరాయల మంత్రియుఁ గొండవీటికి కొంతకాలము రాజప్రతినిధిగ నుండిన తోడరమల్లు రామయామాత్యుఁడు "స్వరమేళ కళానిధి" యను నొప్పు సంగీత గ్రంథమును రచించెను ఈయన శిల్పకళా నైపుణ్యము గలవాఁడై తన రాజునకు "రత్నకూట"మను విచిత్ర ప్రాసాదమును కట్టించెను తంజావూరు రాజగు రఘునాథరాయలు రామాయణాద్యనేక సంస్కృతాంధ్ర గ్రంథములను రచించెను దిగ్విజయముచేసిన కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను వ్రాసెను రాజ మంత్ర తంత్ర ప్రవీణుఁడగు మన తిక్కన ఆంధ్ర భారతీయులకు భారతమునే ఇచ్చెను ఇందఱిపేర్లు వచింపఁగ నన్నయ కేవల కవిమాత్రుఁడని త్రోసివేయఁదగినవాఁడు కాఁడు ఈయన రాజనరేంద్రుని యాస్థానమునందు శాసన లేఖకుఁడుగఁ గూడ నుండెనఁట! వారన్‌గారి యుపాధ్యాయుఁడు శ్రీకాకుళము సమీపమునసుండు సత్యవరము నివాసి ఈకూచన్నగారి సమాచారము వారన్‌గారికిఁ జెప్పి వారి గ్రంథముల నిచ్చెనని వారన్ చెప్పియున్నాఁడు ఆ యుపాధ్యాయుని పేరు సరిగఁ దెలియలేదు. ఇంగ్లీషున "జోస్లా బార్కర్ జోసీ" అని యున్నది బహుశః ఈ బార్కర్ శబ్దము భాస్కర శబ్దముగ నుండును కూచెన్నగారు వ్రాసియుంచిన గ్రంథముల పేర్లు తెలియలేదుగాని తెలుఁగు పంచాంగ గుణితమున కనుకూలించు పథకముల (టేబిల్సు) నాయన గుణించియుంచె నఁట? వీటిని వారన్ ఉపయోగపఱచి శ్లాఘించియున్నాఁడు కూచెన్నగారి ప్రశంస ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రొఫెసరు జాకోబిగారొక కొంత చేసినట్లున్నది 1893 సంవత్సరము రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి జర్నలునందు (పుట 751) బర్జెసుగారు "నోట్సు ఆన్ హిందూ ఎస్ట్రానమీ" అను గొప్ప వ్యాసమును వ్రాసియున్నారు అందులో కూచెన్నగారి ప్రశంస గలదు

నూతన సిద్ధాన్తశిరోమణియుఁ బ్రకృతమున నెల్లూరుజిల్లా కలెక్టరునునగు యల్ డి స్వామికణ్ణుపిళ్లగారు ప్రకటించిన "ఎఫిమరిస్" అను క్రీస్తుశకము 1 మొదలు 2000 సంవత్సరములవఱకు తిథివార నక్షత్రయోగకరణాదులను నిర్దుష్టముగఁ దెలుపు సద్గ్రంథమునను కూచెన్నగారి ప్రశంస గలదు. కూచెన్నగారి జీవితాదులను గూర్చి విశేషాంశములు దెలిసికొనఁగోరి శ్రీ స్వామికణ్ణుపిళ్లగారిని సందర్శింపఁగ పై సంగతులు మాత్రము కొంతవఱకు వారివలనఁ దెలిసినవి (94 వ పుట చూడుఁడు)

# సంగీతము-స్వరప్రభావము

చెలికాని లచ్చారావు గారు

[1919 సిద్ధార్థి సంవత్సరాదిసంచికనుండి]

సంగీతము సామవేదరూపమున భగవన్ముఖమునుండి వెలువడినట్లు చెప్పఁబడుచున్నది దానిని మన పూర్వు లధిష్ఠాన దేవతఁగ భావించి పూజించుచుండిరి సంగీతము సాదనచేసి తఱచిన కొలఁది యం దంతర్గూతముశైయున్న దివ్యశక్తులను బయలుపఱచి జ్ఞానాభివృద్ధికిఁ దోడయి ఇహపర సౌఖ్యసాధనంబై మానవుని యున్నత స్థితికి సాయపడ గలదని చెప్పనగును పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రాణికోటి కెల్ల నానంద మొసఁగునది ఒక్క సంగీతమే! శంకరాదులు సంగీత రసజ్ఞ శిరోమణులు కదా! ఇట్టి సంగీత సుధా రసమును గ్రోలు మానవులు ధన్యులు గదా! స్వకీయముగ రంజింపఁజేయునది గనుక స్వరము స్వరము ప్రధానముగఁ గలది సంగీతము గీతవాద్య నృత్యంబులుచేరి సంగీతమనఁ బడుచున్నది వేదాది మంత్రములవలె నిదియు శాస్త్ర సమ్మతముగ నుచ్చార్యము వేద మంత్రము లపస్వరంబున ననర్థదము లెట్టు లగునో లటులే సంగీత మపస్వరంబున ననర్థద మగుచున్నది మంత్రములనఁగ దివ్యజ్ఞాన సంపన్నులగు ఋషిసత్తములచే నియమానుసారముగను, శక్తియుతముగను కూర్పఁబడిన అక్షర విశేషములు (words of power). ఆ యక్షరముల నుచ్చరించుటవలన గలిగిన ఫలమే మంత్రశక్తి ఇందు సాత్విక తామసములు గలవు ఉపాసనావిధులచే నుపాసకులు వేరయి ఫలసిద్ధిని బడయుచున్నారు వశిష్ఠుఁడు సాత్విక మంత్రోపాసనచే భగవదాదులను వశముచేసికొన్నట్లును జనమేజయుఁడు తామసమంత్రోపాసనవలన సర్పములను దగ్ధము గావించినట్లును పురాణ ప్రసిద్ధంబయ్యె ఈ మంత్రములుగల శ్రుతి, స్మృతి, పురాణాదులకు మనవా రాధ్యాత్మిక శాస్త్రములని పే రిడిరి ఇందు పరమాత్మ జీవాత్మ పుణ్యపాపాదు లతీంద్రియవిషయములును బోధింపఁబడియుండును మహనీయులు వేదముల కాధారమగునదియు, పూర్ణానంద మొసఁగునదియు నగు పరబ్రహ్మ స్వరూపము నోంకారమని తలఁచిరి ఇదియే ప్రణవ స్వరూపము (ఓం అ ఉ మ్) ప్రణవము అక్షరత్రయంబై, మంత్రత్రయంబై, నాదబిందు కళాత్మికంబై, సృష్టిస్థితి లయ కారణభూతంబై యుండు ఇట్టి గుంభితభావ ప్రభావంబు లాధ్యాత్మిక సిద్ధాంతంబులం దొప్పు ఇవి ఆత్మానుభవమునుబట్టి విజృంభించ నెంతెంత ఘన కార్యంబులైనను చేయనగును ఒక్క (ఓంకార) స్వరమునందే ఇంతటి అక్షరార్థంబు లిమిడియుండి మహాద్భుత శక్తి గలిగించునపుడు ప్రణవ ప్రతిపాదితమయి సామవేదసారమనఁబడు సంగీతమున కెట్టి మహాద్భుతశక్తియుండునో యూహింపుడు ఆ యా నియమాక్షర ధ్వన్యాదులనుబట్టి ఆధ్యాత్మిక శాస్త్రంబునందుండు మంత్రాదుల కెట్టి శక్తి గలదో సంగీతమున కట్టి శక్తి కలదని నిరూపింపనగు ఇకఁ బ్రకృతి శాస్త్రమునగల భిన్నవస్తు సంయోగశక్తిని గ్రహింతము ప్రాణవాయువు 1 వంతును నత్రజని 4 వంతులునఁజేరి వాయువగుచున్నది ప్రాణవాయువునందు దీపముంచిన ముందటికంటె నధిక తేజమునఁ బ్రకాశించుటయు నత్రజనియందు నార్పు స్వభావమును గలదు విడివిడిగ నేదైన నొకదానిని పీల్చినఁ బ్రాణహాని యగును రెండును వంతుల ప్రకారము కలిపిన సాధారణవాయువై ప్రాణాగారమగుచున్నది కావున వస్తువులు కలిసినప్పుడొక గుణమును వేఱయినపు డొక గుణమును కలుగుచున్నవి ఇది సాత్విక మంత్రము వంటిది. సున్నము, పసపుల కలయిక యుగ్రమంత్రము వంటది కావున నొండొంటికి సంబంధమున్నప్పటికి వస్తుగుణము లా యా కూడికలనుబట్టి మారుచున్నవి గదా అట్టివే మంత్రాదులకును ఆ యా నియమితాక్షరముల కూడికలను బట్టి శబ్దోచ్చారణబట్టియు నా యా శక్తు లుదయించుచున్నవి ఇందుఁ బ్రత్యక్షములగువాటికి ప్రకృతిశాస్త్రములనియు నాత్మానుభవమునుబట్టి ఆచరించువాని కాధ్యాత్మికశాస్త్రములనియు పేరులు కొందఱు మొదటి దానిని మాత్రమే విశ్వసింతురు మరికొందఱు రెండవదానినే నమ్మెదురు ఏది యెట్టులైన నుభయంబుల ప్రభావము సంగీతమున గుంభితమై యున్నట్లు చూపింపగలము ఆధ్యాత్మికమునం దష్టాక్షరివలె సంగీతమున సప్తాక్షరి (స—రి—గ—మ—ప—ధ) కలదు ఈ సప్తస్వరములకు షడ్జమ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములని వరుసగ పేరులు శయ్యా స్థాయి స్వరము మున్నగునవి పరిభాషలు శాస్త్రమునందు చెప్పిన చొప్పున లక్ష్య లక్షణ సమన్వితంబుగ నభ్యసించిన సంగీతము మిగుల ప్రతిభగాంచును సంగీతమునకు శాస్త్ర మెంత యవసరమో కళయు నంతియే యవసరము. శాస్త్రము శ్రుతి లయ జ్ఞానాదులతో నడుగు తప్పకుండ దాని నంటియే యుండును. శాస్త్రము నియమముకొఱకు కళలేనిది రక్తికట్టదు రక్తి గట్టనిదే శోభించదు గుణములును బయలుపడవు కావున సంగీతమున కపస్వరంబు లనర్థదాయకములని తెలియుచున్నది శబ్దము, స్వనము, రవము, ధ్వని, మ్రోత, నాదము అను పర్యాయ పదములచే స్వర మొప్పుచున్నది స్వరము మ్రోత రూపముగ నూఁపుదల యనియు నది కలిగినపుడెల్ల నొక్కొక్క యాకార విశేష ముదయించుననియుఁ బ్రకృతి శాస్త్రమువలనఁ దెలియవచ్చుచున్నది మ్రోతవలన నంతరాళమున నొక్కొక్కరూ పుదయించుటచేత మ్రోతల గుంపైన స్వర సముదయమువల్ల ననేకములగు నాకారములు భిన్న భిన్న రూపములతో నుదయించుచుండును మఱియును సంగీత స్వరములను బలుకు యంత్రములనుండి వ్యాపించు నాద ప్రకారమువలన సన్నపు టిసుకనేలమీద రేఖాగణితోక్తములగు వివిధ రూప విశేషములు పొడముచుండుటను ప్రత్యక్షముగు జూడఁగునని ప్రకృతి శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు మన ముచ్చరించు ప్రతి యక్షరమునందును బయలి వాయువు కదలి దానియం దొక యల పుట్టుచున్నది ఈ యక్షరమునకు వాయ్వాకాశ సూక్ష్మతత్వములం దొక చలనము పుట్టి యొక రూప మేర్పడును ఇట్లు శబ్ద సమూహముచే ననేకరూపము లుదయించుచున్నవి వీనికి కాలనియమాదులు గూడ గలవు వసంతరాగ మపరదిన మందును, మేఘరంజిని మధ్యాహ్న కాలమందును, ప్రాతఃకాలమున భూపాలి రాగమును పాడవలెనని చెప్పుదురు ఒకఁడు మేఘరంజినిని పాడి మబ్బు గ్రమ్మించి వర్షమును కురియించినట్లును, మఱియొక్కఁడు సారంగరాగమును పాడి లేడిని వశము చేసికొన్నట్లును జనశ్రుతియయ్యె ఏదేని రాగమును సరిగఁ బాడిన యెడల దాని స్వర సమ్మేళనమువలన నంతరాళమును గలుగు మ్రోతచేత నయ్యైయ్య రూపము లుదయించునని సిద్ధాంతము చేయుబడినట్లు వార్తా పత్రికలవల్లను గ్రంథములవల్లను తెలియుచున్నది వాట్సు హ్యూగ్సు దొరసాని "వాయస్ ఆఫ్ ఫిగర్స్" అను గ్రంథమువలన నీ సిద్ధాంతము నిజమని రుజువు చేయుచున్నది ఈమె ఈడోఫో నను యంత్రమువలనఁ దాను పాడిన సంగీత స్వరమువలన నుదయించు వివిధ రూపములను లోకమునకుఁ జూపింప నేర్చినది కొన్ని కొన్నిజాతుల చూర్ణములను నెఱపి సంగీత స్వరముల యాకారముల నా చూర్ణ రేణువులలోఁ గనుపడఁజేయును నక్షత్రములు, ఫలములు, పుష్పములు సర్పములు మొదలగువాని యాకార విశేషములన్నియు కాంతివంతములై సూక్ష్మాకారములతోఁ గనపడును ఇటు లామె సభ్యులకుఁ గనపరచె నట! దీనింబట్టి చూడ స్వర విశేషము రూప విశేషమును పొడమించుననియు నా యా స్వర సముదయ సమ్మేళనమువలన నా యా రూపము లుదయించుననియు దద్భిన్నత్వమున నా విశేషము లుదయించవనియుఁ దేలుచుండెను దీనినింబట్టి దృష్టి కగోచరములైన వానికి రూపములను గల్పించి ప్రత్యక్షముగ స్వాధీనము జేసికొను శక్తి మంత్రాదులకువలె సంగీతమునకు గూడ నుండినట్లు తేలుచున్నది మఱియు భావ రాగ తాళంబులఁ బ్రకాశించెడి నృత్తగీత వాద్యములచే భక్తులు సంకల్పించుకొను రూపమును ప్రత్యక్షముగాఁ జేసికొనునట్లు జెప్పబడుచున్నది సంకల్పమున రూపములఁ గ్రహింపనగును ఇతరుల సంకల్పములు దెలిసికొననగును దేహబలమునకన్న బుద్ధి మనోబలము శతాంశ మెక్కువ మనోబలము ఇతరుల మనస్సును స్వాధీనపఱచుకొనఁగలదు దీనినే ప్రకృతి శాస్త్రజ్ఞులు విల్ ఫోర్సు అని యందురు ప్రత్యక్షముగ నిప్పుచు ఫ్రాన్సుదేశమున మనస్సంకల్పములను ఫోటోగ్రాఫున నెత్తుచున్నారట! దూరమందుండు స్నేహితుని మనస్సునందు సంకల్పించుకొని కూర్చుండ నెదుటివాని రూపము పడక వానిమనస్సునందు తలంచుకొనువాని రూపమే పడుచున్నదట ఇట్టి దానినే మున్ను మనవారు కనిపెట్టి మనస్సునందు పుట్టు సంకల్పము సూక్ష్మాకాశములో ప్రతిబింబ మేర్పడుచున్నదని చెప్పుచుండిరి ఈ సంకల్పశక్తి ఘన కార్యముల నయినను చేయకలదని మనవారి సిద్ధాంతము సంగీత సాధనమున నట్టి మహాద్భుత శక్తు లందినట్లు భక్తులచరిత్రలవలన తెలియుచున్నవి గదా! మఱియు గాన కళావతంసులగు పర్వత నారద హనుమదాదుల సంగీతంబున శిలలు సైతము నీరయినట్లును నీళ్లను రాళ్లను గానొనర్చినట్లును వినియున్నాము సంగీతమున కట్టి శక్తి కలదా? ఈమధ్య నమెరికాయం దొక గాయకుఁడు వంతెనమీఁద కూరుచుండి విలాసార్థము గాన మొనర్చుచుండ నా వంతెన గజగజ వణక నారంభించెనట! ఆతడు పాటఁ జాలించినప్పుడు వంతెన కదలకుండెనట అతఁ డాశ్చర్యము నొంది తిరిగి యా స్వరముననే యదే కాలమున నాపాటనే ఆరం

94వ పుట చూడుడు.)




ESTD 1946

*గుంటూరు, నెల్లూరు, చిత్తూరు జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు*

## స్పార్టన్ పెయింట్సు, హ్యారివేర్ సూపర్ ఫైన్ శానిటరీ వేర్.

మా వద్ద ఎవరెస్టు కంపెని, శెప్టిక్ టాంకీలు, సిమెంటు పైపులు, ఫిటింగ్సు, G I పైపులు, ఫిటింగ్సులు, బిల్డింగులకు పనికివచ్చు హార్డువేర్ రకములు మోజెయిక్ ఫ్లోరింగు మెటీరియల్సు ఫ్లయివుడ్ రకములు, టోకుగాను, చిల్లరగాను సరసమయిన ధరలకు సప్లై చేయబడును.

## శ్రీ కృష్ణా పెయింట్సు & హార్డువేర్ స్టోర్సు

యస్. శ్రీనివాసరావు. (మేనేజింగు పార్టనర్)

H. O. గుంటూరు; B. O. నెల్లూరు, మాచర్ల

Phone : 274, 1183 — 443 — 14: 14 A

Grams 'Spartan' — 'Krishna paints' — 'Krishna paints'

# స్వాతంత్ర్య రథము

దువ్వూరి రామిరెడ్డిగారు

[1920 రౌద్రి సంవత్సరాదిసంచికనుండి]

అంబుదంబుల నమృత పూరంబు లొలుక
నింద్ర చాంపపుఁ దోరణ మింపు గులుకఁ
గార మెఱుగులు నెల్లెడఁ గడలుకొనఁగ
వెడలె స్వాతంత్ర్యరథము విన్వీధియందు.

చ. జలధరమాలఁ జీల్చికొని స్యందనకాంతి నంభోతరాళము
జ్జ్వలితముఁ జేసి యంధతమసంబులు వాఱిన మూలనైన శో
భల నవలెత్తఁ జేయుచుఁ బ్రభాత విభాకర బింబమట్లు సొం
పిలుచు నవీన జీవనము వేడ్కగ నింపె సమస్తపృథ్విలోన్

ఉ ఆ రథమందు దీప్తిమయమై కనుపట్టె నిజ ప్రభావ దు
ర్వార పవిత్రమూర్తి కడుపండువు సేయుచు, "దర్మజీవనా
కారమొ! శాంతిబింబమొ! యకల్మష సత్యనికేతనంబొ! సం
సారఫల స్వరూపమొ! ప్రజా హృదయంబొ!" యన న్వెలుంగుచున్.

మ. ఒకచేతన్ రుధిరంపుఁ బాత్రమును వేఱొక్కంటఁ బియాషపా
త్రికయుం గైకొని సభ్యతా మిషమునన్ దేశంబులం దెల్ల నిం
తకు ధర్మంబులు గాక నెన్నఁబడు నన్యాయ్యంబు లీనాటితో
వికలంబై చనుఁగాక యంచుఁ గరుణావేశమ్ము దీపింపగన్

తే. పచ్చినెత్తురు నమృతంపుఁ బాత్రఁ బోసి దివ్య దుగ్ధంబుగను మార్చె దేవి మహిమ!
హాలహాలగర్భమం దైన నమృతరసము సంభవించు నటం చిలఁ జాట నేమొ?

చ. నిలువదు స్యందనంబు ధరణీపతి పాలన దండభీతిచే
నిలువ దనాథ బాష్పములు నిల్చిన పల్లపునేల మొసగిం
పుల మఱపించు క్రించు దనపుం జతురాత్ముల కాఁగఁబో దన
ర్గళ జవ మొప్ప నేఁగెడిని కన్నులకుం గనరానిచోటికిన్.

తే గీ పూర్వసింహాసనంబులు, ప్రోజ్జ్వలంపు మణిమయ కిరీటములు, భోగమందిరములు,
చక్ర సంఘర్షణంబునఁ జదిసిపోయి యవియివి యనంగరాక రూపఱెడు నేఁడు.

తే. గీ లేవు దివ్యతురంగముల్, లేవు కరులు
ప్రజలె యాతేరుమోకులఁ బట్టువారు
వాయుజవమునఁ దారకాధ్వమున నేఁగు
నంతరాయశతంబుల నైన దాఁటి.

తే. గీ. తేరుజాడల నెత్తురు పాఱి పాఱి బంగరుంబంటఁ బండించె, బక్కనేలఁ
జక్రనేములు దాఁకిన స్థలములెల్ల సస్యలక్ష్మికిఁ గల్యాణశాల లయ్యె

తే గీ. స్యందనాసీనయగు దేవి "శాంతి శాంతి"
యనుచు మంజులగానమ్ము నలరఁజేసి
నవ్య నక్షత్ర వీణాస్వనంబులందు
మేళవించెను జనులు విస్మితులు గాగ.

# తిక్కన సోమయాజి ఘంటము ఒఱ



ఒఱ ముందు వైపు



ఒఱ వెనుక వైపు

[ఈ ఛాయాచిత్రాలు 1920 రౌద్రి సంవత్సరాది సంచికలో ప్రచురించినవి. సం.]

(90 పుట తరువాయి)

కూచెన్నగారి కాలము క్రీస్తుశకము 1298 ప్రాంతముల నుండ వలయునని శ్రీ స్వామికణ్ణుపిళ్లగారు చెప్పినారు. ఆ కాలములో దూర దర్శక యంత్రాదుల సహాయ మేమియులేక తన పూరియింటః గూర్చుండి పలకమీద కోటి వేసికొని ఆచంద్రార్కము ఉపయోగించు జోతిర్మాన పథకముల నిర్దుష్టముగ ఆ బ్రాహ్మణుః డెట్లు గుణింపఃగల్గెనో యని ఆశ్చర్యముగ నున్నది.

ఆంధ్రుల ప్రాచీన ప్రాశస్త్యమున కుపకరించి సూర్య సమీపవర్తి యగు బృహస్పతివలె చిరకాల మౌఢ్యముననున్న ఈ మహామహుని తిరుగ బృహస్పతివలె స్వయం ప్రకాశబింబముగఃజేయ నాంధ్ర చారిత్రకశోధకులు కడంగవలయును.

15—వ శతాబ్దమున బాలాదిత్యకులు అను మఱియొక సిద్దాన్తి యుండెనని బర్జనుగారి వ్యాసమువలనః దెలియుచున్నది. ఈయన రామేశ్వరాక్షరేఖకు పంచాంగమును గుణించె నఃట. ఈయన ఆంధ్రుడో, కర్ణాటకుఃడో సందేహముగ నున్నది. ఎవరైనను వీరి చరిత్రమును కనుగొనఃదగును.

(91 పుట తరువాయి)

భింప మరల వంతెన కదల నారంభించె నఃట! అప్పు డక్కడనున్న జనులెల్లరు నాశ్చర్య మనస్కులై స్వరమునకును లోహమునకును సంబంధ మేదో కలదని నిశ్చయించి స్వర మహిమ మున కద్భుతపడసాగిరని వార్తాపత్రికలవలన వినియుంటిమి. ఒక్క దేవకామిని సంగీత శక్తియే యర్జునుని శాపపాత్రుః జేసెను. శంకర శ్రీ కృష్ణాదులు నృత్తగానంబులకు లోనై తాండవ మాడినట్లు పురాణ ప్రసిద్ధము గదా! శంకరుని ఢక్కా వాద్యధ్వనులే సంస్కృతాక్షరములుగ నయ్యెనని చెప్పెదరు గదా! మనవా రొక జ్యౌతిషశాస్త్రమును కనుగొని దాని నభివృద్ధి పరచునప్పటికి ఎన్నో వేలు సంవత్సరములు పట్టినట్లు తెలియుచున్నది. కాన భారతీయ సోదరులారా! ఇట్టి సంగీత విద్యను భక్తి తాత్పర్యంబులతో భరత వర్షంబున నభివృద్ధిపఱచి తల్లాభంబులు బడయుదురుగాత యని కోరుచున్నాము. జగదీశ్వరుః డట్టి వరప్రసాదము మన కనుగ్రహించునుగాత.

# కౌమారభృత్యము

ఆయుర్వేద విశారద చావలి రామమూర్తిగారు

[1920 రౌద్రి సంవత్సరాదిసంచికనుండి]

కుమారుల రక్షణ మనునది యాయుర్వేదాష్టాంగములలో నొక ముఖ్యమయినది. శిశువులకు వలయు దినదినాభివృద్ధియు సంభవించెడు వ్యాధుల చికిత్సయు, నీ భాగమున విపులముగా విమర్శింపఁబడినవి. ఈ భాగము కేవలము మన యాయుర్వేదమునందే కాక ఆంగ్ల యూనాని వైద్యకము లందును విమర్శింపఁబడినవి. కాని ప్రకృతము మనదేశమున కాయుర్వేదీయ పద్ధతులంతటి యుపకారకము లితరములు గావని యెల్లరెఱింగిన విషయమగుటను ఈ పద్ధతులు మన దేశమున విశేష వ్యాప్తిలో లేనందునను జనసామాన్యము చాల గష్టములకుఁ లోనగుచున్నది. కావున నీ విషయమును గొంచెము వివరింపఁబూనితిని.

శిశువు జనించినతోడనే సైంధవ లవణము గలిపిన తేనె నేయి శరీరమునకు బూసి శరీరము నావరించియుండు మావిని తీసివేయవలయును. అనంతరము ప్రసవము వలనఁ గలిగిన ఆయాసముపోవుటకై బలాతైలము మున్నగు తైలములచే జక్కగ శరీరమును తడుపవలెను. సైంధవ లవణము కలిపిన తేనె నేయిని వ్రేలితో శిశువునోటియందు రాయుటవలన కఫము మున్నగు దోషములు హరించును. నేతితో గర్పూరమును గలిపి దానిని శిరముపైని బత్తిపింజతో వేయవలయును. పిదప నాభినాళమును నాలు గంగుళములకు బైనొకదారము గట్టి యక్కడ ఛేదించి యా నాళశకలముతోఁ గూడిన సూత్రమును శిశువు మెడలోఁ గట్టవలయును. ఛేదించిన నాళమును చెంగల్వకోష్టుచే కాఁచిన తైలముతో లేపనము చేయవలయును.

తరువాత పాలుగల చెట్ల ఆకులు మొదలగునవివేసి కాఁచినవియును, సుగంధ ద్రవ్యములచే కాఁచినవియును బంగారు, వెండి, మొదలగు లోహములు వేసి కాఁచినవియునగు నీళ్లతోగాని గోరువెచ్చని నీళ్లతోగాని శిశువులకు ఆకాలములయందుండు దోషములకు దగినట్లు వెలఁగయాకు మొదలగువానిని వేసి కాఁచిన జలముతోఁగాని స్నానమును జేయుపవలయును.

## స్తన్యపానక్రమము

శిశువునకు మొదటి దినమున నల్లసుగంధిపూల చూర్ణము తేనె నేయి వీనిని గలిపి మూఁడుసారులు నాకింపవలయును. రెండు మూఁడు దినములందు లక్ష్మణ యను మూలికతోఁ దయారుచేసి నేతిని త్రాగింపవలయును. మూఁడవ దినమునఁగాని నాల్గవ దినమునఁగాని తల్లికి స్తన్యము ఆవిర్భవించును. అప్పటినుండియుఁ దల్లిపాలు పిల్లల కాహారముగా నుపయోగింపవలయును. మొట్టమొదటినాఁడు చేపిన పాలను మొదటఁ గొన్ని ధారలను బైన పిండివేయవలయును. అట్లు చేయకున్న బిడ్డకుఁ బ్రమాదము వాటిల్లును. తల్లి పాల నిచ్చుటయే పిల్లలు క్రమక్రమాభివృద్ధినొందుటకు ముఖ్యకారణము. ఒకవేళ తల్లిపాలు లేనియెడలఁ బిల్లయందు మిక్కిలి ప్రేమగలదియును, సమానజాతి గలదియును యోగ్యురాలును రోగము లేవియు లేనిదియును వ్యసనము లేవియు లేనిదియును జీవద్వత్సయును సమృద్ధిగాఁ బాలు గలదియునునగు స్త్రీని శిశువునకుఁ బాలిచ్చుటకై నియమించితిమేని ఆ శిశువునకు సదా ఆరోగ్యము మంచి బలమును గలుగును. శిశువులకు శుద్ధమయిన స్తన్యము నుపయోగింపవలయును. శుద్ధ స్తన్య లక్షణము వాగ్భటమున నిట్లు వివరింపఁబడినది. పాలను నీటిలో వైచిన తోడనే భేదము లేకుండ నీటిలోఁ గలిసిపోయిన యెడల నవి శుద్ధమగు పాలు. వాత దూషితమగు పాలు నీటిలో వేసినతోడనే నీటిపైని దేలుటయు, నురుగు గట్టుటయు మొదలగు గుణము లగపడును. ఆ పాలను సేవించినచో మల మూత్రబంధము గలుగును. పైత్యదూషితమగు స్తన్యము నీటిమీఁద వేసిన తోడనే పచ్చని రంగు గీత లగపడును. వానిని సేవించిన సర్వాంగతాపము గలుగును. కఫదూషితస్తన్యము నీటిమీఁద వేసినతోడనే నురువుగట్టి నీటిలో మునిఁగిపోవును. వాని నుపయోగించిన నగ్నిమాంద్యము గలుగును.

వీనిలో రెండేసి దోషము లున్నయెడల ద్వంద్వజములనియు మూఁడు దోషము లున్నయెడల సాన్నిపాతిక దూషితము లనియు నెఱింగి శుద్ధమగు స్తన్యమునే బిడ్డలకుపయోగింపఁదగును. ఒకవేళఁ బైని జెప్పిన లక్షణములుగల యుపమాత (పాలతల్లి) లభింపనియెడల మేకపా లిచ్చుట యుత్తమము. అవియు దుర్లభములయినచో నావుపాలను మేకపాలతో సమానగుణము గలవానిగాఁజేసి యుపయోగింపవలయును. వాగ్భటాచార్యుఁడు "ఆవుపాలలో ముయ్యాకుపొన్న, కోలపొన్న వాఁకుడు నేలములఁగ పల్లేరు వీని వేళ్లుగాని, ముయ్యాకుపొన్న కోలపొన్నల వేళ్లను మాత్రమేగాని వేసి కాచి కొంచెము చక్కెరఁ గలిపినచో నవి మేకపాలకుండు లాఘవాది సుగుణములు గలవి యగు"నని చెప్పియున్నాఁడు. బిడ్డ కాఱుమాసములు గడచువఱకును బాలిచ్చువారుగాని పోయువారుగాని మిగుల వివేకముతో మెలంగవలయును. తెలివిలేమిని బిడ్డ యేడ్చినపు డెల్లఁ బాల నిచ్చినచో నజీర్ణము కలుగును. ప్రస్తుతము మన దేశమునందలి శిశు మరణముల కిది యొక హేతువనుట నిస్సంశయము. కావున నదివఱకు త్రాగించిన పాలు బాగుగ జీర్ణించినవని తెలిసికొని తిరిగి పాలిచ్చుచుండవలయును. ఆఱు మాసములకు లోఁబడిన శిశువునకు క్షీరాదుఁడనియును (పాలు మాత్ర మాహారముగాఁ గలవాఁడు) అటు తరువాత క్షీరాన్నాదుఁడనియు సంజ్ఞలు గలవు. ఆరు మాసములు గడచిన పిదప శిశువునకు మామూలురీతి పాలను లఘువును బృంహణమునునగు నన్నమును గూడ నీయవచ్చును. దంతములు మొలచిన పిదప శిశువునకు క్రమముగాఁ దల్లిపాలు మానిపింపవలయును. మానుపించుటలో మిక్కిలి లఘువును బుష్టికరమును నగు నన్నమును నుపయోగించుచుండవలయును. శిశువునకు దంతము లంకురించిన పిదప (1) పొరపప్పు, అతిమధురము, తేనె, పేలపిండి, కలకండ వీనిని జక్కఁగఁ గలిపి ఆవిరిపై నుడికించి యుండ్రముగాఁజేసి యిచ్చిన మంచి పుష్టి కలుగును. (2) మారేడు పిందెలు, ఏలకులు, పేలపిండి, చక్కెర వీనిని ఆవిరిచే నుడికించి యుండ్రముగా నుపయోగించిన జఠరాగ్ని చక్కఁగ వృద్ధియగును. (3) ఆరెపువ్వు, చక్కెర, పేలపిండి, మరియును తృప్తికరములు బలకరములునగు నితర వస్తువులును జేర్చి పై రీతి నుండ్రములు చేసి యిచ్చినచో నజీర్ణ విరేచనములు మొదలగువాని నాపి శిశువున కారోగ్యము నిచ్చును. శిశువునకు పదునెనిమిది మాసములు గడచిన పిదప స్తన్యమును క్రమ క్రమముగా నాపివేయవలెను. కొందరు పాలుగల తల్లులు తమ బిడ్డలకు అయిదారేండ్లు వచ్చువఱకును స్తన్యము నిచ్చుచుండుట నక్కడక్కడ కలదఁట. అది పిల్లలకుఁ జాల బుద్ధిమాంద్యమును గలుగఁజేయును. కావున ఈ దురభ్యాసమును మానవలెను. ఆ వయస్సు చిన్నపిల్లలు చాపల్యమున నేవేని యనర్థములగు పనులు చేయుటయు వారి నితరులు భయపెట్టుటయుఁ గలదు. అట్లు భయపడిన శిశువునకు బాలగ్రహాదివ్యాధు లతిసులభములుగ సంభవించును. కావున నట్టి సందర్భములనుండి శిశువులను గాపాడుకొనవలయును. మఱియుఁ బిల్లలను మురికి బట్టలనుండియు, చెడుగాలినుండియు, గృశింపజేయు నాహార విహారములనుండియు రక్షింపవలయును. సంతతము బిడ్డల నెత్తికొని నిలిపివేయరాదు. ఈ విషయములను చక్కఁగ గమనింపని యెడల గొప్ప అనర్థము వాటిల్లును. ఈవిషయమున వాగ్భటాచార్యులు 'వస్త్ర వాతా త్కరస్పర్శా త్పాలయే ల్లంఘితాచ్చ తమ్' అని తెలిపియున్నాఁడు. ఈ వయసు కలుగు బాలురకు బ్రాహ్మ్యాది ఘృతమును వచాది ఘృతమును ఇచ్చిన చాల లాభము గలుగును. బ్రాహ్మ్యాదిఘృతము:— మండూకబ్రాహ్మి, తెల్లఆవాలు, వసకొమ్ము, నల్లసుగంధి పాల, చెంగల్వకోష్టు, సైంధవ లవణము, పిప్పళ్లు వీనిని సమభాగములుగా తూచుకొని అందు నీళ్లుపోసి స్వరసమును దీసి దానికి నాల్గవ భాగము నేతిని కలిపి యథావిధిగ నేయి మిగులునట్లు కాఁచుకొనవలయును. దీని నుపయోగించినచో బిడ్డలకు వాక్పటుత్వము బుద్ధిపాటవము జ్ఞాపకశక్తి ఆయుర్వృద్ధి గలుగును. మఱియును పిల్లలకు పీడ సోకుట గ్రహబాధ ఉన్మాదము మున్నగునవి నశించును.

వచాదిఘృతము—వస, తిప్పతీగ, కచ్చోరములు, కరకకాయలు తెల్ల దంతెన వాయువిడంగములు, సొంటి, ఉత్తరేణి వీనిని సమభాగములుగా గ్రహించి కల్కముచేసి ఆవు నేతిలో జేర్చి విధిప్రకారము పాకముజేసి యిచ్చిన శిశువునకు బలము బుద్ధి జ్ఞాపకశక్తి ఆయుర్వృద్ధి వాక్పటుత్వమునఁ గలుగును. ఇట్టి సులభములు నుత్తమములునగు ఔషధము లెన్నియో యాయుర్వేదమునఁ జెప్పబడియుండినను తెలియకపోవుటచేత బిడ్డలను పాడుచేసికొనుచున్నారు. విజ్ఞులీకన్నైనను శిశురక్షణమున బద్ధాదరులగుదురుగాక యని ప్రార్థించెదను.

# హస్తివర్మ ఉర్లాము శాసనము

[1920 రౌద్రి సంవత్సరాదిసంచికనుండి]

ఈ వ్యాస రచయిత పేరు ఏ కారణంవల్లనో కనిపించడం లేదు ఈ శాసనం శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిద్వారా రావు బహద్దూర్ హెచ్ కృష్ణశాస్త్రిగారికి అందినట్లు, దానిని శ్రీ వేకుమళ్ల రాజగోపాలరావుగారు "సౌత్ ఇండియన్ రీసెర్చ్", పత్రిక 1919 జులై సంచికలో ప్రచురించినట్లు 'ఎపిగ్రాఫియా ఇండికా' 17 వ సంపుటిలో ఈ శాసనం ప్రచురించిన ప్రొఫెసర్ ఇ హుల్ట్‌ష్, పి హెచ్ డి తెలిపారు. కనుక ఈ వ్యాసం రావుబహద్దూర్ హెచ్ కృష్ణశాస్త్రిగారు వ్రాసిఉంటారేమో! ప్రొఫెసర్ ఇ హుల్ట్‌ష్ తెలిపిన అంశాలలో భాగం ఇక్రింద ఉదాహరిస్తున్నాము సం

No 19 Urlam Plates of Hastivarman By Professor E Hultzsch P. H D

"This is a set of three copper plates The plates were received by Rao Bahadur H Krishna Sastry from K Nageswara Rao, Editor of the 'Andhra Patrika' who stated that they are the private property of the Rajah of Urlam, Chicacole taluk Ganjam Dt Mr T Rajagopala Rao has already published the text of the inscription on them in his Journal 'South Indian Research' for July 1919 "

(Epigraphia Indica Vol XVII
P P 330-334.)

---

కడచిన సంవత్సరమున (1919) జూన్‌నెలలో నా మిత్రులైన శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు ఉర్లామురాజాగారివలన తమ కంపబడిన యొక తామ్రశాసనమును పరిశోధనార్థమై నా కొసఁగిరి ఈశాసనము మూఁడు రాగి రేకులమీఁద వ్రాయఁబడినది ఈ రేకులు ఒక యుంగరమువలన బంధింపఁబడియున్నవి రాజదత్తములగు తామ్రశాసనములకుండు నుంగరములమీఁద రాజముద్రిక లుండుట యాచారము కాని ఈ శాసనపు టుంగరముపైనుండు ముద్రిక ఎప్పుడో ఎట్లో ఛేదింపఁబడినందున, దీనిపై నిది ఇప్పుడు కానఁబడుటలేదు కాఁబట్టి ముద్రికవలన తెలియఁదగిన విశేష విషయములను తెలిసికొను నవకాశము నాకుఁ గలుగలేదు. ఈశాసనమునందలి రాగి రేకులలో మొదటిదానికి ఒక్కప్రక్కను మాత్రమే అక్షరములు కలవు తక్కిన రెండింటికిని రెండు ప్రక్కలను అక్షరములు కలవు ఇందలి లిపి మిక్కిలి ప్రాచీనమైనది ఆంధ్రాక్షరములతో వ్రాయఁబడిన ఈ శాసనము క్రీ శ నాలుగవ శతాబ్దమునాఁటిదై యుండవచ్చును. ఇందలి లిపి మిక్కిలి ప్రాచీనమైనదనుట కెంతమాత్రమును సందేహములేదు ఈ శాసనము ఇప్పటి కించుమించు పదునాఱు శతాబ్దములకుముందు వ్రాయఁబడినను, అక్షరము లెంతమాత్రమును అఱిగిపోక, స్ఫుటములై నిన్ననో నేఁడో వ్రాయఁబడినట్లున్నవి ఈ శాసనము ఉర్లాము సంస్థానములో ఏ గ్రామమునందు ఎప్పుడు ఏ ప్రదేశమున ఏ సందర్భమునందు దొరికినదో శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు విచారించి ప్రచురింపఁగర్త్తలు ఇది ఊఁకతో నిండిన మట్టి కుండయందు భూస్థాపితమై దొరికినట్లు తెలియవచ్చుచున్నది అందువలననే ఇందలి యక్షరము లంత స్ఫుటముగా నున్నవి లేనియెడల నీ రేకులు చిలుముపట్టి మట్టిచే తినఁబడి ఎప్పుడో జీర్ణదశకు వచ్చియుండును ఈశాసనము త్రికళింగమును నాంధ్రరాజ్యము మహోచ్చదశయందున్న ప్రాచీన కాలమున నా దేశపు చక్రవర్తులలో నొక్కఁడగు హస్తివర్మ మహారాజుచే వ్రాయింపఁబడినది ఈతఁడు గాంగవంశజుఁడు

మన మిప్పుడీ శాసనమునకు కాల నిర్ణయము చేయవలసియున్నది మహారాజైన హస్తివర్మ ప్రవర్ధమాన విజయరాజ్య వత్సరములు 80 అగు కార్తిక కృష్ణ షష్ఠినాఁడీ దానము చేసినట్లు మాత్రమే మన కీ శాసనము తెలుపుచున్నది కాని, ఈ హస్తివర్మ తండ్రి తాతలెవ్వరో ఈ అశీతి (80) సంఖ్యను శాలివాహన శకమునకుగాని, హూణశకమునకుగాని మార్చుట యెట్లో—మున్నగు విషయములు మనకుఁ దెలియరావు సముద్రగుప్తునితో యుద్ధముచేసి యోడిపోయిన హస్తివర్మ యొక్కఁడు కలఁడుగాని, యాతఁడు వేంగి దేశాధిపుఁడైనట్లు గయాక్షేత్రమునందలి స్తంభముపై వ్రాయఁబడిన శాసనము వలనఁ దెలియవచ్చుచున్నది కళింగ నగరాధిపుఁడైన మన శాసనములోని హస్తివర్మయు నొక్కరే యనుటకు వలసినంత యాధారము దొరకువఱకును, ఆ హస్తివర్మను మన శాసనములోని హస్తివర్మనుగా నూహింప వీలులేకున్నది అందువలన నీ శాసన కాలమును మనము వేరు సాధనములవలన నిర్ణయింపవలసి వచ్చుచున్నది "గంగామలకులతిలకో" అను శాసనములోని సమాసమువలన నీ హస్తివర్మ గంగవంశపు రాజైనను, కళింగదేశపు చరిత్రమింకను స్పష్టముగా వ్రాయఁబడకపోవుటచేతను, పాశ్చాత్య పరిశోధకులు వ్రాసిన కొన్ని విషయములు అన్యోన్య విరుద్ధములై యుండుటచేతను, గంగరాజుల చరిత్రమును నేను శాసన ప్రమాణానుసారముగా నిచ్చోట ముందు నిర్ణయించి, ఆ వెనుకనే హస్తివర్మ కాల నిర్ణయము చేయవలసియున్నది.

శాసనములవలనఁ దెలియఁబడిన సంగతుల ననుసరించి, త్రికళింగరాజులను రెండు శాఖలవారినిగా మనము విభజింపవలసియున్నది అందు రెండవ శాఖవారిలో నొకఁడైన కామార్ణవుఁడను రాజు తత్పూర్వపు కళింగ వంశపు రాజులను జయించినట్లు అనంతవర్మ చోడ గంగదేవుని సింగురాపురపు శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది ఈ రెండవ శాఖవారి వంశవృక్షము కొన్ని శాసనముల ననుసరించి ఈ క్రింద వివరింపఁబడినది. ఒక్కొక్కరాజుయొక్కయు రాజ్యపరిపాలన కాలము కూడ దీనివలనఁ దెలియఁదగును. ఈ శాసనమును ఇతర శాసనములతో గూడఁ బోల్చి చూచి, సరియైన కళింగరాజుల పట్టికను ఈ వ్యాసాంతమునందుఁ జేర్చుచున్నాను

నేను (ప్రక్కపుటలో)తెలిపిన ఈమొదటి వంశావళికి ఆధారము లెవ్వియని ప్రశ్నింపవచ్చును "ఏయి దుదధి ఖేందు గణితేషు శకవత్సరేషు పుణ్యే హని" అనఁగా శక సంవత్సరములు 1040 యం దొసఁగఁబడిన, త్రికళింగాధిపుఁడగు అనంతవర్మ చోడ గంగదేవుని సింధూరపురి తామ్రశాసనములలో నితని వంశావళి తెలుపఁబడినది ఈ శాసనమును ఇప్పుడు చెన్నపురిలోని చిత్రవస్తు ప్రదర్శన శాలయందు చూడవచ్చును ఇది గాక శక సంవత్సరములు "అజగిరినిధి" అనఁగా 979 సంవత్సరపు ఫాల్గుణ శుద్ధ ద్వాదశి ఆదివారమునాఁడు త్రికళింగాధిపుఁడగు వజ్రహస్తదేవునిచే నొసఁగబడిన నడగాము తామ్రశాసనములవలను గూడ నీ వంశములోని గుండమరాజు (10 యువరాజు) వంశావళి (పదనేడవరాజగు) వజ్రహస్తుని వఱకును దెలుపఁబడినది ఇందలి లెక్కలనుబట్టి ఈ వంశపు రాజులు పందొమ్మండ్రును చేరి 432 సంవత్సరములు ఏలినట్లగుచున్నది

పైని చెప్పినది రెండవ వంశమునకు సంబంధించిన త్రికళింగ రాజుల విషయము మొదటి వంశమునకు చేరిన కళింగరాజుల చరిత్రమునకు ఇంకను ఆధారము లంతగా దొరుకలేదు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు మంగలేశ రణవిక్రాంతుఁడు వంగాంగ కళింగ వట్టూర మగధ మద్రక కేరళ గాంగ మూషక పాండ్య ద్రమిళ చోళీయ ఆళీన వైజయంతీ పురాధీశులను జయించినట్లు బాదామి శాసనమువలనను, సత్యాశ్రయపులకేశి కళింగరాజుతో యుద్ధము చేసినట్లు ఐహోలు శాసనమువలనను దెలియుచున్నందున ఈ శాసనముల కాలమునాఁటి కళింగ రాజ్య చరిత్రము విశదమగుచున్నది వారిలోని మొదటిరాజగు కామార్ణవుడు బాలాదిత్యుని జయించి కళింగధిపుఁడైనట్లు అనంతవర్మ శాసనమువలను దెలియఁబడుటచే, ఈ బాలాదిత్యుఁడెవ్వఁడో మనకుఁ దెలియవలసియున్నది (1) శక సంవత్సరములు 620 ప్రాంతములందు బాలాదిత్యుని కుమారుఁడైన ప్రకటాదిత్యుఁడను రాజొకఁ డుండినట్లు కలకత్తా చిత్రవస్తుశాలలోనున్న సారానాధ శాసనమువలనఁ దెలియుచున్నది ఈ శాసనము శిథిలమై యున్నందున ఈ బాలాదిత్యుఁడే కళింగాధిపుఁడని నిర్ణయించుట సులభముకాదు (2) మగధరాజ్యము నేలిన గుప్తవంశములో నొక బాలాదిత్యుఁడు కలఁడు అతనినిగూర్చియు మనకంతగా తెలియదు (3) గుప్తశకము 310 ప్రాంతములలో ధ్రువసేన బాలాదిత్యుఁ డొకఁ డుండినట్లు వల్లభి శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది ఈ శాసనమువలన భీతార్కుఁడను రాజునకు ధారసేనుఁడను కుమారుఁ డుండినట్లును, అతనికి శిలాదిత్యుఁడును, ఆతనికి కరగ్రహుఁడును, ఆకరగ్రహునికి ధారసేన బాలాదిత్యులను నిరువురు కుమారులును గలిగినట్లు తెలియవచ్చుచున్నది


మహావిష్ణువు
చంద్రుఁడు
గాంగేయుఁడు
కోలాహలుఁడు
గంగవాడిలో కోలాహలపురాధిపుఁడు
విరోచనుఁడు
81 మంది రాజులు — వంశపారంపర్యముగా
వీరసింహుఁడు
కామార్ణవుఁడు 1
ఇతఁడు బాలాదిత్యుని జయించి కళింగరాజై 36 ఏండ్లు రాజ్య పాలనము చేసెను [1]
దానార్ణవుఁడు
40 సంవత్సరములు [2]
గుణార్ణవుఁడు II
మారసింహుఁడు
వజ్రహస్తుఁడు
కామార్ణవుఁడు II
నగరము రాజధానిగా 50 సం. రాజ్యమేలెను [3]
రణార్ణవుఁడు 5 సం. [4]
వజ్రహస్తుఁడు II 15సం [5]
కామార్ణవుఁడు III 19 సం [6]
గుణార్ణవుఁడు II 27 సం [7]
గుండమరాజు
3 సం —[10]
పేరు తెలియదు
కళింగాంకుశుఁడు
12 సం [9]
జితాంకుశుఁడు
15 సం.—[8]
కామార్ణవుఁడు IV
35 సం —[11]
వినయాదిత్యుఁడు
3 సం.—[12]
వజ్రహస్త అణియాంకభీముఁడు
35 సం — [13]
రెండవభార్య
కామార్ణవుఁడు
సం ½ [14]
గుండమరాజు
3 సం. [15]
మధుకామార్ణవుఁడు
19 సం. [16]
వజ్రహస్తుఁడు 33 సం. [17]
రాజరాజు 8 సం.[18]
అనంతవర్మ చోడ గంగదేవుఁడు

మనకుఁ గావలసిన ఈ బాలాదిత్యుఁ డెవ్వఁడో తెలిసికొనుటకు ఆధారములు లేవు కాని ఈతని పూర్వమునందు త్రికళింగము నేలిన రాజుల శాసనము లనేకములు మనకుఁ గానవచ్చుచున్నవి అందు సత్యవర్మ యనురాజు కళింగనగరమునుండి సూర్యోపరాగ సమయమున "గాంగేయ వంశ సంవత్సర శతత్రయైక పంచాశతి" నొసగిన శాసనమువలన బాలాదిత్యునికిఁ బూర్వమందు గాంగశక మొదటి యుండెవనియు నాఁక సంవత్సరములు 351 లో సత్యవర్మ యుండెననియును తెలియుచున్నది సత్యవర్మకును బాలాదిత్యునికిని నడుమ ఎందఱు రాజు లుండిరో తెలియవచ్చుటలేదు ఈ ఇరువురికిని నడుమ రమారమి ఏఁబదేండ్ల వ్యవధి యుండినను నుండవచ్చును

హోనుత్సాంగు అను చీనాదేశపు యాత్రికుఁడు తనకాలమునందు కళింగరాజ్యమునకు రాజమహేంద్రవరము ముఖ్యపట్టణమని వ్రాయుచున్నాఁడు వేంగి రాజ్యమును ఒయించిన రెండవ సత్యాశ్రయ పులకేశి కళింగ రాజ్యముతో యుద్ధము జేసినట్లు ఐహోలు శాసనమువలనఁ దెలియఁబడినదని ఇదివఱకే నేను చెప్పియున్నాను పులకేశియొక్క ఈ శాసనము శక సంవత్సరముల 556 నాఁటిది మంగలేశుఁడు కళింగరాజును జయించిన విషయము గూడ ఇదివరకే చెప్పఁబడినది ఈ బాలాదిత్యుఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సంబంధించిన మనుష్యుఁడుకావచ్చును ఏది యెట్లున్నను శక వర్షములు 351లో సత్యవర్మ శాసనముతఱువాత మనకు మొదటివంశపు గాంగుల శాసనములు కానవచ్చుటయే లేదు ఈ కాలమునందు దేశము చాళుక్యులకు స్వాధీనమై యుండినను ఉండవచ్చును సత్యవర్మ తరువాత మనకుఁ దెలిసిన రాజు బాలాదిత్యుఁడే వీరి నడుమ ఒక నూఱు లేక ఏఁబది సంవత్సరముల వ్యవధి యుండవచ్చును సత్యవర్మ తఱువాతిరాజే బాలాదిత్యుఁడని తలంచుటకు ఆధారము లెవ్వియు లేవు పేరునుబట్టి ఈ బాలాదిత్యుఁడు చాళుక్య వంశపు రాజుగా కానవచ్చుచున్నాఁడు ఇదికాక సత్యవర్మయొక్క యొక శాసనము గాంగేయ సంవత్సరములు 351 లో కానవచ్చుటచే ఆ సంవత్సరమునందే సత్యవర్మ చనిపోయెనని గాని, బాలాదిత్యుఁడు 591 లో రాజ్యభ్రష్టుడైనందున అతఁడు ఆ ఏటనే రాజ్యమునకుఁ గూడ వచ్చెననిగాని చెప్పుట సమంజసము కాదు ఎట్లు చూచినను సత్యవర్మకును బాలాదిత్యునికిని నడుమ అనఁగా గాంగశకవర్షములు 351 కిని శాలివాహనశకవర్షములు 591 కిని మధ్య—అధమము ముప్పది నలుబది సంవత్సరముల వ్యవధియైన నుండవచ్చును లేనియెడల ప్రకృతమున విమర్శింపఁబడుచున్న శాసనములోని మిక్కిలి ప్రాచీనములైన యక్షరముల తత్త్వమునకు సరియైన సమాధానము రాదు గాంగేయ శక సంవత్సరములు 284 లో అనంతవర్మయను మహారా జుండినట్లు 'ఇండియన్ ఆంటిక్వేరి' పత్రిక 18 వ సంపుటములోని 164 పుటవలనఁ దెలియుచున్నది గాంగేయ శక వర్షములు 183 లో గుణార్ణవుని కుమారుఁడగు దేవేంద్రవర్మచే నొక శాసన మీయఁబడినట్లు 'ఎపిగ్రాఫియా ఇండిక' యను పత్రికయొక్క మూడవ సంపుటము 131 వ పుటలో వ్రాయఁబడియున్నది ఇంద్రవర్మ యనురాజు రెండు శాసనము లొసఁగినట్లు "ఇండియన్ ఆంటిక్వేరీ పత్రిక" 13 వ సంపుటములోని120, 134 పుటలవలనఁ దెలియుచున్నది ఇందు మొదటి శాసనము గాంగేయశకము 146 వ సంవత్సరమునను రెండవది 128 వ సంవత్సరమునను వ్రాయఁబడినది గాంగేయశకము 91 వ సంవత్సరములో గంగమహారాజగు ఇంద్రవర్మరాజసింహుని శాసనమొక్కటి కానవచ్చుచున్నది అచ్యుతాపురపు తామ్రశాసనములవలన కళింగ రాజ్యాధిపుఁడగు నింద్రవర్మ యను రాజేంద్రుఁడు గాంగశక వర్షములు 87 లో వరాహవర్తనియందలి సిద్ధార్థ గ్రామమును గౌతమ సుగోత్రుఁడగు దుర్గశర్మకు ఒసఁగినట్లు తెలియుచున్నది ప్రకృతమున మనము విమర్శించుచున్న శాసనము గాంగశక వర్షములు 80 వ సంవత్సరమునకుఁ జెందియున్నది గాంగశకము 87 వ సంవత్సరమునాఁటి ఇంద్రవర్మయొక్క శాసనమును గాంగశకవర్షములు 80 నాఁటి మన ప్రకృత శాసనమును వ్రాసిన వా రొక్కరేయని "ఇదం వినయ చంద్రేణ భాను చంద్రస్య సూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా" యను శ్లోకమువలనఁ దెలియుచున్నది హస్తివర్మ తరువాతిరాజే ఈ ఇంద్రవర్మ యని తెలుపుటకీ 87వ సంవత్సరపు శాసనముకంటె ప్రబలాధారము లెవ్వియు నవసరము లేవు. ఆ శాసనము వీ దిగువ నుదాహరించుచున్నాము

1 ఓం స్వస్తి సర్వర్త్తు రమణీయా ద్విజయ కలిఙ్గనగరా త్సకలభువన నిర్మాణైక,
2 సూత్రధారస్య భగవతో గోకర్ణ్ణస్వామిన శ్చరణ కమలయుగల ప్రణామా,
3 దపగత కలికలఙ్కో వినయనయ సంపదా మాధార స్స్వసిధారా పరి,
4 స్పంధాధిగత సకల కళిఙ్గాధిరాజ శ్చతు రుదధి తరంగ మేఖలావనీత,
5 ల ప్రథిత తామలయశాః అనేక సమర సంక్షోభ జనిత జయశబ్ద,
6 గాఙ్గామలకుల ప్రతిష్ఠ ప్రతాపాతిశయానామిత సమస్త సామన్త,

Second plate First side

7 చూడామణి ప్రభామఞ్జరీపుఞ్జ రంచిత చరణో మాతా పితృ పాదానుధ్యాతః,
8 పరమ మహేశ్వరః శ్రీ మహారాజేన్ద్ర వర్మా వరాహ వర్త్తన్యాం సిద్ధార్థకగ్రామే,
9 సర్వా సమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాపయతి విదిత మస్తు వో యథాస్మి న్గ్రా
10 మే రాజతటాక పిత్రే హాలస్య భూ శ్ఛేదీకృత్య సర్వకరైః పరిహ,
11 రేణా చన్ద్రార్క ప్రతిష్ఠ ఙ్కృత్వా మాతాపితృభ్యా మాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే గౌత,
12 మసగోత్రాయచ్ఛన్దోగసబ్రహ్మచారిణే దుర్గశర్మణే మాతృభట్టారికా

Second plate Second side

13 పాదానా న్తటాక ప్రతిష్ఠాపన ముదగయనే ఉదక పూర్వకమస్మాభి స్సంప్రదత్తా,
14 తద్విదిత్వా న భూమి మను పాలయతా (న్న) కేనచి త్పరిబాధా కార్యా సీమా లిఙ్గాని,
15 పూర్వేణ రాజతటాక పావ స్సైవ దక్షిణేన పశ్చిమేన పరిపాల్యా వల్మికత్రయా
16 ఉత్తరపాళ్యా కపాటసన్ధ పరిపాషాణ స్తతః సేష్మకోన్యః పాపేణ
17 స్తతోధి మార తరుద్వయా తతః కారకవృక్ష శ్చేతి తటాకోదేశ బన్ధ మోక్షే నకేనచి,
18 ద్విఘాతః కార్యేతి భవిష్య ద్రాజభి శ్చాయ న్ధావ ధర్మో నుపాల్య స్తథాచ వ్యాసగీతా

Third plate

19 బహుభిర్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా యస్య యస్య యథాభూమి స్తస్య,
20 తస్య తదాఫలం॥ షష్టింవర్ష సహస్రాణి మోదతే దివి భూమిదః ఆక్షేప్తాచాను,
21 మన్తాచ తాన్యేవ నరకే వసేత్॥ స్వదత్తాం పరదత్తాం నా యత్ని యుధిష్ఠిర,
22 మహీంమహిమతాం శ్రేష్ఠ దానాచ్ఛ్రేయోనుపాలన మితి ప్రవర్ద్ధమానవిజయ,
23 రాజ్య సంవత్సరా సప్తాశీతి (87) చైత్రా మావాస్యాం ఇదం వినయ చన్ద్రేణ
24 భాను చన్ద్రస్య సూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా॥

ఈ శాసనమునకు కాల నిర్ణయము చేయునపుడు బాలాదిత్యుఁడు ఎప్పుడు రాజ్యభ్రష్టుడయ్యెనో తెలియవలసియుండును శక సంవత్సరము 591 లో ఈతడు కామార్ణవునిచే జయింపఁబడినను ఈ శాసనము అంతకు పూర్వపుకాలము నాఁటిదే యగుట నిశ్చయము సత్యవర్మ యొసగిన శాసన మొకటి గాంగశకము 351—కి చెందియున్నందున బాలాదిత్యునికి పూర్వము 351 సంవత్సరములు గాంగులు రాజ్యమేలినమాట సిద్ధము మన హస్తివర్మ శాసనము గాంగవర్షమునకు 80 నాఁటి దగుటచే ఇతఁడు సత్యవర్మకు 351—80=271 సంవత్సరములకు మునుపటివాఁడు సత్యవర్మ శకవర్షము 591 లోనె రాజ్యమునకు వచ్చుటయు ఆ యేటనే బాలాదిత్యునిచే ఓడింపబడుటయు అదే సంవత్సరముననే బాలాదిత్యుఁడు గూడ కళింగ రాజ్యమునుండి తొలగింపఁబడుటయు సంభవమగునేని గాంగవర్షములు 351 ని శకవర్షములు 591 గ పరిగణింపవచ్చును అట్లేని సత్యవర్మకు 271 సంవత్సరములకు ముందున్న హస్తివర్మ 591—271 = 320 శకవర్షమునాటి వాఁడగును కాని పై మూఁడును ఏకకాలముననే జరుగుట అసంభవమగుటచేతను పేరునుబట్టి బాలాదిత్యుడు వర్మరాజులలోనివాడు గాక చాళుక్యవంశజుడుగ కానవచ్చుటచేతను చాళుక్య చక్రవర్తులు శకవర్షములు 523, 556 సంవత్సరములలో సైతము కళింగముతో పోరాడుచుండుటచేతను ఒకప్పుడు కళింగరాజ్యమునకు ప్రధాన పట్టణము రాజమహేంద్రవరమై యుండినట్లు హియానుత్సాంగు చెప్పుచుండుటచేతను ఈశాసనమునందలి లిపి యత్యంత ప్రాచీనమగుటచేతను ఇదివఱకు మనకు దెలియఁబడిన ప్రాచీన పూర్వ చాళుక్య శాసనములలోని లిపికంటెను గూడ నందలి లిపి ఎక్కువ ప్రాచీనముగఁ గానవచ్చుటచేతను బాలాదిత్యుఁడు కామార్ణవునిచే జయింపఁబడిన 591 వ సంవత్సరమునకును సత్యవర్మయొక్క గాంగశకవర్షములకు 351 కిని నడుమ 50 సంవత్సరముల వ్యవధి యుండువటుల తలంచుట అసంభవము కాదు అప్పుడు హస్తివర్మ శాసనము 36—20=250 లేక హూణ శకవత్సరములు 270+78=348 అగును అదియే సముద్రగుప్తునిచే వేంగిరాజు ఓడింపబడినట్లు తెలుపుచున్న గయా క్షేత్రములోని ప్రసిద్ధ శాసనముయొక్క కాలము ఎట్లు చూచినను ఈ హస్తివర్మయే సముద్రగుప్తునిచేత ఓడింపఁబడిన హస్తివర్మగ కానవచ్చుచున్నాఁడు అట్లు కాకపోయినను ఈతఁడు శక వత్సరములు 270 లేక హూణవత్సరములు 348 కాలమువాఁడనుటకు సందేహమే లేదు అప్పుడు సత్యవర్మ రాజ్యమునకు వచ్చుటయు రాజ్యమును పోగొట్టుకొనుటయు బాలాదిత్యుడు రాజ్యమునకు వచ్చుటయు బాలాదిత్యుఁడు రాజ్యభ్రష్టుడగుటయు రెండవ వంశపు గాంగులు కళింగాధిపు లగుటయును వీనికన్నిటికిని 50 సంవత్సరములు వ్యవధి యుండును కాబట్టి ఈహస్తివర్మయే సముద్రగుప్తునికాలమునాఁటి హస్తివర్మగ మనము ఊహించుకొనవలయును.

పాశ్చాత్య పరిశోధకులు గాంగశకవర్షములను హూణశకవర్షములనుగా మార్చు పద్ధతిని ఇంకను కనిపెట్టలేదు ఈ శాసనమువలన మనము ఇంచుమించుగ దీనిని తెలిసికొనవచ్చును

సముద్రగుప్తుఁడు క్రీస్తుశకము 326 మొదలుకొని 375 వరకు పరిపాలించినట్లు చరిత్రమువలన తెలియుచున్నది ఈతడు 320 క్రీ శ సంవత్సరములో సింహళద్వీపరాజగు మేఘవర్మచేత బహు సత్కారముల నందినవాఁడు ఈతడు 11 రాజ్యములను జయించినందునను, అందు వేంగిరాజ్యము గూడ నుండినందునను, ఇతర రాజ్యములజయించిన వెనుకనే ఈతఁడు దక్షిణ రాజ్యములకు వచ్చినందునను వేంగిరాజ్యము నితఁడ జయించిన నాఁటికాలము ఇంచుమించుగ క్రీస్తుశక వర్షములు 350 అయియుండును అదియే హస్తివర్మకాల మగుటచేతను ఈహస్తివర్మ తఱువాత నే సంవత్సరములనాటికి

ఇంద్రవర్మ కళింగరాజై యుండుటచేతను గాంగశకవర్షములు 80 ని క్రీ శ వర్షములు 350గ మనము కొంతవఱకు పరిగణించుకొనవచ్చును కాబట్టి 350—80=క్రీస్తుశకము 270లో లేక గాంగశకము ఆరంభమైనట్లు ఊహింపవచ్చును దీనివలన గాంగశక వర్షములకు 270 కలిపిన ఎడల క్రీస్తుశక వర్షములువచ్చునని తెలుచున్నది కాని ఇంచుమించుగ కొంతవఱకు మాత్రమే దీనివలన సంవత్సర పరిమితి తెలగలదు ఈ హస్తివర్మయు ఈతని వంశపువారును శైవులు "పరమ మాహేశ్వర" అను పదము ఈ వంశపు రాజులకు సామాన్యమైయున్నది వీరు అఖండ శివ పూజాధురంధరులై శైవమతము ప్రతిష్ఠించినటుల దీనివలన విస్పయింపవచ్చును

## ఉర్లాము శాసన ప్రతిబింబము







మొదటి రేకు రెండవ ప్రక్కన

శ్రీ స్వస్తి సర్వర్త్తు సుఖరమణీయా ద్విజయ కలిఙ్గ నగరాత్సకల భువన నిర్మ్మాణైక
సూత్రధారస్య భగవతో గోకర్ణస్వామిన శ్చరణ కమలయుగల ప్రణామా దపగత
కలికలఙ్కో వినయ నయ సమ్పదా మాధారః స్వాసిధారా పరిస్పన్ద దిగ
త సంల కలిఙ్గాధిరాజ్య శ్చతు రుదధి తరఙ్గ మేఖలా వనితల ప్రథి
లతామలయశాః అనేక సమర సంక్షోభ జనిత జయశబ్దో గాఙ్గా
మలకుల ప్రతిష్ఠః ప్రతాపాతిశయానామిత సమస్త సామన్త చూడా

రెండవరేకు— మొదటి వైపున

మణి ప్రభా మఞ్జరీ పుఞ్జ రఞ్జిత చరణో మాతాపితృ పాదాను ధ్యాతః పరమ
మాహేశ్వరః శ్రీ మహారాజో హస్తివర్మ్మా క్రోష్టుకవర్త్తన్యాం హెన్నావకగ్రామే
వ్వా సమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాపయతి విదిత మస్తు వో యథాస్మాభి
అస్మి న్గ్రామే గ్రహారిక సకాశా త్క్రీత్వా ద్వ్యర్ద్ధ హలస్య భూ శ్చేదీకృ త్వాచన్ద్రార్క్క
ప్రతిష్ఠ మగ్రహార ఙ్కృత్వా సర్వకరైః పరిహృత్య మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే
ఉరామల్ల నివాసినే వత్ససగోత్రాయ వాజసనేయస బ్రహ్మచారిణే జయ

రెండవరేకు — రెండవ ప్రక్క

శర్మ్మణే కార్త్తిక కృష్ణపక్ష స్యా ముదక పూర్వ్వ [ం] సంప్రత్తా త ద్విదిత్వా స్వభూమి మనుపాల
యతాం న కేనచి త్పరిబాధా కార్య్యేతి। సీమాలిఙ్గాని చాత్ర పూర్వ్వేణ వల్మీక స్తతః
క్షేత్రపాలీ తతో ఘోషణ వాప్యాః పశ్చిమ పాలీ తతః పునరపి క్షేత్రపాలీ తతో వల్మీకః
తతః కృత్రిమా పాషాణపఙ్క్తిః ఉత్తరేణాపి క్షేత్రపాలీ తతో వల్మీకః పున ర్వల్మీకః
[త] తో పూర్వ్వ వల్మీక మనుప్రాప్తేతి। భవిష్య ద్రాజభి శ్చాయ న్ధానధర్మ్మ మనుపాలనీయః



శివుని ప్రళయ తాండవము

చిత్రకారుడు : శ్రీ కౌతా ఆనందమోహనశాస్త్రిగారు—బందరు 1928 విభవ సంవత్సరాది సంచికనుండి

మూఁడవ రేకు — మొదటి ప్రక్క

తథాచ వ్యాసగీతాః—బహుభి ర్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా యస్య యస్య
యదా భూమి స్తస్య తస్య తదాఫలం స్వ దత్తాం పరదత్తాం వా యత్నా ద్రక్ష యుధిష్ఠిర మహీ[ం]
మహిమతాం శ్రేష్ఠ దానా చ్ఛ్రేయో నుపాలనం షష్టిం వర్ష సహస్రాణి మోదతే దివి
భూమిదః ఆక్షేప్తా చానుమన్తా చ తాన్యేవ నరకే వసేదితి। ప్రవర్ద్ధమాన విజయ
రాజ్య సంవత్సరా అశీతి ౦ కార్త్తికదిన 5॥ ఇదం వినయ చన్ద్రేన భాను
చన్ద్రస్య సూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా॥

మూఁడవ రేకు — రెండవ ప్రక్కను

మణ్డలాగ్రాగ్ర నిష్పేష నిష్పిష్టా రాతి సన్హతేః
శ్రీమతో ప్రతిఘాజ్ఞస్య రణాభీతస్య శాసనమ్॥

## తెలుఁగు అర్థ వివరణము

శుభము సర్వర్తు సుఖ రమణీయమైన విజయ కళింగనగరమునుండి—సకల భువన నిర్మాణైక సూత్రధారుఁడును భగవానుఁడును నగు గోకర్ణస్వామియొక్క పాదద్వంద్వ ప్రణామమువలన నపగతమగు కలికల్మషము గలవాఁడును, వినయ నయ సంపదల కాధారుఁడును, తన అసిధారయొక్క సంచలన మాత్రముచేత వశపరచుకొనిన సమస్త కళింగరాజ్యము కలవాఁడును, చతుస్సముద్రిత భూమండలమునఁ బ్రసిద్ధిగాంచిన నిర్మలమగు కీర్తి కలవాఁడును, అనేక రణరంగములయందు జయశబ్దము నార్జించినవాఁడును, గాంగామలకుల ప్రతిష్ఠుఁడును, ఎడతెగని ప్రతాపముచే వినమితులగు సమస్త సామంతరాజుల చూడామణి ప్రభామంజరీ పుంజములచే రంజితములగు పాదములు కలవాఁడును, మాతా పితృ పాద సేవకుఁడును, పరమ మాహేశ్వరుఁడునగు శ్రీ హస్తివర్మ మహారాజుగారు, క్రోష్టుకవర్తనీ ప్రదేశమునందున్న హిందోళ గ్రామమునందు కూడియున్న కుటుంబుల నందఱను ఇట్లు ఆజ్ఞాపించుచున్నాఁడు—మీకు తెలియుఁగాక, ఏమనఁగా—మాచేత నిచ్చట అగ్రహారికుల యొద్దనుండి అర్ధ్యర్థహల పరిమాణముగల భూమి విక్రయించుకొనఁబడి, విభక్తమై ఆచంద్రార్క ప్రతిష్ఠముగా నగ్రహారముగా ఏర్పాటుచేసి, ఏ విధమైన పన్నులు లేకుండఁ జేసి, మాతల్లి తండ్రులయొక్కయు, మా యొక్కయు పుణ్యాభివృద్ధికై, ఉరామల్ల నివాసియును వత్సగోత్రుఁడును వాజసనేయ శాఖీయుఁడును అగు జయశర్మకొఱకు కార్తిక కృష్ణాష్టమియందు ఉదకధారాపూర్వముగ నీయఁబడినది. ఈవిషయమును ఎఱింగి, స్వభూమిని పాలించుకొను ప్రతిగ్రహీతలకు ఎవ్వరును ఏ విధమైన బాధను చేయఁదగదు

దానమీయఁబడిన భూమికి హద్దులు ఇవి—తూర్పున నొక పుట్ట అటుపైని క్షేత్రపాళి, అటుపైని ఘోషణ వాపియొక్క పశ్చిమపాళి, అచ్చటినుండి మరల క్షేత్రపాళి దక్షిణమునం దుత్తరమునందువరకే హద్దులు పశ్చిమమున క్షేత్రపాళి అటుపైని వల్మీకము, అటుపైని పృథివీపమగు పాషాణపంక్తి ఉత్తరమునందు క్షేత్రపాళి, అటుపైని వల్మీకము, పిమ్మట మఱియొక వల్మీకము కూడ, తఱువాత మొదటి వల్మీకము అనుక్రమముగా వచ్చును తాము ను ఈదాన ధర్మములను ఆమోదించి పాలింపఁదగుదురు వ్యాస గీతలు కూడ ఇట్లే కలవు

ఎట్లనగా — అనేకులు వసుధను దానము చేసిరి ఇట్లే అనేకులు అనుపాలించిరి భూమి ఏ యే కాలమున నెవ్వ రెవ్వరి వశమునం దుండునో అప్పుడు వారి వారికి తత్ఫలము లభ్యమగును ధర్మజా! స్వదత్తమును కాని పరదత్తమును కాని భూమిని బాధనొందియకుండ రక్షించుచుండుము మహనీయులలో సత్తముఁడవగు ధర్మజా! భూమిని దానమిచ్చుటకంటెను ఇతరు లిచ్చిన దానిని అనుమోదించి పాలనము చేయుట యుత్తమము ఇట్లు చేసిన దాతయును అనుపాలకుఁడును అఱువదివేలేండ్లు స్వర్గమునఁ గ్రీడింపఁగలఁడు ఇందులకు ఆక్షేపించువాఁడును, ఆక్షేపకుని ఆమోదించువాఁడును అఱువదివేలేండ్లు నరకమునఁ గూలియుండెదరు అనుక్రమముగా జరుగుచు వచ్చుచున్న విజయరాజ్య సంవత్సరములు 80 అగు నేటి కార్తిక కృష్ణ 8 దినములందు ఈ శాసనము భానుచంద్ర సూనుఁడగు విజయచంద్రునిచేత రాజసింహుఁడగు హస్తివర్మయొక్క ఆజ్ఞననుసరించి, లిఖితమైనది కరవాలాగ్రమునఁ బిప్పి బిప్పిగాఁ గొట్టఁబడిన శత్రురాజులు కలవాఁడును శ్రీమంతుఁడును రణాభీరుఁడునునగు గాంగ వంశీయునిది ఈ శాసనము



శ్రీ విజయరామ గాన కళాశాల, విజయనగరము

[ఈ ఛాయా చిత్రం 1920 రౌద్రి సంవత్సరాది సంచికలో ప్రచురితమైనది.]



స్పైలరు దొరగారు, నరసాపురము

[ఈ ఛాయాచిత్రం 1920 రౌద్రి సంవత్సరాది సంచికలో ప్రచురితమైనది]



కోపల్లి హనుమంతరావుపంతులుగారు —వీరు ఆంధ్ర దేశమునందలి జాతీయ విద్యావిధానమునకెల్ల పట్టుకొమ్మ యును నిఖిల భారత వర్షమున కాదర్శప్రాయమునునగు ఆంధ్రజాతీయ కళాశాలకు జన్మదాతలు పిన్నవయస్సుననే ఆంధ్ర భాషా సముద్రము దరి నీది దేశహితమునకై తమ జీవిత సర్వస్వము నంతను ధారపోసినవారు మహా త్యాగులకెల్ల శిరోమణులు ఆంధ్రులు, ఆంధ్రదేశము ఆంధ్రభాష జీవితముతో నున్నంతకాలము వీరి కీర్తి పరువునకు రాజాలదు పంతులుగారిని బోలిన స్వార్థ త్యాగులు, దృఢవ్రతుల, నిశ్చలచిత్తులు, మేరు గంభీరులు, కార్యశూరులు కేవల మొక పదిమంది చొప్పున నున్నను ఆంధ్రదేశ మొక్కటియేగాక సమస్త భారత ఖండము గూడ జాతీయ విజ్ఞాన సంపూర్ణమై మహోత్తేజముతో నలరారగలదు హనుమంతరావుగారు భౌతిక శరీరమున నిర్యాణము చెందినను అధ్యాత్మికమగు యశశ్శరీరముతో నాంధ్రుల హృదయ సీమలయందు నిత్యశాశ్వతమూర్తియై వెలుంగుచుండుట నిక్కము ఇట్టి వీరు ఈ సంవత్సరము కీర్తిశేషులైరి





కోపల్లి హనుమంతరావుగారు

[ఈ ఛాయాచిత్రం 1922 దుందుభి సంవత్సరాది సంచికలో ప్రచురితం]

# నిమ్మరాజు వేంకటాద్రికవి

### కొణిదెన బాలకృష్ణయ్యగారు

**[1921 దుర్మతి సంవత్సరాదిసంచికనుండి]**

వేంకటాద్రికవికి గుంటూరు మండలమునందలి నర్సారావుపేట తాలూకాలోని యనమదల గ్రామము నివాస స్థలము. ఈయన వేంకట కృష్ణమంత్రికిని తిరుమలాంబకును పౌత్రుఁడు ఇతనితండ్రి వేంకట రమణప్ప తల్లి పుల్లమాంబ విద్యాగురువు ఇనగంటి వేంకటజోగి. శ్రీవత్స గోత్రము ఆఱువేలనియోగి ఈతని ఇష్టదైవము వేణుగోపాలమూర్తి ఈ గోపాలుని యనుజ్ఞ వలనఁ దాను "కైవల్య కంద రామాయణమును" రచించినట్లు లిక్కవి తన గ్రంథమునఁ జెప్పియున్నాఁడు ఈ రామాయణము భారతమంత గొప్ప గ్రంథమై యున్నది

వేంకటాద్రికవియొక్క స్వీయసంతతివారు నశించిరి కాని యాతని జ్ఞాతులు యనమదల గ్రామమునఁ బెక్కు రున్నారు వారు చెప్పుచున్న వంశక్రమము ననుసరించి చూడ నిక్కవి పదునెనిమిదవ శతాబ్ది మధ్యమున, ననఁగా క్రీ శ 1740–1760 ప్రాంతమున జీవించియుండినట్లును, కొంచె మించుమించుగ నాకాలముననే "కైవల్య కంద రామాయణము" రచింపఁబడినట్లును తోఁచుచున్నది కవి తన గ్రంథమునఁ దన సమకాలికులగు కవులనుగాని తక్కుంగల సనాతనాధునాతన కవీశ్వరులఁ గాని పేర్కొనక, గీర్వాణ రామాయణ కృతికర్తయగు వాల్మీకిని బ్రార్థించి, యవ్వల నాంధ్రమున రామాయణముల రచియించిన భాస్కరాదులను మాత్ర మీ క్రింది పద్యములలో నుదాహరించియున్నాఁడు

కం. ఘన మాదికావ్య మీవలఁ
దెనుఁగున భాస్కరుఁడు జెప్పెఁ దేటగ జగతిన్
అనువొంద రంగనాథుం
డను నాది కవీంద్రు లెల్ల నధికత రామా.

కం. పరిపరి విధముల రఘుపతి
చరితంబులు జెప్పి రట్టి చతురులలోనన్
పరమ దయాకర! యుష్మ
ద్వరకవి నే వేంకటాద్రి వనరుగ రామా

ఈతఁడు శ్రీ రామభక్తి ధురంధరుఁడై "కైవల్య కంద రామాయణ" మను నొక గ్రంథమును మాత్రమే రచించినటుల నాతని బంధుగులు చెప్పుచున్నారు వారియొద్ద నా రామాయణపు ప్రతి పుత్రిక యొక్కటి తాటియాకులపై వ్రాయఁబడియున్నది మాతృక యేమయ్యెనో ఇప్పటివారు చెప్పఁజాలకున్నారు ఈ తాళీదళ సంపుటములను నిమ్మరాజు వేంకటదాసు (పెద్ద వెంకయ్య) గారు మిగుల శ్రదగాఁ గాపాడుచుఁ బఠించుచున్నారు కొలఁదికాలము క్రిందట నీ రామాయణ పద్యములను వీధిబడులలోని విద్యార్థులకు, అచటి గ్రామములలోని యుపాధ్యాయులు బోధించుచుండినట్లు గొందరు వృద్ధు లిప్పుడును జెప్పుచున్నారు ప్రకృతము మన కలవడిన తాళీదళ సంపుటము గ్రంథకర్త మనుమఁడును కీర్తిశేషుఁడునునగు నిమ్మరాజు అప్పయ్య స్వహస్తమున లిఖించినటులు దదంతమున వ్రాయఁబడియున్నది.

ఈ రామాయణమున నాఱుకాండములును, ఎనిమిది యాశ్వాసములు గల యుత్తర కాండమును నున్నవి. అన్నియుఁ గందపద్యములు

ఉత్తరకాండములోఁ గలిసి ఇందలి పద్యసంఖ్య 11052 ప్రతిపద్యమునకును చివర "రామా" యను మకుటము జేర్పఁబడినది కవియన్నియుఁ గంద పద్యములుగ వ్రాసిన తన సామర్థ్యమును గ్రంథాంతమున నిట్లు వ్రాసికొనియున్నాఁడు

కం. కందమునకు ఘనుఁడందురు
కుందవరము చౌడకవిని, గురిగా నున్నన్
అందముగ వేంకటాద్రియు
కందములకు ఘనుఁడె యంద్రు కవు లిల రామా.

ఈ పద్యము చౌడప్ప పద్యమున కనుకరణమేగాని యన్యము గాదు. చౌడప్ప కందములకుఁ గల సరళత వేంకటాద్రికవి కందములలో నొక్కదానియందును గన్పట్టదు. గ్రంథమంతయు రంగనాథరామాయణము ననుసరించి వ్రాయఁబడినట్టు లందందుఁగల కథల పట్టులు చెప్పకయే చెప్పుచున్నవి ఇందు చ్యుత సంస్కార ఛందో వ్యాకరణాదికములగు దోషములు లెక్కలేనన్ని యున్నవి కొన్ని ప్రక్షిప్తములును లేకపోలేదు గాని యన్నియు నట్టివే యన నవకాశములేని ప్రమాదములు పెక్కులు గన్పట్టుచున్నవి

వేంకటాద్రికవికి సంస్కృత భాషా పరిచయ మంతగ లేనట్టు లాతని రామాయణమువలన మనము దెలిసికొనవచ్చును ఇప్పటి గ్రామ్య భాషా పోషకులగు నూతన సంస్కర్తల ప్రయోగములకుఁ దగు నిదర్శనము లిం దనేకములుగ నున్నవి కవిత్వ మంత సరసమైనదిగ నుండలేదు. కాని తనకుఁ గలిగిన భాషా పరిచయము నూరక వ్యర్థము చేసికొనక భాషాభిమానముననో, భక్తిపారవశ్యముననో, యింత పెద్ద గ్రంథమును రచించిన వేంకటాద్రి కవియొక్క సమర్థతయును నోపికయును దలంచినపుడుమాత్రము మనకు అమ్మహాత్ముని కవితను గౌరవింపకఁ దప్పదు మఱియు "రామకథ" గావున రంధ్రాన్వేషణమునకుఁ బనిలేదు రామభక్తుఁడగు నిక్కవి తన గ్రంథమున నీ క్రిందివిధమున గద్యమును వ్రాసియున్నాఁడు "గద్యము ఇది మఱియు వాల్మీకి మహర్షివలన సంస్కృత విరచితంబైన శ్రీ మద్రామాయణ మహాకావ్యం బాంధ్రభాషగా శ్రీ తిరుమల వేంకటాచలపతి కరుణాకటాక్ష వరలబ్ధకవి నిమ్మరాజు వంశపయ పారావార రాకాసుధాకర వేంకటరమణప్ప నందన వేంకటాద్రి నామధేయ ప్రణీతంబైన కైవల్య కంద రామాయణంబునకు కృతికర్తయైన వైకుంఠపతి శ్రీమన్నారాయణమూర్తి కర్పణంబుగా నొనర్చిన యుద్ధకాండము సంపూర్ణము"

ఇఁక నీ కంద రామాయణమునందలి పద్యముల గొన్ని శైలికై ఈ క్రిందఁ బొందుపఱచెదను.

బాలకాండము

కం. "అందము గలిగిన మేడల
చందము దినమణి శతంబు చాడ్పున వెలయన్
అందరి చిత్రం బెంచగ
కందర్పునియన్న కలవి గాదుగ రామా."

అయోధ్యకాండము.

కం. తన నగరుఁ జేరవచ్చుట
విని, సీతాదేవి తాను వెలఁదులతోడన్
వినయత నెదురుగ వచ్చియుఁ
దనపతి నటుఁ బారజూచి తలకుచు రామా

అరణ్యకాండము.

కం నిను, నా తమ్ముని, నిద్దఱ
పనివడి నే విడుతుగాని పలికిన ప్రతినన్
విను, విడువక నే జరిపెద
నను పతి పలుకులకు నులికి యవనిజ రామా.

కిష్కింధాకాండము.

కం. కన సుకృతికి నిటు దగు నా?
జనకజతోఁ గూడ బుద్ధి జనియెనా నీకున్
ఘన విరహాగ్నినిఁ గ్రాగితి
నిను వనఁగా నేమి ఫల మి కియ్యెడ రామా.

సుందరకాండము.

కం అనయముఁ గొండల దిరుగుచు
నిడుమలఁబడి యున్నయట్టి హీనుని పొందున్
విడువక గోరగ నేటికి?
పడతీ! నను గోరితేని భాగ్యము రామా.

యుద్ధకాండము

కం. ఇనకులమున నుదయించిన
ఘనుఁడే శ్రీరామమూర్తి కారణ పురుషుం
డని యెంత జెప్పినను మఱి
విననేరవు పాప మేమొ? విను మిట రామా.

ఉత్తరకాండము

కం. తన బల మెదిరి బలంబును
గననేరక నెవ్వఁడయిన గదిసినయేనిన్
విను మతఁడు జయముఁ జెందం
డని పలుకుదు రార్యు లెపుడు నతనిని రామా

# నాస్తికదర్శనములు

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

[1921 దుర్మతి సంవత్సరాదిసంచికనుండి]

నాస్తిక మతాచార్యులు తమ మతమును గుఱించి రచించిన స్వతంత్ర గ్రంథములు మనకుఁ గానవచ్చుటలేదు బౌద్ధులయు, జైనులయు మతములు కొంచెముగానైనను గానవచ్చుచున్నవి కాని, చార్వాకమత మూలగ్రంథములు స్వల్పముగనైనఁ గానవచ్చుటలేదు ఈ మతమును ఖండించువారు తమ ఖండనమునకు ఉపయోగించునంతవట్టు ప్రతిపాదించిన విషయమే తన్మత స్వరూపమున కాధారమగుచున్నది 'సర్వదర్శన సారసంగ్రహము'నందు చార్వాక మతమును మాధవాచార్యులవారు ఉపపాదించి యున్నారు ఆ విషయమును గొంత యిట నాంధ్రీకరించుచున్నాఁడను

## చార్వాక దర్శనము

"చార్వాకుని చేష్టితము దురచ్ఛేదమయినది. ప్రాణులందఱును తలఁచుగా—

గీ. బ్రదుకువట్టును సుఖముగా బ్రదకవలయు
మృత్యుముఖమునఁ బడనివాఁ డెవఁడును లేఁడు
బూదెనలుసులుగా మారిపోయినట్టి
కాయమీయది మఱల నేగతిఁ వచ్చు?

అను లోకగాథ ననుసరించుచు నీతి కామశాస్త్రానుసారముగా అర్థకామములనే పురుషార్థములనుగాఁ దలంచుచుఁ బారలౌకికమగు నర్థము నపహ్నవించుచు చార్వాక మతము ననుసరించువారుగానే కానఁబట్టుచున్నారు. కావుననే ఆ చార్వాక మతమునకు 'లోకాయతము' అను అన్వర్థమగు నామాంతరము.

నేల నీరు నిప్పు గాలి యను నాలుగు తత్త్వములనుండి పరిణమించిన దేహాకారములవలన సురాబీజములనుండి మదశక్తివలెఁ జైతన్యము పుట్టుచున్నది ఆ దేహాకారములు నశింపగాఁ, ఆ చైతన్యము కూడ నశించును

విజ్ఞాన ఘనమైన ఆ చైతన్యము భూతములనుండి పుట్టి, వానితోపాటు నశించును. దేహములఁ బాసినచో దానికి సంజ్ఞ (జ్ఞానము) ఉండదు చైతన్యముతోఁ గూడిన దేహమే ఆత్మ. వేఱుగా ఆత్మ లేదు ఉన్న దనుటకుఁ బ్రమాణము లేదు ప్రత్యక్ష ప్రమాణమే ప్రమాణము అనుమానాదులకుఁ బ్రామాణ్యము లేదు

ప్రేయసుల కౌఁగిళులవలనఁ గలుగు సుఖమే పురుషార్థము ఇందును దుఃఖముండుటఁజేసి పురుషార్థము కాదనరాదు ఏలన, అనివార్యమైన దుఃఖమును బరిహరించి సుఖము మాత్రమే అనుభవింపఁదగినది కదా! చేపలు కావలయువాఁడు ముల్లుఁజేపలను, పొలుసుల చేపలను బట్టుకొని, తనకుఁ గావలయు పదార్థమునే స్వీకరించును (1) ధాన్యము వలయువాఁడు పొట్టుతోఁ గూడిన వానిఁ గైకొని యుపయుక్తమునే గ్రహించును. దుఃఖభీతిచే ననుకూల సుఖము నెవఁడును వీడనాడఁడు జంతువులు తినిపోవునని వరిపైరు నాటకుందురా? బిచ్చగాండ్రు కలరని కుండల వండకుందురా? దుష్టమగు సుఖము భీరుఁడెవఁడేని వీడుచో వాఁడు పశువు

చ. సరసుల కెప్పుడున్ విషయ సంగమ జాత సుఖంబు దుఃఖ సం
కరమని లోన నెంచి విడఁగాఁదగు నంటు! విమూఢభావ మా
వరులను దెల్ల బియ్యము నపారముగా నిడుచుండు వానినిం
బరుసని, పెల్లు పొల్లులకుఁ బట్టుని, యెవ్వఁడు పారఁబోసెడున్.

ఓయీ! పారలౌకిక సుఖము లేనియెడలఁ జాల ధనముచేతను శరీరాయాసముచేతను సాధ్యమైన అగ్నిహోత్రము మొదలగు కర్మలయందు విద్యావృద్ధులెటుల ప్రవర్తించుచున్నారన్నచో నదియుఁ బ్రమాణము కాదు వైదికులమని తలఁచు ధూర్తబకములచే నొండొండ అనృత వ్యాఘాత పునరుక్త దోషములచే కర్మకాండ ప్రామాణ్యవాదులు జ్ఞానకాండమును, జ్ఞానకాండ ప్రామాణ్యవాదులు కర్మకాండమును, ప్రక్షిప్తమొనర్చుటచేతను త్రయి ధూర్త ప్రలాప మాత్రమగుటచేతను అగ్నిహోత్రము మొదలగునవి బ్రదుకు తెఱువునకు బరమ ప్రయోజనములు ఇందులకు కాభాణకము కలదు.

గీ. అగ్నిహోత్రంబు వేదత్రయంబు మఱియు
బూదె తాల్పుట దండంబు పుచ్చికోలు
పౌరుషము బుద్ధియును లేనివారలకును
బ్రదుకుదెఱు వని యా బృహస్పతి వచించె

కావున ముల్లు మొదలగు వానివలనఁ గలుగు బాధయే నరకము లోకసిద్ధుఁడగు రాజు పరమేశ్వరుఁడు. దేహనాశము మోక్షము

దేహమే యాత్మ యను సిద్ధాంతమునందే 'నేను కృశుఁడను నేను నల్లవాఁడను' అను నెడల సామానాధికరణ్యము కుదురుచున్నది 'నా శరీరము' అను వ్యవహారము "రాహువుయొక్క తల" లనునటులు ఔపచారికము అనఁగా, దేహమే ఆత్మ కావున (తాను) నేను కృశుఁడను అను నెడ అన్వయము సరిగా నుండును అయితే 'నా శరీ అనునది యెటులు?' లనఁగా, శరీరమే తాను తాను శరీరముకంటె వేఱుకాఁడు శరీరముకంటెఁ దాను వేఱగుచోఁగాని 'నా శరీరము' అనునది కుదుఱదన్నచో 'రాహువుయొక్క తల' అను ప్రయోగమువలె నౌపచారికము రాహునకు తల వినాగా శరీరము వేఱే లేదు. అటులు లేకున్నను తలకంటె వేఱుగాఁ గొంత యున్నటులు 'రాహువుయొక్క' అని వాడుబడుచున్నది అటులే 'నా శరీరము' అనునది ఔపచారికమని యెఱుఁగునది ఈ విషయమంతయు నీ క్రింది శ్లోకములచే సంగ్రహింపఁబడినది —

"అత్ర చత్వారి భూతాని భూమి వా ర్యనలా నిలాః
చతుర్భ్యః ఖలు భూతేభ్య శ్చైతన్య ముపజాయతే
కిణ్వాదిభ్య స్సమేతేభ్యో ద్రవ్యేభ్యో మదశక్తివత్
'అహం స్థూలః కృశోస్మీ' తి సామానాధికరణ్యతః
దేహస్స్థౌల్యాదియోగాచ్చ స ఏవాత్మా న చాపరః
'మమ దేహోయ' మిత్యుక్తి స్సంభవే దౌపచారికీ"

పృథివ్యప్తేజో వాయువులను నాలుగు భూతములనుండి, సురాబీజములనుండి మదశక్తివలెఁ జైతన్యము పొడమును 'నేను స్థూలుఁడను కృశుఁడను' అను ప్రయోగ సామానాధికరణ్యమువలనను స్థౌల్యాదియోగమువలనను దేహమే ఆత్మ మఱొండుకాదు. 'నా దేహము' అనునది ఔపచారికము

స్వభావమువలననే జగతి కలుగుచున్నది

ఆ. నిప్పు వేఁడిగాను నీరు చల్లనిదిగా
గాలి సమప్రుదాఁకు గలుగగాను
ఎవఁడు వీని నిట్లు సృష్టించియున్నాఁడు?
వాని యునికి ప్రకృతివలనఁ గలుగు

ఈ విషయము నంతయు బృహస్పతి యిటులు వక్కాణించి యున్నాఁడు —

గీ. స్వర్గములు లేవు లే నపవర్గములును
పారలౌకికమగు నాత్మ వేఱ లేదు
వర్ణములు నాశ్రమాదులౌ వాని క్రియలు
సుంత యేనియు ఫలమునుఁ జూపలేవు

గీ. అగ్నిహోత్రంబు వేదత్రయంబు మఱియు
బూదెపూఁతయు దండంబు పుచ్చికోలు,
పౌరుషము బుద్ధియును లేనివారలకును
బ్రదుకు దెఱువుగఁ జేసిరి బ్రహ్మగారు

క. క్రతువునఁ జంపంబడు పశు
తతి స్వర్గం బరుగుజాడ తప్పనిచో, నా
క్రతువుల యజమానులు తమ
పితరుల నేలా వధింప విడిచెద రౌరా!

గీ. చచ్చిపోయినవారికి శ్రాద్ధకర్మ
తృప్తికిని దాను హేతువౌనెడల, నింకఁ

---

(1) ఈ యర్థము కల వాక్యములు 'స్వరితా త్సంహితాయా మనుదాత్తానామ్' 1—2—38 ఇత్యాది సూత్రభాష్యములందుఁ గానిపించుచున్నవి వీని పౌర్వాపర్యము విచారింపవలసియున్నది.

దిరుగు జంతువులకును బాభ్ధేయకల్ప
నంబు లోకంబునందు వ్యర్థంబు కాదె!

క దానం బిచ్చినచో స్వ
ర్గానం బడియున్న వారు కడుఁ దృప్తిపడం
గా, నిట మేడలనుండెడు
మానిసిమూకలకు నేల మఱి యీ యరహో!

గీ ప్రబదుకువట్టను సుఖముగా ప్రబదుకవలయు
బదులు చేసియు నేయిఁ ద్రావంగవలయు
బూదెనలుసులుగా మారిపోయినట్టి
కాయ మీయది మఱల నేగతిని వచ్చు?

క ఈకాయ మీఁగి పర మగు
లోకము వేంచేయుచో 'నలోపాలా' యని శో
కాకులులగు సఖిబంధుల
యాకలనము మఱలఁ జేయనయ్యు దా డేలా?

ఉ కావునఁ బ్రేతకార్యములు కావు ఫలప్రదముల్ ద్విజాధముల్
జీవనమార్గముం గడవఁజేసి రుపాయము వేదకర్తలున్
మూవురు, భండధూర్తులును మొండినిశాచరుఁ డన్నవాఁడు వా
చావిధి వాగుచుండుదురు 'జర్ఫరి తుర్ఫరి' యంచుఁ బండితుల్

## సా రాం శ ము

ఈ మతమున నీతియుక్తమగు సుఖోపభోగమే పరమపురుషార్థము ప్రత్యక్ష ప్రమాణమే ప్రమాణము తదితరములు అప్రమాణములు వీరు అనుమానానుమితి శబ్ద ప్రమాణములను ప్రౌఢముగా ఖండించియున్నారు ఆ ఖండనమును బౌద్ధులు ఖండించిరి వారిని ఖండించి యొకరీతిగా ఆర్హతులు తా మొక మతమును సిద్ధాంతముచేసికొన్నారు

## నా స్తి క శ బ్ద వి చా ర ము

పాణిని 'నాస్తిక' అను శబ్దము నిటులు నిర్వహించినాఁడు—"అస్తి నాస్తి దిష్టమ్మతి" (4—4—60) కాశికాకారుఁడు ఈ సూత్రమునకు ఇటులు అర్థమును వ్రాసెను—

ప్రథమా సమర్థములయిన అస్తి—నాస్తి—దిష్ట అను వానికి షష్ఠ్యర్థమున ఠక్ ప్రత్యయము 'ఇతనికి మతి కలదు గాన ఆస్తికుఁడు ఇతనికి మతిలేదు కాన నాస్తికుఁడు మతియున్నమాత్ర ప్రత్యయము రాదు ఇఁక నేమి? పరలోకము కలదను మతి యితనికిఁ గలదు కాన ఆస్తికుఁడు తద్విపరీతుఁడు నాస్తికుఁడు ఈ యర్థము అభిధానశక్తిస్వభావమువలన (లోకమునందలి వాడుకవలన) లభించును, అని

కైయటుఁడు—

పరలోక కర్తృకా చ సత్తా విజ్ఞేయా— అని వ్యాఖ్యానము వ్రాయుటచే పరలోకము కలదను మతి కలవాఁడు ఆస్తికుఁడని తేలుచున్నది అయితే మనువు—వేదము ప్రమాణము కాదని వాదించువాఁడు నాస్తికుఁడు అను నభిప్రాయమును (2—11 లో) ఇచ్చియున్నాఁడు మరికొందఱు 'ఈశ్వరుఁడు లేఁడనువాఁడు నాస్తికుఁడు' అని యభిప్రేతులగుచున్నారు వారి మతమున సాంఖ్య మీమాంసాదర్శనములను నాస్తికము లని చెప్పవలసి వచ్చును గాని, నాస్తికుఁడు కూడ ఆ మతములు నాస్తిక మతములని చెప్పనొల్లఁడు

కొందఱు వెనుకఁ జెప్పినదంతయు సంగ్రహించి మఱికొంత చేర్చి ఇటుల చెప్పుచున్నారు "పరలోకము లేదు తత్సాధనమగు అదృష్టము—తత్సాక్షియగు ఈశ్వరుఁడును—లేరను బుద్ధి యెవనికిఁ గలదో, వాఁడు నాస్తికుఁడు"

ఈ మతమునందలి ఏకదేశి మతస్థులు కొందఱిటులు చెప్పుచున్నారు—పరలోకము ఈశ్వరుఁడు లేరు అనువాఁడు నాస్తికుఁడు. ఈ యుదాహరించిన మతముల నాలోచింపఁగా ఇటులు తేలుచున్నది—

వేదకాలమునుండి సూత్రకాలముదాఁక కర్మవిధులు మిగుల ప్రచారమునందుండుట వలన ఆకర్మవిధులు చాలవట్టు ముఖ్యముగా పరలోకమునందుపొందఁదగు ఫలములు కలవగుటఁ జేసి, యపుడు పరలోకమునందు విశ్వాస మత్యావశ్యకమాయెను కానినాఁడు కర్మానుష్ఠానమే సంభవింపకపోయియుండును అనేకములగు నీ కర్మముల ననుష్ఠించియు, ప్రత్యక్షముగ ఫల మిసుమంతయుఁ బొందమిచే గాని, కొండొక కారణముచేఁగాని, యెవరికిఁ గర్మవిధియందు శ్రద్ధ నశించెనో, వారికి క్రమముగా పరలోకమునందు విశ్వాసము హ్రస్వమైపోయియుండును బహుకాయాససాధ్యము అయిన కర్మఫలము ఈ లోకమునందే చవి చూడ నెంచిన వీరికి, ఆస లడుగంటుటవలనను, వీరి ప్రతిపక్షులు కర్మలు ఫలమిచ్చి తీరునని సమర్థించుకొనుటకు మిక్కుటముగా పరలోకము గూర్చి వ్రాయుటవలనను, వారు పరలోకమే లేదను వాదముఁ గొనియుందురు. దానఁజేసి కాశికాకారుని వ్యాఖ్యానము సమంజసముగా నన్వితమగును మఱియు వేదాప్రామాణ్యవాదియు నాస్తికుఁడను నిర్వచనము కూడ సరియయినదియే. ఎట్లను బరమును దిరస్కరించువారు తత్ప్రతిపాదకములగు వేదములను దిరస్కరింప వెనుదీయరు తల్లి చెవులు ద్రెంపు వారికి బినతల్లి చెవులు బీరపువ్వులును కావు కదా!

"ఈశ్వరుఁడు లేఁ డనువాఁడు నాస్తికుఁ" డను వాద మర్వాచీనము లద్ధ్వర మీమాంసకానుష్ఠితములగు కర్మలలో నీశ్వరునిఁ బ్రవేశ పెట్టుట కవకాశము లేదు కావున అచట నచట యాగములలో ఈశ్వరార్పణము కూడ నర్వాచీనులచేఁ బ్రవేశ పెట్టఁబడియుండును.

కాల విపరిణామమువలన ఏకైక ధర్మానుయాయులు స్వప్రతిపక్షులకు నాస్తిక పదమును ప్రయోగించుచు వచ్చిరి

'లింగార్చన పరా శ్శైవా నాస్తికా స్సంప్రకీర్తితా' అని మాధ్వులును—
'తప్తముద్రాంకితతను ర్నాస్తికం ధర్మ మాస్థితః
పశుతుల్య స్స విజ్ఞేయ స్సర్వకర్మసు గర్హితః'

అని శైవాదులును—ఇటులు తదితరులును—ఒకరి నొకరు నాస్తికులని దూషించికొనుట సాజమయినది ఇది యంతయు విద్వేష ప్రసూతమని విశేషించి చెప్పనక్కఱలేదు

## 2. లౌ కా య తి కు లు

లౌకాయితిక మను నామము నాస్తికాపర నామధేయమే 'లోకాయతమ్ అధీతే వేద వా' అను నర్థమున ఠక్ ప్రత్యయము చేయఁగా లౌకాయతిక శబ్దము నిష్పన్నమగును పాణిని సూత్ర పూర్వకముగా ఈ శబ్దమును బట్టించియుండుటఁజేసి ఈ వ్యుత్పత్తి యాయన కభిప్రేతము

## 3. లో కా య తి కుఁ డు

ఒకానొకట లౌకాయతిక శబ్దస్థానమున లోకాయతికశబ్దము కూడఁ గలదు శారీరక భాష్యమున—లోకాయతికానా మపి చేతన ఏవ దేహ, (2—2—2) ఇటులె 3—3—53 సూత్ర భాష్యమునఁ గూడఁ గలదు ప్రతాపరాయ సంస్కృతమగు మహాభారతము (1—70—49) నందును గలదు

## 4. లో కా య తుఁ డు

కొండొకట నాస్తిక పదమునకుఁ బర్యాయముగా లోకాయత పదము వాడఁబడుచున్నది రామతీర్థకృతమగు వేదాంత సార టీకలో (జాకోబ్ పరిష్కృతము) 'లోకాయతానాం=చార్వాకవిశేషాణామ్' అని 141 వ పుటలోఁ గలదు హరిభద్రసూరి షడ్దర్శన సముచ్చయమున—

లోకాయతా వదం త్యేవం నాస్తి దేవో న నిర్వృతిః
ధర్మా ధర్మౌ న విద్యేతే న ఫలం పుణ్యపాపయోః

అని కలదు తట్టీకాకారుఁడు మణిభద్రుడు లోకాయత పదమునకు నాస్తికులని యర్థము వ్రాసెను శ్రీహర్షుఁడు నైషధీయమున 17 వ సర్గ—94 వ శ్లోకమున లోకాయత పదమును నాస్తికార్థమునఁ బ్రయోగించెను ఈ యర్థమునఁ గ్రమముగా లౌకాయతికులు, లోకాయతికులు, లోకాయతులు అను పదములు ప్రచారములోనికిఁ దేఁబడినవి లోకాయత మనఁగా చార్వాకశాస్త్రమని యమర టీకాకారుఁడు వ్రాసెను అయినను ఈ పద మీ యర్థమునందే శక్తము కాదు సామాన్యముగా దర్కశాస్త్రము గూడ దీని కర్థము ఈ పదము తార్కిక పర్యాయమని వ్రాయుచుఁ శబ్దకల్పద్రుమకారుఁడు దానికిఁ బ్రమాణముగా—

ఐక్యనానాత్మ సంయోగ సమవాయ విశారదైః
లోకాయతికముఖ్యైశ్చ శుశ్రువు స్స్వనమీరితమ్
(248—30—హరివంశె)

ఈ శ్లోకము నుదాహరించినాఁడు (ముద్రిత పుస్తకములలో నీ శ్లోకము కానరాలేదు)

రామాయణమునకుఁ డీక వ్రాసిన తిలకుఁడు

కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాన్ తాత సేవసే
అనర్థ కుశలా హ్యేతే బాలాః పండితమానినః (2—38)

అను శ్లోకమునందలి లౌకాయతిక శబ్దమునకు శుష్కతర్కవాదదూకులని యర్థము చెప్పి, దీని ముందును

ధర్మ శాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్యం నిరర్థం ప్రవదంతి తే (2—39)

ఈ శ్లోకమునందులకుఁ బ్రమాణముగా నుద్ధరించినాఁడు ఇది బౌద్ధులఁ గూడ సంగ్రహించుచున్నది అచట లోకాయత పదముచే వితండా శాస్త్రము బోధింపఁబడుచున్నది అభిధాన ప్రదీపికలో 'వితండసత్థం విఞ్ఞేయం యంతం లోకాయతం' అని కలదు ఈ విచారణవలన లౌకాయతిక శబ్దము తొలుత శుష్క తర్క వాదదూకులు జెప్పునదిగానుండి పిదపఁ దత్సావ్యవసఁ జేసి నాస్తికులఁ గూడఁ జెప్పునదాయెను లోకాయతా పరనామము కల ఈ వితండా శాస్త్రమే హేతు శాస్త్రమని చెప్పఁబడుచు, నచట నచట, నిందింపఁబడుచున్నది

2కేవల హేతువాదుల గర్వించుట ప్రసిద్ధమే కదా!
హైతుకాన్ బక వృత్తీంశ్చ వాఙ్మాత్రేణా పి నార్చయేత్
(విష్ణుపు—3—18—99)

---

2 చూ మను 2—11 చూ మహాభారతము

# నేడే చూడండి!

రాజశ్రీ పిక్చర్సు
సమర్పించు

RAJALAKSHMI

రాజలక్ష్మి ప్రొడక్షన్సు

# వీరాభిమన్యు

నిర్మాతలు: సుందర్‌లాల్‌నహతా, డూండి

దర్శకత్వం: వి. మధుసూదనరావు * సంగీతం: కె. వి. మహాదేవన్

రాజశ్రీ రిలీజ్

MOULIS.

స్వతంత్ర ఎంటర్ ప్రైజెస్

స్వతంత్ర ఎంటర్ ప్రైజెస్

ప్రింటింగ్ పరిశ్రమకు అవసరమైన
అందమైన బ్లాకులు, టైపులు
మొదలగు పరికరములకు

## స్వతంత్ర ఎంటర్ ప్రైజెస్

విజయవాడ-2.
P. B No. 342
Phone No. 334

స్వతంత్ర ఎంటర్ ప్రైజెస్

స్వతంత్ర ఎంటర్ ప్రైజెస్

చార్వాకుఁడు కాన వేఱుగాఁ గానఁబట్టును న్యాయకుసుమాంజలి యను గ్రంధము క్షణ భంగవాది యగు బౌద్ధుని చార్వాకుఁ డని వాడినది ప్రకాశకారుఁడు నటులే చెప్పెను —

స్యాదే తత్ మా భూ దధ్యక్ష మనుమానం వా క్షణికత్వే, తధాహి, సందేహాస్తు ఏతావతా పి సిద్ధం సమీహితం చార్వాకస్యేతి (1 స్తబక—192 సో—సా)

విచారింపగాఁ చార్వాకుఁడువేఱు బౌద్ధుఁడు వేఱు చార్వాకుఁడు నాస్తిక శిరోమణి కాని స్వయముగా నాస్తిక వాద రచయితకాఁడు ఈతఁడు బృహస్పత్యమయాఁయి యని కానిపించెడివి.

## 7 పాషండుడు, పాషండి, పాషండకుఁడు, పాషండికుఁడు

పాషండశబ్దము కూడ వాస్తిక పరముగాఁ గవుంచే వాడఁబడినది శ్రీ హర్షుఁడు నైషధీయమున (17—102)

బభాణ వరుణః క్రోధా దరుణః కరుణోజ్ఝితమ్
కిం వ ప్రచండాత్ పాషండపాశ! పాశా ద్విభేషి నః

అని ప్రయోగించినాఁడు సాంప్రదాయకులు దినికిఁ గ్లిష్టముగా వ్యుత్పత్తి నిచ్చి యున్నారు పాపం + సనోతి—చూపువేతను గలియికచేతను పాపము కలిగించువాఁడు 8 వృపెహాదరాదులలోఁ బెట్టి సాధింపవలయును లేక, పాతీతి—పా (క్విప్) = వేద ధర్మము షండయతి=పాడొవర్చువాఁడు కాఁగా పాషండుడు 9 కొందఱు పాషండ శబ్దము సంస్కృతము కాదనియు, వైదేశికముగాని ప్రాదేశికము కాని యగువనియు వభిప్రేతు లగుచున్నారు 10 ఈ శబ్దము న్యాయ కుసువాఞ్జలి మొ గ్రంధముల యందుఁ గూడఁ బ్రయుక్తమై యున్నది బౌద్ధుల యెడ నీ శబ్దము అసకృదావృత్తమై యున్నది అర్హతులుగూడ నీ శబ్దముచేఁ దిరస్కృతులు కాకపోవుటలేదు ఇంతియకాదు విరుద్ధాచారముకల ప్రతివాఁడును ఈ శబ్దముచే వ్యపదేశింప బడుచున్నాడు 11 అటనట 12 పాషండి 13 పాషండక 14 పాషండికపదము లీ స్థానమును బ్రయోగింపఁబడినవి

## 8, పాషండుఁడు బౌద్ధజైనుల యుద్దేశము

బౌద్ధ గ్రంధములలోఁ బాషండ పదమున కెక్కుఁడు ప్రచారమున్నది ఆ పదముచే బౌద్ధులు తమ్ము సంబోధించుకొనక తమకు విరుద్ధములగు నన్నిటియెడఁ బ్రయోగింతురు వారు తొంబదియాఱు తెఱఁగులగు పాషండులు కలరని వ్రాసినారు

కుటీసకాది చతు త్త్రింసత్ ద్వాసట్టి దిట్టియో
ఇతి చ్ఛన్నవతి ఏతే పాషండా సంపకాసితా
(అభిధావ ప్పదీపికా—440)

కుటీచనాదినామములు 34 మిగిలినవి 62 ఈ మతములు బ్రహ్మజాల సూత్రమున వర్ణింపఁబడ్డవి అర్హతులు 36, పాషండులను జెప్పిరి

అసియసయం (18—వం) కిరియాణం అకిరియవా ఈణహూతి
చులసీ ఈ (84) అన్నణియ సత్తట్టీ వేణఇయాణంచ బత్తిసం (32)—
(మణిభద్రః),

పాణిని 'నాస్తికి' శబ్దమును సాధించుటఁజేసి యాతనికంటె నీ వాదము ప్రాచీనతరము మహాభారతము రామాయణము మైత్ర్యుపనిషత్తు ఛాందోగ్యము బృహదారణ్యకము కఠములందును నీ వాదము కలదు బ్రాహ్మణములందును నీ వాదము కలదు మంత్రభాగములందును నీ వాదము కలదు దేవతలఁ గూర్చి ఋషులు ఆయాయి వస్తువులు ప్రార్థించునట్లు జెప్పిన కొన్ని ఋక్కులలో—నీ విషయము కానిపించెడివి ఏవిధముగా నైనను వారి కోర్కి ఫలించునెడ వా మంత్రము మహిమ కలదని వారికి దానియెడఁ బ్రమాణబుద్ధి పొడమియుండును ఇటులు అప్రామాణ్యముఁ గూడఁ గల్పింపక పోలేదు అట హేతువు వారి స్తుతులు ఫలింపకుండుటయే వ్యర్థమనోరథులకు దావఁ బ్రామాణ్య మెటులు? ఏ దేవునందు విశ్వాసము మితిమీఱియుండెనో ఆ దేవునందే అవిశ్వాసము కూడ నొక పెడఁ బెఱుఁగుచునే యుండెనని కానఁబడుచున్నది ఈ క్రింది విషయములు పై విషయమును స్థిరీకరించును

15 యుద్ధమును గోరు నోజనులారా! ఇంద్రుఁడుండు నెడల వీా రింద్రుని కొఱకు నిజమగు స్తోత్రమును భరింపుఁడు నేమర్షియగు భార్గవుఁడు ఇంద్రుఁడని యొకఁడు లేఁడనుచున్నాఁడు ఆ ఇంద్రు నెవరు చూచిరి? మే మెవరిఁ గొండాడుదుము?

ఇట్లనుటఁజేసి ఇంద్రుఁడు వాదమాత్రమని తేలుచున్నది

16 ఓస్తోతా! నేనుగో! నీ ప్రక్కనున్న నన్నుఁ గనుము సర్వ భువనములను మహత్త్వముచేఁ దిరస్కరించుచున్నాను సత్యోపదేష్టలగు విద్వాంసులు నన్ను స్తోత్రముచే సంతస పెట్టుచున్నారు మఱియు దారణశీలుఁడనగు నేను భువనముల దద్దరిల్ల జేయుచున్నాను

కొండొకట నిటులు చూపబడెడిని

17 జను లెవనిని ఘోరుఁ డందురో ఆ ఇంద్రుఁ డెట నున్నాఁడు? జనులు ఇంద్రుఁడని యొకఁడు లేఁడందురు ఆ ఇంద్రుఁడు భయపెట్టి శత్రువుల డబ్బు హరించును కాన నింద్రుని విశ్వసింపుఁడు ఇంద్రుఁడు కలఁడని విశ్వసింపుఁడు

ఈ సూక్తమువలన నాకాలమున నింద్రునియెడ విశయము కలదనితే లును వైదిక దైవములలో నింద్రున కత్యున్నత పదవి కలదు అటులు విచికిత్సయుఁ గలదు మఱికొన్ని చోటుల నాతనియెడఁ బరమ విశ్వాసము కలదు —

18 యోధుఁడగు నా ఇంద్రుఁడు గొప్ప బలముచే జనుల సౌఖ్యము కొఱకు యుద్ధము లొనర్చును ఎవు డింద్రుఁడు చంప సాధనమగు వజ్రముచే మేఘములఁ గొట్టునో అప్పుడే ప్రకాశవంతుఁడగు నాతనియెడ విశ్వాసము కలుగును

19 మిత్రుల గొప్పయగు నింద్రుని బలముఁ జూడుఁడు ఏలన నీటిఁ డావులను గుఱ్ఱములను నోషధులను నీరిని వనములను సంపాదించెను ఆతని బలమునెడ విశ్వాసము చెందుఁడు

20 ఇటులు పెక్కు లుదాహరింపనగును ఈ పర్యాలోచనముచే మంత్రకాలము నాఁటికే దేవతలయెడ సంశయబుద్ధి కలిగెనచవచ్చును బ్రాహ్మణ సమయముననుఁ, సూత్రకాలమునను, ఇట్టి విచికిత్స కలదని సువిస్పష్టము వేయేల? జ్ఞాన మెప్పుడారంభమాయెనో అప్పుడే ఈ విచికిత్స కారంభము మంత్రములు కొన్ని యనర్థకములని పెలువు రుద్ఘోషించినారు వారి వాదము ఖండింప మహా సంరంభములోఁ గొందఱు గ్రంధములు రచించినారు అంతియకాక వారు స్వమతము నుపపాదింపను గూడఁ బలు గ్రంధముల వ్రాసియున్నారు మంత్రము లనర్థకములని ప్రతిపాదించు కౌత్సుని స్వనిరుక్తమునందు యాస్కుఁడు ఖండించినాఁడు 21

## 9 సం ఘ ర్ష ణ ము

నాస్తిక శబ్ద పరిణామమును రెండవ ప్రకరణమువలన నెఱిఁగియున్నారము కాలము గతించిన కొలఁది చార్వాకులును బౌద్ధులును అర్హతులును నాస్తిక మతము క్రిందఁ బ్రత్యేకముగా విభక్తులయిరి ఆ మూఁడును ఒండొం డభిన్నములయినను ఆ మూఁడు కలిసి నాస్తిక మతము అను శీర్షిక క్రిందికి రా నవకాశము కలిగియున్నది. బ్రాహ్మణ, మంత్ర, ఉపనిషత్, సూత్ర కాలములందు నాస్తిక మతము నుపపాదించు గ్రంధములు కానరావు పురాణకాలమునందు అట్టి మతము అందలి కథలయం దుపపాదింపఁబడియున్నది పదఁపడి మాధవాదులు ఖండనమున కుపయుక్తములగు నంశముల నటనటనుండి యుద్ధరించుకొనినారు పురాణకాలమునందలి నాస్తిక మత కథ నొండు ఉద్ధరించుచున్నాను

22 ధర్మజ్ఞుఁడును మహారాజునగు వేన మహారాజసభలో బ్రహ్మ చిహ్నధారియు నగ్నుఁడును మహాకాయుఁడును నరసిన వెంట్రుకలు కలవాఁడును చంకయందు నెమలియీఁకలతోఁ గట్టిన చీపురుకట్టఁ దాల్చువాఁడును డెంకాయ కమండలువు చేఁబట్టినవాఁడును వేద శాస్త్రముల దూషించు మరుచ్ఛాస్త్రమును బఠించువాఁడును అగు నొక పురుషుఁడు ప్రవేశించెను వేనుఁ డా పాపినిఁ జూచి— ఇట్టి చిత్ర రూపమును దాల్చు నీ వెవఁడవు? ఏల వచ్చితివి? ఈ వేసమేమి? నీ పేరేమి? నీ ధర్మమేమి? నీ పని యేమి? నీ వేదమేమి? ఆచారవేమి? నీతి యేమి? భావనయేమి? జ్ఞానమేమి? ప్రభావ మేమి? ధర్మ లక్షణమగు సత్యమేమి? అని ప్రశ్నలు వైవఁగా, వ్వాపుఁడిటుల్లనుడివెను ఇట్టి శంకలు వైచుచున్నావు నీవు మహా మూఢుఁడవు నేను ధర్మమునకు గుండెకాయను నేనే జ్ఞానమను నేను సత్యమను బ్రహ్మమను పెక్కేల? జీవరూపము ధరించిన నేను సర్వమును

వేనుఁడు—నీ ధర్మమేమి? దర్శనమేమి? ఆచారమేమి?

---

(8) 3—18 వ—విష్ణు—పు—చూ (9) పాలనాచ్చ త్రయీ ధర్మః పాశబ్దేన, నిగద్యతే తం షండయంతి తే యస్మా త్పాషండా స్తేనహేతునా (10) The great epic of India (Hopkins) P-49 Foot note చూ

(11) పద్మపురాణము ఉ ఖ 42 అ (12) చూ విష్ణుపురాణమ్ (13) చూ శబ్దరత్నావళి (14) చూ మణిభద్రకృత షడ్దర్శనసముచ్చయ టీక

(15) ప్రసుస్తోమం భరత వాజయన్త ఇన్ద్రాయ సత్యం యదిసత్య మస్తి, నేన్ద్రో స్తీతి నేమతిత్వ ఆహ కఈం దదర్శ క మభిష్టవాయ (8—100) (16) అయ మస్మి జరితః ఎశ్య మేహ విశ్వా జాతా న్యభ్యస్మి మహ్నా, ఋతస్య మా ప్రదిశో వర్ధయన్త్యా దర్గిరా భువనా దర్దరీమి

(17) యం స్మ పృచ్ఛన్తి కుహసేతిఘోరే ముతే మాహుర్నైషో అస్తీ త్యేవం సో ఆర్య పుష్టీర్విజ ఇవా మినాతి శ్రద్ధస్మై ధత్త సజనాస ఇంద్రః (2—12—5 (18) స ఇ స్మహాని సమిధాని మజ్మనా కృణోతియుధ్మఓజసా జనేభ్యః, అధాచన శ్రద్ధధతి ఇంద్రాయ వజ్రం నిధ నిఘ్నతే వధం (1—55—5) (19) తదస్యేదం పశ్యతా భూరి పుష్టం శ్ర దింద్రస్య ధత్త నవీర్యాయ, సగా అవిందత్ సో విందదశ్వాన్ స ఓషధీః సో అప సవనాని (1—103—5)

(20) చూ—ఋక్ 1—104, 6—6, 6—101, 10—2—2 Max Muller's Lectures on the Religion PP 140, 147-307-10.
(21) అథా పీద మంతరేణ మంత్రే ష్వర్థ ప్రత్యయో న విద్యతే యది మంత్రార్థ ప్రత్యయాయ అవర్థకం భవతీతి కౌత్సః అనర్థకా హి మంత్రాః (నిరుక్తమ్—పూ—ష—1—5—1) (22) భూమి ఖండము—36 అధ్యా—పద్మ పురాణము—చూ

పురుషుడు—జైనులు దేవతలు గ్రంధాభావము గురువు దయ పరమ ధర్మము అదియే మోక్షము ఆచార మేమనగా, యజనము యాజనము వేదాధ్యయనము సంధ్య తపస్సు, దానము హవ్యము, కవ్యము పితృతర్పణము అ తిథిపూజ, వైశ్వదేవము, కృష్ణ పూజ ఈ వెం ఏవియు లేవు జిన ధ్యాన ముత్తమము ఇది జైన ధర్మము

వేనుడు—ఇది యెల్ల వేద విరుద్ధము నిక్కము చెప్పుము

పురుషుడు—పంచతత్త్వములచే వృద్ధి నొందిన శరీరమే ఆత్మ ఇది వాయు స్వరూపము వేద ప్రోక్తములగు కర్మలకు దీనితో నేమి సంబంధము ? నీరిలో బుడగ లెటుల పుట్టునో అటులే భూతముల వ్పుట్టును భ మి రజః ణముల నము దా య ము . శిభూవి య ం ద దకవ ఉ పుట్టును వెలుగుకూడ నటనే కలద . ఈ వ నాడి ఎవి వాయువు కదలించును పిదప నాకాశ మావరించెను పిదపడి బుడగలు పొటమరించ చున్నవి అనగా జీవులు ఉదక మధ్యమున ఒకానొక గుండ్రని తేజస్సు రెప్పపాటు కాలము కనుపట్టి వెంటనే యెట్లు నశించునో, అటులు భూతసమాయోగమయి వశించు చుండును అంత్యకాలమున నాత్మ యెద్దింటిలోఁ గలిసిపోవుచుండును మానవులు మోహ యుక్తులై తిరుగుదురు అజ్ఞానముచే శ్రాద్ధమును పితతర్పణమును జేయుచున్నారు వచ్చినవాఁ డెచట నున్నాఁడు? ఎటులు తినును? శ్రాద్ధము పెట్టు టెవనికి? ఇది నిక్క మనుటకు ఎవఁడు చూచెను? అతిథి ఇంటికి వచ్చుచో విందు చేయవలసినదియే వేద ములఁ బ్రతిపాదితమగు కర్మ దారుణ మయినది అశ్వమేధమున గుఱ్ఱమును, వాజ పేయమున మేకను, రాజసూయమున ననేక ప్రాణులను, పుండరీకమున నేనుఁగును జంపవలసినదని వేదము చెప్పెడివి ఇది యేమి కర్మము ఆట నేమి ధర్మము? ఏమి ఫలము? వేదపండితులకుఁ బశుమారణము ధర్మమా? ధర్మము నశించినది దయలేని ధర్మ మేమి ధర్మము? జీవపాలనము ధర్మముకాని మారణము ధర్మమా? స్వాహాకారము స్వధాకారము తపస్సు, వీనికేమి? వీని నన్నింటి నెపుడు బట్టిన నపుడు చేయనగును. దయాహీనమగు కర్మ నిష్ఫలము దయ వీడుచో వేదము లవేదములు దయాదాన పరుఁడై జీవుల రక్షింపవలయును అటులు రక్షించు వండాలుఁడైనను, శూద్రు డైనను, వాఁడే బ్రాహ్మణుఁడు నిర్దయుఁడేని బ్రాహ్మణుఁడు చండాలుఁడు పొల్లు మాటలను జెప్పునది వేదము కాదు జ్ఞానము నేది నిర్వచించునో యవియే వేదములు. దయాహీనులగు విప్రులయందును అట్టి వేదములందును సత్యము లేదు జినధర్మము భుక్తిముక్తి ప్రదాయకము బహు పుణ్య దాయకమగు విషయమును నీకుఁ జెప్పుచున్నాను తొలుత శాంతచిత్తముతో దయ నేర్చికోవలయును చరాచరాత్మకుఁడగు జినుని ధ్యానింప వలయును అతనికి నమస్కారాదికము చేయవలయును తలి దండ్రుల పాదముల కెపుడు నెఱగరాదు ఇక నితరులకు మ్రొక్కఁగూడదని వేరే చెప్పనేల ?

వేనుఁడు—ఈ విప్రులు గంగాదినదులను బుణ్యతీర్థము లనుచున్నారు నిక్క మము నా కెఱింగింపుము

పురు—ఓ మహారాజా! మిన్నులనుండి మబ్బులు వర్షించుచున్నవి గుట్టల మీఁదను నేలమీఁదను నీరుపడును అది యంతయు నదులగుఁ గదా! నదులు జల ప్రవా హములు చెరువులు సముద్రములు నంతియ కదా! పర్వతములు రాతి గుంపులు కావా? ఇవి పుణ్యతీర్థములనియు పుణ్యక్షేత్రము లనియు నెటులు ఒప్పుదల? ఆ పుణ్య తీర్థ ములలో స్నానము చేయుచో సిద్ధి కలుగు నేడల వానియం దెల్లపుడుండు చేపలేల సిద్ధిఁ జెందవు? కావ నిది యంతయు ననత్యము జీవుఁడే తీర్థము జీవునియందే ధర్మము కలదు తపోదానాదికమగు సమస్త పుణ్యము జీవునియందే కలదు జినుఁడొకఁడే సర్వమయుఁడు తీర్థాదులన్నియుఁ గల్పితములు జినుఁడే ధ్యేయుఁడు—ఇటులు బోధింపఁ బడి వేనుఁడు పాపి యాయెను "

ఈ కథవలన నాస్తిక మతమున దయ ముఖ్యమని తేలుచున్నది ఈ యహింసనే మూల సూత్రముగాఁ జేకొనిన నాస్తికమతమును ఒక మతముక్రింద నిలువఁబెట్టి యద్వైతులు ఖండించుచున్నారు.

ఏ భూతమును జంపరాదు జన్నమునఁ బశువును జంపవలయును **24** అని వేదము లిఖింతముతో శాసించుచున్నది అయినను వేదమతమునకు అహింసయే మూలము కాదు అదియే మూలమగుచో **25** గీతాదికము విరోధించును అట్లని హింస చేయుమని గీతాభిప్రాయము కాదు తన్మతమున **26** దయకూడ నంతఃపాతియై యున్నది బౌద్ధమతమున అహింసయే పరమధర్మమని మూలసూత్రము బుద్ధునకు జన్మమునం దేని పశుహింస యెడ నంగీకారములేదు రామానుజులు కూడ నీయెడ బుద్ధుని హృద యమును సమీపించెను ఆస్తికు లంఱు బుద్ధుని నందువలననే బహిష్కరించియుం దురు ఆ మతమున గానఁబడు విశ్లథత్వము కూడ బహిష్కార హేతువై యుండెను.

## 10. నాస్తికులవలన లాభములు

పరిశీలించి చూచుచో—వేదములు స్మృతులు (పురాతనములు) నేఁటి సంఘ సంస్కార పరాయణు లెంత సంస్కారములు కావలయునని తలఁచుచున్నారో, యంతకు మిక్కుటముగాఁ గూడ ననుజ్ఞ యిచ్చుచున్నవి కలియుగమునందు నిషేధించిన ధర్మముల నన్నింటి బరిశీలించుచో నీ విషయము తేట తెల్లము కాఁగలదు ఈ విషయముల కడ్డు దవిలినవారు బౌద్ధులు వారి ప్రచార వెక్కుడైన కొలఁదిఁ బురాతనాచారముల మార్పు నలపి వచ్చెను బౌద్ధులకును బురాతనాచార పరాయణులకు మితిలేని వైరము పొసఁగెను బౌద్ధు లహింసా ధర్మ నిబద్ధులు పురాతనులో అంతగా గారు అనఁగా 'ఒక దవడమీఁద గొట్టుచో రెండవ దవడను జూపించువారు' కారు 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయువారు' కూడ నగుదురు కాని క్రోధమును దీర్చికొనక మానువారు కూడఁ గారు వారికిని వీరికిని ప్రబల వైరమున్నటులు 'హస్తినా తాడ్యమానోపి న గచ్ఛే జ్జిన మంది రమ్' (ఏనుగుచేఁ ద్రొక్కింపఁబడినను జినాలయమునకుఁ జనుదగదు) లోనగు వాక్య ములు నేఁటికిని విద్వాంసుల నాలుకలపైఁ దాండవించుచున్నవి

యాజ్ఞవల్క్యస్మృతి, అర్థశాస్త్రము, గౌతమస్మృతి మనుస్మృతి మొ వానియందు వర్ణాంతర కన్యా వివాహము విహిత మయినది ఆదిత్య పురాణము బృహన్నార దీయము మొ ఆ ధర్మమును కలివర్జ్యము లని ప్రతిపాదించెడివి కావున నీ స్మృతులు ఆ స్మృతులకంటె నిటీవలి వనుట నిశ్చ్రయము క్రీ శ 8—వ శతాబ్ది దాఁక బ్రాహ్మ ణులు వర్ణేతరకన్యా వివాహము మద్యపానము మాంసాహారము విధవా వివాహము ప్రౌఢా వివాహము మొదలగు నాచారములు బాటించువా రని నిశ్చయింపఁ గొన్ని యుద్గ్రంథ ములు సాక్ష్యమిచ్చుచున్నవి ఆ కాలమున వర్ణేతర స్త్రీలయందు గలిగిన సంతానము నకు వారు బ్రాహ్మణ్యమును **27** బ్రసాదించుచుండిరి ఇంతియకాక బ్రాహ్మణుల కా య బ్రాహ్మణపుత్రులు దశ పేయాది యజ్ఞ కర్మములందు ఆర్త్విజ్యమును గూడఁ జేయువారు ఈ విషయమును బౌధాయనుఁడును **28** ఆపస్తంబుఁడును **29** గూడ వక్కాణించియున్నారు అది యటుండె ఇఁకఁ గలివర్జ్యముల విచారింతము

### బృ హ న్నా ర దీ య ము న

సముద్రయాన మొనర్చినవానిఁ జేర్చికొనుట కమండలుధారణము వర్ణేతర స్త్రీ వివాహము మఱఁదివలన బుత్రోత్పత్తి, మధుపర్కము నెడఁ బశువధ, శ్రాద్ధమున మాంసభోజనము, వానప్రస్థము, దత్తాక్షత కన్యను గొండొకని కిచ్చుట, దీర్ఘబ్రహ్మ చర్యము, నరమేధాశ్వమేధములు, మహా ప్రస్థానగమనము, గోమేధము, మఖము బ్రాహ్మ

(23) చార్వాకదర్శనమున శరీరమునకు భూత చతుష్టయమే కారణమని కలదు (24)మా హింస్యాత్ సర్వభూతాని యజ్ఞాయ పశు నాలభేత (25) గీతాభిప్రాయము యుద్ధ మొనర్చుటలోఁ దుదకుఁ బర్యవసన్నమయినది (26) అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునమ్ దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ (16—2)(27) గౌతమస్మృతి-4-22-24చూ (28) తే దశ మాతృ్పార్ధశపితృ్పా వి త్యన్వాఖ్యాయ ప్రసర్పేయు రాదశమా త్పురుషా దితి హ్యాహ । య ద్యబ్రాహ్మణీ మధిగ చ్ఛేయు ర్బ్రాహ్మణ్యైవాభ్యాం దశ సంపూరయేయుః । అస్మరంతశ్చ యతః స్మరేయుః—శ్రౌతసూత్రమ్ (29) ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ 5—11—10 ) అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణ మాపద్యతే జా పరివృత్తౌ 5—11—11

ణుల ఇండ్ల శూద్రపాకము ఈ మొదలగునవి నిషిద్ధములు

## బ్రహ్మపురాణమున

పునర్వివాహము, జ్యేష్ఠాంశము గోవధ భ్రాతృజాయ, కమండలువు, విధవకుఁ బుత్రుఁడు పుటుటకై మఱది నియోగించుట, బాలికనుగాని అక్షతయోనినిఁ గాని మరొకని కిచ్చుట, వర్ణేతర స్త్రీ వివాహము, అతిథి పితృ దేవతల కొఱకు గోవధ మొనర్చుట వీనిని నిషేధించుచున్నది

ఈ వర్జ్యధర్మము లన్నియు బ్రాచీనానుష్ఠితములని సువ్యక్తము ధృష్టుఁడు రతీతరుఁడు అగ్ని వైశ్యుఁడు యౌవనాశ్వుఁడు కపిముద్గలుఁడు హర్యశ్వుఁడు ఈ మొదలగువారి పరివారులు క్షత్రియులందనములును, పిదప బ్రాహ్మణులయి గోత్రకారులుగా గూడ నయినటులును విష్ణుపురాణపు రెండవ యంశమునఁ జూపబడినది దీని నంతయు వెరసిచేసి మాచుచో—వర్ణ వ్యవస్థ నేటివలె బ్రత్యభివృద్ధికిని ఆతంకముకాక మనుజుల కుండవలయు సర్వ స్వాతంత్ర్యమునకు ఊఁతకోలగా నున్నదని గ్రహింప వీలగుచున్నది కొంతకాల మీ రీతిఁ బోవఁగా గట్టుదిట్టము లే హేతువుచేతనో యెక్కుడయినవి ఆ ప్రాచీనాచారముల నెవ్వరో యడ్డియుందురు ఆ యాతంకములవలన భరతఖండమంతయు నచలాయతనమయిపోయినది ఇపుడు మన మా ప్రాచీనాచారముల నడ్డిన వానిని గూర్చి విచారింపవలసియున్నాము

## కల్కిపురాణమున

మహాభారత యుద్ధాంతకాలమునందు సహభోజనములందును వివాహ సంబంధములందును ఒండొండవిర మైత్రి కల బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలోఁ జాలమంది ప్రాణిహింసనము పల యజ్ఞాది క్రియలనుండి విముఖులై బహు భార్యా వివాహమునేకాక ఏకపత్ని వివాహమును గూడ విడిచి మాంసమద్య నిషేవణమును బరిత్యజించి నూతనముగా జైనమతమను నొక మతము గల్పించి జైనులైరి అని కలదు దీనింబట్టి చూడఁగా ఈ జైనులే పూర్వాచారములు బరిత్యజించి నవీనాచారముల నెక్కొల్పినటుల సువిస్పష్టము బుద్ధుని ధర్మములఁ గూర్చి చెప్పు నవదాన కల్పలత 'వివాహః కామాయతనమ్' (పెండ్లి కామమునకు కిల్లు) 'మద్య మాంస నిషేవణమ్ రాగ మోహ హేతుః' (మద్య మాంససేవ రాగ మోహములకుఁ గారణము) 'ధనం లోభ కారణమ్' (ధనము లోభమునకు మూలము) లని వీనిని నిషేధించినది పరోపకారము మాతా పితృ శుశ్రూష గవాది పశుసేవ అనాధ జన సహాయము పేదఱికము సన్న్యసము ముఖ్యధర్మము అని ధమ్మ పదము చెప్పుచున్నది ఈ ధర్మములన్నియు జైన బౌద్ధ నాస్తిక సాధారణములు గతానుగతికములుగా వచ్చు ప్రాచీనాచారములఁ దొలఁగించుకొని ఈ ధర్మముల నెలకొలుపుకొని జైనాది నాస్తికులు ప్రాచీనాచార పరాయణ సంఘమునుండి వేఱుపడి బాహ్యులయి క్రమముగా వారి మతము బెంచికొనిరి ప్రతి మతమునకు అభివృద్ధిఁ బొందఁ గొంతకాల మావశ్యకముకానఁ బెరిఁగి పెరిఁగి బుద్ధునిచేతను, జైనునిచేతను తుదకు ప్రతిష్ఠాపితము లయినవి వైదిక మతాధిక్యము వారల కాలమునఁ బోవునటులు కానిపించెను కావున వైదికులు కూడఁ దమ మతమును సంస్కరించికొనవలసి వచ్చినది బౌద్ధ భిక్షునాపత్తులు ఖండింప వీలులేకపోయెను వారి ధర్మములు వారికే తప్పుగాఁ గానిపించెను హింస విధవావివాహము మద్యపానము మాంస నిషేవణములఁ గూర్చి బౌద్ధులు చేసిన దూషణమువలన వారు మేలుకొనిరి ధర్మ పరీక్ష యను గ్రంథమునఁ అమితగతి యను నొక బౌద్ధుఁడు—

3) మాతా వివాహ్యమానా స్వావరేణా న్యేన వీక్షితా
వినివేద్య స్వసంబంధం మయా పృష్టా స్తపోధనా
ఆచక్షత న దోషోస్తి పరేణా స్యా వివాహనే
ద్రౌపద్యా పఞ్చ భర్తార కథ్యన్తే యత్ర పాణ్డవా
జనన్యా స్తవ కో దోష స్తత్ర భర్తృద్వయే సతి
ఏకదా పరిణీతాపి విపన్నే దైవయోగతః
భర్త ర్యక్షతయోని స్త్రీ పునస్సంస్కార మర్హతి
ప్రతీక్షేతా ష్టవర్షాణి ప్రసూతా వనితా సతీ
అప్రసూతా త్ర చత్వారి ప్రోషితే సతి భర్తరి
పఞ్చ స్వేషు గృహీతేషు కారణే సతి భర్తృషు
న దోషో విద్యతే స్త్రీణాం వ్యాసాదీనా మిదం వచః

(ఓ తపోధనులారా! నా తల్లి ఇంకొకని బెండ్లియాడుచున్నది దోషము కలదేని తెలుపుఁడు ద్రౌపదికి పాండవు లైదుగురు భర్తలు ఇరువురైన యెడల నీ తల్లి కేమి దోసఁగు? ఒకతూరి పెండ్లియైనను దైవికముగా భర్త చనిపోయినచో అక్షతయోని యగు స్త్రీకి పునర్వివాహము విహితము భర్త పరదేశ మేఁగుచో సంతు కలయాఁడుది యెనిమిదెండ్లును—లేనిది నాలుగేండ్లును—ఎదురు చూడవలయును కారణ పురస్సరముగా నీ యైదుగురువర్తులయెడ స్త్రీలకు దోషములేదని వ్యాసాదులుపలికిరి) అని ప్రాచీనాచారముల నిందించినాఁడు ఈరీతిగాఁ బెక్కురు జైనులును దూషించియున్నారు ఆ కాలమున నీ యాచారములను రోసినవారు బౌద్ధులుగనో, జైనులుగనో మాఱిపోయిరి వారు వేదములఁగూడఁ గొన్ని యెడల బహిష్కరించిరి మద్యమాంస నిషేవణము మానిరి బహుపత్నీ వివాహము ఏకపత్నీ వివాహము విధవా వివాహము తుదకు వివాహమును గూడఁ బోనాడిరి జనుల కందఱకు వారి యెడ విశ్వాస ముదయించెను ప్రాచీను లేమి చేయుదురు? తమ మతమును బరిష్కరించుకొనవలసి వచ్చినది పురాతన దురాచారముల మాని ఆ కాలమునకుఁ దగినటులు వేద శాస్త్రములకు వ్యాఖ్యానములు వ్రాసి నూతనములగు స్మృతులను బురాణములను రచించుకొని ప్రచ్ఛన్న బౌద్ధులయి స్వమతమును వేదములను రక్షించుకొనిరి కలివర్జ్య ధర్మము లన్నియు క్రీ శ 4 లేక 5 శతాబ్దినుండి ఆచరణములోనికి వచ్చినవి ఈ విషయము స్ఫుటముగా సూత్రములందును స్మృతులందును భాష్యములందును జూపట్టుచున్నది

ఈ పర్యాలోచనము మనలఁ దాఱుమాఱొనరించుచున్నది ఏలన—నేటికాలమున ఆస్తికుల మనుకొనువారు ఏ యాచారముల ననుష్ఠించుచున్నారో వానికి నాస్తికులు మార్గదర్శకులు ఈ యాస్తికులు తమకు నాస్తికులు మార్గదర్శకులని యొప్పుకొందురా? నేటి సంఘ సంస్కర్తలు నాస్తికు లీ యాచారములకు విరోధులని చెప్పిన విశ్వసింతురా? కాని గ్రంథములఁ బరిశీలించుచో నాస్తికులే మార్గదర్శకులని దృఢ ప్రమాణములు కానిపించుచున్నవి విచారింపఁగా నేటి యాస్తికులే పురాతన వేద స్మృతి విరుద్ధ వర్తనముల నాచరించుచుండిరనియు, నేటి సంఘ సంస్కర్తలే పురాతన స్మృత్యనుయాయులనియుఁ దేలక మానదు తెప్పగాఁ బరిశీలనము చేయనిచో నిది తలక్రిందులుగాఁ గానిపించి తీరును నాస్తికు లీ విధముగా సంఘమునకుఁ బవిత్రత్వము తెచ్చియున్నారు ఈశ్వర సద్భావము మాత్రము వారికి గిట్టదు

,O ఈ యర్థము కల పద్యములు వేమన్నవి, ఆంధ్రలోకమున వాడుకలో నున్నవి








# శంకరమతమున జగత్తు అసత్యమా?

కావ్యతీర్థులు : బంకుపల్లి మల్లయ్యశాస్త్రులుగారు

[1921 దుర్మతి సంవత్సరాదిసంచికనుండి]

అద్వైతులేమి, ఇతర మతస్థులేమి, ఈ మతభేదము పాటించని పాశ్చాత్య పండితులేమి "శ్రీ శంకరులవారు బ్రహ్మ సత్యము జగత్తసత్యము అని అన్నారు" అని అనుకున్నారు కాని శంకరుని భాష్యము లన్నియుం బరిశీలింపగా నా బుద్ధి కట్లు తోఁచలేదు బ్రహ్మ సత్య మనునంతవరకు నిర్వివాదమే కాని జగత్తు మాత్రము అసత్యమని చెప్పినట్లు కానరాదు ఏమన? కొన్నిచోట్ల—జగత్తులో జీవుని విషయమై చెప్పినవి కొన్ని భాగములు, వియదాది ప్రపంచము విషయమై మఱికొన్ని భాగములును—కావచ్చును అసత్యములని తోఁచు భాష్యము లన్నియు జీవ విషయములుగా సమన్వయముచేయుటకే వీలుగా నున్నవి వియదాది ప్రపంచము విషయమై వ్రాసిన భాష్యము లెంతమాత్రమును అసత్యత్వమును జెప్పవు.

కొన్ని యెడల 'నిది పరమార్థ విషయము కాదు' అంటే—అసత్యము అని యర్థము చేసుకొనుటచే నీ భ్రమ వచ్చినట్లున్నది మరి దీని యర్థము నా మతమున నెట్లంటే? పరమార్థము=మోక్షము. అర్థములు=ధర్మము, కామము, అర్థము, మోక్షమును. అందు మత్కృష్టార్థము మోక్షమును గనుక యది పరమార్థము అని. ఇట్లైన నా యా యా చోట్ల "నిది పరమార్థ విషయము కాదు" అంటే మోక్ష విషయము కాదు అనియే అర్థము చెప్పితే సరిపడును. అంతేగాని దానికి 'ఇది సత్యము కాదు' అని అర్థము చేయరాదు ఇట్లున్నందువల్ల నే భాష్యమును విరోధించదనియే నా నమ్మకము దృష్టాన్తము లన్నో యుభయ వాదములకును ఆధారములుగా గానుపించును అయినను స్వప్నాది దృష్టాన్తములు జీవపరములుగాను, మృద్ఘటాది దృష్టాంతములు వియదాది ప్రపంచ విషయములుగాను, సమన్వయించుట సులభము న్యాయ్యము.

అయితే జగత్తు అసత్యము కానప్పుడు అద్వైతసిద్ధి యెట్లని శంకింపవచ్చును ఆశంక అనవసరము అద్వైతమంటే జగత్తు లేదని యర్థము భాష్యములో నెక్కడను జెప్పలేదు మరేమన్నారంటే "ఏక మేవాద్వితీయం" అను శ్రుతికి మరియొక చేతన పదార్థము లేదని యర్థము జెప్పినారు కాని, అచేతనమైన జగత్తు లేదని చెప్పలేదు జగత్తున్నను బ్రహ్మకు సద్వితీయత్వము రాదని "నచ నభసా సద్వితీయత్వ"మను భాష్య గ్రంథములో స్పష్టముగా వ్రాసిరి.

అలాగు జగత్తునే ఒప్పుకొననప్పుడు అధ్యాస భాష్యమే సమన్వయింపదు ఏమన—రెండు వస్తువులు ఒప్పుకొన్నప్పుడే యధ్యాసము లేకుంటే అధ్యాసము సంభవించదు అది లేనప్పుడుతత్పరిహార ప్రయత్నము నిష్ఫలము.

అయితే సాంఖ్యాది మతములకు అద్వైతమునకును భేదమేమి అందురా? వలసినంత భేదమున్నది. వారు బ్రహ్మ భిన్నముగా మఱియొక యచేతనమును ఒప్పి, అది స్వతంత్ర మన్నారు మఱియు సత్యమైన చేతనాంతరమును గూడ ఒప్పుకొన్నారు. అద్వైతు లట్లుకాదు వీరు చేతనాంతరమును ఒప్పరు సరే కదా, ఈ జగత్తు కూడా బ్రహ్మలోనే యున్నదందురు అదియును స్వతంత్రము కాదు; బ్రహ్మాధీనము అందురు. కాన నద్వైతమునకు భంగము లేదు జగత్తు బ్రహ్మలో నొక్కభాగమయితే బ్రహ్మసావయవమా? వికారము చెందునా? అని శంకించినప్పుడు సమాధానమేమంటే—అవును వికారమును జెందును కాని బ్రహ్మమాత్రము నిరవయమే ఏదేది వికారము జెందునో అయ్యది తప్పక సావయవముకాక తీరదు అనుయుక్తి బ్రహ్మ భిన్న పదార్థములకే కాని బ్రహ్మ విషయమై చెల్లదు యుక్తి యెప్పుడును బ్రహ్మను చెప్పలేదు. బ్రహ్మను జెప్పునది యొక్క శ్రుతియే యని భాష్యములోనే శంకరులవారు వ్రాసియున్నారు

అది ఉపాసనార్థముగాని పారమార్థికము కాదన్నారే అందురేమో! అవును—నా యర్థము చొప్పున గూడ నట్లే కాని ఉపాసనా విషయమంటే అసత్యమని మాత్రము అర్థము కాదు అట్లయిన బృహదారణ్యక భాష్యము విరోధించును—దానిలో ప్రాణోపాసనను చెప్పుచు శ్రీ శంకరుడు ఉపాసనార్థమై చెప్పిన విషయము యధార్థమేగాని అయధార్థ మెంతమాత్రమును గాదన్నారు గనుక ఇదిగాక, విజ్ఞానవాదమును ఖండించుచు నాచార్యులవారు బాహ్య ప్రపంచమైన, స్తంభ, కుడ్య, అదికము—భావ పదార్థమే గాని అభావ పదార్థమని ఎంతమాత్రమును అనరా దన్నారు. అసత్యమైనప్పుడు అభావ పదార్థమనియే వ్రాసియుందురు.

మఱియు, కార్యము ఉత్పత్తికి బూర్వము కూడ సత్తే అని చెప్పుటచేత—ఉత్పత్త్యనంతరము గూడ సత్తే అని స్పష్టముగా సత్కార్య వాదమునే స్థాపించినారు కార్య మన్నది జగత్తే శంకరుని మతమున అది సత్తే అది యెన్నడును అసత్తు గాదు అసత్తయితే స్వప్న దృష్టాన్తమును తీసికొని, 'స్వప్నమునకు జాగ్రదవస్థలో బాధ కలుగుచున్నది. జాగ్రదనుభూతవస్తువున కే యవస్థలోను బాధ లేదు' అను "వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్" అనుసూత్ర భాష్యమును సూత్రమును నెట్లు సమరస పెట్టగలరు?

ఇఁక బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కలిగేవఱకును, జగత్తు సత్యముగానే కనుబడును అని శంకరులవారంటే కొందఱు, చిగుళ్లకు చేవలెక్కించి, తరువాత నసత్యము అని యర్థము చేసి, కావున, నెప్పుడును అసత్యమే యనుచున్నారు. అది న్యాయ్యము కాదు ఆయవస్థ మనస్సుకూడా లేని యవస్థ. అప్పుడు ప్రపంచ మిట్టిదని గోచరించు సాధనమైన మనస్సులేనిది ఇదమిత్థమని యెట్లు నిర్ణయింపగలరు? కాక జాగ్రదనుభూత ప్రపంచ మే యవస్థలోను బాధితము కాదు అని చెప్పుచుండగా—వీరెవరు తరువాత నసత్య మనుటకు? అది వీరి మతము కావచ్చును గాని, శంకరమత మెంతమాత్రమును కాదు అప్పుడు శంకర మతమున జగత్తుకు అభావమే, సుషుప్తిలో నెట్లో అట్లు. ఇందుకు "సత్త్వాచ్చావరస్య" అను సూత్రములో కారణమయిన బ్రహ్మ యేలాగు మూఁడు కాలములయందును సత్తో, యట్లే జగత్తు కూడ మూఁడు కాలములలోను సత్తేకాని యసత్తుకాదు అని చెప్పిన భాష్యము మరింత బలకరము.

ఇంకొకటి—జగత్తును అనాదులలో నొప్పి, యధ్యాసము అనాది—అనంతము— అని చెప్పుటచేత గూడ స్వాములవారి మతమున జగత్తునకు ప్రవాహ నిత్యత్వము కూడ అంగీకారమని చెప్పగలము.

మఱొక్కటి—బ్రహ్మలో 'శక్తి' అను జగద్బీజము దీపములో వెల్తురువలె నున్నది—అని చెప్పి, అది బ్రహ్మకంటె భిన్నమని అభిన్నమని, సత్తని, యసత్తని, సావయవమని, నిరవయవమని నిర్ణయింపలేము. అది యున్నందువల్ల బ్రహ్మకు దోషము రాదు. బ్రహ్మకు శక్తికినిగల సంబంధము వైశిష్ట్యము కాదు మిథ్యా సంబంధము అని తమ "సర్వ వేదాన్తసార సంగ్రహ" మను గ్రంథమున వ్రాసియున్నారు. మిథ్యాఅంటే—అనిర్వచనీయ మన్న యర్థమే గాని యసత్యమని విద్వాంసు లెవ్వరుమ అవరు. కమక జగత్తు అసత్యమని శ్రీ శంకరులవారి మతము కాదు.

# కానుగుచెట్టు

## పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

**[ 1921 దుర్మతి సంవత్సరాదిసంచికనుండి ]**

నక్కదోసకాయ యూరుఁగాయ, గోఁగుకూరపచ్చడి, బఱ్ఱె పెరుఁగు అంతే అంతకంటె నక్కడ నేమి దొఱకును? అవే పంచభక్ష్య పరమాన్నములు ఇట్లను దినము వేళపాళ యనిలేక కొర్నిపాటి సుబ్బరాజుగా రన్నప్రదాన మాచరించుచుండిరి అన్నము జొన్నయన్నము. విస్తరి బొడ్డుమేడియాకు విస్తరి. ఉప్పు తౌతియుప్పు నీరు దిగుడు బావి నీరు ఇప్పటి మాటయా? దాదాపుగా నూఱేండ్ల క్రిందటిమాట ముప్పది సంవత్సరము లిట్లు బ్రాహ్మణుఁ డన్నప్రదాన మొనర్చినాఁడు మహానుభావుఁడు నిర్గర్వుఁడు పల్వురు మోయఁదగిన చొప్ప మోపును తానే పొలమునుండి తలపైఁ బెట్టుకొని తెచ్చి బఱ్ఱెలకు వేయును. వాని పాలు పాలికాపులచేఁ బిదికింపక తానే పిదుకును ఇంట నందఱికాతని భార్యయే వంట చేయును వంటలక్కలు కాని నీళ్లబ్రాహ్మణులు కాని వారి కెవ్వరును లేరు ఉంచుకొనవలసిన యావశ్యకతయు వారికి లేదు తమ ఇంటిపని నౌకరిచేఁ జేయించుట వారు తప్పుగ భావించుచుండెడివారు పచనాదికృత్యములను బైవారిచేఁ గూలి పెట్టి చేయించిన ఎడల నతిథి పూజాఫలము పరిపూర్ణముగఁ దమకు సిద్ధింపదేమో యని వారికి భయము. పాలుమాలిక లేక, యొడలు దాఁచుకొనక భూత సంతుష్టి చేయుటయే పుణ్యకార్యమని నమ్మి వారట్లు చేసిరి

మగనికిఁ దనకుఁ దవ్వెడు బియ్యము కుత కుత లాడించుటకే ఈ కాలపుఁ గులకాంతల కోపిక లేదు. దొడ్డిలో దాసి వీధిగుమ్మములో సేవకుఁడు ఇంటిలో వంటలక్క ఇంత పైబలగ మున్నఁగాని యాలుమగనికంటె నెక్కువలేని యిద్దఱి కాపుర మీ దినములలోఁ గడతేరకుండ నున్నది పంచపాళిలో నారవైచిన బట్ట భటునిపాలు పెరటిలోఁ బారవైచిన తప్పెల దాసిపాలు పడమటింటిలోని పప్పు నేయి సామాను బావనక్కపాలు అమ్మగారు పడుకటింటిలో నౌరంగజేబు నవలను జదువుచు నావులింతలపాలు అయ్యగారణాబిళ్లపై సంతకములతో నప్పులపాలు ఇంతే కదా ఇప్పటి సంసారముల సౌభాగ్యము! అతిథి పూజ లేదు సరే కదా—పతి విస్తరిలోఁ బచ్చడి మెతుకులయినఁ జేసిపెట్టిన దేది? వంట ప్రొయ్యియొద్దఁ గూరుచుండు నెడల మొగము మెఱుఁగు కఱఁగి పోవునప్పుడు మగని మొగాన నింక మొద్దులేకాని మఱియేమున్నది? ప్రాసయతి మంజరీ ద్విపదలో నుండ వచ్చునో లేదో తెలియునుగాని, పప్పుడికిన తరువాత నుప్పువేయవలయునో—యుడుకక ముందు వేయవలయునో తెలియదు ఉండలు జిల్లేడు గాయలు కాకుండ నత్తెసరువేయ గల యమ్మగా రన్నపూర్ణాదేవిగారు వంటయింటిలోని ప్రాణాహుతులతోను బజారులోని కారపుబూసతోను గాపురము లెట్లో జరుగుచున్నవి జరుగక మానునా? కాలచక్రము నెవ రడ్డగలరు? ఆయువుండగా నెవరేమి చేయఁగలరు? మగల బ్రదుకులే ఇట్లు దిగ వాఱినప్పుడు మఱఁదుల, బావల, యత్తల బ్రదుకు లడుగవలయునా?

కాని యయ్యో! ఏమి దుర్గమ్మ!! దూపాటి సీమనుండి వచ్చినవాఁ డొకడు నల్లమలనుండి వచ్చినవాఁ డొకడు కోనసీమనుండి వచ్చినవాఁ డొకడు పలనాటిసీమనుండి వచ్చినవాఁ డొకఁడు. ఇట్లెందఱో యతిథులై రాగా, వారి కందఱకు బహు పరిశుభ్రముగా వండి, భర్త కుట్టి సిద్ధపఱచియుంచిన యాకులలో వడ్డించి, వారు సంతుష్టిగఁ భుజించిన తరువాతఁ దాను భుజించును ఇట్లొక్క దినమా? ఒక్క మాసమా? ఒక్క సంవత్సరమా? ఆఁడుదాని పరిపూర్ణ సహాయ్యము లేకుండ బ్రహ్మదేవుఁడైన నన్నప్రదాన మాచరింపలేఁడు అన్నప్రదాన పుణ్యమంతము నంగనదే!

ఇఁక నీ యతిథులకు సాయంకాలమున మూఁడుగంట లగుటతోడనే—అనుపఁగాయ దినములలో తంపటివైచిన యనుప గుగ్గిళ్లు—లేఁజొన్న కంకుల దినములలో నూచ బియ్యము—మొక్కజొన్న పొత్తుల కాలములో మొక్కజొన్న పొత్తులు—ఇట్లు ఏ యే కాలములో నేది వచ్చునో—యది యల్పాహారముగ వారి ఎదుటఁబెట్టి తాను చే గునవమంత గంటము చేతఁ బుచ్చుకొని, తాటియాకులపై భాగవతమో, హరివంశమో మరేదియో యా సుబ్బరాజుగారు వ్రాసికొనుచుండును ఇట్లాతఁ డెన్ని గ్రంథములో వ్రాసినాఁడు. కవీశ్వరు లాతనికిఁ గన్నులు గట్టినట్లుందురు తిక్కన సోమయాజి యాజడుగుల పొడవగువాఁడని—గ్రద్దముక్కు కలవాఁడని—నడుము కట్టులోఁ జారకత్తి కలవాఁడని కాలిన మొక్కజీడిపప్పు రంగువాఁడని యాతఁడా యతిథులతోఁ జెప్పుచుండును చేతిలోనున్న యనుపపప్పు ముందుఁ గథలోనున్న కాలినమొక్కజీడి పప్పెక్కువ రుచింపకుండుటచేఁ గాబోలు వా రా మాటలను గణింపకుండెడివారు తిక్కన సోమయాజిగారిట్లుండెనని మీకెట్లు తెలిసినదని యాయన నెవ్వరు నడుగలేదు అడిగిన యెడల గారణ మాయనకు మాత్ర మేమి తెలియును? అట్లాయనకుఁ దోఁచుటయే కారణము పింగళి సూరన్నగారికి ముందు దంతములలో నొకటి పొడుగని యొకటి పొట్టియని చెప్పును ఆయనకు ఆలాగున గనఁబడుచుండగ నెవరు కాదనఁగలరు? ఒకనాడు తాను తన భార్యయుఁ బండుకొని యుండగాఁ దాను "దుర్గా! పోతరాజుగా రెట్లుందురని నీ యభిప్రాయ?"మని యామె నడిగెను ఈ ప్రశ్న యామె కెందులకో బోధపడదు "పొడుగుగాను, సన్నముగాను నుందురని నే ననుకొందువ"ని యామె బదులు చెప్పెను భర్త యడిగిన నడుగునుగాక! భార్య కీ ప్రత్యుత్తర మెందులకో యంతకంటె బోధపడదు "ఆలాగునఁ గాదు సుమీ పొట్టిగా నుండును తగు మాత్రమైన బొజ్జగలిగి యుండును" అని భర్త బదులు చెప్పెను ఔనని, కాదని, భార్యా భర్త లిట్లొక్క నిముసము సంభాషించుకొన్నమీఁదట భర్త—"నే నన్నమాటయే నిజమగునెడల—నదిగో—గోడబల్లమీఁదఁ బెట్టిన మద్దెల యున్నదే అది గణగణమ్రోఁగును" అనుసరి కేదైన ఎలుక దానిని గదల్చెనో మరేమైన జరిగెనో తెలియదు కాని, మద్దెల గణగణ మ్రోఁగెను అంతనాతఁడు మహానందముగ లేచి మద్దెలను క్రిందికి దింపి దానికి బూజ లొనర్చి పోతరాజుగారి మద్దెలయని దానికిఁ బేరిడి పోతరాజుగారి గజేంద్ర మోక్షాది గాథలలోని పద్యము లన్నియు గీర్తనములుగాఁ బాడుకొనుచు మద్దెల వాయించుకొనుచుండెను ఇది జరిగి యిరువదేండ్లు దాటినది అల్పాహార కాలమునం దీ కథ యతిథులకుఁ బ్రతిదినమును జెప్పును అట్లు కొంతసేపు చెప్పి—

క "పలికెడిది భాగవతమఁట
పలికించెడివాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా?"

యను పద్యమును చదివి "ఆహా! మహానుభావుఁడు! ఎంత మృదులముగా—నెంత లలితముగా-నెంత మనోహరముగాఁ—జెప్పినాఁడో"యని కన్నుల నీరు జలజల రాల్చుచుండును ఊచబియ్యపుఁ బదనుచేఁ జొంగలు గార్చుచున్న భుక్తిప్రియులకుఁ బోతరాజుగారి కవిత్వ మప్పుడు కావలయునా?

ఇట్లు కొంతకాల మత్యుచ్ఛ్రయముగా నా సంసారమునకు దినములు జరిగినవి కాల మొక్కరీతిగఁ గడచునా? వర్షములు వెనుకఁ బట్టినవి పంటలు తగ్గిపోయినవి క్షామము తలసూపినది అందువలన నతిథులు మఱింతవచ్చుచున్నారు అందఱికి సంతుష్టిగఁ బెట్టుచునే యున్నాఁడు అప్పులు చేసినాడు—పాటి పెరళ్లమ్మినాఁడు ఇల్లమ్మినాఁడు ఇంటిలో బాత్రసామగ్రి నమ్మినాఁడు కోటప్పకొండ మ్రొక్కుతో సంబంధించిన తన ఎడమకాలి వెండి కడియ మమ్మినాఁడు అమ్మగా మిగిలిన రెండు గేదెలుఁ గూడఁ జచ్చిపోయినవి ఇంటిలో నేమియు లేదు మట్టమధ్యాహ్న మగునరి కిద్ద ఱతిథులు వచ్చినారు ఇంటిలో నరసోలెడు గింజలు లేవు అప్పుడు భార్యయొద్ద కాతఁడు పోయి ఇప్పుడు వచ్చిన యతిథులను బూజించు టెట్లు?— అని యడిగెను పసపురాచిన దారమును మెడను గట్టుకొని మంగళసూత్ర మిచ్చి "ఇది యమ్మి వారికిఁ గావలయు సామగ్రిని తెండు అమ్మాయి చద్దియన్నము తినినది మన మీ దినము భుజింపవలదు వారికి సాయంకాలము కాకుండ భోజనముపెట్టి పిల్లను దీసికొని రాత్రి యెటకైన బోవుద"మని భార్య పలికెను మంగళసూత్రమునకు రెండు వరాలు కాఁబోలు వచ్చినది కొంత వ్యయపరచి యా యతిథులకు సంతుష్టిగా భోజనముపెట్టి శిష్టాన్నము కొంత సాయంకాలమునకుఁ గూఁతునకుఁబెట్టి తాము తినక, వా రా రాత్రి యెవ్వరితోడను జెప్పకుండ వెడలిపోవఁ బ్రయత్నించిరి కాని, ఈ యూరనున్న యొక సంపన్నుఁడీ యంశమును గర్ణాకర్ణిగా విని యాయనయొద్ద కా రాత్రి వచ్చి "సుబ్బరాజుగారూ! మీకు దుర్దినములు వచ్చినవి దరిద్రతకంటె దుస్స్థితి లేదు మిమ్ము నేను గనిపట్టుదును మీ రెక్కడికిని బోవలద"ని చెప్పెను "ఓ యబ్బ! దుష్టదినములు మాత్రము మమ్మేమి చేయఁగలవయ్యా? దరిద్రము పోతరాజుగారు పడలేదా? ఆయనకంటె మే మెక్కువవారమా? ధర్మబుద్ధిచే నొకరు నా కింత పెట్టఁగ నేను దినువాఁడను గాను పోతరాజుగారిని రక్షించిన యొంటిమెట్ట కోదండ రామమూర్తి మమ్మేల రక్షింపకుండును?

అడవులబట్టి పోవుదుము నాయనా! పోతరాజుగారు "అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు రక్షింతుండు మందిరమునఁ జచ్చు" నని చెప్పినారు మమ్మడ్డు పెట్టకుము కాని నా దొక్క కోరిక యున్నది ఎవ్వరైన నతిథులు వచ్చునెడల నీవు వారిని చేతనగువంతవఱ కాదరించుచుండుము అట్లు చేయునెడలఁ బోతరాజుగారు సంతసింతురు' అని చెప్పి యాతని పంపివైచి, ఇదివఱకుఁ దాను వ్రాసిన తాటాకు గ్రంథము లన్నియు నటుక మీఁదఁ బదిలముగా దాఁచి, తాను వ్రాసిన పోతరాజుగారి భాగవతమును దేవతార్చనపు పెట్టెతోఁ గూడ సంగవస్త్రమునఁజుట్టి తలపైఁ బెట్టుకొని, పోతరాజుగారి మద్దెల వీపునఁ గట్టుకొని, గంటము మొలలో బెట్టుకొని, కూఁతునెత్తుకొని, భార్యచేయి పట్టుకొని—

కం॥ శ్రీకంఠ చాపఖండన
పాకారి ప్రముఖ వినుత, భండన భీమా
కాకుత్స్థ వంశ మండన
రాకేందు యశో విశాల రామనృపాలా

యని పఠించుకొనుచు వెడలిపోయెను

## 2

అది మహమ్మదీయుల రాజ్యము ఆ యూరి పేరేదో తెలియదు జోడుగుఱ్ఱం బండిమీఁద నబాబుగారు బయలుదేరి—'కాసు' తోటఁ జూచి తిరుగ నింటికిఁ బోవుచున్నారు ఆ దారిలో నొక బ్రాహ్మణుఁడు నిలువఁబడియున్నాఁడు గుఱ్ఱపుబండి వచ్చుచున్నది "ఓయబ్బా! ఆపవయ్యా బండి! ఒక్కటే పరుగా?" యని బండివాని కాతఁడు కేక వైచెను బండియాపక యాతఁడు తోలుకొనిపోవుచుండగా నా బ్రాహ్మణుడు గుఱ్ఱపుఁ గళ్లెములను బట్టుకొని బండి నాఁపెను గుఱ్ఱములు బెదరుచున్నవి కాని వానిని గదలనీకుండ నాతఁడు పట్టుకొనియున్నాఁడు ముందుఁ గొంతదూరము పోయిన తురుపు సవారులు వెనుకకు దిరిగిరి మరికొందఱు జనులు మూఁగిరి నబాబుగారు బండి దిగినారు ఆయనయొద్ద కాతఁడువెళ్లి "మాయబ్బ! నీ వేనటయ్యా! ఈ చుట్టుపట్ల పొలాలకంతకును రాజవు? సరేకాని, నాకేమైన భత్యమేర్పాటు చేసి, తాటాకు గ్రంథాలు వ్రాయింపరాదఁటయ్యా! నాకు జరుగుబాటుగను నుండును నీకు ఖ్యాతిగాను నుండును సుఖముగా గూరుచుండి వ్రాయుదును నీ కచ్చేరీలోనికి నన్ను రానీయరని నిన్నుఁ జూచుట కీడకు వచ్చినాను ఎవరేమి చెప్పుకొందురో వినవచ్చును బండి నిమ్మళముగాఁ దోలించుకొనరాదయ్యా" యని నబాబుగారితో ననియెను బ్రదుకు దెరువు కొఱకుఁ బ్రభుని ప్రథమమున సందర్శించునప్పటి సంభాషణ మిట్లున్నది పాపము! భటత్వ మెఱుఁగునా? ప్రభుత్వ మెఱుఁగునా? మన్నన యెఱుఁగునా? మార్దవ మెఱుఁగునా? మర్యాద యెఱుఁగునా? మాట తీరెఱుఁగునా? అయ్యో! వట్టి జానపదుఁడు రూపమున మోట వస్త్రమున మోట పలుకున మోట వట్టి నిష్కల్మషుఁడు అమాయకుఁడు మనసున నొకటి నోట నొకటి యున్నదా? శుద్ధ సత్యకాలపువాఁడు ఋషి విగ్రహుఁడు హరి హరీ! ఇప్పటి ఇంద్రజాల మహేంద్రజాల మహామహోపాధ్యాయులలోని వాఁడా? ఇప్పటి వారిలోఁ గొందఱు సత్యసంధులకుఁ దక్క దఱచుగా నెవ్వరినిఁజూచినను నొసలు వెక్కిరింపు నోరిగిలింపు మొగమెదుట నమస్కారములు వెనుకఁ దిరస్కారములు పలుకతేనెపట్టు— పిడికిలి కోతిపట్టు పెదవిని మందహాసము హృదయమునఁ జంద్రహాసము ఆతఁ డిట్టి వారిలోవాఁడా? తన కుపకారపుమాట యేదో యెఱుఁగఁడు ఎదుటివాని కపకారపు మాట యేదో యెఱుఁగుడు మనసులో నేది సత్యమని తోఁచునో యది పైకి రావలసినదే ఆ వచ్చుటలో నొక సొంపు లేదు పంతన లేదు నీటులేదు మాటలేదు వట్టి కఱ్ఱపడి కంకరతాలి పాకముతో రావలసినదే! ఆతఁ డనినమాటలు విని నబాబుగారు కొంత నిశ్చేష్టితులై యూరకుండిరి నబాబుగారివంటి వానిని సుబ్బరాజుగారెట్లు చూడలేదో, సుబ్బరాజుగారివంటివానిని నబాబుగా రట్లు చూడలేదు "మాయబ్బ ఆదేమి చూపయ్యా!

'కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం జెందరే?
వారేరీ సిరి మూఁటకట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులున్ బ్రీతి న్యశస్కాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే! యిక్కాలమున్ భార్గవా'

యని పోతరాజుగారు సెలవిచ్చి రయ్యా! అడుగక యఱువదియేండ్ల కడిగినా నయ్యా! నీ పొలాలన్నియు నాకూఱకే యిచ్చినను నా కక్కఱలేదు ఏదో కొలువు చేయించుకోవయ్యా! ఎందులకింత యోజన? నీవిచ్చు భత్యము నాకేమియు నక్కఱలేదు వింటివా? పూట కొక్క యతిథి కన్నముపెట్టి మిగిలిన గంజితో నా కూఁతురును రక్షించుకొందును నేను నా భార్యయు బస్తుండెదము కాదేని కాయయో కసరో తినుచుందుము నా మాటకేమి?" అని బ్రాహ్మణుడు పలికెను ఇంకను నబాబుగారు నివ్వెరగుడ్లు వైచుకొని చూచుచుండగా "నీతో నాకేమి పోవయ్యా—రాజన్నప్పుడు పోతరాజుగారే రాజుగాని నీ వెక్కడి రాజువయ్యా" యని యాతఁడు పోఁబోవునరికి నబాబుగారు భటులకుఁ గనుసన్నచేసిరో యేమో కాని నల్వురు భటులు సుబ్బరాజుగారిని నున్నములోని కెముకలేకుండఁ గొట్టిరి సుబ్బరాజుగారు రామ రామ యనుచు నా దెబ్బలన్నియు నే మాత్రము తిరుగుబాటయిన లేకుండ కన్నయినఁ జిట్లించుకొనకుండ సహించెను మరియొక భటుఁ డింతలో వచ్చి యాయన జన్నిదమును ద్రెంపఁబోవగ నాతని నెత్తిపై తన గంటము మొదటితోఁ గొట్టెను వాఁడు గిలగిలలాడుచుఁ గ్రిందఁబడిపోయెను అంత సుబ్బరాజుగారు కారాగృహమందుంపఁబడిరి నవాబుగారు తమ మహలునకుఁ బోయిరి

## 3

స్ఫోటకపు వ్యాధులచే విషూచి వ్యాధులచే నా మహమ్మదీయ గ్రామమంతయు నిండియున్నది జనులు కుప్పతిప్పలుగాఁ జచ్చుచున్నారు బండ్లమీఁదవైచి శవములను దీసికొని పోవుచున్నారు సుబ్బరాజుగారి కారాగృహమున కొక్క నలుబది బారల దూరములో నొక కానుఁగు చెట్టున్నది అది వీధిప్రక్క నున్నది దానిక్రిందనే, దుర్గమ్మ యామె కూఁతుతో నివసించుచున్నది తనకుఁ, దనభర్త కన్నము లేకపోయినను ఏ జిరుగడమో కఱ్ఱపెండలమో తిని కాలక్షేపము చేయఁగలరు కాని, అయిదేండ్లపిల్ల యట్లు బ్రదుకుగలదా? ఆ పిల్లను సంరక్షించుట కామె యెచ్చటనైన దాస్యమున కొప్పుకొని చేయవలయును గదా? ఎక్కడెక్కడఁ దిరిగినను సదుపాయమగు నౌకరి దొఱకలేదు తుద కొక్కయింట నెలకొక్కవరా జీతమున కొప్పుకొని యా యింటను స్ఫోటకపు వ్యాధిచే బాధపడుచున్న యొక కాంత కుదయమునుండి సాయంకాలమువఱ కుపచారము చేయుట కంగీకరించెను మానసవేతనములోఁ దీర్చుకొను పద్ధతిమీఁద నొక్కవరహా ముందుగాఁ దీసికొని పిల్లదానికిఁ గావలయు సామగ్రికొని కుండతోఁ దెల్లవాఱకముందే రవంతవండి, కూఁతునకు బెట్టి దానిని దండ్రి గారాగృహము గుమ్మము వెలుపల విడిచి తాను సేవకుఁ బోవుచుండును ఇట్లు పదునైదు దినములు గడవకుండ నామెపిల్లకు జ్వరము వచ్చెను పుచ్చుకొన్న మాడ కింకను రెండు దినముల సేవ బాకి యున్నది ఋణము తీర్చుకొనకుండ రాదనియు, నుచితముగ నెవ్వరి సొమ్మును దీసికొనఁగూడదనియు నా జ్వరము తోడనే పిల్లను గారాగృహాంగణమున విడిచి సేవకుఁబోయి యా బాకి తీర్చుకొని, యంతటినుండి సేవకు రాఁజాలనని చెప్పెను పిల్లకు స్ఫోటకము వచ్చినది రెండీఁతాకు లడ్డు కట్టుకొని యా చెట్టుక్రిందనే వాని చాటునఁ బిల్లను బెట్టుకొని కంటికి మంటికొక్కధారగా నేడ్చుచుండును తండ్రి కారాగృహమందు భీష్మస్తవరాజమును జదువుకొనుచుండును ఇట్లుండుగా బైఁట చాటున గుడ్డలలోఁ బిల్లను బెట్టుకొని యొక్కనాఁ డుదయమున దుర్గమ్మ కారాగృహము నొద్దకువచ్చి పిల్లను తండ్రికి జూపి యేడ్చెను ఉదయ మయిదు గంటలకే యా పిల్ల మరణించెను మృతినొందిన తన కూఁతును రోదనము చేయుచున్న భార్యను గాంచి కన్నులనుండి జారిన ఇందుపగింజలంతటి రెండు బాష్పముల నట్టె త్రోచివైచి—"ఓయబ్బ! ప్రపంచ మిట్టిదని యెవరెఱుఁగరు? తొందరపడకు ఒంటిమెట్టు కోదండరాముఁ డిచ్చినాఁడు ఆయనయే తీసికొన్నాఁడు ఓయబ్బ! తన సొమ్ము తాను

# యుగకర్త జ్ఞాపకార్థం



## కీర్తిశేషులు శ్రీ. జి. కె. మంగరాజు
(1896 - 1964)

చలన చిత్ర పరిశ్రమకు - డిస్ట్రిబ్యూటరుగ, ప్రదర్శకునిగ, నిర్మాతగ మూడు దశాబ్దాలపాటు సేవ చేశారు.
మా కంపెనీ - డైరెక్టరు, ఛైర్మన్, వ్యవస్థాపకులు. కలకత్తా మద్రాసుల మధ్య తొలుత టాకీ నెలకొల్పిన మహానుభావుడు.
తొలి తెలుగు చిత్రాన్ని నిర్మించడానికి ప్రోత్సహించిన ఉత్సాహి.
చలనచిత్ర కంపెనీ దారుగ దారితీసిన తొలి ఆంధ్రుడు.
అనుభవజ్ఞులు, ప్రజ్ఞావంతులు అయిన పలువురు సాంకేతిక నిపుణులను, నటులను నిర్మాతలు కావడానికి ప్రోత్సహించారు.
ఆంధ్రా ఫిల్మ్ ఛాంబరు అవతరించినప్పుడీయనే ప్రథమ ఛైర్మన్.
పూర్ణయాత్రా స్పెషల్ రైళ్లు నడిపి అశేష ప్రజానీకంచే కీర్తింపబడ్డారు.
ఆయన పలుముఖప్రజ్ఞను, ఉపజ్ఞను యుక్తంగా పొందు పరచాలని చూడడం సూర్యునికి దివిటీ పట్టడం లాంటిదే.

ఇట్లు

**పూర్ణాపిక్చర్స్ (ప్రై) లిమిటెడ్**

డైరెక్టర్లు, సిబ్బంది: విజయవాడ, విశాఖపట్నం, గుంటకల్, సికింద్రాబాద్, మద్రాస్

దీసికొనఁడేమి? పోతరాజుగారి మాటయందు నాకున్నట్లే నీకుఁ బ్రమాణబుద్ధి యున్నది కావునఁ జెప్పెదను

'మర్త్యక పీరి కెల్ల బహుమాత్రము చోద్యము! దేహి పుట్టుచుం
జచ్చుచు నుండు జూచెదరు చావకమానెడువారి భంగి నీ
చచ్చినవారి కేడ్చెదరు చావున కొల్లక దాఁగవచ్చునే?
యెచ్చటఁబుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్'

అందువలన నిప్పుడు నాన యమ్మ వైకుంఠమున నున్నది నే నెఱుఁగుదును నాకు రాత్రియే తెలిసినది" అనెను ఇంతలో "స్ఫోటకపు శవము నచటికిఁ దీసికొని రాఁగూడదు పోపో" యని భటు లామెను బెదరించిరి ఆమె యేడ్చుచు, "నాయనలారా! పోవుదును క్షమింపుఁ"డని భర్తవంక తిరిగి "ఎవ్వరికైన నొకటంక మిచ్చినఁగాని ఈ పిల్లకుఁ దరువాతి కర్మము జరుఁగదు నాయొద్ద నేమియు లేదు నేనే తీసికొనిపోయి నా చేతులతోనే ఈ పని చేయవలయునా?" యని గోలున నేడ్చుచుఁ దటాలునఁ బోయెను ఆమె యేడ్పు చూచి భర్త గుండెలే కావు-బ్రహ్మాండ గోళమంతయు గడగడ వడుకినట్లయ్యెను నిజమైన యాపద వచ్చినప్పుడు—అందులో మహాపతివ్రత కాపద వచ్చినప్పుడు—ఆ యాపద కన్నకడుపుతోఁ జేరినప్పుడు—పునాదులతోఁ జెల్లగిల్లునట్లు ప్రకృతిఁ గంపించు నవఁగా నాశ్చర్య మేమి? అంత సుబ్బరాజుగారు—

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛ వచ్చె తనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నిత పరం బెఱుఁగ మన్నింపందగుం దీనునిన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!"

యను పద్యమును జదువుకొని కొంత శాంతపడి రామనామస్మరణ మొనర్చుకొనుచుండెను.

# 4

సుబ్బరాజుగారి గంటపు దెబ్బ తినిన భటుఁ డిరువది దినములు బాధపడి మరణించెను ఖూనీ నేరము చేసినందులకు సుబ్బరాజుగారిని నబాబుగారింక శిక్షింపవలసియున్నది విచారణ కొక్క దినమున నాయనను నబాబుగారి కచ్చేరికి దీసికొనిపోవుట కేర్పాటయినది వకీళ్లు కావలయునా? దస్తావేజులు కావలయునా? సాక్ష్యము కావలయునా? నబాబుగారి యెదుటనే కదా నేరము జరిగినది? భీష్మైకాదశీ దినమున విచారణ జరుగనైయున్నది ఆ యుదయముననే దేకుకొనుచు నాతనిభార్య కారాగృహమునొద్దకు వచ్చి భర్తను గాంచి "నా కీ యుదయమువనుండి వాంతులు భేదు లగుచున్నవి నా తను వీ సాయంకాలమువఱకు నిల్చునని తోఁపదు నడువలేక ఇట్లు దేకుకొనుచు వచ్చితిని సర్వథా యనుగ్రహ ముంపవలయును" అని లోయేటఁబడిన గొంతుతోఁ బలికెను భార్యను గాంచి భర్త కొయ్యవారెను ఒక్క నిముసమునకుఁ బ్రజ్ఞఁగాంచి చూచుసరికిఁ దన పాదముల నాయనశలాకలనుండి యావలకు లాఁగి వానిని గన్నులందుఁ జేర్చుకొని—శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమ —యని భార్య యనుచున్నది భర్తకుఁ గంటివెంట నీటి చుక్క లేదు భార్య కంతకంటె లేదు అతిశుష్కమైన వస్తువునకయిన రసమున్నది అతి నీచమైన కార్యమునకైన రస మున్నది అగ్నిజ్వాలలకైన రస మున్నది కాని యతిదు ఖమున రసము లేదు "మీ పాద సన్నిధిని నాకు మరణింపవలయునని యున్నది కాని ఈ వ్యాధిగల నన్నిక్కడఁ గొంతసేపైన నుండనీయరు భటులు పొమ్మనకుండనే స్వామీ వెడలిపోదును నమస్కారము" అని యామె దేకుకొనుచుఁ బోయెను ఆమె యేమనుకొనుచుఁ బోయెనో యాయన యేమనుకొనుచుఁ గొట్టులోనుండెనో వారికే తెలియఁదగినది అంత

కం కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగి గణములపాలన్
గలఁడందు రన్ని దిశలను
గలఁడు కలండనెడివాఁడు కలఁడో లేఁడో

యని చదువుకొనుచు నిట్లు గలిగిన సందేహమును వెంటనే పరిహరించుకొని,

కం నీపాద కమలసేవయు
నీ పాదార్చదకులతోడి నెమ్మి నితాంత
శ్రీపాద కమల సేవయుఁ
దాపసమందార నాకు దయసేయఁగదే

యని ధ్యానించుకొనుచుండెను ఇంతలో విచారణకొఱకు నాయనను గచ్చేరికిఁ దీసికొనిపోవు భటులు వచ్చిరి వా రాయనను దీసికొని పోవుచుండగ "ఆ కామఁగుచెట్టుక్రింద నొక్కసారి నిలువవయ్యా! నా భార్యను చూచివత్తు" నని వారిలో నొక్కని నాతఁడు కోరెను వా రంగీకరింపక చెట్టుప్రక్కనుండియే యాతనిఁ దీసికొని పోవుచుండ "దుర్గా! దుర్గా! దుర్గా" యని సింహగర్జనమునఁ బిలిచెను పలుకలేదు ఆమె మరణించెనని నిశ్చయపఱచుకొని కోదండరామప్రభూ యని యొక్క కేకవైచి "ఓ కామగుచెటా? నా దుర్గను, నా బిడ్డను నేను బోషించుకొనలేని దినములలో నీవు నీడ నిచ్చి వారిని బోషించితివి దిక్కుమాలినదైన నా భార్య కళేబరము ప్రక్కనుండియే దానిని జూడకుండ నేను బోవుచున్నాను నీవట్టి దానవు కావు నీవింక నామె యొద్దనే కనిపెట్టుకొని యున్నావు నీవే నాకంటె ధన్యుఁడవు నీ కుత్తర జన్మమున మహాత్మున మగు జన్మము సిద్ధించునుగాక" యని నడచుచునే చెట్టును దీవించి కచ్చేరికిఁ బోయెను కచ్చేరిలో విచారణ యేమున్నది? "నీవు మా భటుని గంటముతోఁ గొట్టి చంపితివి నీకు మరణశిక్ష యేల విధింపగూడదో చెప్పుకొందువా" యని నబాబుగా రాయన నడిగిరి "ఓయబ్బ! గంటపుదెబ్బకే చచ్చిపోయినాఁడయ్యా! గట్టిగాఁ గొట్టనే లేదయ్యా! మాయబ్బ, ఎన్ని గ్రంథములు వ్రాసిన గంటమయ్యా! ముందు జన్మమున వాఁడు మంచి కవియై పుట్టును ఈడను మంచి మేలు పొందుటకే యాడకుఁ బోయినాఁడని నమ్మవయ్యా! మఱి నన్నేదో చెప్పుమంటి వెందుకు? నన్నడుగు టెందుకు? నీ యిష్టము వచ్చినట్లు చేసికోవయ్యా అడిగి యడిగి నీవేమాత్రము చేయఁగలవయ్యా? పో పో" యని కచ్చేరినుండి పోవుటకుఁ బ్రయత్నింప భటులాయనను బట్టుకొనిరి ఇంత గర్వి, ఇంత పొగరుబోతు, నింత దుర్మార్గుఁడు లేఁడని యచ్చటివారంద ఱనుకొనిరి ప్రజల యభిప్రాయముల సౌష్ఠవము, సౌభాగ్యము నిది ఈ యంశమునందే కాదు అన్ని యంశములందుఁ గూడ నిట్టిదే—అతని తల నఱుకవలయునని నబాబుగారు భటుల కాజ్ఞాపించెను "ఓయబ్బ! ఇంతే కద! ఈమాత్రానికి నన్నిడకుఁ బిలిపించు టెందుకయ్యా" యని యా బ్రాహ్మణుఁడు పలికెను భటు లాతనిని వధ్య స్థానమునకుఁ గొనిపోయిరి తలారి కత్తిచేతఁ బట్టుకొని యాతని మొగముగాంచి గడగడ వడఁకి నే నీ పనిని జేయఁజాలనని కత్తినావలఁ బాఱవైచెను ఏల నఱుకలేవని నబాబుగా రాతని నడుగ "అతని రూపము నాకేమో భయంకరముగా నున్నది నా చేతులాడకున్న" వని యాతఁడు నబాబుగారి పాదములపైఁబడెను "నీ వాతనిని నఱుకకుండువెడల నిన్ను ముందు వధింతుఁ"నని నబాబుగా రాతనిని బెదరించిరి అంత నాతఁడేమి చేయఁగలఁడు? గడగడ వడకుచు సుబ్బరాజుగారి కంఠమున బిస్మిల్లా యని కత్తి విసరెను కంఠము తెగలేదు మరియొకసారి చాఱవ తెచ్చుకొని వైచెను తెగలేదు "ఓయబ్బ! నీవలనఁగాదయ్యా భాగవతము తలమీఁదనుండగాఁ దల తెగువనియే యనుకొంటివటయ్యా! నీ బొందవడ! ఎక్కడనో యడవి మృగమువలె నున్నావు విను నీవేమియు గష్టపడకు వెనుకకు విఱిచి కట్టిన నా చేతులు విప్పవయ్యా భాగవతము తలమీఁదినుండి దింపుదును తరువాత సుఖముగా సుఖముగా నఱుకుదువు కాని—ఎందుకింత యోజన" అని సుబ్బరాజుగారు పలికిరి చేతులు విప్పుమని నబాబుగారు భటులకు సంజ్ఞ చేసిరి అంత సుబ్బరాజుగారు కొన్నిపాటి ప్రయాణమునుండి యా నిముసమువఱకుఁ దలమీఁదనే కట్టుకొనియుంచిన భాగవతమును దీసి, కన్నుల కద్దుకొని దూరముగనుంచి దానికి ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగ మాచరించి లేచి "కోదండరామప్రభూ!" యని బ్రహ్మాండ కటాహ మదరున టొక్క కేకవైచి చాపచుట్టగఁ గ్రిందఁబడి ప్రాణములు విడిచెను కత్తితో భటుఁడింక నరుకుట ఎందుకు? ఆతఁడెట్లు మరణించెనో? యని యందఱ కాశ్చర్యముగా నున్నది పరీక్షించి చూడగ నాతనినోటినుండి రక్త మొలికినది పిడుగుపడినట్లు కోదండరామప్రభూ యని యాతఁడు వైచిన కేకతో గొంతులోని రక్తనాళము తెగి యా రక్తపుఁ జుక్కలు వాయుద్వారమునఁ బోవుటచే మాపిరి యాడక నిముసములో మరణ మీతనికి సిద్ధించినదని యటనున్న వైద్యుఁడు Scientific Explanation (శాస్త్రీయ సమాధానమును) చెప్పి, తన పాండిత్యమందఱకుఁ దెలిసినదో లేదో యని యటు నిటు చూచెను పరమాత్ముని యాజ్ఞ యయినది కావునఁ బ్రాణములు దేహమును వదలిపోయినవని చెప్పగ నందఱకును దెలిసినమాట

సుబ్బరాజుగారు మరణించి రనుమాట చెవినిబడగనే కన్నుల కేదైనఁ గనబడెనో కడుపులో నేమైన గుబులు పుట్టెనోకాని గడగడ వడఁకి బారున నవాబుగా రేడ్చిరి వారి కంటె ముందుగాఁ గాఁబోలు వారి భటులేడ్చిరి అచ్చటి ప్రజ లందఱకంటె ముందుగాఁ గాఁబోలు నేడ్చిరి అంద ఱేడ్చుచున్నారు ఎందుల కేడ్చుచున్నారో ఎవ్వరు నెఱుఁగరు? ఏది? ఆ సమయమున నెవ్వరికైన మతు లున్నవా? చైతన్యము లున్నవా? గోలుమన్న రోదనముతప్ప నంతకంటె నేమియు లేదు అంతయుఁ దీఱిన తరువాత నేడ్చిన లాభ మేమి? సుబ్బరాజుగారి కథ విన్నవారికే కన్నులు చెమ్మగిల్లవలసి యుండగ నాయన కథను జూచిన వారికిఁ గడుపు చెఱువయ్యెననఁగ నాశ్చర్య మేమి? నవాబు గారేమో రామభక్తుఁడైనాఁడఁట అగుఁగాక రామభక్తు లెందఱులేరు వారిలో నాతఁ డొకఁడు నవ కోటి లింగాలలో నొక బోడిలింగము లెక్కయేమి? ఆర్యావర్తమున నా రామచంద్రమూర్తి మాహాత్మ్యమెఱుగని నరుఁ డెవ్వఁడు? నరునివఱ కెందులకు? కోతి నడుగు—కొండముచ్చు నడుగు—కాకి నడుగు—గ్రద్ద నడుగు అంతవఱకుఁ గూడ నెందులకు? చెట్టు నడుగు—పుట్ట నడుగు—జాతినడుగు—ఉప్పునడుగు—దేశమంతటను రామనామము శతకోటి జిహ్వలతో మాఱు మ్రోఁగుచున్నది రాముఁడు లేనిచోటేది? రామునిగూర్చి యొకానొకఁ డిట్లు పలికినాఁడు.

సీ వీధి పురాణంపు వేదికపై నీవు, పారాయణపుఁ బీటపైని నీవు
దృశ్య ప్రబంధంపుఁ దెరల సందున నీవు, స్మృతివార్త శ్రుతిఁ బడ్డ యెడను నీవు,
గొల్లసుద్దుల ఱేకు డొల్లలందున నీవు, యక్షగానపుఁ జిందులందు నీవు
చండాలు బుజముపై మొండితంబుర నీవు, తోలుబొమ్మల సంతగోల నీవు
పడుకగదుల గోడల నీవు భక్త హృదయ
రసనలను నీవు యాయావరతను నీవు—
సృష్టి నీమయమో? నీవు సృష్టిమయమొ?
యెట్లయిననేమి? రామ! రక్షింపుమయ్య!

# ములుగు పాపయారాధ్యులు

ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు

[1921 దుర్మతి సంవత్సరాదిసంచికనుండి]

సహజ పాండితీవైభవయుతుఁడును రెండవ భోజుఁడుననగు కృష్ణరాయుని యాస్థానమువలెనే వాసిరెడ్డి వేంకటాద్రి ప్రభువర్యుని యాస్థానము కూడ పాపయారాధ్యాది మహాకవులతో నిండారియుండెడిది వేంకటాద్రినాయని యాస్థానమం దష్ట దిగ్గజములను యెనమండుగురు పండితులు కలరు. మన సుప్రసిద్ధ మహాకవి పాపయారాధ్యులు కూడ వారిలో నొకఁడని కొందఱు చెప్పెదరు కాని యది యంత సరియైన దిగాఁ దోపదు. పాపయారాధ్యులు తా నొకచో—

సీ "వాసిరెడ్డి కులాబ్జ వనజాతులగు రాజ
సింహుల సన్నిధిఁ జెలిమిఁగాంచి"

అని చెప్పుటవలన నీ కవి యష్ట దిగ్గజములలోవాఁడుగాక, చెలిమి యనుటవలన నా బాల్య మిత్రుఁడని యూహింపదగియున్నాఁడు ఇంకేమన పాపయారాధ్యులు నాయన కా బాల్య మిత్రుఁడు పాపయారాధ్యుఁడు సంస్కృతాంధ్ర భాషా పారంగతుఁడు, సరస కవితా విశారదుఁడు ఈ మహాకవి సంస్కృతమునందు ఏకాదశీ మాహాత్మ్యమను చంపూప్రబంధమును రచియించి వేంకటాద్రి ప్రభువర్యునకు గృతి నొసంగి తదాస్థానమునం దభినవ కాళిదాస బిరుదమును వహించెను ఈ ప్రబంధము పీఠికనుండి యొక్క శ్లోకమును జూపుచున్నాను:

శ్లో. శ్రీ వేంకటాద్రి నృపతే ర్గుణరత్నరాశే
రేకాదశీ వ్రత విశేష కథా ప్రపంచః
చంపూ ప్రబంధతిలకో భజతి ప్రతీతిం
విద్వన్నుతా మతిశయోక్తి ధురా గరిష్ఠః

ఈ ప్రబంధమునందు వేంకటాద్రినాయని కథానాయకునిఁజేసి నాయని ఏకాదశీ వ్రత పరాయణత్వమును దాన దాక్షిణ్యాది గుణగణంబును రాజ్యపాలనా వైభవంబును చక్కఁగ నభివర్ణించినాఁడు వేంకటాద్రినాయని లక్ష్మీపురాధీశ్వరుఁడని జెప్పియున్నాఁడు కృష్ణాతీరస్థమగు చింతపల్లి గ్రామమునకు లక్ష్మీపురమను నామాంతర మున్నట్లు వాడుక గలదు నాయని పూర్వులు చింతపల్లిని రాజధానిగఁ జేసుకొనియుండిరి వేంకటాద్రి ప్రభువు క్రీస్తుశకము 1765 వ సంవత్సరమునందు జన్మించి, 1786—87 ప్రాంతముల వఱకుఁ గూడ నీ చింతపల్లిలో నుండినట్లును, పిదప నిజపరివార సహితముగ నమరావతిని రాజధానిగ మార్చుకొని యందు ప్రవేశించి యున్నటులను, దెలియవచ్చుచున్నది వారిది చింతపల్లిలో నిప్పటికిని శిథిలావస్థ నందియున్న గొప్ప కోట కలదు ఇంతియ కాక నాయని వంశస్థులలో గూడ గొంద ఱిప్పటికి నా గ్రామమందు నివసించియున్నవారు పాపయారాధ్యుని వంశస్థులలో గూడ కొందరు కలరు. దీనిఁబట్టి వేంకటాద్రినాయనికిని పాపయారాధ్యులకును చిరతరాబాల్యవర్ధిత స్నేహ మున్నట్లు దృఢపడుచున్నది వేంకటాద్రి ప్రభువర్యుఁ డమరావతిని రాజధానిగ మార్చుకొనిన పిదప నమరావతి యమరావతిని బోలి సమస్త వైభవములతో నిండియుండెను. ఆ పట్టమునం దిప్పటికిని యొక ప్రదేశమునకు నందనమని పేరు వాడుకగా నున్నది వేంకటాద్రిప్రభు వమరావతీశ్వరుఁడగుటవలన తన యాస్థాన పండితు లష్ట దిగ్గజములనియు దన విహారోద్యానవనమునకు నందనమనియుఁ దనకొలువుకూటమునకు సుధర్మ యనియుఁ దత్ప్రాంతమునం బ్రవహించు కృష్ణానదికి దివిజగంగ యనియు పేరులనుపెట్టిఁ గల్పించుకొని భూలోక దేవేంద్రుడై మహావైభవముతో రాజ్యపాలన మొనర్చినట్లు స్పష్టపడుచున్నది. వేంకటాద్రీంద్రుఁడు చక్కని భాషాజ్ఞానము కలిగి యుభయ భాషారసజ్ఞతాధుర్యుడై యనేక విద్వత్కవుల నాదరించి యనేక సంస్కృతాంధ్ర గ్రంథాధినాథుఁడై యభినవభోజుఁడను నన్వర్థ బిరుదమును నిర్వహించుకొనియెను జగత్ప్రసిద్ధుఁడగు నీ రాజేంద్రునిగూర్చి చెప్పవలయునవిన పెక్కు విషయములు కలవుగాని గ్రంథ విస్తరభీతిచే నింతటఁ విరమించి ప్రకృత విషయమగుటచేత పాపయారాధ్యుని గురించి విచారింతము.

ఈ కవి లింగధారి బ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు ఈతని తల్లి భ్రమరాంబ తండ్రి వీరనారాధ్యుఁడు గురువు శ్రీ శంభులింగస్వామి. ఈతని నివాసస్థలము ప్రథమమందు చింతపల్లి పిదప రాజసన్మానితుఁడై యమరావతియందు నివసించెను కవుల చరిత్రయందు ఈ కవిని గురించి వేమనారాధ్యులు సంగమేశ్వరాధ్యులు అని శీర్షికతో నించక వ్రాయబడి యున్న వేమనారాధ్యులు అనునది మూలపురుషుని నామము ఈ కవికి ములుఁగువా రని గృహనామము సుప్రసిద్ధము సంగమేశ్వరారాధ్యులు అని ఈ కవికి నామాంతరము కాని పెక్కు గ్రంథములయందు పాపయారాధ్యులు అనియే వ్రాసుకొనియున్నాఁడు సర్వమధురమునం దిట్లు గద్య పద్యమును వ్రాసికొనినాఁడు

చ ఇది యపరంజి సొమ్ముపయి నింపుగ కెంపులు చెక్కినట్టులో
ప్పిదముగ మింటితేర్వరులఁ బెద్దల నిద్దరఁ జెప్పు కబ్బమై
మొదవుల పాలతెమ్మ లన ముచ్చటలంగల ములుగు పాపయా
రదు లొనరించు సర్వ మధురంబును దొల్తటి విన్నపంబగున్

మఱియు నీ కవి తాను రచించిన గ్రంథములం దొక్కొక్క రీతి గద్యములను వ్రాసుకొని యున్నాఁడు సరస సహృదయానురంజనమునం దిట్లున్నది —గద్యము ఇది శ్రీ మదుభయ భాషారసజ్ఞ రససాగ్ర నృత్యన్నాటకాలంకార గ్రంథాంధ్ర ప్రబంధ బంధుర కవితా నిబంధన శ్రీ మద్వేమనారాధ్యవంశ పయఃపారావార రాకాసుధాకర పాపయారాధ్యాభిధాన విరచితంబగు సరస హృదయానురంజనమునందు ప్రథమాశ్వాసము వేమనారాధ్యచరిత్రలో

సీ పదపదార్థ నిబంధ బంధురంబుగ ధరా తల మెల్ల నెరుఁగ శంతను చరిత్ర
సరస శృంగారానుషంగముల్ రవణిఁ జూపఁగ నహల్యావధూ పరిణయంబు
ధీమజ్జన స్తవ్య ధీమజ్జనోన్మేషకరముగా నలరు ఘూర్జర చరిత్ర
లసదలంకార లాలన విశంకటముగాఁ బరగు నింద్రాత్మజా పరిణయంబు

గీ శతక పూజాస్తవంబు లతిసంఖ్య
మీనం వ్వ నీవు పొసంగించు సారకావ్య
రచన మాకెల్ల సమ్ముదార్ద్రతఁ బొసంగె
సరసరుచిసాంద్ర సంగమేశ్వర కవీంద్ర!

అని ఈ విధముగ నభిధానాంతరమును వ్రాసికొనియున్నను ప్రాయికముగా దేవీ భాగవతాది మహా గ్రంథములయం దీ పాపరాయాధ్యాభిధానమునే జెప్పుకొని యుండుటను బట్టి పాపయారాధ్యులనియే ఉదాహరించితిని వీరేశలింగకవిగా రీ కవిని గుఱించి ఇంచుక వ్రాసియుండిరని యుదాహరించితిని కాని వారికి కవుల చరిత్ర వ్రాయునాఁటి కీ కవి కుల గోత్రములైన సరిగా తెలియవని చెప్పుటకు సాహసింపవలసి వచ్చినది ఇదియు గాక, మఱికొన్ని చరిత్రములు కూడ వీరేశలింగముగా రిట్లు వ్రాసియుండిరి వారి సాహసపు వ్రాత యిం కొకటి కలదు "ఈ కవి కవిత్వము ప్రౌఢమైనదియే కాని వ్యాకరణదుష్టములిం దనేకములు కానంబడుచున్నవి" అని వ్రాసియుండిరి కాని పంతులుగా రెంచినటుల ఈ కవి కవిజన సామాన్యుఁడు గాక సకల శాస్త్ర పారంగతుడై సంస్కృతాంధ్రములయం దనేక ప్రబంధములను రచియించి కవిత్వమునం దభినవ కాళిదాసు అను నన్వర్థ బిరుదము వడసినవాఁడు ఈ కవి విరచిత గ్రంథముల నిట నుదాహరించుచున్నాను 1 ఏకాదశీ మాహాత్మ్యము (చంపువు) ఇది వేంకటాద్రినాయని కంకితము 2 కల్యాణ చంపువు 3 వేదాంతసార సంగ్రహము ఈ మూఁడును సంస్కృతమునందు రచియింపఁబడినవి ఈ గ్రంథ త్రితయ మతి ప్రౌఢమై విద్వత్కవిమనోరంజకమై కవిపాండిత్య ప్రకర్షమును దెలుపుచున్నది

ఇక నాంధ్ర ప్రబంధములు 1 సరస హృదయానురంజనము 2 శ్రీమతీ పరిణయమను నామాంతరముగల సర్వ మధురము 3 దేవీభాగవతము 4 వేమనారాధ్య చారిత్రము 5 అహల్యా సంక్రందన విలాసము 6 శంతను చరిత్ర 7 ఘూర్జర చరిత్రము 8 ఇంద్రాత్మజా పరిణయము మున్నగునవి వీనిలో సర్వ మధురము మూఁడాశ్వాసముల అచ్చ తెలుఁగు కబ్బము మిగిలినవి మిశ్రఫణితిని రచియింపఁబడినవి మొత్తముమీఁద నీ కవి సంస్కృతమునందును మిశ్రఫణితియందును అచ్చ తెలుగునందును గ్రంథములను రచియించి తన కవిత్వమును త్రివిధగతిని బ్రవర్తింపఁజేసెను శతకపూజాస్తవంబు లసంఖ్య సంఖ్య యనికవియె వాకొనియున్నాఁడు గాన నిఁక వాటికి పరిమితియే గాన్పింపదు వీనిలో 1 శంతనుచరిత్ర 2 ఘూర్జరచరిత్ర 3 ఇంద్రాత్మజా పరిణయము-ఈ గ్రంథ త్రితయ మెం దడగియుండెనో కన్నులఁ గను భాగ్యము కల్గినది కాదు మఱియు నీ కవి బహుళ గ్రంథ రచనా ధురంధరుఁడగుటయకాక సుమా రొక నూఱుమంది విద్యార్థులకు

విద్యాదాన మొసంగి తాను రచించిన కల్యాణ చంపువును పఠన గ్రంథముగఁ జెప్పినటు లీయన శిష్య ప్రశిష్యులవలన నీ కృష్ణా గుంటూరు మండలములం దందందు నభివ్యాప్తి కలిగియున్నది ఈయన ప్రశిష్యు లొక కొంద లిప్పటికిని గలరు వారివలన నీ మహాకవి యొక్క ప్రతిభా విశేషము లీ యా ప్రాంతముల వినఁబడుచుండును కాని వానికన్న కవివాక్యములే మనకు పరమప్రమాణములు వేమనారాధ్యచారిత్రమునందు వంశావ తార మున నిట్లున్నది —

సీ. శాంతి సౌజన్య వాత్సల్య దాక్షిణ్యాది గుణములు మూర్తిగైకొనె ననంగ
హరనేత్రదగ్ధ శంబరవైరి నరుఁడౌచు ధరణిలోపల రూపుఁ దాల్చె ననఁగ
సుర గురుత్వ మటుంచి నర గురుత్వము సేయ జగతి కేగిన బృహస్పతి యనంగ
తన పురాతన కవిత్వ స్థైర్య మొనగూర్పఁ దలఁచి పుట్టిన కాళిదా సనంగ

గీ. తగినవార లటంచు సద్ధరణిపతులు
నతు లొనర్చుచు పూజింప నవ్యవ్యస్త
హార ముఖ భూషణాదుల నందినాఁడ
రసన నను ముల్గు పాపయారాధ్య డండ్రుఁడు

సీ. సరస శేఖర తర్క శాబ్దికాలంకార సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి
సంస్కృతాంధ్రానేక సత్ప్రబంధ నిబంధ బంధుర కల్పన భరితయశుఁడ
[ దిన కర్మయుత మహా త్రివిధ లింగార్చనా యత్త చిత్తైక నిత్యచరుఁడ
షట్స్థలజ్ఞానాసు సంధాన కరలసత్పరమ శివాద్వైత పండితుండ

గీ. వేమనారాధ్య వంశాబ్ధి సోముఁడనుచు
జనులు వినుతింప నెగడితి జగములందు
విమల కౌండిన్య గోత్ర పవిత్ర ముల్గ
పాపయారాధ్య నామ విభ్రాజితుండ

మ. వను విద్వజ్జన జాల లాలిత వచో నైపుణ్య విస్ఫూర్తి గుం
ఫన ధారాళ కవిత్వ తత్వ కలనా పారంపరీ పారగున్
ఘన దైవజ్ఞ కళా విచక్షణ మనోనాళీకుఁ జేరంగ ర
మ్మని రావించి వచించె నంచితవచో మాధుర్య మేపారగన్

మ. వర పుంభావ సరస్వతీ చతురతా వాల్లభ్య సంసూచనా
కర పాతంజల వాగ్విశుద్ధ కవితా కల్హారమాలీ రసాం
కురిత స్నిగ్ధ నిబంధ బంధుర కథాంకూరాంకిత గ్రంథ క
ల్ప రతోత్సాహివి పాపయార్య సుకవీ! ప్రత్యక్ష శోభారవీ!

ఈ పద్యములవలనఁ బాపయారాధ్యుని గుణగణ మెల్లరకు దెలియుటయకాక జ్యోతిశ్శాస్త్ర పారంగతుఁడనియు మహా వైయాకరణి యనియు పాపయారాధ్యుని వాక్యము లనే వినుచున్నాము వినుటయేగాక కవిత్వమునందలి ప్రయోగ కౌశల్యము ఈయన పాండితీ వైభవమును జాటుచున్నది ఇంక నీ కవి శిఖామణినిం గూర్చి చెప్పవలయుననిన ననేకములు కలవు గ్రంథ విస్తరభీతిచే నింతట విరమించి ఒక్క విషయముతో నీ చరిత్రమును ముగించుచున్నాము పాపయారాధ్యులు పరమ భాగవతోత్తముఁడు ఈయన భక్తియంతయు దేవీపరమై యున్నది దేవీ భాగవతము నాంధ్రీకరించిన వారిలో నీయనయే ప్రాథమికుఁడు వేంకటాద్రి ప్రభువు గతించిన పిదప గొంతకాలమునకు తన వార్ధక దశయందు నొక కుమారుఁడు సంస్కృత భాగవతమును జదువుచుండఁ దా నొక బాలీసు నానుకొని వినుచు, నాశు ధోరణి మరియొక కుమారునకు నాంధ్రీకరణమును జెప్పి వ్రాయించి యాఱు మాసములలో సంపూర్తి నొనరించెను ఈయన రచించిన భాగవతమునం దెల్లయెడల భక్తిరసము వెల్లివిరిసియుండును పాపయారాధ్యులు తా నొకనాఁడు చాముండికేశ్వర్యాలయమునకుఁ బ్రదోష కాలమున దర్శనార్థమై పోవునప్పటికి నందలి యర్చకుఁడు తలుపులుమూసి పోయియుండెను ఆ సమయమందు భక్త్యావేశముతో—"ముక్తిద్వారము తల్పు దీయగదె చాముండా! జగజ్జీవనీ" యనెడు మకుటముతో నిరువదేడు పద్యము లాశుధోరణిఁ జెప్పునప్పటి కా జగదీశ్వరికిఁ గరుణ గల్గి తలుపులు తెఱచెనని చెప్పుదురు ఆ పద్యములలో నొకటిమాత్రము నిటు జూపుచున్నాము

శా. ముక్తాపాండుర హాస చంద్రికలు కెమ్మోవిం గుబాళింప మా
దృక్పాత్రయు విన్నవించి పతి కెంతోఁ బ్రేమఁ బుట్టించి ప్రా
గుక్తాశీ చరణాంగదా రవ సముద్యోతాంగివై వచ్చి నీ
ముక్తి ద్వారము తల్పు తీయగదె చాముండా! జగజ్జీవనీ!

పాపయారాధ్యుని గ్రంథములు ముద్రణాది సాధన సంపత్తిలేక ప్రచ్ఛన్నములై యుండుటనుబట్టి లోకమంతగా నీతని కవిత్వము నెఱిఁగి యుండదు కావున నీతని కవిత్వమును గుఱించి ఇంచుక ముచ్చటించి విడిచెదను పాపయారాధ్యులు కవిజన సామాన్యుఁడు గాక నిరుపమాన పాండితీ వైభవోపేంద్రుడు ఈతని కవిత్వమును విమర్శించి చూచిన నీతనికి నాంధ్ర మనిన నొక లక్ష్యములో నుండినట్లు గాన్పింపదు ఇంతమాత్రమున నీతని యాంధ్ర కవిత్వమున కేమేని కొఱత యుండెనా? కేవల మాంధ్రమందు గూడ నొక కావ్యమును రచియించెను కావున నుభయభాషా కవిత్వ విశారదుఁడగు నిమ్మహాకవి కవిత్వ మనర్గళ గంగాలహరివలె నిరాఘాటమై లలిత మృదు పదభూయిష్ఠమై సర్వాలంకారాలంకృతమై చదువఁ జదువఁ జవులు గొల్పుచు మనోహరమై యుండును ఈతని కవిత్వమునుండి యుదాహరణార్థము దిఙ్మాత్రముగాఁ గొన్ని పద్యముల నిం దుదాహరించియేయున్నాము ఆ పద్యములను బట్టి ఈతఁ డసమాన వ్యాకరణ విద్వాంసుఁడని స్పష్టపడక మానదు

# పుష్పాంజలి - శ్రీ కృష్ణ లీలాశుక కవి

మానవల్లి రామకృష్ణకవిగారు, ఎమ్. ఏ.

[1922 దుందుభి సంవత్సరాదిసంచికనుండి]

మందార మంజరీ స్యంది మకరంద రసాబ్ధయః
కస్య నాహ్లాదనాయాలం కర్ణామృతకవే ర్గిరః — గంగాంబ

సకలజన నిరంతరాస్వాద్యమగు కృష్ణకర్ణామృతము రచించిన మహాకవి యెవ్వఁడో యతనిశీల మెట్టిదో యేదేశ మతనిఁగని సాఫల్యము చెందెనో యతని పితృభ్రాతృకళత్ర పుత్రాదు లెవ్వరో యను సందేహ పరంపరలు విప్ర సమారాధనములందును బువ్వపుబంతులందును వెన్నెల పులగములందును బాఱువేటల వనభోజనములందును గృష్ణకర్ణామృతకారుని వాగమృతధారలు గ్రోలినవారు పొందకుండరు అతఁడు చింతామణి యను వేశ్యకై తన శీలమును దారవోసి తత్ప్రేమభరముచే జ్ఞానోదయము సెంది శృంగార సర్వస్వ రసాధిదేవతయగు శ్రీకృష్ణునిఁ బరమప్రేమమున భజించి యతనితో సాయుజ్యము పొందెనని కథలు చెప్పుదురు అతఁ డాంధ్రుఁడని మన మెల్లరము తలఁచియున్నారము కృష్ణవేణ్ణానదీతీరమున నమరేశ్వరము చెంత నొక మఠమున నతఁడు జీవించియుండెననియు శ్రీకాకుళ క్షేత్రమున నుండెననియు కొందఱును జెప్పుదురు ఓఢ్రులును వంగదేశీయులును శ్రీ పురుషోత్తమమగు జగన్నాథమున నతఁడు నివసించెననియు నతనియింట బిల్వవృక్షము మంగళాస్పదముగా నున్నందున నతనికి బిల్వమంగళస్వామి యని పేరు గలదనియు మొదలుగాఁ బెక్కు కథలు గూర్చి భాగవతమునఁ ద్రయోదశస్కంధము రచించి యతనిఁ బరమ భాగవతాగ్రగణ్యుఁడుగా నొనర్చి యర్చింతురు శ్రీ కృష్ణ పూజా పరమార్థులగు నోఢ్రులకుఁ గృష్ణుని లీలాశుకం బారాధనీయం బనుట యేమి వింత?

నేటి కాలమునఁ గవుల చరిత్రము మాత్రము చక్కఁగాఁ దెలిసికొని యొండు రెండు పద్యములు నోటికి రప్పించుకొనినచో నొక్కొకని కవితా సర్వస్వమంతయు గ్రోలినంత సంతోషము పడుచున్నారము ఇట్టి సులభ సంతోషులగు మనలఁ గీర్తిశేషులగు కవులు స్వర్లోకమునుండి చూతురేని తప్పక యామోదింతురు కావున నతని చరిత్రము విని తృప్తిఁ బొందుదము లీలాశుకుం డెవ్వఁడనుట యతని గ్రంథములు మఱికొన్ని లభింపఁగా నించుక వెలివడుచున్నది మన యాంధ్రులకును నోఢ్రులకును మాళవ ఘూర్జరులకును సైత మాశాభంగము కలిగింపఁజాలిన యతని జన్మస్థానము కేరళ దేశమునని చెప్పుటకు సిగ్గువడుచున్నాఁడను అతఁడు బాల్యముననే శంకరాచార్యులవలె సన్న్యసించినందున నతని ప్రియ సర్వస్వమగు "చింతామణి" భక్తజన చింతామణియగు కృష్ణుఁడేకాని చర్మసుందరియగు నాఁడుది కాదు తురీయాశ్రమవర్తియై కేరళమున భారత నదీ తీరమునఁ దిరునావా యను నామాంతరముగల శ్వేతారణ్యమున నతఁడు దనకాలమంతయుఁ బుచ్చెను ఆతని కృతులఁ జదువఁగా గంగా బృందావన ప్రాంతములఁ గొంతకాల మతఁడు విహరించియుండునని తలఁపవలసియున్నది. ఇతడుఁ మూఁడు వ్యాకరణముల నాచార్యుఁడనందగినంత పాండిత్యము నుపార్జించి సంస్కృత ప్రాకృత వ్యాకరణములకు వ్యాఖ్యలం గూర్చె దేవప్రణీతమగు దైవవ్యాకరణమునకుఁ బురుషకార మనువ్యాఖ్యయు, భోజదేవుని యష్టాధ్యాయికిఁ గృష్ణలీలా వినోదమను వృత్తియుఁ, వరరుచికృతమగు ప్రాకృత ప్రకాశమున కొక్కొక్క సూత్రమున కుదాహరణముగా గోవిందాభిషేకమను ప్రాకృత కావ్యమును మఱికొన్ని కృతులును లీలాశుకుని శబ్ద శాస్త్ర పరిశ్రమ ముద్ఘోషించుచుండును సుబంత తిజంత సామ్రాజ్యములను గ్రంథములు నితనివే యని నేను సందేహించెదను అవి భోజుని యష్టాధ్యాయి ననుసరించి సిద్ధాంత కౌముదివలె శబ్ద నిష్పత్తి ప్రదర్శకమగు గ్రంథములు "బుభుక్షితై ర్వ్యాకరణం న భుజ్యతే" యన్నట్లు భక్తిరసమున కేకఁటిఁ గొనియున్న మన కతని వ్యాకరణ రచనతోఁ బనిలేదు లీలాశుకుఁడు గోవిందాభిషేకమున నెనిమిది సర్గలు రచించి వరరుచి ప్రాకృత వ్యాకరణమునకు మార్గము చూపిన పిదప నతని శిష్యుడు దుర్గాప్రసాదయతి దానికి వ్యాఖ్య రచించి మఱియు నాలుగు సర్గలు త్రివిక్రమ వ్యాకరణ లక్ష్యముగా రచించి ముగించెను ఇతఁడు లీలాశుకునిఁ గూర్చి యేమనియె?

"కోదండమంగళవచోగదితే హి ధామ్ని
శ్రీ కృష్ణ దర్శనపరః కిల కర్ణభృత్యః,
జాతః క్రమేణ పరహంస పదే సితోస్మిన్
యోఽంకస్థిత స్త మవలోక్య జగామ తృప్తిమ్.
శ్రీ పద్మపాద మునివర్య వినేయవర్గ
శ్రీ భూషణం ముని రసౌ కవిసార్వభౌమః,
శ్రీకృష్ణరూప పరమామృత పానశీల
శ్చక్రే తదీయ చరితం బహుధా హితాయ"

అని వ్యాఖ్యా ప్రారంభమునను,

"శ్రీకృష్ణ లీలాశుక బద్ధకావ్యం
వివృత్య లోకస్య హితాయ పూర్వమ్,
తచ్ఛేష పూర్తిం చ పున ర్విధాయ
వివృణ్మహే ధోత్తరభాగ మేతమ్"

అని నవమసర్గ ప్రారంభమునను,

"ముక్తిస్థలాలయ శివాపద భక్తిలేశా
ద్దుర్గాప్రసాదయతిరి త్యభిధాం దధానః,
కర్తా స్వయం సుకృతమత్ర ఫలాన్యభీప్సుః
కృష్ణే ర్వయా వ్యధ విశుద్ధికరా మహాంతః"

అని గ్రంథాంతమునను జెప్పుకొనియె నడుమ నొకచో "చాప మంగళ గృహో యతీశ్వరః" అని లీలాశుకునిఁ బేర్కొనియె పై విషయము లాలోచింప నితని గృహనామము విల్వమంగళమనియు (విల్వ యవ గేరళ భాషలో వింటి సంబంధ మనుట) నితఁడు పద్మపాదాచార్యుని వంశమునో శిష్యవంశమునో పవిత్రీకరించెననియుఁ దోచుచున్నది ముక్తిస్థలము శ్వేతారణ్యమునకు దక్షిణమున ముక్కుత్తల యని భగవతీ క్షేత్రము పశ్చిమాంబుధికిఁ గొన్ని మైళ్ల దూరమున నుండును పబయో

రభేదమను న్యాయమున బిల్వమంగళ శబ్దము జనించి పిదప బిల్వవృక్షము పై దత్సంబంధమగు చిలుక కథలును బుట్టియుండునేమో! ఇతనికాలమెప్పుడని స్పష్టముగాఁ జెప్పుటకు వలనుగాదు క్రీ శ 1050 వఱకు నుండిన భోజుని యష్టాధ్యాయికి నితఁడు వ్యాఖ్య రచించుటయుఁ బురుషకారమున హేమచంద్రు నుదాహరించుటయు నితని గ్రంథముల విద్యారణ్యులు ధాతువృత్తిలోఁ బేర్కొనుటయుఁ జూడ సుమారు క్రీ శ 1250–1300 ప్రాంతముల నుండెనని యూహింపవచ్చును ఇతఁడు పెక్కు కృతులు నానా విషయముల రచించె అన్నిటిలో శ్రీకృష్ణుని స్తుతియే ముఖ్య విషయమై యుండును ఇతఁడు పూర్వోత్తర మీమాంసల నుత్కృష్టపాండితి గడించెనని యితని కేనోపనిషద్భాష్య వ్యాఖ్యానమువలనఁ దెలియును దాని పేరువలెనే నిక్కముగా నది "శంకర హృదయంగమ"యే ఈతఁ డీశానదేవుఁడను మహా తాంత్రికుని శిష్యుఁడు గావునఁ గృష్ణపూజా పరముగాఁ గ్రమదీపిక యను నొక తంత్ర గ్రంథము నిర్మింపఁగలిగెను

"ఈశాన దేవచరణా భరణేన
దామోదర స్థిరయశః స్తబకోద్గమేన
లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాంతరే "

అని కృష్ణకర్ణామృతమునఁ జెప్పిన ఇతని గురువగు నీశానదేవుఁడు తంత్ర పద్ధతి యను మహాగ్రంథమును రచించిన ఋషికల్పుఁడు అతఁ డాదిత్య ప్రజ్ఞుఁడను మహాత్ముని శిష్యుఁడు

"ఆదిత్యప్రజ్ఞ సంజ్ఞం య దాదిత్యా దధికం మహః
నిర్జితః సమదృష్ట్యైవ నిర్లోలం యేన మన్మథః
అర్జితై ర్యస్త కుసుమై రారా దారాధయన్ యయౌ"

నిర్లోలుఁడగు నతని సమదృష్టిచేతనే జయింపఁబడి మదనుఁడు స్వైతము తన యస్త్రార్థ మేరితెచ్చిన కుసుమముల నతని పాదములఁ బూజించిపోవు నంతటి యాదిత్యప్రజ్ఞముని శిష్యుఁడు—

"ఈశానదేవ ఇత్యాసీ దీశానో మునితేజసామ్
ఆస్పదస్య హి యస్యాసీ దశేష గుణ సంపదామ్
అద్వితీయ ఇతి ఖ్యాతి రాత్మ బుద్ధ్యైవ న కేవలమ్"

ఈశానదేవుఁ డాధ్యాత్మదృష్టిచేతను లోకము వారలకును నద్వితీయుఁడయ్యె వీ రిరువుర నాశ్రయించిన శిష్యులు—

"తయోరనుగ్రహోపాంగ సంక్రాంత జ్ఞానసాగరాః
సాగరా ఇవ గంభీరాః సంతి ధన్యా స్సహస్రశః"

అని పెక్కండ్రు విద్యాసాగరులవంటి యతులు కీర్తిస్తంభముల వంటి కృతులు రచించుట యచ్చెరువేమి?

"తయోరేవ కృపాపాత్రం కృష్ణలీలాశుకో మునిః
యదాశ్రమాంగణే నిత్యం రమంతే తంత్ర విస్తరా"

అని లీలాశుకుఁడు వారి శిష్యుఁడు పై కర్ణామృత శ్లోకములోని నీలీదామోదరులే యితనిఁ గన్న తల్లిదండ్రులు—

"తిలకం కులపాలీనాం నీలీతి నిలయం శ్రియామ్
యమళం జనయాంచక్రే యం చ కీర్తించ శాశ్వతీమ్"

పతివ్రతా తిలకమగు నీలికి లీలాశుకుఁడును గీర్తియు నవడలుగా జనించిరఁట మృత్యుభయములేని కీర్తి యను కూఁతురే యామె సౌభాగ్యమును శాశ్వతముగా నిలిపెను

'యస్య దామోదరో నామ పితా సవితృ సన్నిభః
అనృణస్య హి యస్యా స న్నధమర్ణా మరుద్గణాః"

ఇతని తండ్రియగు దామోదరుఁడు హవిర్భాగముల నొసఁగి దేవతల నప్పుల కాఁపులుగాఁ జేసికొనియెనఁట ఇతని మిత్రుఁడు భాగవతాది వ్యాఖ్యాతయగు రాఘవేశానయతి ఇతని మనస్సు—

"యస్య దక్షిణ కైలాస లీలా పరిణతం మహః
చర్చా చందన గంధేన సుగంధయతి మానసమ్"

అని దక్షిణ కైలాస మను కీర్తికన్న శ్వేతారణ్యమునఁ బ్రసన్నుఁడగు మృత్యుంజయస్వామి దర్శనముచే నిత్య వికసితమగుచున్నదని,

"కృష్ణలీలా శుకస్యాస్య కిశోర మధిదైవతమ్
స్తుతిరత్న మిదం బ్రూతే వేణువాది ముఖేందునా"

శ్రీ కృష్ణుడే మురళీనాద మధురమగు వాక్కున ఈ కవి ప్రశంస రచించెనని తన పుట్టువు నించుక ఇమ్మహాకవి స్మరించుకొనకున్న మనము సంశయ విభ్రమములపాలు గావలసివచ్చును. ఇతని కృతులు పెక్కు లుత్పన్నము లయ్యె. లభించిన వానిలో త్రిభువన సుభగ,కాలవధము, గోవిందాభిషేకము, గణపతిస్తుతి, కర్కోటకస్తుతి, రామచంద్రస్తుతి, అభవస్తుతి, కృష్ణ చరితము, కృష్ణబాలక్రీడ, బృందావనస్తుతి, కౌస్తుభమాల, క్రమదీపిక, శంకర హృదయంగమము, మొదలగునవియు, వ్యాకరణ గ్రంథములును ముఖ్యములు.

కథా నిర్వహణదక్షులగు మహాకవుల ప్రతిభకును మనస్సు కరంగి భక్తిపారవశ్యముచే "వాచవి లోనుగా నాడలి వాకిళులం బొడచూపు తీపులం ద్రోచి" భగవంతుని దివ్యాకార సౌందర్య ప్రవాహమున మునింగి యతని మహిమము నిలుపోపక కొనియాడు కవుల స్వచ్ఛంద కవితకును మహాంతరము గలదు. స్తుతిపరములగు కావ్యములలో విష్ణుస్తుతులే మృదు మధురపద సందర్భోచితములై హృదయావర్జకములై యున్నవి. దేవీ స్తుతులును మహేశ్వర స్తుతులును నిగూఢార్థ గంభీరములై ప్రౌఢోక్తి గుంఫ సంభృతములై బహుతంత్రవేత్తలకుఁగాని యన్యులకు నోరు మెదల్ప నెడమీయవు. "భగవదనుగ్రహ విశేషవాచా" విలాసుం డగు కాళిదాసుం డును దన చిద్గగన చంద్రికలో నొనర్చిన దేవీస్తుతియు బాలకుల పాండితి దర్ప దళనము గావించుచున్నది. గేయ ప్రబంధరత్నమగు గీతగోవిందము పాదాంత ప్రాసములతో మనోహరమై శృంగారరస పరిపాకబంధురమై పామరులకుఁ గృష్ణ సాన్నిధ్య సోపాన పరంపరకుఁ జేయూత యిచ్చుచున్నది. అతి నిపుణ పరీక్షకుల కందుఁ గొన్నిచోట్ల గవి శిల్పము వెల్లడియై యద్ది యించుక కృత్రిమముగాఁ గానవచ్చును. రూపగోస్వామి ప్రభృతుల కృష్ణ శ్లేషణమున భక్తి ప్రవాహపాతముతో శబ్ద తాండవము కలసియాడనోపదు. కృష్ణలీలాశుకుఁడు కృష్ణబాల క్రీడలే తలంచుచు గోప గోపీ జనంబులలోఁ దన్నుఁ గలుపుకొని పరిపక్వమై యున్నది యున్నట్లు చెప్పఁజాలు తన సహజ వాగ్ధోరణియు నూరకుండమిచే నేమైన వర్ణించుచుండఁగా దాను "వసుదేవ సుతసరోవరములో నోలాడు సనకాదిదివ్యహంసములలోన" నొక హంసయై కాషాయమాత్ర రాగియై విలసిల్లుచుండె. ఇతని కృష్ణస్తుతి మహిమము కర్ణామృతమున నెల్ల రెఱుంగుదురు. వేఱ కొన్ని యెడలనుండి కొంత యుదాహరించెదను. బృందారణ్యస్తుతిలో—

"దేవీ సరస్వతీ స్వైరం సేవావసర కాంక్షిణీ
దేవదేవ మియం ధన్యా సేవతాం దీవకీసుతమ్."

"కృష్ణస్తుతిసేవ ఎప్పుడెప్పుడు కలుగునో యని యువ్విళులూరుచున్న సరస్వతి యింక యథేష్టము సేవించి ధన్యురా లగుగాక" యని తెర యెత్తి చూపిన లీలాశుకుని దివ్య వచనములు వినఁగోరెడు కృష్ణభక్తులు చెవులారఁ గ్రోలుదురుగాక.

వందే బృందావనేంద్రస్య విశ్వనాథస్య శైశవమ్
వైభవోద్గంధి మాంగల్య కటాక్షోక్షిత దిఙ్ముఖమ్.
వందే కందర్ప సామ్రాజ్య బృందావనవనేచరమ్
బృందైరిందీవరాక్షీణాం బందీకృత మిత స్తతః.
అవిశంక మనంగసంకులాభి
ర్వనితాభి ర్వినతాభి రాత్తరాసమ్
కమలారమణం కిశోరవేషం
పరిపుష్య న్మమ చిత్త మభ్యుదేతు.
మధ్యే మధ్యే కృష్ణమాణిక్యమిశ్రా
మాలా కాచి ద్వల్లవీనాం సహస్రైః
చిత్తాభోగైర్భోగినాం ధన్యధన్యై
ర్జీయా దేషా దీర్ఘ మాఘ్రాయమాణా.

బృందావన వ్యసనిన స్తవ దేవ కృష్ణ
లీలాశుకేన రచితం నిచితం రసౌఘైః
ప్రత్యక్షరం పరిదుహన్మధు కర్ణయో స్తే
స్తోత్రం తదేత దనిశం విలిహంతు ధన్యాః

అని మొదలుగా నరువది శ్లోకములలోఁ గృష్ణుని రాసక్రీడ వృత్త విశేషములతో నిక్కని వర్ణించెను రాసక్రీడావర్ణనము పెక్కండ్రు శృంగార రసమనోజ్ఞముగా వర్ణించినను భక్తి ప్రాధాన్య ధన్యము గాదు విద్యాచక్రవర్తి యను మహాకవి రుక్మిణీకల్యాణమున రాసక్రీడ యత్యద్భుతముగాఁ దనవిద్యా గాంభీర్య మెఱుకపడ నొకసర్గమంతయు వర్ణించెను

శ్లిష్టైర్భయద్రుత వినిస్సరణోత్తరాణి
వ్యగ్రాగ్ర చంక్రమణవం త్యవికీర్ణరేణు
అర్ధక్రమ స్ఖల దుపల్బణ లంఘితాని
రేజుః పదాని సుదృశాం చలనూపురాణి
స్వే స్వే సహాభిసరణేప్ని నిరభ్యసూయః
ప్రేమద్రుతాంతరతయా పరనిర్వ్యపేక్షః
రూపేషు పార్శ్వయుగ సన్నిహితేషు విష్ణోః
గోపీజనస్య వవృతే మదనోపచారః

ఇత్యాది భావములు మనకుఁ గవితయుఁ బాండిత్యము నొసఁగుఁగాని తీవ్రముగా హృదయగ్రంథిని భేదించునా యని సంశయించెదను

లీలాశుకుఁడు తన రచించిన పద్యము లెల్లనుఁ గృష్ణప్రోక్తములనియే తలంచుచుఁ దన్నతనికి సర్వార్పణము చేసికొనియె కాలవధ కథ (మార్కండేయుని కొఱకు శివుఁడు యముని జయించుట) కృష్ణుడే యేమేని వినఁగోరిన గోపికలకుఁ జెప్పినట్లున్నది

" ఇత్యాత్మనా నిగదితం సకల వ్రజానాం
విస్మాపనాయ వచనామృత మాకలయ్య
అంతర్నిగూఢహసితేన జగత్త్రయస్య
నాథేన నిర్మిత మిదం శ్రవణామృతత్వం
మందస్మితస్నపితముగ్ధ ముఖారవిందం
మందానిలాకలిత కోమల కాకపక్షమ్
అంగం తథేత దఖిల వ్రజలోచనానాం
మాంగల్య మస్తు కిమతః పర మస్తి కృత్యమ్
పించావతంసరచనోచిత కేశపాశం
పీనస్తనీనయన పంకజలోభనీయమ్
మందార వర్షభరితం సురసుందరీభి
ర్మందం ముహుః క్వణితవేణురసాభిరామమ్
కించేద మద్భుతరసం చరితం పురారేః
శ్రుణ్వంతు . . . "

అని శివుని కథయుఁ గృష్ణుని నోటనే వినుచున్నాము యముని గర్వము సంహరించి శివుఁడు కోప ముపసంహరించుకొని విష్ణువుతో యథావిధి సుఖసల్లాపమునసుండ మహర్షివరులకు "రజత గిరిమీఁద హరిహరారాధనంబు" గలిగిన—

అఖిల మునిజనానా మంతరన్వేషణీయం
నిఖిల నిగమవాచాం విభ్రమైర్లక్షణీయం
నయనపథ ముపేతం మంగళానందపూరం
సపది తమనుమాయ వ్యాజిగీషు ర్మునీంద్రాః

అని జగత్సృష్టికి సితాసిత బీజరూపమగు నద్వైత ద్వయమును నొకసర్గమున మారిసీస్పృత్తరంధియు ముదితధ్రువలోఁ బాడుచుఁ గొనియాడి ధన్యులైరి

ఫణిఫణమణి లక్ష్మీపుంజమంజూకృతేన
ప్రతిభయ లలితాంగం దంతి చర్మాంబరేణ
మధుర మమర నారీ మంథరాపాంగలీలా
వ్యతిధురితవిహారాగార పీతాంబరేణ
గిరివర నిజ కన్యా లోచన చ్ఛాయపూరై
రపి చ భుజగహారై రాదృతం బాహుమధ్యే
నిచిత మురసి లక్ష్మ్యై దివ్య లీలారవిందై
రవిరత వన మాలా షట్పదాన్ వారయంత్యా.
సజల జలదనీలం శారదాంభోదశీలం
కబళిత నవనీతం కాలకూటానురాగి
ఘుసృణ మసృణవేషం ఘూర్ణితోద్భూమిభూషం
శరణ మిదమిదం నః శాశ్వతం ధామ భూయాత్
అవిచలిత తరంగోత్తుంగ గంగావతంసం
సమధుర మధుధారాసార సూనావతంసమ్
కలిత శశికలాంశుశ్రేణి సంచారగౌరం
రుచిర వివిధ రత్న ప్రోద్గతోద్గారశారమ్

అని మొదలుగా వర్ణనాస్తుతి స్వచ్ఛంద ధారామనోజ్ఞమని తలఁపవలయు శివస్తుతిలో లీలాశుకుఁడు శాంతరసోచిత భావములే కూర్చెను

త్వా మేకే ముకురాయమాణమనసః స్వామిన్ సమస్తాత్మనా
మన్యంతే కతిచి త్పునః పరిణతం వ్యస్తాత్మనా మన్వతే
అన్యే వ్యస్తతనుం సమస్తవపుషం జానంతి కేచి త్పునః
నవ్యస్తం న సమస్త మి త్యలమహో దూరేధియాం తత్పదమ్
దేవ త్వదీయ చరణాంబుజ భక్తి భాజాం
ధర్మార్థ కామగతయః సహ ముక్తిలక్ష్మ్య
దాస్యో భవేయు రితి చిత్ర మిదం నచే త్స్యాత్
బాణస్య వేశ్మని భవానపి వేత్రపాణిః
అస్తోకవిస్తరభరైరపి వాఙ్మయానా
మస్పృష్టసీమ భువనాద్భుత మాదిధామ
కిం బ్రూమహే కియ దిహ స్తుమహే మహేశ
కే వా వయం తవ గుణార్ణవవర్ణనేషు

అని యయత్న సిద్ధముగాఁ బ్రవహించు కవిత—

జిహ్వారసాయన సుధాగుళికా సుధానాం కర్ణావతంసరచనా చ కవీశ్వరాణామ్
విశ్వాధికస్తుతి రియం తవ దేవ కృష్ణ లీలా శుకస్య సహజా విజయాయ [భూయాత్

అని లీలాశుకుని కీర్తి లక్ష్మి విలాసమై యుండుట యేమి యచ్చెరువు? లీలాశుకాది యతీశ్వరులు, శృంగార రసభావమందును భగవంతుని లీలలు వర్ణించినప్పుడు కేవల మద్వంద్వులై సాక్షిపదభూతులై యుంటుజం జెఱుంగక తత్వజ్ఞానమాత్రతనులై హృదయ సంవాది యగుచచ్చెప్ప సంవిత్పరిస్పంద పరమానందభరితులై యుందురు వారికిఁ గాక మనయట్టి విషయోన్మజ్జననిమజ్జనులకుఁ దద్ధ్యానసమానమగు తత్త్వ విశేష మెఱుంగు బోలునే?

ఆర్ధోన్మీలిత లోచనస్య పిబతః పర్యాప్త మేకం స్తనం
సద్యః ప్రస్నుతదుగ్ధ దిగ్ధ మపరం హస్తేన సంమార్జతః
మాత్రా చాంగులి లాలితస్య చిబుకే స్మేరాయమానే ముఖే
విష్ణోః క్షీరకణాంబుధామ ధవళా దంతద్యుతిః పాతు నః

అని యిట్లు స్వభావోక్తి రమ్యముగా స్తుతించు కవి యొక జన్మమెత్తి మఱల జననీ స్తన్యపానము చేయఁగలుగునా? లీలాశుకుని ఈ బాలకృష్ణ స్తన్యపానలీలా వర్ణనము వినియుండెనేని రవివర్మ తన చిత్ర లేఖన కౌశలము చూపుచు మఱియొక చిత్ర పటమును మన కనుగ్రహించియుండును ఈ పద్యమునం దశ్లీల దోషము కల దందురేమో! ఈ దేహమున నీ జగంబున నించక కనుదెఱచి చూచిన వార లశ్లీలము జుగుప్సయు లేనియణువైనను గానఁజాలరు ఆ దోషములు దొలఁగిన మనము లీలాశుకునివంటి భాగవతులమే యగుదుము

"పర మిమ ముపదేశ మాద్రియధ్వం నిగమవనేషు నితాంతఖేదఖిన్నాః
విచినుత భువనేషు వల్లవీనా ముపనిషదర్థ ములూఖలే నిబద్ధమ్"

అని లీలాశుకుఁడు ద్వైతా ద్వైత శూన్యవాదాది పథభ్రమణ ఖిన్నులై దరిగానక యలయుచుండు జనులకు సులభముగా గోపికలు రోటికిఁ గట్టఁ గలిగిన యా పరతత్వమే యుపనిషత్తులు వెదకి వేసారిన పరలక్ష్యమని భక్తిరసపారమిత లోకమున కనుగ్రహించె లీలాశుకుని ప్రభావ మంతయు నుదాహరణములతో గ్రంథ రూపముగాఁ ద్వరలోఁ బ్రకటించుటయే యుత్తమమని దీని నింతటితో విరమించుచున్నాఁడ.




శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం (తెలుగు) *** శ్రీనివాస కళ్యాణం (తమిళం)

భగవాన్ బాలాజీ (హిందీ)

సిరిసంపదలు (తెలుగు) **** మురళీకృష్ణ (తెలుగు)

ప్రేమించి చూడు (తెలుగు)

రాబోవు చిత్రం

# పెళ్ళాడియాడు

నిత్యనూతనత్వమే మా ధ్యేయం

నిర్మాత: వి. వెంకటేశ్వర్లు *** దర్శకుడు: పి. పుల్లయ్య

# ఆదిపురుషుడు

## కొండిపర్తి వీరభద్రాచార్యులుగారు

[1923 రుధిరోద్గారి సంవత్సరాదిసంచికనుండి]

పూర్వకాలమున మనదేశము మోటుజాతులవారితో నిండియుండెననియు, క్రమక్రమముగా మధ్య ఆసియానుండి పలుతెగలవారు వేరువేరు కాలములందు వచ్చి యచ్చటి యాదిమవాసులను కొండలకు,గుట్టలకు, అడవులకుదరిమివేసి వాసయోగ్యములగు మైదానములను దామాక్రమించుకొని రనియు చరిత్రకారు లనేకులు వ్రాయుచున్నారు ఆర్యులు నట్టివారిలో నొకతెగవారని వారి యభిప్రాయము ఇందుకు భిన్నముగా ఆర్యులు స్థలాంతరమునుండి వచ్చినవారు కారనియు, వారెప్పుడు నీదేశముననే వెలసినవారనియు కొందఱు చరిత్రకారులు వక్కాణించుచున్నారు ఏదెటులనున్నను సుమారు నాలుగువేల వత్సరముల క్రిందట ఆర్యులు హిందూదేశపు వాయవ్యభాగమున నుండిరనియు, అప్పుడు వారొకజాతిగా గలిసి యైకమత్యముతో వెలయుటకు మారుగా దమలోదాము పోరాటములు సలుపుచు భిన్నభిన్నములగు కూటములుగ నుండిరనియు నందఱు నంగీకరించుచున్నారు

ఆకాలపు టార్యులు సంపూర్ణముగు సంఘీభావము లేనివారయ్యును, వారిచుట్టును నివసించుచుండిన యితర సంఘములకంటె సరళ స్వభావులును, దైవభక్తియుతులును, సాంఘికనీతియం దనురక్తిగలవారును, పరశ్రేయస్సహిష్ణుత కలవారునై యుండిరి ప్రతికుటుంబమును వేరువేరుగ నివసించుచుండెను ఆ కుటుంబమునకు మూలపురుషుడు అనగా తండ్రి సర్వాధిపతి తక్కినవా రందరును వాని యధికారమునకు లోబడి నడువవలయును ఆవులు, ఎడ్లు, గొర్రెలు వారిసంపద ఈ పశువులకు మేతయును, దమ కాహారమును నెక్కడ సులభముగ దొరకెడిదో యచ్చటికెల్ల పోవుచుండెడివారు వారికి స్థిరములగు నివాసస్థలములు లేవు వర్షకాలములందు కొండగుహలలోను, లోయలలోను, తలదాచుకొనుచు వానలు లేనప్పుడు బయళ్లమీదను, నరణ్యపరిసరములందును దిమ్మరుచుండిరి ఒక్కచోట తమ మందలకు దొరికిన మేత యైపోగానె మఱొకచోటికి బోవుచుండిరి ఇట్లు సంచారములు చేయుచు నొకకుటుంబ మొకపర్వతపార్శ్వమున జేరియుండ, ఆపర్వతమునకు మఱొకవైపున వేఱొండు కుటుంబము వసించుచుండవచ్చును అప్పుడు వారిమందలు వీరిమందలు నొకానొకచోట కలిసిపోయెడివి తగవులు పొసగెడివి సాధారణముగా శాంతముతోడనే వివాదాలను దీర్చుకొనుచుండెడివారు సఖ్యతతోనే యెవరోయొకరు స్థలాంతరములకు వెడలిపొయ్యెడివారు కాని క్రోధపూరితులై పోరి యొండొరుల నిర్జించుకొనుచుండుటయు నప్పుడప్పుడు పొసగుచునేయుండెడిది

ఒక్కొకసమయమున ననార్యు లగు మోటుజాతులవారితో యుద్ధములు వాటిల్లుచుండెడివి ఆర్యులు సామాన్యముగా సరళస్వభావులని చెప్పియున్నాము వీరితో దలపడుచు పడుచు వచ్చిన యనార్యు లటులగాక తీవ్రస్వభావులును, గఠినహృదయులునై యుండి వీరిని బాధించు చుండెడివారు కక్షలబలాబలము ననుసరించి జయాపజయములు వాటిల్లుచుండెను అరుదుగ మైత్రి పొసగుటయు గలదు

ఆ కాలపు ఆర్యులు నిరాడంబరజీవులు వారి జీవితావశ్యక పదార్థములు కడుంగడు స్వల్పములు శరీరమున ప్రాణములు నిలుపుకొనుట కవసరమగు నాహారము, శీతమునుండి గాచుటకు దగిన దుస్తులును నున్నచో తృప్తినందెడివారు పశుసంపదను మించిన సంపద వారికి లేదు లోహరూపమగు ధనము వారెరుగరు మిక్కుటముగ ఆస్తిని కూర్చిపెట్టుకొనుట వారికి తెలియదు ఒండొరుల బాధించుకొని సాధించుకొనుటకు దగిన దుష్ప్రేరణలు వారికి లేవు సుస్థిరగృహముల నిర్మాణమునకు వారు గడంగలేదు ఎచ్చట వీలుగనున్న నచ్చటి కేగెడివారు వారి నొక్కస్థలమునకు బంధించియుంచు పరిస్థితులును శూన్యములు అందుమూలముననే వేఱువేరు కుటుంబములకు మైత్రి గల్పించుకొనవలయుననిగాని, యొండొరుల సహాయము చేకూర్చుకొనవలయు ననిగాని, పరస్పర సానుభూతితో పెద్దపెద్ద సంఘముల నిర్మింపవలయు ననిగాని, వారిని ప్రేరేపించు పరిస్థితులు మొదట లేవయ్యెను ఇందులకు మారుగా వారిని వేరువేరుగా నుంచు పరిస్థితులే మెండుగ నుండెను సంఘబాహుళ్యమైనకొలది వారి కొక్కచోటనుండుట యసంభవమగు చుండెను అందరికి నాహారము దొరకుటయు, నందరిమందలకును మేత దొరకుటయుఁ గష్ట మగుచుండెను పరుల సంపర్కము లేకుండ దమను గాపాడుచుండుడనియే ప్రతికుటుంబమువారును దేవుని ప్రార్థించెడివారు ఋగ్వేదమును బరిశీలించిన నప్పటి యార్యుల సంఘస్థితియు జీవితాదర్శములును తెల్లము గాగలవు

ఈస్థితి చాలకాలము సాగినది జనసంఖ్య హెచ్చుచు రాగా కుటుంబములు పెరుగుచు రాగా వారు ద్రిమ్మరుటయు నెక్కువయ్యెను క్రమక్రమముగా విశాలతరప్రదేశములకు చేరిరి పెద్దపెద్ద వీళ్ళుగల చోట్లకు చేరిరి ప్రవాహతీరములకు చేరిరి అక్కడ ఒక్కొక్క కుటుంబమునకును, వారిమందలకును వసతు లమరుటేగాక రెండుమూడు కుటుంబములు సుఖముగ జీవింపగలిగిరి వైరములు, స్పర్థలు లేక మనగల్గిరి అతిసంచయ పద్ధతి లేనివారు గాన నొకరు సేకరించి పెట్టుకొనిన దానిని మఱొకరు రపహరించుట సంభవింపలేదు అందరికిని జాలినంతయాహారము సులభముగ లభించుటచేత వారు వెంటనే స్థలాంతరములకు బోవలసిన యావశ్యకత తొలగినది చిరకాల మొక్కచోట గలిసిమెలిసి యుండు రెండుమూడు కుటుంబములకును మైత్రి యేర్పడినది పరస్పరానురాగము సిద్ధించినది కొన్నాళ్ళకే రెండుమూడు కుటుంబములు నొక్కశ్రేణిగ గూడుచువచ్చిరి పూర్వ మొక్కొక్కకుటుంబ మితరకుటుంబములయెడ వర్తించినటుల నిప్పుడు ఒకశ్రేణి యితర శ్రేణులయెడ వర్తింపసాగెను కాలక్రమమున శ్రేణుల పెరుగసాగినవి ఇదివరలో ప్రవాహమున కూడుచు విడిపోవుచు నుండు పుడకలమాదిరి ఒక్కస్థలమునగూడుచు,నొండొరులతో బంధములులేక నిశ్చింతగా విడిపోవుచు వచ్చిన కుటుంబములు పెద్దపెద్దశ్రేణులుగా నేర్పడినవి అంతసులభముగా విడిపోజాలకుండెను

శ్రేణులలో జనము హెచ్చుగ నుండుటచేతను, వారు సులభముగా విడిజాలపోక యొకేస్థలమున జిరకాలము నివసించుచుంటచేతను, స్థిరతరనివాసస్థానము లేర్పడసాగెన్మరియు వారందరి యాహారపానీయములకై యన్ని ఋతువులందును ప్రకృతిని నమ్మియుంటకు వీలులేదయ్యెను పదార్థముల సేకరించి పెట్టుకొను నాచారము సాగినది పదార్థముల యుత్పత్తింగూర్చి శ్రద్ధవహింపవలసినవారైరి ఇందుకొరకై వారు పంచభూతముల రూపమున ప్రకృతిశక్తుల ప్రసాదము నర్థింపవలసినవారైరి ఎండవానలు గాడ్పులు నీటిధారలు వీరికష్టసుఖములకు మూలాధారములై పూజనీయములైనవి వీనియన్నింటికి నిలయమగు తమనివాసస్థానము సకలేప్సితార్థప్రదాయినియై యుత్తమ దేవతయై వెలసినది తల్లి బిడ్డకువలె జన్మస్థానము ప్రధానపోషకురాలుగ నుండెను మరణానంతరము సుఖముల నిచ్చు స్వర్గముకంటెను నుత్తమముగ గ్రహింపనయ్యెను జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసియని వారు గానము చేయుచుండిరి

ఇప్పటికి కొన్ని స్థిరావాసములును కొంతకొంత స్థిరచరాస్తియు నేర్పడినవి ఏదినమున కాదిన మాహారపదార్థములను సంపాదించుకొనుటకు మారుగా కూర్చి పెట్టుకొనిన దాని ననుభవించు వసతు లేర్పడినవి మమకారలోభములు పెరుగసాగినవి ఈ గుణములు మత్సరములకు దారిచూపినవి ఒకరియాస్తిని జూచి మఱొకరు మాత్సర్యమూనుట, తస్కరణములు సాగినవి క్రమముగా కుటుంబములకు గుటుంబములకు శ్రేణులకు శ్రేణులకు గలహములు తలసూపినవి ఇట్లు వీరిలో వీరు గలహించుటయేగాక వీరి నివాసములకు పరిసరములందు నివసించు ననార్యులదాడులును హెచ్చుపెరిగినవి స్థిరచరాస్తుల శ్రేణులకు గలహములు తలసూపినవి ఇట్లు వీరిలోవీరు గలహించుటయేగాక వీరినివాసములకు పరిసరములందు నివసించు ననార్యులదాడులును హెచ్చుపెరిగినవి స్థిరచరాస్తులతోపాటు రణములు, జయాపజయములు, కక్షలు, పరస్పరద్వేషములు, ఈ ద్వేషముల సాధించుకొను నిమిత్తము వేర్వేరుతెగలవారికి మైత్రి చిత్రవిచిత్రములుగ సాగినవి పూర్వ మున్న సంతుష్టి, శాంతి, యానందము దూరములైనవి మరియు వానియందాసక్తియు పెరిగినది

సఖ్యభావమును బెంచుకొని యొండొరుల క్షేమమును బాటించుచు కొన్ని నీతులను రచించుకొని సంఘనిర్మాణమునకు గడంగిరి సంప్రదాయసామరస్యము గలవారికి మున్ముందు సఖ్యత సమకూరగలదు కావున వేర్వేరు ఆర్యశ్రేణుల తా మొకజాతి యని నిర్ణయించుకొని తమలో దేశకాలముల ననుసరించి యుద్భవములైన భిన్నభిన్నాచార సంప్రదాయములయెడ సహిష్ణుతయు, పరస్పరసానుభూతియు, గౌరవమునువహింప నిశ్చయించుకొనిరి సమయానుకూలములగు మార్పులను సవరణలను గావించుకొని యార్యసంప్రదాయము నొకదానిని నిరూపించుకొనిరి ఈ మహార్యజాతి నిర్మాణమునకు మూలపురుషుడై, వివిధ శ్రేణుల సఖ్యముగూర్చి, యందరి భక్తిగౌరవముల జూరకొనిన మహనీయుని చారిత్రము సర్వత్ర పూజనీయమనుటకు సందియముండదు. వీని చరి

తము ఋగ్వేదమున గాననగును వీనిచే గావింపబడిన మహత్కార్యములు ఐతరేయ బ్రాహ్మణమున వర్ణితములై యున్నవి ఈ మహాపురుషుని నామము భరతుడు భరత డను నామముగల వీరులు మనగ్రంధములలో ననేకులు గాన్పించుచున్నారు వారిలో నీతడు ప్రధముడును మహార్యజాతి నిర్మాణకుండునై యున్నాడు కావున వీనిని ఆది భరతు డని ప్రశంసించియుంటిమి

భరతడు జన్మించునాటికి ఆర్యశ్రేణులు అనేకము సింధుగంగా నదీయాశయములు నచ్చటచ్చట స్థిరనివాసముల నేర్పరచుకొనియుండిరి వానియం దర్యంతము నభిమాన మును గుదుర్చుకొనిరి తమ యున్నతికిని గౌరవమునకును నవియే మూలాధారములని గ్రహించిరి ఎవరికివారు తమజన్మస్థానముల స్వార్థమునకన్న మిన్న యని గానము చేయు చుండిరి వానిని పూజింపుచుండిరి కాని వీరందరికిని సమష్టిభావము గుదుర్చుట సులభ మైనపని కాదు వీరందరునొకే కూటమునుండి ప్రభవించినవా రైనను తామందరు నొక్కమూలము నుండి యుద్భవించితి మను జ్ఞానము వారికి లేదు పూర్వమును మరచి యుండిరి ఏక సంప్రదాయము కలవారయ్యును కాలానుసరణిని వారి నావరించియున్నవరి స్థితులనుబట్టి కల్గిన కించిద్భేదములను గొండంతలుసేసి సంఘీభవించుచుట కొల్లకుండిరి

భరతుడు దేశాటనముచేసి యాయా యార్యశ్రేణుల పెద్దలతో గలిసి సంభా షించి, వారివారి యాచారవ్యవహారముల విమర్శించి, పైపైన పెరుకొనిన భేదము లెన్ని యున్నను వానియడుగున బరగు నేకవరత్వమును నిరూపించి ప్రకటించి వివిధ శ్రేణులవారికి సమష్టిభావమును బురికొల్పెను వారిసంప్రదాయమునందలి మూలభావము లెవ్వియో, ప్రధానాంశము లెవ్వియో, అప్రధానాంశము లెవ్వియో విశదించిచూపి యందరి దృష్టిని ప్రధానాంశములపైకి ద్రిప్పగల్గెను అప్రధానములను గొన్నింటి మార్చియు, గొన్నింటి సవరించియు, గొన్నింటి దొలగించియు నవీనార్యసంప్రదాయము నొకదానిని సర్వాంగసుందరముగ బయలుదేరదీసెను ఎంతయో కష్టపడెను వాని కష్టము ఫలించి నది సింధునదీయాశయమున నెల్ల గల యార్యశ్రేణుల నతడొక్క మహాజాతిగ సమ్మే ళనము గావింపగల్గినాడు

వేర్వేరు కుటుంబము లేకమై శ్రేణులుగట్టి జీవించుట కేది యాధారభూత మయ్యెనో ఆజన్మస్థానాభిమానమునే భరతుడు ముఖ్యాధారముగ గ్రహించెను, ఆజన్మ భూమియొక్క పావనవిగ్రహమునే ఘనతరముగ నొనర్చెను అదివరకు మి ఎల సంకుచితమై పూర్ణతయేలేని యాకారమున కితడు అవయవస్ఫూర్తి గావించి యొక దివ్యసుందరవిగ్రహమును నిర్మించి వారియెదుట ప్రతిష్ఠించెను అందరును సమష్టిని పూర్ణాభిమానముతోడను, భక్తిశ్రద్ధలతోడను నర్చించుట కనుకూలముగ నొర్చెను ఆ సంపూర్ణసుందరవిగ్రహమున కొకనామము కావలెను గదా నామరూపముల ననుసరిం చియే జగత్తు వెలయుచున్నది ఇవి లేనినాడు జగమే లేదు నామరూపములనువిడి వడి .యుండజాలవు నామములేనిది రూపముగాని, రూపములేనిది నామముగాని స్మరణీ యము గాజాలదు ఇప్పుడే సంఘీభవించిన వేర్వేరు శ్రేణులందరికిని హితవుగ నుండగల నామ మేది? అంతకుపూర్వము కొన్నికొన్ని శ్రేణులవారు తమ నివాసస్థలములకు జంబూ ద్వీపము, ఆర్యావర్తము, సప్తసింధువు, మొదలుగాగల పేరుల బెట్టి వ్యవహరించుచుండిరి సింధునదీయాశయమంతయు నీ నామముచే గ్రాహ్యమగుచుండెను కాని వీనిలో దేనికి ప్రాముఖ్యము నిచ్చుట యనుప్రశ్న గలుగ నూతనోపపాదన బయలుదేరినది దాని నంద రును మహానందముతోడ స్వీకరించిరి "భారతవర్షము" అనునదియే యిది! చెల్లా చెదరై యుండి, దుర్బలములై మనుచున్న తమతమ శ్రేణుల నన్నింటిని సమ్మేళనము గావించి యొక్క మహార్యజాతిని నిర్మించి తమనందరిని గణనీయులుగ నొనర్చిన భరతుని కింతకంటె వారు కృతజ్ఞతను జూపగల యుపాయ మేముండగలదు! అప్పటినుండి యార్య నివాసము లన్నింటికిని సమష్టినామము భారతవర్షమై పరగెను భారతవర్ష మనగా భరతుని నాయకత్వముక్రింద సమ్మేళనము గాంచిన ఆర్యశ్రేణులన్నియు నివ సించు సమష్టిభూభాగము

భరతుడు మహావీరుడు సప్తసింధువు నాశ్రయించియున్న యార్యశ్రేణుల నొక్కటిచేసి వారందరికి నాయకుడై క్షాత్రధర్మమును నెలకొలిపినాడు నాయకుని శ్రేష్ఠత్వము వానినాయకత్వము నొప్పుకొని వర్తించునందరికిని క్షేమము సమకూర్చుట ననుసరించియుండును అందరి కష్టములను దనవిగ భావించి వాని నివారణ తనవిధిగ నెంచి యతడు వర్తింపవలసియుండును నాయకుడనగా నందరి పొగడ్తలను, సమ స్కృతులను నందగోరువాడుకాడు అందరి కొఱకు పాటుపడువాడు అందఱికి సేవ చేయు వాడు సర్వమాన్యుడగు సేవకుడని యర్థము భరతు డట్టి నాయక శ్రేష్ఠుడు వాని నాయకత్వమున జేరినవారి నావరించి యనేకముగ అనాగరక జాతు లుండెను వారివలన నార్యశ్రేణులకు పెక్కు ఇక్కటులు మూడుచుండెను ఈయనార్యులు వీరి గోవులను, పంట లను,పశువులను,స్త్రీలను సయితము దొంగిలించుకొని పోయెడివారు ఆటంకపరుపబడినప్పుడు ఘోరయుద్ధము సలిపి క్రూరముగ బాధించెడివారు బుద్ధికుశలతయం దెట్లున్నను పశు బలమున ననార్యులు బలిష్ఠులుగ నుండిరి కేవలము సరళ మార్గమున బోయెడి యార్యులను మాయోపాయముల బన్ని భంగపరచుచుండెడివారు వీరినే దస్యులు, రాక్షసులు, దైత్యు లునని యార్యులు వ్యవహరించుచు వచ్చిరి వీరితో చలపడి వీరిని నిర్జించుట భరతునకు ప్రధాన విధిగ నేర్పడినది

కావున భరతుడు కొంత యోధగణమును సిద్ధపఱచెను రణనీతి ప్రచారము గావించెను యుద్ధవీరులకు శిక్షణము నమర్చెను దస్యులతో సంగ్రామముల సలిపెను విజయముల భగవంతుని కర్పించుచు యాగములు సలిపెను సిద్ధపరచె ఈతడు జయించిన కిరాతులు, హూణులు, యవనులు పౌండ్రులు మొదలగు ననేకజాతులవారిని ఆర్యసంఘ మున జేర్చెను వారిని అనేక విధముల సంస్కరించెను ఈతని శిక్షణ ధర్మము వ్యాపించి నంతవరకు దేశమున కంతటికిని ఆర్యావర్తనమను నామ మమరినది ఆర్యులును వారితో చెలి సఖ్యము గావించుకొనిన ప్రజ లందఱును ఈ దేశభాగమును ప్రబలమగు నభిమాన ముతో జూడగల్గిరి అందరి దృక్కులును ప్రేమ గౌరవ పూరితములై భరతునిమీద కేంద్రీకరించుచుండెను భగవద్భక్తి పూరితుడును, నిర్యచూడామణియునగు నీతడు ప్రబల యైకమత్యమును, పరస్పరాభిమానమును నొక్క వ్యష్టి నరునిపై నాధారపడి యుండకుండ, వారి సకల కష్ట సుఖములకును నైశ్వర్యములకును నాలవాలమగు నివాస భూమిపై స్థిరముగ స్థాపితమగునటుల గావించెను మాతృభూమిని దైవముగ ప్రక టించెను ఆ దివ్యభూమిని వర్ణనచు స్తోత్రములం దిమిడ్చెను అమదినారాధనయం దీ స్తోత్రపారమును విధిగా నిర్ణయించెను ఈ పూజా విధానము స్థిరమగుటకు ప్రజా సామాన్యమునందు ప్రచారము చేయవలయును కావుననే ఆర్యులు తమ నివాస భూమి యొక్క దివ్యమంగళ విగ్రహమును సమగ్రముగ వారి యెదుట ప్రతిష్ఠించి, దాని నిట్లు ధ్యానము చేయుడని విధించిరి

"ఇమం మే గంగే యమునే సరస్వతి
శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా
అసిక్నియా మరుద్వృధే వితస్తయా ర్జీకీయే
శృణు హ్యాసుషోమయా"

దీని భావ మేమనగా ఓ గంగా యమునా సరస్వతి శుతుద్రి పరుష్ణా నా ప్రార్థ నల నైకొనుడు అసిక్నీనదితో గలియు మరుద్వృధా, ఓ వితస్తా, సుషోమానదితో గలియు ఆర్జీకియా నా ప్రార్థనల నాలకింపుడు" ఈ స్తోత్రము నార్యులెల్లరు నను దినము పఠించెడివారు

ఈ స్తోత్రముకంటె నప్పటి ఆర్యుల మాతృభూమిని సమగ్రముగ ప్రదర్శింప జాలునదియు శ్రేష్ఠమునగు సులభోపాయ మేమి యుండగలదు ఈ దేశ మాతృ పోష ణమున నున్నవారంద ఱొక్క కుటుంబము వీరందరికిని భారత వర్షము మాతృదేవత స్వర్గముకంటెను గరిష్ఠురాలు దేశాభిమాన మిట్లు పావనతమ మగు మత ధర్మముగ నేర్పడినది

ఇట్టు లార్యులు స్వదేశమును దేవతగా భావించి ధ్యానించుట క్రొత్తకాదు అంతకు పూర్వము సింధునదీయాశయమున మాత్రమే యార్య నివాసము లేర్పడియున్న ప్పుడు దానిని "ఆర్యావర్త" మని పిలుచుచు మహా పుణ్యభూమి యని పూజించెడివారు ఆ కాలమున దాని నిట్లు వర్ణించిరి

"శతద్రుశ్చ విపాశాచ తృతీ యేరావతీ తథా।
చంద్ర భాగా వితస్తాచ సింధుః షష్ఠా వహిర్గిరేః"

ఆది భరతుడు ప్రచారములోనికి దెచ్చిన ఈ దేశ మాతృ పూజా విధానమే భారత దేశ స్వరూప వికాసమునకు దరువాతనుగూడ నాధారణలో నుంచబడినది ఈ మహా పురుషుని నాయకత్వముక్రింద సుస్థాపితమైన సూత్రమే వాని తదనంతరము విశాల తరదేశమున వ్యాపించినప్పుడు ఆర్యులు ప్రయోగించి ఈ మాతృమూర్తిని సంపూర్ణ వికాసము గలదానిగ నొనర్చిరి దక్షిణ దేశమున గూడ ఆర్యులు చొచ్చినప్పుడు ఈ దేశ భాగమును గూడ నొక యంగముగ గ్రహింపజాలిరి ఇంకొక విశేషము గలదు ఆర్యులు క్రొత్తగా నాక్రమించిన దేశములం దదివరకే నివసించుచున్న ప్రజలను సదా శత్రు లనుగ భావించి వారిని నాశము చేయజూడక, తమ సంప్రదాయము నంగీకరించినచో వారిని గూడ దమలో జేర్చుకొనుచు వచ్చిరి వారి యాచారములను గూడ గౌరవించుచు వచ్చిరి ఇటు లనేక జాతుల వా రార్యులలో గలిసిపోయి అందరు నార్యులమని చెప్పుకొను చుండిరి ఆంధ్రులు ఆర్యులగుట కీ సూత్రమే ఫలించినది ఇట్లు క్రొత్తగ జేరినవారి ప్రాముఖ్యమును నిలువబెట్టుటకు మాతృమూర్తిని పూర్ణవికాస కలితముగ నొనర్చి,

"గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు"

అని ఆర్యు లనుదినమును పఠించుచు ముఖ్య నదుల నెల్ల నాహ్వానించి పూజించు చున్నారు మన కృష్ణా గోదావరి నదులు ద్రావిడుల కావేరీ నదియు స్తోత్రమున జేర్ప బడినవి క్రమ క్రమముగా, ప్రధానములగు పర్వతములును, తటాకములును, నగరము లును గూడ ధ్యాన శ్లోకములం దిముడ్చుట చేకూరినది అఖండ భారత మాతృ స్వరూ పము సమష్టి నందఱికిని ధ్యేయమై వెలుంగుచున్నది దీనికంతకును మూల పురు షుడు ఆది భరతుడు ఆతడే ఈ విశాలతర భూఖండమున నివసించు నన్ని జాతులను, జాతి మత వర్ణభేదము లేక యొక్క మహా కుటుంబముగా జేర్చి యొక్క మహామాత నాశ్రయించియుండు దివ్యమార్గము నేర్పరచియున్నాడు ఈ సూత్రము నంగీకరించి ఆధునిక భారతీయులు హిందూదేశము నాశ్రయించియున్న సమస్త జనమును, హిందూ మహమ్మదీయ, పార్సీ, క్రైస్తవాది మత భేదములులేక, ఐరోపా, యమెరికా, టర్కీ, గ్రీసు, ఇండియా యను భేదములును లేక ఈ దేశమున నివసించుచు,ఈ దేశమాత నారా ధించుచు, ఈ దేశ క్షేమమునకై ఆత్మార్పణము గావించి ప్రవర్తించుచు నందరను సోదర ప్రజగా భావించి మహానందమును పొందనగును ఇట్లు దలపోసి ఆది భరతునకు మన మెంత కృతజ్ఞత జూపవలసియుండునో వాని స్మృతిని మన మెట్లు గౌరవింపవలసి యుండునో నా సోదరులెల్లరును యోచింపవలయును

# దేవాలయములు

## వల్లూరి సూర్యనారాయణరావుగారు

**[1924 రక్తాక్షి సంవత్సరాదిసంచికనుండి]**

మనదేశములో దేవాలయము లేని గ్రామమే లేదు అట్టి గ్రామమేదైన నున్న యెడల, అక్కడ మంచి తీర్థము కూడ తీసికొనగూడదని పెద్దలు చెప్పుదురు సాధారణముగా ఈ దేవాలయములకు భూములమీదగాని ప్రజలవలనగాని వచ్చు నరుంబడి అర్చకుని జీవనమునకును నిత్య నైవేద్య దీపారాధనలకే చాలదు ఇప్పుడిప్పుడు కొన్ని జిల్లాలలో దేవాలయపు భూములు బాగుగా ఫలించుచుండుటచేత అనేక దేవాలయములకు సాలునకు వేయి మొదలు పదివేల రూపాయీలవరకు ఆదాయము వచ్చుచున్నది కాని, యిదియంతయు పూర్వకాలములోవలెనే, తామే అనుభవింపవలయునని అర్చకుల వాదన ఇవి దేవునివిగాని అర్చకుల సర్వీసు ఈనాములు కావనియు అటులైన యెడల భోగమువాండ్రు, భజంత్రీలు, స్వస్తివాచకులు మొదలగు స్వామి నౌకర్లకు పట్టా లిచ్చి నట్లే వీరికిని పట్టాల నిచ్చియుందురనియు, దేవుని నిత్య నైవేద్య ధూపదీపారాధన ఖర్చులలో అర్చకుని భూతాది ఖర్చులు చేరేయున్నవనియు నిటీవల హైకోర్టువారు తీర్మానించియున్నారు అర్చకుడు లేనిదే దేవునికి అర్చనయే జరుగదు గనుక నితనికి ప్రత్యేకించి సర్వీసు మాన్యములు ఎక్కడనోగాని వేరుగా నీయబడియుండలేదు కాబట్టి అర్చకుని కుటుంబమువారు స్వామివారి ఆయివజులోనుండియే జీవింపవలెను కాని ఈ అయివజు ఎంత వృద్ధియగుచున్నను, అంతయు తమ కుటుంబములకే వినియోగించి దేవాలయము దుస్థితిలో నుంచుటయు, ఉత్సవములు మొదలగునవి సరిగా జరిపింపక పోవుటయు తటస్థించుటచేత స్వామివారి యీనాములను అర్చకులనుండి లాగుకొని వారి భూతాదికి నెల జీతముల నిచ్చుటకు కోర్టువారు, నూతన ట్రస్టీలను ఏర్పరచుచున్నారు సి. ప్రొ కోడు సె 92 క్రింద దేవాలయముల మేనేజమెంటు విషయమై స్కీములు ఏర్పడుచున్నవి ఇదిగాక ఈ యర్చకుల కుటుంబములు తామర తంపరగా పెరిగినపుడు స్వామివారి ఈనాములను విభాగించుకొని, అయివజునంతయు తమ జీవనోపాధికే వినియోగించుటచేత, కోవెల మరమ్మతులు, యీనాముల మరమ్మతులు, ఉత్సవములు, మొదలగునవి నిలిచిపోవుచున్నవి గనుక నిట్లు పంచుకొనగూడదనియు ఒకటి రెండు చిన్న కుటుంబములకు సరిపడునట్లుగానే జీతముల నేర్పాటు చేయువలసినదనియు కోర్టులు తీర్పుల నిచ్చుచున్నవి తక్కిన కుటుంబ మెంబర్లు ఇతర కోవెలలోగాని, మరి యొకచోటగాని ఉద్యోగములు సంపాదించుకొనవలసినదేగాని, స్వామివారి భూములమీద జలగలవలె అంటియుండరాదు అర్చకులు మంచి సంస్కారులైనకొలది వీరికి జీతములు వృద్ధిచేయబడి, గొప్ప కోవెలలకు తీసికొనబడుదురు

తమ పూర్వులకంటె, నిప్పటివారికి దైవభక్తి కొఱవడుటవలననో, లేక మనలోని నవనాగరికులకు రూపోపాసన రుచింపకపోవుటచేతనో కొందరు అర్చకుల అసమర్థతా దుష్ప్రవర్తనలవలననో ఈ దేవాలయములను, ప్రజలు త్రొక్కిచూడకున్నారు ఇవి శిథిలములగునపుడు తూష్ణీంభావమును వహించుచున్నారు ఉత్సవములు మొదలగువానికి విరాళముల నొసగకున్నారు కాబట్టి కనీసము అర్చకునికి రు 20 లు నెల జీతమిచ్చి నిత్య నైవేద్య దీపారాధనలకు నెలకు రు 15 లు ఏర్పరచినయెడల దేవాలయముల మరమ్మతులకును, ఉత్సవములకును సొమ్ము మిగులకపోదు ఇట్టి దేవాలయములకు స్కీముల నేర్పాటు చేయించుకొన్నయెడల స్వామివారికి వచ్చు అయివజును, ఏ యే కార్యములకు నెంతెంత ఉపయోగింపవచ్చునో ట్రస్టీద్వారా నిబంధనలను చేసెదరు ఈ నిబంధనలను, అప్పటప్పటి సంగతి సందర్భములనుబట్టి ప్రజలు కోర్టువారిచేత మార్పించుకొనవచ్చును ట్రస్టీని తీసివేయింపవచ్చును లెక్కలను తనిఖీ చేసికొనవచ్చును వానిని ప్రచురించవచ్చును లెక్క కాపీలను పడయవచ్చును ఇట్టి సౌకర్యములు కలుగజేసినను గ్రామస్థులు తమ దేవాలయపు వ్యవహారములను తామే చక్కగా జరిపించుకొనలేని యెడల వీరు స్వపరిపాలన కెట్లర్హులు? సుమారు నూటయేబది రూపాయలు ఖర్చు పెట్టిన యెడల శాశ్వతముగా ఒక స్కీము నేర్పాటు చేసికొనవచ్చును

ఈ స్వల్ప మొత్తమును గూడ ఖర్చు పెట్టజాలరనియు, జాగరూకతతో ట్రస్టీల నడతను గురించి పై తనిఖీ చేయరనియు, పౌర జీవన జ్ఞానము మన పల్లెటూరివారికింకను పట్టుపడలేదని ప్రతి తాలూకాకును, జిల్లాకును కమిటీల నేర్పాటు చేయుటకు మన మద్రాసు శాసన నిర్మాణ సభలో ఒక బిల్లును ప్రవేశపెట్టినారు దీనిలో మరికొన్ని మార్పులుచేసి చర్చకు శీఘ్రకాలములోనే తీసికొని వచ్చెదరు ఈ బిల్లు ప్యాసయిన యెడల మన స్కీముల క్రింద నేర్పడిన ట్రస్టీల కోర్టులకు బదులు ఈ కమిటీల కుత్తరవాదులైయుందురు ఈ కమిటీలు కోర్టుల పై తనిఖీకి లోబడి యుండవలెనుగాని కార్యనిర్వాహక శాఖకు లోబరచుట మంచిదికాదని నా యభిప్రాయము కమిటీలకును, ట్రస్టీకిని, ప్రజకును మధ్య నంకురించు తగవులు పిటీషనులమీద కోర్టులు పరిష్కరించిన యెడల వారి తీర్పులు స్పష్టిగ నుండుటయు త్వరలో స్వల్ప ఖర్చుతో న్యాయమును పొందుటయు ఆ యా గ్రామ ప్రజాభిప్రాయమును శీఘ్రముగ కనుగొనుచుండుటయు తటస్థించును ట్రస్టీలమీద పై తనిఖీకి గ్రామ కమిటీల నేర్పరుచుటయే మంచిది శాఖోపశాఖలతో గవర్నమెంటు డిపార్టుమెంటుగా మన దేవస్థానములను మార్చుట వలన నెంతమాత్రము లాభము లేకపోగా ప్రజా స్వపరిపాలనమునకు ఆటంకము కూడ కలుగజేయును ప్రస్తుతస్థితిగతులలో వోట్లు ఎన్నికలకంటె గ్రామస్థులు కోర్టుల మూలమునవే తమ కమిటీ మెంబర్లను నామినేటు చేయించుకొనుట యుచితము

పెద్దతిరుపతివలెనే ద్వారకా తిరుమల, సింహాచలము, కోటప్పకొండ, శ్రీశైలము, అంతర్వేది, కోటిఫలి, ద్రాక్షారామము, ఆకిరిపల్లి, అన్నవరము మొదలగు ప్రసిద్ధ దేవాలయములకు కూడ స్కీముల నేర్పాటు చేయవలెను విజయనగరము, పిఠాపురము, మైలవరము, నూజవీడు, బొబ్బిలి, వెంకటగిరి మొదలగు సంస్థానాధీశులు ట్రస్టీలుగానున్న దేవాలయములకు కూడ స్కీముల నేర్పాటు చేయని యెడల వారేవిధముగ స్వామివారి అయివజును వెచ్చించుచున్నారో జనుల కెట్లు తెలియగలదు పూర్వపు జమీందారులిచ్చిన ఈనాముల అయివజును, భగవత్కైంకర్యపరులు ప్రతిదినము ఇచ్చుకానుకలను వీ రెట్లు వినియోగించుచున్నారో ప్రజలకు తెలియవలసినది విధి ఈ జమీందారులు తమ తాబేదారులగుండా కొన్ని దేవాలయములను స్వయముగా మేనేజి చేయుచున్నారు వీరు తమ క్రింది యుద్యోగస్థులమీద నమ్మకముంతురు గాని ప్రజల కమిటీలమీద వీరికి విశ్వాసము తక్కువ కాబట్టి, ఆ యా చోట్ల ప్రజలు స్వల్పముగ ఖర్చుచేసి ఈ గొప్ప దేవాలయములకు కూడ త్వరలో స్కీముల నేర్పాటు చేసికొనవలెను వీనినిబట్టి హైందవమతము విజ్ఞానము పెంపొందింపవచ్చును పాశ్చాత్య దేవాలయములవలె మనవి కూడ మంచి సంస్కారులచేత మేనేజి చేయబడుచు, ప్రజల ఐహికాముష్మిక సుఖములకు తోడ్పడగలవు సంగీతము, స్వస్తివాచకము, హరికథా కాలక్షేపములు, నాటకములు, వేదాంతబోధ, పురాణ పఠనము, సంస్కృత పాఠశాలా స్థాపనము మొదలగునవి యెన్నియో మత సంబంధమైన కార్యములకు స్వామివారి అయివజును ఉపయోగింపవచ్చును ఈ విషయములో ఉచితముగ కొందరు న్యాయవాదులైనను ప్రజలకు తోడ్పడిన యెడల నిజమైన జాతీయ జీవనమునకు సహకారులగుట కెట్టి సందేహములేదు నానావిధమైన మన పూర్వపు శాస్త్రములు, కళలలోని విజ్ఞానమునకు ఆధునిక విషయముల జేర్చి పూర్వపు పరిభాషా పదములతో గ్రంథములను రచియింపించి నిజమైన జాతీయ విద్యను వ్యాపింపజేయవచ్చును మన విదేశ ప్రభువులు వారి మత వ్యాపనకు మన సొమ్ము ఖర్చు చేయుచున్నారు గాని మన మతవ్యాపనకు ఒక్క దమ్మిడియైనను వారీయరు కాబట్టి ఈ కాలములో, దేవాలయముల అయివజును, మన మతమునకును జాతీయ విద్యకును ఖర్చు పెట్టుకొనుట శాస్త్ర సమ్మతము న్యాయమునైయున్నది ప్రస్తుత బిల్లులో తగిన సవరణలు, మన ప్రతినిధులచేత చేయించి, దేవాలయములను, శుంఠలగు అర్చకుల చేతులలోనికిగాని, ప్రజాహితకరములైనను తక్కిన కార్యముల కుపయోగించుటకు కార్యనిర్వాహక శాఖవారి చేతులలోనికిగాని పోనీయక మన మత జాతీయ విద్యావ్యాపనకే ఖర్చు పడునట్లు చేయుట మన విధి

### దేవస్థానపు స్కీము

1 దావా దేవాలయమునకును, దాని ఆస్తులకును ఒక్కరే ట్రస్టీగా నుండవలెను చాతుర్వర్ణ్యములలో చేరి మేజరై మహోదార్ఢ్యముగల యే మగవాడైనను ట్రస్టీగా నుండవచ్చును అతను, దేవాలయమున్న గ్రామములోని కాపురస్థుడుగగాని దానికి అయిదు మైళ్లలోపుగానున్న ఇతర గ్రామ నివాసిగ గాని యుండవచ్చును నెలకు ఏబది రూపాయీల అయివజు వచ్చేవాడుగ గాని లేక తన వంతునకు రెండువేల రూపాయీలకు తక్కువ కిమ్మతుకాని స్థిరాస్తి కలవాడుగగానియుండవలెను ఆయన యిన్సాల్వెంటుగ గాని నీతిబాహ్యమైన నేరమునకు శిక్షింపబడిన వాడుగ గాని యుండగూడదు

2 పైన చెప్పిన యోగ్యతలుగల ట్రస్టీ తా నేర్పడిన తేదీ లగాయతు మూడు సంవత్సరములవరకు ఆ పదవిలో నుండవచ్చును ఆ గడువు కాలమైన తరువాత తిరిగ ఆయనవే కోర్టువారు ఏర్పరుచుచుండవచ్చును

3 ట్రస్టీ చనిపోయినపుడుగాని మరియే ఇతర కారణములచేతగాని ట్రస్టీ

ఒడివి ఖాయి యెప్పుడు దేవాలయము దఖిమానము గలవారెవరైనను పిటీషనుపెట్టి కోర్టువారివలన నూతన ట్రస్టీని యేర్పరుచుకొనుచుండవలెను

4 స్వామివారి చర్యాస్తులన్నియు ట్రస్టీ కోర్టువారి సహాయముతో స్వాధీనము చేసికొని జాగ్రత్తగ కాపాడుచుండవలెను

5 స్వామివారికి వచ్చు ఆదాయమును, వారికొరకు చేయు వ్యయమును కన పరచు లెక్కలను యెల్లప్పుడు ట్రస్టీ సరిగా నుంచవలెను కోర్టువారు కోరినపుడు వానిని హాజరు పెట్టుచుండవలెను దేవాలయము దఖిమానముగలవా రెవరైనను పడవకు రెండేసి రూపాయలు దాఖలుచేసి ట్రస్టీయుంచిన లెక్కలను చూచుకొని కాపీలు తీసి కొనవచ్చును తనకు అప్లికేషనుతో ఆ సొమ్ము దాఖలు చేయగానే వారము రోజులలోగా ట్రస్టీ లెక్కలను కనుబరచి కావలసిన కాపీల నీయవలెను

6 సంవత్సరమున కొకసారి ట్రస్టీ, కోర్టువారివలన నియమింపబడు ఒక ప్రత్యేక ఆడిటరుచేత లెక్కలను తనిఖీ చేయించుకొనవలెను ఆడిటరుకు స్వామివారి యెస్టేటునుండి ఏబది రూపాయిలకు మించకుండ ఫీజు నీయవచ్చును

7 స్వామివారి ఆయివజులోనుండి అర్చకుని జీతమునకును, నిత్య పూజా విధానమునకును, ఉత్సవములకును, గుడి మరమ్మతులు మొదలగువానికిని, అవసరమైనంత వరకు, సొమ్మున్నంతవరకు ఖర్చుపెట్టుచుండవలెను

8 నిత్యపూజయు, మామూలుగా జరుగు మాసోత్సవ సంవత్సరోత్సవములును, పండుగలును, ట్రస్టీ యధావిధిగ జరిగించుచుండవలెను ఆ ఆదాయమునుబట్టి వారిని వృద్ధిపరచవచ్చును

9 అర్చకుని జీతమునకును, నిత్య పూజా విధానమునకును, ఉత్సవములకును ఖర్చు పెట్టిన తరువాత దేవాలయ మరమ్మతులకును నూతన కట్టడములకును స్వామివారి ఆయివజులోనుండి వ్యయపరుచుచుండవలెను

10 సంవత్సరాది పండుగ దినమున గ్రామములో ముందుగా దండోరా చేసి స్వామివారి సన్నిధానమున గత సంవత్సరపు ఆదాయ వ్యయముల స్టేటుమెంటును ట్రస్టీ బహిరంగముగా చదువవలెను దాని కాపీని 15 దినముల వరకు దేవాలయములో కట్టుటయేగాక మరియొక కాపీని కోర్టువారికి పంపవలెను

11 అర్చకుడు ట్రస్టీయొక్క అదుపాజ్ఞలలో నుండవలెను ప్రస్తుతము అర్చకత్వము చేయుచున్నమనిషికి నెల 1 టికి కనీసము రు 15 లు నౌఖరీ చేసినందుకు గాను జీతము ఏర్పాటు చేయబడును అతని విద్యనుబట్టియు, నడతనుబట్టియు, దేవుని ఆదాయమునుబట్టియు, ఈ జీతమును వృద్ధిచేయవచ్చును

12 దేవాలయమును, ప్రొద్దున 8 ఘంటలు మొదలు 12 ఘంటలవరకును సాయంత్రము 5 ఘంటలు మొదలు 9 ఘంటలవరకును తెరచి యుంచవలెను పర్వదినములలోను మరికొన్ని దినములలోను, ట్రస్టీ ఆజ్ఞ ప్రకారము ఎక్కువ కాలము తెరవవచ్చును

13 స్వామివారి కోరెంపుగాని దాని ఆస్తులను గాని ట్రస్టీ తాకట్టు పెట్టకూడదు, విక్రయించకూడదు స్వామివారి భూములను కోర్టువారి యంగీకారము లేనిదే అయిదు సంవత్సరములకంటె నెక్కువ కాలమునకు కవుళ్ళ నీయకూడదు. కోర్టువారి సాంక్షను లేనిదే ట్రస్టీ యెప్పుడును అప్పులను చేయకూడదు

14 సంవత్సరారంభముననే స్వామికి సుమారుగా రాతగిన ఆదాయమును కావలసిన ఖర్చులను తెలియజేయు పట్టినిన్ని (బడ్జెట్టు) నిత్య పూజకును ఉత్సవములకును చేయదలచిన ఖర్చుల పట్టినిన్ని (దిట్టమును) కోర్టులో దాఖలుచేసి, వారి సాంక్షను ముందుగా తీసికొనవలెను

15 స్వామివారి భూములమీదను, ఇతరాస్తులమీదను రావలసిన శిస్తులు అద్దెలు వగైరాలు వసూలుచేసి ఆ మొత్తములోనుండి దేవస్థానపు పనులకు ట్రస్టీ ఖర్చు చేయుచుండవలెను నిత్యపూజకును ఉత్సవములకును వస్తురూపముగాగాని లెక్క రూపముగగాని అర్చకునకు కోర్టువారు సాంక్షను చేసిన దిట్టము ప్రకారము ట్రస్టీ యీయ వచ్చును అవసరమని తోచినపుడు ట్రస్టీ ఒక గుమాస్తాను బంట్రోతును పెట్టుకొనవచ్చును

16 దేవాలయమునకు ప్రస్తుతము మిక్కిలి అవసరమైన మరమ్మతులను, ట్రస్టీ కొంతకాలము ఉత్సవములను ఆపివేసియైనను తక్షణము మొదలుపెట్టి చేయించవలెను

17 ఎప్పుడుగాని ట్రస్టీ తన చేతిలో రెండువందల రూపాయీలకంటె హెచ్చు మొత్తమును నిలవయుంచుకొనకూడదు కోర్టువారిచేత అంగీకరింపబడిన బ్యాంకులో మిగిలిన మొత్తమును యెప్పటికప్పుడు వడ్డీకి డిపాజిట్టు చేయుచుండవలెను కోర్టువారి సాంక్షను తీసికొని స్థిరాస్తిని కొనుచుండవచ్చును

18 దేవాలయమునం దభిమానము గలవా రెవరైనను తగిన కారణములను కనుపరచి కోర్టులో పిటీషనుపెట్టి, ట్రస్టీని తొలగించవచ్చును

19 ఈ స్కీములో అవసరమని తోచినపుడెల్లను, దేవాలయమం దభిమానము గల వారెల్లరు, మార్పులను కోర్టువారిచేత చేయించుకొనవచ్చును ఈ దావాలో చేయబడిన డిక్రీని ట్రస్టీయేకాక వారిలో నెవరైనను అమలు జరిగించుకొనవచ్చును ఈ స్కీముకు సంబంధించిన పిటీషనులన్నియు ఈడిక్రీకి అనుబంధములలో పెట్టినట్లే యెంచబడును

20 పైన వ్రాసిన నిబంధనలలో "కోర్టు" అను శబ్దము ఈ డిక్రీని ప్యాసు చేసిన కోర్టునకును, ఈ కోర్టును తీసివేసిన యెడల, ఈ దేవాలయముమీద జూరిసు డిక్షనుగల మరియొక కోర్టుకును కూడ అన్వయించును

# అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్స్చర్




తయారీ
అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - 4



FDS AGM 472 TE A

# చైతన్య స్వరూప సిద్ధాంతములు

పారనంది జగన్నాథ స్వామిగారు ఎమ్. ఏ.; ఎల్. టి.

[1924 రక్తాక్షి సంవత్సరాదిసంచికనుండి]

మన దేశ సిద్ధాంతములో ఆత్మ మనస్సులు రెండు భిన్న పదార్థములు. పాశ్చాత్యుల శాస్త్రములో వస్తుతః రెండూ ఒకటేకాని, వ్యాపారములవలన భిన్న రీతుల విచారణీయము లగుచున్నవని చెప్పవచ్చును. ఈ ప్రపంచమునంతను చేతనా చేతనములుగ విభజించి, చైతన్యమునంతను ఒకే పదార్థముగ నిరూపించి, చైతన్యముయొక్క భిన్నావస్థలు పరిణామ క్రమములో వ్యక్తమగుచున్నవని అన్ని మతములు అంగీకరింపక తీరదు. మనుష్యునిలో వ్యక్తమైన చైతన్యస్థితిని రెండు భిన్న పదార్థములుగ పరిగణించుటకంటె ఒకే వస్తువుగ నిరూపించుట ఎక్కువ శాస్త్రీయముగ తోచుచున్నది. ఆ వస్తువుయొక్క వివిధ వ్యాపారములకు వివిధ నామము లుంచుట బాగుగానే యున్నదికాని, ఆ నామములను వస్తువులని భ్రమపడుట సంభవించుచుండును. ఈ చైతన్యముయొక్క స్వరూపము వివిధావస్థలు ఈ వ్యాసములో క్లుప్తముగా విచారింతము.

మనుజుని జాగ్రదవస్థలో వ్యక్తమగుచున్న చైతన్యమే పూర్ణమైన చైతన్యమని తదితర చైతన్యావస్థ మరొకటి లేదనిన్నీ నిద్రలో ఈ చైతన్యము నిర్వ్యాపారమగుననిన్నీ మొన మొన్నటివరకు తలుస్తూ ఉండిరి. ఈ సిద్ధాంతము శాస్త్రములలో మారినా, సామాన్యులలో ఇంకనూ నాటే ఉన్నది. నిద్రలో ఇంద్రియములన్ని వ్యాపారము లేనివి అగుటచేత,ఇంద్రియములద్వారానే బాహ్య ప్రపంచ జ్ఞానము కలుగవలెను కాబట్టి, చైతన్యమునకు నిద్రలో స్థితివ్యవహారము లుండవు. ఈ సూత్రమును అనుసరించి జాగ్రచ్చైతన్యము, నిద్రాచైతన్యము అని రెండింటిగ చైతన్యమును విభజించుచుండిరి. ఈ సిద్ధాంతమునకు కొంచెము పర్యాయముగా నిద్రా చైతన్యమునకు లీనచైతన్యమని పేరుపెట్టి, నిద్రలో చైతన్యము లీనమై యుండునని చెప్పినారు. వారైనా ఈ లీన చైతన్యమునకు ఏ ప్రత్యేక వ్యాపారమును కల్పించియుండలేదు.

లీన చైతన్యముయొక్కవిశేషము స్మృతి, ఏకాగ్రతలలో చక్కగ వ్యక్తమగుచున్నదని త్వరలో చాలామంది గ్రహించినారు. ఇదివరకు కలిగిన అనుభవము జాగ్రచ్చైతన్యమునకు వచ్చినప్పుడు ఆ వృత్తికి స్మృతి అనిపేరు. ఈ వ్యాపారమును చక్కగ విమర్శిస్తే, మూడు అవస్థలు కనబడును. అనుభవ జననము, అనుభవస్మృతి, జననస్మృతి కాలములకు మధ్య ఆ అనుభవముయొక్క స్థితి. ఈ స్థితి లీనచైతన్యము. జననమైన తరువాత ఆ అనుభవము సంస్కార రూపమున లీనమైయుండి, స్మృతి కాలమున తిరిగి జాగ్రదవస్థకు వచ్చుచుండును. ఇది లీనచైతన్యముయొక్క ఒక విధమైన వ్యాపారము.

ఏకాగ్రతను పరీక్షించినచో మరొక విశేషము వ్యక్తమగును. ఏ యొక్క నిమిషమందైనను అనేకేంద్రియములు పనిచేస్తూఉండును. కాని ఆ వృత్తులన్నిటిలో దేనియందో ఒక దానియందు ఏకాగ్రత ఉండును. మిగిలినవన్నీ లీనములగును. ఎట్లన, నే నీ వ్యాసమును వ్రాయుచున్నప్పుడు నా నేత్రములు చూచుచుండును; నేను వ్రాయుచుండు అక్షరమేకాక మీఁది అక్షరములు, కలముయొక్క రంగు, క్రింద కాగితముపై ఉన్న మచ్చ, వ్రాస్తూ ఉన్న బల్ల ఆకారము, చుట్టు ప్రక్కల వస్తువుల ఆకారము, ఇవన్నీ కొద్దిగనో, గొప్పగనో దృగ్గోచరము లగును. ఆ ఇంద్రియ వృత్తులకు సంబంధించిన మనోవృత్తులుండి తీరును. ఆ వృత్తులన్నీ నా ఏకాగ్రతలోనికి చేరలేదు. అవి అందుచేత లీనములైనవి. ఇట్లు నేత్రేంద్రియము ఎట్లు లీన చైతన్యమునకు సామగ్రి చేర్చునో ఆలాగే యితరేంద్రియములు కూడా చేర్చును. లీనచైతన్యమునకు చేరిన ఇవన్నీ ఒక్కరీతిగా ఉండవు. వాటి లీనత ఎక్కువ తక్కువగా ఉండును. ఈ ఎక్కువ తక్కువ వాటి ప్రసరించిన మనస్సుయొక్క ఏకాగ్రతను పట్టిఉండును. ఏ వృత్తులు ఆ కాలమున మనస్సున ఎక్కువగా నాటినవో, ఏవి ఏకాగ్రతలోనున్న వ్యక్తికి సంబంధించినవో, అవి తక్కువ లీనము లగునో అవి స్మృతి కాలములో సులభముగా జాగ్రదవస్థకు వచ్చును.

ఈ సిద్ధాంతమే చాలాకాలమువరకు సర్వాంగీకృతమై యుండెను. నిద్రావస్థ, లీన, అలీనము లనెడి జాగ్రదవస్థ ఇవి చైతన్యముయొక్క స్వరూపములని మన శాస్త్రజ్ఞు లందరూ సిద్ధాంతీకరించియుండిరి ఇట్లుండగా మనస్సంబంధమైన నూతన సామగ్రి కొంత జిజ్ఞాసక వచ్చినది. వ్యక్తమైయున్న పంచేంద్రియముల ద్వారానే అనుభవమంతా సంపాదించగలము ఒకరికి తిరిగి తెలియజేయగలము అనే సూత్రమునకు విరోధముగానుండు సంగతులు అనేకములు సందర్శించినవి. వాటికి టెలిపథీ అని పేరుపెట్టినారు. దూరస్థు లిద్దరు ఉత్తరములు మొదలైన ఏ సాధారణ మార్గమున కాకుండా, బాహ్యేంద్రియముల సహాయము లేకుండా, ఒకరి కొకరు ఒక సంగతిని తెలియబరచుకొనగలరు. ఇప్పుడు బాహ్యచైతన్యము ప్రవర్తించలేదు గదా. ఆలాగే ఒక వ్యక్తి యోగ నిద్రలో ప్రవేశించి, అతడు జాగ్రచ్చైతన్యములో ఎరుగని సంగతిని చెప్పుట; ఒక వ్యక్తిని అట్టి నిద్రలో ప్రవేశపెట్టగా అట్టి సంగతులను చెప్పుట; జాగ్రదవస్థలో వాటిని గురించి ఎట్టి ప్రశ్నలు వేసినా, ఎంత ప్రయత్నము చేసినా, వాటి అనుభవము ఏమిని లేకుండుట; ఈ విధమైన వాటికి హిప్నాటిజము అని పేరుపెట్టినారు. ఇట్టి సంగతుల పరీక్ష వలన లీన చైతన్య స్వరూప విషయమై సిద్ధాంతము మారవలసి వచ్చినది.

లీన చైతన్యమును రెండు సోపానములుగ విభజించినారు. ఒక రకము సులభముగ, సాధారణముగ, జాగ్రచ్చైతన్య ప్రయత్నముల వలన జ్ఞప్తికి రాగలిగినవి; ఎట్టి ప్రయత్నము చేసినా, జాగ్రచ్చైతన్య ప్రభావము ఉన్నంతసేపూ స్మరణకు రాకున్నవి, అసాధారణ పరిస్థితులలో వచ్చుచున్నవి రెండోరకము. వీటినిబట్టి చైతన్యమునకు వచ్చుటకు, రాలేకపోవుటకు ఒక ద్వారమును దాటి రాగలిగి యుండవలెనని ఒక రూపకమును కల్పించి శాస్త్రజ్ఞులు వర్ణించుచుందురు. చైతన్య ద్వారమును దాట గలిగేవి, దాటలేనివి, అని రెండు విధముల అలీన చైతన్య మున్నదని సిద్ధాంతము ఏర్పడినది. ఈ భేదములకు కారణము ఏకాగ్రతా తారతమ్యములని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఎందుచేతననగా అసాధారణ

పరిస్థితులలో వ్యక్తమగుచున్నవి ఒకప్పుడు అనుభవములోనికి వచ్చియున్నట్లు కొంత రుజువులు కనబడుచున్నవి, కాని జాగ్రదవస్థలో స్మృతికి, రాకుండా ఉన్నవి జాగ్రచ్చైతన్యములో ద్వారము దాటిరాలేక పోవుట, యోగనిద్రలో వచ్చుచుండుటను పట్టి చూడగా, ఈ బాహ్యచైతన్యము కంటె ఆసీనచైతన్యము ఎక్కువ సంపద కలదిగా తోచుచుండును ఏకాగ్రతలో వచ్చు లంకము ఒకటైనప్పుడు, దాని సమయమున లీనచైతన్యమునకు చేయుచున్న సామగ్రి ఇంత అంత అని చెప్పతరము కాదు గదా ఈ లీనచైతన్యముయొక్క వ్యాపారములను ఆత్మజిజ్ఞాసాసంఘము వారు (Psychic Reseirch Society[1])పరీక్షిస్తూ ఈ సిద్ధాంతమును స్థాపిస్తూ ఉన్నారు

ఇంతవరకు చెప్పినదానిని సంగ్రహించినచో చైతన్యముయొక్క భిన్నరూపములను తెలియజేయుటకు ఈ క్రింది పట్టీని తయారు చేయవచ్చును —




ఈ రెండు లీనచైతన్యములు వాటికి సందర్భించిన పరిస్థితులలో జాగ్రత్స్థితికి రాగలిగినవే ఏరూపమున పూర్వానుభవములోనికి వచ్చినవో, ఆరూపముననే తిరిగి అనుభవమునకు ఆ లీనచైతన్యముల మనోవృత్తులు రాగలవు అందుచేత ఇవి చైతన్యములో ఉన్నవేకాని, చైతన్యమునకు అతీతములు కావు

ఇట్లుండగా మంరొకవిధమైన చైతన్యమును లంగీకరించక తీరినది కాదు సర్వాంగీకారము పొందియున్న పరిణామసూత్రము ననుసరించి చైతన్యపరిణామమును పరీక్షించుటచేత మనుజుని మనోనిర్మాణములో జంతుసంబంధములైన భావములు, వాంఛలు, మొదలైన మనోవృత్తులు వాసనారూపమున లీనములైయున్నట్లు కనుగొనినారు ఏవాంఛలు జంతువులు నిరాటంకముగ తీర్చుకొనుచున్నవో, వాటిని మనుజుడు బహిరంగముగ ఆలోచించలేకున్నాడు అలాగని అవి వానిమనస్సు కూర్పు నుండి తొలగిపోలెదు. ఏభావములు, చర్యలు అనాగరక కుటుంబములలో నిర్దుష్టములో, వాటిని నాగరికులు నిర్మూలము చేయలేకున్నా బహిరంగముగ ప్రకటింపలేకున్నారు ఇట్టివన్నీ పరంపరలో వాసనలుగా పిల్లలలో వ్యక్తమగుచున్నట్లున్ను, వాటిని సాంఘికనియమములచే అణచివేయ యత్నిస్తూ ఉన్నట్లున్ను శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు ఆ భావములను ఆ వాంఛలను, తెగదీయ నాగరికులు, ముఖ్యముగ నీతిపరులు యత్నించుచున్నారు వీటి ఉనికి బాలుల మనస్సులకూర్పులోనే కాకుండా పెద్దవారి మనస్సు కూర్పులోకూడా ఉన్నట్లు మంరొకవిధమున ఇటీవల మనశ్శాస్త్రజ్ఞులు కనుగొనుచున్నారు ఉన్మాదము, అస్థిరత, మతివిభ్రమము, దయ్యము పట్టుట, గ్రహబాధ, ఈ మొదలైన పేర్లతో వ్యవహారములో ఉన్న (Hysteria and Merotic disorder) మనస్సంధమైన రోగముల పరీక్ష ఇటీవల ఎక్కువైనది ఆ జబ్బులకు శారీరకచికిత్స ఎంత చేసినా రోగనివృత్తి లేకుండెను మనశ్చికిత్స చేయవలెనని ప్రయత్నించుటలో చెప్పసిగ్గగు వాంఛలు ఆరోగులను బాధిస్తున్నట్లు స్పష్టమైనది ఏవో కొన్ని వాంఛలు ఉన్నట్లున్నూ, ఆవాంఛల సంగతి సూచించుటకైనా జంకుచున్నట్లున్నూ, ఏవో కొన్నికొన్ని చెప్పినా సాక్షాత్తుగా చెప్పక ఏదోవిధముగా సూచిస్తూ ఉన్నట్లున్నూ, వచ్చిబూతు ఉచ్చరించుటకు నాగరికుడు ఎంత సిగ్గుపడునో అంతకంటె ఎక్కువ సిగ్గుతో ఉన్నట్లున్నూ, ఈ మొదలైన సంగతు లనేకములు తెలిసినవి అట్లే స్వప్నముల స్వభావమును తెలుసుకొన ప్రయత్నించిన పరీక్షకులుకూడా ఆలాగే చెప్పుచున్నారు ఏవాఛంలు జాగ్రత్ స్థితిలో మనోవ్యాపారములోనికైనా రాలేవో అవి ఒకొక్కప్పుడు మారువేషములో స్వప్నములోనికి ఎచ్చి కొంత ప్రకారాంతరతృప్తిని పొంది పోవుచున్నవని వారి మతము ఈ వాంఛలు, ఈ వాసన, బాహ్యచైతన్యమునకు ఎన్నడు రాజాలవు అవి చైతన్యాతీతములైన లీనచైతన్యములు.

ఈ పరీక్షలవలన చైతన్యస్వరూప నిరూపణ మారవలసివచ్చినది మనకు జాగ్రత్స్థితిలో వ్యక్తమయ్యే వృత్తులనే కాకుండా జాగ్రత్స్థితికి ఎన్నడూ రాలేని వాసనారూపవృత్తులు, మనోవృత్తులున్నూ ఇంకా అనేకములు ఉన్నవనిన్నీ, మనస్తత్వజ్ఞులు వాటిపరీక్ష చక్కగ చేయనిది అనేక వ్యాపారముల స్వభావమును సమన్వయించలేదనిన్నీ తెలిసినది మనుజుని వ్యాపారమును పరీక్షించినపుడు అనేకవ్యాపారములకు చాలా చిన్నచిన్న వాటికి ఉచితమైన కారణములను నిరూపించలేకున్నామని అందరికి తెలిసిన విషయమే ఈ కారణములు లీనచైతన్యములో ఒకచోట ఎక్కడో జన్మపొందుతూ ఉన్నవి సాధారణ లీనచైతన్యములోనివైనపుడు వాటిని కనుగొనశక్యమగును అసాధారణ లీనచైతన్యములోనివైనపుడు ఈ బాహ్యప్రయత్నము చాలకున్నది అతీతలీనచైతన్యమైనపుడు తెలుసుకొనుటకు ప్రత్యేకసాధనసామగ్రి చక్కని శాస్త్రీయకుశలత కావలసివచ్చుచున్నది ఈచైతన్యమును నిరూపించుటకు ఉద్యుక్తమైయున్న మతమునకు ఇంగ్లీషులో (Psycho Analysis2) అనిపేరు ఈ సూత్రమును సిద్ధాంతముగ అంగీకరించినా, ఈ మతముయొక్క సిద్ధాంతముల విషయమై ఇంకా చర్చ జరుగుచున్నది

ఈరకము లీనచైతన్యముతో కూడా మూడురకముల లీనచైతన్యము, ఒకరకము జాగ్రచ్చైతన్యము సిద్ధమైనవి

1. ఈ సంఘము వారి పనివి ఈ టెలీపథీ, హిప్నాటిజము వ్యాపారములను వర్ణిస్తూ ఆత్మజిజ్ఞాన లేక "శరీరము విడిచిన తరువాత ఆత్మస్థితి" అనే పేరుతో నేను వ్రాసిన పుస్తకము ఆంధ్రపత్రికా కార్యాలయము. దొరుకను

2. ఆత్మజిజ్ఞాన అనుపేరుతో Psychic Research గురించి వ్రాసినట్లు, ఈ I sycho Analysis గురించి ఒక చిన్నపుస్తకము వ్రాయవలెనని కుతూహలము ఉన్నది

# యెంకి పాటలు

### పురాణం సూరిశాస్త్రిగారు బి. ఏ.

**[1925 క్రోధన సంవత్సరాదిసంచికనుండి]**

మానవ ప్రతిష్ఠాపనమందు చక్రనేమిక్రమ మగుపడుచుండును. ప్రస్తుత కాలమందు తత్త్వజ్ఞులు, శాస్త్ర పరిశోధకులు నీతికోవిదులు, కళోపాసకులు, చింతించు సమస్యలు మానవ చరిత్రలో బలుమారు తలచూపి, యప్పటి మేధావులచే బరిష్కరింపబడుచు వచ్చినవి మత నైతిక రాజకీయ సాంఘిక సమస్యా సందర్భములం దెటులనో అటులనే కళావిషయములందుకూడ కొన్ని సమస్యలే, కొన్ని సంప్రశ్నములె, యభిరుచులే, ప్రపంచమం దెల్లెడల గోచరించును కాలవశంబున నొక్కొక్కవిధమగు కళాస్వరూపము, వాఙ్మయరీతి, గౌరవ మొందుచుండినను మహా మేధావులగు కవులు శిల్పకులు, ఆదినరకు వన్నెకెక్కి ప్రస్తుతము వాడిదప్పిన వాఙ్మయ రూపములను జేకొని వానిలో నవ్యభావముల బ్రకటించుచుందురు ఇందుచేత కావ్యరూపములందు సరళ వికాసమునకు బదులు ఆవర్తక్రమము లగుపడును. ప్రకృతి శాస్త్రములందును, వీనిపై నాధారపడిన యాయుర్వేదము, ఎంజినీయరింగు, పారిశ్రామిక ప్రయోగ విద్యలు మున్నగు వానియందును, కాలక్రమమున నూత్న పద్ధతు లేర్పడి ప్రాచీన రూపము లంతరించుచుండును మానవ మానస ప్రతిష్ఠితంబులగు మత సాంఘిక రాజకీయ నైతిక కళా విషయములు నాగరికతా వికాసములో విప్పొందుచుండినను వేర్వేరు దేశకాలములలో నివి యొక్కొక్క రూపమున జెన్నొందినను, వీని ప్రాచీన రూపములు సంపూర్ణముగ నస్తమించవు ఈనాటి మానవలోకమును బరిశీలించిన యెడల నరుడుత్పన్నమైనది మొదలు నేటివరకును బలకరించిన వికాససోపానము లన్నిటిని నిదర్శించు ప్రతిష్ఠాపన లగుపడును అభిరుచు లగుపడును భావము లగుపడును కావ్య చిత్ర శిల్ప రూపక సంగీతాది లలితకళల వికాస సోపానములన్నియు నీనాడు కూడ సమస్త దేశములలో నిలచియుండి, తద్రూప సంస్కారుల మెప్పువడయుచు, ప్రజానంద మొనగూర్చుచు, వినోదకారులై, జ్ఞానదాయకములై యుపచరించుచున్నవి కళాస్వరూపము లస్తమించవు ఇవి వివిధ రకముల మానస వికాసములను, అభిరుచులను, దెలుపునట్టి వాని ప్రభావమున రూపుదాల్చినవి మానవలోకమందు బహురూపములగు సభ్యతలు, సంప్రదాయములు, లభిరుచులు వ్యక్తమగుచుండును అందుచే నన్నిరకముల రుచులను, ప్రకృతులను, రంజింపజేయు కళాస్వరూపము లుండక మానవు

కళయొక్క యుద్దేశ్యము మనోరంజనము. ప్రయోజనము పరమార్థమున రసానందమును గలిగించుట, లౌకికార్థమున పరచింత నేర్పరచుట, శీలవర్తనమును పోషించుట ఇవి సత్కళల నిత్యధర్మములు మనోరంజకమగు సౌందర్యమంతయు, మానవు లామోదించెడి కళలన్నియు, నీతిమయమే. పరతత్త్వ పూరితమే, పరమార్థ సూచకమే కళా స్వరూపము దానిని రచించెడి శిల్పకుల ప్రయోగ చాతుర్యము ననుసరించియు, నాలించు సంబోధించు సామాజిక సంస్కారమునుబట్టియు వేర్వేరు విధముల నుండవచ్చును దేహమనిత్యము నిత్యమైన కావ్యాంతస్సారము పవిత్రోదార సద్భావ శోభితంబై, వెలుగునపుడు దాని వెలుపలి యుడుపు లెట్టివైననేమి? పెద్ద యల్లికలలో విచిత్ర బంధ చమత్కారములతో, దుష్కర పదజాలముతో, ప్రకటింపదగు నుత్తమ భావములను తేనెలూరెడి లేత పలుకులతో సరసముగ సుబోధకంబుగ వర్ణింప గల ధీయుతులుందురేని వారిని మెచ్చక తీరునా? రససిద్ధులగు కవి గాయక శిల్పకులు మొరాగమందైనను, వృత్తమందైనను, శిలావర్ణ సాహాయ్యముననైనను, సమస్త రస భావావస్థల నుద్దీపింపగలిగియున్నారు శిల్పకుని క్రియా నైపుణ్యము వస్తుపరికరముల, సాధన సౌకర్యములను, అతిక్రమించి సిద్ధధ్వజమెత్తుచుండును దీని నెరింగియే మన పెద్దలు 'క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే' యని చాటియున్నారు

కళా ప్రపంచ చరిత్రమును పరిశీలించిన యెడల కావ్య రూపక నృత్య సంగీతాదులు విద్యా సంస్కార విహీనులైన ప్రాకృత జనంబుల రసావిష్ట ప్రలాపములం దుదయించిన ట్లగుపడును మన దేశ వాఙ్మయమునకు వాల్మీకి యాదికవియనియు, పాశ్చాత్య కావ్యములు హోమరు రచనలయం దుదయించెననియు, తెలుగు కవితలు నాగనుశాసనుని భారతాంధ్రీకరణముతో మొదలిడెననియు, విశ్వసించువారు కలరు కాని యీ యాదికవుల కావ్యములు అంతకు పూర్వముండిన ప్రాకృత కవికల్పితంబులు గేయ మాధుర్య మొప్పారు గ్రామ్య గీతికా బీజములనుండి యుత్పన్నమైనవను టకు సందియములేదు. ఆదికవులు చాలవరకు ఆనాటి వాడుక పదములను, సంభాషణ రీతులను ననుసరించియే రచియించిరి మహా కవి కృతులందు గ్రామ్య సంకాశ వైఖరులనేకములు నగుపడును రామాయణములో మిక్కిలి సారవంతముగ దోచు రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్ అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత యథా సుఖమ్' అను శ్లోకపురీతి సామాన్య సంభాషణ క్రమముల నంటియున్నది ప్రాకృత గీతములలో నుండు వీర దేవతా కథలు, నమములు, నీతి ప్రవృత్తి, రమ్యావస్థాభివర్ణనము, మహాకావ్యములందు విస్తరింపబడినవి ప్రాకృత గీతములు ప్రకృతిని, కండ్లంజూచి రసావేశమొంది యథా రూపముగ జిత్రించిన హృదయ వైశాల్యమును, మనోనైర్మల్యమును, చిత్తశుద్ధిని, రసావేశమును ప్రకటించును మహాకవులగు వాల్మీకదులు ప్రాకృత గీతికా మాతృకలకు సద్భావముల జేర్చి యనవద్యసుందర శిల్పముల బెంచి, చమత్కారముగ జిత్రించి, నీతిని, పరమార్థమును, పరతత్త్వమును, ధీరోదార స్వభావమును నెక్కువ ప్రకటించిరి భావ భారమునను, రస సమృద్ధిని ఆవేశ పారవశ్యమునను, వీరి ధోరణి కొన్ని తావుల నుదార విచిత్ర పదాలంకృతమై కల్పన సంకీర్ణత నేర్పరచెను వీరు సందర్భోచితముగ, సహజ పరిభాష నవలంబించిరికాని, పనివడి నాటకీయ ఫలపాకము నందు కైతల్లన బూనలేదు ఈ రహస్య మెరుంగక తరువాతి కవులు ఆదికావ్యములోని జటిల గంభీర భాగమునే కావ్యాదర్శముగ గైకొని వాని రీతుల నవలంబించి ప్రాకృత కవులు ప్రకృతినే రసభావముల నిజబానిగనెంచి రసావేశ సమృద్ధితో రసప్రధానమగు కావ్యములను, గీతములను రచించుచుండిరి ప్రాబంధిక కవులు పూర్వ కవి కృతులం నాధారపరచుకొని కావ్య ప్రపంచమున మెరపుచుండిరి ప్రాకృత గీతములు రస ప్రధానములు, దేశీయ పద సంకలితములు, జాతీయ గీతిక వైఖరుల ననుకరించునవి ప్రబంధ కావ్యములు, భావ ప్రధానములై విదేశీయ పదజాలమును, విజాతీయవృత్త వైఖరులను సంకీర్ణకల్పనా చమత్కారములను గల్గియున్నవి ఇవి రాజపోషితములై పండితాభిమతములై, గ్రంధస్థములై, దేశమందు నిలచియున్నవి తేట పలుకుల పల్లెటిరుచులైయాలపాటలు దేశ కాలావస్థానుకూలముగ నెప్పటికప్పుడు నవ్య వైఖరుల దాల్చుచు, జనసామాన్యమునకు ప్రధాన జ్ఞానదాయక సాధనములై పరగుచుండెను వీనికి లౌకిక సహాయమమరకున్నను, స్వకీయరస పాటవముచె గ్రంధస్థ వాఙ్మయముకన్న నెక్కుడు వ్యాప్తినొంది, కర్మకర్మిగ జనులందు వ్యాపించుచుండెను ఇవ్విధముగ ప్రతిదేశమందును రెండు వాఙ్మయ ప్రవాహములు, ప్రముఖవిద్వల్పోషితమైన లాక్షణిక వాఙ్మయము, ప్రజాభిమతమైన ప్రాకృత వాఙ్మయము, స్వతంత్రముగ ప్రవహించుచుండెను ప్రాకృత గీతములు గ్రంధస్థము కానికతన నంతరించుచుండినవి కాని యెప్పటికప్పుడు కొందరు విద్వాంసులు, సరసులు, వీని పటిమను గుర్తించి వీనిని వ్రాసుకొని నిలుపుచు వచ్చిరి కొందరు కవులు వీని ధోరణి ననుకరించి రచించుచుండిరి శ్రీనాధుని పలనాటి వీరచరితము యిట్టి ప్రాకృత గీతికానుకరణ ప్రవృత్తితో, నుదయించెననుటకు సందియముండదు కొందరు రసజ్ఞులు, విమర్శకులు, వీని నభిమానించుచుండిరి ఇందుచే నిరంతరము లిఖిత వాఙ్మయరూపములనుండి ప్రభవించిన లాక్షణిక కవిత్వ మభిమానించువారికిని, ప్రాకృత రస విష్ట గీతికా మాధుర్య మభినందించువారికిని, వాగ్వాదలు జరుగుచుండెను కాని, ప్రపంచ పరిపాలనము రాజాధీనమైయుండి, యధికారభావములు మెప్పొందుచుండిన కాలములందు సారస్వత సందర్భములలో గూడ లక్షణాధికార మెసగుచుండెను ప్రస్తుత పరిస్థితులలో, సర్వ సమత్వము, ప్రజాస్వామ్యము, మానవాదర్శమై పరగుకతన జనసామాన్యమునకు పెద్దలు గౌరవించుటయేకాక వారి రుచించు కావ్యకళాదులను గూడ నామోదించుచున్నారు ఇంతకూ ఈ వివాదమందలి ముఖ్యాంశము, భాషా విషయికముకాదు వృత్త సంబంధికాదు కావ్యము, రసమయమా? భావ ప్రధానమా? రసభావములు శోభిల్లునెడ ప్రాకృత కావ్య సరళత్వము లామోదింపదగునా? లేక యుదార రసభావ ప్రదీపనమందు కుదారకల్పన వైచిత్ర్యము నవసరమా? అను సమస్యలే ప్రధానమైయున్నవి.

తెలుగుదేశము, లదునిక కాలస్వభావము ననుసరించి ప్రజాభీష్టమగు కావ్యాదుల గ్రహించుచున్నది కొందరు రసజ్ఞులు ప్రాకృత గీతముల బ్రచురించుచున్నారు విమర్శకులు, గ్రామ్యపద ప్రయోగమును అభిమానించుచున్నారు సాహితీ సభ్యులు మున్నగు కవులు, కటకులు, లక్షణ ప్రశంస నంటకయే గ్రామ్యరీతులలో రసవత్కావ్యము లను చిన్ని కథలను గర్పించి నెరవల్లుతున్నారు లక్షణాభిమానులు కొందరు యెంకి

పాటలవంటి పలుగాకికైతలు తెలుగుబాసకు ముప్పుదెచ్చునని వెరగొందుచున్నారు. గ్రామ్య గీతము లశ్లీల కథా సందర్భముల జిత్రించి యాంధ్రుల నీతిసత్త్వముల బెకలించునని కొందరు రసవూనపడుచున్నారు మరికొందరు, ప్రజానురంజకమగు సారస్వత మాదరణీయమయ్యును, విద్యుత్కవులిట్టి నీచ సారస్వత ముత్పత్తి జేయకూడదనియు, గ్రాంధిక వాఙ్మయంబున, యాలపాటల కాస్కార మొసంగకూడదనియు, విన్నవించుచున్నారు వాఙ్మయ ప్రవాహ మపార ధాటీ ప్రాబల్యమున రసపుష్టిచే వెల్లివిరిసి దేశముల నాక్రమించుచున్నది

యాలపాటలు నీతి బాహ్యములనియు, ప్రబంధ కావ్యములు నీతి భరితము లనియు, చెప్పజాలము బూతు దలపులు తేట పదములలో గూర్చబడినను, దుష్కర సమాన నిర్మితములయ్యును, నింద్యములే యగును యాలపాటలు సులభముగ నర్థమగు గాన వీనిలోని నీతిబాహ్యత యెక్కువ హానికరమని వాదింపవచ్చును కాని, కళాస్వరూపములవలన నీత్యవినీతులు ఏర్పడునని నమ్మజాలము రామాయణము జదివినందున శ్రీరామ సద్గుణము లలవడినవారును, రసావిష్ట వాఙ్మయ పఠనంబున పోకిరులైనవారును, నా కనుపడరు జననాంతర సంస్కార ఫలితముగను, యిహలోక సాంగత్య విశేషమునను, పుత్రకు పుట్టెడు బుద్ధులే మానవుల నీతి పాలిత్యములకు గారణముగును మనువ్వని సాంఘిక మత నైతిక రాజకీయోద్యమముల లేనిడలు కళా స్వరూపముల వెలిగించవచ్చును కాని, యివి ప్రత్యేకముగ కళాంశములుకావు వీనిని పోషించవలసిన బాధ్యత కావ్యములకులేదు సౌందర్య నిరూపణమందు కళలు లౌకిక మర్యాదల నతిక్రమించి నడచినను వానికి భిన్నముగ వర్తించినను లోపములేదు అయినను, యెంకిపాటలు మున్నగు నవీన ఖండ కావ్యములలో విశ్వ ప్రణయ సూత్రము లగుపడునేకాని నీచ శృంగార సూచన లగుపడవు

వ్యతిరేక విమర్శకులు చాలవరకు తా మలవడిన కావ్య కళా సంప్రదాయములకు బానిసలై వానినే పరమ ప్రమాణములుగ నెంచుదురు విద్య విషయ పరీక్షకు దోడ్పడు సాధనమై యుపచరించవలెనుగాని మనస్స్వాతంత్ర్యమును ద్రుంచు నిర్బంధ శృంఖలముగ నాచరించకూడదు అహంకారాభిమానముల వర్జించి కళా స్వరూపములను వాని ప్రత్యేక సంప్రదాయములలో పరిశీలించి బాహ్యా వేష ప్రాగల్భ్యమునకును అంతస్సార పాటవమునకును గల భేద మారసి విమర్శింపవలసియుండును ఇట్టి విశాలావలోకన మేర్పడిన సహృదయులే, రసపిపాసువులే, సౌందర్య విచక్షణులే, రసజ్ఞులనిపించుకొందురు వీరే విమర్శక వ్యాపార మలంకరింపదగుదురు

ప్రాచీన కవులు రసభావ పాటవ మేర్పడిన వస్తు నిర్దేశములందు కొన్ని తావుల శబ్ద వైచిత్ర్య ముపయోగింపబోయి రసహాని గురియుచుండు పట్టులలో మీదు మిక్కిలి హృదయావేదనను దెలుపవలసిన సందర్భములందు ప్రసిద్ధకవులందరు గ్రామ్య సంకాశ భాషా ప్రయోగము నవలంబించుచుండిరి నన్నయగారు, రాజసూయాధ్వర విజయ సందర్భమున వర్ణించిన 'మదమాతంగ తురంగ' పద్యములోని విషయము పేలవమగుటచే పదరత్న విరచితాలంకార సౌందర్య మేర్పరచి రంజింపజేసెను పోతన 'కలడందురు దీనుల యెడ', 'మన సారథి మన సచివుడు' మున్నగు హృదయ విదారక రసవత్సందర్భములందు సంభాషణ వైఖరుల రసవాహక సామర్థ్యమును నిదర్శించెను గ్రామ్య ఫణితు లొసంగెడి ప్రీతిని, ఒలికించెడి జీవకళను గ్రాంధికరీతు లేర్పరచజాలవు 'మాకోసము తల్లిదండ్రు లదిగో యిదిగోయని చూచుటాయె' యిందుగల సొగసు, మర్మ విదారక స్వదేశ సంస్కృతి, 'నను నిముసంబు గానకయున్న నూరెల్ల నరయు మా యక్క కెంతడలు వొక్కొ', యను పెద్దన ప్రయోగమందు గానరాదు పూర్వకవులేమి, నవీనులేమి, గద్య పద్యముల జీవ ప్రతిష్ఠతతో రచించువారందరు సమకాలిక సంభాషణ వైఖరులనే యవలంబింతురు భాషలు తమంతట దాము మిన్నలై యవతరించలేదు ధీమంతుల భావపరితోషికము లచే యెలికల బాసలకు సారస్వత గౌరవ మేర్పడినదికాని పదములకు స్వాభావిక వైచిత్ర్యోన్నతులు లేవు యాలపాటల భాషా మర్యాదలను ఆక్షేపించవలసిన కారణ మగుపడదు వారి కథా సందర్భములు, భావములు, రసస్ఫూర్తి నింపార విస్ఫురింపనిచో, వానివలన రసానంద మేర్పడి గుండెలు జల్లురని సౌందర్య సాక్షాత్కార మొదవినచో వాని నొక కావ్యరూపముగ నేల యంగీకరింపకూడదో తెలియకున్నాము

మర్మము విడిచి యంత కరణతో మాటాడు సందర్భములందు మన ముపయోగించెడి పలుకు తెరపులే మనకు సహజమైనవి అట్టి పలుకులే వాక్యగతులే వాణీవిలాసములే హృదయ మర్మముల దాకి యలరించి, కరగించి విశ్వసనీయముగదోచి యుల్లము నుత్సాహ పరుచును మన నిత్య జీవితమునకు సంబంధించని యలంకార చమత్కారము, వ్యాకరణ విశుద్ధత, లాక్షణిక కావ్యఫణితులు, విచిత్ర రమణీయములై శిల్పి నైపుణ్య సూచకములై యసాధారణ కల్పన ప్రభావమును జూపవచ్చును కాని, హృదయ మర్మముల గదలించి రసావేశ మేర్పరచ జాలవు ప్రాబంధిక ప్రణయ సంభాషణములలో నొక్కటైనను 'నాకు నీకు జోడు అయితే మల్లెపూల తెప్పగట్టి తెప్పమీద తేలిపోదము పదరా' యను గ్రామ గీతికతో సర్తు గౌరవమందును, శృంగార మర్యాదలందును, శయ్యామార్దవ మందును వెనయైన వగుపడవు ప్రబంధములలోని రసాడంబరము గుగ్గిలపు మంటవలె మిన్నంటి విస్ఫురియు గాల్చనేరదు గ్రామ్యగీతము లత్యంత సుకుమారవాణీ విలాస శోభితములై యాబాల గోపాల మానందించు లలిత సౌందర్యమున జెన్నొందుచున్నవి దేశభాషలందు తెలుగు 'లెస్స' లందున జనసామాన్య ముపయోగించు వాడుక పలుకు లద్వితీయ గీతికా మాధుర్యరాసులై తడియారుచుండును ప్రాకృతాంధ్రము జనానుకూలమైన భాష. భక్తి శృంగార రసములు గేయ కావ్యములందు మిక్కిలి రుచించుచుండును ప్రాకృత

జనరంజక గీతికలను జాతీయగాన వైఖరులలో గూర్పబడి, తమ భాషయొక్క సంగీత ప్రభావమును సంపూర్ణముగ వెలిబుచ్చుచు వీనిలో వైదుషీ ప్రాగల్భ్యము, విజాతీయ సంపర్కము బొత్తిగ నగుపడదు ఆంధ్ర పదముల తేట సొబగులు ఆంధ్ర జాతీయ గీతికా క్రమముల లేత కాంతులతో, మెళవించి ప్రాకృత జన సహజమగు నిష్కపట రస స్ఫూర్తితో యాలపాటలందు సాక్షాత్కరించుచు వీని సొబగెరింగి, యుపయోగమెరింగి, నవ్యోదార భావ వాహక సామర్థ్యము నెరింగి, ప్రశంసనీయముగ చక్కని గేయకావ్యము తీర్చిదిద్దిన నండూరి సుబ్బారావుగారి నిసామాన్య ప్రతిభా విరాజితులుగ నెంచకతీరదు వీరి 'యెంకి పాటల'లోని గొప్పనిటి నీయెడ రసభావ టీకా సమన్వితంబుగ వివరింపనున్నాను

వలపులాడి, తన చిత్తమంతయు ప్రియునకు వశపరచియున్నది లౌకిక సంపదలను, ఆభరణాది పారితోషికములను ఆశించుటలేదు 'సరకు లేమి కావాలి సంతాపిల్లా! నీవు నరము మిడిసి మన సియ్యి నాయుడుబావా!' ఎంత పవిత్రమైన, అమాయకమైన కోరిక! ప్రియుని ప్రణయమె యపేక్షించుచున్నది తన కిట్టి లాభము కలుగకుండినను ప్రియుడు, 'సల్లగుండుటయే' వాని యాయురారోగ్య సంపదలనే వాంఛించుచున్నది 'నువ్వు సల్లగుండు పద్మాక నాయుడుబావా' అను వాక్యములలోకన్న 'ఆయుష్మాన్ భవ, విజయీభవ' మున్నగు గీర్వాణాశీర్వాద వాక్యములలో గల రస మగుపడదు ఇందు సావిత్రి తక్క, మరి యే ప్రబంధ నాయికయు, యెంకికి సరిరాదని చెప్పవచ్చును యెంకిపలుకులు 'సల్లగ' ననుటతోనె దాని యపార నిర్హేతుక ప్రేమ స్వరూపమును జూపుచున్నది దాని కడుపు చలువను తేటపరచుచున్నది 'ఏదనే నీ కాపుర మెల్తురుపిల్లా! నీ నీడలోనే మేడ కడతా నాయుడుబావా!' మనోనాథుని జీవితమున కితరమును యెంకి వర్తింపనేరదు వలచిన మగడు స్వాతంత్ర పౌరుష ప్రభావ సంపన్నుడగువాడు యెంకి, వానితో నైక్యమొందనేరదు వానిలో జేరజాలదు కాని వాని ననుసరించి వాని ప్రభావమున తనకందు పద్ధతులలో జీవింపగలదు మరియు నీడ, వస్తుభ్రాంతి నేర్పరచునుగాని వాస్తవ స్థితి కలదికాదు మానవదేహము, జీవితము, నీడవలె చంచలమై, యనిత్యమై యున్నది ఇట్టి నీటిబుగ్గను లేనిదిగ వరించి తన మనోవాక్కాయ కర్మముల వశపరచి తదర్పిత జీవయై చరించుటలో నిత్య సద్వస్తువును సాధింపగల యుత్తమ ప్రణయతత్వ మనుభూతమగుచున్నది దైహికమైన, సాంసారికమైన, ప్రణయ ప్రశంసలలో వలపు చేతలలో, పరమార్థ సాధకంబగు భక్తి సౌధ సాదము లేర్పడుచున్నవి మేడ కడతా నను టలో సఖండమైనా నిత్యమైన పరమైశ్వర్య మను ఫలితమను యర్థము ఈ యైశ్వర్యాను భూతికి అలౌకిక సాధనములు వెరొండువేవు బాల్య కౌమార యౌవన జరావస్థలలో మనకభిమతమగు వస్తు ప్రపంచమే మనల నాకర్షించి సంగ సంపర్క మేర్పరిచి, రాగ ద్వేష పూరితుల గావించి, కర్మ నిబద్ధులజేయు లౌకిక సందర్భములే సరియైన రీతిని వాడబడినచో లేతు చూపున జూడబడినచో, నిత్యైశ్వర్య విభూతు లొసంగగలవు లోకమంతయు పరమేశ్వరుని నీడ మన మానవ సంకల్పము లిందుననే చెలగాట లాడుచు మనోరథ పరంపరల నూహించి సాధించుకొనుచు, మనోరథ పరంపరల నూహించి సాధించుకొనుచు, దురాశా దుర్మోహ నిబద్ధములై లౌకిక సంపదల నరయుగలవు అటుకాక నిస్సంగముగ, నిరపేక్షగ, వర్తించువార లీ లోక విషయములందే పరమైశ్వర్య సాధకంబగు విశుద్ధ ప్రణయశిక్ష నొందగలరు ఉనత్యా నిత్యమగు లోకమే మనల కర్మబద్ధుల గావించుటకును, మోక్షసిద్ధుల నొనర్చుటకును, ఉపయోగించుచున్నది యెంకి పరతత్వ సాయుజ్య మపేక్షించు సాధక జీవము నాయుడుబావ నిత్య సద్గుణ సంపద్విలాసితుడగు పరతత్వము భక్తియోగ రహస్యముల నీ పాటయందు పల్లెటి వలపు చూపులో, నమేయ భావ గాంభీర్యమును, అమాయక ప్రణయాలాపమును బొందుపరచి చూపియున్నాడు

"యెనక జల్మములోన యెవరమో" నంటె,
సిగ్గొచ్చి నవ్వింది సిలక—నాయెంకి

. . . .

"ముందు మన కేజన్మ ముందోలె" యంటె,
తెల తెల్లబోయింది పిల్ల—నాయెంకి

. . . .

"యెన్నాళ్ళు మనకోలె ఈ సుకము" లంటె,
కంట నీ రెట్టింది జంట నా యెంకి"

ప్రాక్తనవాసనా ఫలితముగ పశు పక్షి సుతాదు లేర్పడుచుందురు మనుష్యుడు కార్య కారణ సంబంధ మరయు హేతువాదములో జీవకోటిని అతిశయించుచున్నాడు ప్రస్తుత మనుభవించెడి సిరిసంపదలతో, ననుకూల పరిస్థితులతో, యదృచ్ఛా సంప్రాప్తములుగ నెంచి సంతసింపక, అవి భూత భవిష్యత్తులందు కూడ నెటులుండెనో, ఉండబోవునో, యను నాలోచనయందు రమించుచుండును ఈనాటి ప్రియవస్తూపలబ్ధి చిరంతనముగ నుండై తన వెంట వెన్నంటి వచ్చినదను తలపులో నొక వింత సంతస మొందుచుండును. లౌకిక పద ప్రముఖులగువారు తమ యున్నత పదవికి వంశ పారంపర్య మేర్పరచుకొనుచుందురు యెంకి పూర్వ జన్మములో కూడ తన్నెడబాయని యర్ధాంగిగ నుండెనని యతావెచే చెప్పించుటయం దీ నాయకు డుత్సాహియై యుండవచ్చును. లేక, యిప్పటి ప్రణయ ప్రసంగములు కార్య రూపమును దాల్చియుండిన యెడల 'నేను నీ భార్య' నని చెప్పించు వేడుక యాతని డెందమున దలయెత్తి యుండవచ్చును. ఈతని ప్రశ్నమునకు సూటిగ జవాబిడక 'సిగ్గొచ్చి నవ్వింది సిలక నా యెంకి' యను టలో పై యర్థమును సూచించుచు వైవాహిక క్రియవలన నదివరకు బట్టబయలుగ

వలచుచుండెను. ప్రియురాండ్ర కెర్పడు లజ్జను రమ్యముగ సరసముగ చిత్రించియున్నాడు చౌర్య సురత వ్యాపార రీతివిధి యుభయులపట్ల నొకింత వెలుపరింపుతో గూడి యుండుసు వైవాహిక ధర్మమందు ప్రణయ సందర్భములు భక్తి విశ్వాసలజ్జా సమన్వితములై, ఒక్కదేని మెరుగని, వాహాటార్భట మింపరించిన, రేల తళుకులతో నగు పడుచుండును ఒననాంటి సంబంధపదముల బ్రూర్వ లస ఫలముగ, నిహలోక మందు యెంకి లస మనోనాయని గూడియుండవచ్చును నూతన స్థితి కార్యకారణ సంబంధ విచారణచే కొందరరు నిర్ణయించవచ్చును. కాని, భావి పరిణామ మెటులుండునో? ఆం దేసరి సంస్కార మేరీరిగ పరిణమించి, గావిజన్మలో నెట్టి ఫలము నొసంగునో? ప్రవృత్తానంద సంతృప్తిలో పరిచిన తన్మయత్వం సరచి, సుఖ ఫలోద్యములుగ భావించి, సమన్వయించుకొనవచ్చును కాని నావిస్థితిని యాలోచించునపు డున్ని మానసమైన దల్లడిల్లకమానదు వాపిస్థితి తెలియనందువలనె వైవాహిక దేహ విసర్జనానంతరము పరణము ఔనావహమగుచున్నది భావి జన్మలో నిస్సార సిద్ధికలు ఏనో యుండదో యుని సందేహె, యెంకి తెలతెల్లవోపిమ్ము లేక నాయకు డైహిక సౌఖ్యముల, దేహసంబంధముల, జీవంతరవ్యాప్తి నపేక్షించుచుండ యెంకి (సాధురాలు, సంసార పరివర్తనముతో విసిగి వేసారిన జీవుడు సత్వరమోక్షోపలబ్ధిని కాంక్షించుచు సంబంధ వినాశ మన్వేషించుచు) నాయకు డడిగిన ప్రశ్నమున కచ్చెరువంది వెలవెలవారి యుండవచ్చును సృష్టిక్రియా నిరతుడగు పరమేశ్వరుడు జీవుల నెల్ల విశ్వ వ్యవహార నిర్వాహక ప్రవృత్తిలో మండగోరుచుండును ముముక్షువులగు సాధకులు సంసార పరివర్తనములనుండి తప్పించుకొని విశ్వ వ్యాపారములకు దూరముగనుండు నిత్యసంస్థితి నపేక్షించుచుందురు ఓమారుఖయ్యాము చెప్పినట్టుల, జీవవాహిని యనంతముగ జారుచు 'అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత! అవ్యక్త నిధనాన్యేవ' అను నటుల భూత భవిష్యత్తు లగోచరములై సంశయాస్పదములై నమ్మరానివై ఛాయారూపులై యున్నవి ఎన్ని విద్దెల గరచినను, విజ్ఞాన ప్రపంచమెల్ల శోధించి విచారించినను, నూతన భవిష్యత్స్వరూపముల దెలియజెప్పినవారు, జీవుని భావిగతు లరసి తేటపరచినవారు అగుపడరు అందుచే రేయింబవళ్లు నిష్ప్రయోజనముగ భావిస్థితినిగూర్చి చింతించి, విసుగొంది, దరిగానక విలపించుకన్న నైహికమగు వర్తమాన పరిస్థితులనె నిత్యముగ నమ్మి, ఇహలోక ఫలములతో సంతుష్టిజెంది, సదానంద భరితులమై, మన జీవిత కాలమును గడుపు టుచితమని పారశీక కవిపుంగవు డభిప్రాయపడుచున్నాడు రసోన్మాదమొంది నిర్వ్యానందములో చీకు చింతలు లేక జీవిత కాలమును గడుపవలయునని ఓమారుఖయ్య ముపదేశించుచున్నాడు అవవిత్రదుర్నీతి ప్రసంగములతో షోకు చేసుకొనుమని ఆతని యభిప్రాయము కాదు నిత్యానంద పరవశులై, జీవయాత్రలో దాపరించెడి మంచి చెడ్డల నన్నిటిని సుఖానంద సంధాయకంబులుగ నన్వయించుకొని, యోగియై, నివసింపవలెనని యాతని తలంపు కొందరు వేదాంతులు 'ఆయు ర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యవ్వనమ్' మున్నగు భావములతో 'వెంగి వెలగి జ్యోతీ మలగిపోయేటపుడు ప్రమిదతో ఒకమాట చెప్పిపోయినదా' యను తలంపున నైహిక సంబంధము లనిత్యమనియు, వైహిక సంసార మొక భ్రాంతియనియు, దీనిలో మున్పుల మున్నీరురుక్క వెరొండు సుఖమెద్దియు గోచరింపదనియు, 'రస్మాత్ జాగ్రత జాగ్రత' యనుచున్నారు యెంకికి, వెనుక సంగతి తెలియదు కాని ప్రస్తుత స్థితినిబట్టి వెనుక సంగతి యూహింపగలదు వావిగతి యయోమయము అందుచే ప్రస్తుతస్థితిలోనే వర్తమాన జీవన ప్రపంచమందే తన ప్రణయ సాధనను, భక్తి ప్రేమములను, ప్రబర్తించి పరమానంద మొందదలచుచున్నది కాని, భక్తి సాధన ప్రవృత్తిలోనున్న జీవుడు నిత్యానంద పరవశుడై, ముందు వెనుకల మరచి, చిందులాడుచున్నను, దేహ సంబంధమున సంప్రాప్తమగు సుఖ దుఃఖములకును కష్ట నిష్ఠురములకును, వగవకమానడు 'యెన్నాళ్లు యీ సుఖము' అని యడుగ నిత్య నిశ్చల సుఖాను భవ మీ జగమున దొరకదను సూచనతో సుఖదుఃఖము లీ యుపాధి ధర్మములను తలంపులతో, 'కంట నిరెట్టింది జంట నా యెంకి' ఈ గీతికా రత్నమందు సుబ్బారావుగారు ఒసద్వృత రస వైభవముతో సగాద తత్వార్థము దెలిపి, యోమరుఖయ్యా మొసంగిన యుపదేశములనె బలపరిచియున్నారు కాని, ఈ భావములను ఖయ్యాము విచారకరముగ నయోమయముగ వెలుపరించియుండ, సుబ్బారావుగారు, మనోహర సుకుమార నిరూపణ మొసంగియున్నారు వీరి యెంకిపాటలలో వెలుగొందు తత్వార్థములు విశిష్టాద్వైతపరముగ నున్నవనుటకు సందియముండదు ఇందునసే కాదు, రూపకల్పనమెచ్చట గలదో జీవాత్మ పరమాత్మల సంబంధము లేయెడ కావ్యరూపమును దాల్చినవో, చిత్ర శిల్పాది నిరూపణ మొందినవో, అచటనెల్ల విశిష్టాద్వైత భావన క్రమములే యగుపడును అద్వైత సిద్ధాంత మొక నాస్తికవాదము, విశ్వ సౌందర్యమును మూలంట వెలరించు, భక్తి నిర్మూలన మొనర్చు బ్రహ్మవిద్య భగవద్గీతలు, ఉపనిషత్తులు, వేదాంత సూత్రములు, భాష్యములు మున్నగువానిలో నద్వైత సిద్ధాంతములు రాజిల్లుచుండునుగాని భాగవత రామాయణాది కావ్యములందు జీవుని సాధకుడుగను, వియోగ దుఃఖ మనుభవించెడి వలపుకత్తెగను, పరమేశ్వరుని సిద్ధి స్వరూపముగను చిలించు విశిష్టాద్వైత మర్యాదలే గోచరించును

'యెంకిపయన' మను పాటలో 'పడుకుంటే నా కేటొ బ్రమపుట్టినాదీ కడుపులో పెయ్యేసి కలిపేసినాదీ!'

అవి యొక చక్కని స్వప్న వృత్తాంతమును ముచ్చటగ చిత్రించియున్నారు 'అంసల్లె బొమ్మల్లె, ద్దాలత బరిణల్లె, సుక్కల్లె నాయెంకి, సురిగిపోయిందంట' తిరుపతి యాత్రలో ఏడుకొండులవాని జూడబోయెడి పల్లెటి యాత్రికుల ప్రయాణ సన్నాహ మత్యంత విలాప యుక్తముగ వర్ణింపబడినది 'ఆ సామీ మీదెన్నో వూసూ లాడుకొంటూ, కొండ మెట్లున్న నీ కొంగట్టు కెక్కాలి' యనుటలో 'అడుగు అడుగు దణ్ణాల వాడా, ఆపద మొక్కులవాడా' అను భావమును జూపించియు యెంకన్న చేయవలసిన ఘనకార్యము, 'రేతిరి పగటేల రెప్పెయ్య కెంకీని సల్లంగ సూడమాని సామీతో సెప్పాలి' అనుకుంటున్నాడు మన నాయకుడు ఇది యెంత స్వభావ సిద్ధముగ నున్నదో చూడండి

కాని, ఈ ప్రణయ ఎటుత్వము కాల ప్రభావమున నొకింత మబ్బు చూపినట్లగుపడును 'పాటునుండే యెంకి సబకు రాజేశావ?' యను పాటలో యెంకికి జబ్బు వచ్చినప్పుడు తన విచారమును జూపుచు 'రంగులైన చీరకట్టి, ఎజారంచు రవిక తొడిగి, బజారుపాలైతివే రమణి ముద్దులగుమ్మ', 'బందారు రైలు యెందుకూ, గుంటూరు మాకామెందుకూ, రాధారి చీటియెందుకూ, వదిమందీ గూడేదెందుకో, అల్లుడా మేనల్లుడా!' మున్నగు జాలికరమగు పాటలలో విలసిల్లుకావ్యధోరణి యగుపడుచున్నది విరహ వేదనలో తన సంచారి భావముల బ్రకటించిన తెరంగు "అకాలపు యెంకి" అను దానిలో నగుపడును

మన దేశములో జాతియోద్యమ మారంభించినదిమొదలు సుప్రసిద్ధమగు జాతీయ గీతికా ఫణితులలో నవ్య భావముల బ్రకటింపసాగిరి పార్శ్వమట్ల ననుకరించెడి నాటక గీతికా క్రమముల నవలంబించి, యాడువారి పాటలు ప్రాచీన మనోహర లాలిత్యమును దప్పియున్నను, మేలుకొలుపు, జోల, లాలిపాటలు, దసరా పద్యములు మున్నగు నచ్చ తెనుంగు తెరవుల ననేక రమ్యకావ్యము లుదయించినవి తరువాత యాలపాటలను మా బోంట్లు సాహసించి ప్రచురింపసాగిరి వల్లూరు జగన్నాధరావు, ప్రాకృతాంధ్రగీత క్రమములతో పెక్కు సంఘ సంస్కరణ భావోద్దీపకంబులగు పాటల గల్పించి గ్రామఫోను సహాయమున ప్రకాశింపజేసియున్నారు మన దేశములోని యుత్సాహవంతుల మాట చొప్పున 'కొందరు పండితాగ్రేసరులు, విద్వత్కవులు, యాలపాటల సరస లావణ్యాభినందించియున్నారు శాస్త్ర వాఙ్మయము, భావ ప్రధానమై ప్రపంచములోని నానా దేశముల విజ్ఞానసంగిని యనుభవ పారితోషికము నందికొనుచు, సంస్కృతాంగ్లేయాది విదేశ పద జాలముతో, సమర్ధింపవలసియున్నది కాని, రస ప్రధానమగు కావ్యముల కిట్టి యన్యాశ్రయ మనవసరము మనుష్యుని, రసానుభవముల గమ్మగ, తీయగ, వెలిగించు సుకుమార మనోహర పదజాల మన్ని జాతులకును, జాతీయ భాషలకును, స్వాభావికముగ నేర్పడియున్నది ఇట్టి పలుకు విరులతో స్వతంత్ర వికాసమొందిన జాతీయ గీతికా గమకములతో —చక్కని, చల్లని, కైతదండ లల్లవచ్చును సుబ్బారావుగారి, మార్గదర్శక స్వాతంత్ర్య మభినందించుచు, నిట్టితెరవున నశేష ప్రయత్నములు జరుగగలవని వేడుచున్నాము

# దక్షిణాది తెలుగు - కొన్ని పాత వుత్తరాలు

వేమూరి విశ్వనాథశర్మగారు ఎం. ఏ.; ఎల్. టి.

[1925 క్రోధన సంవత్సరాదిసంచికనుండి]

చోళదేశము (తంజావూరు రాజ్యము) ఆంధ్ర నాయకుల పరిపాలనక్రిందనున్న కాలమున తెలుగుభాష యీ దేశాన చాలా ప్రచారంలో ఉండేది రాజులకు మాతృభాషవుటచేత రాజకీయ వ్యవహారాలు కూడ తెలుగులోనే నడిచేవి ఇతర భాషలు మాట్లాడే రాజులకు తంజావూరి నాయకరాజులు తెలుగులోనే వ్రాసేవారు. వారి ప్రత్యుత్తరాలు కూడ తెలుగులోనే ఉండేవి ఈ పద్ధతి ఆంగ్లేయుల కంపెనీవారి హయాములో కూడా జరుగుచుండెను దీనినిబట్టి ఈ దేశంలో తెలుగుభాషకుండిన ప్రాముఖ్యము కొంత వర కూహించుటకు వీలగును

తెలుగు నాయకుల తరువాత మహారాష్ట్రులు రాజ్యానికి వచ్చిరి మహారాష్ట్ర రాజులు కూడ నాయకుల పద్ధతినే అవలంబించిరి ఇతర రాజులకేమి, కంపెనీ దొరలకేమి వీరు వ్రాసిన ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులోనే ఉండేవి వీరి కితరులు వ్రాస్తుండిన ఉత్తరాలు కూడ తెలుగులోనే నడిచేవి తంజావూరి మహారాష్ట్ర రాజులలో ప్రసిద్ధికెక్కిన తుల్జాజీకిన్ని అతని తమ్ముడు అమరసింహ మహారాజుకున్ను వ్రాసిన తెలుగుత్తరాలు నలభై వరకు నాకు లభించినవి ఇందు శృంగేరి స్వాములవారు మొదలుకొని ఆర్కాటు నవాబువరకుగల అన్ని జాతులవారు వ్రాసిన ఉత్తరాలు గలవు మచ్చుకు కొన్ని ఉత్తరాలు యిచ్చట ప్రచురించుచున్నాను ఈ ఉత్తరాలన్ని రమారమి నూటయేబది సంవత్సరాల నాటివి.

ఈ వుత్తరాలు చదివినమీదట అప్పటి దక్షిణాది తెలుగు స్వచ్ఛముగా నుండె దని స్పష్టమగును అరవ మాటలే కానరావు. తురకల సంపర్కము సోకిన తరువాత కృష్ణరాయల నాటికే వారి మాట లనేకము మన భాషలో జీర్ణించినవి ఇట్టి వ్యత్యాసమునకు కారణ మేమై యుండును? తెలుగునకు అరవమునకును పొత్తు కుదురుట కష్టమని అనుకుంటాము లాలిత్యమైన సరళ స్వభావముగల తెలుగులో పిడిరాళ్లవంటి కటువు పదములుగల అరవ మాటలకు యిమిడిక కుదురదు ఇంతకంటె మరియొక కారణము కానరాదు అరవంలోనుంచి తెలుగు పుట్టిందని భ్రమ పడెడివారి వాదమునకు ఈ రెండు భాషలకు పొద్దిక లేకుండుటయే ప్రబల విరోధము.

అయితే యిప్పు డిక్కడి తెలుగువారు మాట్లాడే భాషలో ముప్పాతిక వంతు అరవ మాటలే దీనికి కారణము వేరు ఇది తెలుగు మరిచిపోవుటవల్ల పట్టిన దురవస్థ మహారాష్ట్ర రాజుల కాలములో తెలుగు కుండిన రాజకీయ ప్రాముఖ్యము వారి తరువాత పూర్తిగ పోయినది అందుచేత నిక్కడి యాంధ్రులు కూడ తెలుగు మరిచిపోవుట తటసించినది మన దేశములో కూడ ఇంగ్లీషు చదివినవారు తెలుగు మాటలు తోచక యింగ్లీషుతో తెలుగు మాట్లాడుదురు అట్లే యిక్కడి తెలుగువారు అరవము కలిపి తెలుగు మాట్లాడుదురు అంతమాత్రముచేత ఈ భాషలకున్ను తెలుగుకున్ను ఒకదానిలో నొకటి జీర్ణించుటకు తగినంత పొద్దిక గలదని చెప్పుటకు వీలుపడదు. ఈ సంగతిని భాషా పరిజ్ఞాతలు గమనించెదరను తలంపుతో ఈ పాత ఉత్తరాలను ప్రచురిస్తున్నాను.

## 1. శృంగేరి స్వాములవారి శ్రీముఖం

**ఆశీర్వచనానంతరము :—**

"ఈ ధర్మ సంస్థానము అనాది సిద్ధమైన శ్రీ శంకరాచార్య శారదాగురు పీఠమనే టువంటి సేతు హిమాచల పరియంత్రం ప్రసిద్ధమై ఉండేదానివల్ల ఈ సంస్థాన విషయమందు తాము పూర్ణ సాభిమానం వుంచి నడిపించేటటు వంటిది అనేక శ్రేయసుకు కారణమై ఉండేది సరిగదా ॥సాంప్రతం॥ శ్రీ సేతు యాత్రార్థం స్వారీ దిగ్విజయం చేశేటందుకు మార్గ సంరక్షణార్థం కుంఫిణి సరకారునుంచ్చి కాతగ్గ సాహిత్యం చేయించ్చి యిచ్చి రహదారి బిన్నవతీలవెూదులుగా వ్రాయించి యిచ్చినదానివల్ల స్థళంనుంచ్చి సంస్థాన సమేతంగ్గా వెడలివచ్చి వున్నారము గనుక సధ్యా ఆ ప్రాంత్యానకు విజయంచ్చా యెడ మౌతూ వున్నది ఆ వివరమంతా అరుణాచలశాస్త్రి శృతం చేసినదానివల్ల సవిస్తారం అంతఃకరణకు విదితమయ్యేనని వ్రాకు (పరాకు) శ్రీసెతుయాత్రార్థం అస్మత్పూర్వాచార్యులవారు దయచేసి ఉండినపుడు లనేక సేవ సత్కారాలు చేశి ఈ ధర్మ సంస్థాన విషయమందు బహుతరం సాభిమానం వుంచ్చి నడిపించ్చి ధర్మకీర్తి సంపాదన చేసుకొని ఉండిన దానివల్ల యిపుడున్ను సంస్థాన మర్యాదానుసారంగా యాత్ర పూర్తైత మైయ్యే టటుగా సకలాంశముల యందుంన్ను పూర్ణ సాభిమానం వుంచ్చి నడిపించ్చి శాశ్విత ధర్మకీర్తి సంపాదించ్చుకొనేటటు చేపించ్చవలెను. సకల ధర్మ సూక్ష్మములుంన్ను తెలిసి నడిపించే టువంటి ప్రజ్ఞాశాలి మహాప్రభూలకు పత్రికా ముఖాంత్రం విశేషం వ్రాయించ్చి పంపిచ్చవలెశినది యేమి వున్నది యింతోధిక సాంమ్రాజ్య వైభవాతిశయం కావలెనని శ్రీ శారదా అమ్మవారు శ్రీ చంద్రమౌళీశ్వరస్వామికి ప్రార్థనచేసి ప్రసాద మంత్రాక్షతలు పంపించ్చి వున్నది తీసుకొనేటటు చేపించ్చవలెను

## 2 ఒక శుభలేఖ

"శ్రీమత్సమస్త సద్గుణ సంపంన్న అఖండిత లక్ష్మీ సేవా ప్రసంన్న అవ్యాజ పరోపకార అనేక ధర్మ పరిపాలక స్నేహిత పరిపూర్ణ వాత్సల్య మహాంమ్మేరు సమాన ధీరులయ్ని మహారాజశ్రీ సంబ్భాజీ శివరావు వారికి,—

శే॥ వైద్యలింగ్గం సాష్టాంగ దండములుబెట్టి శాయంగ్గల విన్నపాలు యిచ్చట ఆవణినెల ౨౦ తేదిసర్కు కుశలం తమ నిరంత్తర సకల సంతోష సాంమ్రాజ్య అతిశయము లకు వ్రాయించ్చి పంపిస్తూ రావలెను ఠ॥ ఈనెల ౨౮ తేది భానువారం దినమందు ధనుర్లగ్నమున చిరంజ్జీవి తంమ్ముడు శివదెంబ్బరానికి వివాహ ముహూర్తం నిశ్చయమై వున్నది గన్క తాము కటాక్షించ్చి యింత్తపరియంత్రం విజయంచేసి ముహూర్తం నెఱవేర్చి యిప్పించే లాగ్గు శాయవలెను తాము అభిజ్ఞులుగన్క విశేషించ్చి వ్రాసుకో గలది లేదు గదా కడమ యిచ్చట నడ్వగల ప్రయోజ్నములంకున్ను అచ్చటి సుభోదయములకుంన్ను వ్రాయించ్చి పంపిస్తూ రావలెను యింతే దండ్డములు.

## 3. అమరసింహుడు శంకరాచార్యులకు

"త్మ ముఖ్య శిష్యులైన శ్రీ మదమరసింహ్మ భూపాలకులు అన్కే దండవత్ప్రణామములుచేసి శాయంగ్గల విజ్ఞాపనములు —ఠ॥ శ్రీవారు చెన్నపట్ణ ప్రదేశాన్కి తర్లి చాలాదినము లాయిను గన్క శ్రీవారి చరణారవింద దర్శనాపేక్ష చాలా ఉన్నది గన్క అచ్చటి ప్రదేశ సంచ్చారం శీఘ్రంగా చేసుకొని ఆషాఢ శుధ పౌర్ణమి యీవలో కుంభకోణ ప్రదేశాన్కి వచ్చి చేరితె చాల సంతోషంగ్గా వుండ్డును హరిభట్టు ధవళీకర్ అనే బ్రాహ్మణుడ్కి కొంచ్చం అపవాదం వచ్చింది త్మసముఖాన్కి విశదంగ్గా శృతమై వుండ్డును గద ఆ బ్రాంహ్మడు ధర్మశాస్త్ర విధాయకుడు గన్క హవ్య కవ్యాది సమస్తమున్ను నిలిచిపోయి వున్నది గన్క వారి బంధువులు మరిన్ని వుండ్డే బ్రాంహ్మణులు నగరి వారి వద్దవచ్చి చాలా లర్జు చేశిరి గన్క మనకున్ను ఆ బ్రాంహ్మణ్ణి పునీతుడు శాయవలెనని తోచి శ్రీవార సముఖాన్కి విజ్ఞాపనము వ్రాసుకొన్నది. హరిభట్టు చెన్నపట్ణములో ఉన్నాడు లతడు శ్రీవారి సముఖాన్కి వచ్చును వాడియందు శ్రీవారు దయచేశి ప్రాయశ్చిత్త రూపంగ్గా యేమైనా చేయించ్చి వారిని పునీతుడుగా శాయతగ్గది. యీ కార్య నిమిత్యం మన వక్కీలు త్రియంబక సంభాజిబావావారు శ్రీవారి సన్నిధానమందు విజ్ఞాపనము చేస్తురు ఆలాగున దయచేశి శాయతగ్గది."

## 4. కంపెనీ దొర వ్రాసినది

"శ్రీమత్సమస్త సద్గుణ సపుజన్య సింధు శిరోమణి దేవ బ్రాంహ్మణ వేదపాలకులైన శ్రీమదఖండిత లక్ష్మీ అలంకృతులైన రాజమాన్య రాజపూజిత మహారాజరాజశ్రీ పంతులవార్కి —

మెస్తర్ బెయిన్ దుబాసి శన్కపలి రంగ్గనాయకులు దణ్ణములుబెట్టి శాయంగ్గల విన్నపములు మేముంన్ను విళంబ్బినామ సం॥ సంగ్గుపినెల ౨ తేది స్థిరవాసరముల

కర్కు—త్మయొక్క ఆశీర్వాదంవల్లను త్రిశరపురము (తిరుచినాపల్లి) లో క్షేమం. త్మయొక్క కుశాలీ నామా నిరంత్తరం దయవుంచ్చి నిరూపం వ్రాయించ్చి పంపింస్తూ రావలెను. త॥ త్మవద్ద సెలవు పుచ్చొక నింన్న ఉదయాన త్రిశరపురం చేరినాము. మా దొరవద్దవున్న అరకార సుబ్బయ్య త్మయొక్క ప్రాపున జీవనం చాయవలెనని దొర వెంబ్బడిని పోక సెలవు పుచ్చొక యిచ్చటనే నిలిచెను. దొరన్ను యీాయన నిమిత్యం చాలా చెప్పిపోయినాడు. కాబట్టి త్మకు మనవి చేసుకుంన్నాను. యీాయ్న మంచ్చివాడు. పనిపాటల యందు జాగ్రత కలిగి వుండ్డును. నాయంద్దు చాలా దయవుంచ్చి యీాయ్నకు త్మ ప్రాపున అన్నంకల్పచేసి సంరక్షణ చేసేటట్టు దయచేసి నడిపించ్చవలసినది. నేను సార్వ వాత్మయొక్క శ్రేయస్కరం కోరుతూ వున్నాను. త్మకు మిక్కిలిన్ని వుపదరించ్చి వ్రాయ వనిలేదు గదా. అచ్చటి శుభోదయాములకుంన్ను యిచ్చట నే నడుచుకోగలంద్దుల్కు నిరూపం వ్రాయించి పంప్పించే దయ శాయవలెను. యిదే దంణ్ణములు. వింన్నపత్రం తప్పులు క్షమింప్పవలసినది. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ."

## 5. ఇంకొక వుత్తరం

"శ్రీమతు సకలగుణ సంపన్నులైన రా॥ రాజపూజితులగు రాజ శ్రీ బచ్చన్నపంత్తుల మంత్రి) గార్కి,—

మెస్తర్‌బోన్‌సువారు సలాం. నేనున్ను చెన్నపట్నములోను సుఖం. మీయొక్క సకల శుభ సంతోషాతిశయములకు వ్రాయించ్చి అంప్పించటం దయశాయవలె. త॥ మొన్నటిదినం మీాపని నిమిత్యం వ్రాసి అంప్పించిన జాబ్బుకు బదులు కాబట్టి రా॥ రామా రాయనివారిని పిల్వనంప్పించ్చి మా జాబులోని మతలపు అడ్గి తెలునుకుంట్టె ఆయ్న మీకు నిశదపరుచును. మహారాజావార్కి నా అనేక సలాములు చెప్పవలెను. మార్చినెల 9 తేది 1779 సం॥"

## 6. మిషనరీదొరవుత్తరం

"శ్రీమత్సమస్త సద్గుణ సౌజన్య మేరుధైర్య సాగర గాంభీర్య నయ వినయ ఉదార దాక్షిణ్య స్నేహ పరిపూర్ణా ఖండలక్ష్మీ ప్రసన్న అవ్యాజ పరోపకార నిరత బహు కుటుంబ్బాధార రాజమాన్య రాజపూజిత మహారాజరాజశ్రీ నృశింహ్మ రాజ పంత్తు స్వామివారి సముఖానకు,—

శే॥ దామోదర పద్మనాభయ కృతాన్కే నమస్కారములు. ఈ ఆశ్వీజ బ. 10 భాను వాసరం వర్కు త్రిశరపురంలో క్షేమం. త్మ నిరంత్తర సాంబ్రాజ్య విభవాతిశయముల్కు దయచేశి వ్రాయించ్చ తగ్గది. మా ధొర మెస్తరుపొల్లువారు చిన్నవాండ్లను నాగూరిలో వుంచ్చి రావలెనని స్నైన్యై త్వరగా వచ్చినంద్దు మహారాజరాజశ్రీ మహారాజావారి భేటీకి వచ్చేటంద్కు యుక్తపడక వుండ్డెనని వ్రాయమనిరి. ఆ వైనం చిత్తగించ్చగలది. భాగ వతపురం అనే గ్రామంలో మేము కొంత్త స్థితులు శుద్ధక్రయాన్కి తీశినందుల్లో ఆ గ్రామంవారు దురాగతాలు చేస్తున్నారు. అంద్కుకు దయచేశి తాకీదు శేయించ్చ వలశినది. నన్ప్జ్ఞల్కు విశేషంగ్గా వ్రాసుకోవలశినది యేమి వున్నది. యిచ్చట కాగలం న్నికున్ను త్మ శుభోదయముల్కున్ను వ్రాయించ్చి పంప్పించ్చేటట్టుగా దయశాయ వలెను. యిదే ఆన్కే నమస్కారములు.

## 7. ఒకవేశ్య వ్రాసినది

అఖిలాండకోటి బ్రహ్మండ నాయకులయ్ను మహారాజ ఛత్రపతివారి పాదపద్మము లకు పుష్ప గంధ కస్తూరి పంన్నీరు పరిమళాదులచాత పూజ చాయపడినటువంట్టి పాదపద్మములకు, —

విం్నపములు శేవకురాలు వెంక్కటరాఘవు నిరంత్తరముంన్ను అనేక సాష్టాంగ్గ దంణ్ణములుబెట్టి శాయంగ్గల విజ్ఞాపనములు ॥తర్వా॥ సముఖానను శలవుతీస్కుని కటాక్ష వీక్షణం చొప్పునను యిల్లు ప్రవేశించ్చినాము. సముఖమున శలవు తీస్కుని బయలు వేరిన నాటనుంచి దివ్యపాదారవిందములమీద అచ్చంచ్చల ప్రతిభక్తి జ్ఞానమేకాని యితరము లేదు. అది అట్లా ఉండ్డగా సముఖమున చేస్నినటువంటి మేలుంన్ను ఆదరణా యుంన్ను యిది నా శేరీం వుంన్నమట్టుకు మరవవలశ్నిదిలేదు. అది యెట్లాగంట్టె చంద్రుం జ్ఞి యడబాశ్ని కలువలు యేరీత్ను వుండ్డునో అటువలెనే సూరుంణ్ని యెడబాశ్ని కమ లములు యేరీత్ను వుండ్డునో అటుంవలెనో దీనత్వాంన్ని జెంద్ది వుంన్నాను. ఇంతటికింన్ని తమ పాదార విండ్ద దర్శనంవల్లను నాకు నక్కల పాప విమోచనం అయినది. అక్కడ నుంచ్చి వచ్చిన నాటనుంచ్చి సముఖమంద్దున కొలువు మనస్సుకు కోరుతుంన్నానుగాని మరి వఖటిలేదు. యేదినాన్కు అయ్ను శీఘ్రముగ సముఖమంద్ను శావ చాయగలంద్దులకు వచ్చి చేరుతున్నాను. పదివేలకోట్ల దంణ్ణములు.

సీ. వుండ్డుండ్డి యేమేమొ వూరకె చింత్తింత్తు
చింత్తించ్చి నాలోనె చింన్నబోదు
చింన్నబోయి యొకింత్తశేపు తెలివిగ నుండ్దు
తెలివి వ్యాళను మింమ్ము తలపువచ్చు
తలచినంత్తనె వచ్చి నిలచినట్లనె తోచు
తోచి నే దిగ్గనలేచి జూతు
జూచి వేగమె బార జాచి కౌంగిట గృత్తు
గృచ్చి కౌంగిటలేక వెచ్చనూర్తు
వెచ్చనూర్చియు తపియింత్తు వెతల నింత్తు
నఖుల గద్దింత్తు తెగువ యోచన తలంత్తు





రాజా మీర్జా నల్లపరాజ వేంకటపతిరాజా బహద్దరువారు

వీరు పెద్దాపురం సంస్థాన పాలకులు. క్రీస్తుశకం 1740 లో నిజాముల్ముల్కునుంచి ఏలూరు సర్కారుకు 'సర్ లష్కర్' గా నియమితులయిరి. వీరు అశ్వశాస్త్రజ్ఞులు. ఆంధ్ర, పారశీక, వ్రజ భాషలలో పెక్కుగ్రంథాలు వ్రాసినవారు.

[1929 శుక్ల సంవత్సరాది సంచికనుండి]

---

నీదు మన సెంత్తు అంత్త నంన్నియు శమింత్తు
భవ్యగుణహారి వేణుగోపాల శౌరీ.

## 8. పుదుచేరి నవాబుజాబు

"షహామతు అవాలిమర్త బతుషవుకతు వవూలీ మంజాలతు మలాజా మెహరుబాన్ మొకర్రం మొకలీసాన్ మహారాజ అమరశింహ్మరాజే సల్లమల్లాహుతాలా.

మేముంన్నా ఖుషీని వుంన్నాము. మీా ఖుశాలినామా హమేశా వ్రాయించ్చి పంప్పిం స్తూ రావలెను. త॥ విలాయితీహుకుం ప్రకారం పుదుచేరి వగయిరా యీా ప్రదేశాలను ఫ్రాంసువారి తాల్లూకాల్కు మంమ్మను గవునరుహోదా మొకర్రరు చేశి రవాణాచేశినారు గన్కు యిక్కడ దాఖలు అయినాము. పూర్వాపూర్వంనుంచ్చి ఫ్రాంసు సర్కార్కుంన్ను త్మ సంస్థానానకుంన్ను నడుచుకొని వస్తూవుంన్న దోస్తీయత్తిపాకు దినేదినే మా దినముల యంద్దు అధిక అభివృద్ధి కాగలంద్కుకు మావల్లనయ్ను ప్రయత్నములుచేసి మీ స్నేహం సంప్పాదించ్చవలెనని మా మనస్సున పూర్తిగా వుంన్నది. త్మ అంతఃకరణలోనుంన్ను అదే మేరకు వుంన్నదనే అభిప్రాయం మాకు ముందుగా వుంన్న గవునరువారి ఉత్తర ప్రత్యుత్తరాలవల్లను మాకు బాగా తెలిశి అధిక సంతోషంగా వుంన్న మొదలయ్ను అభిప్రాయములు శేతురాయలు త్మకు తెలిపించ్చును గన్కు జ్యాదా వ్రాయగలది యేమి వుంన్నది. హమేషా మీ ఖయిరాఫీయతు సమాచారంలు వినకోరి వుంన్నాము. ఖాతీర్కు తేవలెను.

# ఆంధ్రపత్రిక-ఉగాది సంచికలు

## సత్తెనపల్లి హనుమంతరావుగారు

### [1925 క్రోధన సంవత్సరాదిసంచికనుండి]

తెలుగునాటియం దుద్భవించి, అస్తమించి వ్యాప్తియందున్న పత్రిక లన్నిటిలో పెన్నిక గన్నది ఆంధ్రపత్రిక ఆంధ్రపత్రిక కీలకనామ సంవత్సర భాద్రపద శు 14 బుధవారమునాడు బొంబాయి నగరమునం దవతరించినది పత్రికాభివృద్ధికి పత్రికాధిపతుల యితర యోగ్యతలతోపాటు అమృతాంజనమును సాయ మొనర్చినది ఆంధ్రుల రాజకీయ, జాతీయ, సాంఘిక సారస్వతోన్నతుల గన్పరచిన ఆంధ్రపత్రిక కాధారభూత మగు నమృతాంజనము నిజముగ నాంధ్రుల యజ్ఞాన ధ్వంసమునకు అమృతాంజనమే ఆంధ్రపత్రికా తత్త్వమును గ్రహించుటకుగాని, విశదీకరించుటకుగాని నే నసమర్థుడ నైనను, ఆంధ్రపత్రికల యభివృద్ధిపై నాకుగల యభిలాషయే నన్నీ పత్రికా చరిత్రను స్థూల దృష్టిని వ్రాయ ప్రేరేపించినది ఆకృతిలో నేమి? విషయ బాహుళ్యములో నేమి, ఔదార్యమును జూపుటచేతనే, ఆంధ్రపత్రిక విరివిగ చదువరుల నారంభముననే యాకర్షించినది ఆంధ్రపత్రికా పఠనమునకై గ్రాహకు లెక్కువగ మూగుటకు స్వల్పచందా గూడ తోడ్పడినది ప్రథమమున ఆంధ్ర వారపత్రిక చందా రు 2—20 లు ఈ స్వల్ప చందాకుతోడు చిత్రపట సంశోభితమును, వివిధ వ్యాస విరాజితమును, సర్వాంగ సుందరమును, అద్భుతోపయోగప్రదమును, ఆకర్షణీయమును, అమూల్యముననగు ఉగాది సంచిక చందాదారులకు ఉచితము ఇంత చౌకగా లభించిన, పత్రికను గొనువారి కేమి తక్కువ? అప్పటికప్పుడే ఆంధ్రపత్రిక అందరకును పరిచయమైనది పల్లెటూరి ప్రజలు, పట్టణవాసులు, పండితులు, పామరులు, రైతులు, వర్తకులు, రాజకీయవేత్తలు వీరు వారలనేల సందరుసు ఆంధ్రపత్రిక నాదరించినవారే సామాన్య జన సౌకర్యములకై అల్పమగు చందాను నిర్ణయించుటచేతను, చదువరుల స్వాంతమున లలరించుటకై విశేష విదేశ వార్తలను విపులవిషయములను విశదీకరించుటవలనను, విలువగల ఉగాది సంచిక నుచితముగ చందాదారుల కొసగుటకు పత్రిక అధిక వ్యయ ప్రయాసలకు లోనుగావలసి వచ్చినది ఆర్థికముగ ఆంధ్రపత్రిక కమృతాంజన మెంత యాధారమగుచున్నను, చందాను పత్రికాధిపతులు క్రమ క్రమముగ హెచ్చు చేసినారు అప్పటికే కాదు యిప్పటికైనను హెచ్చువేసిన చందా యితరాంధ్ర పత్రికల చందా లన్నిటికన్న తక్కువయే!

ఈ స్థితియందే ఆంధ్రావని సమీపమునకు పత్రికను జేర్చుటకును, స్వీయ ముద్రణాలయమును సంపాదించుటకును పత్రికాధిపతులు కృషి సలిపినారు వారి కృషి సఫలమైనది మదరాసు నగర మాంధ్రేతర ప్రాధాన్యము గలదైనను, ఆంధ్రుల కతి సన్నిహిత సంబంధము గలదు ఆంధ్రపత్రిక ప్రమాదీచ సంవత్సరాంతమున మదరాసు నగరమును నివాస మొనర్చుకొనినది స్వకీయ ముద్రణాలయమును సంపాదించినది

## ఆంధ్రోద్యమము

తోడిదేశములగు వంగ మహారాష్ట్ర ఘూర్జర ద్రావిడములతో పోల్చుకొనిన మన యాంధ్ర దేశస్థితి వెనుకబడియున్నది ఆంధ్రులు, ఆంధ్రభాష, ఆంధ్రదేశ గౌరవ పోషణములకు మన యాంధ్రపత్రిక చాల సేవ యొనర్చినది అందులకు ఫలముగ ప్రారంభింపబడినదే ఆంధ్రోద్యమము ఆంధ్రోద్యమమున కీపత్రిక యొనర్చిన ప్రబోధ మమూల్యమైనది ఆంధ్రపత్రికా జననమె, ఆంధ్రపత్రికా కృషియె, ఆంధ్రోద్యమము నారంభించిన దనుట అతిశయోక్తిగాదు ఆంధ్రపత్రికాధిపతుల బోధనలచే నేమి, దేశీయుల సంతత పరిశ్రమచే నేమి, ఆంధ్రత్వమును భారత జాతీయ మహాసభ గుర్తించినది ప్రభుత్వ పక్షమువారును క్రియలలో వెనుకాడినను, మాటలలో మన్నించినారు

ఆంధ్రుల కనుదినమును ఆవశ్యక విషయముల నవగాహ మొనర్పదగు ఆంధ్ర దినపత్రిక లేనికొరతను ఆంధ్రపత్రికాధిపతులు గుర్తించినారు ఇదివర కెందరో యత్నించి ఆరంభించి, విఘ్న పరంపర జిక్కినారు అన్నిట అధోగతియందున్న దేశ ముద్ధరింపబడుటకు దినపత్రికావశ్యకతను గ్రహించినవా రెంతకాలమో యుపేక్షింపలేదు తమ సంకల్పమును దేశీయులకు చాటినారు వారి సాయ సంపదలను సేకరించినారు ఆనంద సంవత్సర చైత్ర శు 6 నాడు ఆనంద ప్రదముగ ఆంధ్ర దిన పత్రికా ప్రచురణ మారంభించినారు ఆంగ్లభాష నెరుంగని ఆంధ్రులకు దిన పత్రికాపఠనప్రాప్తి కలిగినది ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వమును వెలువడినది దైనిక పత్రికా మూలమున నాంధ్రమందొక నూతన తేజ ముదయించినది మతసభలు, సాంఘిక సభలు, భాషాసభలు, రాజకీయసభలు, గ్రంథాగారసభలు, విదేశవార్తలు ప్రభుత్వపు లోతుపాతులు సమస్తమును ఆంధ్రుల కవగాహనము కాబడినది

## ఐరోపా మహాసంగ్రామము

ఈ సమయముననే ప్రపంచ శాంతి సముద్రము నల్లకల్లోల మొనర్చిన సంగ్రామ ఝంఝామారుతము ప్రచండ తరముగ వీచినది వీచికలు మన మదరాసు రాజధానికి గూడ సోకినవి ఈ తరుణమున ఆంధ్ర దినపత్రిక ప్రత్యక్షముగాని తపాలకచేరి ఆంధ్రదేశమున లేదు తపాలు సౌకర్యముగల ప్రతి పల్లెకును దినపత్రిక వ్యాపించినది దిన పత్రికా ప్రతులు వేనవేలు ముద్రించుటతో కార్యాలయము నిమగ్నమైనది ఆదివారమున గూడ సంగ్రామ వార్తల ప్రకటించినారు ప్రత్యేక చందాదారులకేకాక, ఆంధ్రపత్రికను కొనదలచిన వారికందరికిని రైలు స్టేషనులలోను, అంగళ్లలోను, ఆంగ్ల పత్రికలతోపాటు విక్రయింపదగు నేర్పాటు లొనర్పబడినవి యుద్ధక్షామమున చౌకగా పత్రికను ముద్రించుట దుష్కరమైనది పాఠక లోక తృప్తికొరకు విపుల విదేశ విశేషములను, యుద్ధవార్తలను వ్యయ ప్రయాసలకులోనై క్రమముగ ప్రకటించుచు సంపాదకులు పత్రిక చందాను హెచ్చించినారు పెరిగిన చందాను సంతసముగ భరించి ద్విగుణీకృతోత్సాహముతో గ్రాహకు లెక్కువగ చేరి ఆంధ్రపత్రిక నాదరించిరి నిత్యమును ఐరోపా రణరంగమును కండ్లయెదుట జిత్రించినట్లు వర్ణించు పత్రికాధిపతుల లేఖినీ ప్రభావ మెంతయు బొగడదగినది ప్రారంభమున ఆంధ్ర దినపత్రిక చందా రు 12 లు దైవానుగ్రహమున యుద్ధాగ్ని చల్లబడినది, ఆపత్సమయమున ప్రభుత్వమువా రొనర్చిన వాగ్దానము లుత్సాహముతో నెరవేర్చుటకు మారుగ సంకుచిత మొనర్ప యత్నించినారు మరియు నిరంకుశ పరిపాలనాస్త్రమును ప్రజలపై సంధింపబూనినారు

## మహాత్మాగాంధి—సహాయనిరాకరణము

ఆ సమయముననే లోకోత్తర పురుషులగు గాంధి మహాత్ములు భారత రాజకీయ రంగమున బ్రవేశించినారు పాలకజాతి స్వార్థమును, పాలితుల అమాయకత్వమును విధ్వంస మొనర్ప సత్యాగ్రహ మంత్రమును జపించినారు అంతటితో ప్రభుత్వముపై ప్రజలకుగల వ్యామోహ కిరణములన్నియు పటాపంచలైనవి అందుకు ఫలముగ పంజాబులో ప్రజలు పలుబాములకు లోనై ప్రఖ్యాతిని గనినారు తరువాతనే అసహాయవాద మవతరించినది ఆర్యావర్తనము నట్టిట్టూగించిన యీ యగాధ గాథల నన్నిటిని ఆంధ్రదేశమున కతితీవ్రముగ వ్యాపింపజేసిన దాంధ్రపత్రికయె సుమీ! ఆంధ్ర దినపత్రికా సందర్శన మహాభాగ్యమున ఆంగ్ల భాషా పరిచయములేని చాలమంది ఆంధ్రు లిప్పుడు భారత రాజకీయముననేమి, ప్రభుత్వ మోసములనేమి, ప్రపంచ స్థితిగతులనేమి, తాము శల్య పరీక్ష యొనర్చి గ్రహించుటయే కాక ఇతరుల కతి సుబోధకముగ బోధించుట కుత్తీర్ణులైనారు అసహాయవాదము నాంధ్రలోకమున వ్యాపింపచేయుటతో పాటు ఆంధ్రపత్రిక భారత జాతీయ మహాసభా వ్యవహారముల నన్నిటిని పూస గ్రుచ్చినట్లు విశదీకరించుచున్నది ప్రత్యేక మొక దిన పత్రికయే ఆంధ్రుల కింతటి విజ్ఞానము నను గ్రహించినప్పుడు పలు పత్రికలు ప్రచారముగల పాశ్చాత్యు లెంతటి ధన్యులో? ఆంధ్రుల విజ్ఞాన కోశమున ఆంధ్రపత్రిక చరాస్తి చరాస్తి యెంత వెలగలదైనను స్థిరాస్థియు నవసరమే కద అట్టివే ఉగాది సంచికలు ఈ సంచిక లాంధ్రుల గ్రంథాగారముల, గృహముల, కరముల నలంకరింపదగినవి ఈ సంచిక లన్నిటి నొక పరి సింహావలోకన మొనర్చి ఈ వ్యాసమును ముగించుచున్నాను ఆంధ్ర వారపత్రిక నేటి చందా రు 4—8—0 లు దైనిక పత్రిక చందా రు 24 లు ఆంధ్రపత్రికతోపాటు దేశాభివృద్ధి కమూల్య సేవ నొనర్చు పత్రికల కన్నిటికిని నా కృతజ్ఞతను యిందు మూలముగ వెలిపుచ్చుటకు వ్యాస బాహుళ్యమున జంకితిని

### 1. సాధారణ సంవత్సరాది సంచిక

తెలుగు పత్రికల పక్షమున ప్రచురింపబడిన ప్రథమ సంవత్సరాది సంచికయే యిది ఈ సంచికయందు బ్రిటిషు సామ్రాజ్యాధిపతులు, భారత స్వతంత్ర సంస్థానాధిపతులు, ఆంధ్రదేశ మహారాజులు, రాజులు, రాష్ట్ర గవర్నరులు, ప్రభుత్వోన్నతోద్యోగులు, భారతదేశ సేవా దురంధరులు, ఆంధ్ర దేశాభిమానులు, కవులు, పండితులు,

యోషిద్రత్నములు మున్నగువారు చిత్రింపబడినారు మేలైన కాగితములపై 126 చిత్రము లీ సంచిక నలంకరించి తమ్ము దర్శించువారల తన్మయుల నొనర్చెడి ఆయుర్వేదమును గూర్చియు, వాఙ్మయ మత సాంఘికములను గూర్చిన 248 పుటల విద్వాంసుల వ్యాసములు గలవు

## 2 విరోధికృన్నామ సంవత్సరాది సంచిక

ఈ సంచికలో ముద్రింపబడిన స్వదేశ సంస్థానాధీశ్వరులు, ఆంధ్ర జమీందారులు, భారతదేశ నాయకులు, పుణ్యక్షేత్రములు, దేవాలయములు, గోపురములు మున్నగు 210 చిత్రపటములును, వివిధ విషయములపై 60 వ్యాసములును గలవు పెక్కు విద్యాధికు లీ వ్యాసముల రచించి ఆంధ్రభాషాబోధ మొనర్ప సాయపడుచున్నారు

## 3 పరీధావి సంవత్సరాది సంచిక

ఈ సంచికయందు ఏడవ ఎడ్వర్డు ప్రభువర్యుని కుటుంబము గలదు ఢిల్లీ దర్బారు ప్రదర్శన మతి శ్లాఘనీయముగ ప్రదర్శింపబడెను దర్బారు దర్శనాగంతుకు లగు మహారాజుల పటములు పెక్కులు గలవు ఢిల్లీ పురాతన కట్టడములు చూపబడెను మొత్త మీ సంచికలో 172 చిత్రము లున్నవి శ్రీ పంచమజార్జి సార్వభౌముని రాజ్యాభిషేచన వర్ణనాదులను గూర్చిన యనేక కవీశ్వరుల పద్యము లిందు గలవు ఢిల్లీ నగర వర్ణనమును, జార్జి చక్రవర్తియొక్క ఢిల్లీ పట్టాభిషేకోదంతమును, కొన్ని స్వదేశ సంస్థానాధీశుల చరిత్రములును వ్రాయబడినవి ఈ సంచికలోని కొన్ని వ్యాసములకు పత్రికాధిపతులు బహుమతి లొసగినారు మనరాజధానిలోని ముఖ్య పట్టణముల జనసంఖ్యయును, తెనుగు మండలముల జనాభాయు నిందు గలవు దీనిని దర్బారుసంచిక యన దగును

## 4. ప్రమాదీచ సంవత్సరాది సంచిక

ఇందులో ఆంధ్ర రాష్ట్రీయ పట మొకటి వివిధ వర్ణములతో చిత్రింపబడినది ఆంధ్రోద్యమ వ్యాప్తికి పటమే పునాది ఆంధ్రుల సద్బోధించు దివ్య చిత్రము లెన్నియో కలవు పుణ్యక్షేత్రముల దేవాలయముల గోపురముపటము లాంధ్రుల శిల్ప విద్యా నైపుణ్యమును జాటుచున్నవి హార్డింజి ప్రభువర్యుని ఢిల్లీ ప్రవేశోత్సవపట మీ సంచిక ముఖ పత్రము నలంకరించినది ఇన్నూరు పటము లీ సంచికలో నున్నవి ఇందులో వ్యాసములు తక్కువైనను రాజకీయ సంబంధములు 10 గలవనుటచే ఆంధ్రుల యభిరుచి మారుట తెలియుగలదు భాషా విషయిక వ్యాసములారు గలవు మత సాంఘిక సంబంధాధికము లిరువదియారు గలవు

## 5. ఆనంద సంవత్సరాది సంచిక

ఇది ఆంధ్రపత్రికా స్వకీయ ముద్రణాలయమున మదరాసులో ముద్రింపబడినది బొంబాయి తత్త్వ వివేచక ముద్రణాలయముయొక్క పనితనము కిది యేమాత్రము తీసిపోవుటలేదు చెన్న నగరమున గల ముఖ్య భవనములును, ప్రభుత్వ మందిరములును, కళాశాలలును, దేవాలయములును, ఇందు ముద్రింపబడినవి మదరాసు రాజధానికి సంబంధించిన చిత్రములే యిందెక్కువగ నున్నవి బొంబాయి రాజధాని బెల్గాం పంక్తియులును విద్యాధికులును నగు ఐదుగు రక్క సెక్రెటేరియట్ మెంబరులు, పదునైదుగు రిరువురు వైద్యోద్యోగినులు, ఇరువురు బి ఏ లు, ఒక్కరు తత్వజ్ఞ విద్యా విశారదులు యును భరతఖండమునేగాక ప్రపంచమంతను విఖ్యాతిగాంచిన మూర్తుల పటములు గలవు రవీంద్ర కవిచంద్రుని రంగుల చిత్ర పట మొకటి గలదు ఆంధ్రోద్యమ వ్యాసములును, మహాపురుషుల చరిత్రములును 16 గలవు విశిష్ట మత భాషా సాంఘికములు విలువగల 250 పుటల వ్యాసము లీ సంచిక నలంకరుచున్నది.

## 6. రాక్షస సంవత్సరాది సంచిక

దీనిని సంగ్రామ సంచిక యనవచ్చును ఐరోపా మహాసంగ్రామమునకు సంబంధించిన చక్రవర్తుల, సేనానుల సైన్య నివహముల, రణరంగములు, యుద్ధ పరికరముల చిత్రము లత్యుత్తమరీతి జిత్రింపబడినవి రణరంగములందున్న యుద్ధములో దగుల్కొన్న దేశపటములును, ఆంధ్రభాషలో కొన్ని గలవు చిత్రపటసంగ్రహ వ్యయ ప్రయాన సాధ్యమేయైనను, స్వయముగ చేయు సంప్రదాయము నాంధ్రపత్రికాధిపతుల ప్రయత్న మీ రూపమున సాక్షాత్కరించినది గోపాలకృష్ణ గోఖలే రంగుల చిత్ర పట మిందు గలదు నానా దేశ పతాకముల రంగుల పటములును గలవు ఈ సంచికలోని ప్రథమ వ్యాసములు ఐరోపా మహాసంగ్రామ చరిత్రాత్మకములు ఈ వ్యాసములలో (యుద్ధకారణములు) రాజ్యముల బలా బలములు, మున్నగునవి విమర్శింపబడినవి యుద్ధములో దగుల్కొన్న కొన్ని రాజ్యముల చరిత్రలు గలవు.

## 7. నల సంవత్సరాది సంచిక

ఈ సంచికలో భారత జాతీయ సభాధ్యక్షులు, పెక్కండ్ర చిత్రము లున్నవి. పౌరాణిక గాథలను, ఆంధ్రుల కళా కౌశలమును దెల్పు పటములు గూడ కొన్ని కల్పింప




వధూవరులు

[1929 శుక్ల సంవత్సరాది సంచికనుండి]

బడినవి వ్యాయామ ప్రదర్శనములు, మల్లురును చూపబడిరి ఐరోపా రాణుల చిత్రములు, రంగుల దేశపటములు, యుద్ధ సంబంధమగు చిత్రములు మొత్తము మున్నూరున్నవి ఈ సంచికలోని యేబది వ్యాసములలోను సగము ఆంధ్రుల ప్రత్యేకతను పురిగొల్పునవై యున్నవి యుద్ధ చరిత్రము గూడ యిం దుద్ధరింప బడినది

## 8. పింగళ సంవత్సరాది సంచిక

ఈ సంచికలో ఆంధ్రపత్రికా భవనమును, ముద్రణాలయమును, కార్యనిర్వాహకవర్గమునూ అలంకరింపబడినవి జ్యోతిశ్శాస్త్ర సంబంధమగు రంగులపట మొకటి గలదు రాక్షస సంవత్సరాది సంచికవలెనే యుద్ధవీరులు, యుద్ధపరికరములు, యుద్ధ దేశములు ఈ సంచికలో గలవు ఈ మూడు సంచికల పరిచయము ఆంగ్ల విద్యావాసన నెరుగని ఆంధ్రులకు దేశ చరిత్ర జ్ఞాన మలవరచినది ఇవి మూడు సంగ్రామైకాత్మకములే యైనను పత్రికాధిపతులు ఆంధ్రదేశమున ఆంధ్ర దేశాభ్యుదయమున కేమరక అవకాశము కొలది ఆంధ్రోత్తేజక చిత్రములను వ్యాసములను ప్రకటించియేయున్నారు.

## 9 కాళయుక్తి సంవత్సరాది సంచిక

జాతీయవర్గముతోపాటు చెన్నపురి బ్రాహ్మణేతర పక్ష నాయకుల పటములు నిందు ప్రకటింపబడినవి దేశాభిమానులగు వైశ్య కులావతంసుల పటములు గూడ కొన్ని గలవు. యుద్ధ సంఘటన చిత్రములిందును చూపబడినవి ఆంధ్రోద్యమ స్వరాజ్య తత్త్వము లిందెక్కువగ ప్రస్తావింపబడినవి శేషించిన యుద్ధచరిత్రము విశదీకరింపబడెను.

## 10. సిద్ధార్థి సంవత్సరాది సంచిక

సంగ్రామ సంధిసభాప్రతినిధులును, రాయబారులును, భారత రాజకీయ సంస్కరణ సభాధ్యక్షులును, సభ్యులును చిత్రింపబడినారు భారతదేశ స్వాతంత్ర్య సంపాదనార్థులై ఆంగ్లదేశమునకు వెడలిన భారతీయ వివిధ రాజకీయ పక్ష నాయకుల చిత్రములు గలవు ఆంధ్ర వాఙ్మయ సాంఘిక సంస్కార ప్రియులును, ప్రేరకులును, ఆంధ్రదేశ పితామహులును, మూల పురుషులునగు వీరేశలింగము పంతులవారి చిత్రపటము గూడ నున్నది రాజకీయ విషయక వ్యాసములే ఈ సంచికయం దధికముగ నున్నవి మాంటుఫర్డు నివేదికమునుగూర్చిన చర్చ విశేషముగ గలదు భరత ఖండ వైశాల్యమును జన సంఖ్యయు సామ్రాజ్య రాష్ట్రీయ శాసనసభా వివరములును, ఆంధ్ర మండలముల రాజకీయ జాతీయ స్థానిక సభల వివరముల నిందు గలవు ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక గూడ గలదు

## 11. రౌద్రి సంవత్సరాది సంచిక

దేశహితైషిణులగు స్వార్థత్యాగులగు కొందరు మహనీయుల చిత్రములతో నీ సంచిక ముఖపత్ర మలంకరింపబడినది సప్తమాంధ్ర సభలకు సంబంధించిన పటములును, అఖిల భారత గ్రంథాలయ ప్రదర్శన పటములును ప్రభుత్వోద్యోగుల దేశీయ నాయకుల చిత్రములు నిందు గలవు 1919 వ సంవత్సరమున మదరాసు యూనివర్శిటీలో పట్ట పరీక్షయందు నెగ్గిన యువతీమణుల చిత్రము లిందున్నవి వాఙ్మయ రాజకీయ వ్యాసములే పెక్కులు గలవు గత సాలున ముద్రింపబడిన ఆంధ్ర గ్రంథముల వివరణ పట్టికయు నిందు గలదు.

## 12. దుర్మతి సంవత్సరాది సంచిక

లోక కల్యాణ సంధానికులగు గాంధి మహాత్ములును, ఆయన సాధన సామగ్రియగు రాట్నములు మగ్గములు మున్నగునవి ఈ సంచికా ముఖపత్ర చిత్రములు పంజాబు దురంతములు ఈ సంచికలో ముద్రింపబడినవి. స్థానిక రాష్ట్ర ప్రభుత్వ వర్గపు పటములును గలవు. కీర్తిశేషులగు లోకమాన్య బాలగంగాధరుని పట మత్యంతాకర్షణీయముగ చిత్రింపబడినది ఆయుర్వేదోద్ధారకులగు పండిత డి గోపాలాచార్యులవారి పటమిందున్నది లోకమాన్యుని నిర్యాణమును గూర్చిన పలువురి కవుల విషాద గీతము లిందు గలవు వివిధ విషయములను గూర్చిన పెక్కు వ్యాసములు నిందు గలవు

## 13. దుందుభి సంవత్సరాది సంచిక

అహమ్మదాబాదులో జరిగిన జాతీయ మహాసభా మంటప, ఖాదీ నగరము లిందు చిత్రితములు శాంతస్వరూపులగు గాంధిమహాత్ముని శీలము ననుసరించిన దేశారాధకుల చిత్రము లిం దెక్కువగ రచింపబడినవి వీరందరును ప్రభుత్వపు జయిల్‌ఖానాల విందులు గుడిచినవారే! నిర్బంధముంపాలై బందిఖానాల కేగుచున్న వారి వేషములు త్యాగములు భరత వర్ష భావి భాగోదయమునకు శుభ చిహ్నములు ఆంధ్ర జాతీయ కళాశాలా స్థాపకులును పోషకులునగు శ్రీ శ్రీ కోపల్లె హనుమంతరావుగారి పటము గూడ నున్నది తమ పురుషులతోపాటు దేశ స్వాతంత్ర్య సంపాదనార్థినులై దీక్ష వహించిన మహిళామణుల పటములును గలవు స్వయం నిర్ణయ సూత్రముల నుపదేశించినట్టియు, నిరాకరణ వాదోత్సాహ ప్రతిపాదకములై నట్టియు వ్యాసములు గలవు అహమ్మదాబాదు సభలో సవరింపబడిన దేశీయ మహాజన సభా సంవిధాన వివరణ మిందున్నది

## 14 రుధిరోద్గారి సంవత్సరాది సంచిక

సత్యాగ్రహ మంత్రబద్ధులై, శాంత గుణోపేతులై స్వాతంత్ర్య సత్య రక్షణ స్వాంతులైన ఆకాలీలు నిరంకుశోద్యోగులచే బడుచున్న కష్టపరంపర లిందు ముమ్మందు చిత్రింపబడినవి. గయాక్షేత్రమున జరిగిన జాతీయ మహాసభా భవనమంతయు విస్పష్టముగ చూపబడినది సబర్మతీ ఆశ్రమపు పరిశ్రమ లిందున్నవి భారత స్వరాజ్యవృక్షము స్వరాజ్య పథలో మహాత్ముని ఉపదేశ స్వరూప కల్పన పటము అత్యంత ముదావహములు ఆదిమాంధ్ర నాయకుల పటములు కొన్ని యున్నవి భారతీయుల వాంపోళి తరంగితుల నౌసర్స రాజకీయమే యిక్కాలమున ప్రధానముగ నున్నను, ఆంధ్ర దేశావతరణ వ్యాస ప్రకటన మీ సంచిక యేమరలేదు మేధానిధులచే వ్రాయబడ్డ గద్య వ్యాసములేమి, మృదు మధుర ధోరణిగల పద్య ప్రసంగములేమి 130 గలవు

## 15. రక్తాక్షి సంవత్సరాది సంచిక

భారత స్వరాజ్య సంపాదన దీక్షచే ప్రభుత్వ నిర్బంధములపాలై సవసి విముక్తులైన దేశీయులచే పరివేష్టింపబడినట్టియు, మృత్యుకారాగారమునుండియు, నిరంకుశపాలనా నిర్బంధమునుండియు, వెలువడిన గాంధి మహాత్ముని కృశించిన ఉత్తేజక రూప మీ సంచికా ముఖపత్రమున శోభించుచున్నది సర్వజన కారుణ్య విలసన మూర్తియగు నారని మూర్తి పెరొక రంగులపటమున చిత్రింపబడినది కలియుగ వైకుంఠము వలె ప్రఖ్యాతమైన కాకినాడ కాంగ్రెస్ వివరములన్నియు, ఈ సంచికలో చిత్రింపబడినవి ఆంధ్రపత్రికా జన్మము నేటితో ధన్యత నందినది పదేండ్లనుండి అర్థింపబడుచున్న మహాగౌరవము, దేశీయ మహాసభ కాహ్వాన మొసగు మహద్భాగ్యము ఆంధ్రుల కబ్బినది కనుకనే 38 వ దేశీయ మహాసభా దృశ్యముల నన్నిటిని వివరముగ ఈ సంచిక చిత్రించినది మూన్నాళ్ళ ముచ్చటలో ముగిసిన బ్రిటిష్ ప్రభుత్వోద్యోగు లిందుగలరు నాగపూరు స్వరాజ్య పతాక విజృంభము లిం దెన్నదగిన చిత్రములు ఉపహాసవాద సూచక చిహ్నములం దిది అతీత దృశ్యము గాంధిమహాత్ముని విమోచన చరిత్రతోబాటు మామూలు ధోరణిని కొన్ని ముఖ్య వ్యాసములేగాక 38 దేశీయ మహా సభాధ్యక్షుల, ఆహ్వానకర్తల ఉపన్యాసములు, తీర్మానముల వివరములు నిందున్నవి ఖిలాఫత్ సభోపన్యాసములు తీర్మానములును గలవు తదితర కాకినాడ సభా వృత్తాంతములు వర్ణనాతీతములు

## 16 క్రోధన సంవత్సరాది సంచిక

ఇది ఆంధ్రపత్రిక పదునారవ ఉగాది సంచిక ఇందులోని చిత్ర పటములను దర్శించియు, వ్యాసములను పఠించియు ఆంధ్రు లిప్పుడిప్పుడె ఆనందించుచుండురు ఈ సంచికలన్నియు, ఆంధ్ర సారస్వతమున, రాజకీయమున, చరిత్రమున, సాంఘికమున, అవి, యివి యన నేల ఆంధ్రత్వ నిరూపణమున కవసరమైన వసుటలో అతిశయము లేదు ఇట్టి ఆవశ్యకతను దీర్చిన ఆంధ్ర దేశారాధకుల, ఆంధ్ర దేశ బాంధవుల, శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులవారు దేశోద్ధారకు లనుట సమంజసమే యగును. దేశోద్ధారక బిరుద మిట్టి త్యాగశీలుని, కార్యశూరుని నాశ్రయించుటచే శుద్ధి వడసినది. ఈ బిరుదము నారి ంచిన శ్రీ పంతులవారి సునిశితబుద్ధిని, కార్య నిర్వహణ దీక్షను శాంత స్వభావమును, ఔదార్యమూర్తిని, సంతత పరిశ్రమమును ఆదర్శముగ గైకొని ఆంధ్రులు కృతకృత్యులయ్యెదరని నా యాశయము



ఉపన్యాసధోరణి

1929 శుక్ల సంవత్సరాది సంచికనుండి]



Roopkala
గోల్డెన్ జూబ్లీ సందర్భమున
ఆంధ్రపత్రికకు శుభాకాంక్షలు
పద్మనాభం సమర్పించు
రేఖా & మురళీ ఆర్ట్స్
దేవత
దర్శకత్వం: K. హేమాంబరధర రావు
నిర్మాత: B. పురుషోత్తం
వాణీ రిలీజ్
VIJAYA PUBLICITIES

# యతిప్రాసలు

## సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

**[1930 ప్రమోదూత సంవత్సరాదిసంచికనుండి]**

ఈ యతిప్రాసలనుగూర్చి ఆధునిక పండితులలోను, కవులలోను భిన్నాభిప్రాయము లున్నవి. కావలయు ననువారు కొందఱు, వలదనువారు కొందఱు. మొదటి తెగవారు తెల్పు అభిప్రాయములు ఇవి:—

"ప్రాచీనులు యతిప్రాస లుంచుకొని గ్రంథములు రసవంతములుగాఁ జెప్పి యుండలేదా? వారు సమర్థులగు సర్వతోముఖ పండితులు గనుక యతిప్రాసములకు జంకరైరి. ఆధునికులు భాషా పరిశ్రమలేని లేనివారగుటచే కాశికిఁ బోయిన వారు ఇష్టములేని శాకఫలాదులను విసర్జించునట్లే తమకుఁ గష్టముగానున్న యతిప్రాసలు విడువ నెంచుచున్నారు. నదికి ఒడ్డులవలెఁ బద్యమునకు యతిప్రాసలు ముఖ్యములు."

అని. వీరు కేవల ప్రాచీన సాంప్రదాయికులు. నూతన సంప్రదాయ వాసన బొత్తుగ గిట్టనివారు.

నూత్న సాంప్రదాయికులలోఁ గూడ నొక తెగవారు యతిప్రాస లుండవలె ననియే వాదింతురు. కాని వారు తెలుపు క్రొత్త యుక్తు లేమియు లేవు.

కూడదనువారు తెలుపు అభిప్రాయములు:—

"కవిత్వమునకు రసము ప్రధానము. 'వాక్యం, రసాత్మకం కావ్యం' అని సాహిత్య దర్పణ కారుఁడును, 'సాధ్యో హి రసో యథాతథం కవిభిః' అని ఆంధ్ర శబ్ద చింతామణి కారుఁడును ఉచ్చకంఠములతోఁ జాటుచున్నారు. యతిప్రాసలు రసోత్పాదకములు గావు. ప్రత్యుత కొన్నిచోట్ల రసభంజకములును అగుచున్నవి. మరియుఁ గవిత్వమునకు నిర్బంధములు గూడవు. యతిప్రాసలు నిర్బంధములలోఁ జేరినవి. పంజరములోని పిట్ట వలె భాషా నిర్బంధములలో బద్ధుఁడై కవి గిలగిల కొట్టుకొనును. వానికి స్వాతంత్ర్యము కావలెను. ఆంధ్రమునందువలె సంస్కృతమున యతిప్రాసలు లేవు. అందు రసస్ఫూర్తి కలుగుట లేదా? ఆంగ్లమునను గొంతమంది మహాకవులు నియమోల్లంఘనము జేసి వ్రాసిన కావ్యములు రసవత్తరములుగా నుండలేదా? కనుక యతి ప్రాసములు తీసివేసినచోఁ గవిత్వమునకు హాని రాదు. అది కావ్యము కాకపోదు. యతి ప్రాసము లున్నంత మాత్రముననే అది పద్యము కాదు. రసవంతమగు పద్యమును, గద్యమును గవిత్వమే. 'అయినచో పద్య మేల వ్రాయవలెను? రసవంతమగు గద్యమే వ్రాయ రాదా? పద్యము వ్రాసినపుడు యతిప్రాసము లుంచరాదా' అందురా? అది ప్రశ్న గాదు. కవికిఁ దోఁచిన భావము పద్యమునందు గణనియమమును బొంది యొక విధమగు సంగీతమునకు బద్ధమై చిత్తాకర్షకతను వహించి మాధుర్యమును గూర్చుచున్నది. గద్యమునందు గణనియమము లేకపోవుటచే సంగీతమునకు బద్ధముకాక చిత్తాకర్షణ శక్తిలేనిదై రసస్ఫూర్తియందుఁ గొరవడియున్నది. మఱియు నొకటే భావమును గద్యమునందును, బద్యమునందును వ్రాసిచూడుడు. అప్పుడు మీ ప్రశ్నకుఁ గల విలువ మీకే తెలియఁగలదు. కనుక యతిప్రాసలు తీసివేసినచో రసపిండములగు కావ్యములు వెడలుననుట నిస్సంశయము."

అని. ఈ మతములం దున్న సత్యాసత్యములను మనము విచారింపవలెను. అందు ముందు ఈ యతిప్రాసల నియమము ఇతర భాషలలోఁ గూడు గలదా? మన భాషయందు వీనిని నియమించిన వారి అభిప్రాయమేమి? వారి అభిప్రాయ మెంత సమంజసము? అను విషయమును బరిశీలింతము.

సంస్కృత భాషలో యతి, విశ్రాంతి, విరతి, విశ్రామము మొదలగునవి పర్యాయపదములు. 'యతి ర్విశ్రామ సంజ్ఞికా' అని లక్షణము చెప్పఁబడినది. అనగా బద్యపాదమును రెండు భాగములుగాఁ జేసి మొదటి భాగము చివర ఆపుట. రెండు భాగములును ఏక సమాసాంతర్గతములై కూడ నుండవచ్చును. కాని ప్రథమ భాగాంతాక్షరమును, ద్వితీయ భాగాద్యక్షరమును ఏక పదములో యుండరాదు. కాని ఆంధ్రమందువలె సంస్కృతమున అక్షరమైత్రి లేదు. మఱియు సంస్కృతమున ప్రాసమే లేదు. కాని అంత్య ప్రాసము గలదు.

> "వృద్ధో యాతి గృహీత్వా దండం
> తద పిన ముంచ త్యాశాపిండమ్."

ఇట్టి స్థలములందు అంత్యప్రాసము ఆంధ్రమందు పోతన కవిత్వమునందు వలె హృద్యముగా నుండును. నిజమునకు మామూలు ప్రాసముకంటె అంత్యప్రాసము శ్రావ్యతరముగా నుండును అని నా తలంపు. ద్రావిడ కర్ణాటక భాషలలోఁ గూడఁ బ్రాస నియమము గలదు. కాని యతి నియమములేదు. "కన్నడక్కె యతి యిల్ల, తెలుగిక్కె మతి యిల్ల" అను కన్నడపు సామెత గలదు. అనగా కన్నడమునకు యతిలేదు. తెలుగు వారికి మతిలేదు అని అర్థము. ద్రావిడ భాషయందును యతిలేదు. ఈ ప్రాస సంప్రదాయము ద్రావిడ కర్ణాటక భాషలనుండియు, యతి సంప్రదాయము సంస్కృతమునుండియు వచ్చియుండునని నా తలంపు. యతికి సంస్కృతమునందువలెనె ఆంధ్రమునందును స్థాన నియమ మేర్పరచిరి కాని ప్రథమ భాగాంతాక్షరమును ద్వితీయభాగాద్యక్షరమును ఏక పదగతములై యుండరాదను నియమమును బాటింపరైరి. ఆంధ్రభాషలో ఈ యతి ప్రాసముల నేర్పఱచినవారి అభిప్రాయము సంస్కృత యుండుటచో, ద్రావిడ కర్ణాటక భాషలకంటె నియమ బాహుళ్యముచే గొప్పతనము కలుగునని.

ఈ యతి ప్రాసములవలన రసస్ఫూర్తి కలుగునా? అనునది యొక ప్రశ్న. తెలుగు భాషలోఁ బెక్కు సామెతలు యతి ప్రాసములు గలిగియుండి రసస్ఫూర్తిని గలిగించుచున్నవి.

అంగటిలో అన్నీ ఉన్నవి—అల్లునినోట శని ఉన్నది.
అప్పు లేకపోతే—ఉప్పు గంజి మేలు.
అన్నీ ఉన్నవి—ఐదోతనము లేదు.
ఉభయభ్రష్టత్వం—ఉపరి సన్న్యాసం.
బ్రాహ్మణులలో చిన్న—బెస్తలలో పెద్ద.
వచ్చినా పైకం దప్పు—దచ్చమ్మా నను లెక్కకు.

ఇట్టి తావులందు యతిప్రాసలు రసోత్పాదకములు గావని యెవరును చెప్పరు. రసోత్పాదక మనఁగా సౌందర్యోత్పాదకము అన్నమాట. ఈ సామెతలందువలె ఆంధ్ర పద్యములందు యతిప్రాసలు రసోత్పాదకముగా లేవు. దీనికిఁ గారణములు మూడు:

1. ఏ అక్షరమున కా యక్షరమును యతిస్థానమం దుంచకుండుట.
2. యతిస్థానము సంస్కృతమునవలె విభక్తము గాకుండుట.
3. పాదమునకుఁ బాదమునకు ప్రాసాక్షరము దూరమై యుండుట.

ప్రాసాక్షరము సమీపమందున్నచో అనుప్రాసమునందువలె ఇంపు గలుగును. దూరముగా నున్నచోఁ గలుగదు. ఇప్పటి యతులలో వర్గయతి యొక్కటియే శ్రావ్యతను గలిగించునుగాని మరేదియు గలిగింపదు. సంస్కృతమునందును గొన్ని స్థలములం దీయతి పై సామెతలందువలెఁ గనుబడుచు శ్రవణసుఖము నిచ్చుచున్నది.

> వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
> అథ ప్రజానా మధిపః ప్రభాతే.
> నారాయణాయ నళినాయత లోచనాయ.

కనుక యతిస్థానమును విభక్తము గావించి ఏ యక్షరమును, కా యక్షరమును యతిగా నుంచినచో యతి శైలికి సొంపు లిచ్చి తద్ద్వారా రసోత్పాదనము కావచ్చును.

ఇఁకఁ బ్రాస. నాలుగు పాదములకు ఏకాక్షరమునే నియమించుట మాని అదే పాదమునందు దగ్గఱగా నేర్పరచినచో శైలికి సొంపును, తద్ద్వారా రసమునకు ఉపస్కారమును గాఁగలదు ఎట్లన,—

> ఉ. అంతట సంతసం పడుచు
> అంబురుహానన వచ్చి భర్తపా
> దమ్ముల కాదర మ్మెసఁగ
> దండము పెట్టియుఁ బల్కెనో ప్రియా!
> కన్నుల కర్వు దీర నిను
> కాంచుట యెన్నఁడు కల్గునంచు నా
> దేవుని వేవిధంబులను
> దైన్యముతో సతతంబు వేడితిన్.

ఈ పద్యములో 1, 2, 4 పాదములలో ప్రాసాక్షరమునకు సమీపమందే ప్రాసము వేయఁబడినది. మూఁడవ పాదములో ప్రాసములేదు. ఉండఁగూడదని నియమము కాదు. 'కన్నుల కర్వుదీర' అనునది జాతీయము. ప్రాసకొఱకు దానిని విఱిచివేయుట

రసభంజకమగుచు కనుకనే దీసివేయబడినది మఱియును గద్యమునకును, పద్యమునకును ఒక్కటే వ్యాకరణ ముండుట యుక్తమని తోచదు కవికి గద్యమునందుం గల స్వాతంత్ర్యము పద్యమునం దుండదు గణనియమమునకు దాసుడై యుండవలయును. అందుచే గద్యమువలెఁ గాక భాషను స్వతంత్రముగాఁ ద్రిప్పుకొనవలసి యుండును. అట్టి సమయములందు విసంధి మొదలగు దోషములు కావనియు, యతి మొదలగువాని స్పష్ట శ్రవణమునకై విసంధి మొదలగునవి తప్పక ఉండుటయే మేలనియు దోఁచుచున్నది కనుకనే పై పద్యములో విసంధి చూపబడినది. గద్య పద్యములకు ఒకటే వ్యాకరణము గూడదను పరిభాషకు పూర్వ కవుల వ్యాకరణ విరుద్ధ ప్రయోగములే జ్ఞాపకత్వము వహించుచున్నవి

ఆంధ్ర కవిత్వమునకు యతిని నియమించిన లాక్షణికులు పు ఫు బు భు ము—లకుఁ బరస్పరము మైత్రి చెప్పి ఫ ఫ బ భ మ—లకుఁ గూడ దనిరి. ఈ యక్షరములకు ప్రత్యేకముగా వారికిఁ జేసిన మహాపకార మేమియో తెలియదు మఱియును మైత్రిని జెప్పుటలో వ్యంజనములకు స్వర సాహిత్యముయొక్క మైత్రియు నిర్బంధముగా విధించిరి. పై సామెతలలో 'బ్రాహ్మణులలో చిన్న బెస్తలలో పెద్ద' అను సామెతలో 'బా బె' లకు యతి చెప్పఁబడినది అందువలన రసభంగము అగుటలేదు రసభంజకము కానప్పుడు స్వర మైత్రి యేల అవశ్యముగా నుండవలెనో తెలియకున్నది కాని దయాపరులగు లాక్షణికులు యతులలోవలెనే ప్రాసములందును స్వరమైత్రిని విధింపక కవికి స్వాతంత్ర్యమిచ్చినందులకుఁ గవి వారికిఁ గృతజ్ఞత చూపవలెను కనుకఁ బైని నేను సూచించినటులు యతిప్రాసములు పద్యమునకు సౌందర్యము నిచ్చు ననుటలో సందేహములేదని నా మతము ఒకానొకచో రసముకొఱకు యతిప్రాసములు విడిచినను హాని లేదు ("కన్నుల కర్వు దీఱ" యందువలె) ఈ విషయమున నా వ్రాసిన పద్యముల నిందుదాహరింతును

క. శ్రీకృష్ణదేవరాయ
క్ష్మాకాంతుని జన్మదినము మన రాజేశ
క్ష్మాకాంతు నాధిపత్యము
మాకుం బండుగలమీదఁ బండుగలు గదా.

మ కనుచుండంగనె లెంపి యెల్ల విరులన్
గర్వించెఁ బూఁబెట్టు నా
తల వైధవ్యము గొన్న వాలఁగి దయా
దాక్షిణ్యముల్ మాని, ఆ
లని కీ క్రౌర్యము కాదు కూడదని వా
దల్ సేయుదో? లంతరా
త్మ నిగూఢంబుగ, నంతరాత్మయును తే
దో? వాని కే లేశమున్?

ఈ రెండు పద్యములందును నాల్గవ పాదమునందు యతిభంగమైనది కాని అది పోయినదని చెప్పువఱకును దోఁచదు సరే, లంపలి భావ సౌందర్యమే పైకి హృదయము పోవునుగాని యతి పైకిఁ బోదు

మనము పద్యము చదువఁగానే బాగుగానున్నదని చెప్పుచు రసముకొఱకు వారిలో ఎంతమంది రసమున కానందించుచున్నారో, యతిప్రాసముల కెంతమంది ఆనందించుచున్నారో విచారింపుఁడు పైని మొదటి పద్యములోని 'పండుగలమీఁదఁ బండుగలు' అనునది నానుడి మాకున్ అను మకారముతో యతి సిద్ధించుటకై ఈ నానుడిని ఎగురఁ బెట్టుట భావ్యమా? నానుడి ద్వారా సిద్ధించు సౌందర్యము కొఱకు యతిని దీసివేయుట యుక్తమా? లాక్షణికులారా! యోచింపుఁడు. మీరావేళ "పండుగలమీఁద బండుగలు గదా" అను దానిని యతిత్వసిద్ధికై "మంగళము గదా" అని యనరాదా అప్పుడు సౌందర్యము చెడదు గదా అనవచ్చును మంచిది. కాని "పండుగలమీఁద బండుగలు" అను నానుడిలోనున్న సౌందర్యము "మంగళములమీఁద మంగళము గదా" అను నుడికారములో లేదని నా తలంపు ఏలన, రెండవది మొదటి దానికి సంస్కృతీకరణము ఈ రెంటికిని సహజమునకును, కృత్రిమమునకును గల భేదమే యుండును.

ఇఁక రెండవ పద్యములో నాల్గవ పాదమునందు యతిత్వసిద్ధికై 'లేదో' అను దానిని 'లేదా' అనరాదా అని మీ రడుగవచ్చును మంచిది కాని 'లేదా' అనునప్పటి అర్థము వేఱు, 'లేదో' అన్నప్పటి అర్థము వేఱు అర్థము మాఱినచో అందము చెడును. దానితో రసభంగము కనుక యతిత్వసిద్ధికై భిన్నార్థమును గలిగించి రసభంగము జేయుట న్యాయ్యమా? యతి భగ్నమైనను రసము పోషించుట న్యాయ్యమా? విచారింపవలెను కవిత్వమునకు జీవితము రసమని ఎల్లరును అంగీకరింతురు. ఏదో భిన్నమని చెప్పరు ఇట్టి యిక్కట్టులు గలిగినప్పుడు వృత్తమునే మార్చుకొని నానుడులు పోకుండను, భిన్నార్థకము రాకుండను, మఱియొక వృత్తములో వ్రాయరాదా



"రూపాయాలు, అణాలు, పైసలు—"

[1930 ప్రమోదూత సంవత్సరాది సంచికనుండి]

రూపాయాలు, అణాలు, పైసలు.

NVKR

ఆంధ్రపత్రిక

స్వర్ణోత్సవ శుభసమయాన

మా

శుభాభినందనలు



ది బి. ఎన్. కె. ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్

ఫైన్ ఆర్ట్ కలర్ ప్రింటర్స్

"చందమామ బిల్డింగ్స్"

వడపలని - మద్రాసు - 26.

# పన్నీరు పువ్వు

## రాయసము వెంకటశివుడు గారు

[1930 ప్రమోదూత సంవత్సరాది సంచికనుండి]

ఉదయగిరి రాజధానిగాఁ జేసికొని, రెండవ జలాలుద్దీను మధ్యమాంధ్రరాష్ట్ర మేలుచుండెను. ఆ మహమ్మదీయ ప్రభుని రాజ్యమందు జను లెవ్విధమగు ననర్థము లకును బాలుగాక, సరిలేని సౌఖ్య సంపద లనుభవించుచుండిరి హిందువులు, మహమ్మదీయులు నను తారతమ్యములేక, ప్రజలందరిని సమభావమున నవాబు పరిపాలించు చుండెను జలాలుద్దీను సుజనులలో సుజనుఁడు సూఫీ సిద్ధాంతములం దపార భక్తి విశ్వాసములు గలిగియుండు నాతనికి వానితోఁ దులతూఁగు హిందూ వేదాంతశాస్త్రము నందును లమిత గౌరవము గలదు ఆతని కన్నులకు బీదసాదలు, పండిత పామరులు నందఱు నొకటియె జగమంతయు జగదీశుని జీవకళయె ప్రజలెల్లరు భ్రాతృ సమానులు పరమాత్మునియందు బుద్ధి నిలిపి, జలాలుద్దీను పూర్వకాలపు ప్రభువరులగు జనక, ఆరీలియసు, అక్బరు మున్నగు మహనీయుల పాదచ్ఛాయలనే యడుగు లిడుచు, దేశ పరిపాలన ధర్మము నిర్వర్తించుచుండెను

లోకవిభవము లన్నిటికన్నను జలాలుద్దీనునకు చిత్తశాంతియె ప్రియతమము అనేకమాఱు లాతనికి భూలోక జీవనము, ప్రజాపరిపాలనమును నతి దుర్భరములుగఁ దోఁచి, తా నీ కష్టభూయిష్ఠమగు సంసారము వదలి, ఏ మెక్కా పుణ్యక్షేత్రమునకో, ఏ షిరాజానగర వాటికకో చేరి, అందు పరమేశ్వర ధ్యానమందును, సూఫీ వేదాంతుల సుఖగోష్ఠిని దినములు గడపఁ గోరెను. ఐనను తమ్ముఁడగు నాదరుషా కొండవీఁడు ప్రభువై అన్నకు సర్వదా సాయము చేయుచు, ఆతని మనసు నకాండ వైరాగ్యమునుండి రాజకార్య నిర్వహణమునకుఁ ద్రిప్పుచు, ఉదయగిరి ప్రభుత్వ మతఁడు వీడకుండునట్లు చేయుచుండెను

జలాలుద్దీను పారసీక రాజకుటుంబములోని యొక సుందరిని బరిణయమయ్యెను. ఆ సుకుమారి హిందూస్థానమునకు వచ్చి కొన్ని వత్సరములైనను, ఈ దేశపు శీతోష్ణస్థితులకును, జనాచార పద్ధతులకును నభ్యాసపడలేదు ఆ ప్రాంతములకెల్ల నుదయగిరి యుద్యానవనమువంటిది నడివేసవి యెండలు, దేశము నెంత దహించుచున్నను ఉన్నత పర్వత శిఖరమున హిమాలయమువలెఁ జల్లగనుండు నుదయగిరి ఖిల దరికి రాకుండును ఆ నగ రెంత సౌఖ్యావహముగ నున్నను, జులెయికాకాంత కను లెపుడును దూరపు షిరాజా వృక్షవాటికల మీఁదను, అందలి పుష్పజాలముమీఁదను వాలియుండును వసంతకాలమున నుదయగిరి తరురాజముల నాశ్రయించు పికావళి పారసీకోద్యానముల నుండు గండుఁ గోయిలలవంటివిగావని యాతరుణి తలంపు! హిందూదేశమందలి శీతకాలపు లేయెండ ఆ లేమకు గ్రీష్మాతపమువలె దుస్సహముగ నుండును ప్రభుపత్ని సౌఖ్య సదుపాయములకేమి కొఱత వాటిల్లఁగలదు? ఆ సుందరి కెటులైన హిందూ దేశ నివాసము సుఖవంతము జేయఁగోరి, నవాబు పారసీకమునుండి వివిధ పుష్పజాతుల మొలకలు తెప్పించి నాటించెను నీటివసతిగల చల్లని యుదయగిరి నీ చెట్లు వృద్ధినొందెను. కాని యెన్ని సౌఖ్యము లుండినను, హిందూదేశ జీవనము కారాగృహవాసమని జులెయికారాణి యనుకొనుచు, నానాఁట, గృశింపఁజొచ్చెను వ్యాకులిత హృదయమున జననమొంది, దేహమున వ్రేళ్లుపాఱిన యా వనిత వ్యాధి నే వైద్యులును బరిశీలింపలేకుండిరి ఎట్టి షర్బతులు, లేహ్యములు నా సుకుమారి శరీరపు వేఁడిమి నుపశమింపఁజేయ నేఱకుండెను యునానిహకీములు, ఆయుర్వేదభిషగ్వరులును ఆ రాజ్ఞికొఱ కుపయోగించిన రాజౌషధములు అడవిని గాచిన వెన్నెలలై పోయెను జలాలుద్దీను మనశ్శాంతికి విఘాతము కల్పించుటకు ప్రియసతి శరీరాస్వస్థత ప్రబల కారణమయ్యెను

## 2

అద్దంకిసీమ నొక ప్రఖ్యాత వైద్యవంశము గలదు. ఇరువదియైదు సంవత్సరముల ప్రాయముగల శ్రీనాథుఁడను యువకుఁ డా వంశపు వారిలో నిపుడు నుతికెక్కిన వైద్యుఁడు. వంశక్రమానుగతమైన వైద్య విద్యా నైపుణ్యముతోపాటు ఈతఁడు ఉద్గ్రంథ పఠనముచేసి, దైవభక్తిపరుఁడై, పరోపకారచింతనము గలిగి, తనయొద్దకు వచ్చిన రోగుల జాడ్యపు జాడలు మిగుల మెలఁకువతోఁ బరిశీలించి, శ్రద్ధతోఁ దన్నివారణోపాయము లారయుచుండును కావున వయస్సునఁ జిన్నయైనను, శ్రీనాథుఁడు అనుభవమునఁ బెద్దవాఁడె! ఎంతటి కఠినరోగమైనను, వైద్యశిఖామణి చేతికి లొంగవలసినదే! ఉదయగిరీశ్వరుని భార్యయొక్క వ్యాధి సమాచారము తెలిసి, మిత్రుల ప్రేరేపణమువలన, ఆ రాణి రోగ నివారణార్థమై యాతఁ డిలు బయలుదేఱెను ఈ వైద్యుని బుద్ధికుశలతను [illegible] విని, [illegible], వైద్యము చేయింపఁగోరి, ఖిల్లా పరిసరముల నుండెడి [illegible] నీతనికి విడిది చేసెను మహమ్మదీయులలో ఘోషా [illegible] రాజకుటుంబములలో నీమరియాద మరింత ప్రాముఖ్యము వహించి[illegible] జూడక, నాడీ పరీక్ష వలనుపడక, ఇతరులు తెలిపెడి రోగ చిహ్నములబట్టి వ్యాధి నిర్ధారణ చేయుట ఎట్టి వైద్యునికిని దుస్సాధ్యము [illegible] గూర్చి యనుకొన నేమి ప్రయోజనము? బాల్యమున శ్రీనాథుఁడు తండ్రియొద్ద వైద్య విద్యాభ్యాసము చేయు దినములలో, రాజాంతఃపుర స్త్రీల నాడి [illegible] కనుఁగొనవలెనని యడిగి, [illegible] ప్రతిఫల [illegible] రణము చేయు విధ మాతఁ డెఱిగి [illegible] గ్రహించెను ఇప్పుడది శ్రీనాథుఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, నవాబునకుఁ దెలియఁజెప్పెను [illegible] రోగి మంచము దగ్గఱ నొక తెర వేయించిరి క్రింది నుంచిన పన్నీరు తొట్టెలో రాణి ముఖ ప్రతిబింబము స్పష్టముగఁ గానవచ్చెను ఈ నీడను పరీక్షించి వైద్యుఁడు వ్యాధి నిరూపణము చేయఁ బోయెను లేతతమలపాకువలె [illegible], [illegible] అందు నీలిమ మేర్పడుట, కనులు సోలుచుండుట, శిరము తూలుచుండుటయు రోగమునకు ముఖ్య చిహ్నము లగునట్లు లతఁడు కనిపెట్టెను. వైద్యుని కోరికవలన నవాబు వేసిన ప్రశ్నములకు రాణి ప్రత్యుత్తరము లొసంగెను ఆ సంభాషణ మూలమున రోగి కంఠధ్వని, ధోరణి, రుచులు, పరిస్థితులును దెలిసెను ఇవ్విధమున నా వైద్యుఁడు పరీక్ష జరిపి, రోగ నిర్ధారణ చేసెను

## 3

లోకము విరోధివర్గ పరిపూరితము! గురువునకు గురువు, వైద్యునకు వైద్యుఁడు, వర్తకునికి వర్తకుఁడు శత్రువులుగ నేర్పడుచున్నారు ఒకరి నొకరు ద్వేషించి, వలసపడుచో నొకరి నొకరు అటవీ మృగములవలె కబళింపఁ జూచుచుందురు! అట్టియెడ కాని, మిత్రత్వమె వ్యాపార సూత్రముగఁ జేకొని, ఒండొరుల భావానుభవముల సాహాయ్యమున జనులు తమ విధులను మఱింత బాగుగ నెఱవేర్చుట కర్తవ్యమని గ్రహింపకున్నారు శ్రీనాథుని ప్రణాళిక యిట్టిది కాదు. రోగ నిర్ధారణమునట్లు వైద్యునికి సర్వజ్ఞత్వము పనికిరాదు రోగి కిదివఱకు వైద్యము చేసినవారు భిషక్కులనకుఁ బరమమిత్రులని యాతని మతము కావున శ్రీనాథుఁడు రాణి పూర్వపు చికిత్సకుల పరిచయముచేసి, రోగ నివారణమును గూర్చి వారు సలిపిన కృషి వివరము, వ్యాధిని గుఱించి వారికిఁగల యనుభవములను గ్రహించెను శిశువులకును, రాణివాసపువారికిని వైద్యము చేయుట మిగుల కష్టము. పరదేశ జనితయగు జులెయికా కాంతయొక్క తనూలత్వ మతికోమలము మనోవ్యధచే నేర్పడిన మహామోహమునకు వైద్యులు చేసిన ప్రతిక్రియలె వ్యాధిని మఱింత పెంచెను! బంగరు త్రాసువంటి యా సుకుమార లత్వమునకు కలకండ పలుకె కఫోద్రేకము, మధుబిందువె మోహాధిక్యమును గలుగఁజేయును! ఈ విషమ పరిస్థితులందు మిగుల శ్రద్ధ వహించి, తన మేధాశక్తినంతయు [illegible]గించి, శ్రీనాథుఁ డెట్టకేలకు ఔషధానుపాన నిర్ణయము చేసెను

## 4

దైవానుగ్రహమువలన వైద్యకుమారుని మందు రాణికి గుణ మిచ్చుచుండెను నిరతము పానుపునంటిపెట్టుకొనియుండు జులెయికా యిప్పుడు పరిచారికల సాయమున లేచి కూర్చుండి సంభాషింపఁ దొడఁగెను సతి యిట్లు క్రమముగ నారోగ్యాభివృద్ధి గాంచుచుండుటకు ప్రభువు ముద మందెను పుత్రిక యమితానంద భరితయయ్యెను పరిచారికలు ప్రసన్న వదనములతోఁ బనులు చేసికొనుచుండిరి

శ్రీనాథుఁడు ప్రాతఃకాలముననే దేవునికి పూజలు నమర్పించుచుండువాఁడు. పెద్ద కంచె కావల కదళికారామమున వలసిన పూవు లతనికి లభించుచుండునవికావు. పెద్ద కంచె కావల నేమైన పూలు చిక్కునేమోయని యొకనాఁడు వేకువ నచటికిఁబోయి యాతఁడు మొగ మెత్తి చూచెను అనేక జాతుల పుష్పలతిక లక్కడఁ గానవచ్చెను అందొక మాతన రమణీయ కుసుమ మతని కనులకుఁ దట్టెను అరుణ కమలముల కోమలత్వ మందు మూర్తీభవించినటు లుండెను! ఆకృతిని పద్మములకంటెఁ జిన్నదయ్యును, అందమున దానికంటె నిది మిన్నగఁ దోఁచెను! అంత నా విప్ర కుమారుని కింకొక [illegible]

గానయ్యెను నవమల్లికల నవహసించు మేనిఛాయగమన నొప్పెడి పదునాలు వత్సరముల బాల యొకతె పొదరిండ్లలో నడచివచ్చి, ఈ నూతన పుష్ప మొకటి కోసి, అరుణిమ మందు దాని కెనయగు తన కోమల పాణితలమును బట్టి సంతసమున నాఘ్రాణించుచుండెను ఆ సుందరి చెక్కులు, పెదవులు నరుణకాంతుల నలరారుచుండెను. అమెయెంత మృదులాంగకముల నిర్మాణ రహస్యము లోకమున కెఱిఁగింప గుణపాఠముగ నుపకరించుటకె ధాత యీసుకుమార సుమముల సృజించెనా యనునటు లుండెను! ఈ లలన నవాబు కుమారీరత్నమగు గుల్‌నారియె!

శ్రీనాథుఁడు గుల్‌నారిని జూచుట కిది మొదటిసారి కాదు వాఁడు రాజాంతఃపురమున పన్నీటఁ గానవచ్చిన రోగి కొకప్రక్కగ నిలుచుండి నగిషిగోడ కానుకొనియుండు నొకబాల ప్రతిబింబ మాతని కనుల కపుడు గోచరించెను అట్టి సుకుమార సుందర రూపము మానవ భామినులలో నుండునని తలంపక, అతిశ్రద్ధగ నుండెడి తన వయస్సముల భ్రమింపఁజేయుటకు ఏ గంధర్వాంగనయొ మానవాకృతి దాల్చి వచ్చెనని యా యువకుఁ డూహించెను! ఆ కనుల తీరు, మొగము తీరు, నలువరున క్రమము, ముంగురుల కాంతలు వీక్షించి, ఈ జవ్వని దేవాంశ సంజనితయగు వనితయని యా విప్రకుమారుఁడు విభ్రాంతి నొందెను! ఇపు డా సుందరాకారము మఱల వాని కన్నులకు ప్రసన్నమగునపుడు, ఈ కామిని మర్త్యలోక నివాసిని గావచ్చునని యొకింత విశ్వసించినను రాణి సన్నిహిత బంధువర్గములోనిదై యుండవోపునని యా యువకుఁడు తలపోసెను ఏలనో వాని మది గురుతింపఁజాలని మెత్తని తాఁకునకు గురియయ్యెను. అతి సూక్ష్మ రోగాంకురములు నరహస్యముగ శరీరమునకుఁ గావించిన యుపకృతి గని పెట్టిన దిట్టరి, గుల్‌నారినిగూర్చి తలంచునపుడు, తన హృదయపీఠమును కొల్లగొను కామచోరుని జాడలు పరికింపనేరకుండెను!

మోహ మెపుడు నొకప్రక్కనె ప్రవర్తించునని భావించుట మానవుల వెఱ్ఱి! అద్వంకిపీను వైద్యుఁడు ఖిల్లాలో గాలుపెట్టి, తన జనని చికిత్సకుఁ బూనినవాఁటి నుండియు, గుల్‌నారి యా యువకునందు సదభిప్రాయమున నుండెను బ్రహ్మతేజస్సున నొప్పెడి యా వయస్సుని వదన పద్మమును అంతఃపుర గవాక్షములనుండి యాపాలంతి పలుమార్లు పొడగాంచియుండెను. బుద్ధి కౌశల్యమునకు వీడుజోడగు వయస్సందయు, ప్రజ్ఞాధికత కెనయగు సహృదయతయు ఆ జవ్వనుని మోముదమ్మిని తమ్మిచూలి లిఖియించినట్టుగ గుల్‌నారికి నయనగోచరమయ్యెను! అనుభవశాలులు, వయోవృద్ధులునగు ఘన వైద్యుల చేతులకుఁ జిక్కని వ్యాధి యీ యువకునకు దెల్లమగునాయని పలువు రనుకున్నను, వీనికే ఈ రోగము గ్రాహ్యమగునని నమ్మెను, వీనికే జయము సమకూర్చుమని రాజకుమారి యల్లాను ప్రార్థించుచుండును ఈ వైద్యకుమారుని హస్త మమృతహస్తమనియు, ఇతఁ డిచ్చెడి ఔషధము సంజీవియనియు గుల్‌నారి తల్లిని ప్రోత్సహించుచు, రోగనివారణమునకు దోహదములగు ధైర్య విశ్వాసముల రాణి హృదయమున నాటుకొల్పెను ఇవ్విధమున శ్రీనాథునియెడ సదభిప్రాయ సద్భావములు నా యంతఃపుర సీమ నల్లుకొనియెను.

## 5

శ్రీనాథుని పేరిప్పుడు సంస్థానమునం దెల్లెడల వ్యాపించెను. చిరకాల వ్యాధిపీడితయగు జాలెయికారాణి తొలకరివానకుఁ దెప్పిరిలు పూల మొకవలె కలకఁదేరెను. నాఁటి తత్తరువు ననువరించి యన్ని వదుపాయముల చిన్న వైద్యునకు సమకూరెను. కార్యదయమున కిప్పటికి పూజకు వివిధ జాతుల పుష్పములు, వస్త్రములును రాజపత్రిక శ్రేయముగ కోటనుండి పంపుచుండును అన్నిటికంటె శ్రీనాథునికిఁ బ్రియమగు పూవు పేరులేని యా యెఱ్ఱనిపూవె ఆ పుష్పమునకు తన ప్రేయసియగు గుల్‌నారికిని ఆ విప్రకుమారుఁడు సామ్యము గల్పించుకొని సంతసించుచుండును! ఆ పూవు పేరు పన్నీరు పూవని వాని కిపుడు తెలిసెను గుల్‌నారి మోవి, చెక్కులు, పదపాణితలములు, పన్నీరు పువ్వును బోలియుండుటచేత, ఆ సుందరిని పన్నీరు పువ్వని యా తరుణుఁడు తన మనమున వ్యవహరించి, ముదమందుచుండును! దేవుని పూజలకు శ్రీనాథునికిని పన్నీరు పూవులే ముఖ్యమయ్యెను పన్నీరుపూల నెత్తావుల నాఘ్రాణించుట వానికెంతో సంతోష జనకము. ఆతని కన్నులను పేద దీర్చునది పన్నీరుపూవు పన్నీరుపువ్వును స్మరించి యతఁడు పగలంతయు దలపోయును, రాత్రులంతయు కలలు గాంచును! పురుషార్థములు, ముక్తి మోక్షములు శ్రీనాథునికి పన్నీరుపూవె! ఆ కుసుమమె, కుసుమ కోమలియె, ఆ ప్రియునికిఁ గల్పతరువు ఆతనికి స్వర్గము, సర్వమును పన్నీరు పూవె!

ఒకనాఁడు శ్రీనాథుఁడు స్వవిషయ విమర్శన మొకింత సలిపెను అతఁ డీ పరదేశము వచ్చి కొన్ని మాసములైనది దైవానుగ్రహమువలన, తాను వచ్చిన కార్యము సఫలమగుట సత్యమె కాని, యొరులవ్యాధి నివారణఁ జేయవచ్చిన తానె యనివార్యవ్యాధ నుపీడితుఁడగుట యెంత శోచనీయము! పరదేశమందలి మక్కువచేత స్వస్థలమును మఱచెడి మందుఁ డెవడన్నైన గలఁడా! తనకు ప్రేమాస్పదులగు ప్రాంతబంధుగణము వీడి, క్రొత్త చుట్టములకై పరితపించుట యెట్టి వెఱ్ఱి! మోహము వివేకము నణచును. సత్కుల సంజాతుఁడగు తా నీ యవన జవ్వనిమీఁద వలపు గొనుట యెట్టి యవమానము! ఎంత యసభ్యము! అన్యజాతి మత సంప్రదాయములతో నొప్పెడి యా ముస్లిము రాజకన్యక వైద్యవృత్తి జీవనము గాఁగల యొక విదేశ బ్రాహ్మణ పుత్రకుని ప్రేమించి, యాతని పాణిగ్రహణ మొనర్చునా? అందని మ్రానిపండ్లకు ఱెల్లు సాచనేల? వచ్చినపని ముగించి, బహుమతి నంది, యింటికేగి తానేల కృతార్థత నొందరాదు?



బంతి ఆట [1930 ప్రమోదూత సంవత్సరాదిసంచికనుండి]



ఉత్సాహి—2 (మద్దెలకాడు)

[1930 ప్రమోదూత సంవత్సరాదిసంచికనుండి]

శ్రీనాథునికి రాచకన్నియ మీది ప్రేమము ఆత్మ విమర్శనము, ఆత్మ బోధనములను సాధారణ చికిత్సా సాధనముల నతిక్రమించిన కఠిన వ్యాధిగఁ బరిణమించెను! వలపు ప్రాణమునే లెక్కసేయనపుడు, వ్యక్తి లక్షణములగు కులజాత్యభిమానములు, లజ్జావమానములను పరిగణించునా? సంసార బంధములు కోసివైచిన విరాగివలె నీ ప్రియుఁడు ఏకాగ్రచిత్తుఁడై, ప్రేమాధినాథుని కంజలులు నలుపుచు, దినములు పుచ్చుచుండెను. ఆ విప్ర పుత్రకుని కా ముస్లిముదామాస్మరణ మయ్యెను! ఆ సుందరి దినదినము ప్రాతస్సమయమున తన మృదుకరములఁ బ్రీతితోఁ గోసియంపెడి పన్నీరు పూవులె యా ప్రియుని కమూల్యములగు కానుకలు, ఆతని యిష్టదైవమున కభీష్టమగు పూజా ద్రవ్యములును!

## 6

ఇంక రాజగృహమునందలి గుల్‌నారిని గూర్చిన సమాచారములు పరికింపవలయును ఏకైకపుత్రిక యగుటచేతను గుల్‌నారి జననీ జనకుల కన్నులకు పెన్నిధియె! భువనమోహినియగు పుత్రికయందు మాతా పితరుల కమితే వ్యామోహ ముండుట యాశ్చర్యము గాదు ఆ బాలయందుఁ గానవచ్చెడి సుగుణ సౌశీల్యములు వారి ప్రేమ వృక్షమునకు దోహదము లయ్యెను. అసమాన బుద్ధి చాతుర్యముతో భాసిల్లెడి యా బాల జనకుని వేదాంత ప్రసంగములందు పాల్గొనుచుండును. గుల్‌నారి సాదీ మున్నగు పారసీక కవి పుంగవుల కావ్య రాజములఁ జదివి, అందలి మనోహర భావములను గూర్చి జననితో ముచ్చటించుచు, నిరతము యవన కవితా మధురసము నాస్వాదించుచుండును పారసీక కవుల వర్ణనలందు గుప్పించిన గులాబి పూవులను ప్రియ తనయకుఁ జూపించుటకై నవాబు పారసీకమునుండి గులాబి యంటులు తెప్పించి, ఉదయగిరిని నాటించెను! ఆ మొక్కల సంరక్షణా భార మీ సుందరిమీఁదనే యుండెను హిందూదేశీయులవాడిగ పెర్షియానుండి వచ్చెడి గులాబి పూలసారమగు పన్నీరు వాడుచుండెడివారు కాని, ఆ కుసుమముల దర్శన భాగ్య మిదివఱకెఱుఁగరు! కావుననే యిపుడు ఉదయగిరి మీఁద విరివారు నీ క్రొత్త జాతి పూవులను దేశీయులు పన్నీరు పూవులని వ్యవహరింపఁ దొడంగిరి నెల్లూరుసీమవారు నేటివరకును గులాబి పూవులను పన్నీరు పూవులనియె పేర్కొనుచుందురు ఆ పూఁబోదలను ప్రప్రథమమునఁ బెనుచు చుండిన యారాచకన్నియకు "పన్నీరుపువ్వు" అని జనులు పేరిడిరి గుల్‌నారి యను పారసీక నామమునకు నిదియె యర్థమగుటచేత, అన్నివిధముల నా రాజకుమారికి "పన్నీరుపువ్వు" సార్థక నామ మయ్యెను

పాదరిండ్ల పెంచుచును, పూఁదీగలు జక్కచేయుచును, సతతము కుసుమములతోఁ గాలము గడుపు గుల్‌నారిని మధులిహమను ముద్దుపేర తండ్రి పిలుచుచుండువాఁడు. గుల్‌నారి విద్యాబుద్ధులం దాఱితేఱిన వయస్సయ్యెనను, తలి దండ్రుల కింకను బాలికయె! తాను బాలననియె యా తరుణియు తలంచుచుండును! కాని, కష్టానుభవము, కాముని ప్రబోధనమును ఎట్టి తేఁబాయవు వారికిని వయసు గొనివచ్చును! ప్రేమమూర్తియగు జనని చిరకాల వ్యాధి గుల్‌నారికి వ్యాకులతతోపాటు ప్రాయమును బెంచెను యౌవన వైద్యుని చికిత్సచే తల్లి స్వస్థత నొందుటకు పుత్రిక యపరిమితముగ సంతోషించెను. ఆ యువకు ఉసమానబుద్ధి ప్రజ్ఞలతో నొప్పువాఁడని వానిని జూచినపుడె గుల్‌నారి గ్రహించెను. ఆతని మూలమునఁ గదా జనని జీవములు దక్కెనని యారాచకన్నియ వైద్యునెడ మితిలేని కృతజ్ఞత గలిగియుండెను సుగుణాన్వితుఁడగు నా సుందర పురుషునం దా సుదతికిఁ గుదిరిన సద్భావము వట్టి కృతజ్ఞత గాదు ఆ యువకుని తన హృదయాధినాథునిగ గుల్‌నారి భావించెను! ఐనను తన మన మిట్టి తలంపులకు లోనగుట బాల్య లక్షణమని యా తరుణి యొక్కొకతఱి తలపోసి, తనకుగల విద్యా వివేకానుభవముల సాహాయ్యమున నద్దాని హసించి నిరోధింప యత్నించెను కాని, ప్రేమాంకురము తన హృదయ క్షేత్రముల తల మొలవఁగనె వేరు తన్ని వృక్షమగుట కా యువతి విస్మయ మందెను! నూతన ప్రేమ వ్యాజమున నిట్లు గుల్‌నారి పరవశ యయ్యెను!

కుశాగ్రబుద్ధిగల గుల్‌నారి ఈ నూతన పాశమును ద్రుంపివేయ నెన్ని ప్రయత్నములో చేసెను. తనకును, ప్రియునికిని జాతిమత సాంఘికాచార విషయములుగల వ్యత్యాసమును దలపోసెను. జననీ జనకుల యసమ్మతిని గూర్చి యోచించెను లోకుల వ్యాఖ్యానము లూహించెను. తన ప్రేమ సాఫల్యమునకు లోకమంతయు నడ్డుపడునట్లుగ భావించెను ఐన నీ ప్రతిబంధకము లన్నియు దాఁటి వెడలి, ఆ సుదతి హృదయమందలి ప్రేమ లతిక తల యెత్తి యాకస మంటునట్లు గానవచ్చెను! సంకువట్టు పట్టిన పసివట్టినలె నా పడఁతి ప్రేమ శిశువు మాతృహితబోధనలు పెడచెవిని బెట్టుచుండును! గింజుకొనిన కొలంది కంఠము బిగియించు నురిత్రాటివలె, తొలఁగింపవలెనని యత్నించిన కొలఁది ప్రేమపాశము హృదయమును బంధించుట కావనిత వనటఁజెంది, చేయుట కేమియుదోఁపక, చేష్టలు దక్కియుండెను!

చేతనములకెల్ల చైతన్యమగు ప్రేమమునకు సెనుపు నైసర్గిక లక్షణము జనకుని యానచే ననుదినము క్రొత్త వైద్యుని పూజలకు పన్నీరుపూవు లంపెడి గుల్‌నారి, ఒకనాఁడు తన ప్రణయ వృత్తాంతము ప్రియునికిఁ దెల్పి యాతని మన మెఱుంగు గోరి, తాను వ్రాసిన చిన్న కమ్మ చుట్టను పూలమర్చి బంతికట్టి, దానిని పూలలో నిమిడ్చి, పూలగంప నెప్పటివలె వైద్యుని విడిది కంపెను! పూవుల కెదురుచూచుచుండు శ్రీనాథుఁడు, పూలమధ్యమందు పూబంతి చూచి విస్మయమంది, తన గుండియ లాత్రమునఁ గొట్టుకొనుచుండఁగ, అది మెల్లన విప్పెను లోని లేఖ చూచి చదువు కొనునపుడు ఆ ప్రియుని హృదయ మీ లోకమున లేదు! ఏ విచిత్ర ప్రపంచమునవో, ఏ కల్పతరువుల



(మద్యపాన నిషేధ ప్రచారము నుద్దేశించినది)

పిచ్చా—ఆగాడా! [1930 ప్రమోదూత సంవత్సరాదిసంచికనుండి]



ఎలాగైతేనేమి అల్లుడు మామా కలుసుకున్నారు!

[1930 ప్రమోదూత సంవత్సరాదిసంచికనుండి]

వీడనో, తాను విశ్రమించుచు, సుందర పక్షిజాలముల కిలకిలా రావములు వినుచుండు నట్లుగ నా యువకునికిఁ దోఁచెను! లేఖా విషయము లెవ్వి? ఆ యువన కన్యకమీఁది మది నిలుపుటచే తనకు లోక మెంత శోభాయమానముగ నున్నదో, తననుగూర్చియే తలంచుచు ప్రొద్దుపుచ్చుచుండుటచే నా తరుణికి నటులె యుండెను! కదళికావన మున సేవకులు కోసి కోటకుఁ గొనిపోయెడి ఫలపత్రముల మధ్యమున తన ప్రత్యుత్తరపు ప్రేమలేఖను బొందుపఱచి, విప్రకుమారుఁడు గుల్‌నారి కంపెను ఈ విధమున నా యువతీ యువకుల ప్రేమానురాగములు పెంపారుచుండెను!

## 7

సౌఖ్యదినములు క్షణములై సాగిపోవును తాను వచ్చిన కార్యము దైవానుగ్రహమున సఫలమై రాణి సంపూర్ణారోగ్యము గాంచెఁ గావున, రాజానుమతి యైనచో తాను బోయి వచ్చెదనని శ్రీనాథుఁడు నవాబునకు విన్నవించుకొనెను మఱునాడు ప్రభువు నిండు కొలువుననుండి శ్రీనాథు నుచితాననాసీనుంజేసి, అతని వైద్య నైపుణ్యమును ప్రశంసించెను మంత్రులు వాని నెంతో శ్లాఘించిరి వయసునఁ జిన్నయయ్యును, విద్యాప్రాభవముల నీతఁడు పెద్దయనియు, వైద్య రహస్యము లీతనికివలె నింకెవ్వరికి తెలియవనియు, కావున నేలిక యొసంగెడి యెంతటి గొప్ప పారితోషికమును స్వీకరించుటకైన నీ యువకుఁ డర్హుఁడనియు ఆస్థాన వైద్యవేత్త యువన్యసించెను తనమీఁద నురయుగిరి వారికిఁ గల యపారకరుణయె తన జయమునకుఁ గారణముగాని, ఇతర వైద్యులకు లేని ప్రజ్ఞాతిశయము తనయందు లేదని శ్రీనాథుఁడు సవినయముగు ప్రత్యుత్తర మిచ్చెను అంతట నవాబు శ్రీనాథునిచేత నొక గులాబిపువ్వునుంచి, బంగరు పళ్లెరమున నుండిన వరహాలరాశి వాని కొసఁగబోయెను తాను సువర్ణము తాఁకననియు, తన కష్టమున కొక పన్నీరుపూవె చాలు ననియు నా యువకుఁడు రాజునకు విన్నవించెను! గొప్ప బహుమతి వలదనెడి యిట్టి వెడఁగు లెందైన నుందురాయని పలువు రాశ్చర్యమందిరి అర్ధంకిపీను వారు సత్యకాలపువారని కొందఱును, బహుమతి చాలదని నవాబునకు నచ్చఁజెప్పుటకే ఈ గడుసరి యిట్లు చేసెనని మరికొందఱును అనుకొనిరి. అంతటితో సభ గలసెను.

వైద్యయువకుని యుద్దేశము నవాబున కేమియు బోధపడకుండెను ఆయన యొకటి నిర్ధారణ చేసికొనెను ఇంత ధైర్యముగ మెలఁగనేర్చినవాఁడు మిగుల యోగ్యుఁడైనను, ఆత్మ్యాశాపీడిత హృదయుఁడైనను గావలయును! ఫలాపేక్షా విరహితులగు వేదాంతులకు ధనకాంక్షా నిరోధ మెంతటిపని? ఒకవేళ నీతని మనసు అధిక ధన స్వీకారము నందె మగ్నమైన దనుకొన్నను, ఇంతటి మేలు చేసిన వైద్యుని కష్టము ప్రభువు లుంచుకొనుట న్యాయమా? కావున నిండుసభలోనికిఁగాక, ఈ మా అంతఃపురమునకు రప్పించి, రహస్యముగ నభిప్రాయము గనుఁగొని, వాని ఋణము దీర్చివైచి, తాను గృతకృత్యత నొందవలెనని నవాబు ఉద్దేశించెను

## 8

ప్రభునాజ్ఞ ననుసరించి శ్రీనాథుఁ డా మఱునాఁడు నగరున కేతెంచెను రాణి పానుపున కడ్డముగఁ దెరవేయఁబడియుండెను. నవాబు కాంచన వేదికపైఁ గూర్చుండి శ్రీనాథుఁడు తనకుఁ జేసిన సలాము అందుకొని, కురిచీలో నాతనిఁ గూర్చుండబెట్టెను

పొట్టకూటికి పాటుపడుచున్న ఉద్యోగి గౌరవము పొందుచుండ

ప్రజల జ్ఞానాభివృద్ధికి పాటుపడుచున్న జ్ఞానిని చూచువారు లేరు. [1930 ప్రమోదూత సంవత్సరాదిసంచికనుండి]

వెనుకటికంటె నెక్కువగ పసిఁడి నాణెములు పళ్లెరమునఁ దళుకొత్తుచుండెను అవుడె వికసించిన యొక పెద్ద గులాబిపూవు సువర్ణరాశిపై సొబగొందుచుండెను రాజ్ఞి రాజపుత్రికలు తెరవెనుక నాసీనలై యుండిరి అదెనుండి తెరలు తెరలుగ వీతెంచు పూల నెత్తావులును, కాంచన కంకణముల కలస్వనము ను ఆ సుందరు లీ సభా కార్యక్రమము నతి కౌతుకాయత విలోచనముల విలోకించుచుండిరని ప్రకటనము చేయుచుండెను!

ప్రథమమున ప్రభువు కొన్ని యుపోద్ఘాత వచనములు పలికెను శ్రీనాథుఁడు తన కుటుంబమున కొనర్చిన మహోపకార మాతఁ డుగ్గడించి, తన కృతజ్ఞతా సూచకమగు నీ చిన్ని కానుకను గైకొని తనను గౌరవింపుమని యా యువకుని వేఁడెను శ్రీనాథుఁడు వినయ పూర్వకమగు వినతు లొనర్చి తన హృదయము కాంచన రత్నములు దగిలియుండలేదనియు, దేవరకు సమ్మతమయ్యెనేని తన వలపుల కొలికియగు నొక పన్నీరు పూవె చాలునవియు విన్నవించెను! ఈచిన్ని కోరికకు రాజు, రాజ్ఞియు నద్భుతమందిరి. ఆశ్చర్యలగ్నమానసులుగానివారు వక్తయు, నాతని కలుముల రాణియగురాజకన్యయును

తురుష్క ప్రభువు ధీశాలి, ధీరోదాత్తుఁడు విప్రపుత్రకుని పలుకులకు ఆ మహనీయుని మనమున తొలకరి మెరుపువలె నిపుడొక యోజన మ్ఫురించెను! వైద్యుఁ డటనె కూర్చుండుమని చెప్పి, రాజు చట్టున తెరలోనికిఁబోయి రాణితోఁ గొంత ముచ్చటించి, పిమ్మట పుత్రికతో సంభాషించి, తెరవెలుపలకు వచ్చి, "యువకుఁడా! నీ బుద్ధికుశలత మేలైనదని యున్నె యెఱింగితిని ఇపుడు నీ ధైర్యము ప్రశంసనీయమని తేలినది మఱి యే కోరిన్ మోలనేని, నీసాహసమునకు నీ శిరసె సమాధాన మీయవలసి యుండెడిది! నా మనస్సునకు మాత్రము సత్యధర్మములె ముఖ్యములుగాని క్షణభంగురములగు జాత్యభిమానములు గావు నీ ప్రణయ చరితము నిక్కువమైనచో, ప్రేమసత్యములకు నెనగొమ్మయగు పరమాత్ముఁడు ని న్నాశీర్వదించుఁగాక! నీ కోరికను మరందెలిపెదవా?"

"దేవర వారికి నా యం దనుగ్రహమున్నచో, నాకు పన్నీరుపూవు ప్రసాదింపవలయును!" అని శ్రీనాథుని ప్రత్యుత్తరము

రాజు —"పన్నీరుపూవు మాకు ప్రియము, పవిత్రము నైనది! అద్దాని నీవు శయన గృహాలంకరణమునకేకాక, దేవతా మందిరమునఁ గూడ గౌరవించెదవా? లలిత కళా జన్మభూమియగు పారసీకోద్యానములందును, ఆధ్యాత్మిక విద్యా రహస్యములగు సూఫీ దేవాలయ ప్రాంగణములందును ప్రభవించిన ఈ పూవుఁ దీఁగె పవిత్ర వేద భూమియందు వర్ధిల్లఁగలదని అంటుగట్టుట కనువఁబడుచున్నది సుమా!"

వైదిక నిష్ఠాపరుఁడగు నా విప్రకుమారుని ప్రేమమున కిది క్లిష్టమగు సమస్య! ఐన దీని కాతఁ డొసఁగు సమాధానమును బట్టియె ఆతని ప్రేమమునకుఁ గల ధైర్య స్థైర్యములు తేటపడఁగలవు ఇవు డతఁడు అవంతయు గొంకక "మహాప్రభూ! సత్యసంధత యనుశ్రుతముగ నుండెడి భగవద్భక్తుల వంశ్యుఁడనేని, పన్నీరుపువ్వును తగినచొప్పున మన్నించి, ఎన్నఁటికిని వన్నెమాయని విధమునఁ గాపాడఁగలను!" అని ప్రత్యుత్తరమిచ్చెను

అంత నవాబు దిగ్గన లేచి, ఒరలో వ్రేలాడు కాంచన ఖడ్గము దీసి, "హృదయము గలిసిన చోటుల వదిలము లెందుకు?" అని పలికి, తెర నొక్కవ్రేటునఁ జీల్చి, "హృదయేశ్వరీ! మన ప్రాణసమానయగు పుత్రిక పన్నీరుపూవునకు తగినవరుఁ డీ వైద్యకుమారుఁడె సుమీ! దేవుఁడు ప్రీతితోఁ గలిపిన హృదయములు వేఱుచేయుటకు మనుష్యమాత్రులము మన మెవ్వరము? స్వాంతము సత్య ధర్మములందున్న సచ్ఛారిత్రులె స్వచ్ఛమగు ముసల్మానులు! బిస్మిల్లా! వీరి దాంపత్యముదైవ సమ్మతము!" అని వక్కాణించెను.

అంత నా యువతీ యువకులు రాజ్ఞీరాజులకు మ్రొక్కి, వారి దీవనలతో గృహస్థాశ్రమ స్వీకారము చేసిరి!

## 9

కందుకూరుసీమలో పశ్చిమ దిగ్భాగమున కమలూరను గ్రామము గలదు. అందు క్రొత్తగ నొక బ్రాహ్మణ కుటుంబము వచ్చి కాపురముండెను. ఏ ప్రభువు ప్రాపకముననో వారికి గొప్ప భూవసతి ప్రాప్తించెను. గృహస్థుఁడు వైద్యశిఖామణి. గృహిణి అప్సరసవంటి శరీర సౌందర్యమున నొప్పునది దేశభాష బాగుగ రాకుండుటచేతనో, మరి యే కారణముననో ఆగర్భ శ్రీమంతురాలగు నా యిల్లా లెప్పుడు నిల్లు విడిచియుండునది కాదు ఐనను, రూప గుణాధిక్యమున నా కోమలి దేవతా విగ్రహమె! పూల మొలకలు పెంచుటయం దాసుంధరి కెంతయు నాసక్తి ఆ పడఁతిపేరు పన్నీరు పువ్వు వారి సంతతివారు పన్నీరుపూలవంటి శరీర సౌందర్యమున నొప్పుచు, భక్తినిరతత్వమునకును, లలితకళలం దభిరుచికిని వాసికెక్కియున్నారు

## 10

కమలూరు గ్రామమందును, చుట్టుప్రక్కల నైదారు గ్రామములందును ఇప్పటికిని "శ్రీనాథము" అను నింటిపేరుగల గొప్ప భూస్వాము లున్నారు ఇచటఁ దప్ప దేశమం దెచటను శ్రీనాథమువారు లేరు మొట్టమొదట కొన్ని యనుమానముల చేత ఆ వంశికులను తక్కిన బ్రాహ్మణ సంఘమువారు, కొంత తక్కువగఁ జూచిరట గాని, శ్రీనాథమువారి కిపు డట్టి బాధలు లేవు సోముఁడు వారి యిష్టదేవత స్త్రీపురుషులు లలాటమందలి బొట్టుమీఁద చాలచంద్రరేఖ నలంకరించుకొందురు వింతయగు నొక చాంద్రాయణవ్రతము వారు జరుపుచుందురు. మహమ్మదీయులయెడ వీరు అత్యంత సోదరభావము గలిగియున్నారు ఈ వంశమున పలువురు కవిత్వ ధోరణికిని, లలిత కళాభిరతికిని ప్రసిద్ధి కెక్కియున్నారు సమధికవిమ్మకును, శరీర సౌందర్యమునకును శ్రీనాథమువారు పేరుపడియున్నారు!

(ఈ యైతిహ్యమునందలి ముఖ్యాంశములు స్పెయిను దేశీయుఁడగు జోసెఫ్ మేబిగ్ అను హిందూదేశ చరిత్ర పరిశోధకుని దినచర్య పుస్తకమునుండి గ్రహింపఁబడినవి.)

# కల్పసూత్రములు

శ్రీ వై. కోటీశ్వర దీక్షితులుగారు

[1931 ప్రజోత్పత్తి సంవత్సరాదిసంచికనుండి]

'కల్ప్యతే—సమర్థ్యతే యాగ ప్రయోగో అనేనేతి కల్పః' అను వ్యుత్పత్తిచేత కల్పశబ్దము నిష్పన్న మగుచున్నది 'శిక్షా వ్యాకరణ ఛందః' ఇత్యాది వేదాంగము లారింటిలో కల్పసూత్రము ఆఱవ వేదాంగముగా నున్నది అట్టి వేదాంగమగు కల్పసూత్ర జాతమునుగూర్చి యొకింత వ్రాయుచున్నాము.

ద్విజాతు లందఱు తాము నిత్యము చేయుచున్న మతాచార విధులందు తా మే వేదమునకు, సూత్రమునకు, గోత్రమునకు చేరియున్నారో, ఆ గోత్రమునకు మూల పురుషు లెవ్వరో ఈ విషయమును సంస్మరించుచునేయున్నారు — "చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్య శ్శుభం భవతు కాశ్యప, ఆవత్సార, నైధ్రువ, త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపసగోత్రః, యజుర్వేదీ, తైత్తిరీయ శాఖాధ్యాయీ, ఆపస్తంబసూత్రః, నారాయణ శర్మా అహం భోః అభివాదయే" అని చెప్పుచుందురు గోత్ర ప్రవర శాఖా సూత్రనామము లను తమకు సంబంధించినవి చెప్పుకొందురు కనుక తమ తమ గోత్ర శాఖా సూత్రము లను గూర్చి తెలిసికొనుట ద్విజులందఱకు అత్యావశ్యకమని వేఱుగ జెప్పనక్కఱలేదు

భరతఖండమునందుగల ద్విజాతులందఱు ఋగ్యజుస్సామాథర్వములను నాలుగు వేదములకు సంబంధించియున్నారు అనగా ద్విజాతులని చెప్పబడువా రందఱు పై నాల్గు వేదములలో ఏదో ఒక్క వేదమును లోకమునందు ఆదిలో పఠన పాఠనములతో ప్రచార మొనర్చిన మహర్షి యొక్క వంశమునకు సంబంధించినవారని భావము. ఇచట వంశమను పది మాతా పితృ సంబంధముగ్గా కూడ నుండవచ్చును అపారమయిన విద్యాసముద్ర మును ఒక్క పురుషు డవగాహన మొనర్చుట యశక్యమను విషయము నెఱింగిన మహర్షులు అపారమయిన వైదిక విజ్ఞానమంతయు లోకమునందు పఠన పాఠ ములతో వ్యాప్తి చెందవలయునను సదూహతో కొందఱను ఋగ్వేదాధ్యాయులుగను, కొందఱను యజుర్వేదాధ్యాయులుగను, కొందఱను సామవేదాధ్యాయులుగను, కొందఱను అథర్వ వేదాధ్యాయులుగను ఆదియందు నిర్ణయించి ఆ యా వేదమును చదువవలసినవారి సంతతికి చేరినవారలు ఆదియందు తాము చదువవలసిన వేదమును పూర్తిగ పఠించిన తరువాతనే ఇతర వేదములు పఠింపవలయుననియు, తమ వేదమును పఠింపక ఇతర వేదముల పఠించిన యెడల ఆతడు శాఖారండుడు అని పిలువబడి సర్వ ధర్మ కర్మల యందు బహిష్కృతుడగునని కఠినముగ శాసించిరి ఇట్టి కఠిన శాసనము వల్లనే అర్థికముగ ఇహలోకమున లాభము లేకపోయినను అవికలముగ పఠనపాఠనము లందు దేశభేదముగాని, భాషాభేదముగాని లేక భరతఖండము నందంతట నాల్గు వేదములకు వ్యాప్తి నేటివఱకు గనంబడుచున్నది

ఒక్కొక్కశాఖకు సాధారణముగ ఒక్కొక కల్పసూత్రము ఏర్పడియున్నటుల తోచుచున్నది ఈ కల్పసూత్రములందు స్మార్తవిభాగము, శ్రౌతవిభాగము, ధర్మవిభాగము అని మూడు విభాగము లున్నటుల తెలియవచ్చుచున్నది. స్మార్తవిభాగమునకు గృహ్యసూత్రమనియు, శ్రౌతవిభాగమునకు శ్రౌతసూత్రమనియు, ధర్మ విభాగమునకు ధర్మసూత్రమనియు వ్యవహారము విశేషించియున్నది వివాహమయిన పిదప పత్నీ సహితు డయిన గృహస్థుడు ఔపాస నాది క్రియలను కొన్నిటిని వివాహాగ్నియం దవశ్యము చేసి తీరవలయును గృహ్యసూత్రమునందు చెప్పిన క్రియలలో కొన్ని ప్రతిదినము చేయ వలసినవియు, కొన్ని అమావాస్యాదికములగు ఆ యా తిథులందు చేయవలసినవియు గలవు గృహ్యసూత్ర విహితములగు క్రియలన్నియు ఒక్క గృహ్యాగ్నియందే చేయ దగినవి కనుక ఆ యగ్నియందు చేయదగిన వైదిక విధులం దుపయోగింపఁబడుచున్న మంత్ర సమూహమునకు 'ఏకాగ్నికాండ' యను సార్థక నామము సుప్రసిద్ధము.

ఋగ్వేదమునకు 21 శాఖలును, యజుర్వేదమునకు 101 శాఖలును, సామ వేదమునకు 1000 శాఖలును, అథర్వవేదమునకు 9 శాఖలును గలవని వ్యాకరణ మహా భాష్యమున పతంజలి వ్రాసియున్నాడు ఆ ప్రకార మిప్పుడు ఆ యా వేదములయొక్క శాఖలన్నియు ప్రచారమునందు లేవు ప్రచారమునందుగల శాఖలకు సంబంధించినంత వఱకు కల్పసూత్రములను గూర్చి యిచ్చట వివరించుచున్నారము

## 1. ఋగ్వేదకల్పసూత్రములు : 1. ఆశ్వలాయన కల్పసూత్రము

ఋగ్వేదమునకు చేరిన ఆశ్వలాయన సూత్రము ననుసరించుచున్న బ్రాహ్మణులు పంచగౌడులలోను పంచ ద్రావిడులలోను అధిక సంఖ్యాకులు గలరు ఆంధ్ర బ్రాహ్మణులలో వెలనాడు, వేగినాడు, తెలగాణ్యము మున్నగు అంతర్విభాగములందున్నూ ఋగ్వేదమునకు చేరిన ఆశ్వలాయన సూత్రము ననుసరించువార లున్నారు ఆంధ్ర బ్రాహ్మణులలో కంణకమ్మలు, నందవరీకులు అను తెగలవారు కేవలము ఆశ్వలాయన సూత్రమునకు సంబంధించినవారే ఈ కల్పసూత్రముయొక్క గృహ్య శ్రౌత విభాగములు మాత్రము నాగరాక్షరములందు వ్యాఖ్యాన సహితముగ ముద్రితములయి యున్నవి ఆశ్వలాయన ధర్మసూత్రము మాత్రము లభించుటలేదు ఉన్నటుల గూడ ప్రాచీన నిబంధన గ్రంథములం దెటను స్మరింపబడియుండలేదు

ఆశ్వలాయన గృహ్యసూత్రమునకు హరదత్తాచార్యకృతమగు 'అనావిల' యను వ్యాఖ్యయు, గార్గ్యనారాయణకృతమగు వృత్తియు, శ్రౌత సూత్రమునకు నారాయణ కృత వృత్తియు నాగరాక్షరములందు ముద్రితము లయియున్నవి ఇదిగాక ఈ గృహ్య సూత్రమునకు జయంతస్వామి, ఆనందరాయవాజపేయి, దేవస్వామి, విష్ణుగూఢస్వామి మున్నగువారిచేత వ్రాయబడిన వ్యాఖ్యాన గ్రంథములు గలవు కుమారిలస్వామి, రఘు నాథదీక్షితులు, గోపాలసుధి మున్నగువా రొనర్చిన గృహ్య సూత్రకారికలు, తిరుమలయజ్వ నరసింహాభట్టు మున్నగువారిచేత సంకలితములయిన ప్రయోగ గ్రంథములు అనేకములు గలవు 'లఘు ఆశ్వలాయనస్మృతి' అను పేరుతో శ్లోక రూపముగనున్న ధర్మ శాస్త్ర గ్రంథమొకటి ఆనందాశ్రమ గ్రంథమాలికయందు ప్రకటితమయియున్నది ఇది గాక దాదాపు 2000 శ్లోకములుగల 'ఆశ్వలాయన స్మృతి' యను వ్రాతకాపి బొంబాయి యూనివర్సిటీ లైబ్రరిలో గలదని తెలియవచ్చుచున్నది

## 2. శాంఖ్యాయనగృహ్యసూత్రము 2. (కౌషీతకీ గృహ్యసూత్రము)

ఈ పేరుతో ఒక గృహ్యసూత్ర గ్రంథము, శ్రౌతసూత్ర గ్రంథము ముద్రిత మయి యున్నది ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణులు ఆంధ్ర ద్రావిడ దేశము లందుగల బ్రాహ్మణ శాఖలందు గనంబడుటలేదు మలయాళ బ్రాహ్మణులందున్నూ, ఉత్తరహిందూస్థానమునందున్నూ గలరని తెలియవచ్చుచున్నది ఈ సూత్రమునకే కౌషీతకీ గృహ్యసూత్రమనియు నామాంతరము గలదు శ్రౌతసూత్రమునకు సాంఖ్యాయన శ్రౌత సూత్రమనియే ప్రసిద్ధిగాని కౌషీతకీ శ్రౌతసూత్రమను ప్రసిద్ధిలేదు ఈ గృహ్య సూత్రమునకు బ్రహ్మదత్తకృతభాష్యము, దయాశంకర రఘునాథ రామచంద్రాదుల చేత రచింపబడిన వ్యాఖ్యలు, కృష్ణజీ ద్వివేదికృత గృహ్యసూత్రపద్ధతి మున్నగు గ్రంథ ములు గలవు ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణు లత్యల్పసంఖ్య గలవారగుటచేత కాబోలు, ఈ గృహ్యసూత్రమునకు సంబంధించిన వ్యాఖ్యానాది గ్రంథములలో నొక్క టియు ముద్రితము కాలేదు ఆనర్తకృత శాంఖ్యాయన శ్రౌత సూత్ర వ్యాఖ్యమాత్రము ఏషియాటిక్కు సొసైటీవారిచేత ముద్రితమయియున్నది ఋగ్వేద కల్పసూత్రములు సమాప్తము

## 2. యజుర్వేద కల్పసూత్రములు

యజుర్వేదము కృష్ణమనియు, శుక్లమనియు ద్వివిధముగా గలదు అందు కృష్ణ యజుర్వేద కల్పసూత్రములను గుఱించి ప్రథమమున వ్రాయుచున్నాడను కృష్ణ యజు ర్వేదశాఖలలో తైత్తిరీయశాఖ, మైత్రాయణీయశాఖ, చరకశాఖ అను మూడు శాఖలు, తత్సూత్రములు మాత్రమే వ్యవహారమునం దున్నటుల తెలియవచ్చుచుండుటచేత ఆ శాఖ లకు సంబంధించిన కల్పసూత్రములను క్రమముగ పేర్కొనుచున్నాడను.

### 2. అ. తైత్తిరీయ శాఖా కల్పసూత్రములు :

### 3. ఆపస్తంబ కల్పసూత్రము—1.

ఈ యాపస్తంబ కల్పసూత్రము తైత్తిరీయశాఖకు సంబంధించిన అరు సూత్ర ములలో నొకటి ఈకల్పసూత్రముయొక్క గృహ్య శ్రౌత ధర్మ విభాగములు మూడున్నూ సభాష్యములుగ ముద్రితములయి లభించుచున్నవి భరతఖండమునం దన్నివైపుల నీ సూత్రము ననుసరించు బ్రాహ్మణులు గలరు ఆంధ్ర ద్రావిడ బ్రాహ్మణులలో అత్య ధిక సంఖ్యాకులు ఆపస్తంబ సూత్రము ననుసరించుచున్నారు ఆపస్తంబ సూత్రమునకు కపర్ది కృతభాష్యము, హరదత్త, రుద్రదత్త, ధూర్తస్వామి, గోపాలయజ్వ మున్నగువార లొనర్చిన వ్యాఖ్యలు, కపర్ది, సుదర్శనాచార్యుడు మున్నగువార లొనర్చిన కారికలు, ఇంకా


కొత్త నటుడు కె.వి.నాగేశ్వరరావును,
కొత్త తరహా భూమికలో గీతాంజలిని
పరిచయం చేస్తున్న


ప్రసాద్
ప్రొడక్షన్స్ వారి
అద్భుత రస భరితమైన చిత్రం
ఇల్లాలు
(కలర్ & బ్లాక్ అండ్ వైట్)
దర్శకత్వం: A సంజీవరావు
సంగీతం: K.V. మహదేవన్
రచన. ముళ్లపూడి
దర్శక పర్యవేక్షణ
L.V. ప్రసాద్
పూర్ణా రిలీజ్


STUDIO
PRASAD

భట్టు, బప్పనభట్టు మున్నగువారలు సంకలిత మొనర్చిన ప్రయోగ గ్రంథములు అత్యధిక సంఖ్యాకలవి లభించుచున్నవి గృహ్య ధర్మసూత్రములు ఆంధ్ర, ద్రావిడ, నాగరాక్షరములందు కూడ ముద్రితములయియున్నవి శ్రౌతసూత్రము పృథ్వగ చాల రోజుల క్రిందట నాగరాక్షరములందే ముద్రితమయియుండెను గాని ఇప్పుడా గ్రంథము లభింపదు ఈ గృహ్యసూత్రమునకు విద్యారణ్య కృతవ్యాఖ్య కూడ యొకటి యున్నట్లు తెలియవచ్చుచున్నదిగాని ఆ గ్రంథ మింతవఱకు నాకు లభింపలేదు

## 4. సత్యాషాఢ హిరణ్యకేశీయ కల్పసూత్రములు—2

ఈసూత్రము తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నొకటి. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు ఆంధ్రులలో లేరు ద్రావిడ కేరళ బ్రాహ్మణులలో నీసూత్రము ననుసరించు బ్రాహ్మణులు గలరు ద్రావిడబ్రాహ్మణులలో నీసూత్రము ననుసరించు బ్రాహ్మణులకు "కేశియర్లు" అని వ్యవహారము గలదు ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులలో పలువురు పునహానగరమునను, తత్సమీప మహారాష్ట్రదేశమునందును గలరు వారిలో అధికసంఖ్యాకులు మహారాష్ట్రులు సవ్యాఖ్యానముగ ఈ సూత్రమునకు సంబంధించిన గృహ్య ధర్మ శ్రౌతవిభాగములు పూనాలో ఆనందాశ్రమ గ్రంథమాలాధిపతుల చేత ఇప్పుడే ముద్రితములయి యున్నవి ఈ ధర్మసూత్రమునందు గల గ్రంథమంతయు అచ్చటచ్చట కొంచెము భేదముతో ఆపస్తంబసూత్రమునకు నకలుగా సరిపోవుచున్నది ఈసూత్రమునందు వివాహయోగ్యయగు కన్యక "నగ్నిక"గా ఉండవలయునని చెప్పబడినది మహాదేవుడు, వాంఛేశ్వరుడు, గోపీనాథభట్టు, మాతృదత్తుడు మున్నగు వారలు చేసిన కల్పసూత్రవ్యాఖ్యలు కొంతకొంతవఱకు అచ్చటచ్చట లభించుచున్నవి ఒక్కరే చేసిన సమగ్రకల్పసూత్ర వ్యాఖ్యానము లభింపనందువలన ఆయాభాగములకు లభించినంతవఱకు చేర్చి సమగ్రముగ వ్యాఖ్యా సహితముగ నీకల్పసూత్ర గ్రంథము నాగరాక్షరములందు ముద్రింపబడినది

## 4. బోధాయన కల్పసూత్రము—3

ఈసూత్రముకూడ తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నొకటియే గృహ్యధర్మ శ్రౌతవిభాగములు మూడున్నూ లభించుచున్నవి ద్రావిడులలోను, కర్ణాటకులలోను ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు గలరు ఆంధ్రదేశమునందు ఆదిశైవులనియు, శివద్విజులనియు అచ్చటచ్చట గనంబడుచున్న బ్రాహ్మణశాఖా బ్రాహ్మణులలో పలువురు తా మీసూత్రమునకు చెందినవార మని చెప్పుకొనుచున్నారు ఆంధ్రదేశమునందుగల ఇతర బ్రాహ్మణశాఖలలో నీసూత్రము ననుసరించువారు గనంబడుట లేదు సర్వవేదవ్యాఖ్యాతలును, మహర్షికల్పులును అగు శ్రీమత్సాయణమాధవాచార్యులు ఈ బోధాయనసూత్రీయు లగు బ్రాహ్మణులే ఈ కల్పసూత్ర గ్రంథము ఇతర కల్పసూత్రగ్రంథములకంటె చాలపెద్దదిగ తోచుచున్నది నాగరాక్షరములందు మైసూరు గవర్నమెంటువారు గృహ్యధర్మవిభాగములను మూలమాత్రమే ప్రకటించియున్నారు శ్రౌతసూత్రము ఏషియాటిక్ సొసైటీవారిచేత ముద్రింపబడుచున్నది గోవిందస్వామి, అష్టావక్ర, శిష్టి మున్నగువా రొనర్చిన సూత్రవ్యాఖ్యలు, కేశవస్వామి, కనకసభాపతి మున్నగువార లొనర్చిన గృహ్యకారికలు, ప్రయోగపద్ధతులు మున్నగునవి కలవుకాని అవి యన్నియు అముద్రితములు ఆపస్తంబ, హిరణ్యకేశీయ గృహ్యసూత్రములందు చెప్పిన విషయములకంటె అధికవిషయము లీసూత్రమునందు చెప్పబడియున్నవి 'అనుక్తమన్యతో గ్రాహ్యం' అను అభ్యనుజ్ఞ ననుసరించి ఆపస్తంబాదిసూత్రముల ననుసరించు బ్రాహ్మణులు తమసూత్రములందు చెప్పబడని స్మార్తకర్మల విషయమును బోధాయన సూత్రమునందు చెప్పబడిన వాని నాచరించుచున్నారు ఉపనయనమునందు నాల్గవ నాడు చేయునట్టి పాలాశకర్మయున్నూ, వివాహమునందు అయిదవ నాడు చేయునట్టి 'నాకబలి' కర్మయున్నూ బోధాయనసూత్రమునకు సంబంధించినవియే ఇట్లే అంకురార్పణము, మహాన్యాసాభిషేకము, వృత్తికాస్నానవిధి మున్నగునవికూడ బోధాయనసూత్ర ప్రతిపాదితములే యని వైదికులు తలంచుచున్నారు బోధాయనధర్మశాస్త్ర మను పేర శ్లోకబద్ధమయిన ధర్మశాస్త్రగ్రంథముకూడ ఒక్కటి లభించుచున్నది

## 6. భారద్వాజ కల్పసూత్రము—4

ఈసూత్రముకూడ తైత్తిరీయశాఖకు చేరినదే ఈ సూత్రముయొక్క గృహ్య విభాగము మూలమమాత్రము ముద్రితమయియున్నది శ్రౌతవిభాగము ముద్రితము కాలేదు దాదాపు 15 ప్రశ్నలవఱకు అచ్చటచ్చట లైబ్రరీలలో శ్రౌతసూత్రము లభించునటుల తెలియవచ్చుచున్నది ధర్మసూత్రము మాత్రము ఇంతవఱకు లభించలేదు ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు ద్రావిడబ్రాహ్మణులం దొకటి రెండుచోట్ల అల్పసంఖ్యాకు లున్నటుల తెలియవచ్చుచున్నది ఈసూత్రమునకు కపర్దిస్వామి, భాస్కరుడు, హరిహరుడు భాష్యముల నొనర్చినట్లున్నూ, భట్టరంగు డనువాడు ప్రయోగవృత్తి రచించినట్లున్నూ తెలియవచ్చుచున్నది ఇదిగాక 'భారద్వాజస్మృతి' యను పేరుగల ఒక శ్లోకబద్ధమగు ధర్మశాస్త్రగ్రంథముకూడ గలదని తెలియవచ్చుచున్నది

## 7. వైఖానస కల్పసూత్రము—5

ఈ సూత్రముకూడ తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నొకటియే గృహ్యధర్మ శ్రౌతవిభాగములు మూడున్నూ లభించుచున్నవి గృహ్యధర్మవిభాగములు మాత్రము ముద్రితములు శ్రౌతసూత్రము అముద్రితము ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణులను వైఖానసవైష్ణవులని యందురు ఆంధ్రద్రావిడ కర్ణాటక



పరిశోధక మహాశయుడు

[1931 ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికనుండి]




పట్టణములలో మోటారు ప్రమాదములు లేకుండుటకు కొన్ని సూచనలు

[1931 ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికనుండి]

**Each for All. All for Each.**

ఫోన్ : 1045 గ్రాము "CONCOPS"

# గుంటూరు పట్టణ వినిమయదారుల సహకార కేంద్ర స్టోర్సు లిమిటెడ్. I. No. 2113

(*Sponsored by* Govt of India)



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**గౌ॥ కాసు బ్రహ్మానందరెడ్డి గారిచే 19-10-63 న ప్రారంభించబడినది.**

ప్రజాసేవయే లక్ష్యముగా గలిగి, నిత్యావసర వస్తువులను సరసమైన ధరలకు విక్రయించుచు ప్రజల అభిమానమును చూరగొన్న ఏకైక సంస్థ.

: బ్రాంచీలు :

1. బ్రాడీపేట (3 వ లైను) 2 అగ్రహారం (రామనామ క్షేత్రము ఎదురు) 3. అరండల్ పేట (5 వ లైను, 3 వ అడ్డరోడ్డు) 4 చౌత్రా (సంగడి గుంట) 5 చిన్నబజారు (పాత బస్సు స్టాండు వద్ద) 6 పోత్తూరి వారి తోట 7. పాత గుంటూరు 8. సహకార వస్త్ర విక్రయ శాల (బ్రాడీపేట 4 వ లైను) 9. జూట్ మిల్లు (వర్కర్సు కాలనీలో) 10. ఐ యల్. టి. డి. బ్రాంచి (కన్నావారి తోట) 11. ఉప్పుబజారు (తెనాలి) 12 గాంధీ నగర్ బ్రాంచి (తెనాలి) 13 కొత్తపేట (తెనాలి) 14 వింజనంపాడు (గుంటూరు తాలూకా) 15. అంకిరెడ్డి పాలెం (గుంటూరు తాలూకా) 16. అనంతవరప్పాడు (గుంటూరు తాలూకా) 17. స్తంబాలగరువు 18. యడ్లపల్లి (తెనాలి తాలూకా) 19. పలివేరు (తెనాలి తాలూకా) 20. మండూరు (తెనాలి తాలూకా)

హెడ్ ఆఫీసు : 2 వ లైను, బ్రాడీపేట, గుంటూరు-2.

సి. వి. రమణయ్య
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

తమ్మా రంగారెడ్డి
ప్రెసిడెంటు

దేశములందే ఈసూత్రము ననుసరించువారు గలరు మహారాష్ట్రలందుగాని, ఇతర దేశములందుగాని ఈసూత్రము ననుసరించు బ్రహ్మణులు లేరు స్మార్త బ్రాహ్మణులలో గాని మధ్వబ్రాహ్మణులలోగాని యీసూత్రము ననుసరించువారు ఆంధ్రద్రావిడ కర్ణాటకటక బ్రాహ్మణులలో కూడ లేరు ఈ కల్పసూత్రమునకు నృసింహకృత ప్రయోగదర్పణ గ్రంధము గలదు శ్రీనివాసదీక్షితీయవ్యాఖ్యానము కూడ లభించుచున్నది. ఈ వైఖాసస గృహ్యసూత్రమునందు ఇతర సూత్రములకువలె సూత్రాంతర సహాయ మక్కరలేదనియు, సకలవిషయములను తమ సూత్రకారుడే చెప్పియున్నాడనియు, ఇతర సూత్రములకంటె ఇదియే ఈసూత్రమునందుగల విశేషము అనియు తత్సూత్రానుసారులు సగౌరవముగ చెప్పుకొందరు ఈ గృహ్యసూత్రమునకు సంబంధించిన మంత్రము లన్నియు "వైఖానసమంత్రప్రశ్నాష్టకము" అను పేరుతో ఆంధ్రాక్షరములతో ముద్రితమయి యున్నది ఈ గృహ్యసూత్రమునందు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, గాంధర్వ, రాక్షస, ఆసుర, పైశాచములను అష్టవిధ వివాహలక్షణములు చెప్పబడినవి వీనిలో బ్రాహ్మణునకు దానపూర్వకములగు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యవివాహములే శస్త్రములనియు, గాంధర్వ, రాక్షస, పైశాచ, ఆసురములను నాలుగు వివాహములు నింద్యములు కావున తగవనియు చెప్పబడియున్నది బ్రహ్మక్షత్రియవైశ్యజాతులవారు నగ్నికయగు కన్యనుగాని, గౌరియగు కన్యనుగాని పెండ్లాడవలయు ననియు నగ్నికయనగా 8, 9, 10 సం॥ వయస్సుగల పిల్లయనియు, గౌరియనగా 10 మొదలుకొని 12 సం॥ లోపల వయస్సుకలిగి ఋతుమతికాని పిల్లయనియు నిర్ణయింపబడినది ప్రథమ ఋతుస్నానము చేసినవెంటనే మొట్టమొదట భర్తను సందర్శించవలయునని, ఈగృహ్యసూత్రమునందు ప్రతిపాదింపబడియున్నది ఈ కల్పసూత్రమునకు శ్రీనివాసదీక్షితీయ వ్యాఖ్యయు, నృసింహవాజపేయికృతమగు దర్పణమను వ్యాఖ్యయు గలవు

## 8. వాధూల కల్పసూత్రము—6.

ఇదియు తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రమే. ఈ సూత్రము యొక్క గృహ్యశ్రౌతవిభాగము లిప్పుడే లభించినవి. కాని ఆప్రాతప్రతి నానాగందరగోళముగా నున్నది ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు కేరళదేశమునం దేమూలనో ఒకరిద్దఱు గలరట దాదాపు బోధాయనసూత్రముతో చాలవిషయములం దీ సూత్రము పోలియుండునట ప్రత్యంతరము లభించలేదు "వాధూలస్మృతి" యను శ్లోకబద్ధ ధర్మశాస్త్రగ్రంధముకూడ ఒక్కటి లభించుచున్నది ఈ యాఱును తైత్తిరీయ శాఖాసూత్రవ ులు.

## 2. ఆ. మైత్రాయణీయ శాఖాసూత్రములు

## 9. మానవ కల్పసూత్రము—1

మైత్రాయణీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నిది యొకటి ఈ కల్పసూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు మాత్ర మిపుడు లభించుచున్నవి. ధర్మవిభాగముకూడ ఉండియుండవలయుననియు, ఇప్పుడు శ్లోకరూపమున మనకు లభించుచున్న మనుస్మృతికి ఆమానధర్మసూత్రము మూలముగా నుండియుండుననియు కొందఱు విద్వాంసులు తలంచుచున్నారు. ఈ మైత్రాయణశాఖా సంహిత ముద్రితమయి యున్నది అష్టావక్రవ్యాఖ్యా సహితముగ మానవగృహ్యసూత్రము బరోడాయందు ముద్రితమయి యున్నది శ్రౌతసూత్రము కూడ మూలముమాత్రము ముద్రితమయి యున్నది ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు బొంబాయి రాజధానిలో నాసికయందున్నూ గుజరాతుదేశమునందున్ను గలరు ఈ గృహ్యసూత్రమునందు "నగ్నిక" యగుకన్య వివాహయోగ్యమని చెప్పబడియున్నది ఈమైత్రాయణీ సంహిత ముద్రితమయి లభించుచున్నది

## 10 వారాహ కల్పసూత్రములు—2.

ఇదియు మైత్రాయణీయశాఖకు సంబంధించిన కల్పసూత్రమే గృహ్యవిభాగము మాత్రమే ముద్రితమయియున్నది శ్రౌతవిభాగము కూడ లభించునటుల తోచెడివి ధర్మసూత్రవిభాగము మాత్రము లభించునటుల తోచదు ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు ఆంధ్ర ద్రావిడకర్ణాటాదిదేశమునం దెచ్చటను కనబడుటలేదు బహుశః ఘూర్జరదేశమునం దుండవచ్చునని ఊహింపబడుచున్నది ఈ గృహ్యసూత్రమునందు వివాహయోగ్యయగు కన్యక "అనగ్నిక"గా నుండవలయునని చెప్పబడినది ఈ రెండు మైత్రాయణీయ శాఖాసూత్రములు

## 2. ఇ. చరకశాఖా సూత్రములు 11. కరక కల్ప సూత్రము—1.

ఇది చరకాధ్వర్యుద్వాదశశాఖలలో నొకటియగు కారకశాఖకు సంబంధించిన కల్పసూత్రము దీనినే లోగాక్షిసూత్ర మనియు వచింతురు ఈ కల్పసూత్రముయొక్క గృహ్యవిభాగము సవ్యాఖ్యగ దయానందగ్రంథమాలికయందు లాహోరులో ముద్రితమయి యున్నది శ్రౌతవిభాగము లభించవచ్చునని తోచుచున్నది. కాని యింతవరకు లభించలేదు ధర్మసూత్రవిభాగ మున్నది లేనిది తెలియవచ్చుటలేదు ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు కాశ్మీరమునం దున్నారట ఆంధ్రద్రవిడకర్ణాటదేశములం దెచ్చటను గనంబడుటలేదు. ఈసూత్రమునకు దేవపాలుడు, ఆదిత్యదర్శనుడు, బ్రాహ్మణబలుడు అనువార లొనర్చిన వ్యాఖ్యానములు, గంగాధరుడు సంకలన మొనర్చిన కాఠకాహ్నికము, కారకగృహ్యపంచిక, కారకగృహ్యపరిశిష్టము మున్నగు గ్రంథములు గలవు ఈ కారకగృహ్యసూత్రము లోగాక్షికృతమనియే తెలియవచ్చుచున్నది విబంధనగ్రంథములం దచ్చటచ్చట లోగాక్షి










కవి [1931 ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికనుండి]







మన దినచర్య [illegible] [1931 ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికనుండి]













అవసరము లేని ఆర్భాటము [ఒక జర్మను చిత్రము ననుసరించి]
[1931 ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికనుండి]



పట్టణములలో దేహపరిశ్రమకు వీలులేదని విచారించవద్దు.
[1931 ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికనుండి]

స్మృతియను పేరుతో ఆశౌచసంస్కారాది విషయములందు శ్లోకరూపప్రమాణవచనములు గొన్ని లభించుచున్నవి ఈ కాఠకసంహిత నాగరాక్షరములందు ముద్రితమయి లభించుచున్నది. ఈ మూడుశాఖలు కృష్ణ యజుర్వేదమునకు సంబంధించినవి.

## 2. ఈ. శుక్ల యజుర్వేద కల్పసూత్రములు :

## 12. కాత్యాయన కల్పసూత్రము—1.

కాత్యాయన కల్పసూత్రము శుక్లయజుర్వేదశాఖకు సంబంధించినది. దీనికే కాతీయసూత్రమనియు, పారస్కరసూత్రమనియు నామాంతరములుకూడ గలవు శుక్ల యజుర్వేదశాఖయొక్క 15 శాఖలలో కాణ్వమాధ్యందినములను రెండుశాఖలు మాత్రము నేడు ప్రచారమునం దున్నవి ఈ శాఖాద్వయముయొక్క సంహితాబ్రాహ్మణ గ్రంథములు రెండున్నూ కాణ్వసంహితయనియు, కాణ్వశతపథబ్రాహ్మణమనియు, మాధ్యందిన సంహిత, మాధ్యందినశతపథబ్రాహ్మణమనియు వ్యవహారమునం దున్నవి ఈ కాణ్వ మాధ్యందినశాఖలు రెంటికిన్నీ కల్పసూత్రము మాత్రము కాత్యాయనసూత్రము ఒక్కటియే ఈసూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు ముద్రితములయి సర్వత్ర లభించుచున్నవి ధర్మసూత్రవిభాగము మాత్రము లభించుటలేదు ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు పంచగౌడులందున్నూ పంచద్రావిడులందున్నూ భరతఖండమునం దంతట గలరు ఆంధ్ర ద్రావిడదేశములం దీసూత్రము ననుసరించువారిని ప్రథమశాఖీయులనియు వ్యవహరింతురు ఈసూత్రమునకు కామదేవుడు, హరిహరుడు, కర్కుడు, భర్తృయజ్ఞుడు మున్నగువార లొనర్చిన వ్యాఖ్యానము లసంఖ్యాకములు గలవు అట్లే గృహ్యపద్ధతులు, పరిశిష్టములు, గృహ్యకారికలు మున్నగునవికూడ చాల గలవు కాత్యాయన స్మృతియనియు, వృద్ధకాత్యాయనస్మృతియనియు శ్లోకబద్ధధర్మశాస్త్ర గ్రంథములు లభించుచున్నవి యజుర్వేద కల్పసూత్రములు సమాప్తము

## 3. సామవేద కల్పసూత్రములు అ. రాణాయనీయశాఖ :

## 13 ద్రాహ్యాయణ కల్పసూత్రము-1.

సామవేదముయొక్క 1000 శాఖలలో ఇప్పుడు ప్రచారమునందు రాణాయనీయ, కౌథుమ, జైమిని అనుమూడు శాఖలు మాత్రమే కలవు ఈమూడు శాఖలలో రాణాయనీయశాఖకు సంబంధించినది ద్రాహ్యాయణకల్పసూత్రము ఈ సూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు లభించినవి ముద్రితములయి ప్రచారమునం దున్నవి ద్రాహ్యాయణగృహ్యసూత్రమునకు ఖాదిరగృహ్యసూత్రమనియు, గౌతమగృహ్యసూత్రమనియు నామాంతరము లున్నటులు తెలియవచ్చుచున్నది గౌతమపితృమేధసూత్రమని యొక గ్రంథము ముద్రితమయి యున్నది కాని ఆగ్రంథము నాకు లభించలేదు ముద్రితమయిన ద్రాహ్యాయణశ్రౌతము సమగ్రగ్రంథము కాదని తెలియవచ్చుచున్నది ఈ కల్పసూత్రము ననుసరించు బ్రాహ్మణులు భరతఖండమునం దంతట పంచద్రావిడులందును, పంచగౌడులందును గలరు ద్రాహ్యాయణధర్మసూత్రము లభించలేదు. గౌతమ ధర్మసూత్రమను పేర నొక ధర్మశాస్త్రము సూత్రబద్ధము ప్రచారమునం దున్నది హరదత్తాచార్యుడు, మస్కరియనువారు వ్యాఖ్యానము కూడ నొనర్చిరి. ఆంధ్రటీకాతాత్పర్య సమన్వితముగ మామిత్రులు కావ్యవ్యాకరణతీర్థ, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులవారు గౌతమ ధర్మసూత్రమును హరదత్తవ్యాఖ్యతో ఆంధ్రాక్షరములతో ముద్రించియున్నారు ఇది యీ కల్పసూత్రములు ననుసరించునని తోచుచున్నది రుద్రస్కందుడు, శ్రీనివాసుడు మున్నగువారు ద్రాహ్యాయణ గృహ్యసూత్రవ్యాఖ్యాతలు బాలాగ్నిహోత్రియను నాతడు గృహ్యకారికలను, వినతానందనుడను నాతడు గృహ్యసూత్రప్రయోగము నొనర్చిరి. ఆంధ్ర ద్రావిడదేశములం దీశాఖయే వ్యాప్తియందున్నది.

## ఆ. కౌథుమశాఖ. 14. గోభిలకల్పసూత్రము—1

గోభిలకల్పసూత్రము సామశాఖీయకౌథుమశాఖకు సంబంధించినది లాట్యాయన శ్రౌతసూత్రమను పేరనున్న సూత్రగ్రంథమున్నూ, గోభిలగృహ్యసూత్రమను పేరనున్న గ్రంథమున్నూ కౌథుమశాఖకు సంబంధించినవని చెప్పుచున్నారు ఈ విషయమయి ఇంకా విచారించవలసియున్నది ఈ సూత్రము ననుసరించువారు విశేషించి గుజరాతునందును, ఉత్తరహిందూస్థానమునందును గలరు ద్రావిడదేశమునందుకూడ అచ్చటచ్చట కొందఱు గలరని తెలియవచ్చుచున్నది భట్టనారాయణుడు, యశోధరుడు, మహేశచంద్రుడు మున్నగువారు సలువురీసూత్రమునకు వ్యాఖ్యాన మొనర్చిరి సాయణాచార్యులుకూడ యీ గృహ్యసూత్రమునకు వ్యాఖ్యానమొనర్చినటులు తెలియవచ్చుచున్నది గోభిలసంధ్యాసూత్రము, శ్రాద్ధసూత్రము మున్నగు సూత్రగ్రంథములుకూడ గలవు గృహ్యకారికలు, గృహ్యపద్ధతులు, గృహ్యప్రయోగములు మున్నగునవికూడ చాల గలవు. గోభిలస్మృతియను గ్రంథముకూడ గలదు ఈ గృహ్యసూత్రమునందు "నగ్నిక" యను కన్యకను వివాహమాడుట శ్రేష్ఠమని చెప్పబడియున్నది ఈ సూత్రము సవ్యాఖ్యగ ముద్రితమయి యున్నది

## ఇ. జైమినిశాఖ: 15. జైమినీయ కల్పసూత్రము—1

ఇది సామవేదజైమినీయశాఖకు సంబంధించిన కల్పసూత్రము. ఈ సూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు మాత్రము లభించుచున్నవి ఈ సూత్రము ననుసరించువారు ద్రావిడ కర్ణాటక కేరళ బ్రాహ్మణులందు అత్యల్పసంఖ్యాకు లచ్చటచ్చట గనంబడుచున్నారు శ్రీనివాసకృత వ్యాఖ్యతోడ ఈ గృహ్యసూత్రము ముద్రితమయియున్నది

# కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్‌వల్ల ఆరోగ్యము కలుగును

ఫోస్‌ఫోమిన్‌లో విటమిన్ బి కాంప్లెక్స్ మరియు అనేక గ్లయిసరో ఫాస్ఫేట్‌లు గలవు...అవి మీ కుటుంబమును దారుఢ్యముగా, సరదాగా, ఆరోగ్యముగా నుంచును. ఇంట్లో ఫోస్‌ఫోమిన్‌తో, అలసట, ఆయాసము ఇంక ఎంతమాత్రమూ వుండవు ఫోస్‌ఫోమిన్ శక్తి నిచ్చును. ఆకలిని అధికము చేయును. వహనశక్తిని పెంపొందించును. మరియు శరీరముయొక్క నిరోధక శక్తిని ఎక్కువ చేయును. కుటుంబములో అంతా ఫోస్‌ఫోమిన్‌తో ఆరోగ్యమును పొందుదురు — అది ఆకుపచ్చ పండు రుచిగల విటమిన్ టానిక్.




SQUIBB A century of experience builds faith SARABHAI CHEMICALS

Shilpi SC 43A Tel

శ్రౌతసూత్రమునందున్న 'కౌంతభాష్య' మాత్రమే ముద్రితమయియున్నది ఈ జైమిని యసామశాఖాసంహిత, బ్రాహ్మణ, ఉపనిషద్భాగములుకూడ రోమను లిపిలో విదేశములందు ముద్రితములయియున్నవి ఉపనిషద్బ్రాహ్మణ మొకటిమాత్రము నాగరాక్షరములలో లాహోరు దయానందవైదిక గ్రంథమాలాధిపతులచేత ముద్రింపబడినది ఈ గృహ్యసూత్రమునందు వివాహయోగ్యయగు కన్యక 'నగ్నిక'గ ఉండవలయునని చెప్పబడి యున్నది సామసూత్రములు సమాప్తము

## 4. ఆథర్వణవేద కల్పసూత్రములు.

## 16. కౌశిక కల్పసూత్రము—1

అథర్వణవేదముయొక్క తొమ్మిది శాఖలలో ఒక్క శౌనకశాఖమాత్రము ఇప్పుడు కనబడుచున్నది అథర్వణవేద మనునది కేవలము భూతోచ్చాటనమారణాది ప్రయోగములను మాత్రము తెలిపెడి మంత్రశాస్త్రమనియు, ఇతర వేదములవలె దాని ననుసరించి గృహ్యక్రియల నాచరించు బ్రాహ్మణులు లేరనియు, ఆవేదము ఇప్పుడు నామమాత్రశేషముగ నున్నదనియు తలంచువారలుకూడ మనలో కొందఱు గలరు అది వట్టిభ్రమ ఇతర వేదములవలెనే ఈ వేదమునుకూడ అనుసరించు బ్రాహ్మణులు కలరు ఏతద్వేదశాఖా సూత్రమునకు కౌశికసూత్రమనియు, బ్రాహ్మణమునకు గోపథ బ్రాహ్మణమనియు ప్రసిద్ధి ఈ వేదము ననుసరించు బ్రాహ్మణులు గుజరాతునందును, కాశ్మీరమునందును గలరు కాశీక్షేత్రమునందుకూడ నీయథర్వణశాఖీయ బ్రాహ్మణులను రెండుమూడు కుటుంబములవారిని చూచి యున్నాడను ఆంధ్రదేశమునందు లభించిన దానశాసనలేఖలలో అథర్వవేదీయులయిన బ్రాహ్మణులలో కొందఱకు దాన మొనర్చినటుల చదివినటుల జ్ఞాపక మున్నది కాని ఎచ్చట చూచినాడనో చక్కగా స్మరణమునకు రాలేదు బహుశః ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికయం దుండవచ్చునని ఊహించెదను సాయణభాష్యముతోడ అథర్వవేదమును సమగ్రముగ బొంబాయి గవర్నమెంటువారు ముద్రించియున్నారు దారిలకేశవాదిత్యకృత వ్యాఖ్యానముతోడ నీ కౌశికసూత్రము ముద్రితమయి యున్నది ఇతర కల్పసూత్రము లందున్న దర్శపూర్ణమాసాదివిధు లీ కల్పసూత్రమున విశేషించి లెవు గృహ్యకర్మలు, అభిచారికర్మలు, వృద్ధికర్మలు మున్నగునవియే ఇందు విశేషించిగలవు గృహ్య ప్రయోగకారికా గ్రంథాదులు కూడ గలవు కౌశికస్మృతియను పేర ధర్మశాస్త్రము కూడ ఒకటి గలదు.

వైతానసూత్ర మను పేరు గల ఆథర్వవేదీయసూత్రగ్రంథ మొకటి యున్నటులు తెలియవచ్చుచున్నది గాని ఆ గ్రంథము మాకు లభించలేదు

## కల్పసూత్రముల సామాన్య విచారము

వేదములు యజ్ఞయాగాదిసత్క్రియలను లోకమునందు ప్రచార మొనర్చుటకై ఏర్పడినవని భారతీయమహర్షుల యభిప్రాయము ఆవిషయమును చక్కగా నిరూపించుటకే యజ్ఞకల్పసూత్రము లేర్పడినవి అధ్వర్యుడు, హోత, ఉద్గాత, బ్రహ్మయను నలుగురు ఋత్విక్కులు యజ్ఞకార్యముల నిర్వహింతురు వీరిలో బ్రహ్మ అందరిని కనిపెట్టి చూచుచుండును అధ్వర్యు డొనర్పవలసిన క్రియాజాతము మాత్రమే ప్రధానముగ యజుర్వేదకల్పసూత్రములందు తెలుపబడియుండును హోతయను ఋత్విక్కు చేయవలసిన క్రియాజాతము మాత్రమే ఋగ్వేదీయ కల్పసూత్రములందు వివరింపబడియుండును ఉద్గాతయను ఋత్విక్కు చేయవలసిన సామగానాది క్రియాజాతము మాత్రమే సామవేదీయ కల్పసూత్రములందు వివరింపబడియుండును

యజుర్వేదీయ కల్పసూత్రముల గమనికను పరిశీలింపగా కల్పసూత్రములందు ప్రథమమున దర్శపూర్ణమాసేష్టులను శ్రౌతక్రియలతో కల్పసూత్రగ్రంథము ప్రారంభమయి హవిర్యజ్ఞములు, సోమసంస్థలు, అగ్నిచయనము, రాజసూయాశ్వమేధాది విశేష క్రతువులను చెప్పిన పిదప గృహ్యకర్మలను, ధర్మసూత్రములను చెప్పుట పరిపాటిగా నున్నది ఋక్సామవేదీయ కల్పసూత్రగ్రంథముల కీ సామాన్య లక్షణము సరిపోవుటలేదు సమగ్రగ్రంథభాగము లభింపకపోవుటచేత ఆ విషయమును గూర్చి 'ఇదమిత్థ' మని నిర్ణయింప శక్యముగాక యున్నది

బ్రాహ్మణులు తా మాచరించుచున్న శ్రౌతస్మార్తక్రియలం దవశ్యము పఠించుచున్న ప్రవరర్షి సంస్మరణమునుగూర్చి వివరము ఋగ్యజుర్వేద కల్పసూత్రములందన్నిటియందు 'ప్రవరాధ్యాయ' మనుపేర పఠింపబడియున్నది ఔద్గాత్రసూత్రములందు (అనగా సామవేద కల్పసూత్రములందు) కూడ గలదని తెలియవచ్చుచున్నది కాని సమగ్ర సామకల్పసూత్రగ్రంథములను సందర్శించు భాగ్యము లభించియుండ నందున ఇంతకంటె విశేషించి చెప్పజాలను.

## లభించని గృహ్యసూత్రములు

ప్రాచీనులగు వ్యాఖ్యాతలు తమ గ్రంథములం దుదాహరించినట్టియు, ఇప్పుడు గ్రంథరూపమున లభించనట్టియు కొన్ని గృహ్యసూత్రములు గలవు వాని నామములమాత్ర మిట నుదాహరించుచున్నాడను —

1 శాండిల్యగృహసూత్రము —ఈ గృహ్యసూత్రమును ఆపస్తంబ శ్రౌతసూత్ర వ్యాఖ్యాతయగు రుద్రదత్తుడు 9 11 21 సూత్రముల వ్యాఖ్యానమునం దుదాహరించియున్నాడు

2 శాట్యాయనకల్పసూత్రము —ఈ కల్పసూత్రము మహాదేవ కృత సత్యాషాఢ శ్రౌత సూత్ర వ్యాఖ్యయందున్నూ, 6 5 గోపీనాథ వ్యాఖ్య 10 10 యందున్నూ ఖాదిర గృహ్య వ్యాఖ్యయందున్నూ ప్రమాణముగ గైకొనబడినది స్మార్త ప్రాయశ్చిత్త విషయమై శాట్యాయన సూత్రమనుపేర స్మార్తానుక్రమణికయందు బాల వచనములు ప్రమాణములుగా నుదాహరింపబడియున్నవి ఇతర గ్రంథములందు కూడ శాట్యాయన కల్ప సూత్రము ప్రమాణముగ గైకొనబడినది

3 జాబాలి గృహ్యము —యజుర్వేదీయ శాఖలకు సంబంధించిన గృహ్య సూత్రముగా నుండవచ్చును మస్కరికృత గౌతమ ధర్మ సూత్ర వ్యాఖ్యయందు రెండు తావుల నీ గృహ్య సూత్ర వచనము లుదాహరింపబడినవి

4 పైంగిగృహ్యసూత్రము —పైంగి కల్పమను పేరు పాతంజల వ్యాకరణ మహాభాష్యము (పా సూ 4 2 66) నందు స్మరింపబడినది గౌతమధర్మ సూత్ర మస్కర భాష్యమునందు రెండు తావుల నీ గృహ్యసూత్రవాక్యము లుదాహరింపబడినవి

5 బైజావాపగృహ్యసూత్రము.—యాజ్ఞవల్క్య స్మృతి 1 275 శ్లోక అపరార్క వ్యాఖ్యయందు బైజావాప గృహ్య సూత్రమునుండి వినాయకశాంతికి సంబంధించిన ప్రమాణవచనము లుదాహరింపబడినవి కుమారిలభట్టు కూడ తంత్ర వార్తికమునందు 1—3—11 పూర్వ మీమాంసా సూత్రవ్యాఖ్యయం దీ గృహ్యమును స్మరించెను

6 అథర్వణ గృహ్యసూత్రము —14 అధ్యాయములు, 141 కండికలు కలిగి యున్నది ఈ గ్రంథమునందు అనధ్యాయతిథులను గూర్చి చెప్పబడియున్నది బొంబాయి యూనివర్సిటీ లైబ్రరీయందు వ్రాతకాపి యున్నటుల తెలియవచ్చుచున్నది నీలకంఠకృత నీతిమయూఖమునం దీ గృహ్య సూత్రమునుండి ప్రమాణ వచన ముదాహృతమయినది

7 శౌనక గృహ్యసూత్రము —యాజ్ఞ వల్క్యస్మృతి వ్యాఖ్యయందు విశ్వరూపుడున్నూ, అపరార్క వ్యాఖ్యయందున్నూ, హేమాద్రి కృత చతుర్వర్గ చింతామణి యందున్నూ ఈ గృహ్య సూత్రము స్మరింపబడినది ఈ గృహ్య పరిశిష్టము కూడ అపరార్కమునందు స్మరింపబడినది ఋగ్వేద శాఖలలో నిది యొక శాఖకు చేరిన సూత్రము కానోపును శౌనకోక్తబృహత్కారిక యనుపేర ఋగ్వేద సూక్తముల యొక్క వినియోగాదికమును తెలుపు 20 అధ్యాయముల గ్రంథము పూనా దక్కను కాలేజి లైబ్రరీయందు గలదు ఇండియాయందు ముద్రితమయిన ఋగ్వేద భాష్యమునందు కూడ ఆదియందు ఈ శౌనక కారికలు కొన్ని చేర్చబడియున్నవి

8 పరాశరగృహ్యసూత్రము —ఈ పేరుతో నొక గృహ్య సూత్ర మున్నటులు మానవ గృహ్య సూత్రోపోద్ఘాతమున గలదు బికనీరు పుస్తకసూచియందు 'పరాశర గృహ్యసూత్ర' మను పేర నొక గ్రంథనామముగనంబడుచున్నది తంత్ర వార్తికము

(పూర్వ మీమాంసా సూత్ర భాష్యమునకు కుమారిలకృత వ్యాఖ్యాన రూపగ్రంథము) నందు వేద శాఖా విభాగ నామములందు "పరాశర బ్రాహ్మణము" అను పేర గనంబడు మన్నది ఈ గృహ్యసూత్రము బహుశ ఆ పరాశరశాఖకు చేరినదయి యుండవలయును

9 శార్దూల గృహ్య సూత్రము —ఈ గృహ్యసూత్రము బహుశ సామవేదమునకు సంబంధించియుండునని తోచుచున్నది

10 శ్వేతాశ్వతర గృహ్యసూత్రము — శైవ ప్రచారిణీ పత్రికా సంపాదకులు తమ కడ "శ్వేతాశ్వతర" గృహ్య సూత్రమను గ్రంథము అసమగ్రముగ గలదని చెప్పిరి గాని నే నా గ్రంథమును స్వయముగా చూడలేదు

11 నిదాన సూత్రము —ఈ పేర సామవేదమునకు సంబంధించిన గ్రంథ మొకటి గలదు పుల్లసూత్రమని మరొక సూత్ర గ్రంథము కూడ లభించు చున్నది అయినను నీ రెండు సూత్ర గ్రంథములు గృహ్యసూత్రముగాని, శ్రౌతసూత్రవములుగాని కావని మా విశ్వాసము

యజుశ్శాఖలలో కపిష్ఠల కరసంహితయని యొక సంహితయు, అధర్వ శాఖలలో పిప్పలాదశాఖయని యొకటియు వ్రాతప్రతులు క్రొత్తగా లభించినటుల తోచుచున్నది అట్టి యపూర్వ గ్రంథము లందుబాటులో లేనందువలన వానినిగూర్చి వ్రాయుటకవకాశములేదు

వసిష్ఠ విష్ణు హారీత శంఖలిఖిత ధర్మసూత్రము లాదియందుండెననియు, ఇప్పుడు గనంబడుచున్న వసిష్ఠ విష్ణుహారీత శంఖ లిఖిత స్మృతిగ్రంథములు ఆ సూత్ర గ్రంథములయొక్క అవశిష్టాంశములనియు కొందరు తలంతురు ఈ పేరుగల కల్ప సూత్రములు కూడ ఉండియుండునని వారి యూహ

## ఉపసంహారము

కల్పసూత్రములను గురించి యిచట తెలిపిన అంశమంతయు ఆ యా దేశము అందు ప్రచారములోనున్న కల్ప సూత్ర గ్రంథములను లభించినంతవఱకు స్వయముగ చూచియు, తత్తచ్ఛాకీయ బ్రాహ్మణులను లభించినంతవఱకు విచారించియు వ్రాసి యున్నాడను వైద్య నాథీయ వరాశ్రమార కాండయందున్నూ, స్మృతి రత్నాకరమందున్నూ కల్ప సూత్రములను గుఱించి ఇట్లు చెప్పబడియున్నది —

"అగ్ని వైశ్య సూత్రే—వాక్యం —అథా త స్సూత్రగణాన్ వ్యాఖ్యాస్యామో, 1 బోధాయనం, 2 ఆపస్తంబం, 3 సత్యాషాఢం, 4 ద్రాహ్యాయణం, 5 ఆగస్త్యం, 6 శాండల్యం, 7 ఆశ్వలాయనం, 8 శాంభవీయం, 9 కాత్యాయన మితి నవాని పూర్వ సూత్రాణి.

1 వైఖానసీయం, 2 శౌనకీయం, 3 భారద్వాజం, 4 అగ్నివైశ్యం, 5 జైమినీయం, 6 వాధూలం, 7 మాధ్యందినం, 8 కౌండిన్యం, 9 కౌషీతక మితి నవాన్యపర సూత్రాణి

అష్టాదశ సంఖ్యాతా శ్శరీర సంస్కారా ఇతి "

అని గలదు ఇందుగల పూర్వ సూత్రములు, అపరసూత్రము లనుపదములకు గల వాస్తవార్థమేమో బోధపడుటలేదు ఈ 18 సూత్రములలో వ్యవహారమునందున్న యజుర్వేదీయములగు మానవ, వారాహ, కాటక సూత్రములున్నూ, అధర్వ వేదీయ కౌశికసూత్రములున్నూ ఏలకో పరిగ్రహింపబడలేదు తెలిసినంతవఱకు పరిన పారనాది ప్రచారములలో లేని అగస్త్య, శాండిల్య, శాంభవీయములను మూడు సూత్రములందున్నూ, శౌనక, అగ్నివైశ్య, మాధ్యందిన, కౌండిన్యములను నాలుగు సూత్రములు అపర సూత్రములందున్నూ చెప్పబడియున్నవి ప్రచారమునందున్న సూత్రములను వదలుటకును, ప్రచారమునందు లేని సూత్రములను పరిగ్రహించుటకును గల కారణము దురూహ్యముగ యున్నది కల్పసూత్రములకు సంబంధించిన గ్రంథములలో అధిక భాగము ముద్రితమే అయియుండలేదు ముద్రితములయిన గ్రంథములు కూడ విదేశములందు ముద్రింపబడియుండుటచేత సామాన్య జనులు భరించరానంత మూల్యముతోనున్నవి ప్రాచీనమగు వైదిక వాఙ్మయమును సంరక్షించుట యనగా మనయొక్క ప్రాచీన నాగరకతను కాపాడుకొనుటయే యగునని వేఱుగ జెప్పనక్కరలేదు పరిపాలకులు విదేశీయులగుటచేత వైదిక వాఙ్మయ వ్యాప్తికి యింతకంటె విశేషించి వారు ప్రోత్సాహము నొనర్పజాలరు మతాచార ధర్మ సంరక్షణమునకున్నూ, తద్ధర్మ బోధకున్నూ శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యుల వారిచే సంస్థాపింపబడిన జగద్గురు పీఠముల నలకరించుచున్న పీఠాధిపతులున్నూ శ్రీమంతులున్నూ అవకాశము ననుసరించి గ్రంథములను ప్రకటించుటయో, లేక చక్కగా సంస్కరించి, వ్రాయించి ప్రధాన నగరములందైనను గ్రంథ భాండాగారము లందు అందరకు పరిశీలనార్థము లభించునటుల సదుపాయమును చేయుటయో తమ యావశ్యక కృత్యముగా నెంచెదరుగాక! ఇట్టి జ్ఞాన యజ్ఞము యజ్ఞము లన్నింటికి మూలభూతమగుటచేత శ్రేష్ఠతమమనియు శ్రుతి స్మృతి ధర్మ పరిపాలకుడగు భగవానుడట్టి యుదారాశయమును జగద్గురు పీఠాధిపకార్య నిర్వాహకులకును, శ్రీమంతులకును కలుగజేసి వైదిక వాఙ్మయ మపేక్షించెడి అర్హు లెల్లరకు లభించునటుల చేయుదురుగాక యనియు పరమేశ్వరుని ప్రార్థించుచు విషయాంతరమునందు లేఖినిని నియోగించుచున్నాను

"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"



గోకుల్ ఆర్ట్ థియేటర్స్

# విశాల హృదయాలు

డైరెక్షన్
బి.యస్.నారాయణ

మ్యూజిక్
టి వి.రాజు

ప్రొడ్యూసర్
డి. కృష్ణమూర్తి




ఆంధ్ర: కృష్ణా పిక్చర్స్
సీడెడ్-నైజాం: ఈస్టిండియా

# వాసిరెడ్డీయము

## అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు, ఎం. ఏ.

**[1932 ఆంగీరస సంవత్సరాదిసంచికనుండి]**

వాసిరెడ్డీయము మనునది రెండాశ్వాసములుగల ఒక అముద్రిత గ్రంథము. దీనిని రచించిన అమరవాది రామకవి గుంటూరు మండలవాసి సత్తెనపల్లి తాలూకాలోని బాలే మల్లు అగ్రహార మీయన జన్మస్థలము సుమారు 78 సంవత్సరములు జీవించి, కాళయుక్తి సం. కార్తిక బహుళ షష్ఠినాడు (1918 సం) దివంగతుఁడైనాడు

ఈ రామకవి రచించిన గ్రంథములలో ముఖ్యమైనవి ద్రౌపదీ పరిణయము, వాసిరెడ్డీయము, కార్తిక పురాణము అను గ్రంథములు వీనిలో మొదటిదగు ద్రౌపదీ పరిణయము ఎనిమిదాశ్వాసముల ప్రబంధము. భారతములోని ద్రౌపదీ స్వయంవర కథను విస్తరించి ప్రబంధ రూపముగా రచించినాఁడు ఆధునికులచేఁ గృతములగు ఉత్తమ కావ్యములలో నిది యొక ముఖ్యమయినది. ఈ రామకవి మిక్కిలి ప్రౌఢకవి కవితాధార ధారాళమయి, మనోజ్ఞముగా నున్నది. శైలి గంభీరమై కవియొక్క కల్పనా చాతుర్యమున కెంతయు ననుకూలముగ నున్నది. గ్రంథములోఁ జాలభాగము నారికేళ పాకమే ఈ ద్రౌపదీ పరిణయ ప్రబంధము కృష్ణాతీరస్థమయిన ముక్త్యాలపురమునం దవతరించియున్న శ్రీ ముక్తీశస్వామి కంకితము చేయఁబడినది తత్పురాధిపతియైన శ్రీ రాజా వాసిరెడ్డి భవానీ ముక్తీశ్వర ప్రసాదనాయఁడు బహద్దర్ మన్నెసుల్తాను జమీన్‌దారు ఈ కృతిని భరించినాఁడు గ్రంథకర్త గ్రంథాదియందుఁ గృతిభర్తృ వంశమయిన వాసిరెడ్డివారి చరిత్రయంతయుఁ జక్కఁగ వర్ణించియున్నాఁడు

ఈ వర్ణనతోఁ దృప్తినొందక, తమ వంశ చరిత్రమంతయు ప్రత్యేక గ్రంథముగ రచింపుమని, పై రాజావారి వంశీయులలో నొకరగు వాసిరెడ్డి వేంకటలక్ష్మీ నరసింహనాయఁ డనువారు కోరుటచే వాసిరెడ్డీయ మను నీ గ్రంథమును రామకవి రచించియున్నాఁడు. ఈ సంగతినే కవి యిట్లు వివరించుచున్నాఁడు

"వను, మత్పూర్వ బుధార్జితా గణిత మాన్య క్షేత్ర భవ్యాగ్ర
రనిరాయాస సమగ్రజీవను, సుధీంద్ర శ్లాఘ్యమాన ప్రవ
ర్తను, నచ్చామరవాది రామయను, మేధా దక్షిణామూర్తి సాం
ద్రదయావానుగ్రహభా క్కవిత్వ మహిమున్, రప్పించి తా నిట్లనున్.

"కృత వేదాధ్యయనుండు, సూనృత వచఃకీర్ణుండు, నన్న ప్రదా
త తమోహారుఁ, డయాచకుండు, గిరిశ ధ్యానావధానుండు, వి
శ్రుత శిష్టాగ్రణి యౌ భవద్గురుఁ డహో! సోమేశ్వరాభిఖ్య దీ
క్షితవర్యుండు, తదాత్మజుండవగు నీ శీలంబు సామాన్యమే!"

"ఘనవాక్ప్రౌఢిమ, ద్రౌపదీ పరిణయ గ్రంథాది, మావంశవ
ర్ణనముం జేసితివంచు వింటి, మతియున్ మా ప్రాజ్య రాజ్యంబు, హా
ణనరేంద్రుల్ గయికొంట, దానికగు నానాకారణంబుల్, రయం
బున నీ వొక్క ప్రబంధ మూర్యవరు లామోదింపఁ గావింపుమా!"

ఇట్లు కోరిన మీఁదట దా నీ ప్రబంధ రచన కంగీకరించితిననియును,

"వాసిరెడ్డి చరిత్రమై వఱలుకతన
వాసిరెడ్డీయ మనఁగ నాహ్వయ"

మొనర్చితి ననియును గవి తెలుపుచున్నాఁడు

వాసిరెడ్డివారి వంశావళినంతయును గవి వర్ణించిన రీతి నిట సంగ్రహించుచున్నాను. విష్ణు పాదోద్భవమయిన నాలవ జాతిలోఁ గతిపయ ప్రజ బుజ మార్గవర్తనులై యుండిరఁట. వారినిఁగాంచి, తగు పెద్దలు "మహాశుభ వైభవశాలి కమ్మా!" అని దీవించిరఁట. అంతటినుండి యది కమ్మజాతియై వర్ధిల్లెనట ఇట్లు తత్కులోత్పత్తి విధానమును జమత్కారముగఁ దెల్పి, ఆ కమ్మకులములో వాసిరెడ్డివా రెట్లు ప్రభవించిరో కవి తెలియఁజేయుచున్నాఁడు

రెడ్డిరాజులలో ముఖ్యుడగు అనవేమారెడ్డి సార్వభౌముఁడు రాజ్యమేలుచున్న కాలములోఁ బై కమ్మకులములో సదాశివనాయుఁడను నొక శూరవరేణ్యుఁ డుద్భవించి యుండెను. ఈతని శౌర్యాదులఁ గూర్చి విని, అనవేముఁ డాతనిఁ బిలిపించి, యోగ్యతను బరీక్షించి, కొంత సేన కధికారిగా నియమించెను అటుపిమ్మట నొకా నొక సమయమునఁ బశ్చిమ దేశాధిపతులు రెడ్డి ప్రభువులపైఁ దిరుగు బాటొర్చితా మీయ వలసియున్న కప్పము నెగవైచిరి అంత వారిపై అనవేముఁడు ధాడి వెడల, వా రొక రాయబారి ముఖమున నాతని కిట్లు కబురంపిరి "ఇంత సేన వ్యర్థముగా నొంప నేఁ? మొనగాని నొకరి నేర్పఱిచికొని, ద్వంద్వ యుద్ధముసేయ నాజ్ఞాపింతము. అప్పుడగు జయాపజయములు బట్టి మన గెల్పోటముల నిర్ణయింతము" ఇట్లు వర్తమాన మంపినపుడు, తన సేనయందుఁ దగిన శూరుని నొక్కనినైనను గాంచనేరమి, అనవేముఁ డేమియుఁ బాలుపోక దిక్కులు సూచుచుండ, సదాశివ నాయుఁడా పనికిఁ దా నంగీకరింతు ననెను

"అని వేవేగ సదాశివ ప్రభుఁడు ద్వంద్వయుద్ధ వ్యగ్రుఁడై
తనతో మార్కొనఁ బూనియున్న రిపుయోధశ్రేష్ఠుతో మోహరిం
చి, వితాంతాహవ మాచరించి, యతనిన్ సింహంబు మత్తద్విపం
బును బోలెం దునిమెన్ హితా హితులకున్ మోదంబుఁ ఖేదంబుగాన్"

ఇట్లు

"పెనఁకువ నోర్చి, శాత్రవుం బిట్టడిగాఁపుఁ జేసి, రాజరా
జనియెడి వాసి రెడ్డి కలరార్చుటఁ దా నం వాసిరెడ్డినాఁ
దనరె సదాశివ ప్రభుఁడు ధాత్రి క్రమంబున వాసిరెడ్డివా
రనఁగఁ దదీయ వంశభవు లందఱు విశ్రుతి కెక్కి రున్నతిన్"

ఈరీతి వైరుల హతమొనర్చి, తన పేరు ప్రఖ్యాతిగాఁ జాలుటచే, మిగుల సంతసించి, అనవేమ సార్వభౌముఁడు సదాశివనాయనికి దక్షిణదేశముం దొక కొంత భాగ మిచ్చి, 'రాజా' బిరుద మొసంగి గౌరవించెను ఇట్లా ప్రభువుచే సమున్నతుండై సదాశివనాయఁడు రాజ్యమేలుచుండ, నాతని పూర్వపు వైరులు ఒకానొక రాత్రి వాతని బంధుమిత్రయుతముగ సంహరించిరి దైవకృపవలన నెట్లెటో, ఒక బ్రాహ్మణ పురంధ్రి సాహాయ్యమున నా సదాశివ ప్రభుని పుత్రుఁడు, రెండేండ్ల ప్రాయముగల శ్రీగిరిమల్లికార్జున నాయకుఁడు వైరులచేఁ జిక్కక, నిజ మాతామహస్థానము జేరఁగల్గెను ఇతని సంతతియే క్రమేణ శాఖోపశాఖలుగా బయలుదేరి, వృద్ధినొంది జగము వినుతి కెక్కినది సదాశివ నాయనియందు గౌరవాదరములుగల ఆనాఁటి క్షుద్ర కర్ణాట దేశ పాలకులందఱు తమకు గప్పముకట్టు నేర్పాటుమీఁదఁ గొంత భూమిని శ్రీగిరి మల్లికార్జుననాయని సంతతివారికి 'మిరాశిదఖల్' పఱచిరి.

ఇట్లు వృద్ధిగాంచిన వాసిరెడ్డీయులలో వీరపనేఁడు సుప్రసిద్ధుఁడయ్యె తన సమానులగు వీరులు లే రనుకటు లితఁడు 'ముమ్మడి భాస్కరి' పేరిటి రాష్ట్రమును బరిపాలించెను ఇతనికి రాఘవయ్య, చౌదరి రామన్న, చంద్రమౌళి అను ముగ్గురు పుత్రులు గలిగిరి ఒకప్పు డీ ముగ్గురును గొంత దేశము సంపాదింపఁగోరి ఢిల్లీ పాదుషాతోయి చూచిరి

"కన, యప్పాదుషహాకు విభ్రమ చమత్కారంబులన్, హర్ష పూ
ర్తినిఁ గావించి, తదీశువల్ల నల నందిగ్రామ సీమోపవ
ర్తన సర్వంబునకున్ స్థిరంబగు జమీన్‌దారీ మిరాశీదఖల్
ఘనసమ్రాడ్వరుదాంకముల్ వడసి వేడ్కన్ వచ్చి, తత్సత్ప్రభుల్"

తమ స్వార్జితమయిన నందిగామ సీమయంతయు మూఁడు పంట్లుగా విభాగించుకొనిరి. పెదవాఁడైన రాఘవయ్యకు వాగల్లు వంటును, రెండవవానికి రాఘవాపురమును, తృతీయుఁడగు చంద్రమౌళికి చింతలపాటివంటును బాలువచ్చినవి.

చింతలపాటివంటున కధిపతియైన చంద్రమౌళి కృష్ణాతీరమున వెలసియున్న ముక్త్యాల రాజధానిగాఁగఁ గొంతకాలము రాజ్యము చేసెను పిమ్మట నాతని పుత్రుఁడు రాఘవయ్య రాజ్యమునకు వచ్చి పరిపాలించెను ఈయనకు రాజమౌళి అప్పన్నగారు అను పుత్రద్వయము గల్గెను పెద్దవాఁడైన రాజమౌళి పెద్దకాలము ప్రజారంజకముగ రాజ్యమేలి అమితదానపరుఁడై 'నిస్సీమ భూదాన చక్రవర్తి' అను బిరుదము గాంచెను వాఁడు ఈ రాజమౌళికి శ్రీ చంద్రమౌళియు, నాతనికి రామలింగ వీరన్న ప్రభువులు వారలును జనించిరి జ్యేష్ఠుఁడగు రామలింగశౌరి రాజ్యమేలుచుండ ప్రభువు సేనాధిపతియై, అన్నను గొలిచియుండె. ఇట్లు పాలించిన రామలింగ ప్రభువునకు ఏడుగురు, రాజమౌళి, లక్ష్మీపతి, రాఘవయ్య, చంద్రమౌళి, వేంకటాద్రి, ... అనువారలు పుత్రులైరి. వీరిలోఁ బెద్దవాఁడైన రాజమౌళి, యనంతరము ...

# ఆంధ్రులు - రాధ

సముద్రాల వేంకటరాఘవాచార్యులుగారు

[1933 శ్రీముఖనామ సంవత్సరాదిసంచికనుండి]

ఆంధ్రమున నేడొక క్రొత్తయుగము జరుగుచున్నది ఈ యుగ పరివర్తనమున నాంధ్ర సంప్రదాయము లన్నిటిలోను మార్పు రాక తప్పినదికాదు నూతన సన్నివేశమున గల్గిన ఆంధ్ర మానసిక సంస్కారము బాషతో గూడ దాని క్రొత్త పోకడలను జూపుచున్నది. శిల్పమున గూడ దాని వలుకుబడి చెల్లకపోలేదు ఆంధ్రులలో విప్పారుచున్న నూతన వికాసమునకు గల కారణము లన్నిటియందును వంగ భాషా శిల్పములు ప్రధానములు వానితో గూడ చైతన్య మతము తెలుగు నాటిలో కాలూన గలిగిన పిదప నాంధ్రుల మాధురీ వృత్తి వికసింప దొడగినది నేడాంధ్రమున నేయింట జూచినను వంగీయ చిత్రకళా నైపుణ్యము చేవలుదేరిన కృష్ణుని పటములు ఈ చిత్రశాల కంతటికిని మహారాణి రాధాదేవి అచటినుండి రాధాదేవి నికుంజ పుంజములలోనున్న కృష్ణుని దోడ్కొని యాంధ్ర యువక హృదయములలో ప్రవేశించినది అచ్చట జరుగుచున్న నూతన నృత్య విలాసమే నేడాంధ్ర లలితకళలలో గోచరించున్న నూతనజ్యోతిర్విలాసము సర్వతోమధురమగు నీరాధాతత్త్వమును ప్రాచీనాంధ్రు లెట్లు సంగ్రహించుకొనియుండిరి?

ఆంధ్రులకు రాముడు ప్రాణాధిక ప్రియుడు. 'శ్రీరామ' చుట్టనిది వారి కలము సాగదు 'సీతా రామ పరబ్రహ్మణే నమ' అననిది భిక్షకుడు జోలె తెరువడు చిలుకలకు భాషాభ్యాసము రామనామముతోనే మొదలగుచున్నది. సంతాపకరమగు విషయము విన్నపుడు 'రామ రామ' యనకుండ వా రూరకొనలేరు రాముని స్మరింపకుండ రాగము సాగదు ఆంధ్ర గాయక శిఖామణి, కర్ణాటక సంగీత సుధానిధియగు త్యాగరాయలు తన గీతము లన్నియు హృదయముతో రాముని కర్పించెను సుప్రసిద్ధాంధ్ర భక్తుడగు గోపన్న రామదాసై పోయెను వేయేల తుడుమునుండి దేవతార్చనవరకు తెలుగు జీవితమంతయు రామమయము రాముడు పూర్ణముగా నౌత్తరాహుడైనను కైకపుమూలమున దాక్షిణాత్యసంబంధము గలిగినది మరియు నా యవసరమున రాముడు దండకారణ్యమున–తెలుగు నాటి గుండెలలో పెక్కు సంవత్సరము లుండెను. అందువలన నాంధ్రులలో రామ తత్త్వము పూర్తిగా నిమిడిపోయినది అంతమాత్రమున కృష్ణుడు తెలుగువారి కపరిచితుడని చెప్పరాదు ఆంధ్రులు కృష్ణు నెరుంగుదురు. కాని వారి హృదయముల గరచిన వాడు గోకులద్వారకాకృష్ణుడే కాని రాధాకృష్ణుడు గాడని తలంచుటకు కారణములులేకపోలేదు

నన్నయకు పూర్వము పద్య రూపమగు తెలుగు వాఙ్మయము శాసనములో గన్పించుచున్నను మహాభారతాంధ్రీకరణమె గ్రంధరూపమున దొలుదొల్త కన్పించుచున్నది అంతవరకు తెలుగునాటిలో కావ్య రచనము ఒక రూపమును దాల్చియున్నట్లు లేదు అందువలన నప్పటికి విశేష ప్రచారములోనుండి జాతి మత ధర్మముల ప్రచారమున కుపయోగించు గ్రంథముల ననువదించుటతో నాంధ్ర వాఙ్మయము రూపు గొన్నది కావున నీ కాలమును పౌరాణిక యుగమని చెప్పవచ్చును నన్నయ మొదలు కొని అల్లసానివానివరకు గల కవు లెల్ల రా యుగమున పురాణేతి హాసములను దెలిగించిరి. రామకృష్ణ కథలేకాక యెన్నియో శైవ పురాణములు తెలిగింపబడినవి కలము బట్టగలిగిన కవియెల్ల యే పురాణమునో, ఇతిహాసమునో తెలిగింపక విడువలేదు ఇంత విచ్చల విడిగా నాయాంధ్రీకరణము కొనసాగినను రాధా చరిత్ర ప్రతిపాదకమగు బ్రహ్మవైవర్తముగాని, దేవీ భాగవతముగాని తెలిగింపబడలేదు. ఈ తెలిగింపబడిన యే గ్రంధమునందును రాధా కృష్ణ సంబంధము గానరాదు శృంగార రస పరమావధిని ముట్టిచూపిన శ్రీనాథాది కవులు గూడ రస స్వరూపులని చెప్పబడు నీ రాధా కృష్ణుల దెస జూడని కారణము తెలియరాదు విజయనగర సమ్రాట్టగు కృష్ణరాయల కాలమున నాంధ్ర కవితా పితామహుడు నూతన కావ్య ధోరణికి దారిచూపెను అప్పటినుండి తెలుగు వాఙ్మయమున నైతిక ప్రబోధము, మత రేఖలు సన్నగిలజొచ్చి లాలసత్వముతో గూడుకొన్న శృంగారము ప్రధానస్థానము నాక్రమించెను రాజు లట్టి కావ్యములను ప్రోత్సహించుటచే నానాడును, తరువాతను ప్రబంధములు కుప్పతెప్పలుగా వెలసినవి అపుడు పురాణములు కూడ యనువదింపబడినవి కాని వాని గౌరవము సడలిపోయినది అందువలన పురాణములలోని రామకృష్ణ కథలను సంగ్రహించి నూతన కల్పనలతో కావ్యములు రచించిరి ఈ కృష్ణరాయల కాలముననే రాధకు తెలుగు వాఙ్మయమున దొలుదొల్త స్థానము లభించినది చింతలపూడి యెల్లనార్యుడు 'రాధా మాధవ' [1] మను కావ్యమును రచించెను. కర్ణాటాధిపుడగు కృష్ణరాయని దాధా మాధవ కావ్యముచే మెప్పించి 'రాధామాధవ కవి' యని పేరు గాంచినట్లు తన కావ్యమున యెల్లనార్యుడు చెప్పికొనియున్నాడు కవితా రహస్యవేదియు, గవియు నైన కృష్ణరాయల దలయూపించిన ఈ కావ్యము పేరు గూడ నాంధ్రులు వినియున్నట్లు తోచదు ఇందలి యితివృత్తము "లక్ష్మీనారాయణులు వైకుంఠమునం దుండగా లక్ష్మికి రామావతారము స్మృతికి వచ్చినది ఆ దివ్య పుంగళ దేహునితో గలిసి, యామె మరల నొక సారి క్రీడింప గోరికపడి మగనితో చెప్పుటకు సిగ్గుపడి శివుని స్మరించినది అత డరుదెంచి కొన్ని పూర్వ వృత్తాంతములను దెలిపి ప్రసంగవశమున లక్ష్మియుబలాటమును దెలిపి జగన్మోహనమగు కృష్ణావతారమును ధరింపబోవు చున్నావు గనుక యా వేషమున లక్ష్మికి కోర్కి చెల్లింపుమని వెడలి పోయెను విష్ణు వీమాట నంగీకరించి సఖీసమేతముగా లక్ష్మిని గోకులమున నవతరింప గోరెను ఆమె యట్లే బృందావన సమీపమునం గల యొక పల్లెలో సహస్రగోపునకు బుత్రికయై జన్మించెను ఆమె పేరు రాధ సఖీ జనులవలన కృష్ణ సౌందర్యమును రాధయు, నారదుని వలన రాధా సౌందర్యమును కృష్ణుడును విని పాణిగ్రహణమున కభిలషించుచుండిరి రహస్యముగా దౌత్యములు సాగించిరి కాని రాధికకు స్వయంవరము చాటింపబడియెను అన్ని దేశములనుండి రాజు లరుదెంచిరి స్వయంవరములలో రాధ కృష్ణుని వరించెను కృష్ణుని రాజు లెదిరించి పరాజితులైరి రాధికా సోదరుడగు భద్రకుడు కూడా కృష్ణు నెదరించి ఓడిపోయెను కృష్ణుడు రాధికతో బృందావనమున కరుదెంచి వసంతోత్సవములు, జల విహారములు మొదలగు సమస్త క్రీడలతో యమునా పులినములను ధన్య మొనరించెను" ఈ కథనుబట్టియె యిది రుక్మిణీ కల్యాణాను కరణమని తలంపనగును దీనిలోని కవిత్వము రసవంతమై నాటి కవుల కవిత్వమునకెందును దీసిపోవుటలేదు ఇట్లుండియు దీని కేలనో ప్రచారము గలుగదయ్యెను ఈ సమయమునకు పాతిక సంవత్సరములు రమారమి మునుముందు గజపతుల యేలుబడిలో చైతన్యదేవుడు గౌడ దేశమునుండి బయలుదేరి గోదావరీ తీరమున కరుదెంచి తన భక్తి సుధ నట వెల్లువ గట్టించెను ఆ భక్తి వేణువు రాజధాని వరకు బ్రాకలే దను కొనుటకు వీలులేదు ప్రాకియుండుట చేతనేనూతనమగు నీ రాధా ప్రస్తావ మా కవి చంద్రుడు వాఙ్మయములోనికి దీసికొని రాదలంచెను కాని, చైతన్యరేఖ లద్దానిలో జొనుపుటకు వెనుకాడెనని తోచుచున్నది

విజయనగర రాజ్య పతనానంతరము తెలుగు వాఙ్మయలక్ష్మి తంజనగరమునకు బయనము కట్టినది తంజాపురాంధ్ర నాయకులు తెలుగు భాషా పోషణమునకు పూనిరి వీరు కృతికర్తలును, గృతిభర్తలును నై యాంధ్రభాష నభివృద్ధి జేసిరి ఈ ప్రభువుల సభలలోనె రాధా వాఙ్మయము తెలుగులో నించుక కాలూన గలిగినది రాధాశబ్దము తెలుగు నాటిలో శాశ్వతముగా నెలకొల్పిన గౌరవము వీరు చూరగొనిరి వీరి యాదరణమున రాధికాసాంత్వనము రచింపబడినది తెలుగు కోడెకాండ్ర కందరకును కలకండవంటిదైన ఈ గ్రంధమును కొత్తగ పరిచయము చేయనక్కర యుండదు తద్గ్రంథకర్త్రియగు ముద్దుపళని సుప్రసిద్ధురాలు ఆమె కవనము గూడ చాల ముద్దు గురియుచుండును. కాని ఈ గ్రంథ రచనమునం దామె యంతగా శ్రద్ధ వహించినట్లు గానరాదు ప్రాచీన సంస్కృత వాఙ్మయమునం దా పాత్ర యెట్లు పోషింపబడినది తెలిసికొనుట కామె ప్రయత్నింపలేదు సాధారణముగా నామె కాలమునాటికి లోకులు చెప్పుకొనుచున్న కొన్ని జనశ్రుతుల నాధారముగా నుంచికొని యామె ఈ కావ్యము రచింపబూనుకొనెను అది ప్రబంధమగుటచేత దానిలో తా నుపయోగించికొన్న పాత్ర నామములను గురించి విచారించు టామె కవసరములేక పోయెనేమో? ఇక నది శృంగార ప్రబంధమైనపుడు, తన పోషకుడగు రాజు కుల్లాసము కల్పించుట కట్టి కావ్యము వ్రాయుచున్నపుడు పాత్రౌచిత్య విచారణము మాత్ర మేల అవసరపడియుండును? ఈ కావ్య సృష్టిలో రాధాపాత్రకు సంఘటిల్లిన యధ పతనము ఇంతింత యని చెప్పరానిది. భావోన్నతి, కల్పనాశక్తి, రసస్ఫూర్తి యున్నంత మాత్రమున దానిని విచ్చల విడిగా నుపయోగించుట ఎవ్వరు నంగీకరింపరు సమస్త మానవాదర్శ పురుషుడును, భారతాచార్యుడును నగు శ్రీ కృష్ణునకు ప్రేమపాత్రురాలగు నాయిక చేయదగిన పనులుగా నందలి వర్ణనలు కన్పింపవనుటకంతె నిచట విస్తరింప నొల్లను. మొత్తముమీద నా కావ్య రచనమునాటి కాంధ్రుల కా పాత్రను గురించి అంతియే తెలియును. చైతన్యదేవు డాంధ్రమునుండి చిదంబరముగుండ మధురవరకు తన భక్తి సిద్ధాంతమును వెదజల్లుచు బోయినను దానియం దాంధ్రులకు విశ్వాస గౌరవము లుదయింపలేదని దీనివలన తెలియుచున్నది.

---

1. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందలి అముద్రిత ప్రతి.

దీనికి బిదప నాంధ్రములో ప్రచారముగల గ్రంధము రాధా మాధవ సంవాదము దీనిని వెలిదండ్ల వెంకటపతి రచించెను ఇతడు క్రీ॥ 1700 ప్రాంతముల నుండియుండు నని తలంపబడుచున్నది. ఈ కావ్యము 'ముద్దు పళని కావ్యమునకు మేలు బంతి' యట అది నిజమే కాదగియున్నది రాధికా సాంత్వనమును గన్పింపని కొన్ని నూతనాంశము లిందు గలవు పెండ్లిలేని రాధిక కితడు పెండ్లి చేసినాడు కాని లోకమునకువలె నాతవికిని వరుని పేరు తెలియదు సాంత్వనములోని యిళాకళ్యాణమున కిందు రాధా కృష్ణుల ప్రథమానురాగము వర్ణింపబడియున్నది శుక సందేశము రెండిటియందును గలదు శ్రీదామునకు బదులిం దుద్ధవుడు పేర్కొనబడినాడు రాధా కృష్ణ సంవాద ముభయులు కల్పించినను ముద్దుపళని కృష్ణుడు రాధికాపాదములపైబడి పాదాహతిని ధన్యుడైయుండ, పౌరుష మడ్డువచ్చినది కాబోలు, నితని కృష్ణుడు పాదదాసుడ ననిమాత్రము చెప్ప సాహసించినాడు సాంత్వనమునందలి రాధ బృందావనమునందె యుండిపోయెను గాని సంవాదములోని రాధ ద్వారకాపురి కేగి సవతులకు కయ్యమును గల్పించి తాను సవరించి రుక్మిణీ సమానత్వమును గ్రహింపగల్గినది ఇందులోని మరొక విశేషము -రాధ శ్రీకృష్ణుని బెండ్లియాడినది ఈ గ్రంధమునం దానాటికి రాధా కృష్ణ సంబంధమగు దురభిప్రాయముల బారద్రోలుటకు కవి చాల ప్రయత్నించెను వాని వరుసల యవసరము, పాతివ్రత్యము వీనియొక్క యుచ్చాటనము కొరకు గవి చూపించిన యుక్తివాదము, దృష్టాంతములు గమనించినచో నేటి కొందరు నవయువకుల సంస్కార దృష్టి కాతడే మార్గదర్శకుడైనట్లు తెలియగలదు ఈత డెన్ని గౌడ ప్రాణాయామములు చేసి, మసి బూసి మారేడుకాయ జేసినను తన కావ్య ప్రపంచమున రాధను పతివ్రతను, నీతిబద్ధయగు ప్రియురాలిని కావింప లేకపోయెను ఏమైనను ఇతడు రాధను కొంతవర కాదర్శప్రాయనుగా జేయుటకు ప్రయత్నించెను

తరువాత రాధామాధవ సమాగము,2 కన్పించుచున్నది దీనిని నిశ్శంక వెంకటపతి రచించెను ఇందలి కధానాయికయగు రాధ కూడ నందుని చెల్లెలే లేకలేక కలిగిన చిన్ని కుమారుని యశోద యింటిపనులలో సరిగా జూడదని నందుడు రాధను కృష్ణపోషణమునకు నియోగించెను ఆమెయు నతని నల్లారు ముద్దుగా బెంచి పెద్దవానిని చేసెను ఇంతలో రాధ బాగుగా వయసు వచ్చిన దవుటవలన తగిన బంధుపుత్రున కిచ్చి పెండ్లి చేసెను ఆమె కాపురమున కేగినది తరువాత క్రమ క్రమముగా గృష్ణుని వయసుతో గూడ రాధానురాగము పెరుగజొచ్చినది ఒకనాడు మనసు పట్టలేక కృష్ణు డొక ముదియవ్వను జీరి రాధకడకు బంపెను ఆమెయు లోకమునకు జంకు

2 అముద్రిత ప్రతి చెన్నపురి ప్రా లి పుస్తక భాండారము

చున్న రాధ, కందులకు తగిన కొన్ని ఐతిహ్యములు చెప్పి యొప్పించెను ఆడినమాట తప్పక రాధ యమునా తీరమున కరుదెంచి కృష్ణుని స్థిరానుగ్రహమునకు బాత్రురాలయ్యెను ఇదియును నైతికాదర్శమున బూర్వపు గ్రంథములకు దోడబుట్టువే కాని దీనిలో నొక విచిత్రమగు కథ కలదు—

శ్రోతలు "రాధ నేల శ్రీ కృష్ణు డిట్లు ప్రేమింపవలసి వచ్చె"నని కథకుని ప్రశ్నించిరి సూతు డిట్లు చెప్ప దొడంగెను? "సముద్ర మథన కాలమున జన్మించిన దివ్య పదార్థములను ఇంద్రోపేంద్రులు పంచుకొనిరి విష్ణువు కౌస్తుభమును, లక్ష్మిని రొమ్ము నెక్కించుకొనెను అపుడు వారితో బుట్టిన యచ్చర కన్నెలలో 'హరిహారిణి' యను నామెను విష్ణువు సేవకురాలినిగా గ్రహించెను తరువాత నొకనాడు వేసగిలో మందర సానువుల శృంగార క్రీడల దేలుచున్న లక్ష్మీ నారాయణులకు హరిహారిణి రాక యభ్యంతరమును గల్గించెను దీని కిందిర యోపలేక 'నీవు మగనాలవై భూమిం బుట్టు' మని శపించెను (అది యాకాలమున దేవతలకు విధించు నొక శిక్ష గాబోలు) ఆమెను ప్రార్థించి తన్మూలమున గృష్ణానుగ్రహమును బడయ వాలడు భూలోకమున నేను నంద నందనుడనై జనియింతును గావున నీవును జనింపుమనియు, నచట నా సేవ లభించుననియు నచ్చజెప్పినందున నామె నందుని చెల్లెలై పుట్టి యతని సేవించి యాతని యనుగ్రహమునకు పాత్రురాలయ్యెను "ఇదియే కృష్ణునికి రాధ మేనత్తయగుటకు కన్పించుచున్న గ్రంథాధారము దీని నెచట కవి సేకరించెనో తెలియరాదు పిదప పేర్కొనదగినది రాధా కృష్ణ విలాసము 3 ఇది కృష్ణదాసు కృష్ణదాసునిచే రచింపబడినది ఇది గీత గోవింద రసాలంకృతమని గద్యలో జెప్పబడియున్నది

దీనిలోని కథా సంగ్రహ మిది "కృష్ణుడు బృందావనము విడిచి ద్వారకలో గాపురము పెట్టెను మరల గోకులము మొగము చూడలేదు గోపిక లోపికలు లేక యుండిరి వారిలో పెద్ద భాగము రాధది చెలికత్తె నొకర్తును చేరబిలిచి తన యవస్థను చెప్పి కృష్ణుని దోడ్కొని రమ్మని ద్వారక కంపినది ఆమె సముద్రమును గూడ దాటి ద్వారక కేగి రుక్మిణీ సమేతుడై యున్న కృష్ణుని దర్శించెను శ్రీకృష్ణుడు గోకులములోని వారందరి క్షేమము నడిగెను. దూతిక క్రమముగా జెప్పుచు రాధను డడవి యామె కష్టములు వెళ్లబాడి రాధ పంపిన హార మొసంగెను కృష్ణుడది గ్రహించి రాధను మరువ లేదని, భౌతిక సౌఖ్య వాంఛల గుములజేయు నొక దీర్ఘ ధ్యాన మొనగి యేకాంతమున నీ కొక వృత్తాంతము జెప్పుదునని రుక్మిణి మందిరమున కంపెను రుక్మిణియు దూతిని వెంట దోడికొని మందిరమున కేగి సుఖాసీనం గావించి రాధా కృష్ణుల పూర్వ సంబంధము గూర్చి ప్రశ్నించెను ఆమె గీత గోవిందానుసారము వర్ణింపసాగెను" ఇంతటితో గ్రంథ మాగిపోయినది ఇందును 'పచ్చి శృంగారపు' తళుకులు లేకపోలేదు గ్రంథ మసమగ్రమవుటచే నేమియును చెప్ప వీలులేదు కాని యిప్పటికిని రాధా చరిత్రమును గురించిన సంస్కృత వాఙ్మయ వాసన లాంధ్రులకు చేరవచ్చినవని చెప్పవచ్చును

గోపీనాథుని వెంకటపతి తెనిగించిన శ్రీకృష్ణ జన్మఖండము రాధాచరిత్రమున నూతన యుగమును తెలుగు నాటిలో వెలయించినది అది బ్రహ్మ వైవర్తములోని యొక భాగమని చెప్పినచో చైతన్య దేవుని భక్తి సిద్ధాంతము నెడల నాంధ్రులకు గలిగిన గౌరవాదులు తెలిపినట్లే కాగలదు దానిలో నేటి రాధాతత్త్వపు బునాదులన్నియు బుంజీభవించియున్నవి ఇందలి రాధ మానవి గాదు; త్రిమూర్తుల కతీతురాలు; సర్వ సృష్టి సంచాలిని, సంహారిణి; ఆమె ముగురమ్మల మూలపుటమ్మ, ప్రకృతి స్వరూపిణి; శ్రీకృష్ణునకు గూడ ధ్యేయురాలు ఇటు లెంతయో గలదు ఈ తత్త్వమును విస్పష్టము గావించు కథ లెన్నియో దానిలో గలవు వాని నన్నింటి బేర్కొనుట కిచట దావు లేదు. కాని యొకసారి యధఃపతితయై నీచశృంగారరసాలంబయై యున్న రాధ దీనివలన శక్తి స్వరూపిణియు, మహాప్రకృతియు నైపోయినది దీనికి ములుగు పాపయారాధ్యుని దేవీభాగవతము వన్నె దెచ్చినది కాని యది యింకను ముద్రింపబడకపోవుటచేత ప్రచారములోనికి రాలేదు కింకవీంద్ర ఘంటాపంచానను' లీ కొరత లేకుండ దేవీభాగవతము దెలిగించి ముద్రింపించిరి దాసువారి దేవీభాగవతము గూడ ఇచట స్మరింపబడదగినది వీనివలన రాధా స్వరూపము పూర్వోక్త ప్రబంధ స్వరూపమునకన్న భిన్నమని యాంధ్రు లెరుగగలిగిరి ఈ యెరుకకు చిలకపాటి రామానుజశర్మగారి గోపీ కథా కౌముదియు, బ్రహ్మవైవర్త పురాణపు గద్యానువాదమును నుత్తేజము కలిగించినవి వెంకట పార్వతీశ్వర కవులయొక్కయు, సాహితీ సమితి సభ్యులయొక్కయు, మరి కొంద రధునాతన కవుల యొక్కయు ప్రేమ గీతములు, వంగ భాషానువాదములు విద్యాధికులలో నీ నూతన తత్త్వమున కొక రూప మొసంగ జాలినవి వీనియన్నిటి కంటెను జన సామాన్యమునందు రాధయొక్క ప్రాచీనానౌచిత్య క్షాళనమునకు మిక్కిలి తోడ్పడినది, పానుగంటివారి పరమార్థ రాధా కృష్ణ నాటకము ఈ క్రొత్త వింతలో నేడెన్నియో గ్రంథములు రాధా చరిత్రమునకు సంబంధించినవి ప్రచురింపబడుచున్నవి అవి యన్నియు నిచట పేర్కొన జాలనందులకు జింతిల్లుచున్నాను ఇంతవరకు ప్రాచీన కాలమున నాంధ్రులు రాధ నెరుంగరనియు, వా రెరుగగల్గిన రాధ ప్రబంధములలో గన్పించుచున్నదే యనియు కాలక్రమమున సంస్కృత వాఙ్మయ సాహాయ్యముతో రాధ యొక్క అధునాతనమూర్తి వారి లక్ష్యమునకు చేరువయ్యెననియు నది సంస్కృత వంగ భాషానువాదములచేతను, వంగీయ శిల్పమువలనను ఆంధ్ర వాఙ్మయ పరిష్కారముల యం దొక నూతనత్వమును వెలయించుచున్నదనియు తెల్పితిని. దీని యాథార్థ్యమును మరొక్కమారు విన్నవించెదను పాఠకోత్తమా, సెలవు

3. అముద్రితము చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము

కాబోయే వకీళ్లకు కొన్ని సూచనలు (నాయూహా ప్రపంచమున)
[1933 శ్రీముఖ సంవత్సరాదిసంచికనుండి]

కాబోయే గ్రంథకర్తలకు కొన్ని సూచనలు (నాయూహా ప్రపంచమున)
[1933 శ్రీముఖ సంవత్సరాదిసంచికనుండి]




అప్రమత్తులై వుండండి

●

రైల్వే లైన్లు జాగ్రత్తగా దాటండి

●

ఇది?

కాపలివారులేని

లెవల్ క్రాసింగ్

●

ఇండియాలో ఇలాంటివి

20,000 క్రాసింగులున్నాయి






రోడ్లనుపయోగించేవారి క్షేమాన్నికోరి, రైల్వే బోర్డుకు చెందిన భద్రతా శాఖచే ప్రకటించబడింది.



ఆంధ్రపత్రిక రజతోత్సవము                [1934 భావ సంవత్సరాదిసంచికనుండి]

# తెనుఁగు శైలి

**కవికొండల వేంకటరావు**

**[1934 భావ సంవత్సరాదిసంచికనుండి]**

పురాణములనుండి :

నన్నయ :

జగంబులు పుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గులేదు. నేను గర్మభూమిని జనియించి కర్మతంత్రుండనైతి.

తిక్కన :

ఈ రెండు దెఱంగులవారును బంచి కుడిచి సుఖంబున్న నఖిల భూప్రజకును బ్రమోదం బగుం గావున నట్లు సేసి యందఱచేత దీవనలు వడయవయ్య.

ఎఱ్ఱాప్రగడ :

నీ గౌరవంబంతయు నెఱింగి కాదె వహ్నిసమానుండైన ఈ మహామునిని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద.

ప్రబంధములనుండి :

మనుచరిత్ర:

అనిన నత్తెఱవ యక్కలికి పలుకుల కులికి గలగలం బఱవ గరకరిం జెలికి విలుకాడు పరగించు విరిదమ్మి గొంకతలు.

పారిజాతాపహరణము;

ఇవ్విధంబున నభీష్ట ఫలసిద్ధి సంతోషిత స్వాంతులును, నిఖిలలోకైక వంద్యాయమాన మహామహిమోదాత్తులు నై నిరంతర సౌఖ్య వర్ధిష్ణులగు నా సత్యాకృష్ణులను జూచు వేడుకం గ్రమ్మఱ నొక్కనాడు.

శృంగారనైషధము ;

ఇట్లంతర్హితుండై రాజమార్గంబున నిరర్గళ వేగంబునం జని యా రాజకుంజర ఘటాసుందరంబగు రాజమందిరంబు డాసి.

విజయవిలాసము :

ముముక్షుజన హృదయంగమంబగు త్రివేణి సంగమంబున దానంబులు గావించి, యచ్చట మాధవు నారాధించి, భవరసానుభవభీరుసాక్రోశంబగు పంచక్రోశంబు ప్రవేశించి.

ప్రభావతీప్రద్యుమ్నము ;

దానవేంద్రా, నీ వలికినట్లు మన మిరుదెగలవారము గశ్యపు సంతానం బగుటం జేసి మన యెల్లవివాదంబులు నతండ తీర్ప నర్హుండు.

పదములు, కీర్తనములు, కథలునుండి:

రామదాసుచరిత్ర:

ఓ భద్రాద్రీశ్వరా! నేను పూర్వజన్మంబున జేసిన కర్మశేషమో, లేక మీ కరుణకు పాత్రుండను గాననియో, ఈ దుర్మదులచే గొట్టించుటకు మనస్సు గలిగియో యివ్విధంబుగా నన్నుం జేయించుట తగునా యని స్తుతిచేయుచున్నాను.

మైరావణచరిత్ర ;

ఓ తల్లి, అనేకకోట్ల రాక్షసులు యుద్ధము గోరి వచ్చుచున్నారు. వారల నందరిని నీకు బలి యివ్వబోవుచున్నాను. ఈ రామ సౌమిత్రులను......

భారతసావిత్రి

విష్ణుభక్తిలేనివాడు శూద్రుం డన బరగు వాయెడ భక్తి గలిగిన చండాలునైన నవమానించుట బుద్ధిమంతులకు నుచితంబుగాదు

సర్వాయి పాపడు కథ :

పన్నెండుమంది నేస్తులాతో శకునమెళ్లి వస్తువుంటె చాకలి యెల్లి ఒక్కమైన చిక్కుతీసి కొప్పుబెట్టి శ్రీగంధపు చుక్కబెట్టి హంపలామొగ్గాల రవికె రీకుమీద తొడిగినాది కండ్లకు కాటిక వేసి పండ్లుకు దాసీనా వేసి బోర్ మెట్లు వేసుకోని బొమ్మంచు చీరెగట్టి పిల్లవాణ్ణి చంకపెట్టి కూటిబుట్ట యెత్తుకోని యెదురుగుండ తాను వచ్చి పెళ్లు పెళ్లున తుమ్ముతున్నాదీ ఆ యెల్లమ్మ

నేటి యొక నాటకము:

తరువాత వో ప్రభూ, మున్ను మూర్ఛిల్లిన మునిబాలుండు నిద్దురమండి లేచినట్లు లేవ నా సోదరు లిద్దరు నితాంత సంతోషక్రాంతస్వాంతులై

నేటి యొక నవల -

ఆ నలువురు నా నూతన పురుషునితో లోన ప్రవేశించి మందిర ద్వారంబులను మూసివైచిరి. లోన కేమి జరుగునో వినుట కామెకు కుతూహల ముదయించెను

## నేటి మరికొన్ని విధముల రచనలనుండి

ఉండసు పన్యాసములు

వేర్వేరు సంఘముల ప్రతినిధులతో సంప్రతించి అందరికిని సమ్మత మగునట్లుగా సాంఘిక సమస్యను పరిష్కరించు ఏర్పా టేదియు చేయలేక పోతినని ప్రకటించుట కెంతో విచారమును చిన్నదనమును కలుగుచున్నది

పల్లెటూరి కథలు -

కరణం సంకురాత్రి పండుగకు అల్లుణ్ణి తీసుకు రావడానికి వెళ్లాడు వడవ దగ్గిరకు రాలేదనే కోపంతో అల్లుడు పండగకు రానన్నాడు

చిత్రాంగి.

కాని మీరు పొడుంకాయితోటే సహజంగా పుట్టార్టగా?

ఏమమ్మా, మీ మామగారు వచ్చారు అందర్నీ యింట్లోకి రమ్మంటున్నారు మాకు రాణివి కాబోతున్నావు ఇదేం వేషం, ఆయనముందే?

నలభమపాకశాస్త్రము

అయిదుశేర్ల నీళ్లుపట్టే కళాయి పాత్రతో నాలుగుశేర్ల నీళ్లుపోసి పొయ్యిమీద కాచవలెను

## నేటి పత్రికలనుండి

ఆంధ్రభూమి.

బైబిలునందు ఒక కథ కలదు ఇసుకమీద నొకటియు, రాతిమీద నొకటియు రెండు ఇండ్లు కట్టబడినవి

గృహలక్ష్మి

దేశారాధకుల 'మనుకొనుచున్నవారు' లెస్సగ యోచించి ఈ మహోతరుణమందు దేశాభ్యుదయము అట్టి యమాయికుల యోగ క్షేమములపై నాధారపడియుండు ననుసత్యము

ఆంధ్రపత్రిక

వాయువిమానములనుండి బాంబులను విసరు పద్ధతి హిందూదేశమువందే గాక ఇంగ్లండులో గూడ ఏహ్యాం గలిగించె ననుటకు నందియము లేదు

కృష్ణాపత్రిక

బర్మా నిభజనము కన్నియు అమారగుచున్నవి. బర్మా ప్రజలు విభజనమున కంగీకరింతురో లేదో తెలియక పూర్వమే

## వాడుకనుండి

రైతుమాటలు

ఎందుకండి ఈ వానలు బుడంక్రలు కోసుకునేవాళ్లకి నష్టం కొన్ని కట్టేత మీదుంటాయి కొన్ని కోతకు సిద్ధంగా ఉంటాయి ఊడుపుచేలకు కొంచెం వయమను కోండి తాటాకు తెగులు పట్టిందంటారు దాని క్కాస్త మెరుగు కందిచేలు ఊటెక్కి చస్తాయి

ఒక ఇల్లాలు మాటలు,

చంటిపిల్లల పాట్లాటలు ఎందుకంటాం మనం—అవసరం మాలిప పుల్లలకు అగ్గిపెట్ల గుల్లలకు అవి యెంతో పనిముట్లు అవి వాళ్లకు

ఒక కూలివాని మాటలు.

పొద్దున్నే అబద్ధ మాడుకుంటే నాకేం వస్తుంది? పని చేసేవోణ్ణి నే వబద్ద మాడుకుంటానా?







[1934 భావ సంవత్సరాదిసంచికనుండి]







అలవాటు—2

[1934 భావ సంవత్సరాది సంచికనుండి]




(ప్రబంధసుందరి—సాదృశ్యమే నిజమె నచో. (బాలకవుల కుపయోగ పడుటకు చిత్రము) [1934 భావ సంవత్సరాదిసంచికనుండి]

క్రాపింగుల గ్యాలరీ—(కొన్ని సూచనలు)




[1934 భావ సంవత్సరాదిసంచికనుండి]

ఏ ప్రకారముగా యథాలాపముగఁ జదివిన పుస్తకమునుండి, చూచిన పత్రిక నుండి, విన్నమనిషినుండి మనము భాషను సేకరించి గమనించి చూచితిమా, ఎంతమంది తెనుఁగుభాషను వ్రాయుచున్నారో, ఎంతమంది వాడుచున్నారో అన్ని విధముల తెను గున్నట్లగపించు—తెనుఁగు జాతికిఁ జెందినవా రెవరోయి యన్న 'నేను నేను' అని కొన్ని కోట్లమంది మారువలుకునట్లు

కాని తెనుఁగుజాతిని గుఱించి తెలిసికొనవలయునన్న మూఁడుకోట్లమంది తెనుఁగు వారిని వరుసగ నిలువఁబెట్టి వారి ముఖవర్చస్సు గమనించుచున్నామా? గమనింపఁగలమా? తెనుఁగు జాతియని యనుకొనుటలో నేవో కొన్ని లక్షణములు హృదయావలంబనము గొనుచున్నవి ఆ లక్షణము లున్న జనుల నందఱిని తెనుఁగు వారినిగ గుర్తించుచున్నాము. అలాగుననే తెనుఁగు శైలిని గుఱించి తెలిసికొనుటలన్నను మనకు తెనుఁగువా రందఱును మాటలాడు, వ్రాయు సమస్తమును సేకరించి విమర్శించుటలు సాధ్యమా! ఒక్కనాఁటికి గాదు కాని తెనుఁగు శైలి యని యనుకొనుటలో మన కేదో యొకవిధమగు మాటల పొందిక, ఏస, నడక, నాలుకపైఁ దాండవించుచుండును నిజముగ నా యుద్దేశ్యమం దది నిర్వచింపఁబడనేరనిది, అనుభవించవలసినది 'పంచదార తీపి' యని యన్న, పంచదార తినుటలో మనకుఁ దట్టు తీయందనమని కదా యర్థము అట్లే తెనుఁగు శైలి యన్నఁ దెనుఁగును వాడుటలోఁ దట్టు నొకానొక యొయ్యారపు టుచ్చారణ కావున నా యీ వ్యాసముయొక్క యభిప్రాయములను బూర్తిగ నెఱుంగవలతురేని తెనుఁగున మాటలాడుచు నందలి యుచ్చరించు పొందిక యిట్టిదని స్మరణకుఁ దెచ్చుకొన్నఁగాని బోధపడదు

తెనుఁగునకును సంస్కృతమునకును నవినాభావ మున్నది. తెనుఁగునకుఁ దురకమునకుఁ, దెనుఁగునకు నాంగ్లేయమునకు సంపర్క మున్నది. తెనుఁగునకు నరవమునకుఁ గన్నడమునకు మైత్రి యున్నది తెనుఁగు బంగాళీ, తెనుఁగు హిందీ, తెనుఁగు మరాఠీ—యివి యన్యోన్య పరిచయములేనివి కావు కాఁబట్టి కేవలము తెనుఁగుదృష్టి యలవరచుకొనవలెనన్నఁ, దెనుఁగు శైలి కనిపెట్టవలెనన్న మనము ఎట్టి దృక్పథమున నిలువవలెను? సంస్కృత సంబంధములేని, తురకము, ఆంగ్లేయము, కన్నడము, అరవము, మరాఠీ, హిందీ, బంగాళము—వీని సంపర్కములేని యొకానొక నైజపుఁ బోకడఁ బోవు దానిని గ్రహించుకొనవలసియుండును అదెట్లని పెక్కుమందికి సంశయము ఒడమ వచ్చును

ఒక యావు పాలును మఱియొక యావుపాలును గలసిపోయినట్లు కలసిపోయినవే తెనుఁగు సంస్కృతములు వానిని విడుదీయుటెట్లు? పంచదార కాఫీకషాయము పాలు కలసి పోయినట్లు కలసి పోయినవే తెనుఁగు తురకము ఆంగ్లేయము వీని నొకదాని నుండి యొకదానిని విడఁదీయుటెట్లు? అని ఈవిధముగ నందఱు క న్నిసర్గపుఁ దెనుఁగు దెలిసికొనుట యసాధ్యముగఁ బొడగట్టవచ్చును

అయినప్పటికిని నిదానించి చూడవలెను మనము హూణభాషను మాటలాడుచు నడుమ నిట్టె తెనుఁగునకు దిగుచుందుము చటక్కున వలవైచిపట్టుకొన్నట్లు తెనుఁగు ముక్కలను నాల్గింటినిం గొనుఁడు బజారులందు గుద్దులాటల, సరాగాల, ఇండ్ల కబుర్ల, పాలాలమీఁదఁ బదాల, దెనుఁగు నుడికారము సమయోచితముగ బయల్వెడలునప్పుడు హృదయ మాంధ్రోద్దీపితమై "ఇది తెనుఁ" గనిపించును అది మీ మనంబుల కెక్కించుకొనుఁడు దాని నాధారభూతముగఁ జేసికొని తెనుఁగు శైలి యేమొకో యని యోజించుఁడు ఇది నా మనవి

అట్లు విమర్శించునప్పుడు ముఖ్యముగ నాకు గోచరించున దిది—"మన కింకను దెనుఁగుభాష యున్నది అది పోలేదు అది యప్పటప్పట బయల్వెడలి భావము ప్రకటించుచున్నది" అని "ఎల్లప్పు డట్లనే మాటలాడి యట్లనే భావమును బ్రకటింపఁ గలవార మైతిమా!" అని కూడ నూహ పోవుటయును గద్దు భూమి నే ప్రకారముగ నిరంతర మాంధ్ర భూమిగ నుండఁ దలపోసికొనుచున్నారమో మన నాలుక కూడ నిరంతరము తెనుఁగు నాలుకగ నుండ వాంఛింతు

కాని యొకప్పు డాంధ్రరాష్ట్ర మనుకొను భాగము ఉత్కళ రాష్ట్రమునఁ గలసి పోయినచో నది యాంధ్ర రాష్ట్ర మెట్లు కాదో, యొకప్పు డంతయు దెనుఁగై యున్న మన యీ నాలుక యాఁగ్లేయమును ఒఱించి, సంస్కృతమును నేర్చి, హిందీ గఱచి, తెనుఁగు చవికి వెలియగుచున్నా మంతో యింతో అయినప్పటి కుత్కళ రాష్ట్ర మన్నంత, తెనుఁగు మనిషిని గుర్తించుట మానినామా? అట్లే ఎన్నెన్ని భాషలఁ గలగలపైనను 'నిట తెనుఁగు శైలి కలదు' అని స్ఫురింపక మానదు అది నిర్వక్రముగఁ జాఱగొనవలెనన్న నొకటే సాధనము తెనుఁగువారిని జూచుచు, తెనుఁగుదేశమం దభిమానము వహించుచు, తెనుఁగు వచ్చినవారితోఁ బదే పదే తెనుఁగున మాటలాడుచు, తెనుఁగు పుస్తకములను విరివిగఁ బఠించుచు, 'తెనుఁగు తెనుఁగు తెనుఁగు' అని దానిని శ్రద్ధాభక్తులతోఁ బ్రత్యక్ష మొనరించుకొందుమేని తెనుఁగు శైలి యూరక కర్ణపుటంబుల నినదించు

అప్పుడు మీరు మఱచిపోదురు నారికేళపాకము, ద్రాక్షాపాకము, కదళీపాకము అను మాటలు, గ్రామ్య గ్రాంథిక విభజనములు అప్పుడు మీకుఁ దట్టఁగలవు తెనుఁగు వారి పురాణ శైలి, తెనుఁగువారి ప్రబంధశైలి, తెనుఁగువారి గేయశైలి యనునవి.

నారికేళపాకమన్న నదియొక తెనుఁగు నుడికారముయొక్క పొందికను సూచించు మాటకాదు అది తెనుఁగు పదములు తక్కువపెట్టి, సంస్కృత సమాసముల నెక్కువ జొనిపి, తెనుఁగువారి కర్థము గాకుండ వ్రాసిన పుస్తకములయొక్క గుణ సంకీర్తన సందర్భమున వెలువడిన పదము అట్లనే ద్రాక్షాపాక కదళీపాక శబ్దములును. ఆ పదములు తెనుఁగువారు పుస్తకములు వ్రాయుటలోఁగాని, తెలుఁగు నిజగుణము సూచించుటలోఁగాని యుపకరించవు సంస్కృతము బాగుగ వచ్చిన తెనుఁగువానికి నారికేళ పాక గ్రంథము లేత గుంజునే యిచ్చి దిగ్రమింగుట కనువుపడును సంస్కృతమురాక యాంగ్లేయ మెక్కుడు వచ్చిన వానికిఁ 'గురిడీ' కావచ్చును స్వభాషాజ్ఞానమునుబట్టి యొకానొక గ్రంథము సులభముగ నర్థమగుట, కాకపోవుట యనునది తెనుఁగు శైలిని నిర్వచింపనేరదు.

శైలియను మాటను పొందిక, వాక్యముల కూర్పు, ఒక మానవుఁ డొక మానవునికి తన భావమును ఊతముగ వెల్లడించుట తెనుఁగు శైలియన్న తెనుఁగు మాటల పొందిక, తెనుఁగుకూర్పు, తెనుఁగునూతము పురాణ పఠనమందుఁ దెనుఁగువారి మాటల పొందిక ఏస, నడక వేఱు, ప్రబంధఫక్కి వేఱు, పదములు పాటలు విన్నప్పుడు వేఱు

ఎంతటి మార్పు చెందినను నా యీ మాటలు తెనుఁగువారిచే నిరంతర మాయా సందర్భములందు వాడఁబడుచు, "ఇది తెనుఁగు నుడికారము" అని తట్టఁజేయు చుండును కావున ప్రతి తెనుఁగు వానిని నేను నేఁడు హెచ్చరించునది, "ఇందు సంస్కృతము హెచ్చా, తెనుఁగు హెచ్చా? ఇందు సంస్కృతము దెనుఁగు కలగలపు లెట్టున్నవి? వీ రితర భాషల నేర్చి వ్రాయుచున్నారా, నేర్వక వ్రాయుచున్నారా?" అను నత్తవ శల్య పరీక్షకుం దిగక, మాట, మాట, నక్షర మక్షరము విడదీసి చదువక నేకముగ గుర్తించి 'ఇది తెనుఁగు పురాణ శైలియా? ఇది తెనుఁగు ప్రబంధ శైలియా? ఇది తెనుఁగు గేయశైలియా?' అని ప్రబోధించుకొనుట శ్రేయస్కరము" అని

అందుల కిష్టత యెవరికిఁ గలదన్న నెవ రెన్ని తెనుఁగు పురాణములను బఠించి, యెవ రెన్ని తెనుఁగు ప్రబంధములను జదివి, ఎవ రెన్ని తెనుఁగు గేయములను బాడి యానందించుచు ఎం దాయానంద మున్నదో గ్రహింప దొరకొందురో వారికే యీ యర్హత కలదు



ప్రబంధములలోని విరహము

[1934 భావ సంవత్సరాది పంచికనుండి]

# యతిప్రాస మహాసభ

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

[1936 ధాత సంవత్సరాదిసంచికనుండి]

క

తెల్లవారి చూసేసరికి సారంగధరుడి మెట్టమీద ఒక పెద్ద తాటాకు పందిరి, దాని పైనీ—కిందా—మామిడాకు తోరణాలు, రంగు రంగుల జెండాలు, ఎరుపు, పచ్చ, నీలం కాగితాల గొలుసులూ, బుట్టలూ, లేతగాలికి వూగుతూ కనుల పండువుగా కనిపిస్తున్నవి ఆ పందిరికి చుట్టూ చిన్న చిన్న కొత్త తాటాకు పాకలు అందంగా బారులుతీరి వీథులు వీథులుగా ఉన్నాయి

ఉదయం 7 గంటలయింది బాలసూర్యుని బంగారు కాంతిలో రైలు రోడ్డు మొదలుకొని మెట్టదాకా 'దయచేయుడు దయచేయుడు' అన్న ఆహ్వానపు టట్టలకు అంతులేదు వీరభద్రపురంనుంచి వీరేశలింగంతోటకు ఏదోపనిమీద పోతున్న నన్ను చూసి మిత్రులు సూర్యనారాయణశాస్త్రిగారూ, సీతాపతిగారూ తొందరగా, "శాస్త్రీ, చప్పున రావాలి గొప్ప తమాషా జరిగిపోతోంది పరుగులమీద పోవాలి ర"మ్మన్నారు "ఊఁ ఏదో రాగిశాసనమో, మరణ శాసనమో దొరికింది కాబోలు" అని నవ్వుతూ "ఆగండి ఏమిటా తొందర?" అన్నాను "కవిత్వంచేసి చంపక రద్దూ! వస్తేగాని చెప్పం" అన్నారు "పదండి" అని బయలుదేరాను

చ

సీతాపతిగారు ముందు నడుస్తున్నారు ఎట్టకేలకు మెట్ట సమీపించాం పెద్ద తాటాకు పందిరి ఏదో సభాభవనంలాగా కనిపిస్తోంది. "కొంపదీసి ఆంధ్ర సాహిత్య పరిషత్తు అభినవ కవులకు ఒడిసి ఇక్కడ జరగడం లేదు కదా" అన్నా సూర్యనారాయణశాస్త్రిగారితో "అంతకన్న ఒక మహాసంస్థ ఒహ టిక్కడ శేవదీశారయ్యా మహానుభావా" అని తిర్పిన 'ఆర్చి' ఒకటి చూపించారు దానిమీద "అఖిలాంధ్ర యతిప్రాస మహాజనసభ" అనే కాకి బంగారం అక్షరాలు జిగజిగమన్నాయి ఒక్కసారి. సీతాపతిగారు మాతో రహస్యంగా "ఇక్కడ మన మెవరమో ఎవ్వరికీ తెలియగూడదు తెలిస్తే వీళ్ళు మనను చంపేస్తారు జాగ్రత్త" అని హెచ్చరించారు

ట

బారులు తీరిన తాటాకుపాకల మొదటి శ్రేణిలో వెళ్ళి నిలుచున్నాం నిదానించి సీతాపతిగారు ఒక పాకదగ్గరకు నడిచారు. మేము వెంబడించాం ఆ పాకకు ఒక వైపున 'ఓరుగల్లు ప్రతినిధులు' అని వ్రాయబడిన ఒక అట్ట వ్రేలాడుతున్నది పాకనిండా ప్రతినిధులు 'కోదండరామునకు జై' అని కోలాహలం చేస్తున్నారు సీతాపతిగారు చూపుడు వేలు తిప్పుతూ "అదిగో అందులో వారి కందరికీ నాయకుడుగా 'అజమాయిషీ' చేస్తున్న ఆ డబుల్ పన్నామనిషి 'అనఘం'గారు ఈయన బమ్మెర పోతరాజు గారికి సయాన మేనత్త కొడుకు ఆయనపక్కను పరుపుచుట్ట కానుకుని కూర్చునాయన 'అమరం'గారు యీాయనా 'అమలం', 'విమలం', 'ప్రతిమలం' ఒక వేలువిడిచిన పెత్తల్లి పినతల్లి బిడ్డలు వీరి ఎడంపక్కను కూర్చున్న కుర్రవాడు 'వెతి' అతనిపక్కవాడు అతని ఆత్మబంధువు 'మతి'" అని చెప్పి, ఈ మూల కూనిరాగాలు తీస్తున్నాయన ఎవరు చెప్మా అని ఆలోచిస్తుండగా "ఓస్ ఈయన 'పరగం' గారండీ" అన్నా కొంటెగా. "రైటో పదండి ముందు" కన్నారు సీతాపతిగారు.

త

అది కొండవీటి ప్రతినిధులున్న బస

'నమస్సాంబశివాయ' అనే కలకలం మాకు దూరానికే వినబడింది అంతా కుస్తీ చేసిన వస్తాదు జబరస్తీగా ఉన్నారు దగ్గరకు వెడితే తంతారేమో అన్న భయంమీద ఓరగా నిలుచున్నాం సీతాపతిగారు ఎవరికోసమో వెదికి వెదికి ఉండబట్టక పాకలో దూరి "అయ్యా, ధరాదేవిగారు రాలేదేమండీ?" అని అడిగారు పాకంతా గొల్లుమని నవ్వి "ఈసభా కార్యక్రమం మీాకేమీా తెలియదు కాబోలు ఈ మహాసభకు మా ధరాదేవిగారే అధ్యక్షత వహిస్తారు వారు త్రోవలోన సన్మాన సభలూ, స్వాగతపత్రాలూ విధీ విరామం లేకుండా అందుకుంటూ ఈవేళ 9 గంటల రైలుమీద వస్తున్నారు బ్రహ్మాండమైన ఊరేగింపుతో గోదావరి స్టేషనుకు వెళుతున్నాం" అన్నారు

"వెళ్ళి అంతా గోదావరిలో దిగిపొండి ఆంధ్రకవిత్వం పీడ వదలిపోతుంది" అన్నానన్నగా సూర్యనారాయణశాస్త్రిగారు.

నేను కొంటెగా అందులో ఒకాయనను "అయ్యా, తమపే రేవరండీ!" అన్నాను. అతడు గూబకు బెత్తెడు చూసినట్టు చూసి "రాజమంద్రీ కుర్రాళ్లకి బొత్తిగా కళ్లు కనిపించడంలేదు ఏనాడూ మమ ల్ని చూస్తేగా" అన్నాడు 'గుసా' అయిపోయి. "పేరడుగుతే తప్పండీ?" అని సీతాపతిగారు సర్ది, "శాస్త్రీ ఎంత టాటె చెప్పాలూ! వాళ్ళ నడక్కూ—రంగం చెడుతుంది నేను చెబుతా వినండి ఇదిగో! ఏ.మీద మండిపడినవా డున్నాడే వాడు 'కెరలి' గాడు వాడి పక్కవాడు 'పంబిన'వాడు ఉరుద్రాక్షతావళం తిప్పుతున్నాయన 'ఒరిమ' గారు అతని కెదురుగుండా ఆ వెర్రి మొహంవాడు 'అర్థి' ఈ హడావడిగా పరిగెత్తేవాడు 'పికం' గారు" అని చెబుతూ ముందుకు నడిచారు.

ప

ఇంకొకపాక అది 'జమీందారీ' ఫాయా మనుషు లుండదగినంత 'హోదా' గా తయారు చేశారు ఆ 'రాతిరియుం బవల్ మరపురాని పాయలు' చూస్తే ఒక మహాసామ్రాజ్యం పంచుకు అనుభవిస్తున్న దర్పా గోచరిస్తుంది పరచిన పట్టు తివాసీమీద ఒక పెద్దమనిషి హుక్కా పీలుస్తూ 'ఫక్తుఫాదుషా' లా ఉన్నాడు సీతాపతిగారు తేరి చూచి "ఓహో! వీరు విజయనగర ప్రతినిధులండీ ఆ హుక్కా పీలుస్తున్నాయన 'హరువు మొల్లం'గారు మాంచి హుషారైనవాడు ఇటువెంపు చూస్తున్నాడే అతడు 'అల్లవ'. ఇతడు పెద్దన్నగారి దత్తపుత్రుడు ఆ పొడుగాటివాడు 'వావిరి' ఇతనికీ నముచర్త్రభట్రాజుగారికే మహాదోస్తీ ఆ పొట్టి దబ్బకుర్రాడు 'సారిది' ఆ పొడుందటిట్టున్నవాడు 'తలమే'. ఎలాగో వచ్చి వీళ్ళగ్లో పడ్డాడు" అన్నారు "ఆ తురక ఎవరండీ వీరిలో ఉన్నాడు' అన్నారు సూర్యనారాయణశాస్త్రిగారు నేను గుర్తించి ఇతడు షేక్ తవళవసాయబు ఆరుగో స్త్రీ ప్రతినిధులు—ఈ బక్కపలచని జాకాలావిడ 'అండజయాన' ఆ పచ్చ చీరావిడ 'భీతహరిణేక్షణ' ఆ పడుచు 'శతపత్రేక్షణ.' వారి కెదురుగా కూచుని వెర్రిమొహంవేసి యేమీాతోచక 'క్రతూత్సవ సంధాయకుణి' పిలిచి చుట్ట అంటిస్తున్నవాడు 'కైతవ కుసుమశరాసనుడు'" అనేసరికి మా వారిద్దరూ పొట్టలు పగిలేట్టు నవ్వుతూ ఈ పై ప్రతినిధులతో శాస్త్రి ఎట్లాగూ తంటాతెస్తాడు. అసలు మన పని చెడుతుంది అని సభాభవనంలోకి లాక్కుపోయారు నన్ను.

గ

ఆహ్వాన సంఘ సమావేశము జరుగుతున్నది అధ్యక్షులు 'జగన్నుతం' గారు, కార్యదర్శి 'మానుగ' గారు తగ్గిన ముగ్గురు సభ్యులు 'పొలగ' 'పెలుచ', 'తద్దయు' గార్లు సభా ప్రణాళిక, కార్యక్రమం గూర్చి మాట్లాడుకుంటున్నారు. ప్రణాళిక ఇట్లా సిద్ధమయింది:

(1) 8 గంటలకు బ్రహ్మాండమైన ఉత్సవముతో వీరేశలింగముతోటమీాదుగా గోదావరిస్టేషనుకు వెళ్ళి ధరాదేవిగారికి ఘనమగు స్వాగత మిచ్చుట.

(2) యావన్మంది ప్రతినిధులతోను, సభ్యులతోను తిరిగివచ్చి తావన్మందితోను తదుపరి మజ్జిగ భోజనాదు లాచరించుట

(3) 2 గంటలకు మహాసభాప్రారంభము

(4 అధ్యక్షు యెన్నికోలు

(5) ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

(6) అధ్యక్షోపన్యాసము

(7) అఖండయతి ఆక్రందనము

(8) క్రొత్త ప్రతినిధుల కొన్ని మాటలు

(9) అభిశంసన తీర్మానములు

(10) సమాప్తి.

'జగన్నుతం'గారు లేచి "సోదర ప్రముఖులారా, కార్య ప్రణాళిక కడుంగడు చక్కగ కుదిరినది ఎనిమిది గంటలైనది లెండు మన వంశ ప్రతిష్ఠాకంఠకుస మూలవిరాడ్రూపిణియగు సద్ధరాదేవి ఘనస్వాగతమునకై కదలిరండు" అని గంభీరంగా పలికేసరికి ప్రతినిధులందరూ సభా భవనం నిండిపోయి, 'ధరదేవికి - మహీరమణీమణికీ—పుడమితలికీ—జై' అని తమ భక్త్యుత్సాహముల వెల్లడించి బారులుదీరి బయలుదేరారు.

80 ఏళ్లకు పైగా ప్రఖ్యాతి గాంచిన

# కవిరాజ్ ఎస్. ఎస్. సేన్ & కంపెనీ, కలకత్తా వారి

నమ్మకమైన ఆయుర్వేదీయ ఔషధ రాజములు

**సిద్ధమకరధ్వజం :-** సమస్త వ్యాధులకు, నరముల బలహీనతకు బ్రహ్మాస్త్రము వంటిది.

**వసంత కుసుమాకరం :-** అతి మూత్రము పోగొట్టి, బలము నిచ్చును.

**పూర్ణ చంద్రోదయం :-** శరీర పుష్టికి, బలహీనతకు దివ్యౌషధము.

1. అమృతవల్లి కషాయ (రక్తశుద్ధి చేయును)
2. బృహత్ అమృతవల్లి కషాయ
   (రక్తశుద్ధి చేసి, చర్మవ్యాధులను పోగొట్టును)
3. అశోకామృత (స్త్రీల సమస్త వ్యాధులకు)
4. దశమూల రసాయన
   (నరముల బలహీనతకు, దీర్ఘ రోగములకు)
5. ద్రాక్ష రసాయన
   (న్యూమోనియా, బ్రోంకైటీసు- ఇన్‌ఫ్లూయెంజాలకు)
6. జీరక రసాయన (అజీర్ణ, ఉదర వ్యాధులకు)
7. కర్పూర రసాయన
   (కలరా, నీళ్ల, బంక విరేచనములకు)
8. కస్తూరి కల్ప రసాయన
   (ఉత్తేజము, ఉత్సాహము కలిగించను)
9. పంచతిక్త కషాయ
   ("మలేరియా", చలి విష జ్వరములకు)
10. ప్రసూతి కల్ప రసాయన
    (సుఖ ప్రసూతి కల్పించి, చనుబాలను వృద్ధి చేయుటకు)
11. రతి వల్లభ రసాయన
    (నరముల పటుత్వమునకు, మనోల్లాసమునకు)
12. వాత నిర్వాణ
    (కీళ్ల నొప్పుల సంధి, సమస్త దోషములకు)

1. అశోకారిష్ట (స్త్రీల గర్భాశయ రోగములకు)
2. అశ్వగంధారిష్ట (వాత, రక్త, దోషములకు)
3. చందనాసవ (సమస్త మూత్ర వ్యాధులకు)
4. దశమూలారిష్ట (కస్తూరి కలిపినది)
   (నరముల బలహీనతకు, వాత దోషములకు)
5. పార్థారిష్ట (హృద్రోగములకు, ఊపిరితిత్తులకు)
6. పునర్నవాద్యారిష్ట
   (తిమ్మిరి, నీరుపట్టుట మొదలగు వ్యాధులకు)
7. శారిబాద్యాసవ
   (గజ్జి, తామర, కురుపులు- రక్తదోషక చర్మ వ్యాధులకు)
8. కనకాసవ
   (బ్రోంకైటీసు - ప్లూరసీ - మొదలగు శ్వాస రోగములకు)
9. జీరకాద్యారిష్ట
   ("స్ప్రూ" అజీర్ణ రోగములకు)
10. అమృతారిష్ట
    (దీర్ఘ రోగములకు, జ్వరములకు)
11. లోహాసవ (రంజా - పాండు వ్యాధులకు)
12. పత్రంగాసవ
    (ఋతు దోషములకు, శూల, పాండు, ఉదర వ్యాధులకు)

సమస్త దంత దోషములకు. **'దంతధావన చూర్ణం'** ❖ కురుల సౌందర్యమునకు. **'కేశరంజన్'** తలనూనె

వివరములకు, ఉచిత వైద్య సలహాలకు

# ఆక్మీ ట్రేడ్ ఏజన్సీస్

ఆంధ్ర, మైసూరు రాష్ట్రములకు సోల్ డిస్ట్రిబ్యూటర్లు

**పి. బి. నెం. 116, పులిపాటివారి వీధి, విజయవాడ - 1**

*బ్రాంచి ఆఫీసు :*

మెయిన్ రోడ్, కాచిగూడ, హైదరాబాదు.

—NVKR

స్వరయతులందరూ ఒక జట్టు వ్యంజన విరామములందరూ ఒక గుంపు బిందు విశ్రాంతుల చెట్టాపట్టాలు వెనుక తరువాత విశేష విరతుల శ్రేణి అందరివెనకా అఖండ యతిగాడు అప్పకవిని తిట్టుకుంటూ బావకవుల్లో కలసిపోదామా అని ఆలోచిస్తూ బయలుదేరాడు ఇసకవేస్తే రాలని యతిపటాలంతో రోడ్డు ఉక్కిరి బిక్కిరి అవుతూ ఒక మహాప్రబంధంలా ఉంది

ఊరేగింపు వీరేశలింగంతోట దగ్గరకు వచ్చేసరికి చటుక్కున ఇంకా కొందరిని వెంటబెట్టుకుని 'క్రందుగ'గారు ప్రాస ప్రముఖులను వెదుక్కుంటూ వచ్చి కలిశారు

తిన్నగా ఉత్సవం లక్ష్మీవారప్పేట దగ్గరనుంచి 'సర్కారు పశువుల వైద్యశాల' మీదుగా గోదావరి స్టేషను వద్దకు నడిచింది

మెయిలువచ్చి స్టేషనులో ఆగింది. అమర ప్రకారం అక్షరాలా ధరాదేవి కుండే సపేర, జాబితా కంఠటేకీ జై జై కొడుతూ ఆహ్వానసంఘంవారు ఆమె ఎక్కిన పెట్టె కోసం జనాన్ని తోసుకుని పరుగెత్తుతూండగా, ఒక పెట్టెలోనుంచి తలంతా నెరిసి ఒకప్పుడు తులలేని వైభవం అనుభవించిన ఒక ముసలావిడ తొంగిచూసింది

"అదుగో వసుంధరాదేవిగారు" అంటూ జనం అంతా అటు వెంపు పరిగెత్తారు అవియవ పటుత్వం తప్పినా సకలాంధ్ర కవిత్వరంగమూ అసివారుబయలుగా తిరిగిన ప్రాభవమూ, ఏ ఆంధ్రకవి ఆపత్తులోనైనా అడ్డుపడి కాపాడిన ఔదార్యమూ ముఖంలో ప్రతిఫలిస్తూండగా ధరాదేవి జరాభరంతో వణకుతూ దిగింది ఆమెవెంట 'లీలా' కుమారి, 'అలి' కన్య స్వాగతపత్రాలూ, సంచీ పట్టుకు దిగారు

'మానుగ', 'జగన్నుతం' గార్లు గబగబ పరిగెత్తుకు వచ్చి ధరాదేవి మెడలో కర్పూరపు దండలూ, పూలదండలూ వేసి సాష్టాంగంగా నమస్కరించి లేచారు వచ్చిన ప్రతినిధులందరూ సాష్టాంగపడదామనుకున్నారుగాని ప్లాట్‌ఫారం పట్టదనీ, పాసింజర్లు తొక్కి చంపేస్తారనీ భయపడి జంకి చేతులతోనే 'దండించి' తృప్తిపడ్డారు

'సెకండ్‌క్లాస్ కంపార్టుమెంట్' లోంచి నవనాగరికులగు ముగ్గురు యువకులు 'పోజు' లిస్తూ దిగారు జనంలో కొత్త ప్రతినిధులన్న గోల పుట్టింది కార్యదర్శి 'మానుగ' గారు తెచ్చికోలునవ్వుతో తేరిచూసి "అయ్యా, దయచేయండి! తమరు గుంటూరునుంచా, తెనాలినుంచా బయలుదేరారు" అన్నారు "అసలు మొన్న గుంటూరినో బయలుదేరి తెనాలి నిన్న రాత్రికి వచ్చి ఉదయం బెజవాడలో బయలుదేరాం" అన్నాడు అందులో ఒకాయన

"తమ నామధేయ"

"నా పేరు మధురం—ఈయన వలపుబరువు ఆయన 'సుషమం.' ఏదో మీ కుటుంబంలో వాళ్లమే కనక బంధువులనందరినీ చూసిపోదామని వచ్చాం."

"మంచిపని చేశారు దయచేయండి"

'మానుగ' వారిని వెంటబెట్టుకుని మహాజనంలోకి వెళ్లాడు లీలాకుమారి మధురాన్ని చూసి తన చురుకైన కళ్లను ఓరగా అప్పళించి పరిచయ సూచకంగా నవ్వింది

'ప్రేమ గుడ్డిది' అనుకున్నాడు 'వలపుబరువు' ధరాదేవి కారు ఎక్కుటకు నిరాకరించగా రెండెడ్లబండిమీద ఆమెను ఎక్కించారు 'అలి' కన్య ఆమెతో బండిలోనే కూచుంది లీలాకుమారి, కొత్త ప్రతినిధులూ కారులో ఎక్కగా కారు బర్రుమంది

౫

మూడు గంటలకు ఎట్టకేలకు మహాసభ ప్రారబ్ధమయింది

స్త్రీల ప్రత్యేక స్థలంలో స్త్రీ ప్రతినిధులు కూర్చున్నారు 'లీల' వారందరికీ నాయకరాలులాగ కొంచెం ముందుకు కూచుని 'మధురం' మీద ఓ కన్ను పారేసి ఉంచింది అంతట కార్యదర్శి 'మానుగ' లేచి కన్నుమూసి, 'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ' అని దైవ ప్రార్థన చేయగా "విద్యనిచే జనించు చూడా చదివి తీరాలి చదవకపోతే లేచి వెళ్లి మే మింకో సభ పెట్టుకుంటా"మని ఓరుగల్లు ప్రతినిధులు తీవ్ర—గగ్గోలు చేశారు ఓ మూలనుంచి రాజమండ్రి పెద్దమనిషిలేచి "అయితే 'శ్రీ మద్భాను సహస్ర' వదిలి పెట్టవలిసిందేనా?" అని గద్దించాడు మధురం జెండాలా లేచి ఫక్తు బంగాళీలో "గీతాంజలిలోవి పది లైనులు చదివితేగాని మేం ఒప్పుకోం" అన్నాడు ఎట్టకేలకు 'జగన్నుతం'గారు లేచి కాంగ్రెసువాది భీకరారావంతో,

"నాయనలారా! అమ్మలక్క నాయనమ్మలారా! బ్రహ్మాండమైన కార్యక్రమము ముందు బెట్టుకొని దైవ ప్రార్థనకై తగవులాడుట వట్టి ఆంధ్రత్వము ఆ భారతామ్నాయ గంగా భగీరథునియందు, ఆ వాగనుశాసనునందు మీకు గౌరవము లేదా! వెండియు నఖండ గౌతమీ జలకణ హల్లోహల మదబంభర మల్లధ్వనుల నుల్లసలరు ఉద్దండ మండలేశ్వర చండ కాండాతికాండ నికురుంబకరంబిత రాజ రాజ నరేంద్ర చంద్రు పేరోలగమువంటి ఈ 'ధీరోలగమున' నింత పూచీలేని పేచీలు లేవనెత్తుట భావ్యమా? సంభావ్యమా?" అని గర్జించి అల్లరి సర్ది "ఏ దేవి యాథేయ భావంబున స్థావరజంగమ ప్రపంచము కాలూని క్రాలుచున్నదో, ఏ దయామయస్వాంత యనుగ్రహంబున నన్నయాది కవులు వేమనాది యోగులు కృత్యాద్యవస్థ దాటి కృతకృత్యులైరో, ఏ యుదార శీల గంటము దించి, ఆకు చించి ఆలోచన తెగక తన్నుకొని చచ్చు ఆంధ్రకవుల కడ్డపడి ఆపత్తు దాటించెనో అట్టి శ్రీ వసుంధరాదేవిగారు దయచేసి అధ్యక్షపీఠ మలంకరింతురుగాక" అని ఉరిమి కూర్చున్నారు

"ముసలాళ్లు అధ్యక్షపీఠాలు వదులుకుంటేనేగాని ఈ దేశం బాగుపడ"దన్నాడు మధురం వెంటనే ఒణుకుతూ అధ్యక్షపీఠానికి తడుముతున్న ధరాదేవి చేయిపట్టుకుని 'అలి'కన్య పీఠం ఎక్కించింది కార్యక్రమం ప్రకారం ఆహ్వాన సంఘాధ్యక్షులు తమ ఉపన్యాసం ఇట్లా ప్రారంభించారు

"అయ్యమ్మలారా! అఖిలాంధ్ర యతిప్రాస మహాజనులారా! స్వాగతము సుస్వాగతము. నేడు ఇప్పుడు ఇక్కడ మనము ఎందుకు సమావిష్టులమైతిమో యందఱికుం దెలిసినయది కాదా? ఒకప్పుడు మనమును తులలేని గౌరవమును, వెలలేని కానుకలను నింపుదళుకొత్త సంపాదించినవారమె కామా! మనవంశము బహు పురాతనమని యిటీవల దొరికిన కరక్కాయవలస మరణ శాసనముంబట్టి సువిదితమైనదికాదా? రాజరాజ నరేంద్రుని మొదలు రఘునాథ రాయలవఱకు మనధాటి కెదురొడ్డిన వా రున్నారా?

"నన్నయ మొదలు చిన్నయదాక మనల గాదని కాలు కదపినవా రున్నారా? బాలకవి పార్థసారథి శతకము దగ్గఱనుండి మహాకవి భారతమువఱకు మనము పెట్టినది



నేను దావా దాఖలు చేశా
[1935 యువ సంవత్సరాదిసంచికనుండి]



బుద్ధుడునేడు జీవించియున్నయెడల [1935 యువసంవత్సరాదిసంచికనుండి]
ఇప్పటి మానసికజీవనము ను వివర్శించ టకేకాని బద్ధభగవానుని దూషించ టకుకాద.

భిక్షకాదా! (పొంగివచ్చే కన్నీళ్లు తుడుచుకుని) చచ్చి స్వర్గమునవున్న నన్నయ తాతగారు వినియున్నను లేకున్నను నన్ను బిలిచి యభిమాన పుత్రునిగా జూచిన దివసములు తలచు కొన్న నాకు దుఃఖము వచ్చుచున్నయది కన్నీరు మున్నీరగుచున్నది 'క్రందుగ బాష్పరోధమున కంఠమువన్' జెడుచున్నది అయినను గొన్ని సంగతులు నివేదించి విరమింతును

"నేడు కొందరు మన మహాకవు లిచ్చిన ప్రబంధ రాజములం జదివి బాగుపడిపోయి, ఎదురుతిరిగి, పొల్లు పదములు, పడికట్టురాళ్లు అని మన 'భవిష్యము' తీయుచున్నారు చెల్లరే యిది యెంత విశ్వాస ఘాతుకత్వము! అమ్మకచెల్ల వీరి నమ్మగజెల్లదు నంకాయ బజ్జీవలె వట్టి గీత పద్య మిప్పటివారి కారాధ్యమైనది ఇందు యతి సోదరులకు భిక్ష దొరకినను ప్రాస ప్రముఖుల ప్రాణములు పోవుచున్నవి ఉభయులను గౌరవించు తెలివి వీరికి లేదా? నేటికాలపు డిప్రెషన్ పద్యములకు గూడ ప్రాకినదా! (భీకరంగా) ఆ శార్దూలము లేమి! (గర్వంగా) ఆ మత్తేభము లేమి! (మృదువుగా) ఆ చంపకమాల లేమి? (సువాసనగా) ఆ ఉత్పల మాల లేమి? వాని 'పసందు' ఈ తుక్కు గీతములకు, నీ చొప్ప గేయములకు వచ్చునా? మెచ్చు దెచ్చునా? ఇప్పే యివి లెస్సయే? (సభలో- ఆహా ఏం కొట్టేస్తున్నాడయ్యా దెబ్బలు బలే! అనే అభినందనాలు) ఏమయినను పోయినది—పోయినది ఆంధ్ర కవిత్వ ప్రతిష్ఠ అడుగంటినది పాపము గోపాలకృష్ణయ్య ఏమన్నాడు? "కొంతిమీరి కవిగాళ్ల గతు లయోమయములై నన్ను వీధిని బెట్ట నెన్నుచుండ" అని ఆంధ్రమాత ఆవేదనగా వినిపింపలేదా? లేవరేమి? నడుములు బిగింపరేమి? కాళ్లెగుర వేయరేమి? అల్పులము మన మేమి చేయగలమని యోడకుడు చెప్పలేదా చిన్నయసూరి మహాకవి 'గడ్డి వెంటి గంధ గజమును బంధించు'నని కావున మన మందరము మన నవమానించిన క్రొత్త కవులను కెక్కు కెక్కుమనిపించుట కొక క్రొంగ్రొత్త మార్గము కనిపట్టి ప్రచారముచేయ నీ మహాసభ సన్నాహము జేసితిని అది యెట్టిదన—క్రొత్తకవుల యూహలు విదేశీయులైన భాష స్వదేశీయ కావలయును కనుక వారు భాష కొరకు ప్రబంధములు చదువునప్పుడు మనము ముక్కు బిగించి చిత్ర బిగిసితిమేని యతడు ఎంత తన్నుకొనినను మన యాంతర్యమును దెలిసికొనలేక చివరకు మనకు దాసోహమయి చెప్పినట్లు వినును ఈ ఘనకార్యమునకు మీ రంద రేకమతులై తోడ్పడినచో కుహనకవులను ఘడియలో లొంగదీయగలను

"నేను చిరకాలం మీ యఖండ గౌతమి నఘమర్షణ స్నాన మాచరించి, సారంగధర పర్వతమున ఘనతపం బాచరించి ఈ సహాయ నిరాకరణోద్యమమును గనిపట్టినాను గాంధి నా ప్రియ శిష్యుడు చెప్ప మరచినాను

"వజ్ఝల పండితాదులు వసుచరిత్ర విమర్శనాదికములో మనము వ్యర్థులమని దూషించినను నలుగురిలోను మనము లేకున్న రసభంగమగునని చెప్పుచుండుటచే వారి నెంతయు మన మభినందింపవలసియున్నది ఇక మన మనిన నోర్వలేని ముగ్గురను తీవ్రముగ నభిశంసింపవలసియున్నది. సోదరులారా! చాల తడవైనది నేను సూచించిన ఉత్కృష్ట పద్ధతి ననుసరించి వంశ ప్రతిష్ఠ నిలువం బెట్టుడు"

అని జగన్నుతంగారు మఖాసీనులుకాగా ఉవ్వెత్తుగా రేగిన చప్పట్లవంటి చప్పట్లమధ్య ధరాదేవి లేచి, "చిరంజీవులారా! ఎందరో మహామహులుండగా నన్ను, ఈ ముసలి ముత్తైదువను అగ్రాసన మెక్కించుట కేవలము తమకున్న స్త్రీ గౌరవమే యని చెప్పకతప్పదు ఇంత మహోన్నత పదవికి నేను తగను. శ్రీనాథాది కవిరాజులు నామీద విష్కారణ గౌరవము చూపినట్లే మీరును వ్యర్థులనగు నామీద నింత యాదరము, ప్రాముఖ్యమునుంచి విశ్వాసమును ప్రదర్శించినందులకు చాల కృత జ్ఞురాలను

"నా జీవనము, జపము నేనాడో తెనుగు కవులకే ధారపోసిన నేను ఈ జరాభరమున నేమియు మాటలాడంజాలను అదియునుంగాక శ్రీ జగన్నుతంగారే చెప్పవలసిన దంతయుం జెప్పి నా భారమును తగ్గించినారు వారి యమూల్యోపదేశముల ననుసరించి మీరందరు కృతకృత్యులగుదురుగాతమని కోరుచున్నాను" అని చదికిలబడగా, చివ్వున అఖండయతి లేచి "జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచా రూఢి సత్యంబుగా మీరు నన్ను దరిజేరనీక తరిమికొట్టినారు నామీద ఆదరం చూపిన క్రొత్త కవుల వ్యావహారిక భాషతోనే మాట్లాడతాను

"భారత కవులు న న్నభిమానించినా, అప్పకవి వాడి సొమ్మంతా పడిపోయినట్టు నన్ను కాదని అడ్డమైన గడ్డీ కరచాడు నా సోదరుడు రలయతికి విషమే పెట్టాడు నన్ను ఆదరించిన అభినవ కవులను నమ్ముకుని మేమిద్దరం వారితోటే ఉంటాం మేము మీతో ఎప్పటికీ కలియం నాకు మీ సంస్థతో సంబంధంలేదు" అని దబాయించి చెప్పికూర్చున్నాడు

యతిప్రముఖులు మండిపడి "ఏల చొరంగ నిచ్చితిరి యుత్తరకన్ మనసీమలోనికిన్" అన్నట్టు ఉగ్రులై చూశారు క్రొత్త ప్రతినిధులలో 'మధురం' లేచి "జగన్నుతంగారి అభిప్రాయాలతో కొంతవరకూ ఏకీభవిస్తాం ఆట్టే చెప్పవలసింది లేదు" అని కూర్చున్నాడు

కార్యదర్శి లేచి "మహానుభావులరగు నస్మత్సోదరులారా! తమరందరు సాదర భావముతో నందందు తోడ్పడి సభ జయప్రదముగా జరిపించినందులకునిదే వేనవేలు కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను ఈ తీర్మానములను తామందరుచిత్తగించిసమ్మతింపగోరుచున్నాను

1 ప్రస్తుతము, మన సంఘమును బహిష్కరించి క్రొత్త త్రోవలను త్రొక్కుచున్న ఇప్పటి కవుల ప్రబంధములు బట్టుకొనినచో వారి కడుగడుగున నడ్డు తగిలి యేడిపించుటకు నీ సభవారు తీర్మానించుచున్నారు.

2 తమ విమర్శనలలో మనము వ్యర్థులమని దూషించి వ్రాసినను, నలుగురిలోను మనవల్ల రస ముప్పతిల్లునని చెప్పు వజ్ఝల పండితాదుల నీ సభవారు అభినందించుచున్నారు

3 మనలను పీఠికలలోను, పత్రికలలోను దూషించి యిహపరములకు జెడిన ఛందోదర్పణ పీఠికాకారుడు సీతాపతి, యతిప్రాసలైచ్ఛికములని యుగాది సంచికలో వ్రాసిన సూర్యనారాయణశాస్త్రి, పద్యములలో యతిప్రాసలుత్రోసి మనపై కత్తికట్టిన హనుమచ్ఛాస్త్రిగార్లను ఈ సభవారు మిక్కిలి గర్హించుచున్నారు."

సభ్యులంతా 'బేష్—బలే—అవును' అని చప్పట్లుకొట్టి, అట్టహాసాలుచేసి తమ ఆమోదమును తెలియజేస్తూ సభలోంచి లేచారు. మే మెవరమో తెలియకుండా బయట పడేటప్పటికి బ్రహ్మాండమయిపోయింది.



ఇది ఆంధ్రత్వమా? [1935 యువ సంవత్సరాదిసంచికనుండి]




ముక్తి కావలసినచో [1935 యువ సంవత్సరాదిసంచికనుండి]

# సేఫ్టీ రేజరు

వెంపటి నాగభూషణం, ఎం. ఏ.

[1937 ఈశ్వర సంవత్సరాదిసంచికనుండి]

**అంకితం**

కొత్త పోకడలు అంటే భయంలేనివాళ్లకు

*　　　*　　　*

**అష్టక**

శ్రీమేనాకమనా
సుమనోదయ కోమల రమణా
కోరకహీరమణీ రదనా
భారవి కరపులకిత కుముదా
ధారా జయ వసంత మాధవ—
విజయీ భవ

(ఓమూలనుంచి విలాసంతో, రెండో ప్రక్కకు నడిచిపోతుంది తెర ఎత్తగా)

ఒకటో రంగం

[ఆశ్రమ ప్రాంత పుణ్యభూమి · విశాలమైన మఱ్ఱిచెట్టు మొదట వేదికమీద పలచని లేడిచర్మపు రజాయి జారుగా పరచిఉంటుంది ఒక చివరగా, అజంతా బొమ్మల్లో చూసే మధుకలశము, పానపాత్రమూ ఉంటవి వాటి ప్రక్కన హుక్కా

కొంచెం దూరంలో జాలువారుతూన్న సెలయేటి అంచున, అప్పుడప్పుడే అంకురిస్తూన్న బాలతృణాల్ని మునిపంట నొక్కుతూ, తిరుగుతూన్న ఆడలేడిని అనుసరించి బాలకురంగం చెంగున గెంతుతూంది విశ్వామిత్రుడు వేదికకు మరో అంచున ఠీవిగా కూర్చుని, ఆవంక చూస్తూంటాడు

శిష్యుడు ప్రవేశిస్తాడు కొంచెం బెదురుతూ దూరంగా నిలబడి, ముందుకు రెండడుగులువేసి, మళ్లా తటపటాయిస్తూ]

శిష్యుడు —జయము, జయము గురుపాదులకు!

విశ్వామిత్రుడు —(ఒక నిమిషం ఊరకుండి, తరువాత రవంత శిష్యుడి వైపుకు తిరిగి, చూసీ చూడనట్లుగా కొంచెం తల ఊపుతాడు రాజ దర్పంతో)

శిష్యుడు —తమకోసం దూర్వాసమునీంద్రులు—

విశ్వామిత్రుడు —(పరధ్యానంగానే, చికాకుతో) ఇప్పుడు వీలులేదు మరోమారు రమ్మను

శిష్యుడు —మరి వారు ఇప్పుడే—

విశ్వామిత్రుడు —పో॰

(శిష్యుడు జంకుతూ వెనక్కి వెళ్లిపోతాడు లోపల గలభా వినపడుతుంది- —దూర్వాసుడు ముందుకు రాబోతూంటే, శిష్యుడు అడ్డుపడి వారిస్తున్నట్లు క్రమంగా కేకలు దూరమౌతవి తరువాత నిశ్శబ్దం)

ఆ॰, చింత చచ్చినా పులుసు చావనంటూన్నదే? దేవతలందరూ నాకు జడిసి బ్రాహ్మణ్ణి చేశారా? కాని, మళ్లా ఎంతలో మారిపోయినానూ? (లేచి అటూ, ఇటూ పచారు చేసివచ్చి మధువును సేవిస్తాడు నిలుచునే హుక్కాగొట్టం అందుకుంటాడు)

అవును, మారిపోయాను మారిపోగలను నా యథేచ్ఛావిహారం . లీల (నవ్వి) నన్ను నేనే దిద్దుకుంటాను—మేనకకోసం

(మేనక ప్రవేశిస్తుంది పదహారేళ్ల బాలెంతరాలు మిసమిస లాడుతూంది కొంచెం వెనుకగా ఒక అప్సర పొత్తిళ్లలో పిల్లను ఉంచుకు వస్తుంది

మేనకను చూసి అమితావేశంతో)

వచ్చావూ?

మేనక· (చిరునవ్వుతో సమీపించి, అతని భుజాలమీద చేతులువేసి, కళ్లల్లోకి చూస్తూ) ఆహా॰

విశ్వామిత్రుడు.—ఐతే—తెచ్చావా?

మేనక —(అర్థం కానట్టుగా) ఏమిటీ?

విశ్వామిత్రుడు.—ఏమిటా? అంత వళ్లు మరచిపోయినావేం? చూశావా ఎలా పెరిగిందో? (అని వారంరోజుల మాపు కనబడుతున్న గడ్డం నిమురుకుంటాడు)

మేనక.—(తలవంచుకుని, నెమ్మదిగా) లేదు.

విశ్వామిత్రుడు —(ఉరుముతూ) ఎందుచేత ?

మేనక —మరే—

విశ్వామిత్రుడు —మరీలేదు—గిరీలేదు వారదుడిచేత కబురు పంపాను కూడా కాదూ ? ఆ వెధవ చెప్పలా? ఇంత మైమరపా ?

మేనక·—(మోకలించి) కోప్పడవద్దు నేను మరచిపోలేదు లేక—పట్టుకు రాలేదు.

విశ్వామిత్రుడు —ఏం?

మేనక —అబ్బ! అలా కసరకుండా వినండి మొన్ననే సోమయాజులు గార్లందరూ అప్సరలను వరించవచ్చని 'లా' అమలులో పెట్టారు మీకు తెలియదూ?

విశ్వామిత్రుడు —ఆలాగేం · నేను సనాతన సభాసభ్యుణ్ణి కానులే అందుచేత నాకు సర్క్యులర్ రాలేదు ఐతే?

మేనక —ఏమీలేదు వచ్చేవారందరికీ ఇచ్చేటప్పటికి అన్నీ బ్లేడ్‌లా అయిపోయినవి తిరిగి చేయడానికి—విశ్వకర్మకు ఒంట్లో బాగుండక అతడు పనిలోకి రావడం లేదు

విశ్వామిత్రుడు —పోనీ, ఇంద్రుణ్ణి అడిగి ఆతనిదగ్గర ఏమైనా ఉన్నవేమో అడిగి తీసుకు రాలేకపోయినావా?

మేనక —బాగుంటుందా చెప్పండి, మీరే ఆయనకు అక్కర్లేదూ?

విశ్వామిత్రుడు —'అఖిలాప్సరోంగనావిటుడు' కనుక అతనికి గడ్డం మాయకు డదు నాలాటి ఏకపత్నీ

మేనక —(అపవారించి) అది కాదండీ

విశ్వామిత్రుడు —అవును ఆలాటివాడు నాకు రేజర్ ఎందుకు ఇచ్చాడు మొదలు నీవు నన్ను గెడ్డం తీసేసుకోమని ఎందుకు బ్రతిమాలావు? ఇదివరకు నాకు దాని ప్రసక్తి ఏమైనా ఉన్నదా? నీవు వచ్చేటప్పటికి గెడ్డం పెంచుకు కూచోనా? కబురు అందగానే, పంపిస్తావనుకున్నాను పోనీ, ఆలస్యమైనా, నీవు వచ్చేటప్పుడైనా తీసుకు వస్తావను కున్నాను అవును, నీకేం?

మేనక.—ఎందుకూ—ఎదుటపడగానే అలా కసురుతారు? (సమీపించి, సవిలాసంగా) మీరు, ఏలా ఉన్నా నాకు బాగానే ఉంటారు

విశ్వామిత్రుడు —చాల్లే నీ మాయవేషాలు కట్టిపెట్టు

మేనక (మారు మాటాడకుండా దూరంగాపోయి నిలుచుంటుంది)

విశ్వామిత్రుడు.—ఏం? మాట్లాడవేం?

మేనక (క్రిందికి చూస్తూ, ఆలాగే ఉండిపోతుంది)

విశ్వామిత్రుడు — ఈలా రా కదలవేం? ఊ॰, రా ఇక్కడికి

మేనక —(సమీపిస్తుంది)

విశ్వామిత్రుడు —కనుక, నీవూ వాడూ ఆలోచించుకుని చేసిన పని అన్నమాటా, ఇది?

మేనక — . .

విశ్వామిత్రుడు —నా తపస్సు విఘ్నం చేయడానికి, నా బవిరిగెడ్డం, నా ఊర్ధ్వ జటాజూటం పోయేందుకు, నీవూ ఇంద్రుడూ పన్నిన పన్నాగమా ఇది? మీ అక్కర తీరింది కనుక—నేనిక ఏలా పోతే మీకేం? నా గెడ్డం మాసి, చేసుకునేందుకు బ్లేడులేక, నేను ఎంత అవస్థ పడుతూంటేమాత్రం నీకేం? అమ్మా, ఎంతవాళ్లు అప్సరలు! మానవాంగనలకుండే కుత్సితాలన్నీ మీకూ ఉన్నాయి! (ఏమన్నా మేనక కిక్కురుమనకపోవడం చూసి) కానీ, మీపని చెప్తాను శిష్యా!

శిష్యుడు —(వింగ్‌లోంచి తొంగిచూసి, తల ఊగిస్తాడు)

విశ్వామిత్రుడు —ఓరి, శంభయ్యా! అలా దిక్కులు చూస్తావేం· ముందుకురా· (శిష్యుడు సమీపిస్తాడు) ఆశ్రమంలోకివెళ్లి తైత్తిరీయం రెండో కట్టచాటున రేజరున్నూ, సామసంహితలో పాత బ్లేడున్నూ ఉన్నాయి, పట్టుకురా (శిష్యుడు వెడతాడు.)

ఎంతో అనుకున్నా నీవు అమ్మాయిని, చిట్టితల్లిని ఎత్తుకు వచ్చేటప్పటికి, చక్కగా షేవ్ చేసుకుని అందంగా ఉండాలని కానీ, ఇంతచేసిన తరువాత—నీవు నాకు అక్కరలేదు. నామీద మనసు తీరగానే నన్ను ఇలా పరాభవిస్తావేం? సరేలే. నీ రేజరు

నీవు వట్టుకెళ్ళు: ఇంద్రుడి మొఖాన కొట్టావని చెప్పు: ఎవడిక్కావాలి: మళ్ళా ఏ ఋషి నన్నా చెరపడానికి బయలుదేరేటప్పుడు ఉపకరిస్తాయి.

మేనక:—(కంగారుపడుతూ లోపలికి సైగ చేస్తుంది. దాది పసిపాపతో ప్రవేశించగా, తాను అందుకుని, అతన్ని సమీపించి) నన్ను మన్నించండి. నేను చేయాలని చేయలేదు. మీకు గెడ్డం పెరగడం నాకుమట్టుకు ముచ్చటా? పోనీ, నామీద కోపమైతే ఈ పసికందును, మన ప్రేమాంకురాన్ని చూసిఐనా ఊరుకోండి. చూడండి, ఏలా చేతులుజాస్తూ ఎత్తుకోమంటూందో, బంగారుతల్లి. తీసుకోరూ?—ఆ నవ్వని పాలబుగ్గలమీద, నవ్వితే, ఏలా సొట్టపడుతూందో! చూడమ్మా! మరే, నాన్నకే కోపం వచ్చిందికాని......(పసికాపాపను అతనికి అందీయబోయింది.)

విశ్వామిత్రుడు:—(రవివర్మ బొమ్మలో పోజుతో ఓ చేయి నెత్తిమీదకు ఎగజాపి వారిస్తాడు.)

మేనక:—(కొంచెం వెనుకకు తగ్గి) ఎంత కఠినులండీ.

విశ్వామిత్రుడు:—కఠినుణ్ణా ?

మేనక:—ఆఁ......తపస్సు కఠినం: ఆచరణ కఠినం: చివరకు......మనస్సు కూడా,

విశ్వామిత్రుడు:—అవును: కఠినమ్మైతే—నీ మెర మెచ్చులకు కరగిపోకుండా. ఉండేదే. (శిష్యుడు వచ్చి రేజరూ, బ్లేడ్లూ అందిస్తాడు భయపడుతూ) దౌర్భాగ్యుడా ఎక్కడకు వెళితే అక్కడే పాతుకునిపోతావేం? (మేనకవైపు రేజరు విసిరివేసి) తీసుకుపో, వెళ్ళు.

మేనక:—ఇది తగునా?

విశ్వామిత్రుడు:—భేషుగ్గా.

మేనక:—అవును. మనసు మారిపోయినప్పుడు.....నెపం నామీదనే వేసి తప్పించుకోవాలని మీ పన్నాగం: నాకు తెలుసులెండి. వెళ్ళిపోతాను.

విశ్వామిత్రుడు:—శీఘ్రంగా.

మేనక:—ఉండనులెండి. మీ పాపను మీరు తీసుకోండి.

విశ్వామిత్రుడు:—మీపాప—మాపాప! ఇష్టం లేకపోతే పారవెయ్యి.

మేనక:—అలాగే. లేకపోతే, మనకు పిల్లలు ఎందుకూ!

విశ్వామిత్రుడు:—ఎందుకూ! నీవు చేసిన పనే, పెద్దదై అదీ చేయడానికి. కానీ ఇది వృథాగా పోదులే. రేజర్‌వల్ల నీకూ నాకూ ఎడబాపులైనవి కదా. నీ సంతానానికీ అదే-శాపం! రేజరే!

ఛీ! మాయలోపడి ఎంత తపఃఫలం వ్యర్థం చేసుకున్నానూ!

(వెళ్ళిపోతాడు. మేనక, అప్సర అలా నిలవబడి, కదలక ఉంటారు.)

## రెండో రంగం

[కులపతి కణ్వుని తపోవనం.
అవతలగా ఆశ్రమకుటీరములు కనబడుతూ ఉన్నవి.
మాధవీ నికుంజము దగ్గర శకుంతల నిలుచుని ఉంటుంది]

శకుంతల:— (చేతిలోఉన్న రేజర్ కనబడేటట్టు పట్టుకుని చూస్తూ)

బేజరూరు వగలేనా
మోజు తీరిపోయెనా
రేజరా
గడ్డమంటె చెప్పి వలపు
కాని పిలువనంప మనవే.
బ్లేడు కరుకు పూములుకుల
వాడి అబ్బ! సైపలేనే!

ఎన్ని మాయలు, ఎన్ని నమ్మికలు, అన్నీ మరచిపోయినాడా! అంతఃపురాంగనల వలలోపడి, నన్ను అన్యాయం చేయడం—

(అనసూయవచ్చి (సమీపించి)

అనసూయ:—ఏమి......చేయడం?

శకుంతల:—. . . . . . . . . .

అనసూయ:—కదులు. ముహూర్తం దాటిపోతుంది. కులపతి, బ్రహ్మలోకానికి వెళుతున్నారు. నిన్ను శార్జ్గరవుని తోడు తీసుకోమన్నారు.

శకుంతల:—(కోపంగా) నేను వెళ్ళను. నగరు చేరుకోగానే పిలిపించుకుంటానని చెప్పి ఇలా వంచన చేస్తాడా? పోనీ, తన పేరే తలుచుకుంటూ బ్రహ్మచారిణిగా ఆశ్రమంలోనే ఉండిపోతాను. ఆయనకు అంత బెట్టా?

అనసూయ:—కాదమ్మా! రాచకార్యాలు—

శకుంతల:—రాచకార్యాలు!! అవే నాకన్న ఎక్కువైతే నే నెందుకేం? తేరగా దొరికానని, ఏమీ తెలియనిదాననని అంత చులకనగా చూస్తాడా? (వ్రేలితో బెదరిస్తూ)ఆమాట నావద్ద ఎత్తావంటే—

అనసూయ:—వినవూ?......నీమాటల కేమిలే, నేను చూడటం లేదూ, ఎప్పుడెప్పుడని కాచుకొని కూర్చోడం? కొంచెం అలికిడి అయితే సైన్యం వస్తూన్నదని ఎదురు చూసిక ఉలికిపోవడం (రేజరును చూపించి)—అదిగో, వెళ్ళేటప్పుడు నీ దగ్గర వదిలేయలేదూ జ్ఞాపకానికి? దాన్ని ఒక్కక్షణమ్మైనా ఎడబాస్తున్నావా? మునుపటిలాగా నీతీవలను కన్నతల్లిలాగా పెంచుకుంటున్నావా? హరిణ బాలలకు నవ తృణాంకూర ప్రాశనము చేస్తున్నావా? నిదుర లేచినది మొదలు రేజరును మెరుగుపెట్టడం తలచుకుని మురియడం, ఎన్ని నేర్చుకున్నావమ్మా!



శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి షష్టిపూర్తి; అధ్యక్షుడు: శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

[1936 ధాత సంవత్సరాదిసంచికనుండి]

శకుంతల:—(రేజరును దూరంగా విసిరి) నన్ను మోసంచేసినవాళ్ళు—ఇంతే!

అనసూయ:—(తీసి అందీయబోతుంది.)

శకుంతల:—అక్కర్లేదు. నీవు నాతో మాటాడవద్దు.

అనసూయ:—మాటాడను లే. ఇక మీ ఊరికిపోయి మహారాణివైన తరువాత సరే, ఇప్పటినుంచే ఇంత అధికార గర్వమా? కానీలే—

శకుంతల:—నాతో మాటాడవద్దు. ఇక్కడనుంచి వెళ్ళిపోతావా, నేను వెళ్ళనా?

అనసూయ:—మెదలకుండా ఉంటానులే. నా కెందుకు, అయినా, మీ దంపతుల సంగతి? మీలో మీకు ఏమేం ఉన్నాయో, ఏం?

శకుంతల:—......................

అనసూయ:—కూర్చో.

శకుంతల:—ఊహుఁ.

అనసూయ:—పోనీ, నవ్వు.

శకుంతల:—ఊహుఁ. కూర్చోను, నవ్వను—నీతో—

అనసూయ:—మాటాడవు. అయితే ఏం చేస్తావు?

(దూర్వాసుడు వస్తాడు. శకుంతల, అనసూయ ఎడపెడగా తిరిగి నిలుచుని ఉంటారు.)

దుర్వాసుడు:—ఓం శన్నో అస్తు.....ద్విపదే

(ఎవరూ కదలరు.)

శం చతుష్పదే.

(విని, అటు చూడకుండా నవ్వుతారు. దూర్వాసుడు కొంచెం పకిలిస్తాడు: ప్రయోజనంలేక, రాచుకునేట్టుగా సమీపించి)

నేను వచ్చానర్రా: (కొంచెం తటపటాయించి వెళ్ళి, మావిగున్న మొదల వేదిక మీద కూర్చుని)

దూర్వాసుడు:—అతిథిపూజ—

(శకుంతల, అనసూయ వినరు)

అర్ఘ్యం, పాద్యం—

(వాళ్ళు వెనుకటిలాగానే ఉంటారు: ఆయన ధూకుడుగా వాళ్ళమీదకు వెళ్ళి)

తెస్తారా లేదా పూజాద్రవ్యాలు? (వాళ్ళు చలించరు) శపించనా ఇక తిరుగకుండా! కాచుకోండి (కొంచెం తమాయించి) చిత్ర ప్రతిమలలాగా కదలరేం? మీకు మతిపోయిందా? దివ్యఋషిని—దర్శనం అనుగ్రహించాను. పూజించండి—తరించండి! ఇప్పటికీ చెప్తున్నాను. చెడిపోకుండా—(ఊరుకుని నిదానంగా) ఏమిటీ వింత? (దివ్యదృష్టి సారించి) హుఁ. పడుచుదనం పొగరు! శకుంతలా ఈ అవజ్ఞకు ఫలం అనుభవించు. రాజును తలచుకునే కళ్ళతో నన్ను చూడలేవేం? అతనిమీద కోపం నామీద చలాయిద్దామనుకున్నావేం? చూసుకో—(శాపోదకం, అభిమంత్రితం, విడుస్తూ) నిన్ను దుష్యంతుడు మరచిపోతాడు. (అంగలో దాటిపోతాడు.)

అనసూయ —చండకోపి—శాపం—అమోఘం

శకుంతల —కానీ, ఎన్ని కష్టాలు వస్తాయో గానీ నా విధి వ్రాత! (దుఃఖిస్తుంది)

అనసూయ —రా పోయి ప్రతిమాలుకుని ప్రసన్నుని చేసుకుందాం

(శకుంతలను బలవంతంగా లాక్కుని వెళుతుంది స్టేజి ఒక నిమిషం ఖాళీ. అంతలో ఇద్దరూ తిరిగి వస్తారు)

శకుంతల —మాయమైనాడు

అనసూయ — (తల ఊగిస్తుంది)

శకుంతల —ఏం చేయను? ఎవరిని వేడుకోను? ప్రభూ! నీవు కనికరించినందున కదా ఈ దాసికి ఇన్ని అగచాట్లు! ఏలా బ్రతుకను? ఎందుకు— (కూలబడుతుంది)

అనసూయ —సఖి! ధైర్యం తెచ్చుకో అలా విచారించకూడదమ్మా! అన్నిటికీ గౌరీ మహాదేవి ఉన్నది ఆమెకు దయరాదా! (కళ్ళనీరు పెట్టుకుంటుంది)

(నారదుడు ప్రవేశం వెంట గానం)

నారదుడు — లోకైక సుందరాననా—దురా
లోక శ్మశ్రు రహితా
నాకవామలోచనా మ
నా కమలాసహితా

(శకుంతలస్థితి చూస్తాడు మహతిని తీసి) ఎప్పుడూ ఒకటే మ్రోతా! (క్రిందపెట్టి) కిక్కురుమనకుండా ఊరుకో, వేళాపాళా లేదూ (బిగ్గరగా) నారాయణ, నారాయణా!

శకుంతల —(లేచి నిలుచుని) నమస్కారం దయచేయండి.

నారదుడు —కల్యాణి! భర్తృసహవాససిద్ధిరస్తు!

అనసూయ — నవ్వుతూ అయితే పెద్ద పేచీ వస్తుంది!

నారదుడు — (ఉలికిపడి) ఏం?

అనసూయ —ఇప్పుడే—దూర్వాసమౌని శాపం యిచ్చి వెళ్లారు!

నారదుడు —ఎందుకూ?

అనసూయ —ఎందుకేమిటి—శాపానికి? ఆయనకు అలవాటే కదూ? ఇవాళ మేం కనబడ్డాం!

నారదుడు —అయితే మాత్రం?

అనసూయ —కాలినిబడ్డ పాము కరవక మానుతుందా? ఊరికేవచ్చి, ఒక్క శాపమైనా ఇయ్యకుండా వెళితే పరువు తక్కువకాదూ? అయినా, తెలియక అడుగుతాను, మీలో మీరు కూడబలుక్కోరా, ఏం, కర్మం? ఒకరు శాపం, వారి వెనుక మరొకరు వరం! పేచీలు ఎందుకు పెట్టుతుంటారు? పోనీ, పెద్దవాడు, ఆయనమాట గౌరవిద్దాం, మీ ఆశీర్వచనం ఉపసంహరించుకోండి

నారదుడు —ఏమిటీ! ఉపసంహరించుకోవడమే!—బ్రహ్మ వాక్కు!

అనసూయ —మరి, దూర్వాసమౌనీంద్రుని ది?

నారదుడు —ఆ సంగతి తరువాత ఆలోచించుకోవచ్చును అసలు జరిగిన కథ ఏమిటో

అనసూయ —ఆం పాడిందే పాట! నేను చెప్పలేను మీరు యోగదృష్టితో—

నారదుడు —ఊహూం తెలిసింది మహామంచి పట్టులో చిక్కాడులే ముసలాడు మరచిపోతాడనుకున్నాడు కదూ అప్పుడు బ్రహ్మచారికేం తెలుసును? కమండలు, జలం ఉన్నాయికదా అని అవక తవకలు చేయడమే! కానీ, తెలిసివస్తుంది నేనే గెలుస్తాను

అమ్మాయీ! తిరిగి ఆశీర్వదిస్తున్నాను భర్తృసమాగమ

శకుంతల —అనసూయా! చూడు, ఆ లేడిపిల్ల తుంటరితనం తల్లిదగ్గరనుంచి పారిపోతున్నది పట్టుకుంటాను (తొందరగా వెళుతుంది)

అనసూయ —అప్పుడే ఎందుకమ్మా అంత సిగ్గు! (నారదునితో) పిచ్చితల్లి! సంబరం దాచేసుకోవాలని వెళ్లిపోయింది రేజరు వెదుకుతూ ఇక్కడే పడవేసింది— ఈ పొదలో—అరే! ఏమైందీ? కాస్త మీరు కూడా వెదకండి

నారదుడు —ఏం రేజరు?

అనసూయ —ముందు వెదకండి

నారదుడు —కాదు, చెప్పాలి! ఆం అక్కర్లేదులే—నా దివ్యదృష్టి ఉన్నదిగా తెలుసుకుని ఓహోహో ఇంకేం? సాధించాను! శకుంతలను మరచిపోయినా, రేజరు చూడగానే దుష్యంతుడు యిల్లాలిని ఏలుకుంటాడు!—చూడు జాగ్రత్తగా (ఇద్దరూ వెదుకుతారు)

అనసూయ —పోయింది

నారదుడు —ఊం ఇంతలో ఏమవుతుంది?—శకుంతల పట్టుకు వెళ్లిందేమో?

అనసూయ —లేదు మనం చూస్తూనే ఉన్నాం కాదూ? ఇదంతా శాపమే! మళ్లా మహాసముద్రంలో—

నారదుడు —పరవాలేదు, నేను ఉన్నాను కదూ

అనసూయ —ఏమై పోయిందంటారు?

నారదుడు —అదే చెప్పడానికి వీలు లేకుండా ఉన్నది విచారిస్తాను దివ్యదృష్టి ఒక—విషయంలో రెండుసార్లకన్న పనిచేయదు లేకపోతేనా—

అనసూయ —మీరే రక్షించాలి ఇప్పుడు పెద్ద దిక్కు ఎవరూ లేరు

నారదుడు —మరేం భయంలేదు శకుంతలను అత్తవారింటికి పంపించివేయవచ్చును తరువాత భారం నాది

అనసూయ —అలాగే

---

ఎవరికి తెలుసు, ఇరవై సంవత్సరములలో నేను

సిగరెట్టు కాల్చికాల్చి క్షీణించెదనో —
సారా త్రాగిత్రాగి మతిచెడియుందునో -
బలిష్ఠుడనై గర్వించెదనో -
తీరనై ఉండూ ఉండెదనో - ఐశ్వర్యవంతుడనయ్యెదనో - విప్లవకారుడనయ్యెదనో
దాసానుదాసుడనయ్యెదనో - స్త్రీలోలుడనయ్యెదనో - యతినయ్యెదనో -

తలిశెట్టి రామారావు

ఎవరికి తెలుసు [1936 ధాత సంవత్సరాదిసంచికనుండి]

శిల్పప్రదర్శనమును జూడవెళ్లిన వైద్యుడు పరధ్యానముతో

తలిశెట్టి రామారావు

అలవాటు—3 [1936 ధాత సంవత్సరాది సంచికనుండి]

నారదుడు —వెళ్ళివస్తాను (నిష్క్రమిస్తాడు)

అనసూయ —ఇదిగో—ఏమండోయ్ (పిలుస్తూ వింటారా వెళుతుంది నారదుడు వస్తాడు)

నారదుడు —ఇప్పుడు వెళ్ళి తిరిగి వస్తా

అనసూయ —ఎందుకు కాదు, ప్రియంవదా! మీ—మహతిని వదిలివేసి వెళుతున్నారేం—ఇదుగోండి

నారదుడు —(అందుకుంటూ, ఆ ప్రోవే, అనుకోకుండా) మహతిని కాదు, మనసే మరచిపోయినాను ఇంకా ఏంవెం బుద్ధికు ఉరుకుతాడు)

అనసూయ —కొంచెంసేపు—(నారదుని వెక్కిరిస్తూ చేయి అలా అని) కుంతి ఆప్రయత్నం చేయాలి కన్ను గీటి చూపి పారిపోతుంది)

(గానం)

ఏమంటివలా మదా

ధరణా, మురమోహనా

లోకైక సుందరానవా

నారదుడు — ఊరుకో సంగీతం పాడుతుంటుగానే ఉన్నది మనసు ఎని! (గానం ఆగి పోతుంది)

(నడచిపోతాడు)

## మూడో రంగం

[రాచనగరిలో విహారమందిరం సన్నజాజుల దండును పదిలముగా పుచ్చుకొని చేటి]

చేటి — (పరిక్రమించి) ఏగీ, ఇక్కడ ఎవరూలేరేం? ప్రమదవు ఈవైపు వచ్చినారని కంచుకి చెప్పాడే? ముసలితాతకు దృష్టిదోషం వచ్చిపోతూన్నది కంటికి కనబడ్డ వారందరూ మహరాజులే

(ప్రతీహారి ప్రవేశించి, చేటినిచూసి)

ప్రతీహారి —మహరాజులే! నీ స్వయంవరానికి నేను చాలనా!

చేటి —(తిరిగిచూసి) నీవు ఉన్నావు బాబూ, ఇక్కడ—

ప్రతీహారి —నీతోడు నీడను నిన్ను చూడకుండా నిమిషం ఉండగలనా? సుదినం! పూలమాల కూడా ఉన్నది కదా—అన్నీ కలిసివచ్చినాయని స్వయంవరమన్నాను—సై (సమీపించి) ఎంత అందంగా ఉన్నావు?—నిన్ను ఇహ వదిలిపెట్టలేను! జాజులు రేకలు విచ్చినట్టుగా నీ చిన్నారి పెదవులతో—ఏగీ చిరునవ్వు

చేటి (నవ్వుతూ) జాజులందమా—రవల

గాజులందమా—బావా

ప్రతీహారి — చందమామ వెలుగు నీడ

సరసమందమా

చేటి — ఎరుల కందరాని మోవి తేనె

విందులందమా

ప్రతీహారి —అందాలరాణి—ఏ అందమైనా సరే! స్వయంవరందాకా ఆగలేను!—గాంధర్వం—(పట్టుకోబోతాడు)

చేటి —(చిక్కకుండా తప్పించుకుని) ఉండు, ఎవరన్నా చూస్తారు!—మహరాజు (దూరంగా వెళ్ళి నిలుచుంటుంది)

(దుష్యంతుడు వస్తాడు కుడిపక్కగా ఉన్న ఆసనంమీద కూర్చుని ఆలోచనతో)

దుష్యంతుడు —కుడి, ఎడమ కన్నులు ఏంటులు వేసుకొని అదురుతున్నవి ధర్మ నిర్వహణంలో ఏమైనా లోపం చేశానా? మనసు కూడా కలవరపడుతూన్నదే! (ప్రతీహారిని చూసి) పురోహితులు సోమరాతులవారిని పిలుచుకునిరా

(ప్రతీహారి వంగి, నమస్కరించి వెళుతాడు)

చేటి —(ముందుకువచ్చి) దేవా! మహారాణి వసుమతీదేవి పంపిన ప్రేమోపహారము

దుష్యంతుడు —(దండను మెడలో వేయించుకుంటూ) దేవితో, కానుకను కనులకు అద్దుకొన్నానని చెప్పు

చేటి —(చేతులు జోడించి, వినయంగా) తమ దర్శన భాగ్యాన్ని కలుగచేయమని మనవిచేసి రమ్మన్నది దేవేరి

దుష్యంతుడు —మంచిది, అలాగే

(చేటి నిష్క్రమిస్తూండగా, సోమరాతుడు ఎదురు అవుతాడు అయనకు నమస్కరించి, వెడలిపోతుంది పురోహితునికి కొంత వెనుక ఒక ఇద్దరు మునికుమారులు, శార్ఙ్గరవుడు—శకుంతల మేలి ముసుగుతో

వీరిని చూసి దుష్యంతుడు లేచి నిలుచుంటాడు సోమరాతుడు ముందుకు రెండడుగులు వేస్తాడు మహరాజు నమస్కరిస్తాడు)

సోమరాతుడు —వత్స! ఆయుష్మాన్‌భవ! (వచ్చినవారిని చూపిస్తూ) వీరు కులపతి కణ్వుని దగ్గరనుంచి శుభ సందేశము తీసుకుని వచ్చారు శ్రౌతవిధిచేత, ఉచిత సత్కారములు చేసి, వెంటబెట్టుకుని వచ్చాను

దుష్యంతుడు —కణ్వ సందేశమా? తపోధనులకు నమస్కారములు ఇలా దయ చేయండి

(ముని కుమారులు కూర్చుంటారు శార్ఙ్గరవుడు అతని వెనుక శకుంతల నిలుచునే ఉండిపోతారు)

పూజ్యులైన కణ్వులకు కుశలమా? మీ తపస్సు నిర్విఘ్నముగా సాగుతూన్నదా?

శార్ఙ్గరవుడు —ధర్మ రక్షకులైన మీరు ఉండగా మాకు కొరత ఏమిటి? గురుపాదులు కుశల పూర్వకంగా ఇలా కబురు పంపినారు.



ఆంధ్రుని చిత్తవృత్తి [1936 ధాత సంవత్సరాదిసంచికనుండి]



పరధ్యానముగా వకీలు భార్యతో
నా మాట నమ్మకపోతే ఎఫిడవిట్టు దాఖలుచేస్తా

అలవాటు—4 [1936 ధాత సంవత్సరాది సంచికనుండి]

# OR WO

# ఆర్వో రోల్ ఫిల్మ్

## ధ ర లు

### బ్లాక్ అండ్ వౌయిట్ NP 22

| | | |
|---|---|---|
| 120 620 | | రు. 2 33 |
| 127 | | 2.21 |
| 135/36 కాసట్స్ | | 6.01 |
| 635/36 రీల్స్ | | 4 40 |
| 127 | NP 27 | 2.56 |

### ఆర్ వో కలర్

| | |
|---|---|
| NT 18 నెగటివ్ ఫిలిం 120 | 9.03 |
| UT 16 రివర్సల్ ఫిలిం 135/20 | 8.49 |

అమ్మకం పన్ను, యితర
స్థానిక పన్నులు అదనము

ప్రోసెస్ చేయుటకు : బాంబే ఫోటో స్టోర్సు, 33/34, పార్క్ వీధి, కలకత్తా-16.
G. K. వేల్ & కంపెనీ, (NT 18 నెగటివ్ మాత్రం) మౌంట్ రోడ్, మద్రాసు-2




**VEB FILMFABRIK WOLFEN**
German Democratic Republic

ఆర్వో ఫిలింస్ ఈస్టరన్ యూనిట్
మద్రాసు-2 — — కలకత్తా 13

దుష్యంతుడు —ధన్యుడను వారి ఆజ్ఞ ఏమిటి?

శార్‌ఙ్గరవుడు —"నాయనా! గాంధర్వాన నా కూతురిని వరించడం తెలిసికొని సంతోషించాను నెల మసలిన ఈమెను నీ చెంతనే ఉంచుకోడం మంచిది" అని చెప్ప మన్నారు

దుష్యంతుడు —ఇవి ఏం మాటలు? (చిరునవ్వుతో)సాత్త్వికమూర్తులు—పరిహాసకుశలులే ని తెలియ చెప్పడమా?

శార్‌ఙ్గరవుడు —పరిహాసమా?

దుష్యంతుడు —కాదా, మరి? అయినా, కానీయండి మీరు పూజ్యులు! (శకుంతలను చూపించి) ఈ గర్భవతియేనా కణ్వులు నాకు పంపిన భార్య?

శార్‌ఙ్గరవుడు —ఈమెనే నీవు వరించినది

దుష్యంతుడు —అబద్ధము!

శార్‌ఙ్గరవుడు —ఆఁ శాపాయుధులమని మరచిపోతూన్నారు

దుష్యంతుడు—లేదు మహాప్రసాదము! కాని కడుపుతో ఉన్న పిల్లను భార్యగావరించ వలసినదనే ఆదేశము—శిరసా వహించాలా, శాపానికి ఒడిసి?

శార్‌ఙ్గరవుడు —ఈలా, ఉమాయకురాలిని వంచనచేయడం కూడా రాజ ధర్మాలలోదేమో? అరణ్యాంలో ఉండే మాకు ఏం తెలుస్తుంది? మా పని మేము చేశాం ఇక నీయిష్టం ఏలుకున్నాసరే, లేక—

(శకుంతలతో) ఏమమ్మా! చూశావా, ఈయన వాలకం! పోనీ, చూసిఅయినా పోల్చుకుంటాడేమో, ముసుగులీయి ఇప్పుడు సిగ్గుపడితే ఏలా? (ముఖం చూపిస్తుంది)

(మహారాజుతో) చూడండి, ఈమె ఎవరో

దుష్యంతుడు —ఈమె ఎవరు?

శకుంతల —నాథా!

దుష్యంతుడు —నాథా!—ఇంత విపరీతమా? అమ్మాయీ నీవు పసిదానవులాగా ఉన్నావు అప్పుడే ఇన్ని మాయలు ఏలా నేర్చుకున్నావమ్మా?

శకుంతల —మాయలా! ఎవరివి?

దుష్యంతుడు — తెలియడంలేదూ?

శకుంతల —మళ్లా అనండి, ఆ మాట

దుష్యంతుడు — అంటాను నాకేమి భయం?

శకుంతల —అప్పుడు ఇంత దుర్మార్గానికి, మోసానికి ఒడిగట్టిన మీకు (దగ్గరకు వెళ్లి) కోపమా నామీద? మీరు ఎప్పుడు రమ్మంటారా అని కాచుకుని ఉండి ఉండి, స్వతంత్రించి వచ్చినందుకు మన్నించండి

దుష్యంతుడు —నాకేమీ అర్థం కావడంలేదు

శకుంతల —అల్లాగా? ఏమీ తెలియనివారు నన్ను మాయచేసి, ఏలా వరించి, నమ్మిక లిచ్చి

దుష్యంతుడు —ఊఁ కథ అల్లు—

శకుంతల —పౌరవా! ఇది మీకు తగదు! అప్పుడే మరచిపోయినారా? మన చెలిమికి సాక్షిగా సేఫ్టీరేజరును, మా తండ్రి, మా అమ్మకు యిచ్చిన దానిని మీకు నేను సమర్పించలేదా? ఆశ్రమంలో ఉన్నంతకాలం మీకు అనుదినమూ నేను అమరించి యిచ్చే దాన్నికదా? అప్పుడు మీ నున్నని చెక్కిళ్లు ఎంత ముద్దొచ్చేవి? తోటి చెలికత్తెలు నన్ను చూసి ఎంత అసూయపడేవారు! జ్ఞాపకంలేదూ, మొదటిసారి మీరు రేజరు పట్టుకోవడం చేతగాక, గంట్లు పడితే, నేను మందార రేకులు తీసుకువచ్చి అద్దలేదూ? ఏం, చూడండి, మీరు షేవ్ చేసుకుని అక్కడ పడవేసిపోతే తీసి దాచేసి, అల్లరిచేస్తే 'రేజర్ ఒక యెత్తూ, నేను ఒక ఎత్తూ' అని మీరు నన్ను ఎంత బ్రతిమాలుకుని, అనితరజన లభ్యమైన ఆ దేవప్రసాదాన్ని నేను నవ్వుతూ యివ్వగా, కళ్ల నద్దుకుని, మీ భాగ్యదేవతనని కౌగిలించుకోలేదూ? ముద్దు పెట్టుకుంటామని మీరు ఎంత ఉబలాట పడినా, మూడు రోజులూ గెడ్డము పెరిగి గరుకుగా ఉన్నదని నేను తప్పించుకుంటే, నామీది మక్కువతో మీరు, సాయంకాలమైనప్పటికీ, ఎవరూ చూడకుండా అప్పు డప్పుడు గెడ్డం చేసుకుని, కలకలలాడుతూఉంటే, నిలువలేక నేనే మీ కౌగిలిలో వాలి పోయినాను కదూ? చివరకు, మీరు ఇక్కడకు వచ్చేస్తూ, రేజరు వెంట పట్టుకువెళతా నంటే, మీ నున్నని గడ్డం చూసి ఎవరైనా మాయచేసి వలలో వేసుకుంటారని, నేను ఇయ్యకుండా ఉట్టి చేతులతోనే పంపాను కాదూ? చూసుకోండి, ఎంత పెరిగిపోయిందో! అచ్చంగా కిరీటం పెట్టుకుని, వేషం వేసుకున్న ముని కుమారుడులాగా ఉన్నారు (దుష్యంతుడు ఉలికిపడి గడ్డం తడుముకుంటాడు) ఏం, గడ్డమంటే అయినా నేను జ్ఞాపకం వచ్చానా? (మీద చేయి వేస్తుంది)

దుష్యంతుడు —(సంభ్రమంతో) రేజరు! ఏదీ రేజరు?

శకుంతల —(దీనంగా) లేదు, పోయింది!

దుష్యంతుడు —అవును, ఆలాగే పోతుంది ఎంత మోసం!

**శకుంతల—నమ్మరూ, ఇంకా ఇప్పటికీ నమ్మరూ?—నిజంగానే పోయిందండీ.**

దుష్యంతుడు —ఇక చాలించు—నీ వేషాలు వచ్చిన త్రోవను నడు

శకుంతల —ఎక్కడికి పోను?—మీ భార్యను—

దుష్యంతుడు —ఆమాట అంటే ఊరుకోను భార్యవా?

శకుంతల —కానా?

దుష్యంతుడు —నీవు ఎవరో నాకు తెలియదు వెళుతావా, లేదా?

శార్‌ఙ్గరవుడు —(ముందుకువచ్చి) ఏమిటయ్యా నీ ఆగడం? మాలో మీరు రాజీ పడరా? ప్రణయ కలహమేమోనని ఊరుకున్నాను, చూస్తూ పొగరుబోతుతనం మాని ఏలుకుంటావా సజావుగా, శపించనా? (చేయి జాస్తాడు)

శకుంతల —వద్దు, వద్దు నా నాథుని ఏమీ చేయవద్దు నన్ను చూసి అయినా—

శార్‌ఙ్గరవుడు —ఊహుఁ వీల్లేదు ఎత్తిన చెయ్యి ఊరికే క్రిందకు దించ కూడదు శపించి తీరాలి! ఏం, రాజా?

(నారదుడు, కణ్వుడు ప్రవేశిస్తారు)

నారదుడు —(శార్‌ఙ్గరవునితో)ఏం, పిట్ట కొంచెమైనా కూత ఘనంగానే ఉన్నదే? చదువంతా అయిపోయి, శాపప్రయోగాలదాకా వచ్చావూ?

(దుష్యంతునితో) ఏం రాజా, క్షేమమా?

దుష్యంతుడు —(మాటాడకుండా ఉభయులకూ నమస్కరిస్తాడు)

శకుంతల —నాన్నగారూ (కణ్వుని కౌగిలించుకుంటుంది)

నారదుడు —(కణ్వునితో) ఏమండీ, ఊరుకుంటారేం? చేసిన ఘనకార్యం పెట్టండి, ముందు మీ అల్లుణ్ణి పలకరించండి

కణ్వుడు —(శకుంతలతో) ఊరుకో తల్లీ! నీకేం భయంలేదు అంతా నా పొర బాటు

దుష్యంతుడు —పెద్దలు—నిలుచునే ఉండటం భావ్యంకాదు దయచేసి ఇలా—

కణ్వుడు —నాయనా! పెద్దల అభావ్యపు పనులే ఇంతవరకూ తెచ్చినవి నా తప్పు ఒప్పుకుని మీరందరూ క్షమిస్తేనే కాని కూర్చోను

దుష్యంతుడు —దైవసములు—మీరు తప్పుచేయడం—

కణ్వుడు —విధి విధానం బాబూ! ఆకలముంతో జీవనంచేస్తూ, అడవిలో పడి ఉండటం మాకు తగిందికాని తగుదుమని నాగరికవేషం వేస్తే ఊరికే పోతుందా?

దుష్యంతుడు —మీ మాటలు వింతగా ఉన్నవి

నారదుడు —వినండి! ఇంకా ఉన్నవి విశేషాలు.

కణ్వుడు —మహాపరాధం—

దుష్యంతుడు —మీరు మాటి మాటికీ అలా నిందించుకోవడం మహారాజాకు విస్మయనంగా ఉన్నది

కణ్వుడు —(శకుంతలతో) అమ్మా, నన్ను మన్నించవూ?

శకుంతల —(ఆశ్చర్యంతో) ఇదేమిటండీ?

రైలు టిక్కెట్లు కొనుటకు వెళ్లినవర్తకుడు పరధ్యానముతో: 'డజను కొంటే ఎంత కమిషనిస్తారు'

తలిసెట్టి రామారావు



[1936 ధాత సంవత్సరాది సంచికనుండి]

కణ్వుడు —కాదుతల్లీ! నీకు యిన్ని కష్టాలు వచ్చింది నా తెలివితక్కువతనం వల్లనే

నారదుడు —ఉపోద్ఘాతం తెగ పెరిగిపోతూంది ఇకనైనా ఉపక్రమిస్తారా, లేదా, అసలు విషయం? మహా మునీ (సైగతో ఏదో జ్ఞాపకం చేసి) వెళ్ళవద్దా—

కణ్వుడు —(నవ్వుతూ) చల్లేవోయ్—ఇక

నారదుడు —ఉండండి (ఏకాంతికంగా) ముందు చూపించవద్దా? శాపమైకం పోయి జ్ఞాపకం రానిదే మీ మాటలు ఏలా నమ్ముతాడు?

కణ్వుడు —అవును (రేజరుతీసి అందరికీ చూపించి, నిదానంగా మహారాజు సమీపంలో బల్లమీద పెడుతాడు)

దుష్యంతుడు —(నిద్ర మేల్కొనినవాడిలాగా సంభ్రమంతో) రేజరు, రేజరు! (కలయజూసి) శకుంతల, నా శకుంతల!

(నారదుడు, కణ్వుడు ఒకరి నొకరు చూసి నవ్వుకుంటారు)

శకుంతల —నాథా! (కౌగలించుకుంటారు ఉభయులూ)

నారదుడు — (కొంచెంసేపు ఊరుకుండి) ఇక, అందరం కూర్చుందామా?

(మహారాజు కూర్చుంటాడు ఆయన పరుసన శకుంతల—నిల్చుని మిగిలిన వారందరు ఎదురుగా కూర్చుంటారు కణ్వుడు—కమండులం, దర్భాసనం శకుంతలకు అందిచ్చి, నిలుచునే)

కణ్వుడు —రేజరు నేను తెచ్చా!

శకుంతల —మీరా?

కణ్వుడు —అవును!

నారదుడు —ఎందుకో అడగరేం ఎవరూను?

కణ్వుడు —నేనే చెపుతున్నాను కదూ! బ్రహ్మలోకానికి యజ్ఞ సంభావన తీసుకునేందుకు వెళుతూ మా శకుంతలను చూద్దామని, ఇక ఇక్కడకు వచ్చేస్తున్నది కద ఆమె, మునికుమారికలతో కలిసి పూలు కోసుకుంటున్నదని ఆ వైపు వెళ్ళి కనబడకపోతే, ఎటు వెళ్ళిందో అని అటూ, ఇటూ అక్కడే తిరుగుతూండగా, పచ్చికలో తళతళలాడుతూ ఈ రేజరు కనబడ్డది!

శకుంతల —నేను విసిరివేశాను, కోపంతో (దుష్యంతుడు ప్రశ్నిస్తూ చూస్తాడు ఆమె అతని చెంపలు నిమురుతుంది లాలిస్తూ)

కణ్వుడు —చూడగానే మరచిపోయిందేమో తీసుకువెళ్ళి యిద్దామని తలచా కాని, అంతలో ఒక పిచ్చి ఆలోచన పోయింది వెళతున్నది బ్రహ్మలోకంలో సభకు అక్కడకు రంభాది దేవ గాయనులు అభినయ ప్రదర్శనానికి వస్తారు కదా, చక్కగా గెడ్డం తీసేసుకుంటే బాగుంటుందని—

నారదుడు —ఓహో! మీ రూపం తలచుకుంటే నేటికీ నవ్వు వస్తూన్నది

కణ్వుడు —రేజరును తీసుకు వెళ్ళిపోయినాను, వెనుకనుంచి ఎవరిచేతనైనా పంపించవచ్చును కదా అని

నారదుడు —ఇంకా నయం నేను కనబడకపోతే అలా చేసేవారనుకుంటా? కోతి మూక, మీ శిష్యులు మిమ్మల్ని బ్రతుకనిచ్చేవారేనా?

(శార్‌ఙ్గరవునితో) నిన్నుకాదు లేవోయ్! నీవు చాలా యోగ్యుడవు, నెమ్మదైన వాడవు! నేను ఎరుగనా ఏమిటి?

కణ్వుడు —తీరా, అక్కడ ఏవో ఆట పాటలని వాణీధవుడు కదులనివ్వాడుకాదు ఏలాగూ ఆలస్యమైందికదా, శకుంతలను చూసిపోదామని వస్తూండగా నారదుడు సంగతి అంతా చెప్పేటప్పటికి—

నారదుడు —మా యింటిదగ్గర మిమ్మల్ని చూసేటప్పటికే అర్థమయింది నాకు మా అమ్మ అడిగింది కూడాను, మీరు అలా తయారైనారేమని నేను, తరువాత చెపుతానని తప్పించుకున్నాను

కణ్వుడు —నాయనా, నీ ఋణం ఎలా తీర్చుకోగలను?

నారదుడు —తిరిగి గెడ్డం పెరగనీయండి తాపసులకు అందులో ఉన్నంత అందం (అందరూ నవ్వుతారు) పోనీ, భార్య గర్భవతి గనుక, ఈ నవమాసాలూ మీ అల్లుడికి దానితో అవసరం లేదు గనుక, నాడి చూస్తానంటారా? ఊహూం, అమ్మో! వద్దు లెండి అది కనబడకపోతే అమ్మాయిని మళ్ళా మరచిపోతాడేమో? సరే, సమస్త సన్మంగళాని భవంతు! నేను వెళ్ళి ఈ పట్టున దూర్వాసుడికి చెవులు ఎక్కదీయాలి ఎవరు గెలిచారో!

దుష్యంతుడు —మా పూజలు అందుకుని—

నారదుడు —ఇప్పుడు వీలేదు భారసాలకు ఎలాగూ వస్తాను కాదూ? ఊర్వశి నాట్యం చూడటానికి వెళ్ళాలి మీ మామగారు ఉంటారుగా, నా వంతు గూడా ఆయనకే మంచిది, వెళ్ళివస్తాను.

[అందరూ లేచి నిలుచుంటారు నారదుడు వెళిపోతూండగా—జవనిక]

# విజ్ఞానశాస్త్ర సేవలో ముందంజ

ఆంధ్రా సైంటిఫిక్ కంపెని లిమిటెడ్ 37 యేండ్లుగా క్రమాభివృద్ధి చెందుతూ, ఇండియాలో అన్ని రకములైన **సున్నితమైన** విజ్ఞానశాస్త్ర పరికరముల **నుత్పత్తి** చేయుటలో తమ ప్రత్యేక విశిష్టతను ధృవపర్చుకొన్నది. అనేక రకములైన థియోడలైట్లు, లెవెల్సు, మైక్రోస్కోపులు, ఆప్టికల్ ఇన్‌స్ట్రుమెంటులు, త్రాసులు, తూకపు గుండ్లు మరియు పరిశోధనశాల పరికరములే కాకుండా, ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీవారు **ఇంటర్ ఫెరో మీటర్లు, స్పెక్ట్రో మీటర్లు, పోలారి మీటర్లు,** ఇమ్మర్షన్ రిఫ్రాక్టో మీటర్లు, హారిజాంటల్ బటర్ రిఫ్రాక్టో మీటర్లు, సిట్టింగ్ ఫోటోమీటర్లు, యూనివర్సల్ కేథిటోమీటరు వగైరాలవంటి విశేషంగా వాడబడుచున్న అనేక రకములైన ప్రత్యేక తరహా పనిముట్లను తయారు చేసి, వాడుకలోనికి తెచ్చినారు.

*: పూర్తి వివరములు గల పుస్తకమునకు వ్రాయండి :*

# ది ఆంధ్ర సైంటిఫిక్ కంపెని లి॥

హెడ్ ఆఫీస్ & వర్క్సు : మచిలీపట్నం [దక్షిణ ఇండియా]



: బ్రాంచీలు :



★ మద్రాసు ★ బొంబాయి ★ కలకత్తా

★ న్యూఢిల్లీ ★ హైదరాబాద్ ★ కటక్

తంతి . 'ASINSTS' ఫోన్ . 35416

హైదరాబాద్ ఆఫీసు : పి. బి. నెం. 111, అబిద్ రోడ్.

టీకాలసత్యం నచ్చచెప్పడం చాలా కష్టం ఏం చెయ్యను! రోటిలో తల దూర్చి రోకటిపోటుకు భయపడనా?'' అని యేమేమో ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఆ గ్రామంలోని సంబరం జనసమూహంతో, కలకల ధ్వనితో, మిన్నంటే కేకలతో తన వైపే వస్తూంది వాళ్లకు కానరాకుండా ఆ చెట్టుచాటున డాగి నిలచేడు చెంగల్వరాయడు—పరిసర జ్ఞానమే లేకుండా ఎగురుతూ, దాటుతూ ఆ క్రొత్తగాకట్టే గుడివైపు పోతూంది ఆ సంబరం ఆతడా సంబరం నడుమకు నిదానించి చూచేడు కొందరి చేతులమీద వీరమరం బిగించి, పూలదండలతో పుక్కిట కల్లుతో ముందుకు చాచిన వాని అరచేతులలోకీ ఏదో పట్టుకొని ఒక యువకుడు కూర్చున్నాడు వానివైపు చూచి సంతోషంతో గంతులు వేస్తున్నారు ఆడూ మగా కలసి నడుమ నడుమ బలులిస్తున్నారు కోళ్ళూ, గొఱ్ఱెలూ కోసి రక్తం చిమ్ముకుంటూ పచ్చిగంధపు ముద్దలు పట్టించుకుంటున్నారు ఒడళ్ల పానకం వలె కల్లు జాడీలతో తాగేస్తున్నారు





గ్రామం పెత్తందారుకోసం చెంగల్వరాయుడు పంపిన గదబవాడు తిరిగివచ్చి నరవాహనంమీద ఊరేగుతున్న ఆ గదబ యువకుని చూపుడు వ్రేలితో చూపి "రఘువ" అన్నాడు త్రుళ్లిపడి చెంగల్వరాయడు వానివైపు చూచేడు "అవును వాడే అదిగో ముఖాన స్ఫోటకపు గుంటలు. బట్టతల ఆపైమీది ఎఱ్ఱపంచ తానిచ్చిందే" అనుకొని సంఘమున వానికి జరుగుతూన్న ఆ గౌరవానికి కారణమేమని వాని నడిగేడు ఆ గదబ వానికి తెలుగు రాదు గదబ భాషలోనూ సంజ్ఞలతోనూ కూడా ఆ ఉత్సవ వివరాలు తెలిపేడు అది యొక గ్రామ దేవత ఉత్సవమని బోధపరచికొని చెంగల్వరాయడు ఊరుకున్నాడు "ఇది అమ్మతల్లి పండుగ కాదు, అమ్మమ్మతల్లి పండుగ" అన్నాడా గదబవాడు అది క్రొత్తపేరవడంచేత వానికి బోధపడకపోయినా తెలిసినట్టు జాలిగా తలయూచేడు చెంగల్వరాయుడు ఆ కడుతూన్న గుడి ఆ దేవత కొరకె అన్నాడు గదబవాడు 'ఆహా' అన్నాడు చెంగల్వరాయడు వాని కా మాటలు చెవిని పట్టలేదు ఆకలి ఆంతరంగికంగానూ, ఎండ బాహ్యంగానూ వానిలోనూ పైనీ కూడా ప్రజ్వలిస్తున్నాయి మందుపెట్టె ఏమయిందో వాని నడుగుదామంటే వా డేనుగుమీది నున్నమయి ఎక్కడో అంతరాళాన అందకుండా ఊరేగుతున్నాడు తన బస అక్కడకు లొమ్మిది మైళ్ల దూరములో నున్నది నిలువలేక పోయాడు సొమ్మసిలి ఆ చెట్టునీడను రాయి తలగడగ పడుకున్నాడు చెంగల్వరాయడు వాని వైఖరి చూచి ఆగదబవాడు వాని కాకలి, దాహం విపరీతముగా నున్నవని పోల్చి ఉడికించిన దుంపలు, వెదురు గొట్టముతో తేనే, తామరాకుదొన్నెతో నీరూ తెచ్చి వాని కిచ్చేడు చెంగల్వరాయడు కాస్త చల్లబడి సేదదేరి, "రఘువని కలుసుకోవచ్చునా?" అని ఆ గదబవాని నడిగేడు "వా డా గుడివద్ద ఉండవచ్చును అందరు వెడలి పోయారు సందడి చాలించి మన మక్కడికి పోవచ్చు"నని వా డన్నాడు. చెంగల్వరాయడు మెల్లగా వాని చేయూతను నడుస్తూ అమ్మమ్మతల్లి క్రొత్త గుడి దగ్గరకు వెళ్లేడు అక్క డెవ్వరూ లేరు వా రా దేవత నా గుడిలో ప్రతిష్ఠించి విందు లారగించుటకు గ్రామంలోకి పోయారు పొద్దు పడమటి దిక్కును సమీపిస్తూంది కోడి వెంట్రుకలూ, నెత్తుటి మరకలతో నిండిన త్రోవ సరిచూచుకొంటూ ఆ దేవాలయ సమీపానికి వెళ్లేడు అక్కడ నొక పూలకొట్టెమీద పొదుపుగ నుంచిన అమ్మమ్మతల్లిని చూచేడు ఆ చేరువను నెత్తుటితో వత్తి వెలుగుతూంది ఇంకా గుడికి పైకప్పు కట్టలేదు ఆదేవతవైపు నిదానించి చూచి త్రుళ్లిపడ్డాడు చెంగల్వరాయడు ఈలోగా దేవతకు సాష్టాంగపడి లేచిన గదబ యువకుడు వాని వైఖరి చూచి వాని నమ్మమ్మతల్లి పూనినదని భ్రమసి వానిచుట్టూ తిరుగుతూ ఏవో గదబ పాటలు మొదలు పెట్టేడు

కొంత ధైర్యం తెచ్చుకొని చెంగల్వరాయ డా గదబ వానిని వారించి, ఆ పూలకొట్టెపైనున్న దేమని వాని నడిగెను "అదియే అమ్మమ్మతల్లి—వాని జాతరే సాగిస్తున్నా రిప్పుడు ఈ ఊళ్లో క్రొత్తగా ఈ గుడి ఇంత వేగంగా ఈదేవతకోసమే కడుతున్నా"రని ఆగదబ యువకుడు బదులుచెప్పెను.

కాస్త ధైర్యం తెచ్చుకొని, "నే నా గుడిలోనికి వెళ్లి ఆ దేవతను చూడవచ్చునా?" అన్నాడు

గదబ —ఓ ఆ ఉగ్రం భరించగలిగితే

పిరికిదనంగా 'ప్రయత్నించి చూస్తా' నంటూ ఆ గుడిలోనికి అమ్మమ్మతల్లి చేరువగా పోయి వంగి నిదానించి ఆదేవతను చూచి, చూచి, అదేదో చదివి తెలిసికొన్న ట్టేవలకు వచ్చి "సరే రా పోదా"మన్నా డా గదబవానిని చెంగల్వరాయడు వారిరువురూ కలసి పోస్టుమాస్టరు దగ్గరకువచ్చేరు.

చెంగ —అయ్యా పోస్టుమాస్టరుగారూ, మీ రా మందుపెట్టె వానిచేతిలో పెట్టినప్పుడు వాడేమన్నాడో చెప్పగలరా?

పోస్టు —ఇదేమిటని వాడు నన్నడిగేడు ఇది అమ్మవారిని చంపే దేవత అన్నాను. వా డతి జాగ్రత్తగా ఆ పెట్టెను తీసికొని వెడలిపోయాడు

ఏం చెయ్యడమో చెంగల్వరాయనికి తోచలేదు గాని అమ్మమ్మ తల్లి జాతరలుమాత్రం అక్కడ మందుపెట్టెకు సాగుతున్నాయి


COAL




తారలు

అక్కినేని నాగేశ్వరరావు * అక్కినేని నాగేశ్వరరావు

దర్శకుడు

ఆదుర్తి సుబ్బారావు

కథ. మాటలు

ముళ్ళపూడి వెంకటరమణ

సంగీతం

కె.వి. మహదేవన్

నిర్మాత

డి.బి. నారాయణ

శ్రీఫిలింస్ విడుదల

కరకురంగాకృతి కడగంట నిలిపి
తరుణేందుకళ ఫాలతటిఁ గీలుకొలిపి

* * *

వృ వి మహత్త్వ ర్యం పిఱుఁదులయందు
ప్రగుతరసరసత వ్రాదయంబునందు
బంధుర తే ంబు సలెరయందు
గంధపవాలంబు కాయంబునందు

కలికి బంగరు పూల గాజులు దొడిగి

ముక్కున బులాకెంపు ముక్కర చెంగ
పెక్కు లిల్లును పూసపేర్లు వెన్నంద
శిరమున రత్నాభాసితపాత్రఁ బూసి
యెఱుకలయ్యై వచ్చె హేలగా మొక్కు"

* * *

ఆ ట తా ళ ము

"ఎరుకసాని వచ్చె ఎరు కనుచు ||అను||
ఎరుకలసాని వచ్చె నెరుకో యెరుకో యెరుకో యనుచు ||ఎరు||
మురిపెంపునడలతోడ ముంగురు లల్లాడ
నరవంపు మాటల చతురతతో
శిరమున నవరత్న ఖచితమై న బుట్ట పెట్టి
మెరుపువలెను మేను మెఱయఁగను"

* * *

వచ్చి ఈవిధంగా తన గొప్ప చెప్పుకొంటోంది —

ఆ ట తా ళ ము

"సరసిజభవురాణి పరిణయమైనాట మా—యెఱుకను కాదటవె
సురపతి పౌలోమి శోభనాకృతి మా—ఎఱుకను కాదటవె యోదేవి
తరు పదికి నేఁ దార్కాణగాఁజెప్పి— తగు గోర్కె లందెదనె—యోదేవి
యెఱుక గలవారు గల వారెందరైన మా—సరివత్తురె రమణి ||

ద్వి ప ద

అంగన యామాట లాలించి వేడ్క
బంగారు చేటలోపలి ముత్తియములు
ముమ్మారు తన కరాంబుజమునఁ బట్టి
నమ్మతి ఫాలదేశంబున నిలిపి
మ్రొక్కి యిట నేఁ చిత్తమునఁ దలపోసి
మిక్కిలికంటిసామి నా విభుడు
నెన్నఁడు దయవచ్చు నెపుడు పెండ్లాడు
నెన్నఁడు నా కోర్కె లీడేరు ననుచు
చేతి ముత్తియములు చేటలోఁబోసి
నాతి యందిచ్చెను నగుమోముతోడ
నా యెఱుకలసాని యాత్మదైవముల
వాయిని భక్తితో ప్రస్తుతించె||

* * *

ద్వి ప ద

ఓ భారతీదేవి యో పల్కుమాత
పరగంగ నా జిహ్మఁ బాయకయుండి
వెరగొందకుండఁగ వ్రాల్తువుల్ నుడువు
ఇగనాలు తొలఁగించె డిగినేశపరుడ
నగినాలు లెస్సగ సాగంగఁజేయు
నుల్లంబులో నిల్వఁ డో వెజెలార!
కొల్లాపురీదేవి! గోరెద నిన్ను

* * *

ఈ కాంల నను నా మొద వచ్చునట్లు
నా కీయిరే నాడు వాక్కుల రిచిరి

అని యిప్పుడు యెంటి వాల్గంటి సంచితినని వేలు గిలించి యేమని యెరుక చెప్పుచున్నది—

అవో దేవి భాగ్యంగల చెయ్యి, ఐతిష్టిగల చెయ్యి, సంతానముగల చెయ్యి, నల్లని చెయ్యి.

అవో దేవి యెక్క తలంపు చేసినావు, యెక్క కోరిక కోరినావు, యెుకటొక్క మే అడిగినావు

అది కాయో పండో, కల్లో నిజమో, అవునో కాదో, చేకూడునో చేకూడదో యని వెనకముందు తొక్కులాడుతున్నావు

అది కాయకాదు పండు, కల్లగాదు నిజము, శ్రీఘ్రంబే యింతలోనె చేకూడుతున్నది.

అది యేకోపుకార్యమంటె యిదుగో ఈ కోపు, ఆడవారివంక తలంపా మొగవారి వంక తలంపా అంటే యిదుగో మొగవారంటే గడ్డంబు ఆడవారంటే సిగ్గాకు—

యిదుగో నీ యెదలో యెన్నాళ్లకంటె వకటే రెండే మూఁడే వకటంటే నీవక యేఁడుగాదు, రెండంటే రెండేండ్లుకావు, మూఁడంటే మూఁడేండ్లుకావు, శీఘ్రంబె, యింతలోనె చేకూడుతున్నది, యింక దాపేల, కోడెగాడితో తక్కిర బిక్కిర లాడుకుంటూ కులకనున్నావె, అప్పుడు నన్ను మెచ్చేవే, కోర్కు లిచ్చేవే

* * *

నీకు నాథుండు నయ్యెద నని యిప్పు డిచ్చటనే యున్నాడు, నీపై చాలా దయ వచ్చింది శీఘ్రంబె పెండ్లియాడు, నీ కోర్కె చేకూరు, నమ్ము నా బుట్టతోడని నమ్మించి చెప్పిన—

* * *

ద్వి ప ద

అంత నయ్యింతి యింతంతనరాని
సంతోష మంది యాశ్చర్యంబు నొంది

* * *

ఎరుకలసాని గా దెన్న నా పాలి
వారకృపమూర్తియై యవతరించినది
ఇచ్చెలి మెచ్చి నే నే మిచ్చుదాన
నిచ్చేడెకు జగంబు లిచ్చినఁ జాల
నన తన మౌక్తిక హారంబు కంఠ
మున వైచె మల్లెపూమొగ్గ లదండ
వరునిపై వరియించి వైచెనో యనఁగ

* * *

వినయ వాక్యములచే వీడ్కొల్పె నంత"

కథానిర్వహణానికిన్నీ, వినోదము చేకూర్చడానికిన్నీ ఈ **కొరవంజి** ఏ విధంగా తోడ్పడిందో గమనించదగ్గ విషయం

(2) రంగాజమ్మ వ్రాసిన మన్నారు దాస విలాస నాటకం —

ద రు వు

"చెలువ మన్నారుదాసుపై వలపు నిలుప
లేక, కలవరింపుచున్న కాంతిమతికి
దలఁచిన దలఁపెల్లఁ దార్కాణగాఁ దెల్ప
నల చెంగమ్మ ఎరుకచెలువయై వచ్చె"

చెలికత్తె ఎరుకసాని సంగతి కాంతిమతికి చెప్తూతోంది—

"విను కాంతిమతి! యొక వింత యీవేళ
మినుకు బంగరుచాయ మెఱయు నెమ్మేను
నుప్పాణిముత్యాల సొబగు కమ్మలును
గప్పురా జిగిమించు కస్తురిబొట్టుఁ
బలుచని చెక్కులు బటువు పాలిండ్లుఁ
జెలువైన కెంగేలఁ జెలఁగు బెత్తంబు

* * *

విరుల చెండును నెమ్మిపింఛంబు మెఱియ
నురమున బురుకని హోయలుగాఁ బూని

* * *

ఎఱుకత యొక్కతె యిదె రాజవీధి
నొఱపుగా వచ్చుచున్న దోయమ్మ"

కాంతిమతి కొరవంజిని పిలిపించింది ఎరుకసానివచ్చి తన యిష్ట దేవతలను కొనియాడిం దీ విధముగా—

"శ్రీరాజగోపాల, దొరకానాథ,
బంగారుమన్న రంగమరేండా"

* * *

నల్లని దేవర గొల్లలసామి

* * *

ఈకలికి తలంశిన తలంపు నిజముగా బలుకవయ్యా, నిక్కముగా బలుకవయ్యా, తార్కాణగా బలుకవయ్యా—

అమ్మాయమ్మ, అమ్మాయమ్మ, సెయిసూపు, సెయి సూపు, సెయి సూపవే దుండి, దనముగల సెయ్యే, దాన్యము గల సెయ్యే, బంగారు సెయ్యే, బాగ్గెముల శయ్యే, దుండి, అటు నిటు సూడక నే సెప్పే గురి ఊంకొని వినవే దుండి, కండ్లంటే తోడు, కడుపండే కొడుకు, కంటెంటే మగండు వొండే రెండే వొండు ఆతం డేవితమువా డంటూ అడిగేవే అయితే తెలిపేను వినవే దుండీ—

"వేయూరు వెలదుల వెలయుచు దక్షిణ
నాయకుండని మించి నలువొందువాడు
అతడె నీ పతి యగు నందుకు దార్కాణ
యితవైన నెచ్చెలి యిదిగొ వచ్చినే

అని పలికి యాకలికి చిలుకల కొలికిచేత సకల బహుమతులు జెంది నిజమందిరంబు సేరె"

* * *

(3) తులాభారం అనే యక్షగానం (కవిపేరు తెలియదు) —

"బ్రహ్మసమ్మతిని యా భారతీదేవి
యెరుకల వేషంబు (యింపుగా) దాల్చి
భామను చూడంగ భామిని వచ్చె

కు రు జం పె

జిలుగు బంగరు చీర తెల్లనిజారు కుచ్చులు
మెరయగా గరిమతో గుత్తంపు చం
దురుకాని రవికయు దొడగి చూ
వచ్చె నెరుకత అహహా॥
చొక్కమగు రత్నంములు
జెక్కిన బుట్ట శిరసున బెట్టుకొని
కుందనపుక ట్లమరవేసిన కురుచ బెత్తము చేతబట్టుకు ॥వచ్చె॥
ఫాలమున నసియాడు అల నెలవంక
పాపిట బొట్టుతో సొగకన్నులు వాలు
చూపులు వైడూర్య పచ్చా బొట్టుతో ॥వచ్చె॥
అంద మలరగ యెడమ మూపున ఆడశిశువును గట్టుకూ
మంద యానల తోటి వీధులు మళ్లీ మళ్లీ తిరుగుచూ ॥వచ్చె॥
చిలుకతాళియు కంకణమ్ములు
వెలగు దంతపు కమ్మలున్
వెలయు ముత్యపు సరులు గవ్వల పేరు ఒల్లలవాడగా ॥వచ్చె॥

* * * *

కు రు జం పె

యెరుకోయమ్మ యెరుక। వచ్చేది పొయ్యేది యెరుకా
కాగల దయ్యేది యెరుక। దానంబు జేసినా దెరుకా
వారణాశికి బోతి నవ్వా అన్నపూర్ణ కెరుక జెప్పితి నవ్వా
వరహాల పేరిచ్చె నవ్వా ॥"

అప్పుడు సత్యభామ అడుగుతోంది

ద రు వు

"యే సీమదానావె యెరుకతా నీ
కెందారు సవతులే యెరుకతా॥

* *

మగడు నీపై నెపుడు యెరుకతా
మక్కువతొ నుండునా యెరుకతా॥

* * *

బుట్టముందర ముమ్మారు పూజ జేసి
భాగ్యవతియైన శ్రీ సత్యభామ నపుడు
భమిడి బెత్తంబు తనవ్రేళ్ల బట్టమనియు
యెరుక జెప్పంగ దొడగె నామరునిబొమ్మ

* * *

శ్రీ వెంకటేశ్వరా శ్రితపారిజాత
మంగళాద్రి నృసింహా మదనగోపాల
బెజవాడ మల్లయ్య బేరికోటయ్య
జిల్లేళ్ల కనకయ్య శ్రీ సుబ్బరాయ
కోరిక లిచ్చేటి కొల్లాపురమ్మ
గుంటూరు సర్వేశ గువ్వలచెన్న
ఓరుగంటిపురమ్మ ఓ కూనలమ్మ

* * *

దుండి, వకమేలు కని యడిగినావే, యవ్వో యవ్వా, సతులకు సాధ్యముగుచో మందువే యవ్వ—నారదముని వచ్చేనే యవ్వా, వ్రత మడిగితివే యవ్వ, మగని దాన మిమ్మనెనే యవ్వ, వద్దనకపోతివే యవ్వ, చిరునవ్వు నవ్వకే యవ్వా—"

* * *

ఎరుకసాని తన గొప్పతనం చెప్పుకొని చివరకు చెప్పిన మాటలు—

* * *

"అవ్వా, అవ్వా వకటే, రెండే, మూడే, నాలుగే, నాలుగంటే నాలుగు సంవత్సరాలుగావు నాలుగు, దినంబులలోనే నీ ఒక గొప్ప నోము నోచేవే యవ్వా, నీవు పెనిమిటిని పారుజాత పుష్పమునకు గట్టి దాన మిచ్చేవే యవ్వా, నీ సవతులందరు నీమీదకు కయ్యానికి వత్తారే యవ్వా, సవతులలో నీవు చాలా కించ నొందుదువే యవ్వా ."

(4) ఏనుగలూరి పాపరాజు వ్రాసిన రుక్మాంగద చరిత్ర అనే యక్షగానం — మోహిని విరహబాధ పడుతుంటే "నీరజ గర్భుని పంపున గారవమున యోగమాయ" యెరుకత వేషముతో—

"అంగన! నాదుపేరు కొరవంజి యటందురు, వాదు సామియున్
సింగఁడు, తావు ద్రోణగిరి సీమ, జను ల్కొవియాడ నెప్పుడున్
పొంగుచు సోదె చెప్పి వరభూషణముల్ కొని వార్త లెక్క మా
బంగరు పల్లెవాని మదిఁబాయక నమ్మిరవార మెయ్యెడన్"

* * *

అని ఈ విధంగా ఎరుక చెప్పుతుంది

"సూర్యవంశకులోద్భవుండైన రుక్మాంగద రాజేంద్రుండు ఎన్ని విడనాడి అన్య కాంతల గూడినాడని నీ మనస్సున నెంచినావే వెర్రి తల్లీ ఆయన నీయందు మోహితుడైనాడు అన్యకాంతల గూడనివాడు వినవోయమ్మ"

అంతేకాకుండా స్త్రీ సాముద్రికం కూడా చెపుతుంది ఈ కొరవంజి

"శుక్లపక్షంబు పంచమి శుక్రవార
మంచితంబుగ నతివల కగును మేలు
"తరుణికి దాపలికుచమున
స్థిరమగు కెంపలరు మచ్చ దీకొనియున్నన్
వరసుతుడు పుట్టు "

* * *

"పొలంతికి దాపలిపక్కను
తిలకమువలె మచ్చ గలిగి స్థిరమై యున్నన్
తొలి చూలు కొడుకు గలుగును"

* * *

"మండూకోదరగతి భూ
మండలమున తరుణికుక్షి మానితమైనన్
మెండుగ లాభము భాగ్యము
పండితులగు సుతులం గాంచుం బరమప్రీతిన్"

(5) వెంకటరాయకవి వ్రాసిన లేపాక్షి జలక్రీడలనే నాటకంలో **ఎరుకలవారి పుట్టు పూర్వోత్తరాలు** వర్ణించబడ్డవి

" అఖిల భూతముల
తెర గెల్లభంగులు తెల్లంబుగాను
ఎరుక గల్గినవారమౌటకు మమ్ము
యెరుకలవారని యందురే చెలియ"

అంతేకాకుండా ఈ క్రింది విద్యలు కూడా తనకు వచ్చునని కొరవంజి **చెపుతుంది.**

"స్తంభన, వశీకరణ, ఆకర్షణ, ఉచ్చాటక, విద్వేషణ, వ్యోమగమన, పరకాయ ప్రవేశాది విద్య లెరుంగుదునే యవ్వా అశ్వలక్షణ, గజలక్షణ, రత్నలక్షణ, స్త్రీలక్షణ, పురుష లక్షణ, సాముద్రిక లక్షణంబు లెరుంగుదునే యవ్వా"

* * *

ఈమె శ్రీకృష్ణబాలునికి చెయ్యి చూచి సాముద్రికం కూడా చెపుతుంది.

(6) పార్వతి కొరవంజి అనే కన్నడ గ్రంథంలో కూడా కొంచెం హెచ్చు తగ్గుగా ఎరుకలసాని తెలుగు నాటకాలలోవలెనే ప్రవర్తిస్తుంది

దశరథుడు పుత్రకామేష్టి ఆచరించిన తరువాత కౌసల్య గర్భవతిఅయింది అప్పుడు—

ఏకతాళ

"పరమేశ్వరను పార్వతియన్ను కరెదు
కొరవంజి వేషదలి ధరగె పోగువుదు
అరసి కౌసలెగె నీ కణియ హేళివుదు"

(పరమేశ్వరుడు పార్వతిని పిలిచి కొరవంజి వేషం వేసుకొని కౌసల్యాదేవికి ఎరుక చెప్పమంటాడు)

కొరవంజి వేషం యిట్లా ఉన్నది

"హిడిదకై యొళు హొన్నబెత్త కడు చెల్వ
శిశువ బెన్నినొళిరె కొరవంజి తరుణి

(చేత బంగారు బెత్తము, మూపున చిన్న శిశువును కట్టుకుంది.)

"యెన్న మాతు తలెయమృతవాక్కు
కరెయు కాణిసదు కొల్లాపురదమ్మనాణె"

(కొల్లాపురమ్మ ఆనసుమ్మా, ఎరుక చెప్పుతా, నామాట అమృతవాక్కు)

ఈమె తన దేవతలను పేర్కొంటోంది

"వో
కొల్లాపురదమ్మ గోవిందరాజ
సోభానదైయ్యన సోమేశలింగ
కొండలగిరి తిమ్మ కోనేటిరాయ
చెలువ అహోబలరాయ జానకీరమణ
కంబదరాయనె కకుద్గిరీశ,
కల్యాణ బసవణ్ణ కరుణదడంగా .. "

* * *

ఇంతలో

"సింగాసానియ నరసుత్త యరుకల సింగను బంద నడెంతెనె"

పై పదములు తెలుగుకూ కన్నడముకూ సమానముగా ఉన్నవి

కొరవంజి కౌసల్యాదేవికి పుత్రోత్సవ వార్త చెప్పి సెలవు **తీసుకొంటుంది.** కౌసల్యాదేవి కొరవంజికి "ముత్తు రత్నంగళం, పట్టెయొళ్తుంబి **బురుకవిగె** హోలు ధుప్పవ నెరెగు అనేక వస్త్రాభరణగళింద అలంకరిసి కళుహిదళు"

* * *

పై విషయములనుబట్టి చూచిన తెలుగుయక్షగానములు ప్రశస్తమైన వాఙ్మయ శాఖ అనిన్నీ, ద్రావిడ వాఙ్మయంతో సంబంధం కలవి అనిన్నీ వెల్లడి అవుతోంది

# త్యాగరాజయ్య సాహిత్యము:

## సాహిత్యమును వెనుకకు నెట్టి నూతన సృష్టి చేసిన త్యాగయ్య గానప్రతిభ

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

[1940 విక్రమ సంవత్సరాదిసంచికనుండి]

### అనితర సాధారణమైన కావ్యకళను త్యాగయ్య అబ్బురముగా అబ్బించుకున్నాఁడు

త్యాగయ్యగారి సాహిత్యము ఆయన సంగీతమువలె విశాలము, వివిధము, ఉన్నతము, అపూర్వమునైన కళ సరస్వతితల్లి యిరుప్రక్కలచనుబాలను ఇంత సమానముగా కడుపునిండ త్రాగి పెరిఁగిన బిడ్డఁడు తెలుఁగువారిలోనే కాదు—నేనెఱిఁగినంతవఱకు ఎక్కడను ఇంకొక్కఁడులేఁడు ఇతని సమకాలికులై కర్ణాటకసంగీతరక్షామణు లనఁదగిన ముత్తుస్వామిదీక్షితులు, శ్యామాశాస్త్రులు, కులశేఖరమహారాజు—వీరిలోనే యెవరికిని కావ్యకళ ఇంత చక్కనిది, ఇంత తేజోవంతమైనది అబ్బలేదు దీక్షితుల భాష మంత్ర తంత్ర పరిభాషలతో, సంగీతపు నాలుకకు సామాన్యముగా మెదగని సమాసములతో, శబ్దములతో ముక్తాయమయినది శ్యామాశాస్త్రుల భావ ప్రవాహము కామాక్షమ్మను తలుచుకొని 'అమ్మా! ననుఁ బ్రోవవే' యని వాయి విడిచి వేఁడుటతో పరవశమై స్తంభించుచున్నది కులశేఖరుల సంస్కృత రచన ముద్దుల మూటయైనను వట్టి మూర్తివర్ణనముతో మొదలై 'మాం పాహి'తో ముగియునేకాని తీవ్రభావముల లోఁతుకు దిగలేదు ఇట్లగుటకు కారణము పై ముగ్గురిది హృదయమందు వేదనగాని, ఆందోళనగాని లేని యుపాసన ముగ్గురును పరమభక్తులే, కావ్యావేశము కలవారే కాని తాము భజించు దేవత తమ్ము తప్పక కాపాడి మోక్ష మిచ్చునను గట్టి నమ్మికతో సంప్రదాయము ప్రకారము ఉపాసన చేసినవారు కనుక వారికి ముక్తి లభించియుండవచ్చునుగాని మనకు వారివలన కావ్యకళ లభింపలేదు

### శాస్త్రచోదితములైన నిత్యనైమిత్తిక కర్మములు 'కల్లలని' వానిని వదలివేసిన పరమభాగవతోత్తముఁడు

త్యాగయ్య భక్తిజీవిత మట్టిది కాదు చిన్నతనమున నుండియు నానాదేవతోపాసనకు వాడుకపడియున్నను, వేదశాస్త్ర పురాణములందు విధింపఁబడిన నిత్య నైమిత్తిక కర్మములు చేయు సంప్రదాయమునకు లోఁగియున్నను, అవన్నియు 'కల్ల' లని వదలి శ్రీరామమూర్తిని 'వాఁడేరా దైవ'మని నమ్మి 'నీవే రా కులధనము సంతతము నీవే రా జీవనము' అని శరణు చొచ్చినవాఁడు అతని ఆశ అపారమైనది నిరాశ యగునేమో యను ఆందోళన అంతులేనిది శ్రీరాముని ఈ జన్మమందే, ఈ తోలుకన్నులతోనే దర్శించి తీరవలయునని పట్టుపట్టినవాఁడు అందుకని జపములుచేసి, ప్రార్థించి, పూజించి, నిందించి, తన్ను నిందించుకొని, వేసటపడి, విసుగుకొని, ఏడ్చి, తప్పాయెనని క్షమాపణ వేఁడుకొని, ఎన్నో తంటాలపడినాఁడు తన కోర్కి ఫలించకపోయినప్పుడు తన కీ మార్గ ముపదేశించిన 'పెద్దల మాటలు నే డబద్ధమౌనో!' యని భయపడినాఁడు వైదిక మార్గనిష్ఠు లగు స్మార్త బ్రాహ్మణుల కులమందు పుట్టి ఆ సంఘమందే పెరిఁగియున్నను 'వేద శాస్త్ర పురాణ విద్యలచే భేదవాదములు తీరక' వారందఱును 'భ్రమసేవా' రనియు, 'యజ్ఞాదులు సుఖమనువారు' 'అజ్ఞాను' లనియు, 'అసురచిత్తు'లనియు ఎదురు తిరిగి తిరస్కరించి తిట్టినవాఁడు మనము కల్ల అనుకొన్నను, కలవరింపు అనుకొన్నను, భ్రాంతి అనుకొన్నను సరే, అతఁడు శ్రీరామచంద్రమూర్తిని పలుమా రీ జన్మమందే తాను దర్శించినట్లు అనుభవించి అతనితో సాక్షాత్తుగా ఆడి పాడి వేఁడి ఆనందలీనుఁడైనవాఁడు ఇతరులు భుక్తి, ముక్తి రెండును గావలెనని కోరఁగా, అతఁడు 'రామా! నీ భక్తి నాకు భోగానుభవంబులందు బాగుగ బుద్ధి నీయదు' అని విరక్తికి పరమైనవాఁడు కావుననే దొరలను, వారిచ్చు గౌరవములను మన్నింపక తిరస్కరించి తిరిగిన పరమ స్వతంత్రుఁడు కాఁబట్టి త్యాగయ్య భక్తి వట్టి దృఢమైన మూగ నమ్మిక, జడశ్రద్ధ కాదు; నిమిషమైనను ఊరకుండనీయక దేహ మనస్సుల ప్రతినాడిని కదలించి మీఁటి ఊఁగించి ఆడించునట్టి అమేయమైన విద్యుచ్ఛక్తి అది ఆడించిన ఆటలలో మన పాలికి ముఖ్యమైనవి అతని పాటలు

కాఁబట్టి త్యాగయ్యకృతులలో ఒక దానివలె మఱొక్కటియుండదు. క్రొత్తభావమో, క్రొత్తనుడికారమో తప్పకయుండును మనఃపూర్వకముగా తీవ్రముగా వెడలని భావ మేదియు కానరాదు మఱియు మనస్సులో పుట్టిన భావము కావ్య రూపముగా బైలుపడు వేగమునకు అడ్డపడున దేదియు నుండదు

### గేయకల్పనలో అపూర్వశక్తి, అసాధారణ ప్రతిభలుగల ధీశాలి

కాని ఒకటితప్ప నిదనుగా అతని గేయ రచన మాటలలో ఎంత ఎంత క్రొత్తదనము, వేగము, అందము కలదో అంతకన్న ఎక్కువగ వానిని పాటలందు చూపఁగల అపూర్వ గేయకల్పనాశక్తి అతనిది ఒక శంకరాభరణ రాగమందు ముప్పది పైన్ల మెట్లు నెత్తి, అన్నిటిని అన్ని ముఖములుగా ఆద్యంతము నిర్వహింపఁగల అసాధారణ ప్రతిభ అతని సొమ్ము ఇతరు లెత్తిన మెట్లకు తన మాటలను జోడించు దేబతనము నతఁ డెప్పుడును చేసినట్లే కానరాదు కాఁబట్టి మనసులో మాట తోఁచిన వెంటనే దాని నేదైన క్రొత్త నడక గల పాటగానే కూర్పవలయునను ఉత్సాహము అతనికి ఉగ్గుపాలతో వచ్చినది ఇట్లయి మాట పాటకు లోఁగి నిలుచును ఎన్నియో పాటలలో అతని మాటలు స్వేచ్ఛా ప్రచారములు లేక మంత్రమునకు కట్టువడిన నాగుఁబామువలె ఎగరోజుచు అణఁగియుండును

### అతఁడు పాటను నేర్చినంతశ్రద్ధతో మాటను నేర్వలేదు సంగీత భావము ముందఱ సాహిత్యభావము గౌణముగానే నడచును.

ఇట్లగుటకు కారణము త్యాగయ్యకుఁ గల అపారమైన గానవిద్యాపాండిత్యమే నాకుఁ జూడఁగా పాటను నేర్చినంత శ్రద్ధతో అతఁడు మాటను నేర్వలేదు మాటయం దతనిది ఇంచు మించు పోతన్నవంటి సహజ పాండిత్యము పాటలో నట్లుగాదు సుప్రసిద్ధు లగు సొంటివారి యింటి శిష్యుఁడు, మీఁదు మిక్కిలి నారదమహర్షి యనుగ్రహమునకు పాత్రుఁడు. 'రజత గిరీశుఁడు నగజకుఁ దెల్పు స్వరార్ణవ మర్మములు విజయముగల త్యాగరాజా

కెరుకే' అను గొప్ప ఆత్మప్రత్యయము గల ప్రొఢ్విన పండితుఁడు కనుకనే అతని సాహిత్యము మూఁడు పాళు సంగీతము నాశ్రయించి ఆకుమఱుఁగు పిందెవలె నున్నది సంగీతభావము ముందఱ సాహిత్య భావము గౌణముగానే నడచును. ఉదాహరణముగా అతని పంచరత్నములలో ఒక రత్నమగు 'సాధించెనే ఓ మనసా' అను ఆరభి పాటను గ్రహింపవచ్చును 'శ్రీరాముఁడు తుట్టతుదకు తన్ను మోసగించెనే!' అని ఇందులో త్యాగయ్య అంగలార్చుచున్నాఁడు శ్రీరాముఁడు 'సమయానికి తగుమాట లాడెనే: నే నిచ్చిన పూజ లన్ని కైకొనెనే• అలుగవద్దనెనే, విముఖులతో చేరఁబో కనెనే, వెత కల్గిన తాళుకొమ్మనెనే, ఇట్లాడిన మాట లన్ని బొంకుచేసి తుదకు చెంత రాకనే తాఁ బట్టిన పట్టు సాధించెనే!' యని—యింకెవరితో చెప్పుకొనఁగలడు?—తన మనస్సుతో త్యాగయ్య మొఱ పెట్టుచున్న పాట యిది ఈ భావమును, భాషను అడఁచి పట్టుకొన్న రాగము ఆరభి అది ఉత్సాహ ప్రధానమగు ఘన రాగము స్వరముల నడక జంటలు జంటలుగా పందెపు గుఱ్ఱపు నడకవలె, నాభినాదముతో గంభీరముగా, ధైర్యముగా, నిర్లక్ష్యముగా జరుగవలసి యుండును. కాఁబటి విలంబ కాలముకంటె మధ్యమ ద్రుతకాలములు ఈ రాగ స్వరూపమున కెక్కువ చేరిక గలవి ఈ రాగమం దీ పాటను పాడుచు పె నిరాశ భావమును, దైన్యమును స్ఫురించునట్లు చేయుట నాకుఁ జూడఁగా అసాధ్యము. ఆరభి రాగమును లయమును బిగువు చెడును. కీర్తిశేషురాలగు వీణధనము దీనిని మార్దవ ప్రధానముగా పాడినప్పుడు విన్న వారి కిదే భావము కలిగినది.

సాహిత్యమును వెనుకకునెట్టి నూతనసృష్టిచేసిన త్యాగయ్యగానప్రతిభ

త్యాగయ్యగారి గాన ప్రతిభవుఱియొుక నూతన సృష్టిచేసి సాహిత్యమును వెనుకకు త్రోసినది. పల్లవి విస్తరింపులను శిష్యులు చిన్ననాఁటి నుండి నేర్వవలయునను ఉద్దేశముతోఁ గాబోలును త్యాగయ్య తన పాటలకు వీలున్నచోట నెల్ల కొన్ని సంగతులకనేర్పఱచి అవి తప్పక పాడవలయునని కట్టుపాటు చేసినాఁడు ఈ పద్ధతి అదివఱకు లేనిది ఆ సంగతు లన్నియు రాగ తాళ భావములఁ జూపుట కెంతో అనుకూలముగానున్నను సాహిత్య భావములతో ఏకీభవించుట కష్టము. తన ప్రియదైవము శ్రీరాముని అపూర్వ మధురముగా

"నా జీవనాధారా, నా నోము ఫలమా
రాజీవలోచనా, రాజ రాజ శిరోమణీ
నా చూపుప్రకాశమా, నా నాసికాపరిమళమా
నాజపవర్ణరూపమా, నాదు పూజాసుమమా త్యాగరాజనుతా"

అని మహా ప్రేమతో సంబోధించు కృతికి త్యాగయ్య బిలహరి రాగములో ఏర్పఱచిన మెట్టును సంగతులన్నియు వేసి సంప్రదాయముగా పాడఁబోయినప్పుడు అక్షరములన్నియు తసుకులాడి ఎక్కడనో ఆవిరియై అంతర్ధానమగును! సంగీతమం దున్నంత పాండిత్యము లేకున్నను ఇదే చిత్తవృత్తి అతని కొన్ని సాహిత్య కల్పనలందును చూడవచ్చును. అన్త్యప్రాసములను నిర్వహించుచు అతఁడు రచించిన కొన్ని కీర్తనముల భాష భావశూన్యమై రాగలయములను గూడ త్రోసి నడచును 'తరాన దొరకని పరాకు నా యెడను రామ చేసితే సురాసురులు మెత్తు, రా యిపుడు ఈ హరామితన మేలరా భక్తత్యాగరాజనుత' ఇత్యాదు లుదాహరింపవచ్చును సాహిత్య పాండిత్యము దుర్బలము కావుననే ఇటి చిత్ర రచనల కతఁ డెక్కువగా చేయి వేయలేదు.

వట్టి పాండిత్యపు పొగరుతో అతఁడు తృప్తిపడలేదు. అతనికి చాల లోఁతుకు దిగి చూచు ఆధ్యాత్మిక దృష్టి కలదు.

అనఁగా త్యాగయ్య కృతులన్నియు నిట్లున్నవని కాదు. ఆయన సృష్టిలో అటు జరుగుట అసాధ్యము. అతనిది చాల సుకుమారచిత్తము. నిర్మాణశక్తి మెఱపువలె మెఱయునట్టిది భావములు తేజోమయములై అడఁచినను అడఁగనివి కాఁబట్టి అతఁడు వట్టి పాండిత్యపు పొగరుతో తృప్తిపడఁజాలఁడు. చాల లోఁతుకు దిగి చూచు ఆధ్యాత్మికదృష్టిగల వాఁడు కావున పైదంభము లతనికి చాలవు. మఱియు సంగీత సాహిత్యములు రెంటిని అనుభవించి ఆనందించు రక్తియు, నిర్మించు శక్తియు కలవాఁడు కావున, అతని రచనలలో కొన్నిటియందు ఒక దాని కొకటి అడఁగియున్నను, అనేక కృతులలో రెండును చేయి చెయి పట్టుకొని అపూర్వ సౌహార్దముతో ఏకాగ్రముగా రూపుగొన్న అద్భుత దృశ్యమును మనకు త్యాగయ్య ఎత్తి చూపఁగలిగినాఁడు 'పలుకు పలుకులకు తేనె లొలుకు' కృతులు అతని వెన్నో కలవు ఆ తేనెలు మాటలవో, పాటలవో చెప్పలేము ఎందుకనఁగా అవి రెండును మేళగించి దింపిన రసాయనములు 'దొరకునా ఇటువంటి సేవ', 'పక్కల నిలబడి', 'నీ దయచే రామ' మొదలగు ఎన్నో కృతుల ధాతు మాతు మాధుర్యమును, భావగంభీర్యమును ఎవరు వర్ణింపగలరు?

కాని మొత్తముమీద నాద విద్యామర్మములను గమనించినంత మెలకువతో శబ్దరచనా రహస్యములను గమనింపలేదు.

కాని మొత్తముమీఁద త్యాగయ్య 'నాద విద్యా మర్మములను' గమనించినంత మెలుకువతో శబ రచనా రహస్యములను గమనింపలేదనుట మనము కనుఁగొనఁగలము. భావముల గొప్పతనమునకు సరిరాలేక ఎన్నో చోట్ల అతని భాష తంటాలుపడుచున్నది వ్యావహారిక రూపములను ఉదాసీనముతో దూర్చినాఁడేకాని అందుఁగూడ క్షేత్రయ్యవలె నయము నాజూకును తలపెట్టలేదు. సంగీత సాహిత్యములు రెంటికిని సమాన గౌరవము గల రచన దైవ శక్తితో రావలసినదేకాని దానికై ప్రయాసపడి ఫలము లేదని త్యాగయ్యకుఁగూడ అర్థమాయెనేమో! భావములోఁచి మెట్టు స్ఫురించినప్పుడు దానికి తగిన భాష ధారాకారముగా రాదేని అది దాని తప్పే కాని నాది కాదను ఉదాసీనము అతని కుండెనని అనేక కృతులు చాటుచున్నవి. పాటలు రచించువారికందఱికిని ఇది తెగని చిక్కు. తెలుఁగు పదకవులలో ఈ చిక్కును కొని చోట్లనైన తెంచుకొనఁ గల్గిన మహానుభావుఁడు ఒక్క త్యాగరాజే

ఇట్లు సాహిత్యమును అరగంటితో చూచు చిత్తవృత్తి త్యాగయ్యగారియందే బీజ రూపముగా నుండి, గురు భక్తికి పేరుపోయిన అతని శిష్య ప్రశిష్య పరంపరలో మొలచి పెరిఁగి పెద్దదైనది ఆయన సంగీతమును వదిలపఱచుటకు భగీరథ ప్రయత్నము చేసినవారు, చేయుచున్నవారు ఎందఱో కలరు కాని ఆ సాహిత్యము స్ఫురించునట్లు పాడఁగలవారుకాని, దానిని భాషా దృష్టితో కాపాడినవారుగాని అరుదు ఒకటికన్న ఎక్కువ చరణములు గల అతని కృతి యేది పాడినను, ఎవరు పాడినను, రెండవ చరణమైనను తాఁకఁగోరు పుణ్యాత్ములు నేఁటి గాయకులలో అపురూపమైనారు. చాలమందికి వేఱు చరణములు కలవని కూడ తెలియదు డెబ్బదియేండ్ల గొప్ప విద్వాంసు డొకఁడు, సంస్కృత సాహిత్యమును చక్కఁగా చదివినవాఁడు 'సాధించెనే' అను కీర్తనము 'సమయానికి తగు మాటలాడెనే' అను పాదముతోనే ముగిసినదని, మొన్న నేను చెప్పు వఱకును భావించియుండెను! నిజముగా ఆపాటలోని జీవమంతయు తరువాతి పంక్తులలోనేయున్నది. కాని ఆరభిరాగము నేర్చుటకై పడిన శ్రమమంతయు సార్థకపఱచి, పల్లవి, ప్రస్తారముచేసి, స్వరరచనలతో పందిరిగట్టుటకు 'సమయానికి' అను ఆవర్తము మిక్కిలి తగియున్నది ఆ పని చేయుటతో పాటకునికిని, వినువారికిని తృప్తియగును ఇక తక్కిన సాహిత్య భాగ మెవరికిఁ గావలయును? మఱియు పాడినంతలోనైనను శబ్దార్థములను గమనించు గాయకుఁడు దొరకుట నేఁటి మన గొప్ప భాగ్య ఫలము ఇది ఒక త్యాగయ్య తెలుఁగు కీర్తనలకేకాక సామాన్యముగా అన్ని భాషల పాటలకును అంటిన చీడ. శ్రుతి తాళ లయములను చక్కఁగా నిర్వహించు ప్రయత్నములో నమలి మ్రింగవలసినది ఏ శబ్దమైననేమి, ఏ యర్థమైన నేమి?

త్యాగయ్య తెలుగుసాహిత్యమునకు పట్టిన దురవస్థ.

సామాన్యముగ సంగీత విద్వాంసులు నేఁడు సాహిత్య పరిశ్రమగాని, సంస్కారముగాని లేనివారగుటచేత సంగీత విద్య ఇన్నాళ్లవలెఁగాక ఇప్పుడు సాహిత్యపు సంకెళ్లకు లోపడక స్వతంత్రముగా నిలుచుటకు ప్రయత్నించుచుండుటచేత, త్యాగయ్య తెలుఁగు దేశములో పుటి పెరుఁగకపోవుటచేత, అతని శిష్యులందఱును అఱవవారే యగుటచేత, తెలుఁగు దేశమునందు కర్ణాటక సంగీతమునకు వ్యాప్తి రాను రాను క్షీణించుచుండుటచేత,

ఉన్న కొందఱు తెలుఁగు గానవిద్వాంసులు తెలుఁగు పాటలు పాడినను అఱవ వారి పద్ధతులే వారికి చాలావఱకు ఆదర్శముగా నుండుటచేత త్యాగయ్య తెలుఁగు సాహిత్యము ఈ యవస్థకు వచ్చినది

ఇది అఱవవారి దూషణ కాదు త్యాగయ్యపై నిజమైన భక్తిగల యెవరైనను అఱవదేశపు గాయకులను, రసికులను కృతజ్ఞతతో నమస్కరింపక తీరదు నాఁటికిని నేఁటికిని త్యాగరాజ కీర్తనలు వారు పెట్టవలసిన బిచ్చమే త్యాగయ్య, క్షేత్రయ్య మొదలగువారి రచనల ననుభవించుకొఱకు ఎందరో ద్రావిడులు తెలుఁగుభాష సలక్షణముగా నేర్చుకొన్నారు వారి రచనలను వేదములవలె భక్తితో కాపాడినారు అవేమాదిరిగా తెలుఁగులో ఎందఱో కృతులు రచింపఁ బ్రయత్నించినారు వానిని అర్థ తాత్పర్యములతో తెలుఁగులోను, అఱవములోను ప్రకటించినారు, ప్రటించుచున్నారు కాని యెంత భక్తి శ్రద్ధలతో నేర్చినను తెలుఁగు వారికి స్వభాష కాదు కావున వారికి పొరఁబాట్లు తప్పవు తక్కిన వారి మాట అట్లుండ నిండు మహా ప్రతిభగల పండితుఁడు కీర్తిశేషుఁడగు సి ఆర్ శ్రీనివాసయ్యంగార్లవంటివాఁడే ప్రచురించిన త్యాగయ్య కీర్తనములందు, తెలుఁగు రచన యందలి జీవగఱ్ఱలవంటి యతి ప్రాసములను గమనింపక వర్ణమెట్లలో పదవిన్యాసముచేసెను సాహిత్యపు నడక స్పష్టముగా చతురశ్రగతిలో నుండఁగా 'సిగ్గుమాలి నావలె ధర నెవరు తిరుగఁజాలరయ్య' అను కీర్తనను మిశ్రచాపు తాళమున కమర్చి అవక తవకగా ప్రచురించిరి ఇఁక కే వి శ్రీనివాసయ్యంగార్యులు తెలుఁగు వ్యాకరణ మందలి జడశ్రద్ధచే త్యాగయ్య రచనలను నానాముఖముగా తిద్ది పెట్టిన త్రిప్పటలకు తుది మొదలులేదు ఇది సహజము తెలుఁగువారు అఱవ సాహిత్యమునకు చేయివేసినచో ఇంతకంటె మేలుగా పని చేయఁగలరని నమ్ముట కవకాశములేదు మనముబుద్ధిమంతులమై ఊరకున్నాము గనుక బ్రతికినాము!

### తెలుఁగు వారికి మిగిలిన కర్తవ్యము.

కాఁబట్టి ఇదివఱకును తమిళులు చేసిన ఉపకారమునకు వారికి కృతజ్ఞులై, ఇప్పటికైన తెలుఁగువారు తెలుఁగు దృష్టితో త్యాగయ్య సాహిత్యమును సమకూర్చి శోధించి పెట్టుకొని దేశములో వ్యాప్తికి తేవలసి యున్నారు ఇప్పుడు స్వభాషాభిమానము అను పేరితో పర భాషా తిరస్కారము చీడ పురుగువలె అన్ని దేశములందును వ్యాపించుచు భారతీయ విజ్ఞానమును తునకలు తునకలుగా చేయుచున్నది తెలుఁగు కీర్తనలు పాడఁగూడదను భావము అఱవ దేశములో అందందు తల చూపుచున్నది అది ముదురుటకు ముందే ఆంధ్రులు మేలుకొనుట మేలు

# కూచిపూడి భాగవతులు

శ్రీ తాండవకృష్ణ

[1941 వృష సంవత్సరాదిసంచికనుండి]

నేటి దినములలో నాట్యకళకు పునరుద్ధరణము జరుగుచున్నది అఖిల భారత దేశమునందును 'నాట్య' శబ్దము విన్నంతనే ప్రజలు తండోప తండములుగ నాట్యశాలలకు మూగుచున్నారు లలితకళలలో ఒకటైన నాట్యము అగ్రస్థానము వహించుచున్నది

"న తత్ శ్రుతం న తత్ శిల్పం న సా విద్యా న సా కళా,
నాసౌ యోగో న తత్ కర్మ యన్నాట్యే స్మిన్న దృశ్యతే"

పై శ్లోకమునుబట్టి నాట్యమునందు ఇతర లలితకళ లన్నియు అంతర్భూతమై యున్నటుల తెలియుచున్నది నాట్యము ముక్తిప్రదమని కూడ పెద్దలు చెప్పిరి

అట్టి ఉత్కృష్టమైనటువంటి నాట్యకళకు నేటికి మరల మంచి దినములు వచ్చి తగిన స్థానము నది ఆక్రమించుకొనుచుండుట కళారాధకుల కందరికిని ముదావహమైన విషయము

నాట్యకళ భారతదేశమం దన్ని ప్రాంతములలోను వెలసి వివిధ రూపములతో, వివిధావస్థలలో వివిధ నామములతో నుండుచు వచ్చినది భరత నాట్యమని యావద్భారత దేశమునను దీనికి వ్యవహారము గలదు భరతముని ప్రోక్తమై ప్రచారములోనికి వచ్చుటచే గాబోలు దీని కీ పేరు గలిగినది

మలబారు దేశమున 'కథకళి' యనియు, అస్సాము దేశమున 'మణిపురినాట్య' మనియు, సంయుక్త రాష్ట్రమున 'కథక్' అనియు, తమిళనాడు, ఆంధ్రదేశములందు భరత నాట్యమనియు వ్యవహారము జరుగుచున్నది

'కథకళి' నాట్యమున నాట్యకాండ్రు పాటపాడరు వారికి నోట మాటలేదు అది 'టాకీ' కాదు 'మూకీ' 'కథక్', 'మణిపురి' నాట్యములందు ఆటగాండ్రు పాట కూడ పాడుదురు తమిళులును, మనవారును భరతనాట్య శాస్త్రమును,

"కంఠే నా లంబయే ద్గీతం హస్తే నార్థం ప్రదర్శయేత్,
చతుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమాచరేత్"

అను శ్లోకము ననుసరించుచు, తు. చ తప్పక ప్రవర్తించెదరు

ఆంధ్రదేశమున 'కూచిపూడి' యను గ్రామమునుగాని, తద్గ్రామవాస్తవ్యులగు నాట్యకళారాధకులనుగాని ఎరుగనివారు లేరని చెప్పవలెను. పెద్ద 'కారు'లో అసలే లేరు ఇప్పటి కుట్టి 'కారు'లో గూడ నాట్యకళాభివృద్ధి జరుగు నేటిదినములలో పై పేరు చాలమందికి పరిచయమే

కాని, ఆంధ్రేతర ప్రదేశములలో ఆంధ్రులలో నాట్యకళావేత్తలున్నారన్నమాట చాలమందికి తెలియదనియే చెప్పవలెను దీని కంతటికిని కారణము మనవారికి తగిన ప్రచార, ప్రకటనలు లేకపోవుటే మనవారిలో ఒక్కరును ఒక 'బృందము' (Troop) గా ఏర్పడి పట్టణములలోను, నగరములలోను ప్రదర్శించినవారు లేరు అంతేకాక నవీన పంథమునకు సరిపడునట్లు సంస్కార మొనర్చి వారి రుచుల కనుగుణముగ ఆట పాటలను అందిచ్చుట కూడ మనవారిలో తక్కువ అందుచేత మన కూచిపూడి నాట్య సంప్రదాయమునకు ప్రచారము తక్కువ

'కూచిపూడి' బెజవాడకు నలువదిమైళ్ల దూరములో నున్నది అది మా స్వగ్రామమగు 'అయ్యంకి'కి కనుచూపు మేరలో నుండును కూచిపూడి అగ్రహారము ప్రప్రథమమున 'కుచేలపుర'మని అది వ్యవహరింపబడినటుల పెద్దలవలన వినికిడి. ఆ పేరు మారి కూచిపూడి యని ఇప్పటికి చాలకాలమునుండి వ్యవహారము అసలు కూచిపూడి ఆంధ్ర నాట్యమునకు పుట్టినిల్లగుట యెట్లు సంభవించెనో కొంచెము వెనుకకుబోయి పరికించినచో తెలియగలదు

తరంగకర్తయగు నారాయణతీర్థులవారి శిష్యుడు సిద్ధప్ప నామధేయు డొకడుండెను. అతడు వారి శుశ్రూషచే ధన్యుడు గాదలచెను నారాయణ తీర్థులు గ్రుడ్డివాడు మహా భక్తుడగు తీర్థులవారికి బొజ్జయుండెడిదట ప్రతిదినమును లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణపరమాత్మ భక్తుని బొజ్జను తన నాట్యవేదికగ నొనర్చుకొని నాట్యము సల్పుచుండెడివాడట. ఆ నాట్యపు టడుగులకు తాళము తప్పకుండగ తీర్థులవారు తరంగము లల్లుచుండెడివారట ఆ నాట్యమును, వీరి తరంగ కాలక్షేపమును చూచుచు వినుచు సిద్ధప్ప ఆనందాబ్ధి నోలలాడుచుండెడివాడట ఒకనాడు సిద్ధప్పకు ఇదంతయు చూచునప్పటికి కోపము వచ్చెను "ఏమి! ఇతడు మన గురువగు తీర్థులవారి బొజ్జ యంతయు నొచ్చునట్లు నాట్యము చేయుచున్నాడే" అని తలపోసి, మరుసటి దినమున శ్రీకృష్ణులవారు నాట్యము చేయునపుడు "నీ వెవర"వని యడుగ నిశ్చయించుకొనెను.

ఈ విషయమంతయు తీర్థులవారికి విన్నవించగా "నాతడు శ్రీకృష్ణు"డని, యాయనగారు సెలవిచ్చి, నీవును నేనును ప్రపంచ మహా సముద్రమునుండి తరించు టెపుడో యడుగవలసినదని చెప్పెను

మరునాడు శ్రీకృష్ణు డష్టభార్యాసమేతుడై యథా ప్రకారము తీర్థులవారి బొజ్జమీద నాట్యము సేయుచుండెను అంత సిద్ధప్ప భక్తి వినయములతో "మహానుభావా! మా గురువులవారును, నేనును తరించు టె"ట్లని పృచ్ఛించెను అంతట శ్రీకృష్ణుడు పారిజాతాపహరణ గ్రంథమును శృంగార గ్రంథముగ వ్రాసి దానిని ప్రచార మొనర్చినచో సిద్ధప్ప తరించునట్లును, నారాయణతీర్థులకు మరుజన్మమునగాని జన్మరాహిత్యము కలుగదనియు చెప్పెను

అంత పారిజాతాపహరణకథను రచించి, దాని నాడి పాడి ప్రచార మొనర్చుట కనువగు వారి కొర కన్వేషించుచు సిద్ధప్ప కృష్ణాతీరస్థమగు కుచేలపురమను నొక గ్రామమున చేరెను అచట నూరిబయట నొక చింతచెట్టుమీద కూనిరాగములను దీయుచు నిరువురు బాలురు సిద్ధప్పకు గాన్పించిరట అంత నా బాలురు తన ప్రచారమునకు అనువుగ నుందురను తలంపుతో సిద్ధప్ప వారి తలిదండ్రుల పేర్లడిగి తెలిసికొని వారింటి కేగి వారి తలి దండ్రులతో నీ విషయమును దెలిపెను. వా రందుల కనుమానించుచు, నంగీకరింపకతప్పకపోవుటచే నంగీకరించిరి

అంత సిద్ధప్ప వారి కా పారిజాతాపహరణ కావ్యమును, నాట్యాభినయములను ఉపదేశించి వారి నారితేరినవారిని జేసి ధన్యత జెందితినని తలంచెను వా రా కథను తరతరముల నాడి పాడి ప్రచార మొనర్చినంతవరకు శుభము గలుగునని యాశీర్వదించెను

ఇట్లు పూర్వులవలన వినవచ్చు ఈ కథ ప్రచారమం దున్నది ఇంతేకాక సిద్ధప్పను గూర్చియు, కూచిపూడి అగ్రహారమును గూర్చియు మరికొన్ని కథలు గలవు.

ఏదెట్లున్నను కూచిపూడి మాగాణిమీద సిద్ధప్ప యను నాతనివలననే నాట్యదేవత ప్రతిష్ఠింపబడినట్లు తెలియుచున్నది కూచిపూడివారిచే నర్తింపబడు 'భామకలాప' మను శ్రీకృష్ణపారిజాతాపహరణము సిద్ధేంద్రయోగి వ్రాసినట్లు ప్రసిద్ధి.

ఈవిధముగ కూచిపూడిలో నాట్య కళాదేవతకు స్థానము లభించినది నాట్యదేవత కూచిపూడి మాగాణిమీద నర్తించి చనినది కూచిపూడి గ్రామములో నేటికిని ప్రత్యూష సమయములలో శిష్యుల లేత గొంతుకల సంగీత స్వరములు, కాళ్ల గజ్జియల ఘలుఘల్లులు వినువారికి వీనుల సొంపు గలుగజేయుచు ప్రాతబడిన ప్రాభవమును జ్ఞప్తికి తెచ్చుచుండును.

కూచిపూడి బ్రాహ్మణులను మూడు తెగలుగ విభజింపవచ్చును (1) నాటకములాడువారును, (2) పగటివేషకులు, (3) అభినయ దేశికులు.

నాటకము లాడువారు బృందములుగ నేర్పడి గ్రామమునుండి గ్రామమునకు ద్రిమ్మరుచు, తమ కళా నైపుణ్యమును గ్రామ జనులకు ప్రదర్శించుచు వారి నానందపరచుచుందురు పగటి వేషకులు గూడ గ్రామాంతరముల కేగి వివిధ వేషములను ధరించి గ్రామస్థులను దిగ్భ్రమ చెందజేయుచుందురు ఈ సందర్భమున పెద్దలవలన విన్న ఒక కథ స్ఫురణకు దెచ్చుకొనుట అసంగతము గాదేమో

ఒకప్పుడు ఒక కూచిపూడి పగటివేషకుల బృందము తూర్పు గోదావరిజిల్లాలో పర్యటనము చేయుచు నొక గ్రామమునకు జనెనట ఆ గ్రామవాస్తవ్యులందరును ఛాందసపు బ్రాహ్మణులు వారు నాటకములనుగాని, వేషములన గాని జూడకూడదనువారి కక్షకు జెందుదురు నటకు లపాంక్తేయులు, అస్పృశ్యులనని వారి మతము కాన వారి ప్రదేశములో వీరికి తావులేదు. కాని మన కూచివాపూడివా రెంతయు ప్రాధేయపడి వేడుకొనిరి "అయ్యా! మేము ధనాశతో విచ్చటికి రాలేదు పెద్దలును, విద్వాంసులును నగు మీ

సన్నిధానమున మా విద్యా కౌశలమును ప్రకటించి మీ మెప్పులను బడయుటకు మాత్రమే వచ్చినాము" అని సవినయముగ విన్నవించుకొనిరి కాని ఆ ఛాందసులు మాత్రము తమ పట్టుదలను వీడజాలరైరి

అంత మన కూచిపూడివా రేమి చేసిరో యెరుగుదురా? ఆనాటి రాత్రి మరాఠీ సిండు వేషములను ధరించి, కత్తులను, డాలులను పట్టుకొని, అశ్వారూఢులై ఆ గ్రామమును ముట్టడించిరి ఆ వైదిక బ్రాహ్మణు లత్యంత భయాన్వితులై తలుపులు బిడాయించుకొని యెవరింట వారు కాపాడుమని మిమ్ము లెంతయు ప్రార్థించిరట అంత పగటివేషకులు కొద్దికాలం మా బ్రాహ్మణులను భయపెట్టి తదుపరి తమ నిజమైన వేషములను వెల్లడి చేయగా ఉపకారందరును ఆశ్చర్యాన్వితులై పగటివేషకులను సందరిని సన్మానించి పంపిరట

ఈ కథ మన కూచిపూడివారు పగటి వేషధారణతో నెంత సమర్థులో తెలుపుట కుపయుక్తమగును

కూచిపూడి పగటివేషకులు సుమారు ముప్పదిమూడు వేషములను ధరింతురు. అందుతో ముఖ్యమైన కొన్నిటి నీ దిగువ నుదాహరించుచున్నాను బుడబుక్కలవేషము, సోమయాజి—సోమిదేవి, శారదవేషము, కాశీ కావిళ్లవేషము, జంగం వేషాలు, కోమటి—లింగబలిజవేషము, బైరాగి—బాలకి వేషము ఇత్యాదులు

ఇంక అభినయదేశికులు వీరు కళావంతుల స్త్రీలకు అభినయోపదేశము చేయుదురు చేటపట్టిసుందరి, అమలాపురం అన్నాబత్తుల చిట్టి, మండపేట శ్రీవిరాజితము, రామచంద్రపురంవీరభద్రము మొదలగు పేరుమోగిన ఆంధ్ర నాట్య కత్తెలు కూచిపూడివారి శిష్యురాండ్రే కూచిపూడి అభినయ దేశికులు తమ శిష్యురాండ్రగు కళావంతుల స్త్రీలతో వెంటపాటకులుగను, హాస్యగాండ్రుగను పర్యటనముచేసి వారి యార్జనలో పాలుగొందురు అభినయము చేయునపుడు అలయుట సామాన్యము గదా అపుడు కూచిపూడి 'వంత' (వెంట?) పాటకులు హాస్యముచే సామాజికులను వినోదపరచుచుందురు కూచిపూడి బ్రాహ్మణుల హాస్య మత్యంత వినోదకరముగను, విషయపరిజ్ఞానప్రదముగను నుండి, సంఘ పరిస్థితులను, కుహనా సంస్కర్తల సమాచారమును దడవుచు ఉపయోగకరముగ నుండును కాని కొందరు హాస్యము చెప్పునపుడు వెగటుగాను, గొంత అసభ్యముగను నుండుటయు గలదు

సాధారణముగ కూచిపూడివారు కళావంతుల స్త్రీలకు 'భామకలాపము', 'గొల్ల కలాపము', తరంగములు, జావళీలు మొదలగునవి ఉపదేశముచేసి తరిఫీతు నిచ్చెదరు భామకలాపమునందు పారిజాతాపహరణకథ వర్ణింపబడినది దీని కర్త సిద్ధేంద్రయోగులు ఇందు దూతికాలాలనము, సత్యభామా విరహాభినయము, దూతికా రాయబారము, కృష్ణుని దక్షిణ నాయక భార నిర్వహణ కౌశలము, సత్యభామా ప్రతిజ్ఞా పాలనము మొదలైనవి అత్యంతరసవంతమైన ఘట్టములు

గోపికా విప్ర సంవాద రూపమైన వేదాంత గ్రంథము గొల్ల కలాపము కూచిపూడి వాస్తవ్యులగు నప్పలొకరు దీని కర్త వారిపేరు భాగవతుల రామదాసుగారు ఇందు పిండోత్పత్తికథ ముఖ్యమైన భాగము గొల్ల జన్మ, బ్రాహ్మణజన్మ—ఈ రెండింటనే జన్మ శ్రేష్ఠతరము అని భామ బ్రాహ్మణునితో వాదము పెంచుకొని వేదాంత పరముగ బ్రాహ్మణా బ్రాహ్మణ జన్మల తారతమ్య గణనయొక్క సారహీనతను తడివి తుట్టతుదకు కర్మప్రాశస్త్యముచేత బ్రాహ్మణజన్మోత్కృష్ట్యమునే స్థిరీకరించును

ఇందు భామాబ్రాహ్మణసంవాదము అతిమృదువును, ఉపదేశకరమునునై సహృదయానందకరముగ నుండును

కూచిపూడి వైదికపు బ్రాహ్మణులు సంవత్సరమున కారు మాసములకు పైబడి సర్వసాధారణముగ నెపుడును బృందములతో పర్యటనము చేయుచునే యుందురు.

పూర్వము పర్యటనకు పోవునపుడు వా రేమేమి 'సరంజాము'తో బోయెడివారో కొంచెము పరికించినచో సొంపుగ నుండును 'గణేయపు పెట్టె' అను నొక పెట్టె వారి వెంట నుండెడిది దానిలో వారి రంగులు, అలంకారములు మొదలగునవి యుండును ఇది Make—up box అన్నమాట. ఒక ఎద్దుమీద పాత్ర సామాను, వారితో నొక పాకశాస్త్రజ్ఞుడు నుండుచుండెను బృందమువా రెచటికి జనినను వారివంట వారే చేయించుకొనెడివారట! నిష్ఠా నియమములు గలిగిన సద్బ్రాహ్మణులగుటచేత వారి కింకొకరియింట సరిపడెడిదికాదు గాబోలు తమ వంటవానిచే వంట చేయించుకొని దినమున కొక్కమారే స్నాన సంధ్యాద్యనుష్ఠానానంతర మేరెండు గంటలకో భోజన మొనర్చెడివారట.

అందుచేతనే వా రంత బలిష్ఠులై రాత్రియంతయు వాడి పాడినను అలయక యుందురు భామ నాట్యరంగముమీద ప్రవేశించినచో తెల్లవారువరకును ఆట పాటలచే సామాజికుల నందరిని ఆలరింపజేయును ఇప్పటివారు అరగంట యరగంటకును కాఫీ మొదలగు నుద్రేక ద్రవములను త్రాగిగాని అభినయింపజాలకుండుట వారి నియమ రహితమైన జీవితముయొక్క ఫలితమే యని చెప్పవలెను

ఈ విధముగ పర్యటన మొనర్చి వారు దేశమంతటను తమ కళా వైదగ్ధ్యమును వెదజల్లి, కళారాధకులను తనియజేసి భుక్తిముక్తులను సంపాదించుకొనెడివారు.

కూచిపూడి భాగవతులు పర్యటన మొనర్చునపుడు సరిపడని దుండగీడులు వీరిమీద ప్రయోగములను చేయుచుండెడివారట ఆ ప్రయోగములు తమకు దగులకుండ త్రిప్పుకొను శక్తియేగాక ప్రతిప్రయోగములను జేయు నద్భుతశక్తి సామర్థ్యములు కూడ కూచిపూడివారి బృందములలో ననేకుల కుండెడివట ఈ సామర్థ్యములను దెలుపు నొక కథ పెద్దలవలన విన్నది ఇట నుదహరించుచున్నారు

ఒకప్పుడు భాగవతుల దశరథరామయ్యగారు గారను వారు కూచిపూడివారి బృందముతో మలయాళదేశమునకు వెడలిరట మలయాళదేశము ప్రయోగములకు ప్రఖ్యాతి చెందిన దేశము ఈ విషయము విశేషముగా గూడ విఖ్యాతి చెందినటుల నే నొక విదేశీయ వనితవలన వింటిని అటుల వెడలి వా రొక యూర విడిసిరట ఆ యూర నొక విఖ్యాత మాయావి—ప్రయోగములజేయువా డుండెను ఆతని యనుమతిలేక ఆ యూర నే నాటకములును ప్రదర్శింపబడకుండినవి ఆతనిని లెక్కచేయక కూచిపూడివారు తమ ప్రయత్నములు తాము చేసికొనుచుండిరట

ఆనా డుదయమున దశరథరామయ్యగారు బహిర్భూమికి జనుచు చుట్టకాల్చుకొనుట కా ప్రయోక్త భార్యను నిప్పు నర్థించెనట అంత నామె నిప్పును దోసిలితో తీసికొనివచ్చి ఆయన కందిచ్చెనట అంత నాయన నిప్పును తన పైనున్న 'కండువా'లో మూటకట్టినాడట "ఆతనికంటెను ఘను డాచంటి మల్లన"

భర్త గృహమున కరుదెంచగా నామె ఈ అద్భుత వృత్తాంతము నాయనకు దెల్పెనట అంత భర్త మరియు నీర్ష్యాగ్రస్తుడై వారిని తగినటుల శిక్షింపదలచి వారిపై 'ప్రయోగము' ను జేయ ప్రయత్నించెను ఆ కూచిపూడివారు వారి నాట్యారంభమును చేయుసరికి మలయాళ ప్రయోక్త ఒక బావిలో దిగి నీటిని ద్రావ మొదలిడెను అంత 'భామ' కడుపుబ్బ నారంభించెను ఆటులవేసి చివర కాతడు సామాజికులలోని కరుదెంచి యాసీనుడయ్యెనట అంత మంత్ర శాస్త్ర ప్రవీణుడగు దశరథ రామయ్యగారు మంత్రపఠన పూర్వకముగ నొక గంటమును పందిరి స్తంభమున గ్రుచ్చిరట అంత నత్యాశ్చర్యకరముగ నీరంతయు నా స్తంభములోనుండి కారిపోయెనట అంత భామకు బరువు దిగిపోయెనట

పిమ్మట ఆ మలయాళ బ్రాహ్మణునకు ప్రతీకారము జేయనెంచి దశరథరామయ్యగారు మంత్ర ప్రయోగము చేయగా నాయన అండము అభివృద్ధియయి చివరకు కూర్చున్న ప్రదేశమునుండి లేవలేకపోయెనట సామాజికులందరును లేచిపోయిరట! మలయాళ బ్రాహ్మణుడు మాత్రము లేవలేకుండెనట! అంత నాయన భార్య ప్రతిమాలగా దశరథరామయ్యగారు దయదలచి యాతనిని విముక్తుని జేసెరట

ఈ కథ కూచిపూడివా రెట్టి ప్రతిబంధకములనైన నెదుర్కొనుటకు సమర్థులై యుండెడివా రనుట కుపయుక్తమగును

ఇట్టి కథలు, గాథలు కూచిపూడివారిని గూర్చి యనేకములు గలవు కేవలము కథలు గాథలే యొక గ్రంథమునకు సామగ్రి కాగలవు

## కూచిపూడి నాట్యరంగము

కూచిపూడివారి నాట్యశాల ఆనాటి సాయంకాలమే నిర్మింపబడును అది బహు సులభ సాధ్యము చిన్న తాటియాకు పందిరి తెరలు ఉండవు అట్టహాసము, ఆడంబరములు ఉండవు తెరలు, తీగెలు లేకయే వారు తమ అభినయాది విశేషములచే సామాజికులను మంత్రముగ్ధులుగ జేయగలిగియుందురు వారి ఆహార్యము, ముద్రలు, అభినయము మొదలగునవన్నియు ఎంతయు రమ్యముగ నుండి మనోరంజకముగ నుండును

పూర్వము కూచిపూడి నాట్యరంగములు కాగడాలచే వెలిగింపబడెడివి కాని ఈమధ్య కాగడాలు కాలప్రవాహమున కలసిపోయినవి

## కూచిపూడివారి ఆహార్యము

చతుర్విధాభినయములలో నొకటగు ఆహార్యాభినయమునకు గూడ మనవా రత్యంత శ్రద్ధ వహింతురు వారి వేషములలో ముఖ్యము లీ క్రింద నుదాహరించుచున్నాను

భామకలాపములో భామవేషమున కెన్నేని నగలు నాభరణముల నుపయోగింతురు. పేర్లు చెప్పుట మొదలిడిన అనేకములైన పేర్లు గలవు మన పూర్వులా నగల నన్నిటిని ధరించెడివారు నేటిదినములలో గూడ కొందరు రాజుల ఇండ్లలో కూచిపూడి భామవేషమంతయు బంగారు నగలు లభించగలవు పెద్దజడ, చిన్నజడ, శిఖ, రాగిడి, చంద్రవంక, సూర్యుడు, తమలపాకులు, మొగలిరేకులు, కేతకి, తురాయి, పాపటపింజినీలు, కమ్మలు, చేర్లు, జూకాలు, కర్ణపత్రములు, తాయెత్తులు, బాజుబందులు, దండ కడియములు, మత్స్యములు, పోచీలు, కంకణములు, కడియములు, చిన్న పతకము, పెద్ద పతకము, పట్టెడ, బిళ్లల మొలతాడు, అడ్డబాస, కట్టడపు బులాకీ, ముక్కుపుడక మొదలగునవి కూచిపూడి భామకు ఉపయోగించెదరు

ఇంక రాజవేషముయొక్క వివిధములైన నామములు—కిరీటము, దవురు లేక లంగా, నల్లకోటు, కాశికోక, కండువాలు, శంఖచక్రములు లేక భుజకీర్తులు, కర్ణపత్రములు, గండభేరుండము (పతకము) మొదలైనవి

ఇతరములైన వేషములకు కొన్నిటికి 'కరాళములు' లేక 'ముసుగు'లు (Masks) ఉపయోగించెదరు పాత్రానుగుణముగ ఆహార్యముల నుపయోగింతురు. చతుర్ముఖుడగు

బ్రహ్మ, నరసింహావతారము, శక్తి, దితి, హనుమంతుడు, మొదలగు పాత్రలకు 'కరాళము'ల నుపయోగింతురు. పాత్ర శీలానుగుణముగను, పాత్ర ఆకారానుగుణముగను, కరాళములు, ఉపయుక్తములగును ఆ యా పాత్రలకు కరాళము లుపయోగించకపోయినచో పాత్రా నుగుణమగు రసస్ఫూర్తి గలుగవేరదు అందుచే మిగుల నావశ్యకమగు పాత్రలకే 'ముసుగు'ల నుపయోగింతురు

## కూచిపూడివారి ఆచార వ్యవహారములు

కూచిపూడివారి ఆచారములు కొన్ని కలవు కూచిపూడి మాగాణిమీద పుట్టిన ప్రతి వ్యక్తియు ముక్కు చెవులను కుట్టించుకొని గ్రామాంతరస్థిత నటరాజాలయ మును దర్శించి నాట్యాధిదేవుడగు శివునకు జోహారు లియ్యవలసినదే ఈ ఆచారము నేటికి చాలవరకు నశించినదనియే చెప్పవలెను

## కూచిపూడివారి మేళతాళములు

కూచిపూడివారి హంగునకు వంత (వెంట?) పాటగాడు, తాళమువేయువాడు, శ్రుతికి 'తిత్తి' నూదువాడు, మార్దంగికుడు నుందురు ఇప్పుడు 'తిత్తి' వి దీసి పార వైచి హార్మోనియమును దగిలించిరి హార్మోనియము భారతీయ వాద్యము గాదని హాహా కారములు సేయుచున్న ఈ రోజులలో గూడ వీ రింకను వద్దానినే యుపయుక్తమొనర్చు చున్నారు

ఈ పై వాద్యములతో హంగుదారుల నేర్పరచుకొని, కూచిపూడి నాట్యకాడు తా నభినయించు పదములను తాను పాడుచు ముద్రలచేతను, భంగిమల వలనను, నేత్రా ద్యవయవాభినయముల వలనను రసస్ఫూర్తిని గలుగజేసి సామాజికుల నెంతయు రంజింప జేయును

కూచిపూడివారు భామకలాపము, గొల్లకలాపము, నాటకములుగాక తరంగములు, జయదేవుని అష్టపదులు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు, క్షేత్రయ మువ్వ గోపాల పద ములు మొదలైనవానిని గూడ నభినయించి వివిధములైన సామాజికులను రంజింప జేయ గలరు

## నేటి కూచిపూడి

కూచిపూడివారు మరి యే భారతీయేతర ప్రాంతముల నాట్యకాండ్రకును తీసి పోరు కాని మనవారికి నేను పైని వివరించినటుల ప్రచారము తక్కువ మనదేశములో నైనను కూచిపూడివారి నాదరించి, వారి ప్రదర్శనముల నేర్పాటు చేయువారు తక్కువ అసలు సంగీతము, నాట్యము మొదలగు లలిత కళలకే మన ప్రాంతమున ఆదరము తక్కువేమో యని యనుకొనవలసి వచ్చుచున్నది

నేటికి పోగా మిగిలినవారిలో వేదాంతము లక్ష్మీనారాయణగారు, చింతా వెంకట రామయ్యగారు, కూచిపూడి భరతనాట్య శాస్త్ర ప్రవీణులు శ్రీ వెంపటి వెంకట నారా యణగారు భరతశాస్త్ర ప్రవీణులని అఖిల భారత విఖ్యాతిని బడసిరి వారి సంతతిలో గాని, వారి శిష్యులలోగాని వారిస్థానము నాక్రమించుకొనగలిగినవారు లేకపోవుట కడుం గడు విచారించదగిన విషయమే

జీర్ణించుచున్న కూచిపూడి నాట్యోద్ధరణమునకు కళారాధకులందరును కట్టు గట్టి కర్తవ్య మాలోచించుకొనినగాని కూచిపూడి నాట్యము కొద్దికాలములో రూపు మాసిపోవునేమో యను నూహ కవకాశము గలుగుచున్నది నేటి పరిస్థితులను పరికించి నచో

కాని నేడు ఉత్సాహవంతులగు కూచిపూడి యువకులు కొందరు కలసి యొక బృందముగ నేర్పడి కొంత సంస్కరణము దీసికొని రాగలందులకు జేయు ప్రయత్నము లభినందనీయములే యగును వారిలో శ్రీ వెంపటి సత్యనారాయణమూర్తి, వేదాంతము రాఘవయ్యగార్లు ముఖ్యులు

ఈ ప్రాచీనాహార్యములు ధరించుటయే నేటి కూచిపూడివారికి మాసిపోయి నది అసలీ విషయములను సంపాదించుటకే నాకు తల ప్రాణము తోకకు వచ్చినది వేషము వేయించుటకు గూడ ఎంతో ప్రయాసమైనది ఇప్పటి కూచిపూడి వా రిట్టి స్థితిలో నున్నారు

ఇపుడు కూచిపూడివారు 'భామ కలాపము'ను, 'గొల్ల కలాపము'ను ఆడుట మాని వేసినారు అవన్నియు మాసినవట ఏమి వైపరీత్యము!!

ఇప్పటికైనను పోయిన ప్రాభవమును పునఃప్రతిష్ఠాపన చేయవలెనన్నచో కూచి పూడి నాట్య కళాశాలలను వెంటనే స్థాపించి ఆంధ్రదేశములో నున్న లభినయవేత్తలనందరి నొకచోట సమావేశమొనర్చి, ఆంధ్ర భరత నాట్యకళకు కేంద్రీకృత మొనర్చి, సమర్థుల చేత కళాబీజములను విరివిగ జల్లించినగాని మిక్కిలి భయంకరముగా పరిస్థితు లేర్పడు నటుల దోచుచున్నది

సంపన్నులకు సంస్కారము తక్కువ, విపన్నులకు వివేక మెక్కువ

విస్పష్టముగా నిరూపించుట కవకాశము కలిగెను

గంగేశోపాధ్యాయుని చింతామణి సర్వోత్కృష్టమగు గ్రంథమగుటచే తరువాతి నైయాయికులు నూతన గ్రంథములను వ్రాయుటమాని దానికి వ్యాఖ్యానములు వ్రాయుట యందే ప్రవృత్తులైరి

గంగేశుని కుమారుడగు వర్ధమానోపాధ్యాయుడు తన తండ్రిగారి గ్రంథమునకును, ఉదయనాచార్యుని గ్రంథములకును వ్యాఖ్యానములను వ్రాసెను. ఇతనియు ప్రకాశ మనెడు పేరుతో ... జయదేవాపరనామముల పక్షధరమిశ్రుడు చింతామణికి ఆలోక మను వ్యాఖ్యానమును వ్రాసెను. ఈ జయదేవుని శిష్యుడగు వర్ధమానుని కుసుమాంజలి ప్రకాశమునకు మకరందమను వ్యాఖ్యానమును వ్రాసెను

16—వ శతాబ్దమున నవద్వీపమున న్యాయశాస్త్ర ప్రచారము చేసిన వాసుదేవ సార్వభౌముని శిష్యుడు రఘునాథుడను తార్కిక శిరోమణి గంగేశుని తరువాత నితడే యెన్నదగిన నైయాయికుడు. ఇతడు గంగేశుని చింతామణికి దీధితియను వ్యాఖ్యను వ్రాసెను. చింతామణిలోని రెండుఖండములకే దీధితి యగుపడుచున్నది. రఘునాథుడు వైశేషిక మత ఖండనమగు పదార్థఖండనము మొదలగు మరికొన్ని గ్రంథములను గూడ రచించెను

ఇతని శిష్యుడు మథురానాథుడు. ఈతడు చింతామణికిని, దీధితికిని గూడ వ్యాఖ్యానములు వ్రాసెను. ఇతడును, జగదీశుడును సమకాలికులు. జగదీశుడు దీధితికి వ్యాఖ్యానమును వ్రాసెను. ఇది జాగదీశి యను పేరున వెలయుచున్నది. ఈతడు శబ్దశక్తిప్రకాశిక యను వార్తికగ్రంథమును, భాష్యసూక్తి యను ప్రశస్తపాదభాష్య వ్యాఖ్యానమును, తర్కామృత మను చిన్న ప్రకరణమును గూడ రచించెను

మథురానాథ జగదీశులకు సమకాలికుడగు హరిరామ తర్కాలంకారుని శిష్యుడు గదాధరుడు. అందుచే నితడు 17—వ శతాబ్దమువాడు కావచ్చును. ఈతడు కూడ దీధితికి వ్యాఖ్యానమును వ్రాసెను. ఇయ్యది గాదాధరి యని ప్రసిద్ధి చెందినది. మరియు నీతడు చింతామణి భాగములకుఁ గూడ వ్యాఖ్యానము వ్రాసెను. ఇదియే మూలగాదాధరి యని వ్యవహరింపబడుచున్నది. ఇవిగాక వ్యుత్పత్తివాద—శక్తివాదములను వార్తిక గ్రంథములను, ఉదయనాచార్యుని యాత్మతత్త్వవివేకమునకు వ్యాఖ్యానము మొదలగు ననేక గ్రంథములను ఈతడు రచియించెను.

17—వ శతాబ్దమున రఘుదేవుని శిష్యుడగు శంకరమిశ్రుడు దీధితి కొక వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతడే వైశేషిక సూత్రములకుపస్కార మను నొక వృత్తిని వ్రాసెను. ప్రశస్తపాదభాష్యము సర్వజన సౌలభ్యము గాకుండుటచేత శంకర మిశ్రకృతమగు నుపస్కార మను వృత్తినే యాధారముగా చేసికొని వైశేషిక దర్శనము పాన పాకములలో నున్నది

16—వ శతాబ్దముననే విశ్వనాథ పంచాననుడు న్యాయదర్శనములకు పూర్తిగా నొక వృత్తిని వ్రాసియున్నాడు. ఆతడే నవ్య న్యాయపద్ధతి నవలంబించి కారికావళిని, దానికే ముక్తావళి యను వ్యాఖ్యను రచించెను. అది వైశేషికదర్శనము ననుసరించియే వ్రాసినట్లు గానవచ్చుచున్నది. న్యాయసూత్రములలోఁ జెప్పిన రీతిని కొంత యనుసరించి నను వాద జల్ప వితండములను జాతి నిగ్రహ స్థానములను జెప్పకపోయినందున న్యాయ సూత్రములను పూర్తిగా ననుసరించినట్లు కా రాదు. వైశేషిక సూత్రములలో జెప్పిన ప్రత్యక్షానుమానములకే ప్రామాణ్యమును విడనాడి న్యాయసూత్రములలోఁ జెప్పిన ప్రమాణ చతుష్టయము నవలంబించుటవలన వైశేషిక మతమును కొన్నిచోట్ల విడిచినట్లు గూడ కానవచ్చుచున్నది. ఈ గ్రంథమునకు దినకరభట్టు దినకరియను వ్యాఖ్యను వ్రాసెను

ఈ దినకరికి రామరుద్రుడను నాంధ్ర దేశీయుడు రామరుద్రీయ మను వ్యాఖ్యను వ్రాసెను. ప్రస్తుత మది నాలుగు ఖండములకు మాత్రమే లభ్యమైనది. ఇతడు దీనికే కాక గదాధరకృతములగు వ్యుత్పత్తివాద, శక్తివాదములకుఁగూడ వ్యాఖ్యానమును వ్రాసెను.

ఇటీవల ప్రాచీన ప్రకరణముల సంగతులను విడనాడి అన్నంభట్టు నవ్యరీతి ననుసరించి తర్క సంగ్రహమను స్వతంత్ర గ్రంథమును వ్రాసెను. దాని కతడే దీపిక యను వ్యాఖ్యను వ్రాసెను

దీపికాభిప్రాయములను పూర్తిగా తెలియఁజేయుటకు నీలకంఠుడు నీలకంఠీయ మను వ్యాఖ్యను వ్రాసెను. పై వానికి ప్రకరణము లనిపేరు.

పై న్యాయశాస్త్ర చరిత్రమునుబట్టి ఈ శాస్త్రము రెండు విధములుగా నభివృద్ధి చెందినట్లు తెలియఁగలదు. మొదటినుండి 12 వ శతాబ్దమువరకు సూత్ర గ్రంథముల నాధారము చేసికొని ఈ శాస్త్రము వికాసము బొందినది. అప్పటినుండి సూత్రముల పక్కని విడచి తత్త్వచింతామణి నాధారముగాఁ జేసికొని వ్యాప్తిని జెందినది. ఈ భేదమును బట్టియే మొదటి దానికి ప్రాచీనన్యాయమనియు, రెండవ దానికి నవీన న్యాయమనియు వ్యవహారము గలిగినది. కాలభేదమున వీటి శైలిలోఁ గూడ భేదము గలదు

గాదాధరి మొదలగు సద్గ్రంథములు సంప్రదాయముగా చదివినను దర్శనములందున్న యున్ని విషయములను తెలియనందున ప్రకరణజ్ఞాన మావశ్యకము. ప్రకరణజ్ఞాన మితర శాస్త్రముల కుపయోగించినట్లు ఉద్గ్రంథ పఠన మంత యుపయోగించదు. కాన శాస్త్ర మభ్యసించువారు ప్రకరణముల నభ్యసించుట యుక్తమని నా యాశయము.

# హైదరాబాదు రాష్ట్ర విద్యాసమస్యలు

శ్రీ సురవరము ప్రతాపరెడ్డి

**[1941 వృష సంవత్సరాదిసంచికనుండి]**

[1881 నుండి జరుగుచు వచ్చుచున్న విద్యావ్యాప్తి క్రమము—హిందువులకన్న ముసల్మానులలో మూడింతలు హెచ్చు విద్యావ్యాప్తి—స్త్రీ విద్య అధ్వాన్నపు స్థితి—విద్యా వ్యాప్తికి నిజాము ప్రభుత్వమువారు తీసుకొనుచున్న శ్రద్ధ తగినంతగా ఫలించక పోవుటకు కారణములు—హిందువులలో విద్యావ్యాప్తి బొత్తిగా లేకపోవుటకు కారణములు—ఉర్దూ మాతృభాషగా కలవారికి మాత్రమే లాభకరమును, ఇతరులకు కష్ట నష్టములకు కారణమును అయిన ప్రభుత్వ విద్యా విధానము—హిందీకి ఉర్దూ ప్రత్యామ్నాయమా? ఉర్దూ వలన కలిగిన అపార నష్టము—ఖాస్గి బళ్లపై నిర్బంధాజ్ఞ—జాగీర్లలో విద్య వెనుకపాటు—మత విద్యా ప్రాధాన్యము, తత్ఫలితములు—ఆశాభంగమును కలిగించిన మెకంజీ నిదానము—దేశ భాషలకు ప్రోత్సాహము కలిగించిన కొందఱు మొగిలాయి రాజులు ]

హైదరాబాదు రాష్ట్రములోని విద్యా సమస్యలను గురించి బ్రిటిషిండియాలోని ఆంధ్రులు సరిగా తెలియుకొనినవారు కారని తోచుచున్నది. ఎన్నియో మారులు అచ్చట ప్రకటింపకు వినియోగించి వారికీ సమస్యలు సరిగా తెలియలేదని స్పష్టపడినది. అందుచేత ఈ వ్యాసమందు నేను ఒక సమగ్రమైన సింహావలోకన చర్చ చేయుటకు ప్రయత్నింతును.

### కొన్ని అంకెలు

హైదరాబాదు రాష్ట్ర విద్యా సమస్యలను గ్రహించుటకు ముందు ఈ క్రింది అంకెలను దృష్టిలో నుంచుకోవలెను.

| | |
|---|---|
| రాష్ట్ర జనసంఖ్య | 1,44,36,148 |
| అందు హిందువులు | 1,21,76,727 |
| ముసల్మానులు | 15,34,666 |
| భాషా విభాగ ప్రకారము చూచిన— | |
| ఆంధ్రులు | 69,72,534 |
| మహారాష్ట్రులు | 37,96,838 |
| కర్ణాటకులు | 16,20,094 |
| ఉర్దూ హిందీ మాట్లాడువారు | 15,07,277 |
| రాష్ట్రాదాయము (1938 లో) | 9,15,46,000 రూ |
| విద్యపై వ్యయము ,, | 1,24,19,072 రూ |
| విద్య వచ్చినవారి సంఖ్య (1931 జనాభా ప్రకారము) | |
| హిందువులలో నూటికి | 3 3 |
| ముసల్మానులలో ,, | 10 3 |
| మొత్తముపై ,, | 4 8 |

1881—వ సంవత్సరమునుండి విద్యావ్యాప్తి యే విధముగా జరుగుచు వచ్చినదో ఈ క్రింది అంకెలు విశదముగా తెలుపుచున్నవి

| సంవత్సరము | నూటికి విద్య వచ్చినవారు | హిందువులలో నూటికి విద్య వచ్చినవారు | ముస్లిములలో నూటికి విద్య వచ్చినవారు | వ్యయము రూపాయిలు |
|---|---|---|---|---|
| 1881 | 3 7 | 2 98 | 4 9 | 2,29,220 |
| 1891 | 4 7 | 3 37 | 6 6 | 3,03,292 |
| 1901 | 3 4 | 2 5 | 6 5 | 7,48,665 |
| 1911 | 3 2 | 2 3 | 5 9 | 10,19,787 |
| 1921 | 3 3 | 2 6 | 8 9 | 68,29,907 |
| 1931 | 4 8 | 3 3 | 12 4 | 90,77,063 |

ఇందలి ఒక చిత్రమును గమనింపవలెను 1891 లో అనగా 40 ఏండ్ల క్రిందట 3 లక్షల చిల్లర రూపాయిలు మాత్రమే విద్యపై వ్యయము చేయగా నూటికి 4 7 (అనగా 1000 కి 47) మంది విద్య వచ్చినవారుండిరి 40 ఏండ్ల తర్వాత 90 లక్షల చిల్లర రూపాయిలు వ్యయము చేసినప్పటికిని విద్యవచ్చినవారి సంఖ్య ఇంచుమించు అంతే ఉండిపోయినది ఈ 40 ఏండ్లనుండి చేసిన ప్రయత్నమంతయు క్రమముగా 1891 స్థితికి తెచ్చుటకేనా అని అనిపించును ఇందింకొక విశేష మేమనగా ముసల్మానులలో విద్య హిందువులకన్న ఇంచుమించు మూడింతలు హెచ్చుగా వ్యాపించినది స్త్రీ విద్యను చూచిన అది మరీ అధ్వాన్నముగా ఉన్నది ఎట్లనగా, క్రీ శ 1921 లో

| | | |
|---|---|---|
| హిందువులలో విద్యవచ్చిన స్త్రీల సంఖ్య మొత్తము | | 17,316 |
| ముసల్మానులలో | ,, | 19,599 |
| క్రీ శ 1931 లో— | | |
| హిందువులలో విద్యవచ్చిన స్త్రీల సంఖ్య మొత్తము | | 15,502 |
| ముసల్మానులలో | ,, | 26,847 |
| హైదరాబాదు రాష్ట్రములో మొత్తం గ్రామాల సంఖ్య | | 21,830 |
| క్రీ శ 1938 లో రాష్ట్రములో మొత్తం పాఠశాలలు | | 6,189 |

వీటిపై ప్రభుత్వమువారు 1,24,19,072 రూ వ్యయము చేసినారు.

### ప్రభుత్వము వారి ప్రయత్నాలు

నిజాం ప్రభుత్వమువారు విద్యావ్యాప్తికై ఎక్కువ శ్రద్ధ వహించుచున్నారు ప్రాథమికవిద్య, అనగా ప్రైమరీస్కూలు విద్య ఉచితముగా చెప్పించబడుచున్నది ఇప్పుడు ప్రాథమిక పాఠశాలలలోను, సర్కారీ పాఠశాలలలోను బాల బాలికలనుండి జీతములు తీసుకొనరు బళ్ల సంఖ్య కూడా చాలా హెచ్చినది 20 ఏండ్ల క్రిందట ఎంత వ్యయము చేయుచుండిరో అంతకు రెండింతలు ఇప్పుడు వ్యయము చేయుచున్నారు వయోజన విద్యకై రాత్రి పాఠశాలలను కూడ అచ్చటచ్చట ప్రారంభించినారు ఈ విధముగా ప్రయత్నములు చేయుచున్నను విద్యా వ్యాపకము తగినట్లుగా కాకపోవుటయేల యని యాశ్చర్యము కలుగవచ్చును మరియు హిందువులలో విద్యావ్యాపకము బొత్తిగా కనిపించుటలేదు దీనికి కారణము లెవ్వియో తెలుసుకొనవలసియుండును.

### విద్యావ్యాప్తి కాటంకములు

నిజాంరాష్ట్రములో విద్యావ్యాప్తి కానందులకు ముఖ్యకారణములను ప్రజానాయకులు పలుమారు చూపించియున్నారు హైదరాబాదు ప్రజా విద్యామహాసభ అను పేరులో ఇంతవరకు మూడు మహాసభలు జరిగినవి అందలి తీర్మానములు గమనించిన ప్రజా నాయకుల దృష్టిలో విద్యావ్యాప్తి కాటంకము లెవ్వియో విశదమగును ఇచట ఆ తీర్మానముల సారాంశమును మాత్రము వ్రాయుచున్నాను

1 రాష్ట్రములో విద్యా వ్యాపకము కావలెననిన ఈ క్రింది ఏర్పాటులను ప్రభుత్వమువారు చేయవలెను —

(అ) ప్రైవేటు బళ్లపై పెట్టిన నిర్బంధములను తొలగించవలెను

(ఇ) గ్రంథాలయములపైనను, ప్రైవేటు బళ్లపైనను పోలీసువారు ఒక దృష్టి ఉంచవలెనని క్రీ శ 1911 లో ప్రభుత్వమువారు కావించిన ఆజ్ఞ తీసివేయవలెను

(ఉ) విద్యా సంబంధపు సకలవిధమైన నిర్బంధములను తీసివేయవలెను

2 సర్ఫెఖాసులలోను, సంస్థానములలోను, జాగీర్లలోను విద్యావ్యాపకము చేయవలెను

(సర్ఫెఖాసు అనగా మహా ఘనత వహించిన నిజాము ప్రభువుగారి సొంత వ్యయానికై ఒక జిల్లాయు, మరికొన్ని తాలూకాలును ప్రత్యేకింప బడినట్టి భాగము )

3 వయోజన విద్యకై ఏర్పాట్లు చేయవలెను
4 నిర్బంధ ప్రారంభవిద్య ఉచితముగా చెప్పించు నేర్పాట్లు చేయవలెను
5 మాధ్యమిక పాఠశాలలలోను, ఉన్నత పాఠశాలలోను ఉర్దూలో విద్య చెప్పించు చున్నారు అట్లుకాక ఏ జిల్లాలో ఏ భాష ప్రధాన భాషగా ఉండునో దాని లోనే విద్య చెప్పించవలెను

నిజాం రాష్ట్రములో కొన్ని సంవత్సరములనుండి ఆంధ్ర మహాసభ ఏర్పడి ప్రజాభ్యుదయమునకై బాగుగా పనిచేయుచున్నది ఇంతవరకు ఏడు మహాసభలు జరిగినవి ఈ సభలలోను పై తీర్మానములు కావింప బడుటయేకాక ఈ క్రింది విశేష తీర్మానములు కావింపబడెను వాటి సారాంశ మేమన—

1 ఆంధ్ర స్త్రీలకు ఆంధ్రభాషామూలమున విద్య చెప్పించుటకై కళాశాలలను స్థాపించవలెను
2 ఉన్నత విద్య జనుల మాతృభాషలోనే ఉండవలెను

ఇదేవిధముగా హైద్రాబాదు రాష్ట్రములోని మహిళాసభలు, కర్ణాటక, మహారాష్ట్ర సభలును, జిల్లాల సభలును తీర్మానములు చేసియున్నవి ఈవిధముగా ప్రతి మహాసభలోను, ఆంధ్రులు, మహారాష్ట్రులు, కర్ణాటకులు తీర్మానములు చేయుట ఎందులకో తెలుసుకొనిన విషయము స్పష్టపడగలదు

## ప్రభుత్వవిధానము

హైద్రాబాదు రాష్ట్ర ప్రభుత్వమువారు అవలంబించిన విద్యా విధానము కేవలము ఉర్దూ మాతృభాషగా కలవారికే లాభకారిగా ఉన్నది ఇతరులకు నష్ట కష్టములు కలిగించుచున్నది ఈ రాష్ట్రములో పూర్వము ఉర్దూకు ప్రాధాన్యము లేకుండెను 80 సంవత్సరాలకుముందు ఇచ్చట ఫార్సీ రాజకీయభాషగా ఉండెను కాని, జిల్లా కచ్చేరీలలోను, పాఠశాలలలోను జిల్లాభాషకే ప్రాధాన్యము నిచ్చియుండిరి క్రీ శ 1834 లో మొట్ట మొదట హైద్రాబాదు నగరములో ఒక ఇంగ్లీషు పాఠశాలను స్థాపించిరి క్రీ శ 1859 లో ప్రతి తాలూకాలోను రెండు పాఠశాలలు స్థాపించునట్లును, ఫార్సీ కొకటి, ముల్కీ భాషకు (అనగా జిల్లాభాషకు) ఒకటివంతున స్థాపించునట్లును ప్రభుత్వమువా రాజ్ఞాపించిరి క్రీ శ 1881 లో 'దేశభాషల' విద్యాబోధను విచారించుకొనుటకు ఒక విద్యాధికారిని ఏర్పాటు చేసిరి క్రీ శ 1884 లో జిల్లాలలో మొత్తము 125 ముల్కీ భాషల పాఠశాలలను నెలకొల్పియుండిరి

## ఉస్మానియా విద్యాపీఠస్థాపన

అటు తర్వాత మెల్ల మెల్లగా ఉర్దూ ప్రారంభమయ్యెను కాని 1917—వ సంవత్సరమువరకు దానికి ప్రాధాన్యము లేకపోయెను క్రీ శ 1917 లో సర్ అక్బర్ హైదరీగారు హైద్రాబాదు రాష్ట్ర విద్యావిధానములో మార్పు కావించుటకై ప్రభుత్వమువారికిని, మ ఘ వ శ్రీ నైజాం ప్రభువుగారికిని ఒక జ్ఞాపిక(Memoramdum) పంపుకొనిరి అం దిట్లు సెలవిచ్చిరి

"పరభాషలోని బోధవలన చాలా లోపములు కలుగును విద్యార్థుల మెదడుపై అధికమైనట్టియు, అనవసరమైనట్టియు భారము కలుగును పరభాషలో విద్య చెప్పించిన బాలురు విషయగ్రహణశక్తులుగా నుండరు పరభాషలోని చిక్కులను స్వాధీన పరచుకొనుటలో వారి స్వతంత్రబుద్ధి నష్టమగును ఉర్దూలో విద్య నేర్పిన రెండు ఆక్షేపణలు కలుగవచ్చును రాష్ట్రములో ప్రజా బాహుళ్యము ఇతర భాషలను మాట్లాడును ఉర్దూలో పాఠ్య గ్రంథాలు లేవు మొదటిదానికి సమాధాన మేమన ఉర్దూ మాతృభాషగా కలవారు అల్ప సంఖ్యాకులనుట నిజమే అయినను ఉర్దూభాష రాష్ట్రముయొక్క విజ్ఞాన సంబంధము కల భాష, మరియు కచ్చేరీ భాషయు అయియున్నది ఇంతేకాక ఉర్దూభాష శిష్టజనుల భాషయు అయియున్నది

(Although it is true that those whose mother-tongue is Urdu, are in a minority yet Urudu is the cultural and official language of the state and of polite Society ")

సర్ హైదరీగారి అభిప్రాయము ప్రకారము క్రీ శ 1918లో ఉస్మానియా విద్యాపీఠము స్థాపింపబడెను దానిస్థాపనతో మాధ్యమికోన్నత పాఠశాలలలోను, కళాశాలలలోను ఉర్దూలోనే విద్య చెప్పించుట మొదలయ్యెను ప్రైమరీ తరగతులలోను మూడవ తరగతినుండియే ఉర్దూ బోధ మొదలయ్యెను ముల్కీ భాషలకు స్థానము లేకపోయెను ఉర్దూ ద్వారా విద్య చెప్పుటకు పాఠ్య గ్రంథా లవసరమయ్యెను అందుచేత ఒక తర్జుమా కచ్చేరి ఏర్పాటు చేసిరి దానిలో 20 ఏండ్లు కష్టపడి 20 లక్షలు ఖర్చుపెట్టి 200 తర్జుమా గ్రంథాలను అచ్చుకొట్టిరి క్రొత్త శబ్దజాలమును సృష్టించుటకై కొందరు విద్యాధికులు నియుక్తులైరి వారు ఏటేటా సుమారు 5000 నుండి 10,000 వరకు ఇంగ్లీషు పదాలకు క్రొత్త ఉర్దూ సాంకేతిక పదములను, ఇతర పదములను సృష్టి చేసిరి ఈవిధముగా ఉర్దూ వాఙ్మయము అభివృద్ధి అయ్యెను ముల్కీ భాషలలో ఒక గ్రంథమైనను అచ్చు కాలేదు ఒక క్రొత్త పదమైనను సృష్టి కాలేదు ఈ కారణముచేత ఉర్దూ మాతృభాషకానివారి విద్య పూర్తిగా వెనుకబడెను

## న్యాయమూర్తి నాయకుగారి విమర్శ

ఇట్టి విద్యా విధానమువలన హిందువుల కెట్టి నష్టము కలిగెనో, దానిని గురించి బ్యారిష్టర్ రామచంద్రనాయక్‌గారు (ఇప్పుడు వీరు హైద్రాబాదు ప్రభుత్వపు హైకోర్టులో న్యాయమూర్తి (జస్టిస్)గా ఉద్యోగము చేయుచున్నారు ) క్రీ శ 1931 లో హైద్రాబాదులో రాజకీయసభ చేయుటకు ప్రభుత్వమువారు సెలవియ్యనందున బీరారులోని అకోలా అను పట్టణములో జరిగిన హైద్రాబాదు సంస్థాన రాజకీయ మహాసభకు అధ్యక్షత వహించి తమ ప్రారంభోపన్యాసములో ఈవిధముగా తమ అభిప్రాయమును ప్రకటించిరి

"ప్రభుత్వమువారు ఏటేట 78 లక్షల రూపాయీలను విద్యకై వ్యయము చేసినను (ఇది 1931 నాటి మాట), విద్య వచ్చినవారు వేయింటికి 35 మంది మాత్రమే అత్యధిక సంఖ్యాక ప్రజల భాష ఉర్దూ కాకున్నను ఉర్దూ ద్వారా ఉస్మానియా విద్యాపీఠములో విద్య చెప్పించుటలో ఎక్కువ ద్రవ్యము నగరములోనే పెద్ద పెద్ద జీతాలకు, బంగ్లాల అద్దెలకు, గ్రంథాల తర్జుమాలకు మున్నగువాటికై వ్యయము చేయుచున్నారు బీదలకన్న ధనికుల పిల్లలకే ఉపకార వేతనాలు ఎక్కువగా ఇచ్చుచున్నారు విదేశాలలో బ్యారిష్టరీలను మున్నగువాటి నభ్యసించువారికి ద్రవ్యము ఎక్కువగా ఇచ్చుచున్నారు ప్రాథమిక పాఠశాలలలో మాతృభాషలలో సరిగా విద్య చెప్పించరు ఇది యిట్లుండగా ప్రజలే ప్రైవేటు బళ్లను స్థాపించుకొనిన వాటిపై ఆంక్షలు, నిర్బంధాలు పెట్టి విద్యావ్యాప్తి కాటంకములు కలిగించుచున్నారు ఉర్దూరాని బాలికలకు రాష్ట్రములో ఒక్క ఉన్నత పాఠశాలయైనను లేదు లార్డు ఇర్విన్ వైస్రాయిగారు 'విద్యను ప్రజలందరికిని ఉపయోగకారిగా ఉండునట్లు చేయవలెను' అని చెప్పిపోయిరి కాని, యింత వరకు ప్రభుత్వమువా రేమియు చేయకపోయిరి "

బ్యారిష్టరులును, జాగీర్దారులును, ఉదారులును, ప్రజానాయకులలో ముఖ్యులుగా నుండినట్టివారును, ఇప్పుడు ఉన్నత న్యాయస్థాన న్యాయమూర్తులును అయిన శ్రీయుత రామచంద్రనాయక్‌గా రిచ్చిన పై అభిప్రాయమువంటి అభిప్రాయములనే ప్రతి హిందూ నాయకుడును ప్రకటించుచు వచ్చినాడు నూటికి 10 మంది మాతృభాషయైన ఉర్దూభాషను దాని నెరుగనట్టి నూటికి 90 మందిపై మోపుటవలన ఎంత ద్రవ్యము వ్యయము చేసినను విద్యావ్యాపకము కాకపోవుట కనబడుచునేయున్నది

## కాంగ్రెసువాదము

బ్రిటిషు ఇండియాలో కాంగ్రెసువారు హిందీకి ప్రాముఖ్యము ఇచ్చుచున్నారు కదా, మరి హైద్రాబాదురాష్ట్రములోను హిందీకి ప్రత్యామ్నాయమైన ఉర్దూను ప్రవేశపెట్టితే ఏల యాక్షేపించవలెను అని కొందరు తలపవచ్చును

కాంగ్రెసువారి హిందీ సులభభాషగా నుండు ఆదర్శభావ ఇచ్చటి ఉర్దూలో ఫార్సీ, అరబ్బీ పదములు నూటికి 75 కన్న హెచ్చుగా నుండి అతి కఠినభాషయైపోయినది లిపి కూడ నాగరలిపి కాదు అది ఫార్సీలిపియైయున్నది హిందువులకును, నాగర లిపికిని సన్నిహిత సంబంధ మున్నది ఉర్దూ లిపి నేర్చుకొనిన మరల నాగరలిపి నేర్చుకోవలసి వచ్చును కాంగ్రెసువారు పాఠశాలలలో మాతృభాషల స్థానములో హిందీని పెట్టి మాతృభాషలకు ద్వితీయైచ్ఛిక స్థానమో, లేక తదభావమో ఏర్పాటు చేయవలెనని ప్రచారము చేయలేదు ప్రాథమిక పాఠశాలలలో రెండవ తరగతి పూర్తియగువరకు మాతృభాషలలో చదివి, మూడవ తరగతిలో ఉర్దూ మొదలుపెట్టి, అనగా ఉర్దూ కొరకు మరల 'అలిబ్బే' తరగతి నుండి ప్రారంభించి తర్వాత అంతయు ఉర్దూలోనే చదువుటకై కాంగ్రెసువారు ప్రచారము చేయలేదు చేసినచో వారి మాట ఎవ్వరును వినరు హిందీని నిర్బంధ ద్వితీయ భాషగాను, అదియు ఉన్నత పాఠశాలలలోను, అదియు పరీక్షాపేక్ష లేకుండునట్లుగాను మద్రాసు రాజధానిలో కాంగ్రెసు మంత్రులు ప్రవేశపెట్టగా దానికై ఆందోళనము జరిగినది మద్రాసీ సోదరులకు నిన్న మొన్నటి యనుభవమే కదా అయితే హైద్రాబాదులోని నాయకులు ఉర్దూను పూర్తిగా ఎత్తివేయుటకై ఆందోళనము చేయుటలేదు ఉర్దూను ఉన్నత పాఠశాలలలో నిర్బంధ ద్వితీయ భాషగా ఏర్పాటు చేయుట కంగీరింతురు అట్లంగీకరించినను ముల్కీ భాషలకు స్థాన మేమియు లభింపనందున ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకుల భాషా సంస్కృతియు, మత సంస్కృతియు, విజ్ఞాన సంపదయు, దైన్యమును పొందుచున్నవని మా నాయకుల అభిప్రాయమై యున్నది

## స్త్రీవిద్య

ఇదివరలో చూపిన అంకెలనుబట్టి ఉర్దూ మాతృభాషగాకం స్త్రీలలో చదువు వచ్చినవారు 26 వేలకుపైగా ఉండుటయు, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక స్త్రీలలో 15 వేల స్త్రీలేయుండుటయు చూచినచో ఈ ఉర్దూ విద్యా విధానమువలన హిందూ స్త్రీల కెంతటి తీర్పరాని నష్టము కలిగినదో తెలియగలదు ముస్లిం స్త్రీలకన్న హిందూ స్త్రీల సంఖ్య ఇంచుమించు పదంతలైనను, హిందూ స్త్రీలలో విద్యా వ్యాపకము ముస్లిం స్త్రీలకన్న తక్కువగానే యున్నది రామచంద్రనాయకుగా రన్నట్లుగా మొత్తము రాష్ట్రములో ముల్కీ భాషలలో ఒక ఉన్నత పాఠశాలనైనను ప్రభుత్వమువారు స్థాపించక పోయిరి

హిందూ స్త్రీలకు ప్రాథమిక, మాధ్యమిక తరగతులలో ఉర్దూ బొత్తిగా అవసరములేదు వారికి హిందీని ద్వితీయైచ్ఛిక భాషగా ఉన్నత తరగతులలో నేర్పిన నేర్పవచ్చును కాని ఆందోళనము చేయగా చేయగా ఇప్పుడు హైద్రాబాదు ప్రభు

త్వమువారు ప్రాథమిక తరగతులలో స్త్రీలకు మాతృభాషలలో చదువు చెప్పించుటకు ఒక దిక్కు సెలవిచ్చుచు, ఇంకొక దిక్కు వారికి ఉర్దూను నిర్బంధ ద్వితీయ భాషగా నేర్పవలెనని శాసించినారు అటువద్దాలపై తరగతులలో అంతయు ఉర్దూలోనే విద్య చెప్పించుచున్నారు వీరికి కలిగిన నిర్బంధ ద్వితీయభాషా పాండిత్యముతో పై ఉన్నత తరగతులలో సంపూర్ణ ఉర్దూబోధను ఏరేమి గ్రహించుకొనగలరో ఊహింప శక్యముకాదు

## ఖా న్గీ బ ళ్లు

సొంతబళ్ళను, లేక ప్రైవేటుబళ్లనే ఖాన్గీబళ్లు అనియందురు ఇంతవరకు ఉర్దూవలన కలిగిన అపారనష్టమునుగురించి చర్చింపబడెను ఇక ఖాన్గీబళ్ళ ముచ్చటను తెలిసికొనవలెను 1334 ఫసలీలో, అనగా 16ఏండ్ల క్రిందట విద్యాశాఖవారొక విచిత్రమగు ఆజ్ఞను ప్రకటించిరి అందలి ముఖ్య విశేషము లేవనగా—

1 విద్యాధికారుల సెలవులేనిది ఇకముందెవ్వరును ఖాన్గీ బళ్లను స్థాపించగూడదు

2 సొంతముగా స్థాపించుకొన్న ఖాన్గీబళ్లలో అన్ని కులాల వారియొక్కయు, అన్ని మతాల వారియొక్కయు పిల్లల కాటంకము లేకుండ ప్రవేశమునకు అధికారముండవలెను

3 అధికారుల సెలవు లేక సొంతబళ్ళను స్థాపించినట్లైన కలెక్టరుగాని, లేక పోలీసుకమిషనరుకాని, వాటిని మూసివేయింపగలరు

ఇట్టి ఆజ్ఞవలన ఏమి ఫలితము తేలినదనగా—1333 ఫసలీలో, అనగా యీఖాన్గీ బళ్ళ అనుజ్ఞయగుట కొక సంవత్సరము ముందుండినస్థితి ఆజ్ఞలయిన తొమ్మిదేండ్ల తర్వాత ఎట్లు పరిణమించెనో యీ క్రింది లంకెలే తమ కథను వెల్లడించుచున్నవి

| | ఖాన్గీబళ్లసంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| 1333 ఫసలీలో నిర్బంధాజ్ఞ కొక సంవత్సరము పూర్వము | 4053 | 76,654 |
| 1342 ఫసలీలో 9 ఏండ్లతర్వాత | 776 | 27,506 |

ఈవిధముగా విద్యావ్యాపకముపై గొప్ప నిరోధము కలుగునట్టి నిర్బంధాజ్ఞ అయిన నాటినుండియు నేటివరకును ప్రజలును, నాయకులును, ఆందోళనము చేయుచువచ్చినను దాని నింతవరకు ఉపసంహరించుకొనక పోయిరి

## జా గీ ర్ల లో వి ద్య

హైద్రాబాదు రాష్ట్రములో నూటికి42పాళ్ళ భూభాగము జాగీరులు, పాయిగాలు, సంస్థానములు అనువానిచే నిండియున్నది ఈ భాగములోని విద్యాస్థితి అత్యంత ఘోరముగా ఉన్నది పాయిగాలు అనగా మిలిటరీ (సైన్య) భృతికై ప్రత్యేకింపబడి పూర్వపు నిజాం ప్రభువుల బంధువుల కియ్యబడిన సంస్థానములు పాయిగాలును, సంస్థానములును జాగీరు వర్ణనలో చేరును జాగీర్దారులు తమ ఇలాఖాలలో పన్నులను నిజాం యిలాఖాలోని పన్నుల కన్న హెచ్చుగా విధించి వసూలు చేయుచుందురు అనేక జాగీర్లలో అక్రమమైన పన్నులు కూడా వసూలు చేయబడుచున్నవి ఈవిధముగా ఆదాయములో ఏమాత్రమును లోపము లేకున్నను వ్యయములో మాత్రము జాగీర్దారులలో ఉదారత ఏమియు కానరాదు

పాయిగాలలో ఎచ్చటను ఒక ఉన్నత పాఠశాల లేదు కొన్ని ప్రాథమిక పాఠశాలలు మాత్రమున్నవి ఉపాధ్యాయులకు చాలామందికి నెలకు మూడు రూపాయీల జీతము లభించును ఖుర్షీద్జాహి పాయిగాలో 387 గ్రామాలు కలవు దాని సంవత్సరాదాయము 21లక్షల రూపాయీల కన్న హెచ్చు అచ్చటివిద్యాలయా లన్నింటికిని ఏటేట కష్టపడి 360 రూపాయీలు వ్యయము చేయుచున్నారు ఈమొత్తము కూడా పాయిగాలోకాక హైద్రాబాదులోని ఒక పాఠశాల కిచ్చుచున్నారు ఈ పాయిగాలో లోకల్ఫండు పేర 92వేలకు పైగా వసూలు చేయుచున్నారు కాని విద్యకై అందులో నుండి 14 వేలు వ్యయము చేయుచున్నారు

విఖారుల్ ఉమ్రా పాయిగా అనునదింకొకటి కలదు అందును 387 గ్రామాలు కలవు దాని సంవత్సరాదాయము 22లక్షలు లోకల్ఫండుపేర 77 వేలు వసూలు చేయుచున్నారు పన్నుల ఆదాయమునుండి విద్యకై ఒక దమ్మిడీకూడా ఇచ్చుటలేదు లోకల్ఫండు నుండి మాత్రము 13వేలు ఇచ్చుచున్నారు

ఆస్మాన్జాహి అనునది మూడవ పాయిగా అందు 395 గ్రామాలు కలవు సంవత్సరాదాయము ఇంచుమించు తక్కిన రెండు పాయిగాలంత కలదు ఇచ్చట 1లక్షకు మించిన లోకల్ఫండు నుండి 23 వేలు మాత్రమే విద్యకై వ్యయము చేయుచున్నారు

గద్వాలసంస్థానములో ఇప్పుడొక ఉన్నత పాఠశాల కలదు అచ్చట సంవత్సరానికి ఇంచుమించు 10 వేల రూపాయీలు విద్యకై వ్యయము చేయుచున్నారు

వనపర్తి సంస్థానములోను ఇప్పుడొక ఉన్నతపాఠశాల కలదు అచ్చట ఇంచుమించు 20వేలు ప్రతి సంవత్సరము విద్యకై వ్యయము చేయుచున్నారు

ఈరాష్ట్రములో చిన్నవి పెద్దవి కలసి 1500 వరకు జాగీరులు కలవు అనేక జాగీర్లలో జాగీర్దార్లచే నడిపింపబడు పాఠశాలలు లేవు ఇట్టి జాగీర్లలోని పరిస్థితుల మూలమున, మొత్తము రాష్ట్రములో విద్యావ్యాపకముయొక్క లెక్కలను గుణించునప్పుడు విద్యావ్యాప్తి తక్కువగా కనబడుచుండుటచే, రాష్ట్రమున కంతకును అపకీర్తి కలుగుచుండును ఈ యభిప్రాయమును ప్రభుత్వపు విద్యాశాఖవారే తమనివేదికలో వెల్లడించియున్నారు

## మ త వి ద్య

ఉస్మానియావిద్యాపీఠ మేర్పడిన తర్వాత ముసల్మానులలో సున్నీలకు ఇస్లాంమత విద్య నిప్పించుటకును, షియాలకును, హిందువులకును, ఇతర మతస్థులకును నీతిబోధ చెప్పించుటకును ఏర్పాటు చేసిరి

హిందూవిద్యార్థులలో దీనిపై అసమ్మతి యుండినట్లు కనుపించుచున్నది అందుచేతనే రెండేండ్లక్రిందట వందేమాతరం గానమును ఉస్మానియా కళాశాలలోని హిందూ విద్యార్థులు తమకై ప్రత్యేకించిన హాలులో పాడుకొనగా, ప్రభుత్వమువారు దానిని నిషేధించుటచేత హిందూవిద్యార్థులు సమ్మెకట్టిరి ఆసందర్భములో వారు తమకుండు యిబ్బందుల నిట్లు ప్రకటించిరి

1 కళాశాలయొక్క హాస్టలులో (ఛాత్రగృహములో) హిందూవిద్యార్థులు షేర్వానీ లాగులతో భుజింపవలె ననుట

2 కళాశాలలో హిందూ విద్యార్థులను యూనిఫారంపేర లాగు పచ్చషేర్వానీ ధరించవలె ననుట

3 హిందూవిద్యార్థులకు మతవిద్య చెప్పించు ఏర్పాట్లు లేకపోవుట

4 ఉర్దూ నిర్బంధము ఎక్కువై తమ మాతృభాషలకు స్థానము లేకపోవుట

ఈవిషయాలనుగురించి వారు ఆందోళనముచేసి, నాగపూరు విద్యాపీఠ కళాశాలలో చాలమంది చేరిరి ఇకను ఏదో పరిష్కారము చేయుదుమని ప్రభుత్వమువారు నచ్చచెప్పిరి కాని యింతవరకు 3, 4 విషయములలో మార్పులేమియు చేయలేదు ఉస్మానియావిద్యాపీఠములో ఇస్లాంమతమునకై బి ఏ,ఎం ఏ డిగ్రీలను ప్రత్యేకముగా ఏర్పాటుచేసినారు దీనినే వారు (Faculty of Theology)అనియందురు ఉస్మానియా విద్యాపీఠములో మతవిద్యకుప్రాధాన్యము నిచ్చుట మంచిపరిణామమును కలిగించదని తోచుచున్నది హిందూముస్లిముల ఐకమత్యమునకు మారుగా వారిలో విభేదాలకు తావిచ్చును

ఈ పీఠములో ఇంకొక విశేషమేమనగా, విద్యార్థుల కేర్పాటుచేయు గ్రంథములలో ఇస్లాంమతమునకు విరుద్ధమగునంశము లేవియు లేవు కదా అని పరిశోధించుటకై ముస్లిము సభ్యులుకల ఒక వర్గము (బోర్డు) నియోగింపబడియున్నది హిందూమత విరుద్ధముగా ఏమియులేదుకదా అనిపరిశోధించుటకే హిందూబోర్డును నిర్ణయింపబడలేదు

## మె కం జీ వి ధా న ము

ఆరుసంవత్సరముల క్రిందట హైద్రాబాదు రాష్ట్రవిద్యా పద్ధతిలో మార్పులు చేయుటకై డాక్టర్ మెకంజీ అను ఇంగ్లీషు పండితులు నియమింపబడిరి వారొక కమిటీని ఏర్పాటు చేసి హిందూముస్లిం ప్రజాప్రముఖుల అభిప్రాయాలను, సాక్ష్యములను కైకొనిరి ఆసందర్భములో వారు కొన్ని బహిరంగోపన్యాసము లిచ్చిరి అందొకయుపన్యాసములో విద్యార్థులకు తమతమ మాతృ భాషలో (వర్నాక్యులర్‌లో) విద్య చెప్పించవలెనని వారభిప్రాయమిచ్చిరి

ఈయభిప్రాయములను వినినవెంటనే హిందువులలో ఒక గొప్ప సంచలనము కలిగెను మెకంజీ దొరవారు చేయనున్న మార్పులో ఇదొక ముఖ్యమైన మార్పుగా ఉండుననియు, ఇకముందు హిందువులకును విద్యాలాభమును పొందుటకు మంచి అవకాశములు కలుగనున్నవనియు, విద్యాసంబంధమునకల ఆటంకము లన్నియు తొలగిపోవుననియు హిందువు లభిప్రాయపడిరి

మెకంజీ కమిటీ విచారణ పూర్తియయ్యెను ఆ నివేదిక పూర్తిగా ఆశాభంగమును కలిగించెను జనుల మాతృభాషలకు పూర్వముండిన స్థితిలో మార్పేమియు కలుగక పోయెను గత సంవత్సరము నుండియు మెకంజీ (స్కీము), విధానమును రాష్ట్రములో ప్రవేశపెట్టుచున్నారు పల్లెటూరిబళ్ళు, పట్టణవాసముబళ్ళు అను భేదము తప్ప మరే విశిష్టతయును ఇందు కానరాదు ముల్కీభాషలలో ఉన్నతవిద్య చెప్పించుటకై ప్రత్యేకముగా బళ్ళనేర్పాటు చేయుటకు ప్రభుత కోశములో ద్రవ్యము లేదని, ఆవిధానమును నిరాకరించిరి మెకంజీ విధానమును గురించి ప్రత్యేకముగా చర్చించ వలసి యుండును అందుచేత నిచ్చట సూచన మాత్రము చేయబడినది

## ని జా ము కా లే జీ

హైద్రాబాదు నగరములో నిజాము కాలేజీ అనునది కలదు అది ఉస్మానియా విద్యాపీఠము ఏర్పడిన కాలమునకన్న పూర్వము బహుకాలమునుండి పనిచేయుచున్నది. అది మద్రాసువిద్యాపీఠముతో సంబంధముకలిగి, అచ్చటి విద్యాపద్ధతి ననుసరించుచున్నది దానిని తీసివేయవలెనని మెకంజీవిధానము ఏర్పడు కాలములో కొన్ని ఆలోచనలు జరిగెను ఆసందర్భములో పెక్కుమంది దానిని తీసివేయకూడదని అభిప్రాయ మిచ్చిరి ఎట్లైతేనేమి అది తీసివేయబడ లేదు ఈనిజాము కాలేజీ పరిస్థితులనుండి కొన్నివిశేషములు తెలుసుకొనవచ్చును జనవరి 1941లో దాని వార్షికోత్సవ సందర్భములో ప్రిన్సిపాలుగారు కొన్ని అంకెలను వెలిబుచ్చిరి.

అందిపుడు మొత్తము 380 మంది విద్యార్థులు ఉన్నారు వారిలో హిందువులు 203 మందియును, ముసల్మానులు 132 మందియును, ఇతరులు 45 మందియును ఉన్నారు. ఉస్మానియా విద్యాపీఠములోని కళాశాలలో ముసల్మాను విద్యార్థు లెక్కువగాను, హిందూ విద్యార్థులు తక్కువగాను ఉన్నారు కాని నిజాముకాలేజీలో హిందూ విద్యార్థులు

ఎక్కువగాను, ముసల్మాను విద్యార్థులు తక్కువగాను ఉన్నారు ఇందును ఓకేటి సుమారు 200మందికి తప్ప లేదని నిరాకరించుచున్నారు. నిజాం కాలేజిలో 300 మందికన్న ఎక్కువమందిని చేర్చుకొనరాదని విద్యాశాఖవారు శాసించియున్నారు. ఇంకొక విశేష మేమనగా హిందూ క్రైస్తవస్త్రీలే ఎక్కువగా నిజాముకాలేజిలో చదువుచున్నారు స్త్రీలకై ప్రత్యేకముగా ఉస్మానియావిద్యాపీఠమువారు కళాశాలను స్థాపించిరారు అందు హిందూ స్త్రీలు రారారు. మెకంటీ విధానము ఏర్పాటైన తర్వాత ఇంగ్లీషులో ప్రధానముగా బోధించు చుండిన ఉన్నతపాఠశాలల సంఖ్యయు తగ్గించబడుచున్నది అందుచేతరాను రాను నిజాం కాలేజికి విద్యార్థులు పోవుటయు తక్కువ కావచ్చును

ముగింపు

ఈ చర్చయంతయు ఉస్మానియావిద్యాపీఠమును నిరసించుటకు గాని, లేక దాని ప్రతిష్ఠకు భంగము కలిగించుటకుగాని చేసినట్టిది కాదు నిరసనము పొందిన ముల్కీ భాషలకును స్థానముండవలెననియు, అట్లుండినచో విద్యా వ్యాపకము కలిగి జనులు వృద్ధికి వత్తురనియు, ప్రాచీనములైన ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక భాషలకును చరిత్ర, సంస్కృతి, విజ్ఞానములు కలవనియు, పైమూడింటికి విద్యా విధానములో స్థానము లేకుండుట వాటి మూలసంస్కృతికే ముప్పు వాటిల్లుననియు ఎత్తిచూపించుటయే దీని ముఖ్యోద్దేశము. ఉర్దూను ప్రతిఘటించు హిందువులు నిజాం రాష్ట్రములో లేరు తమ మాతృభాషలను ప్రేమించుట ఉర్దూవారికి వలెనే ఇతర మూడుభాషల వారికిని సహజమనుట గమనించవలసియుండును. వారి మాతృభాషలలో బాలబాలికలకు విద్య చెప్పించుట ప్రపంచమంతటను ప్రకృతి సిద్ధమైన పద్ధతిగా ఉన్నది ముస్లిం విద్యార్థికి ఉర్దూ ఒకటి మాత్రము నేర్చుకొనవలసి యుండును అది అతని మాతృభాషయే యగుటచేత సులభసాధ్యమైనది హిందూ విద్యార్థికి తన మాతృభాషను నేర్చుకొనవలెను తనకు మతవిద్య చెప్పించవలయును సంస్కృతలిపిని, భాషను నేర్చుకొని మతవిద్యను తానే తనకు తోచినట్లు నేర్చుకొనవలెను సర్కారిభాష కాపున ఉర్దూ నేర్చుకొనవలెను తాను మున్షీను, లేకపోయినను సర్కారి బళ్లలో అదే చదువవలసి వచ్చును అవే సర్కారి బళ్లలో ఇంగ్లీషుమూలాన బోధించుచున్నారు కాపున అదియు నేర్చుకొనవలెను లేత వయస్సులోనే ప్రాథమిక తరగతుల నుండియే ఇన్ని యిబ్బందులకులోనై లహాయుడు కైనట్టియు, అజ్ఞులైనట్టియు హిందూ బాలబాలికలు పరభాషలలో ఏమి తెలివి సంపాదించగలరు? ఏమి అర్థము చేసుకొనగలరు? అందుచేత సహజముగా వారిలో విద్యా వ్యాప్తి యేమాత్రమును అగుట లేదు.

పూర్వము మొగలాయిరాజు లెందరో ఈదేశములో రాజ్యాలు చేసినారు వారి కాలములో దేశభాషలకు ఎంతో ప్రోత్సాహము కలిగెను బెంగాలులో బెంగాలీ సాహిత్యమునకు బెంగాలు నవాబులు దోహదమిచ్చిరి జౌన్పూరు నవాబులు అవధీ భాషను (అయోధ్య భాషను) ప్రోత్సహించుటయేకాక మలిక్ మహమ్మద్ జయాసీ అను నతడు ఆభాషలో మొదటి ప్రామాణిక కవియని పేరు కాంచినాడు క్రీ. 15వ శతాబ్దములోని ఒక జౌన్పూరు నవాబు మహాభారతమును, భాగవతమును సంస్కృతము నుండి బెంగాలీ భాషలోనికి తర్జుమా చేయించి బెంగాలీభాషను పోషించెను

బిజాపూరుసుల్తాను అయిన యూసఫ్ ఆదిల్షా తనకచ్చేరీలో అంతవరకుండిన ఫార్సీని తీసివేసి, తనరాజ్యములోని బహుళ జనులచే మాట్లాడబడు మరాఠీ భాషను తనకచ్చేరీ భాషగా నిర్ణయించెను గోల్కొండ కుతుబ్షాలు కొందరు తెనుగును బాగుగ ప్రోత్సహించిరి వారును, వారి ముసల్మాను సేనానులును తెనుగు కవులను పోషించిరి. కొందరు కృతుల నందిరి ఇబ్రహీంకుతుబ్షాకు అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానమును అంకిత మిచ్చెను ఇబ్రహీంకుతుబ్షా స్వయముగా తెనుగు బాగా మాట్లాడి తెనుగు కవితను స్వయముగా అర్థము చేసుకొను విజ్ఞానము కలవాడై యుండెను అతడు తెనుగుకవిత్వముకూడ చేసె నందురు వారిపద్య మొక్కటైనను ఇప్పుడు దొరకినచో అదెంతటి సాధారణపద్యమైనను ఆంధ్రులు దాని కెంతటి అగ్రస్థానమిత్తురో ఆ విషయము ఆంధ్ర హృదయమునకే యెరుక హైదరల్ సుల్తాను కన్నడములో బాగుగా మాట్లాడుచుండెను

ఈవిధముగా పూర్వము ముస్లింసుల్తానులు దేశభాషలకు ప్రాముఖ్యము నిచ్చి ప్రజాప్రేమను చూరగొనిన నిదర్శనములు పరిశోధకులకు వెతికినకొలదియు దొరకగలవు.

మ ఘ వ నిజాము ప్రభుత్వమువారు ప్రజానురంజకముగా పాలించు అభిమానము కలవారనుటలో సందేహము లేదు కాని ప్రభుత్వమునకు ఆలోచనలు చెప్పు వారిలో భావ పరివర్తన మవసరముగా ఉన్నట్లు తోచుచున్నది హైద్రాబాదు ప్రభుత్వమువారితో హిందువులు లార్డు ఇర్విన్ వైస్రాయిగారు చెప్పిన యీ వాక్యమునే మనవి చేసుకొనుచున్నారు

"ఉస్మానియా విద్యాపీఠముపై ముసల్మాను ప్రజల కెంతటి గాఢమగు అభిమానముకలదో, అంతటి అభిమానము హిందూప్రజలకును కలుగునట్లు చేయుటయే ఉత్తమ రాజనీతియై యుండును

(It will be a task of mature statesmanship, so as to shape the policy of the Osmania University that it may have as strong an appeal to the Hindu as to the Mohammadan subjects of your state)"

# వైదికుల పరిభాషలు

శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

[1941 వృష సంవత్సరాదిసంచికనుండి]

ఉత్తర్లాంలో శ్రావణి (సన్మానం) పుచ్చుకోడానికి బయలుదేరిన వేదమూర్తులు తరువాత కూడా సంచారంచేసి, ఆశ్వీజమాసాంతం తిరిగి తిరిగి యిళ్లకు మళ్ళుతారు నున్నగా గవ్వ మెఱుగు పెట్టిన ముండిత మస్తకమూ, బ్రహ్మ తేజస్సుట్టిపడే ఫాలమూ, చెవులకు మకరకుండలాలూ, బుజంమీాద శాలువా, చేతికి సింహతలాటం మురుగులూ, చంకను మడిసంచీ, నీరుకావి దోవతులూ కలిగి, వేదపనసలు, చెప్పుకుంచూ, తమ్ము సన్మానించిన చోటల్లా వేద నినాదాలు చేస్తూవుంటారు వేదమెల్ల చదివినవారు సరస్వతీదేవి పుంమూర్తులు వారు ఆరణ్యాల్లో కూచుని ఉపనిషత్తుల్ని చూచినవారికి వారసులు వారు నాటి సంప్రదాయము దెబ్బతింటున్న ఈ నాటి కూడా వారు ఇలా ఉన్నారే, ఆనాటి వారు ఎలా ఉండేవారో! నాడేమో గాని, నేడు వారూ అంతో యింతో పతితులైన మాట వాస్తవం

ఒక క్రొత్త యుగ సంప్రదాయము వచ్చి, పాత వాటిమీాద మంచిగానో, చెడ్డగానో తన ప్రభుత్వము నేలుచున్న దినాలు ఇవి నేటి కాలి వాహినిలో ప్రతివారును అంతో యింతో మునుకలు వేసినవారే, వేసేవారే మార్పు బలీయమై వచ్చింది పాత వాటి యెడల వైమనస్యం పెరిగినది ఆ వేదమూ, అది విధించిన కర్మకలాపమూ బలవంతముగానో, భయమువల్లనో జరుపబడుచున్నదేగాని వినయ విధేయులతోఁ గాదు, త్రికరణశుద్ధితోఁగాదు యజన యాజనములు మూలఁబడినవి కొండొక్కచో నున్నను, అవి విడంబనకును, సంపాదనకును మారినవి హిందూవాలాలో సప్తపదికి గౌరవం ఏర్పట్టం, అది ఒక అవసరంగా ఉండటంవల్ల వివాహాదికం సమంత్రకంగా జరుపుతున్నాము (1930 తరువాత జరిగే పెళ్లిళ్లలో వివాహ మంగళం ఎంతో దెబ్బతిన్నది కాని అసలు మూర్తి గల్లంతు కాలేదు) మర్యాదకు ఉపనయనాదులు చేస్తున్నాము తలిదండ్రులకు ముట్టిచస్తాయా అని అనుమానిస్తూనే—పెట్టకపోతే ఏ అరిష్టము చుట్టుకుంటుందో అనే భయాన తద్దినాలు పెడుతున్నాము (పెళ్లేవాళ్ళమాటే తద్దినం మంత్రం తేటతెల్లంగా తెలుఁగు అయితే ఈగుంజాటన పోతుందగాని, అట్టి పని జరగలేదు) ఈ మార్పు, ఈ భావ సంఘర్షణ ఒక్కనాఁడు వచ్చినదికాదు ఎన్నాళ్లనుంచో వస్తున్నది ముఖ్యంగా జీవిక ఒక వర్తకంగా తయారైనది ఎక్కడ పట్టిచూచినా వైదికుల జీవిక మరీ అర్ధాన్నమయినది వారి జీవితవర్తకానికి పెట్టుబడిలేదు ఇంత లాభం అని నిర్ణయం లేదు బేరం ఉన్నా రశ్మి లేదు దయా ధర్మ బిచ్చం అయినది ఏనాఁటినుంచి వస్తోందో ఇది ఈ పతనము (అనుకుంటే ) బౌద్ధులనాఁటిదో, తరువాతిదోకాని మోంతంమీాద వైదికధర్మములమీాద నిరాదరణ ప్రబలినది మఱీ మఱీ రాను రాను ఆ నిరాదరణ పెచ్చు పెరిఁగినది వేద శాస్త్రాదుల యెడలా, వాటితో సంపర్కం పెంచుకున్న శ్రౌతస్మార్త క్రియా కలాపాదుల యెడలా వైమనస్యం ఎక్కువ అయిన తరువాత అవి మఱీ వర్తకంగా తయారైనవి ఇట్టివి చేయించేవాగికి ఆనాఁటి వసిష్ఠ ధౌమ్యుల మర్యాదా ప్రపత్తులు కఱవైనవి డంబమూ, పటాటోపమూ కావలసి వచ్చినవి కొంత మఱుఁగు తప్పనిసరి అయినది

విషయం అంటూఉంటే మాటలకు కొదవా? ''ఇచ్ఛా మాత్రం ప్రభోః సృష్టిః'' మాటలు సాంకేతికములై వెలసినవి వాడుకలోకి వచ్చినవి చెలామణీ లగుచున్నవి ఇంకను ఇట్టివి పుట్టుటకు అక్కర కలుగుచో అట్టివి తయారగుటకు వీలును కూడ కల్పించుకొన్నవి ఇట్లు ఇప్పటికి తయారైన పదములు కేవల వైదికుల కడ మాత్రమే చలామణీకాక, ఇతరత్ర కూడ చలామణీ అయినవి కవుల ప్రయోగములలోనికి గూడ కొన్ని ఎక్కినవి (ప్రయోగములున్న వాటికి అట నుదాహరణముల నిత్తును) వైదికులు పరస్పరము మాటలాడుకొనుమాటలను చూపి, ఆ సంకేతము ఎటుల పుట్టినదో క్రమముగా నిరూపింతును

* * *

''ఏమోయ్ కామావధాన్లూ 'వయం దేవస్య' ఎక్కడ ?''

'' 'దేవావై'లో ''

మొదటి బ్రాహ్మఁడు 'భోజనం ఎక్కడ' అని అడిగినందుకు, 'సత్రమున' అని జబాబు

విరివిగా వైదికులు పక్కనున్న మాటను ఆవరి మాటకు సంకేతము చేయుదురు అటుల తయారైనదే 'వయం దేవస్య' శ్రుతిలో ''వయం దేవస్య భోజనం'' అని గలదు

అట్టిదే 'దేవావై' ''దేవావై సత్రమాసత'' అని శ్రుతి

* * *

'''తేజోవా' ఏమన్నా ఉంటుందా?''

'''ప్రక్రాంతం' కాదూ ఓ, 'యుద్వమేనం!' ''

మొదటి బ్రాహ్మఁడు 'నెయ్యి యేమైనా వేస్తారా' అని అడిగాఁడు కడుపు నిండుతుందా, లేక తూష్ణీం (ఊరికే) ఏదో పెట్టామంటే పెట్టాము లనేదేనా అని అడిగిన వాని ఉద్దేశము 'తద్దినము గనుక సమృద్ధిగ వేస్తారు, రావయ్యా' అని రెండవ వాని జబాబు

ఇందాఁక మన మనుకొన్నదాని చొప్పున ఇక్కడ వేదమును వెతుకుచో కిటుకు తెలియఁగలదు ''తేజోవా ఆజ్యం'' అని వేదము

''ప్రక్రాంతం శ్రాద్ధకర్మ కరిష్యే'' అని తద్దినం మంత్రము నేయి నన్నయ భారతముకే ప్రవాహంగా భావించఁబడింది వైదికులకు నేయి అనఁగా మిక్కిలి మక్కువ ఈ వైదికుల పరిభాషలలో నేతికి రెండు మాటలు కలవు మఱొకటి 'తేజోవై' ''తేజో వై ఘృతం'' అని మంత్రము

* * *

''ఏమిషోయ్, అంత 'దేవా దేవేషు' జరిగింది ''

''ఆఁ, పోనిద్దురూ ఇద్దరూ 'నిషంగిణ' గాళ్లె ఏదో, మన కెందుకు?''

'ఏమిటోయ్ అంత పోట్లాట జరిగింది' అని ప్రశ్న 'ఇద్దరూ దొంగలే మన కెందుకు' అని జబాబు

'దేవా దేవేషు' అనగా పోట్లాట దెబ్బలాట 'నిషంగిణ' అంటే దొంగ రుద్రమున ''నిషంగిణ యిషుధిమతే తస్కరాణాం పతయే నమోనమః'' అని కలదు విలుకాఁడను అర్థముపోయి, దొంగ అను అర్థము వీరి పరిభాషలో పుట్టినది

ఇక్కడ ఒక విశేషము పక్కనున్న మాట కాక కప్పగంతువైచి ఆ పక్కలనున్న మాట అర్థము మొదటి దానికి వచ్చినది ఇట్టివి మరికొన్ని గలవు

'దేవా దేవేషు' అను పదమునకు కథ యొకటి యున్నది అది వెనక 'భారతి'లో అచ్చైనది గూడ (పిట్ట కథలలో) క్లుప్తముగా ఆ కథ యిది—చిన్నల్లుఁడు అత్తవారింటికిఁ బోయినాఁడు పెద్దల్లుఁడును వచ్చినాఁడు పెద్దల్లుఁడు వేదమూర్తి, చిన్నాయన శాస్త్రము చదువుతూన్నవాఁడు; పండితుఁడు చిన్నవాఁడు గనుకను, క్రొత్త గనుకను అతనికి గదిలో మంచము వైచినారు పెద్దల్లుఁడు పాతబడుటయు, అరమరికలు పోవుటయుఁగల్గి, బయట సావిట్లోనే పన్నుండినాఁడు చిన్నాయన శాస్త్రజ్ఞుఁడనను గర్వమున గది తనది కావుటను పాంకోళ్లు టకటక లాడించుచు రాత్రియంతయు గదినుండి బయటకు, బయటనుండి గదికీ పోవువాఁడు చిన్నాయన నిద్రమైకమున నిద్రించుచున్న షడ్డకునికి పాంకోడు దెబ్బలు దెబ్బలిని తోఁటియల్లుఁడు నొచ్చుకొనుచుండఁగా పండితుఁడు 'క్షమధ్వం' (Excuse me) అని తడవ తడవకు అనువాఁడు ఇటుల చాలా తడవలు గడిచినవి నిద్ర పోవుటయేగాక నొప్పి, ఇతఁడు 'క్షమధ్వం' అనుటయు పెద్దాయనను వికేపించి బాధించినవి మర్నాడుకు సహించుచు వచ్చినాఁడు చిన్నాతఁడు మరలవచ్చి పాంకోళ్లతో త్రొక్క, 'క్షమధ్వం' అని దొడ్లోకి పోయినాఁడు పెద్దాయన ఋక్కఁ భరించలేక, వెంటఁబోయి పిలక పట్టుకుని 'క్షమధ్వం' అను మాట వంటి మాట (ధ్వనిలో) గల ''దేవాదేవేషు ప్రయుధ్వం, ప్రథమా ద్వితీయేషు శ్రయుధ్వం'' అను పన్నమును చెప్పుచు, 'ధ్వం' వచ్చినప్పుడల్లా ఒక్కటి చొప్పున దెబ్బలుకొట్టినాఁడు అల్లరికి సలుగురూ లేచి అడుగఁడు కథయంతయు చెప్పినాఁడు చిన్నాతఁడు సిగ్గిలినాఁడు ఈ కథలో 'దేవా దేవేషు'తో దెబ్బలు ప్రారంభమైనవి గనుక 'దేవాదేవేషు' అనఁగా

దెబ్బలాట అను అర్థము సంకేతించినారు వైదికులు మంత్రమునుబట్టికాక కథను బట్టి సంకేత మిది

*   *   *

" 'సదస్యంట, రావుటయ్యా సుబ్బావధాన్లూ!"
" 'వాయువ్యం' ఏమైనా ఇస్తారా?"
"ఇవ్వచ్చు 'ప్రతి శ్రుత్కాయ'కు ఛచ్చుండదు"
" 'యువాసు'?"
"ఇంకా నయం! మొత్తమ్మీంద పోనిచ్చావు కావు"

సదస్యానికి రమ్మనఁగా 'రూపాయి ఇస్తారా' అని అడుగుతాఁడు అర్ధరూపాయకు చచ్చుండదనఁగా, 'బట్టలు ఏమైనా ఉన్నాయా' అని శంక మొదట పిలిచినవాఁడు కనుఁ కుంటాఁడు

"వాయువ్యగ్ఁ శ్వేత మాలభేత" అని మంత్రము పక్కనున్నమాట అర్థము పూర్వపుమాటకు రాఁగా 'వాయువ్యం' అనఁగా 'శ్వేతం' అయినది శ్వేతం అనఁగా రూపాయికి వైదికులు పెట్టుకున్న ఒక గుర్తు రూపాయి తెల్లగా ఉంటంచేత ఆకారాన్నిబట్టి పెట్టుకున్నది అది 'వాయువ్యగ్ఁ' అంటే రూపాయి అని ఆక్షేత్రాన కుట్టినికిఁ గూడ కొట్టిన పిండి

"ప్రతి శ్రుత్కా యారతులవ్" అని సున్నాల పన్నము తులం రూపాయకు పర్యాయముగా లోక వ్యవహారంలో కలదు కావున అరతులం అనుమాటకు ముందున్న 'ప్రతి శ్రుత్కాయ' అనుమాటను ఇట్లు సంకేతించినారు ఇట్టిదే 'కృష్ణాయ' "కృష్ణాయర్తులవ్" అని వేదమున కలదు గనుక అరతులం అర్తులం అని, అర్తులమును 'కృష్ణాయ'కు అంటకట్టి, 'కృష్ణాయ' అనఁగా అర్ధరూపాయ చేసినారు

"యువాసు' అనఁగా బట్ట ఏరికైనను బట్టలు చదివించునప్పుడు ఈ మంత్రమును జెప్పుదురు "యువాసు వాసః పరివీత ఆగా " అని మొదలు కలది అది ఆ మంత్రము బట్ట అక్కర కలిగినపుడెల్ల వాడఁబడుటవలన ఆ మంత్రపు మొదటి తునకే బట్టకుఁగా సంకేతింపఁబడినది

*   *   *

"ఏమిచ్చారుట, అక్కడ?"
"జోటిక్కృష్ణాయ"

'ఇద్దరికీ అర్ధ రూపాయ ఇచ్చారు' అంటున్నాఁడు మనిషికి పావలా యిచ్చారని విడతీసి చెప్పవలసివచ్చుచో 'తలో యత్పుణ్యాం' అని "యత్పుణ్యాం నక్షత్రం తద్భట్కుర్వీతోపవ్యుషం" అని శ్రుతి ఆకారసామ్యమునుబట్టి పావలాను నక్షత్రముగా చేసినారు నక్షత్ర పదమునకు ముందుండుటనుబట్టి 'యత్పుణ్యాం' అనఁగా పావలా ఇక్కడ మాటలేకాక అర్థమును మండూకప్లుతి (కప్పగంటు)వైచినది

*   *   *

"మన కేమయినా ఉందివయ్యా?"
"రమ్మన్నారు, 'ఏతత్సామగాయనం' చెప్పారు"

'లేదన్నారు' అనుదానికి 'ఏతత్సామ గాయనం చెప్పారు' అని "ఏతత్సామగాయనం నాస్తి" అని శ్రుతి 'నాస్తి' అనిన అందరకు తెలియును గనుక చాటుదనముకై 'ఏతత్సామగాయనం' అనుదానికి ఈ సంకేతపు బరువు నెత్తినఁబడినది

*   *   *

"ఇంటో లేట్ట"
"లేకేం, 'సుఖం చ మే' కావచ్చు"

'ఇంటిలో లేఁడని చెప్పిన దానికి పక్కనున్నాతఁడు చేయు అనుమానము 'ఇంట లేకేమి, నిద్రించుచున్నాడేమో' అని చమకమున "సుఖంచ మే శయనంచ మే" అనిఉన్నది 'శయనం' అన వెల్లడి యగును గుట్టుకు 'సుఖంచ మే'

*   *   *

"ఏమి టక్కడ కీచులాడుకుంటున్నారు?"
"'యద్దేవా' చెయ్యొస్తే, ఏమిడూరుకుంటాఁడు!"

ఈ 'యద్దేవా' అనునది వైదికుల కడమాత్రమే నిలువలేదు లౌకికులకడను ప్రవేశించినది తన గుట్టును రట్టుచేసి వైదికులను మోసపుచ్చినది నేఁడు 'యద్దేవ' అనఁగా హేళన అని తెలుఁగు నాట చాలామందికి విదితచరము

"యద్దేవా దేవహేళనమ్" అని శ్రుతి 'యద్దేవా—హేళనం' అను మాటల నడుమ 'దేవ' అనునది అడ్డమున్నను కప్పగంతువైచిన దీ హేళనము

దేవులపల్లి వెంకట సుబ్బారాయశాస్త్రులవారి మహేంద్రవిజయమున—

"అంశుమత్ఫలకమధ్యంబు తథ్యం బదే
తత్సామగాయమో తరుణయజ్వ
సారంగి వదనంబు సారఁగ లాంఛను
యద్దేవ చేయునో యాయజూక
చంద్రమ కళ నాభిచంద మింద్రోపల
స్య సమానమో హవిర్యాజివర్య
యష్టాపద గృహంబునందె కదా యా ప్రతి
యామ సుఖంచ మే యాహితాగ్ని
యనుచు మందాకినీ తీరమునను తాన
మున కుషఃకాలమునఁ గూడికొనిన క్రొత్త
సోమయాజులు స్థాలికల్ ప్రోమికొనుచు
నాత్మ పరిభాష భాషింతు రచట నెపుడు" (3 వ ఆశ్వాసం 14 వ పద్యం)

ఈ పద్యమున ఔచిత్యముతో మూఁడు వైదికుల పరిభాషలు వాడకము చేయఁబడినవి

(యాయజూకుఁడు=మాటి మాటికి యజనము చేయువాఁడు అష్టాపదగృహం=బంగారుఇల్లు)

'ఏతత్సామ గాయనం' అనఁగా 'లేదు' అని అట్టిదే 'ఆజ్ క్తే చాద్గణం'. ఆజ్ క్తే చాద్గణం అనినను లేదనియే "ఆజ్ క్తే చాద్గణం నాస్తి" అని శ్రుతి బట్టకు 'సువాసు'. అట్టిదే 'సర్వదేవత్యం వై వాసః' అని శ్రుతి

*   *   *

"వాఁడికేం రా, 'ఆమాయంతు'గాఁడు"

'బ్రహ్మచారి, వాఁడికేం' అని ఆ మాట తాత్పర్యము "ఆమాయంతు బ్రహ్మచారిణః స్వాహా" యని హోమమంత్రం 'ఆమాయంతు' అనియే సంకేతము

*   *   *

'యోగశ్చ' అనఁగా కరణం ఏదైనా కార్యము కరణాల, నియోగుల ఇండ్లలో జరిగిన యెడలను, సామాన్యముగానున్ను నియోగులను చెప్పవలసి వచ్చుచో 'యోగశ్చ' అని అందురు దీనికి మూలము తద్దినం మంత్రమునఁ గలదు "యోగశ్చ కరణం చైవ సర్వం విష్ణుమయం జగత్" అని

'మరుద్భ్యః' అనఁగా కోమట్లు సున్నాలపన్నమున "మరుద్భ్యో వైశ్యం" అని ఉన్నది

'ఇంద్రాణి' అనఁగా విధవ వితంతువు లోకసామాన్యమున వెధవ అనునది ఎంత విరివిగా యథేచ్ఛముగా తిట్లలో వాడుక యగుచున్నదో అటులే యిక్కడ గూడ దీనికి ఆకరమైన మంత్రమును నా కెవ్వరును చెప్పలేదు 'ఇంద్రాణీ విధవా' యని ఎచ్చటనో కలదఁట సి పి బ్రౌన్‌దొఁగారు తమ నిఘంటువున ఇటుల వ్రాసిరి "ఇంద్రాణి Name of the wife of Indra A sart of bracelet Og, 'Dowager,' a brahmin widow Enugala 28, July 1830" అని బ్రౌన్ దొరకు పండితులు చెప్పనిదీ తెలియదు గదా ఆనాఁటికే పండిత వ్యవహారమున 'నింద్రాణి'కి ఈ యర్థము రూఢమై యుండవలయును ఈ అర్థము ఎటులు కలిగినదో తెలియదు ప్రయోగములు లేవు శబ్దరత్నాకరాదుల కిది ఎక్కలేదు.

వెధవ అనునది ఇంద్రాణికి సిద్ధించినది దీనిపైని వైదికులు ఇంకొక చమత్కారమును చేసిరి నవగ్రహపూజలో శుక్రగ్రహమును అర్చించునపుడు అధిదేవతగా ఇంద్రాణిని అర్చింతురు కావున శుక్ర గ్రహాధి దేవత యన నింద్రాణి గనుక, ఇంద్రాణి విధవ గనుక, వెధవను చెప్పవలయునెడ శుక్రగ్రహాధిదేవత అనియు నందురు "అమ్మో, శుక్ర గ్రహాధి దేవత ఉంది, జాగర్త!" ఇది యొక వైదికుని వాక్యము దీని మర్మము విడుగొట్టుటకు నా కొక రోజంతయు పట్టినది విషయమునుబట్టి వచ్చినవి కొన్ని పరిభాషలు కలవు కాని, విషయమును గూడ విషయముగాఁ జేసినవి యిట్టివి యెన్ని కలవో ('యత్పుణ్యాం' యిట్టిదే) కాని, ఎక్కువగా తెలియరాలేదు

*   *   *

"అబ్బ, పోనిద్దూ వాఁడో 'అపహత'!"

'అపహత' అనుగా పిశాచి సంధ్యావందనమందును వచ్చు మంత్రమునం దిట్లు కలదు "అపహతా అసురా రక్షాగ్ంసి పిశాచా." అని అపహత అనుదానికి ఈ అర్థము పక్కనున్న 'అసురా'వల్ల వచ్చినదో, మరికొంత పక్కనున్న 'పిశాచాః' వల్ల వచ్చినదో తెలియదు నాకు చెప్పిన అయ్యవారు 'పిశాచా' అను దానినుండి వచ్చిన దన్నారు 'అసురా' వల్ల కాఁగూడదా అనఁగా, 'అవును, అదీ నిజమే' అన్నారు. కాని, ఇది ఇల్లాగు అని తెమల్లేదు

*   *   *

'అధర్మాయ' అనగా చెవిటివాఁడు
"వాఁడో 'అధర్మాయ', వాఁడితోవా విన్నపం"

చెవిటివాఁడే కానక్కరలేదు మాట చౌరవనీయని వానిని సైతము చెవిటివాఁడని కసితీరా అనుటకు ఈ చాటు చెవిటివాఁడన మూరుకొనరు గదా అందుకు ఇది. సున్నాల పన్నమున "అధర్మాయ బధిరం" అని

*   *   *

అట్టివాఁడే 'స్వప్నాయ' ఇతఁడు గుడ్డివాఁడు తనకడకు వచ్చు పండిత ప్రవరులను, వేదమూర్తులను చూడలేఁడు వారిదర్పమునైనను పరికింపలేఁడు. పాపము పుట్టుగ్రుడ్డి! సున్నాలపన్నముననే ఉన్న "స్వప్నాయాంధం" అనునది దీనికి మూలము. 'అంధం' అన తెలియుని దెవ్వరికి? కాన ఈ ముఱుఁగు

*   *   *

'శంనో' అని మరియొకఁడు ఇతగాఁడు, పాపము, ఏమి పాపము చేసికొనెనో గాని పశువైనాఁడు

"వాఁడుత్త 'శంనో' గాఁడు వాఁడితో నీ కెందుకురా?"

అని ఇష్టులను కూకలు పెట్టుదురు ఈ కూకలు పెట్టుట పరుని ఇతరుని పశువని తిట్టుచో వాఁడూరకొనునా? కనకనే కొంత గూఁఢ "శంనో అస్తు ద్విపదే శం చతుష్పదే" అని ప్రతి ద్విపాత్పశువు అనుటయే "శంనో" అయిన ఈ 'శంనో' అనునది రూఢికెక్కి ప్రయోగాదులలోని కెక్కినదేమో తెలియదు

* * *

"ఈశంనోకు చాలా 'అగ్నిర్ధిమస్య' కలదు అమ్మో ఎంత వాఁడనుకొన్నారు మరి?

"ఎంతనుకుంటున్నావూ, అమ్మో, 'అగ్నిర్ధిమస్య' కేం లోటూ?"

'అగ్నిర్హిమస్య' అనఁగా భేషజము వైద్యునకు పటాటోపము, డంబముల అసరమెక్కుడు తిరగమూఁతల సామగ్రిలోను, కూరలలో వాడు అల్లము బెల్లముల తోను చేయు గారడీ వైద్యున కెక్కుడు (తెలుఁగు వైద్యం మాట ఇంగ్లీషు వైద్యము మన దేశాన కాలుపెట్టునాటికే ఈ పదము రూఢమై పోయినది) అట్టిది కాన భేషజమనుమాట పటాటోపముకు పర్యాయమైనది ఆ భేషజము అందరకు తెలియుటచే వైదికులు 'అగ్నిర్హిమస్య' అనుదానిని ఆ అర్థమున సంకేతించుకొనిరి "అగ్నిర్హిమస్య భేషజం భూమి రావపనం మహత్" అని వేదము

*

ఇట్టివాఁడే మరియొక్కఁడు 'త్వాష్ట్రము' ఇదియు నలుగురికీ తెలిసిపోయిన మాట మరీ ప్రసిద్ధికెక్కినమాట చాటు ఇసుమంతేనియు లేనిమాట కన్యాశుల్కమున కరటకశాస్త్రుర్లు అగ్నిహోత్రావధాన్లను త్వాష్ట్రమనును "త్వాష్ట్రాః పశవ ఉచ్యన్తే" అని యొక వాక్యము ఇది వేదములోనిది కాదని నా అనుమానము సస్వరముగా నేను వినలేదు వాక్య విన్యాసమునుబట్టి కూడా ఇది వేదమునందలిదని అనుకొనను కాని యిదియే మూలముగా వైదికులు చెప్పిరి

* * *

మరియొకఁడు 'యంబ్రహ్మ' ఈ యంబ్రహ్మయు తెలుఁగు దేశాన ప్రసిద్ధుఁడు సృష్టికర్తకు ప్రతిగా తయారైనవాఁడు కాఁడితఁడు కవిబ్రహ్మలకు ప్రతిగా నున్న కవి యంబ్రహ్మకాఁడు 'యం బ్రహ్మ వేదాంతవిదో వదంతి"

వేదాంతవేత్తలు శమప్రధానులు ప్రవృత్తి మార్గమును వదలి, నివృత్తి మారమునఁ బడువారు పడకపోయినను, నివృత్తి మార్గమును కొండాడువారు వారిని హేళన చేయుటకు వారు స్తబ్ధులనియు చలిమిడి ముద్దలనియు, చేతకానివారనియు అందురు వేదాంతవేత్త పక్కనున్న కారణాన 'యంబ్రహ్మ'కు స్తబ్ధత మొదలగునవి సంకేతమువలన దక్కినవి శ్లోకమువలన విదివచ్చుట యిట విశేషము ఇట్లు సంకేతింపఁబడ్డ యంబ్రహ్మ తన ప్రఖ్యాతికై ప్రాఁకులాడి సంకేతముల ప్రయోజనమును చెరిచినాఁడు నేఁడు యంబ్రహ్మను తెలియనివారు లేరు గదా

* * *

ఈ ప్రభువుకు చేయు మర్యాదలలో 'ఉద్వాసన' యొకటి ఇదియు ప్రఖ్యాతిని బడసినదే 'ఉద్వాసన చెప్పినారు' అనఁగా వెడలఁగొట్టారు అని అవమానము బిచ్చికము ఉద్దేశించిన ఉద్దేశించవచ్చునుగాని, వస్తుత లేదు దేవతలను ఆవాహనచేస్యి పూజలయిన తరువాత వారిని పంపివేయుట ఉద్వాసన ఇది వైదికులు కల్పించినదయు, చెవిని పలుమారు పడుటవల్ల, ప్రత్యక్షముగా పెక్కు తడవలు చూచుటవల్ల ఉద్వాసన తేటతెల్లమయినది

"ఆ సరసీరుహాక్షిపయి నాసల నా నరివారు నవ్వ ను
ద్వాసిత ధైర్యతన్ విపివి వాసనవింటివజీరునమ్ములన్
గాసిలుచున్నవాఁడ వను గన్నడసేసె విధాత యయ్యయో
దోసము కాదొకో తవకు తొయ్యలి నీయక యిట్టు లేచుటల్"

—అహల్యా సంక్రందనం, 2—వ ఆ 83 వ ప

'ధైర్యము పోయింది' అని చెప్పటానికి సముఖం వేంకటకృష్ణప్పనాయకుఁడు 'ధైర్యం ఉద్వాసితమైంది' అని అన్నాఁడు

* * *

మఱియొక ప్రబుద్ధుఁడున్నాఁడు ఆతఁడు 'ద్రాపి' ఇతగాఁడు ద్రాబ గానూ, దేబెగానూ మారినవాఁడు ఆప్టే నిఘంటువున "ద్రాపః 1 Mud, Mire 2 Heaven, sky 3 A Fool, an Idiot 4 An epithet of Siva 5 A small shell" అని కన్నడ నిఘంటువున "ద్రాబ—Adj Aukword or useless" అని బ్రౌన్ నిఘంటువున ద్రాబ—1 A block head, A fool ఆముక్తమాల్యద 4—262 adj Silly, worthless, base, trashy ద్రాబ సొమ్ము H S Trash, Stuff, Rubbish" అని

ద్రాపి అతి ప్రసిద్ధమై పలు వికారములకులోనై వాడుకలోకి ఎక్కి, ప్రయోగములలోనికిని ఎక్కినది శబ్దరత్నాకరమున "ద్రాప దే విణ అసారుఁడు అసారము" అనీ, "దుష్కవితలు లక్షణం బెరుఁగఁజాలక ద్రాబలు గూర్చి అల్లుచున్" (కవి స 1 ఆ) అనిన్నీ, అధముఁడు, అధమము అనిన్నీ, "గూబలచే నిట్లయితిమి ద్రాబలమై " (పంచ నా 2 ఆ) అనిన్నీ ఉన్నది ద్రాపి అనఁగా దరిద్రము, దరిద్రుఁడు నిర్ధనుఁడని కాదు (దరిద్రాధాతువునకు దుర్గతి అర్థము) అన్ని విధాలా దరిద్రుఁడని వైదికుల చేసిన సంకేతము "ద్రాపే—అంధసస్పతే దరిద్రం నీలలోహిత, ఏషాం పురుషాణాం ఏషాం పశూనాం మాభే ర్మారో ఏషాం కించినా మమత్" అని నమకము (రుద్రము)

'వీఁడు పట్టి దరిద్రుఁడు' అని వషట్కారాలు తినటం యిష్టంలేక, తమ అలవాటు చొప్పున దరిద్రం అనే మాటకు ముందు ఉన్న 'ద్రాపే' అనుదానికి ధర్మం ఐన దరిద్రాన్ని ధర్మిగా వాడి, 'ద్రాపే' అనుదానికి 'దరిద్రుడు' అను అర్థమును సంకేతించుకొనినారు ఇది లోకమున పడినది నలుగురూ వాడఁజొచ్చినారు వాడుకలోని కెక్కినది అనేక వికారములకు పాలయినది ఆముక్తమాల్యదనాఁటికి—

"ద్రవిణము నొవ్వఁగొంట, నొఱ ద్రాబలతో నిడుచుంట, భూమిగొం
తవలికి నిచ్చుచుంట, ప్రథమాప్తక చూడక శంకనుంట, లో
బొనయు నృపాళికై యుభయము న్మణిభూషలు గుప్తి బంపి, భూ
ధవుఁ డరియుం దిరుందగు నిదం దనయుం దివి మాన్పుకోఁదగున్"

—యామునప్రభు రాజనీతి 4 ఆ 248 వ

ద్రాబయి కావ్యమున కెక్కినది నేఁటికిని రాయలసీమలో ద్రాభ అని అంటారు అని మిత్రులు శ్రీమాన్ తిరుమల రింగాచార్యులుగారు అన్నారు

కృష్ణా గుంటూరు మండలాలలో దేబె అని వాడుక ద్రాబ అన్నా, దేబె అన్నా, ద్రాపి అన్నా— సూనము దరిద్రుఁడనే నేఁటి తిట్లలో స్వైఅము అంతర్వాహినిగా దరిద్రుఁడనియే వినఁబడును

కైలాసవాసి శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు వెనక ఆంధ్రవారపత్రిక (1937) దసరా సంచికలో వ్రాసిన 'వైదికభాష—ఆంధ్ర భాష' అను వ్యాసములో 'ద్రాపి'ని గురించియు కొంత ముచ్చటించినారు వారు ఈ పదము వైదిక భాషకు చెందినదే అని అంగీకరించినారు తిట్టనియే ఒప్పుకొన్నారు అర్థవివరణము మాత్రము ఇంకొక విధముగా చేసెనారు వారి మాటలు—

"తెలుగువారి తిట్లలో ద్రాపివెధవ అనేది చాలా తరుచుగా ఉపయోగిస్తూ ఉన్నది మనుష్యరూపము మాత్రము కనిపిస్తూ, మనుష్యునకు కావలసిన తెలివి తేటలు లేనివాణ్ణి 'ద్రాపివెధవ' అంటాము ఈ క్రింది మంత్రము చూడండి—

'బిభ్రద్ద్రాపిం హిరణ్మయం
వరుణో వస్త నిర్ణిజం'

హిరణ్మయం సువర్ణమయం, ద్రాపిం కవచం, బిభ్రత్ ధారయన్

ఇందు ద్రాపి యనగా కవచ మర్థము కవచము మనుష్యాకారము కలదేగాని మనుష్యునకు ఉండే తెలివి తేటలు ఉండవు కాబట్టి మనుష్య ఆకారమే ఉన్న తెలివి తేటలు లేని వాణ్ణి ద్రాపివెధవ అని తిట్టడం సహజం ఈ ద్రాపి ద్రాబగా మారి గ్రంథాలలోకి ఎక్కింది కాబట్టి, గ్రామ్యంలోని ద్రాపిన్నీ, వైదికభాషలోని ద్రాపిన్నీ ఒక్కటే అని చెప్పడానికి అభ్యంతరం ఉండకూడదు"

అని వ్రాశారు వారు వ్రాసిందంతా నేను అంగీకరిస్తాను అర్థ వివరణంలోనే వచ్చింది అభిప్రాయభేదం అనాఁడే ఈ అభిప్రాయభేదం ప్రచురించెడివాఁడను కాని మిత్రుఁడు మల్లాది రామకృష్ణశాస్త్రి వైదిక వాఙ్మయం యింకా గాలించి చూదాం అని ఆపాఁడు తాను గాలించాఁడు నమకంలోదే నసిగా ఉందని తరువాత చెప్పాఁడు వేలూరి శివరామశాస్త్రులవార్ని కనుక్కున్నాను ఈ అభిప్రాయభేదం చెప్పాను వారున్నా 'అ అ అలాగే' అన్నారు నమకమున రుద్రుణికి "ద్రాపే, అంధసస్పతే, నీలలోహిత" అని సంబోధనలు కలవు గదా ఈ మంత్రమునకు సాయణ భాష్యమును, పాల్కురికి సోమనాథుని రుద్రభాష్యమును ఒక సారి చూడఁగ్గని అవి చూచి, నా అభిప్రాయము తప్పైనచో నేను మార్చుకొందును 'ద్రాపి' కి ఈ వైదికుల సంకేతమువల్లనే తిట్టువోతుతనము లబ్బినదిగాని, కవచము అను అర్థమువల్ల వచ్చినది కాదని తలంతును కవచము బుద్ధిహీనము గనుక, బుద్ధిహీనుఁడికి ద్రాపి అని అంటారనే దానిలో డొంక తిరుగుడు మొదటనుండీ నాకు కనఁబడుచున్నది ఒక వెలితి కనఁబడుట నా తప్పిదమే కావచ్చునుగాని, నా కెందుకో నచ్చుట లేదు

* * *

సాయంత్రము 5 గంటలు కొట్టినారు భారతీ ఆఫీసున శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారును, నేనును మాటలాడుచున్నాము గంట చెవింబడుటతోనే ఆయన "యత్తే అగ్నే చెబుదాం" అన్నారు ఇది 1938 మేనెలలో నాకు తెలియలేదు వారే 'యత్తే అగ్నే' అంటే ఏమిటో తెలివిడి చేసినారు

"యత్తే అగ్నే' అనఁగా ఉద్వాసన దేవతను ఆహ్వానించి పూజాక్రమము నెరవేర్చిన పిదప ఉద్వాసన చెప్పు మంత్రము ఇది "యత్తే అగ్నే తేజ స్తేనాహం తేజస్వీ భూయాసం, యత్తే అగ్నే వర్చ స్తేనాహం వర్చస్వీ భూయాసం, యత్తే అగ్నే హర స్తే

నాహం హరస్వి భూయాసం" అని ఈ 'యత్తే అగ్నే' అనునది కూడా కొంత ప్రచారము నందుకొన్నదే!

యదగ్నే=కానీ (కాణీ)

"ఏమిచ్చా రక్కడ?"

"యదగ్నే"

ఎంతో సంభావన యిస్తారని వెళ్లగా, అక్కడ కానీ మాత్రమే ఇచ్చిరట దానిపై సంభాషణ

*    *    *

వషట్కారాలు=చీవాట్లు

శ్రౌషట్, వౌషట్ అను ప్రత్యయములకు దురర్థము లేదు వషట్ అనునది దేవతలకు గౌరవార్థమున ప్రయోగింపబడునది ఆప్టే నిఘంటువున "వషట్— An exclamation used on making an oblation to a deity, (with dat of the deity) ఇంద్రాయ వషట్ పూష్ణే వషట్ వషట్కార the formula or exclamation వషట్" అని యున్నది

కాని, వైదికులు వషట్కారాలు అని చీవాట్లను గురించి వాడుదురు ఏల వాడుదురో తెలిసినదికాదు బహుశః వ్యతిరేక లక్షణచేత, ఉద్ద ఎద్దు మొద్దు స్వరూపమును "బృహస్పతి వీడు" అని వ్యవహరించినట్లును, అమంగళవారమును (కుజుడు యుద్ధాధి దేవత కాన) మంగళవారము అనీ, జయవారము అనీ వ్యవహరించి నటులను చీవాట్లను వషట్కారము లనిరేమో అని అనుమానము వైదికుల నడిగి చూచితిని కాని వారు ఇదమిత్థమని తేల్చి చెప్పలేదు

*    *    *

"ఏమైందీ అక్కడ . ?"

"అయం వై—"

'నే నిక్కడ ఉన్నాను ఆ సభలో ఏమైన'దని అడుగగా, జబాబు 'అయం వై' అనినాడు 'అయంవై' అనగా క్షవరము 'ఏ ముందీ అక్కడ, క్షవరం అయిం'దని జబాబు "అయంవై లోక ఆవపనం మహత్" అని శ్రుతి

*    *    *

అసురఘ్నం—సగం

"ఏమిచ్చారట"

"ఇచ్చిందే కొద్ది అదైనా అసురఘ్నం వొచ్చింది"

ఒకడు ఏది చేయించి తెచ్చుకొంగా వాటాదారు సగంపంపిణీకి వచ్చాడు తనకు మిగిలింది సగమే అది వెల్లడించుచున్నాడు

"అసురఘ్న మింద్రసఖం సమత్సు" అని మంత్రము 'ఇంద్రసఖం' అనుదానిలో 'సఖం' ఉండుటనుబట్టి తెలుగున సగము అనుదానికి వైదికపు ఒత్తులతో 'సఖం' అనుటయు శ్రుతిగోచరము కావున సగము అనుదానికి చాటుగా 'అసురఘ్నం' అను పదము సంకేతింపబడ్డది.

*    *    *

'అశ్మా చ మే' అనగా మట్టి

"ఏం మిగిలిందీ అక్కడ?"

"అశ్మా చ మే, ఏం మిగులుతుందోయ్!"

చమకమున "అశ్మాచ మే మృత్తికా చ మే" అని కలదు కావున ఇటుల "అశ్మాచమే" అనునది సంకేతింపబడినది 'అశ్మా' అనుదానికి 'రాళ్లు' అనునది అసలు అర్థము.

*    *    *

దమ్మిడీకి 'గర్భం ధత్తే' అని "గర్భం ధత్తే పయసా" అని శ్రుతి 'పయస్సుచే (నీరూ—పాలూ) గర్భము ధరించినది' అని అసలు అర్థము

*    *    *

"వాఁ డిప్పు డేం జేస్తున్నాడు?"

"పాపఁ! అగ్నేయింతి చేస్తున్నాడు"

ప్రశ్నకు 'పాపం, ముష్టెత్తుకుంటున్నాఁ' డని జబాబు ఈ అర్థములో అగ్నేయంతిని ప్రయోగించినవారు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారు నాక్కనిపించారు వారు ప్రయోగించిన వ్యాసం గుర్తులేదుగాని అది కృష్ణా పత్రికలో అచ్చయినది "అగ్నేయంతి ద్రవిణం భిక్షమాణా." అని శ్రుతి

*    *    *

"ఏమయ్యా రామయ్యా ఏం చేస్తున్నట్టు?"

"హుఁ, రుద్రా యాతతామినే"

ఉపవాసాలు చేస్తున్నాఁ డనడానికి క్షేత్రాలు చెయ్యడమని వాడుక అది ఎట్టుల వచ్చిందో తెలియదుగాని వాడటం ఎఱుగుదుము శ్రీ జనమంచి కామేశ్వరరావు తల్లి "ఏమండీ రాత్రి క్షేత్రమా?" అని అడిగినప్పుడు మల్లవరపు విశ్వేశ్వరరావూ, నేనూ విస్తుపోయాము క్షేత్రమంటే తెలియక అతనూ, ఉపవాసం అని తెలిపి, ఈమె ఎల్లా అన్నారా అని నేనూను ఏ కారణాన క్షేత్రానికి ఉపవాసం అర్థం వచ్చిందో తెలిసింది కాదు

బ్రౌన్ నిఘంటువున క్షేత్రమునకు మామూలుగాఁ గల అర్థముల నిచ్చి, తుదిని "(Starvation) (The meaning is peculiar to Telugu)" అనినారు ఉదాహరణముగా "నిన్న కటిక క్షేత్రముగా ఉండినాడు (He was starving all yesterday)" అనినారు వారికిన్నీ ఇది వింతగా తోఁచినది సమక్షముననున్న పండితులు గూడ తెలియదన్నారు కాఁబోలు వైదికులు ఉపవాసానికి 'రుద్రా యాతతామినే' అంటారు "రుద్రా యాతతామినే క్షేత్రాణాం పతయే నమో నమః" అని వేదము. క్షేత్రము అనునది ప్రఖ్యాతమైనది గనుక దాని అర్థమును ముందు మాటకు వాడినారు

*    *

"భూ ర్భువ స్సువరోం అన్నారుట్రా?"

అని తోటి భోక్తను అడుగుతున్నాఁడు ఒకఁడు 'ఇంకా పొయ్యిలో నిప్పు వేశారా' అని దాని కర్థము అగ్ని ప్రతిష్ఠాపన 'భూ ర్భువ స్సువరోం' అని చేస్తారు గనుక విషయాన్ని బట్టి మాటను సంజ్ఞగా చేసుకోడము ఇది

*    *    *

"పొంతు ఎంత?"

"ఏముందీ అక్కడ, యాత్తమస్య—"

'దక్షిణ ఎంత' అని ప్రశ్న వేశాఁడు ఒకఁడు "దక్షిణాః పొంతు పొంతు దక్షిణాః" అని స్మార్త కలాప వాక్యముండుటనుబట్టి 'పొంతు' అనుదానికి దక్షిణ అను అర్థము పొసఁగింపఁబడినది

ఈపైవి కొంచెం ముతకమాటలు తెలిసినను ఉన్న విషయముగాన వీలైనంత మృదువుగా చెప్పెదను కామ క్రోధాది విషయాలూ, రాజసతామసాలూ అన్నీ స్వాభావికాలూ, సహజాలూ గనుకా, అందరిలోనూ మృగ వాసనలు అంతో యింతో గోంద్రుమనుచుండును గనుకా వీరలు బూతులు కూడ వాడెదరు నిర్భీతిగా తాము నిర్మించుకున్న కవచము చాటున విచ్చలవిడిగా బూతులను వాడెదరు పైవారి కేమి తెలియును! దక్షిణ ఎంత ఇచ్చారని అన్నపైదానికి చెప్పిన జబాబు "ఏముందీ అక్కడ, యాత్తమస్య" అని గదా "యాత్తమస్య పశవ స్సుజంభం" అని మంత్రము

ఇట్టిదే ఇంకొకటి 'పద్భ్యముదరేణ' "పద్భ్య ముదరేణ శిశ్నా" అని సంధ్యా వందనంలోని మంత్రము

*    *

దారినిబోవు తరుణిని, జఘనము, సామాన్యనుగాని ఆబతో వర్ణించుకొనుట వీరికి గలదు సంకేతమని తెలియని సంకేతాలతో వ్యవహరించుకోవాలి మరి వీరూ సృష్టించుకున్నారు కొన్ని మాటలను అవి, ఆక్రంద, ఏతేవా ఇడాలు "అక్రంద దగ్ని స్తనయన్ని వద్యాః" అని మంత్రము "ఏతేవా ఇడా స్తనాః" అనియు మంత్రము

*    *    *

అరోహోరు—మైథునము

గర్భాదానఖండంలో మొదట, "అరోహోరు ముపబర్హస్వ బాహుం" అని

*    *    *

బయట తుప్పర పడుచో వీరు 'యాకుందేందు' అందురు "యాకుందేందు తుషార హార ధవళా" అని సరస్వతీ స్తోత్రము

*    *    *

'అరి నీ పిండం పిల్లులకు పెట్టా' అనునది మోటు తిట్టు

పిండం అనుదానికి వీరి పరిభాషలో "తేభ్య శ్చాయం" అని "తేభ్య శ్చాయం పిండః తస్మై తే స్వధా నమో గయాయాం దత్తమస్తు" అని తద్దినం మంత్రము దీనిలోని ముక్క 'తేభ్యం'

విడివిడిగానైన కొన్ని పరిభాషలు టా రా డా ఘా—అణాకు గంగిగోవు—పశుప్రాయుఁడు రశ్మి—సంపాదన, లాభం వికిరపిండం—కాకి ఇత్యాదులు

వీరు వాడుక చేసిన మాటలలో అవతలి మాట అర్థాన్ని ఇవతలి మాటకు వాడుక చేయడము, ఒకటి రెండు మాటలు దాటినా అవతలవుండే పద అర్థాన్ని మొదటిమాటకు సంకేతం చేయడం, అర్థాన్నిబట్టి ప్రయోగించడమూ, విషయాన్నిబట్టి ప్రయోగించడమూ, పర్యాయంగా వాడటం, కొండ గుర్తుగా వాడటం, వ్యతిరేక లక్షణగా వాడటం ఇవి కనిపిస్తూ ఉంటాయి. ఈ పరిభాషలలో సంపూర్ణంగా వాక్యాలు నిర్మించి ప్రసంగం అంతా యిట్టి మాటలతో చేస్తారు నాకు లభించని వెన్ని ఉన్నాయో మఱి ఉన్నవాటికి ప్రయోగాలు కావ్య పరంపరలలో ఉన్నాయో లేదో మఱి తెలియదు

# నాదబ్రహ్మము

శ్రీ శొంఠి వెంకటరామమూర్తి

[1942 చిత్రభాను సంవత్సరాదిసంచికనుండి]

## 1

ముప్పది సంవత్సరముల క్రిందట, నేను ఇంగ్లాండులో ఐ సి ఎస్ ప్రొబేషనరుగ నుండగ, ఆంధ్ర పునరభ్యుదయముకొఱకు పాటు పడిన వారిలో నగ్రగణ్యులైన కీర్తిశేషులు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రిక ప్రథమ ఉగాది సంచికకు నన్నొక వ్యాసము వ్రాయగోరిరి నేడు, వారి అల్లుడు— ఇప్పటి పత్రికా సంపాదకులు ఈ సంచికకు ఒక వ్యాసము వ్రాసి పంపగోరినారు నేనందుకు సంతోషముతో నంగీకరించితిని వారు నాకు నిర్ణయించిన విషయము 'నాదబ్రహ్మము'

## 2

బ్రహ్మము సత్తు అగును అసత్తు కూడ నగును బ్రహ్మము నిజముగ త్రిరూపాత్మకము—సత్తు, అసత్తు, ఈ రెంటిని అంగీభూతము చేసుకొను పరమ తత్త్వము అట్లే త్రిగుణాత్మకము కూడ—సత్త్వరజస్తమములనెడు గుణములు గలది ఈ త్రిత్వము నీ క్రింది విధముగగూడ సూచించవచ్చును అస్తిత్వము (Exixtence), స్పందనము (Vibration), విస్తృతి (Extension), లేదా, జడము (Matter), శక్తి (Energy), ఆకాశము (Ether) బ్రహ్మముయొక్క స్వరూపము అణు రూపాత్మకము (Atomic) అణువులు అంతరిక్షములో ఆవాసస్థాన మేర్పరచుకొన్నవి అణువుల సంయోగ వియోగము లీ అంతరిక్షముగుండ జరుగుచుండుట వలన అంతరిక్షము గూడ అణువుల స్వభావమున బాల్గొనుచున్నదని చెప్పనొప్పును శక్తిపరిమాణరూపతః (Quantam) అణురూపాత్మకము, జడము (Matter), దేశము (Space) అణువుల, ఎలెక్ట్రానుల మయమైనట్లే

## 3

త్రిరూపాత్మకమైన బ్రహ్మము అనేక భూమికలలో (levels) అభివ్యక్తమగుచున్నది జడప్రపంచము మనకు సులభముగ ప్రత్యక్షమగుచున్న భూమిక జడము అసత్తు దీని దిక్కు మనకు దేశము (Space), లేక విస్తృతిగ (Extension) గోచరమగుచున్నది కాలము ఈ రెంటిని అనుబంధములుగ గూర్చుచున్నది జడ, దేశ, కాలములు మూడును జేరి బాహ్యములుగ గన్పట్టుచున్నను, నిజముగ మనోమయ జగత్తునందు ప్రతిష్ఠితములై యున్నవి అన్నమయ (Matter-Space-Time), మనోమయములను, అంతర బహిరములను విషయి విషయములను (Subject and Object) అంతర్భుక్తము చేసుకొనునది నిజముగ ఆత్మతత్త్వము. బ్రహ్మము ఈ సదసత్తుల భూమికల నన్నిటిని సూచించుచుండుటచేత ఇవన్నియు ఆత్మయొక్క భిన్న లోకములే అని తెలియనగును

## 4

జడము దేశములో (Space) నివాస మేర్పరచుకొని ఉన్నది సంచలనము (Motion) ఈ రెంటిని అనుబంధములుగ జేర్చుకొని బ్రహ్మమున కొక భూమిక అగుచున్నది జడములో సంచలనము కలిగి నాద ప్రపంచ మేర్పడుచున్నది ఇది మరియొక భూమిక ఆకాశమునందలి సంచలనము వర్ణ ప్రపంచమును గల్పించుచున్నది ఇవన్నియు బ్రహ్మము యొక్క భిన్న భూమికలు సంఖ్యా రూపము మరియొక భూమిక అందు మన జ్ఞానము గడ్డకట్టుకొనుచు, తిరిగి కరిగిపోవుచు సంఖ్యా ప్రపంచము నేర్పరచుకొనుచున్నది.

ఈవిధముగా బ్రహ్మము అణురూపమై సంఖ్యా ప్రపంచముగ రూపొందుచున్నది

## 5

నాదము అణురూపాత్మకము సంగీతమున అణువుల స్పందనము క్రమానుగతములైన తరంగ వేగములవలన ఆరోహణావరోహణము లేర్పడుచున్నవి ఒక తరంగ వేగమును ప్రమాణముగ (unit)'స' స్వరము నిరూపితమైన ఎడల తక్కిన తరంగ వేగ ప్రమాణములు $12\frac{1}{12}$ నుండి 12 మెట్లమీద బైకి పోవునప్పుడు రెండై తిరిగి 'స' స్వర మేర్పడును. ఈ స్పందన క్రమమే మన చెవులకు ఇంపును గూర్చును మనకంటె భిన్నులైన జీవు లుందురేని, నాదపు అణువుల వేరు కూర్పు వారికి శ్రావ్యతను గల్పించవచ్చును ప్రధాన స్వరముల మధ్యనుండు అంతరములు కూడ నాదపు అణువులతో నిండియుండును—సంఖ్యకు సంఖ్యకు మధ్యనుండు లంతరములు కూడ సంఖ్యామయము లైనట్లు మన చెవికి సోకని నాద ప్రపంచ మెంతయో కలదు మనకు శ్రవణ గోచరమైన నాదము ఆ శ్రవణాతీతమైన నాద ప్రపంచమున ప్రతిష్ఠితమై యున్న దనుట నిశ్చయము మనకు శ్రవణాతీతమైన నాదము మనకు అశబ్దముగ తోచవచ్చును; లేదా మన చెవులకు కటువైన శబ్దముగను తోచవచ్చును మనకు శ్రుతిరంజకమైన నాదము ఆ మహానాదములోని ఒక అంశమాత్రము.

## 6

బ్రహ్మమెంత గంభీరమో, ఎంత విశాలమో, ఎంత పూర్ణమో బ్రహ్మభూమికలలో నొకటియగు నాదము కూడ అంత గంభీరము, అంత విశాలము, అంత పూర్ణము అని గ్రహింపనగును అందుకనియే నాదము పరబ్రహ్మ స్వరూపమని మన ఋషులు కీర్తించిరి

# విమర్శ ప్రమాణము

## శ్రీ నోరి నరసింహశాస్త్రి

[1944 తారణ సంవత్సరాది సంచికనుండి]

సృష్ట్యాదినుండి ఇప్పటివరకూ కవు లెంతమంది పుట్టినారో చెప్పలేము కాని వారిలో మన మిప్పటికీ స్మరించెవారు కొద్దిమందే ఉన్నారు అయితే మనము మరచిపోయినంత మాత్రముచేత మన దృష్టిలో లేనివారు కవులు కాకపోరు మనకు జ్ఞానకము ఉన్నంత మాత్రముచేతనే వారంతా మంచి కవులు అవడానికీ వీలులేదు ఇక మనము మరచిపోయిన విమర్శకులు ఎంతమంది ఉండేవారో చెప్పనేలేము గదా

### అందరూ విమర్శకులే

ఇప్పుడున్న కవుల సంఖ్య స్థూలంగా చూస్తే సృష్ట్యాదినుంచీ ఇప్పటిదాకా ఉన్న కవుల సంఖ్యకు సరిపోతుందా అనిపిస్తుంది ఇక ఇప్పుడు విమర్శకుడు కానివాడే లేడు డెమాక్రెసీ రోజులు గనుక కవిత్వమూ, దాని విమర్శా సర్వసాధారణము కావడము న్యాయమే నా కెందుకు, నేను పది పన్నెండేళ్లు వచ్చినప్పటినుంచీ కవిత్వమూ, కవితా విమర్శా మొదలు పెట్టినాను ఎప్పటికప్పుడు నేను చెప్పే కవిత్వమువలెనే నా విమర్శ కూడా నాకుమాత్రము బాగుండేది అయితే ఎప్పటి కప్పుడే కాని ఆ తృప్తి, వెనకటి కాలంలో బాగున్న కవిత్వము కాని, విమర్శకాని ఇప్పుడు నాకే నచ్చడములేదు

### ఒకే ఒక ప్రశ్న

అందువల్ల ఈమధ్య కొంతకాలమునుంచీ నన్ను ఒక ప్రశ్న పట్టి బాధిస్తున్నది బంగారము మంచిదో, చెడ్డదో విచారణ చేయవలెనంటే స్థూలంగా గీటురాయివల్ల చెప్పవచ్చును ఇంకా సూక్ష్మమైన సాధనాలవల్ల కొలతవేసి ఇంత బంగారము, ఇంత రాగి, ఇంతమట్టి అని చెప్పే వీలున్నది అట్లాగే ఇతర విషయాలు కూడా మంచిచెడ్డల విచారణ చేయడానికి ఏవో ఆధారాలు—ప్రమాణాలు ఉన్నవి

### ఏది కొలబద్ద?

కవిత్వానికీ, విమర్శకూ అటువంటి కొలబద్దలు ఏవైనా ఉన్నవా? ఉంటే అవి ఎంతవరకు నమ్మదగినవి? కావ్యము మంచిదేదో, చెడ్డదేదో తెలుసుకునేందుకు ప్రమాణము దొరికితే కవిత్వానికీ, విమర్శకూ ప్రమాణము దొరికినట్లే కాబట్టి రెండింటికి కలిపి పర్యాలోచన చేదాము అందులో పాశ్చాత్యులమీద అభిమానముచేత ఆధునికులు అమలులోకి తెచ్చిన కొన్ని ప్రమాణాలు ముందు విచారిద్దాము అయితే అవి మనకూ కొత్తవి కావు

### కాలమా?

అటువంటి ప్రమాణకోటిలో ప్రప్రథమముగా పరిగణించేది కాలము ఏ కావ్యము శాశ్వతముగా జనాదరణ పాత్రముగా ఉంటుందో అదే గొప్ప కావ్యమని ఉద్దేశము ఎన్నో గ్రంథాలు తాత్కాలికముగా జనుల మనస్సులు ఆకర్షిస్తవి కొద్దిరోజులకు మళ్లీ వాటి సంగతి తలచేవాళ్లు కూడా ఉండరు హోమరు, డాంటే, షేక్స్పియరు—ఇత్యాది మహాకవుల గ్రంథాలు కొన్ని శతాబ్దాలుగా జనము చదివి ఆనందిస్తున్నారు అవే ఉత్తమ కావ్యాలు వాటి గుణము శాశ్వతత్వము కాబట్టి కావ్యానికి కాలమే ప్రమాణము అని పిస్తున్నది

### అందులో విప్రతిపత్తిలేదు

అయితే ఇవ్వాళ వ్రాసే కావ్యము మంచిదో, చెడ్డదో విమర్శించడానికి ప్రస్తుతము వీలు లేదన్నమాట కాలము విమర్శించి నిరూపించేదాకా మనము ఆగవలసి వస్తుంది ఇక కాల మంటే ఎంతకాలము!

అదీగాక ఒక్కొక్క కావ్యము ఉండడానికి దాని గుణమేకాక మరెన్నో కారణాలు ఉండవచ్చును ఒక మహాకవి వ్రాసిన సామాన్య కావ్యాలు కూడా జనము అతనిమీద గౌరవముచేత స్మరిస్తూ మరవకుండ ఉంటారు ఒక్కొక్కప్పుడు మత సంబంధమైన స్పర్శ కలిగితే ఆ మతస్థులకు అది పూజ్యమై శాశ్వతమవుతుంది చివరకు ధైర్యముచేసి వచ్చిబాతుగా ఎవరైనా పుస్తకము వ్రాస్తే అన్నిటికంటే అది శాశ్వత మవుతుందని నా విశ్వాసము విశ్వాసము లేనివారు కాళిదాస ప్రహసన మనే ప్రసిద్ధి ఉన్న ప్రహసనము వ్రాసినవాణ్ణి, మన కవి చౌడప్పనూ అడగండి! ఈవిధంగానే ఉత్తమత్వమేకాక మరెన్నో కారణాలు ఉండవచ్చును—చిరంజీవులుగా ఉండడానికి

అంతేకాక ఉత్తమమైనవి ఎన్నో కావ్యాలు కాలగర్భంలో పడిపోయినవి కవి తాను ప్రచారము కోసము ప్రయత్నించకపోతే లోకానికి ఎట్లా తెలుస్తుంది! ఒక్కొక్కప్పుడు ఉపద్రవాలవల్ల కావ్యాలు పోతవి కొన్ని గ్రంథ భాగాలే కనిపిస్తవి ఎన్నో కాలగర్భంలో పడిపోయినవి చిత్రముగా కొన్నాళ్లకు పైకి వచ్చి జనాదరణ పాత్ర మవుతున్నవి ఇటువంటిదానికి గొప్ప ఉదాహరణము ఇప్పుడు మనము సామాన్యముగా భాసనాటకాలని వ్యవహరిస్తున్న ప్రతిమాది నాటకాలు ఇందులో రెండు విశేషాలు అవి ఎవరు వ్రాసినా చక్కని నాటకాలే అవి ఎన్నాళ్లు కాలగర్భంలో పడిపోయినవో తెలియదు గదా! ఇప్పుడా నాటకాలు నమ్మకమైన ఆధారము లేకపోయినా, భాసుడి పేరుతో ముడివేయడమువల్ల నాటికి మరింత జనాదరణము వచ్చినదనడము నిస్సందేహ విషయము!

కాబట్టి కాల మనే ప్రమాణము మనకు విశ్వాస పాత్రమైనది కాదు.

### విశ్వజనీనతా?

కాలము కాదు కావ్యము బహు జనాదరపాత్రము కావలె అంటే ఒక రకమైన మనుష్యులకేకాక బహువిధాలవారికి కావ్యము నచ్చవలె అప్పుడే అది మంచి కావ్య మవుతుంది అంటే మంచి కావ్యాలు బాలురవద్దనుంచీ పరిణతబుద్ధులవరకూ అందరికీ బాగుండవలె పిల్లలు కథా చమత్కృతికి వ్యగ్రులవుతారు శాబ్దికులు శబ్ద సౌష్ఠవం వల్ల ముగ్ధులవుతారు ధర్మ ప్రబోధముతో ధార్మికులు సంతుష్టులవుతారు మహాభారత ప్రస్తావనలో పూజ్యపాదుడైన నన్నయభట్టారకుడు కూడా ఈ గుణమే ఉద్ఘాటించి నాడు

"ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని "

ఇంకొ విధముగా కూడా మన పెద్దలు ఈ గుణాన్నే వర్ణించినారు

"ఒక్కొక్కని కావ్యము కవి గృహములోనే నిలిచిపోతుంది మరొకరిది ఆ కవి స్నేహితుల ఇళ్లదాకా వెళ్లుతుంది ఇక మరి ఒకరి కావ్యము అవిదగ్ధుల వదనములందు పాదము లుంచి విశ్వకుతూహలివలె శాశ్వతముగా సంచరిస్తుంది"

ఈ గుణాన్నే 'విశ్వజనీనత' (Universality) అని పాశ్చాత్య విమర్శకులంటారు.

### అదీ నిలవదు

అయితే ఈ కొలబద్ద వేస్తే ఎన్నో మంచి కావ్యాలు పోతవి కొన్ని కావ్యాలు పరిణత బుద్ధులకేకాని ఆనందము కలిగించవు

"    లేజవరాలు చెక్కుగీ
టిన వసవల్చు బాలకుడు
డెందమునన్ గరగంగ నేర్చునే?"

అన్నాడు కాదూ మన తెలుగుకవి! మరి అంత గొప్పగా నన్నయభట్టారకుడు మహాభారతమును ప్రశంసించినాడా? దాన్ని కూడా కొందరు నవనాగరికులు, ద్విజులు తమకు ద్విజేతరులచేత శాశ్వతముగా దాస్యము చేయించుకోడానికి వ్రాయించిన ప్రచార ప్రధానమైన గ్రంథమని తోసివేస్తున్నారు అంతమాత్రముచేత మహాభారతము కూడా పోవలసిందేనా? కాబట్టి ఈ విశ్వజనీనత కూడా నమ్మకమైన కొలబద్ద కాదు సూక్ష్మముగా

ఆలోచిస్తే ఇది కూడా ముందు విచారించిన కాలమనే ప్రమాణానికి అపరరూపమె! కాబట్టి కాలమూ కాదు, విశ్వజనీతా కాదు!

## ఉదాత్తతా? అంటే......

ఇక కొందరు ఉత్తమ కావ్య లక్షణము ఉదాత్తత (Sublimity) అంటారు మిల్టను వ్రాసిన 'పారడైజు లాస్టు' చూడండి! అందులో మనుష్య జాతికే సంబంధించిన ఉదాత్త విషయాలు చిత్రించినాడు డాంటే వ్రాసిన 'డివైను కామెడీ' కూడా అంతే! అట్లాగే గెటే వ్రాసిన 'ఫాస్టు' ఆలోచించండి రవీంద్రుని 'కింగు ఆఫ్ ది డార్కు చేంబరు', మీటరు లింకు వ్రాసిన 'బ్లూబర్డు', 'ది సైటులెస్', హాప్ట్మను 'ది బెల్'! హోమరు చిత్రించిన యుద్ధము కూడా సామాన్య మానవులది కాదు దేవతాసములైన వీరులది పెద్దలు పురాణము పంచలక్షణ మని చెప్పినారు—సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము! ఇట్టి ఉదాత్త విషయ వర్ణన చేసేదె ఉత్తమ కావ్యము!

## అందులో బాధకాలు

ఈ గుణము కొలబద్దగా తీసుకుంటే ఉత్తమ కావ్యకోటిలో అందరూ సామాన్యముగా పరిగణించే కావ్యాలు చాలా భాగము వస్తవి నా కెందుకు నాకు గాఢాభిమానపాత్రమైన కావ్యాలన్నీ వస్తవి మహాభారతానికి మకుటాయమానమైన స్వర్గారోహణపర్వము ఒక్కసారి జ్ఞాపకము తెచ్చుకోండి! మానవులలో ఉత్తముడు ధర్మరాజు అందరిలో మానవ శరీరముతో స్వర్గములో అడుగు పెట్టదగినవాడు ఒకడొక్కడే! అతనికి ఎంధుజనులను చూడ బుద్ధిపుట్టగా ముందు ఉన్నతాసనముమీద దుర్యోధనుణ్ణి చూపుతారు తన సోదరులు నరకములో ఉంటారు దేవనీతిమీద కొంతసేపటికి అసహ్యము కలుగుతుంది ధర్మరాజుకు! చివరకు మానవనీతికీ దేవనీతికీ భేదము విశదీకరించి ఆకాశగంగతో స్నానము చేస్తేనేగాని ధర్మరాజుకు కూడా 'మానుష భావ వికారముల శోక బంధము' లడగవనీ, అప్పుడేకాని స్వర్గ సౌఖ్యము అనుభవింపరాదనీ విశదీకరిస్తారు ఈవిధముగా ఈ లోకనీతితో కట్టుబడే మనకు ఇంతకంటె ఉదాత్తమైన నీతి బోధించినాడు వ్యాసభగవానుడు! ఈ విధంగానే ఉదాత్త విషయములు చిత్రించగలిగినవారే మహాకవికోటిలోకి వస్తున్నారు అయితే ఈ ఉదాత్త ధర్మమే ఉత్తమ కావ్య లక్షణ మంటే బాగున్నట్లే ఉన్నదికాని దీనికి కూడా ఎన్నో బాధకాలు ఉన్నవి

## అసలుకే మోసము

ముందు అస లిది సంసార పక్షమైన కొలతకాదు ఈ కొలతబద్ద వేసి కొలిస్తే నిలవగలిగే కావ్యాలు బహుస్వల్పము ఇక మహాభారతాదులే కావ్యాలు—ఇతరము కాదంటే కవులు చాలా భాగము వ్రాయకుండా వూరుకోవలసి వస్తుంది షేక్స్పియరు నాటకాలు చాలా భాగము పోతవి భవభూతి మాలతీ మాధవము నిలవదు కాళిదాసు మేఘదూతము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము కూడా గణనలోకి రాకపోవచ్చును అమరుకము ఏమి కావలె! గాధా సప్తశతి?

## అవ్యాప్తి

కవులూ, విమర్శకులూ ఎందరో రామణీయకవాదులు కావ్యానికి ఉదాత్తత దానికి ఉత్కృష్టత ఆపాదించే ఒక గుణ విశేష మేకాని నిత్య ధర్మముకాదు. ఎన్నోకావ్యాలు రమ్యంగామాత్రమే ఉంటవి వాటి విషయముల ఈ ఉదాత్తతా ప్రమాణము అవ్యాప్తమైపోతుంది కాబట్టి నాబోటి వారికి ఈ ఉదాత్తత ఎంత అభిమానమైనా ప్రమాణభూతముకాదని ఒప్పుకోక తప్పనిస్థితి ఏర్పడుతుంది

## పోనీ, రామణీయకమో?

ఇక ఉదాత్తతను బాధించిన రమ్యత పోనీ, విశ్వసనీయమైన ప్రమాణమవుతుందా? కావ్యము మనోజ్ఞముగా ఉండవలె! "A thing of beauty is a joy for ever" అని కీట్సు ప్రారంభించినాడు కొందరు కళకు గమ్యస్థానము కళయే అన్నారు కవులు చిత్రకారులవలెనే సౌందర్యోపాసకులు ఆలంకారికులలో అధునాతనుడైన జగన్నాథపండితరాయలు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్య" మన్నాడు శ్రీ రాయప్రోలు సుబ్బారావు కూడా అన్నాడు

"నిర్వికల్పక విజ్ఞాన నిరతు లయిన
బ్రహ్మవాదులకును, హ్లాదరామణీయ
వాదులైన కవులకును భేద మెంతు,
తారతమ్య మీమాంసకు తగను నేను"

## బాగానే ఉంటుంది

మమ్మట భట్టారకుడు 'కవి భారతి హ్లాదైకమయ' మనీ, 'నవ రస రుచిర' మనీ అన్నాడు కావ్య విమర్శకు ప్రమాణముగా ఈ రమ్యత, మనోజ్ఞత అని అంగీకరించేందుకు చాలా అవకాశము కనబడుతున్నది ఎంత చిన్న కావ్యమైనా మనోజ్ఞమైతే మనకది గ్రాహ్యమే!

## కాని, దానికి వ్యవస్థ లేదు

ఐతే దీనికి కూడా బాధ లేకపోలేదు కావ్యానికి మనోజ్ఞతే ప్రధాన లక్ష్యమైతే ఇప్పటికి లోకములో ఉత్తమోత్తమ కావ్యాలుగా పూజింపబడే కావ్యాలే వెనుకపడిపోతవి ఉదాత్త కావ్యకోటిలో ఉదాహృతమైన కావ్యాలన్నీ మనోజ్ఞతలో చాలా చిన్న కావ్యాలకు తీసిపోవచ్చును అంతేకాదు ఈ మనోజ్ఞతకు సరియైన వ్యవస్థచేసే వీలులేదు ఈ మనోజ్ఞత మనిషిని బట్టి మారుతుంటుంది కాముకునికి శృంగార ప్రశంస ఒక్కటే మనోజ్ఞము భక్తునికి భక్తి ప్రశంసేకాని శృంగార ప్రశంస అసహ్యము కలిగిస్తుంది. పామృత జనానికి పచ్చిబూతు రుచిగా ఉంటుంది పాపము! వరూధిని మనోజ్ఞత ప్రవరాఖ్యునికి పనికి రాలేదు ఆ శ్రోత్రియబ్రాహ్మణునికి అరణులు, దర్భలు, అగ్నులు ప్రియములైనట్లు అన్యముల్ కావు

కాబట్టి ఈ రమ్యత కూడా అవ్యవస్థితమైపోతుంది

## భావనాబలమూ కాదు

పోనీ, కొందరు కవికి భావనాబలము (Imagination) ఉండవలె నంటారు. కదా అంటే ఇదమిత్థమని మనము స్పష్టముగా తెలుసుకునే వస్తువు కా దిది!

## కావ్యాలాపాలు

మరికొందరు మనిషిని కావ్యాలు కదిలిస్తవి, ఉద్రేకము కలిగిస్తవి అంటారు. మద్యాదుల సేవవల్ల కలిగే ఉత్సాహమూ, ఆవేశమూ వంటిదే కావ్యపరనమువల్ల కలిగే ఫలితమని వీరి ఉద్దేశము తన పాఠకులచేత వీరాంగము వేయించడమే కవి విధి అంటే పెద్దమనుష్యులైనవారు కవిత్వము జోలికి పోరు అటువంటి కావ్యాలను ఉద్దేశించే పెద్దలు 'కావ్యాలాపములు వర్జించవలె'నని పలికి ఉంటారు

## ఉపజ్ఞలో ఓగు

అదికాదు కవికి ఉండవలసినది ఉపజ్ఞ (Originality) అంటారు కొందరు. అయితె కాళిదాసంతటివాడు తనకు ఉపజ్ఞ లేదని

"మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః"

అని ఉద్ఘాటించినాడు ఉపజ్ఞ విమర్శకు ప్రమాణమైతే రఘువంశము మంచి కావ్యము కాదని తోసివేసే అవస్థ పడుతుంది అటువంటి కావ్య విమర్శకు దూరము నుంచే నమస్కారము చేయవలసి వస్తుంది

## వైచిత్రిలోని విపరీతాలు

మరికొందరు కవికి కావలసినది 'వైచిత్రి' అంటున్నారు నిజముగా ఆలోచిస్తె ఉపజ్ఞ లేనివాళ్లు అది ఉన్న వాళ్లను అనుకరించబోయి చూపే ఉపజ్ఞాభాస ఈ వైచిత్రి అని స్పష్టమవుతుంది కావ్య రచన ధన సంపాదనకూ, కీర్తి సంపాదనకూ ఉపకరించే వ్యాపారముగా మారిన తర్వాత లోకవంచనకు చిల్లర కవులు చేసే గారడీ ఈ వైచిత్రి 'నీ పేరేమి'ని తల్కిందులుచేసి చవుకగా వైచిత్రిగల కావ్యముగా చేయవచ్చును. అప్పుడు అది 'మిరేపేనీ?' అవుతుంది

'వైచిత్రి' కావ్యానికి కొలబద్దగా తీసుకుంటే ఏమవుతుందో అది 'వికటకవి'కే వదలవలసి ఉంటుంది

## దేని కదే

ఇక కొందరు "ఏ కావ్యానికి ఆ కావ్యమేగాని కావ్యాలకన్నింటికీ సామాన్య ధర్మము లేదు ఏ కావ్యానికి అదే ప్రమాణము, అంటే కావ్యము చదివి అది ఏ ప్రమాణములతో బద్ధమైనదో తెలుసుకొని విచారించవలెను" అంటారు ఇది విమర్శకులు ముఖ్యముగా గమనించదగిన విషయము అయితే ఈ పద్ధతి విషయగ్రహణానికి మాత్రమే పనికి వస్తుంది కాని అది మంచిదా, చెడ్డదా, గొప్పదా, తక్కువదా—ఈవిధముగా విలువ కట్టడానికి ఉపయోగించదు అర్థము చేసుకోకుండా విమర్శ ప్రారంభించేవారికి ఈ పద్ధతి అడ్డు తగులుతుంది

## అభ్యుదయ రచయితలకు పోటీ

"ఇకముందు లోకంలో రాబోతున్నది కమ్యూనిజము దానికి అనుకూలించేవే మంచి కావ్యాలు ఇతరమంతా తుచ్ఛమైనవి" అంటారు ప్రోగ్రెసివు రైటర్సు అనే పేరుపెట్టుకొని కొందరు వారు చెప్పేదంతా కావ్య వస్తువుకు సంబంధించినదేకాని కావ్య స్వరూపానికి సంబంధ మేమాత్రమూ లేనిది ముందు ఎట్లా ఉన్నా అది అంగీకరిస్తే ఇంతవరకూ లోకములో గొప్ప కావ్యాలనుకునేవి తోసివేయవలసి వస్తుంది వాటి రుచి ఎరిగినవారు ఎన్నటికీ అందుకు ఒప్పుకోరు వీరితో పోటీగా చాలా రకాల ప్రచారకులు తమకు ఇష్టమైన ప్రచారానికి ఉపయోగించేదే కావ్యమని పోటీకి వస్తారు.

## సున్నకుసున్న, హళ్లికిహళ్లి

ఇంతవరకూ పాశ్చాత్య వాసనవల్ల మనవాళ్లు వాడుకలోకి తెచ్చిన విమర్శాదర్శములు పరీక్షించి చూచినాము అవి అన్నీ కూడా కేవలము పాశ్చాత్యులవే కావని కూడా సూచించినాము. అయితే పై వాటిని పరీక్షించగా ఒకటీ తృప్తిగా నిలవలేదు.

## పూర్వాచార్యు లేమంటారు?

మన పూర్వులు ఎందుచేత సమర్థులు కాకపోయినా తిట్ల వేసే మహాసాహిత్య ప్రము-ఖులు వారు దీనికి ప్రమాణ మేమైనా నిర్వచించినారో చూద్దాము!

## రసమతము

భరతముని గోష్ఠియందే ఉపాసించదగినది సాహిత్య మనేమాట ఉన్నదని చెప్పినారు

"కావ్యస్య శబ్దార్థౌ శరీరమ్, రసాది శ్చాత్మా, గుణాః శౌర్యాదివత్, దోషాః కాణత్వాదివత్, రీతయో వయవ సంస్థాన విశేషవత్, అలంకారాః కటక కుండలాదివత్"

ఈ సమష్టి వాక్యములో అలంకారికమతాలు చాలా భాగము సమన్వయమైనవి. ఔచిత్యానికి ముఖ్యత, ధ్వనికి ముఖ్యత పేరిట మారినవి సూక్ష్మముగా పరిశీలిస్తే ధ్వనిమతానికి, రసమతానికి ఎక్కువ భేదము లేదు. ఔచిత్యము కూడా రసమునకు అనుకూలమే.

## కావ్యాత్మ స్వరూపము

ఇక రసవాదములోగాని, ధ్వనివాదములోగాని కావ్యాత్మ స్వరూప మేమి? ఏం అన్నారు

"ధ్వనే, స్తత్త్వం గిరా మగోచరం సహృదయ సంవేద్య మేవ"

ఆనందవర్ధనుడు ఇట్లా అన్నారు

"ప్రతీయమానం పున రన్య దేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్,
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్య మివాంగనాసు"

అట్లాగే రసము కూడా—

"లోకోత్తర చమత్కార ప్రాణః కైశ్చి త్ప్రమాతృభిః,
స్వాకారవ దభిన్నత్వే నాయ మాస్వాద్యతే రసః"

అలాగే—

"పుణ్యవంతః ప్రమిణ్వంతి యోగివ ద్రససంతతిమ్"

ఈ విధముగా మన పూర్వులు కూడా వివరణాలలో ఎట్లా ఉన్నా రసస్వరూపము చెప్పేటప్పుడు సహృదయైక వేద్యమేననీ, అనిర్వాచ్యమనీ, బ్రహ్మానందసహోదరమైన అనుభవము కలిగిస్తుందనీ ఇత్యాదికముగా చెప్పవలసి వచ్చినది

## ఎవడు సహృదయుడు?

అయితే ఎవడు సహృదయుడు?

శ్రీ మమ్మట భట్టారకుడు కావ్యానికి హేతువుగా మూడు సామగ్రులు ఉదాహరించినాడు

"శక్తి ర్నిపుణతా లోక శాస్త్ర కావ్యా ద్యవేక్షణాత్,
కావ్యజ్ఞశిక్షయా భ్యాస ఇతి హేతు స్తదుద్భవే"

అందులో 'శక్తి'ని వివరిస్తూ—

"శక్తిః కవిత్వ బీజరూపః సంస్కార విశేషః, యాం న వినా కావ్యం ప్రసరేత్, ప్రసృతం వా ఉపహాసనీయం స్యాత్." అన్నాడు

నిపుణతను వివరిస్తూ లోకజ్ఞానమూ, ఛందో వ్యాకరణాది శాస్త్రములూ, గజ తురగ ఖడ్గాది లక్షణ గ్రంథములూ, మహాకవుల కావ్యములూ, ఇతిహాసాదులూ—వీటి విమర్శవల్ల వచ్చే వ్యుత్పత్తిగా నిరూపించినాడు

అభ్యాసము వివరిస్తూ—

"కావ్యం కర్తుం విచారయితుంచ యే జానంతి తదుపదేశేకరణే యోజనేన పౌనః పున్యేన ప్రవృత్తిః" అన్నాడు

ఆపైన "ఈ మూడూ వేరువేరే కారణాలు కావు కారణమే అంటే అన్నీ ఉన్నప్పుడే సాధ్యము" అని ఉపదేశించినాడు

కావ్య విమర్శకుడికికూడా తప్పనిసరిగా ఇవన్నీ కావలసిన గుణాలుగా కనబడుతున్నవి. అటువంటి సామగ్రి ఉన్నవాడే సహృదయుడు వజ్ర పరీక్ష 'ఎంత కష్టసాధ్యమైనదో అంతకంటే ఎక్కువగా కావ్యపరీక్ష కష్టసాధ్యమైనది వజ్రపరీక్షకు ఒక వజ్ర ప్రపంచము బాగా తెలిస్తే చాలును కాని కావ్య విమర్శకు కావలసిన సామగ్రి అపరిమితమైనది.

## మనవి

విమర్శప్రమాణము సర్వవ్యాధినివారిణులని చెప్పే చిట్కా మందులవలె సులభ సాధ్యమైనది కాదు విమర్శ చేసేందుకు సమగ్రమైన సామగ్రి మన విమర్శకులకు ఎందరికి ఉన్నదో ప్రశ్నించుకోవలసినదని మనవి చేస్తున్నాను

# తెలుగులో సొగసులు

శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

[1944 తారణ సంవత్సరాదిసంచికనుండి]

తెలుగుభాషలో వుండే సొగసు వివరించవలసివస్తే ఒక్క తెలుగు మాత్రమే తెలిసిన మనిసికి శక్యం కాదు మరికొన్ని భాషలు కూడా రావలెను నాకు తెలుగుతోపాటో, అంతకంటె కొంచెం హెచ్చో సంస్కృతంలో ప్రవేశం వుంది యింకేదీ రాదు నన్ను దీన్ని గూర్చి వ్రాయవలసిందని మా శంభుప్రసాదుగారు కోరిరి అందుచేత వ్రాయడం తప్పింది కాదు

యెవరి భాష వారికి సొగసుగా ఉన్నట్లు తోచడం సహజం. నేనైతే కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం అఱవవాడనే (మాశాఖ తోటరవశాఖ) కాని యిటీవల తెలుగు దేశంలోనే మా శాఖ బ్రాహ్మణులు నిల్చిపోయారు పేరూరి ద్రావిళ్లు యింకా అంతో యింతో (యింట్లోనేనా) అఱవం మాట్లాడుకోవడం ఉందిగాని మా శాఖవారు లేమున్నా ఆ జోలి లేని తెలగాణ్యంతో పూర్తిగా యేకీభవించడంచేత నేను తెనుగువాడనే అయి నాను మా ముత్తాత సరసకవిగారు మేలుకోటనుండి (తిరునారాయణపురం) మా చెళ్ల పిళ్ల కుటుంబం వలస వచ్చినట్లు వ్రాసి ఉన్నారు చెల్వము+పిళ్ల కలిసిన సమాసం 'చెల్వప్పిళ్ల'గా మారి తుదకు 'చెళ్లపిళ్ల' క్రింద లోకంలో నిల్చిందన్నారు

"మ ప్రవరుల్ గొండఱు మేలుకోటఁ గల చె
ల్వప్పిళ్లరాయుండు ప
ర్వ విశేషంబుల వృద్ధిఁ బొంది రిలఁ జె
ల్వప్పిళ్లవా రంచనన్
తే గీ అది మొదలుగాఁగ సకల జనానుమతిని
వినుతిఁదగెఁ జెళ్లపిళ్ల వారను సమాఖ్య" (వేంకటేశ్వర విలాసము)

శ్రీ కృష్ణదేవరాయలు కన్నడీయుఁడై కూడా తెనుఁగునే ప్రేమించినప్పుడు నేను యెన్ని తరాలనాఁడో అఱవవాఁడనైనా తెనుఁగును అభిమానించవచ్చును కాని నాఅభిమానం అట్టిదికాదు మొదట నాకు తెలుఁగంటే కొంత ఈసడింపుగా ఉండేది తెలుఁగుకవి అని నన్నెవరేనా అంటే అది నన్ను తిట్టినట్టుగ భావించేవాణ్ణి తెలుఁగు పండితుఁడుగా 13 యేండ్లు బందరు హిందూ హైస్కూల్లో ఉన్నానుగాని ఆపేరు నే నెక్కడా వ్రాసికోనే లేదు. అవధానాలలో (యెవరేనా కోరితే చెప్పక తప్పదు గదా!) తప్ప యితరత్ర మేం తెలుఁగు చెప్పేవాళ్లం కాము సర్వాత్మనా మాకు (తి వెం కవులకు) సంస్కృత మందే అభిమానం దాని క్కారణం మేము గురుకులవాసంచేసి చదువుకొన్న విద్య సంస్కృతం కావడమే యిప్పుడేనా కేవలం తెలుఁగు మాత్రమే తెలిసి కవిత్వం చెప్పేవారి యందు మాకు—కాదు, నాకు—కొంత నిస్సాకారమే ఇటీవల కొన్ని యేండ్ల క్రిందట నాకు "తెలుఁగు కూడా గౌరవించతగ్గదే" అనే అభిప్రాయం గలిగింది కాని అది కేవల తెలుఁగుకాదు

తే గీ. "తెలుఁగు తెలుఁగని యద్దాన దిగులె కాని
సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁజాలు
దాని, కిద్దానికో! రెంటఁ దగులవలయు" (పాణిగృహీత)

శ్రీనాథాదులవలె సంస్కృత పాండిత్యంతో మిళితమైన తెలుఁగు చెప్పువారు గౌరవనీయులని మా తాత్పర్యం సంస్కృతంలో నిశితమైన సాహిత్య సాహిత్యం లేని కవులను శ్రీనాథునితో ఎవరేనా పోల్చినా, వారే పోల్చుకున్నా అది నాకు లజ్జను కలిగించును.

క. "కేవల సంస్కృత మర్యా
దావిదులును గేవలాంధ్ర తత్పరులును గా
కేవార లుభయభాషా
కోవిదు లవ్వారు దీని గురువులు జగతిన్" (దేవీ భా)

ఈవిధంగా కొన్నాళ్లకు అభిప్రాయం మారిందిగాని యింతమాత్రంచేత తెలుఁగులో సంస్కృతంకంటే కూడా సొగసెక్కువ ఉందనే అభినివేశం కలిగినట్లు లేదు. శ్రీనివాసవిలాసాంధ్రీకరణం నాటికి ఆ యీ యభిప్రాయం మొలక ఎత్తినట్లు ఈ క్రింది పద్యము తెల్పును.

ఉ. "కావ్యముగాని నాటకముగాని మఱొక్కటిగాని తెల్గునన్
శ్రావ్యముగా వెసంగదు పురాణము తెల్గొనరించినన్ గడున్
శ్రావ్యతగాంచి యొప్పెనఁగి సంస్కృతముం గని గేలిసేయు. "

దీని తాత్పర్య మేమంటే? భారతాదులు వ్యాసకృతమైన సంస్కృతంలోకంటే కూడా తెలిఁగించిన నన్నయాదులవే హృద్యంగా ఉంటాయని కారణమేమంటే వినీ వినడంతోనే తాత్పర్యం తెలిసే మాతృభాషగదా తెలుఁగు? సంస్కృతమా? అభ్యాససాధ్యం. అందుచేత సర్వ సామాన్యంగా ఆనందాన్ని కలిగించదు "అస్య దాలోచనాప్లుతం" వంటి దన్నమాట తెలుఁగో? "ఆపాత మధురం" వంటిది అనఁగా సంగీతంవంటి దన్నమాట. (ప్రతి తెలుగున్నా కాదు ప్రసాదగుణం కందైతేనే) విశేషాంశాలు కాకపోయినా ముఖ్య తాత్పర్యం ఏమాత్రం అక్షరజ్ఞానమున్నా చక్కని కవిత్వమైతే తెలిసిపోతుంది చూడండి.

క "దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాళితో వచ్చి యర
ణ్యావాసము చేసెదు ధర
ణీవల్లభ! నీవు ధర్మనిశ్చిత బుద్ధిన్" (నన్నయ్య)

క "ఆపద గడవం బెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పఁగ మా
కీ పట్టునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా" (తిక్కన)

క "ఈలోకము యగుఁ గొండఱ
కాలోకము గొండఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొండఱ కధిపా!
యేలోకము లేదు సూవె యిలఁ గొందఱకున్' (యెఱ్ఱన)

ఆయా మాదిరి పద్యాలు భారతంలో ఎన్నో ఉంటాయి ఉన్నా నేను తరచు వీట్లనే ఉదాహరించడాని క్కారణం నాకు నోటికి వచ్చి ఉండడమే ఇవి త్వరగా తాత్పర్యం బోధించి జన సామాన్యానికి ఆనందాన్ని కలిగించడంచేత "తెలుఁగు సంస్కృతముం గని గేలిసేయు" అని కూడా వ్రాయవలసి వచ్చింది ఇంకా ఇలాటి వెన్నో నాకు కంఠతః వచ్చిన వున్నాయి సుమండీ! నా యీ వెఱ్ఱి అభిమానం నాకు నమస్కారాలు గూడా తగిలిస్తూ ఉంటుంది అయినా నేను వీట్లని మెచ్చడం మానలేదు వీట్లకి పోటీగా వ్రాసిన వాటిని యీసడిస్తాను కూడా

అయితే కేవల సంస్కృతాభిమానులు యీ మాటకు (గేలిసేయు) వప్పుకోరు. పయిగా తెలుఁగు మ్లేచ్ఛ భాష అనిన్నీ, యెమో అనిన్నీ, దాన్ని మడిగట్టుకొన్నప్పుడు ఉచ్చరించనే కూడదనిన్నీ వివదిస్తారు అందుకు నేనున్నా వారిలోనే కలుస్తాను మునిఁగిపోయిందేమిటి! తద్దినం, యజ్ఞం మొదలైనాలలో సంస్కృతానికే ప్రాముఖ్యం ఇవ్వండి ఆనందం కలిగించే సందర్భంలో మనకు పుణ్య పాపాలతో ఆవశ్యకత లేదు కవిత్వం ఆనందం కోసం పుట్టింది తటస్థిస్తే పుణ్యం కూడా తటస్థించవచ్చు ప్రధానం ఆనందం పుణ్యమో! "నను లక్ష్మీః ఫల మానుషఙ్గికం"

"అభినవ నవనీత స్నిగ్ధ మాపీతదుగ్ధం", లేదా "వాశ్చారేడ్వ్యఞ్జక్" అనే రచనలో కంటె "వెన్నవలెన్ గరంగు నలివేణులు" అంటే వెంటనే తాత్పర్యం స్ఫురించి ఆనందో బ్రహ్మన్ని కలిగిస్తుంది పూర్వకాలంలో నాటకాలు మన తెలుఁగుభాషలో లేవు శాకుంతలం వగయిరా కొందరు ఆ భాషలో మిక్కిలి మృదువైన శైలిలో రచించారు. అందులో శ్లోకం—"యాస్య త్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా" అనేది సభ్యులలో (ఈ కాలంలోకాదు ఆ కాలంలోనే) ఎందరికి తెలుస్తుందో, ఆనందం కలిగిస్తుందో ఆలోచించండి "కొందల మందె డెందము శకుంతల నేఁడు" అన్న పద్యములో అదే అర్థం త్వరలో గోచరిస్తుందంటే రసజ్ఞులు ఒప్పకపోరు కొందఱు డెందము, కొందలము ఇవి మాత్రం (వ్యావహారికాలు కావుగదా) జన సామాన్యానికి చట్టన గోచరిస్తాయా అని వివదిస్తారు అందుకే యెమాత్రమో అక్షరాస్యులుగా ఉండేవాళ్లకే అన్నాను కట్టెలమ్ముకొనేవాళ్లకు కాదు ఇప్పటికంటే ఆకాలం చాలా సంస్కృత పాండిత్యమయంగా ఉండేది అని చెప్పేవారితో నేనూ యేకీభవించేవాణ్ణే కాని "ఉద్దామ ద్యుమణి ద్యుతి వ్యతికర ప్రక్రీడ దర్కోపల జ్వాలా జాల కరాళ" అనే శైలిలో వ్రాసిన నాటకాలే చాలా ఉన్నాయి ఆ యీ నాటకాలు ప్రదర్శించేవారో లేదో? ప్రదర్శిస్తే ఎవరో ఉపాధ్యాయులున్నూ, శిష్యులున్నూ మాత్రమే ఆడియన్సుగా ఉండేవారనుకోవాలి వారేనా ఆనాఁడు ఆ యీ నాటక శ్లోకాల వ్యాఖ్యానాలు చూచికొని తాత్పర్యం అవగతం చేసికొనివచ్చి కూర్చుండేవారేమో! విజయనగరం మహారాజులుంగారు ఆనంద గజపతి భవభూతి ఉత్తరరామచరిత్రాన్ని పండితులచేత ప్రదర్శింపచేశారని విన్నాము. ఆ పట్టు

ణంలో తప్ప యితరత్ర ఆ ప్రదర్శనం చూచేవాళ్లు ఉండరు. ఆ పట్టణం పండిత స్యం కదా! ఇది విషయాంతరం

తెలుఁగుభాష మృదువైనది, మధురమైనది అనడానికి మన తెలుఁగువాళ్లం మాత్రమే కాదు అఱవవారున్నూ (ఇప్పుడుకాదు) అంగీకరిస్తారు రాగం ఒఱవవారు తమ సాంప్రదాయకంగా ఆలాపించినా కృతి త్యాగరాయల తెలుఁగే కదా పాడడం? నావలె త్యాగరాయలు తెలుఁగును అభిమానించినవాఁడు కాఁడు మొదట తెలుఁగు (వెల్నాటి) వాఁడే అయినా కృతి రచనా కాలంనాటికి శుద్ధ అఱవవాఁడు అలా అయివుండి దీని కున్న మాధుర్యం అఱవానికి (తెలుఁగుతేట, అఱవం అద్దాన్నం) రాదనియే రచన యావత్తూ తెలుఁగులోనే నడిపించాఁడు త్యాగరాజు సంస్కృత పండితుఁడయివుండిన్నీ యే కొంచెమో తప్ప దానిలో రచించలేదు నిన్న మొన్నటిదాఁకా అఱవవారు ఆ కృతులను పాడి పేరుపొంది నారు ఇటీవల "స్వస్థాన వేష భాషాభిమతా స్సంత" అన్న శ్లోకపాదానికి ఉదాహరణంగా మారినట్లు వినికిడి

తెలుఁగుభాష చాలావఱకు సంస్కృత ప్రాకృత భాషలనుండి పుట్టిన వికృతి కొంత అఱవమునుండి దిగినది కొంత కన్నడం కృష్ణదేవరాయలు కర్ణాటరాజు (వారి పూర్వులు తెలుఁగువారైతే కానివ్వండి) గదా? అతఁ డేమన్నాఁడో చూడండి

ఆ వె "తెలుఁ గదేల యన్న దేశంబు తెలుఁ గేను
దెలుఁగు వల్లభుండ దెలుఁగొకండ
యెల్ల నృపులు గొల్వ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"

ఈమాట తెలుఁగుదేశంలో కృష్ణాతీరంలో శ్రీకాకుళంలో వుండే దేవుఁడన్నట్లు రాయలు వ్రాసినాఁడు ఆయనకు ఒఱవం, కన్నడం, ఉరుదు, సంస్కృతం, మహారాష్ట్రం ఇన్ని భాషలేనా వచ్చి ఉండాలి వీట్లన్నిలోనూ తెలుఁగే మంచి మృదువైనది యని ఆయన తాత్పర్యం. నేను మందసా సంస్థానానికి వెళ్లినప్పుడు ఆ రాజుగారు మంచి పాండిత్యం సంస్కృతంలో ఉండిన్నీ నావల్ల వసుచరిత్రను ప్రత్యేకించి కోరి శ్రద్ధగా విన్నారు శ్రీ జయపురం మహారాజాగారు (విక్రమదేవవర్మ) ఓఢ్రం, సంస్కృతం వగయిరా లలో విద్వాంసులై యుండి తెలుఁగు రచనకే ప్రాధాన్యం యిచ్చి నాటకాలు వగయిరా వ్రాసినారు శ్రీనాథుఁడు "గౌడ డిండిమభట్టు కంచు ఢక్క" పగులు గొట్టించింది సంస్కృత భాషా పాండిత్యంవల్లఁగాని తెలుఁగులోఁ గాదు అట్టి వుద్దోలపు సంస్కృత కవిసార్వభౌముఁడు రచించిన కావ్యమున్నీ తెలుఁగులోనేకాని మచ్చుకి కూడా ఒక్క సంస్కృతశ్లోకం ఉన్నట్టూ, విన్నట్టూ లేదు యే కొన్ని శ్లోకాలోవున్నా అవి ఆయన్ని సంస్కృత భాషా కవిని చేయనేరవు పైఁగా ఆ మహాకవి యీలా అన్నాడు. "నా కవిత్వంబు నిజము కర్ణాట భాష" అన్నాఁడు (కర్ణ + ఆటతి) చెవి కింపైన తెలుఁ గన్నమాట

అచ్చతెలుఁగు చెపుతామని కొందఱు ప్రారంభించి కుమ్మరి కుండలు కొత్తవి నిర్మించినట్లు క్రొత్త మాటలు నిర్మించి రచిస్తే తెలుఁగు పూర్తిగా స్వరూపాన్ని గోలు పోయి కోడుభాషగా పరిణమిస్తుంది అవసరమైనప్పుడు తత్సమ పదాలు చేర్చికోవ డమే నన్నయాదులకు యిష్టం కొందరు అచ్చ తెలుఁగు మాత్రమేకాక నిరోష్ఠ్య, నిర్వ చన అని కూడా నియమం పెట్టుకుంటారు ఇవన్నీ రస స్వరూప మెఱుఁగని వారి పోక డలు "సాధ్యోహి రసో యధాతధం కవిభిః" అప్రయత్న సిద్ధంగా వచ్చిన శబ్దచిత్రం తప్ప కవిత్వంలో యితర శబ్దచిత్రం కూడా హృద్యం కాదనియే నా అభిప్రాయం ఇందుకు లాక్షణికులు వ్యతిరేకించరు

ఉ "భారత భారతీ శుభ గభస్తి చయంబులు"
మ "కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్"
మ "మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్య గాణిక్య"
ఈవిధంగా నన్నయ్యకు అప్రయత్నసిద్ధంగా శబ్ద చిత్రం దొర్లుతుంది.

మ "బహు రత్న ద్యుతి మేదురోదదరీ సౌరభ గ్రహణేందిరదిర తుంది లంబు లివి మత్కాంతార సంతానముల్"

మ "అకలం కౌషధ . ఉద్దండ గండక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్రము"

నన్నయ్య తర్వాత మళ్లా పెద్దన్నగారికే యీ సంస్కృత ధారలో ఈ శబ్దచిత్రం దొరకడం నాకు నన్నయ్య చుట్టం కాఁడు అతణ్ణి నేను మిక్కిలిగా మెచ్చుకొన్నం దుకు నాకు ఒక ముసలి తిక్కన్నవల్ల చాలా తిట్లు తగిలాఁయి అయితేమాత్రం యేలా మానేది? శాంతం పాపం!

వసు చరిత్రలోవున్న శబ్ద చిత్రాలు ప్రయత్న పూర్వకాలుగాని సహజాలు కావు
సీ "మందయానము నేర్పు నిందింది రాజీవ రాజీవ రాజ న్మరాళరాజి"
సీ "లలనాజనాపాంగ వలనావసదనంగ తులనాభికాభంగ దోఃప్రసంగ"

అయినా విషయం చాలా ముసలి వాళ్లలో కూడా కొంద ఱే చర్చించ తగ్గది చట్టన కొందఱు ఆ యా కవులను యీసడించినట్లభిప్రాయపడతారు యేం చేసేది? ఆ యా కవులు యెంతటి పండితులూ, యెంత కష్టించినవారూ కాకపోతే అలాటి (లలనా) యమకం కుదురదు అది నిజమే రసజ్ఞులకు కవి తన ప్రతిభను తెల్పుడుచేసి గాని, కష్టం తెలియఁగాజేసిగాని ప్రయోజనం లేదు రచనలో రస మెంత యున్నదో రసజ్ఞులు చూతురు పైకి డాబుగావుండి తీరా విడదీస్తే "గుడ్డలు రైకలోపలం బ్రోవి డివట్టి శుష్కకుచ పాంకము"గా పరిణమించే శబ్ద చిత్రం మృదంగాది ధ్వనివలెవుండి అర్థికులకు హాయిని గలిగించదు అర్థంతోగాని, శబ్దసౌష్ఠవంతోఁగాని నిమిత్తంలేని గానంగాని కవిత్వం కాదు ఆచార్య గోవర్ధనుఁ డేమన్నాఁడో చూడండి "కి మపభ్రంశేన భవతి గీతస్య" అపభ్రంశము వ్యాకరణ రీత్యా తప్పయితేనే కాదు, సమంజసమైన అర్థం లేకుండా ఉండేది కూడా ఒక విధమైన అపభ్రంశమే ఒక మహాకవి—

"మురారే! మురారే! మురారే! మురారే!
తవా హం తవా హం తవా హం తవా హం"

అదేమాదిరిని నాల్గు చరణాలున్ను పూర్తి చేశాఁడు సందర్భం తెలియ-గక దీని కర్థం చెప్పవలసివస్తే ఒక్కొక్క పదానికి నాలుగర్థాలు చెప్పడానికి నిఘంటులు తిరుగ వేయవలసి వస్తుంది సందర్భం తెలిస్తేనో? యేమీ లేదు "వర్షాగింజలోది బియ్యపు గింజ!" బ్రహ్మదేవుఁడు నాలుగు మొగాలలోనూ విష్ణుమూర్తిని స్తోత్రం చేశాఁడంటే పరిపోతుంది యింకొక తెలుఁగు కవి నాల్గు చరణాలూ యిట్టే చిత్రించాఁడు "పీ సారంగ మదహారి సంపన్నత వహించు ఘనసార నచ్చాయ కడు రహించు" తేటఁతెలో యేవో లవ యవాలను పేర్కొన్నాఁడు దీని సమన్వయానికి సారంగ శబ్దానికిన్నీ ఘనసార శబ్దానికిన్నీ నిఘంటువులలోవున్న అర్థాలు చూచుకొంటే, ఏమాత్రం అక్షరజ్ఞానమున్నా చాలు

ఈ మాదిరి కవిత్వాలు "తనకు నాల్గు నిఘంటు పదములు వచ్చునంచ బదిమందికిని దెలుపంగ" పనికి వచ్చునేకాని రసజ్ఞుల నలరించడానికి పనికిరావు మరి యేమంది? "మూఁక చెవిటివారి ముచ్చటదియు" అని సాహసించి పలికింది ఆమాట చాలా గౌరవించతగ్గది కవిత్వమన్నది ఎందుకు పుట్టిందంటే? తన అభిప్రాయాన్ని పరులకు తెల్పడానికి కదా! అలా తెల్పడంలో కొందఱు వింతయి నంతలో సుందర శైలిలో తెల్పుతారు కొందఱో? కఠిన శైలిలో తెల్పుతారు ఈ రెండు పక్షాలలోనున్నూ బుద్ధిశాలి శైలివిడిచిపెట్టి విచారిస్తే తేలిక శైలిలో తెల్పడమే ఆదరణీయంగా కనపడుతుంది

"రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్।
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్" (రామాయణం)
"ధర్మ క్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవా శ్చైవ కి మకుర్వత సంజయ!" (భారతము

యేమాత్రం సంస్కృత విభక్తి జ్ఞానమున్నా పై శ్లోకాలు తాత్పర్యం లవుతాయి తెలుఁగులో కూడా యీలాటి శైలికే గౌరవం మనకి వుపలబ్ధమవుతూన్న తెలు పుస్తకాలలో ఆముక్తమాల్యద చాలా కఠినపాకంలో ఉంటుంది దానిలో కూడా కొన్ని తేలిక శైలి పద్యాలు ఉండబట్టే దానికి కొంతమట్టుకేనా వ్యాప్తి కలిగింది కొంచెం మచ్చుచూపుతాను

తే గీ "సంగతియె యోయి? యిసుమంత టింగణావు
తత్త్వ నిర్ణయవాదంబు తరమె నీకు
నోడితేనియు వద్దు మెట్టో యసంగ
లింగమును గట్ట కుడుగ మెఱింగి నొడువు"

ఈ ఘట్టంలో మరికొన్ని పద్య లీలాటివే ఉన్నాయి విస్తరభీతిచే స్పృశిం వదలుచున్నాను ఇతర ఘట్టాలలో కూడా వెదుకుమించగా యీలాటి తేలిక శై ఉండబట్టే ఆముక్తమాల్యద పేరు శాశ్వతంగా నిల్చింది (1) "ఆ నిష్ఠనిధి గేహ సీమ" (2) "గృహ సమ్మార్జనమో, జలాహరణమో పుహారీ! వాదము లేల? లే యితరుల్ నీలిలకుం బాత్రముల్" (2) "తల పక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు" ఈల టివి చాలా ఉన్నాయి ఋతు వర్ణనలు, అలంకారాలతో గ్రంధాన్ని పెంచినా స్వభావోక్తు లుండడంచేత రాయల కవిత్వానికి విద్వల్లోకంలో మంచి పేరు ఉంది

(1) "మే కెరువున్ గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వై కాప్తి రె డ్లన్గడిన్
(2) "మట్టి మిద్దెలవారికి మరుపనులకు నెంత బాసిన వారికి నిదుర చెడియె
అయినా వుంటంకింపులు వర్షఋతు వర్ణనలలోనివి

యింతవరకు వ్రాసిన సంగతులు తెలుఁగుకూ, సంస్కృతానికి కూడా వ స్తాయి కేవలం తెలుక్కే సంబంధించేవి కొన్ని ఉన్నాయి అందులో ఒకటి మృదుత్వ ఇది సంస్కృతంలో లేకపోలేదుగాని తెలుఁగులో ఎక్కువగా చూపవచ్చును.

చ "వలఁ బడియున్న ఒక్కమకరం బురుణించుచు నన్నపైఁటలో
పల బిగిగుబ్బదోయి కను పండువు సేయఁగ మోడ్పుఁ జేతు లొ
దలను ఘటించి మ్రొక్కెడి పదంబడి మెల్లన డాయఁబోయి తొ
య్యలి విలపించి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్"

గుఱుతుంచిన రెండు పదాలుతప్ప పై పద్యంలో సంస్కృతపదం లేదు అం చేత పద్యాని కంత మృదుత్వం వచ్చింది ఆ రెండిటిలో 'ఉపాయనం' లనే పదం తెలు పదంలాగే ఉంటుంది కైశికీ వృత్తికి ఉదాహరణంగా యిచ్చిన "జితమదన విలాసం తీయాన్వయేందుం" లోనైన శ్లోకాల కూడా యింత మృదుత్వం వున్నా దీని ప్రసాదగుణం దానిలో రావడానికి అవకాశంలేదు అభ్యసిస్తేగాని రాని భాషకదా అది? ఉగ్గుబాలతో వచ్చేది

గిడుగు పంతులుగారి వాదానికి నేను కొంతకాలం కేవలం వ్యతిరేకినై ఉ కూడా సుమారు పదిపన్రెండు యేండ్లనుండి కొంత అనుకూలుణ్ణిగా మార క్కారణం తగినంత పాండిత్యంలేని రచయితలు తమ అభిప్రాయాలు లోకానికి పుడు చేయడానికొక అవకాశం ఉండడం యుక్తమనియ్యేవే కొన్నాళ్లు పత్రికలలో ర్తల దగ్గిరనించీ వ్యాకరణ యుక్తంగావే ప్రకటిస్తేనేగాని బాగుండదనుకొనేవ

ఆయన ధర్మమా అని ఇటీవల ఆ పీడ వదిలింది ఇప్పుడు సంపాదకీయం కూడా వ్యావహారికంలోనే వ్రాసినా లోకం ఆమోదిస్తోంది విషయాంతర మేతత్

యిక తెలుగులో మాత్రమే రాదగిన సొగసులు కొద్దిగా చూపుతాను

తే గీ "విమల మధుర మనోహర వృత్తి వెలయు
వారి బోడగన " (వసుచరిత్ర)

యిందులోవున్న 'వారి శబ్దము ఒక పక్షంలో సంస్కృతం యింకొక పక్షంలో శుద్ధ తెలుగు ఒక పక్షంలో 'వారిన్' అని యేక వచనం వేరొక పక్షంలో 'వారిన్—వారలను' అని అర్థం గనక బహువచనం ఈ శ్లేష సంస్కృతంలో వచ్చేదికాదు ఇంకోటి చూపుతాను

తే గీ "తమ్ములు పదానుజన్ములై తనరఁబోలు" (వసుచరిత్ర)

దీన్ని సంస్కృతీకరించవలసివస్తే కంఠం ఎట్టుకుంటుంది 'తమ్ముఁడు' అనే దాని బహువచనం 'తమ్ములు' 'తమ్మి' అనే దాని బహువచనం 'తమ్ములు' దీన్ని అతి ప్రయాసమీఁద సంస్కృతీకరించవలసి వచ్చింది యేలాగంటే—

"కనిష్ఠ సముదాయ తత్పాదకనీయాప్ కిప్"

కనిష్ఠ శబ్దానికి 'తమ్ములు' అనే అర్థం సులువుగానే వస్తుంది గాని 'పద్మములు' అనే అర్థం రావడం కష్టం క్లిష్టిమీఁదగాని రాదు "కే—ఉదకే, నిష్ఠా స్థితిః యేషాం తాని కనిష్ఠాని, పద్మానీత్యర్థః" ఈవిధంగా మార్చి యేలాగో బయటఁబడవలసి వచ్చింది మాకు వేంకటగిరి సంస్థానంలో తెలుఁగులో ఎంతో సులువుగా 'సోదరులు, పద్మములు' అనే ఉభయార్థాలు వచ్చి హృదయంగమంగా ఉన్నాయి ఈ గీతంలోనే చక్రపదం వకటిన్నీ (చక్ర పేర్బడి గాఁబోలు జఘనరమకు ప్రసవములు గోళ్ల నిమువులై యొసఁగఁబోలు), ప్రసవపదం వకటిన్నీ శ్లేషించినవి ఉన్నాయిగాని అవి ముక్కస్య ముక్కార్థః (కాఁబట్టి—కనుక, కనుక—కాఁబట్టివలె) చేస్తే చిక్కులేదు ఈ తమ్ముల శ్లేష ఆమాదిరిది కాదని అనుభవజ్ఞులు గుఱితిస్తారు

శ్లేషదాఁకా యెందుకు, జాతీయంగా మాట్లాడవలసివస్తే మాత్రం తెలుఁగులో వచ్చే సొగసు సంస్కృతంలో వస్తుందా? మచ్చు చూపుతాను కొంచెం

క "వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా? వీరెన్నఁడును వెన్న గావరఁటు కదా?
చోరత్వం బించుకయును
నేరరఁటు? ధరిత్రి నిట్టి నియతులు కలరే?" (భాగవతం)

యిక్కడ పోతన్నగారు బహువచన ప్రయోగం చేసి తెచ్చిన సొగసు సంస్కృతంలో వస్తుందా? యేమి, యెందుకు రాదు? సంస్కృతంలో మాత్రం బహువచనం (శ్లో ఏతే కే శ్రీ కృష్ణా న హి వా) లేదా అంటే జవాబు చెప్పడం కష్టం 'తేభ్యో మహద్భ్యో నమః' దశరూపకంలో యేమన్నాడు? "తస్మై నమః స్వాదు వరాఙ్ముఖాయ" అనలేదా? అయితే దీనికి మార్గదర్శకుఁ డెవఁడు పోతన్నకు? నన్నయ్య అతఁడు వీరరసంలో మిళితమైన హాస్యరసంలో—

క "వీరెవ్వరయ్య? ద్రుపదము
హారాజాలె యిట్లు కృపణులై పట్టువడన్
వీరికి వలసెనె? యిపుడు మ
హారాజ్య మదాంధకార మది వాసె నొకో" (భారతం)

అని యెత్తిపొడుపుగా, జాతీయంగా చిత్రించాడు పోతన్నగారు వాత్సల్యరస మిళితమైన యొక విధమైన కోపరసంలో వినియోగించారు నన్నయ్య నాల్గో చరణంలో వాచ్యం చేశాడు అంతః స్థిత కోపాన్ని పోతన్న యావత్తూ గుంభితంగానే నడిపించాడు యేదో మహాఝరలో రచన సాఁగుతుంది ఈ నీహార లేశాలకు తీరిక ఉంటుందా? మహా ప్రవాహంలో గ్రంథకర్తల కెక్కడ తీరుతుంది?

లోఁగడ ఉదాహరించిన "రామం దశరథం విద్ధి" ఆ యీ శ్లోకానికి వ్యాఖ్యాతలు ఎన్నో అర్థాలు వ్రాశారు అవి గ్రంథకర్తకు—వాల్మీకికి అభిప్రేతములని యేకవి అనుకుంటాఁడు? ఏవిధమైన శ్లేష లేకుండానే తెలుఁగులో వచ్చే సొగసులు చూపడం మనకు ప్రస్తుతం "వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు" ఈ పద్యం సంస్కృతీకరణం చేసేయెడల యీ 'ఫోర్సు' వస్తుందా? "ఫల్గునో ద్య సమాయాతః" అనిగాని, "ఫల్గునస్తు సమాయాతః" అని గాని మారిస్తే అర్థం మటుకు వస్తుంది గాని దానిలో వుండే సొగసు రాదు

ఆ యీ సందర్భాలనుబట్టి పరిశీలిస్తే తెలుఁగుభాష మృదుత్వానికే కాదు, మఱి కొన్నిటికి కూడా తనకు మాతృభాషగావుండే సంస్కృతాన్ని అతిక్రమిస్తుందేమో అని నే ననుకుంటాను ఆ యీ కారణాన్నిబట్టే కాకపోతే వాల్మీకి వ్యాసులకంటే యే విషయంలోనూ తీసిపోని శుద్ధ 'జపహోమతత్పరుఁడు' నన్నయభట్టేమి, తత్తుల్యుఁడో, అధికుఁడో అయిన శ్రీనాథభట్టేమి సంస్కృత విద్వాంసులు "ఆంధ్ర భాషామయం కావ్యమయోమయ విభూషణమ్" అని యీసడించే తెలుఁగులో, లేదా తెలుఁగులోనే గ్రంథాలు వ్రాసి వూరుకుంటారా? నాకు కొంతకాలం గతించాక కలిగిన "సంస్కృతముం గని గేలిసేయు" అనే అభిప్రాయం వారికి మొట్టమొదటనే కలిగి ఉండాలి పరిశుభ్రత వగయిరాలు తెలుఁగులోకంటె సంస్కృతంలోనే ఉండనివ్వండి, రసానికీ, పరిశుద్ధికీ చాలా దూరం శృంగారరస ప్రవర్తనకు కూడా ఆచమనాది కర్మకలాపం ఉందిగాని లేక పోలేదు ఆ పద్ధతిని పగటి సమావేశం బొత్తిగా దూష్యం భవతు—అగుఁగాక కాళిదాసుగారి శాకుంతలంలోవుండే శృంగారం ధర్మశాస్త్ర విరుద్ధం పరాశరుని శృంగారం కూడా డిటో శాకుంతలంలోని శృంగారరసం ధర్మశాస్త్ర విరుద్ధమని ఆక్షేపించిన వారిని నే నెఱుఁగుదును వారికి నమస్కారం కవులకు రసమే ప్రధానం "సాధ్యోహి రసో యధాతథం. కవిభిః" కొనసాగకపోతే మానిందిగాని పరాధీనీ ప్రవరుం శృంగార మున్నూ మిట్టమధ్యాహ్నమే ఆ శాస్త్రంతోవ దానిదే, దీనిది దీనిదే సంస్కృతానికి సమగ్రమైన వ్యాకరణం వుంది తెలుక్కి లేదు దీనిలో నానా చెత్తా చెదారం చేరింది చేరుతూవుంది యింకానూ కంగూరగింపలా ఉంటుంది ఈ భాష, అయినా మాధుర్యం హెచ్చు అందుచేత నిప్పు కూడా కడిగే వైశ్వదేవపరుల నన్నయాదులు దీనిలో ప్రవేశించారు అంతకు పూర్వులే అని తోస్తుంది శైవకవులు రచన—పాల్కురికి సోమనాథుని ద్విపదలో ఉండే భాష చాలా బాగుంటుంది—సంస్కృతంలో చాలా వృత్తాలు వున్నా అనుష్టుప్ శ్లోకాలతోటే నూటికి తొంబైవంతులు పురాణాలు ప్రవర్తించాయి ఆ శ్లోకానికి దీటయినది తెలుఁగులో ద్విపద ఒక్కటే కనపడుతుంది శైవకవి సోమనాథుని రచన సర్వమూ ద్విపదలోనే నన్నయమాత్రం ద్విపద ననాదరించాఁడు. రంగనాథాదులు ద్విపదకు ప్రాధాన్యం యిచ్చారు శ్రీనాథుఁడు వెక్కిరించాడు

కొన్ని సొగసులు సంస్కృతంలోని తెలుఁగులో తీస్కురావడానికి సాధ్యపడవు మచ్చు చూపుతాను—హర్షుడు బాణమహాకవిని రిజాలాపురుషుఁడని వినివున్న కారణంచేత 'భుజంగి' అని భావగర్భితంగా, అనాదరంగా సంబోధించాఁడు దానిమీఁద బాణుఁడు "కా మే భుజంగతా" అని యెదురుకొని ప్రశ్నించాడు ఇక్కడ "కా—మే—భుజంగరా" అని ఒక విఱుపు కామె భుజంగితా" అని ఒక విఱుపు అర్థాన్ని మీరే చూచుకోండి సులువే ఈ విఱుపులు తెలుఁగులో తీస్కురావడం యెంతటి మహాకవికిన్నీ పుస్తకాపేక్షే. యీలాటి వింకా సంస్కృతంలో "చేతో నలం కామయతే", "అంసంగితం శుకం" "లలంఘనం" మొదలైనవి శరపరంపరగా ఉన్నాయి ఇవి తెలుఁగులో రమ్మంటే రావు. వీట్లనే జతుకాష్ఠ శ్లేష లంటారు "ముంచ మానం దినం ప్రాప్తం నేహ నందీ హరాంతికే" ఈ వక్రోక్తికిగాని, "కేదార పోషణరతాః కేదార పోషణరతాః" ప్రశ్నోత్తరాలు రెండూ వకటిగానే ఉండే యీమాదిరి శ్లోకాలుగాని ఆంధ్రీకరించడం ఘటించదు. కనుకనే యీలా అనవలసి వచ్చింది.

మ "జతుకాష్ఠక్రియ నొప్పు సంస్కృతపు శ్లేషల్ తెల్గులో మార్ప మా
మతికిన్ శక్యమటంచుఁ దోఁచ, దిక, మా మాటట్టులుండంగను
న్నతులై పేరును గాంచినట్టి యల శ్రీనాథాదు లిప్పట్టున
న్నతు లర్పించిరి నిక్క మియ్యది ప్రమాణంబుల్ తదుద్గ్రంథముల్"
(మా 'శ్రీనివాస విలాసం')

ఒక భాషలో వుండే సొగసులుగాని, శ్లేషలుగాని మరొక భాషలో రావాలంటే సుఖ సుఖాల రావని అందఱూ యెఱిఁగిందే దాన్ని బట్టి విశిష్టత్వం చెప్పవలసి ఉండదు.

చ "తెనుఁగును గొన్ని సంగతులు తియ్యనవై యలరారు సంస్కృతం
బున మఱికొన్ని సంగతులు ముద్దులు మూటలు గట్టుఁజాలు నిం
దును మఱియందునున్ సొబగుతోఁ దులఁ దూఁగును గొన్ని సంగతుల్
పనిగొని చెప్పనేల? యిది పండితవేద్యము గాకయుండునే?"
(మా 'శ్రీనివాస విలాసం')

పై పద్య తాత్పర్యాన్నిబట్టి యే భాషలో అంద చందాలు ఆ భాషవే అనిన్నీ, పరివర్తన చేయడంలో అవి రావడం దృశ్యా దృశ్యమనిన్నీ చదువరులు తెలిసికోఁగలరు.

ఇంకొక విశేషం ద్వ్యర్థి కావ్య రచనకు తెలుఁగులో కొంత సులువు కనపడుతుంది. "సీతను వే విడుమంగ మేలగున్"—ఇది 'లంకా విజయం' (రావణ దమ్మీయం) లోనిది. ఒక పక్షంలో "సీ? తనువే" అనిన్నీ, ఇంకొక పక్షంలో "సీతను— వే—విడువంగన్" అనిన్నీ విఱుగుతుంది ఇది సంస్కృతంలో రమ్మంటే వస్తుందా? రాదు వసుచరిత్రలో—

క ఆడుఁబడుచు లే
పగవారికి వలదన నా
పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁడు"

"ఏ పగవారికి—ఏ శత్రువులకు, ఆ పగవారికి" అని సామాన్యంగా తోఁచే అర్థం అంతరార్థమో? "ఆపగ (నది) వారికి (ఉదకమునకు)" అని గిరికాదేవి శుక్తిమతీనది కూఁతురు గదా?

యీలాటి సొగసులు చాలా ఉన్నాయిగాని, ఆ యీ స్థలాలలో విస్తరించి వ్రాస్తే గాని చదువరులలో చాలామందికి అవగతంకాదు.

తే గీ "ఎందు వేఁట రారె? యితరు లేమనసుతో
దార సంగ సుఖము తప్పు ద్రోచి తకట! " (రాఘవ పాండవీయం)

ఈ పద్యంలో రామాయణార్థం చెప్పేటప్పుడు "ఏమనన్—సుతోదార (సుత ఉదార) సంగసుఖము" అనిన్నీ, భారతార్థంలో "ఏ మనసుతోన్—దార సంగ సుఖము" అనిన్నీ విఱుగుతుంది ఈ సొగసు తెలుఁగు భాషకేగాని సంస్కృతానకు సంఘటించదు. సంస్కృతంలో వున్న నైషధాన్ని శ్రీనాథుఁడు తెలిఁగించి ఎక్కువ రసం కలిగించాఁడు. ఆరసాని క్కారణం భాషే అని నే ననుకుంటాను

సీ "నళిన సంభవు వాహనమువారువంబులు
కొలముసాములు మాకుఁ గువలయాక్షి
వదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ జావుఁబోఁడి

స్వర్గలోకమువాని పదం లోకింపం
  రాయుట్రల వారి విజ్ఞపదర
పరిహాస్యరమునైన పా పాటలు వినం
  స్ఫురితరంగనులు దివ్య రంభయివారో
తే. గీ. ధారుదేవి పంపితి ఏలుము వినం
  పద మయాన వ్యవిస్మాదాది పాదం
  పదవాస్తు భరాణాది పిద్యలెల్ల
  వరి నీ వీయా ఘంటానఘముల్ల వారు"

ఆ యీ సీసంలో ఉండటాలో, దురుదుపివే ప్పైల తాత్పర్యం కలిగి పెద్ద చెవి యుపిట్ట తమారు చేరాము ప్రసాధము సంస్కృతంలాటే యెంతో పొనుగా వుంది. ఆ పొను చాలా భాషల భాషావాడితే సొంత రుచితో కూడా ఉంటుంది.

రచనా ప్రౌఢిమ చెలు నిపిర్పిమా 'విప్వన్లి ఘంటాఘమ్ము' ఆ చోట శంసిస్తారు. వాడి "విజ ప్రమాణం" అన్న సాంస్కృతిక ప్రయోగ సార్థంగాని, "గార్లాంద్ర ఎద్దు వారిస్పె నాప్ప" అన్నైం పిల్లలిట్టి పదైరాల ప్రౌఢ ప్రయోగాల సామగ్రి తెలియజేసేవారి.

యింత రసవత్తరమైన సీసాన్నైనా తెలుగులో పెట్టి రసం తేవచ్చుగాని తెలుగులోనే మంచి పాకంలో వున్నవన్నీ సంస్కృతంలో పెట్టి రసం తేవడం వస్పసాధ్యం చూడండి.

శా. "నానా గాఢమైన గాఢుమీవి జాల గారం బుప్పి నారింపమో
  నానాదు సౌభాగ్యపటంగ వంభవాప్సరోగారి
  వ్యాసైస్వర్యాము వెన్ని యేని వీడా లంద్వైన నిందైన విం
  వైవాహం బావసార్పు నే పదికి ని య్యాంది ఎంచహాములన్" (వసుచరిత్ర)

ఉ. "విన్ని భవమ్ముల గెలుగు నెక్కుతరాను పాయుకప్పథా
  భ్రాంతి వాడిపట్టంబు పేలం గవాలము యాది చూడ్కులన్
  విప్ర దురుణు దోడు గాంచేలుకుం బయగారి సోకిసన్
  వెన్నవెంగటులు సవేణులు గొంగటం చేర్పు భాగ్యముల్" (మనుచరిత్ర)

చ. ప్రకటితేంద్రియుల్ ముని పరాశర కౌశికులంతవారు ప్రీ
  లకు వశు లైరకన్న మిగులన్ దృఢమౌ మనకప్ప దిగ్గజ
  ట్టుకొని సీతం దెంత శుకుండో? హనుమంతుడొ? భీష్ముడో? వివా
  యుకుడో? తలంచుకొ నరసిజాయతలోచన! నెమ్మనమ్మనన్" (వైజయంతీ విలాసము)

శా. "గంగా సంగమ మిచ్ఛగించునె? మదిన్ గావేరి దేవేరిగా
  నంగీకార మొనర్చునో? యమునతో నానందమున్ పొందునే
  రంగత్తుంగతరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
  యంగం బంటి సుఖించునేని గుణభద్రా! తుంగభద్రా నదీ

చ. మదభసలాళివంటి కచమా? వ్యదురంభలవంటి యూరులా?
  కదలని మించువంటి తళుకా? విరిబంతుల వంటి గుబ్బలా?
  పదన ఉరంబు వంటి గళమా? ముకురంబులవంటి చెక్కులా?
  మదవతి జవ్వనం బమృత మాధురి సేయదె యెంతవానికిన్?" (యామినీ పూర్ణతిలక)

శా. "ఎంచు స్మర్మము లెత్తిమాటికిం దుటాయించుం గను ల్బిట్టా
  రించున్ జన్నవన్నె వెటులు వలపూరించు స్మరించుం ప్రకాశం
  సించున్ మించు మనోవికారముల సూచించున్ మరుల్ వెంచు వ
  మ్మించుంబోడి స్వభావమో? లతవి నమ్మించం ప్రయత్నించుటో?" (శ్రవణానందము)

యీలాటి వెన్నో తెలుగులో వున్న పద్యాలు సంస్కృతీకరించవలసివస్తే దీనిలో వున్న అందచందాలు రావడం దుర్ఘటం. యెంతటి మహాకవికైనా సరే ఈ విషయం వుస్తకాపేక్ష అది కవిలోపం గాదు ఆ యా భాషల దుండే సహజ గుణమే అలాటిది దీనికి ముఖ్యకారణం వినీ వినడంతోటే, మాతృభాష గనుక— తెలుగు—ఎంతో యెంతో అర్థం తెలుస్తుంది సంస్కృతం అలా బోధించదు

ఏతావన్మాత్రమే కాదు. తెలుగులో శ్రవణ కటువుగావుండే ఒత్తక్షరాలు లేవు సంస్కృతంతో ప్రయుల్పించి చెప్పాలంటే (శ్లో. సజల జందపీలం వల్మీకేళిలోలం) మృదువుగా చెప్పవచ్చునుగాని స్వతహా తెలుగు కున్నంత మార్దవం కల పదాలు ఉండవు అచ్చ తెలుగు పదాలతోటే యావత్తు రచనా సాగించాలనే చేదస్తం పెట్టుకుంటే ఆ రచన దుర్బోధంగానూ, కటువుగానూ ఉంటుంది. ఎందుచేతనంటే ఆ రచనలో సహజ భాషకాక కొంత కృతకభాష వడుతుంది. అర్థం బొత్తిగా తెలియని యూరోపి యనులు కూడా తెలుగు చదివించి ఆనందించడం వేసు యెఱుగుదును తత్సమ పదాలు కలిపినా అవి లలిచు తెలుగులో వాడుకొనేవిగా వుంటే తెలుగుకు వున్న మాధుర్యాన్ని చెడుగొట్టవు. లోగడ ఉదాహరించిన "దేవసములైన యనుజులతో" అనే నన్నయ్య గారి కంద పద్యంలో యే కొంచెమో తప్ప తక్కిన యావత్తూ తత్సమపదాలే అయినా అర్థం ఝుడితిగా స్ఫురించడంచేత అవన్నీ అచ్చ తెలుగుగానే పరిణమించినట్లయినది

  . . . . . యు . . . . . ధ
  వంశయునం . . . . గా . . . కర్ణుం డిం
  ద్రుం . . . . . . గెల్తు న
  . . . . . . . . . వాడుసుం గియ్యమునన్" (తిక్కన)

క. "కరుణా నిరతులు ధర్మ
  స్వరూప్ల లింపు . . . . . . వసుదేం
  ద్రుల వారు వచ్చు నీ కి
  చ్చరేని పాణిగ్రహణము . . . . . . . " (నన్నయ)

పై పద్యంలో ఉభయులుగా ఉభయ భాషలు యిందుమించు సమంగానే వాడినా అర్థం త్వరితో స్ఫురించడమనే ప్రసాద గుణానికి లేశమూ లోపం కలక్కపోవడం చేత అంతా తెలుగే అనిపిస్తుంది కవిత్వారంభ దశలో సంస్కృతం యెంత కఠినంగా రచిస్తే లోకంలో మనలను అంత గొప్ప వాళ్లనుగా గౌరవిస్తారనే భ్రాంతి కలుగుతుంది కాని క్రమంగా ఆ భావం సరియైనది కాదని గోచరిస్తుంది ఇది విపర్యాసం.

యెంత చెప్పించినా కవిత్వమనేది సుళువుగా బోధించేటట్టు ఉండడమే ఆవశ్యకం ... రచనలో ఈ లక్షణం బాగా గోచరిస్తుంది "అర్జునస్య ఇమే బాణా నేమే బాణా శ్శిఖండిన:" ఈ మాదిరి శ్లోకాలు సంస్కృతం రానివాళ్లకు కూడా సుళువుగా తెలుస్తాయి కాని సంస్కృతమంతా యిదేవిధంగా ఉండనక్కరలేదని వీలులేదు కొందరు కవులు వారి వారికి వున్న వ్యాకరణపాండిత్యాన్నంతా వినియోగించి తాత్పర్యం దుర్బోధంగా రచించిన మాట సత్యం

శ్లో. "ఏకైకే నివసంతి తే భుజభృత: కస్మై నిగృహ్ణామహే
  వీరక్షత్ర మియం పురర్ధసుమతి పౌలస్త్య హాబిభ్రతీ,
  వాలీ త్వాప్తాయుమాను మే మనసి యు ష్ప్రక్తే కృతే చక్షుషీ
  వ్యాము ప్రసీద్వలేచ ప్రణుము ద్రద్వక్తు మప్పే వయమ్" (మురారి)

ఈ శ్లోకంలో ఒక లోకోక్తి యిమిడ్చి చక్కని పోకడగా రచించి ఉన్నప్పటికీ రెండు మూడుచోట్ల పాషాణపాకంగా ఉండడంచేత దీన్ని కావ్య పంచక పాండిత్యం ఉన్నవాళ్లు కూడా విని ఆనందించడానికి అర్హులు కారు చూడండి! దీన్ని తెలుగు భాషలో పెడితే యెలాటి అందం వచ్చిందో—

వ. "ఒక రొకటుండ్రు వీరవరు లొక్కరి కొక్కరు లీసిపోరు భూ
  మికి యశ మబ్బె రావణుని మెచ్చిన నం చొకొండుమేని వా
  లికి సతం డింత బంకె నవేశము లొక్కట డించి కన్నులుం
  టకుం గని వీకు యింటకు గెండిని నల్వుల మేమి చెప్పగన్"

ఆశ్లోకంలోవున్న అర్థాన్నే వివరించే ఈ పద్యం శ్రోతల కానందం గలిగించినట్లు సంస్కృతభాష బాగా వచ్చిన పండితులకేనా ఆ శ్లోకం కలిగించనేరదు అది భాషలోవున్న భేదంగాని అన్యంగాదు. తెలుగుభాషలో వున్న సీసం మాదిరి శ్లోకాలు సంస్కృతంలో యిత్కించిద్భేదంతో లేకపోలేదు గాని అవి కేవలం విశేషణ కవిత్వానికే తప్ప యితరథా ఉపయోగించవు వాట్లను అశ్వధాటీవృత్తాలని వ్యవహరిస్తారు గాని వృత్తరత్నాకరంలో మత్తేభము అని ఉన్నట్లు జ్ఞాపకం "ద్వైపాయన ప్రభృతి శాపాయుధ త్రిదివపోవ" అనే కాళిదాస శ్లోకాలవే సీసానికీ, దీనికీ యెంతో తేడా ఉండదు ప్రతిచరణానికీ మూడేసి ప్రాసలతో రచించినప్పుడే ఈ శ్లోకం అందంగా వుంటుంది. సీసం అలా అక్కరలేద అనేక విధాల ఉపయోగిస్తుంది

సీ. "హంసచే దన వినినంతకంటెను రూప
    విభవాతిశయమున వెలయుదాని" (భారతం)

సీ. "వితతనవద్వయ ద్వీప నానా జయ
    శ్రీ వధూటీ సమాశ్లిష్టభుజుండు" (నైషధము)

సీ. "తన కప్పు వెళ్లి కొప్పునవెవ్వాని గౌరీస
    మాఖ్యమించ జనించినట్టి యార్య" (వసుచరిత్ర)

సీ. "చిన్ని వన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిం
    బొడమిన చెలువ తోబుట్టు మాకు" (మనుచరిత్ర)

యీలా అనేక విధాలుగా సీసం తెలుగు భాషకు అందం తెస్తుంది సంస్కృతంలోవున్న అశ్వధాటి ఒకటే విధంగా ఉపయోగిస్తుంది అదేనా కాళిదాసువంటి సమర్థులకేకాని సర్వ సామాన్యులకు దాన్ని స్పృశించే అధికారం లేదు

ఇంకా ఎన్నో సంగతులు తెలుగును గురించి వ్రాయవలసినవి ఉన్నాయి "ఉడుకుల నాయకుండు=నక్షత్ర సముదాయమునకు నాయకుడు; ఉడుకులకు నాయకుడు" "రాజీవంబయటంచు=రా, జీవంబ జీవమా రా" ఇత్యాదులు సంస్కృతంలో రావని యెఱుగనగు దిఙ్మాత్రం చూపించాను తుది దానిలో "రాజీవంబె పద్మమే" అని ఒక అర్థం ఒక్క దేశ భాషందు మాత్రమేకాదు సంస్కృత భాషకంటే కూడా తెలుగు మెప్పును గడిస్తుం దనుటకు సందేహంలేదు ఎక్కువ మెత్తని హృదయం గలవారు తప్ప ఆయీ నా అభిప్రాయాన్ని ఆమోదించరు "వీడికి సంస్కృతమంటే యేం తెలుస్తుంది? వీడిముఖం!" అనేవారు కూడా ఉంటారని నే నెఱుగుదును నాకు యేమీ తెలియనిమాట సత్యమే అయినా నే నెవరి పద్యాలు ఉదాహరించి ఆ యీ చర్చ చేశానో, ఆ నన్నయాదులు సంస్కృతంలో యెంత వాళ్లయి తెలుగులోకి వచ్చి రచన సాగించారో ఆలోచించుకుంటే వారికి నా తాత్పర్యం సుళువుగా అవగతమవుతుంది ముందు వచ్చిన చెవులకంటే కూడా వెనక వచ్చిన కొమ్ములే వాడి కలిగి ఉండడం అంతా యెఱిఁ

గిందే సమస్త భాషలకూ తల్లి సంస్కృతభాష అది గురుస్థానం రాముడికి విశ్వామిత్రుడు గురువు అతని విద్య రామునియందు సంక్రమించి యెక్కువ శోభించింది అలాగే సంస్కృతం తెలుగులోకి వచ్చి విశిష్టత్వాన్ని ఆర్జించింది

సంస్కృతంలోకంటే తెలుగులో కొన్ని కట్టుబాట్లు (యతిప్రాసలు) ఎక్కువగా ఉన్నమాట సత్యం ఆ కట్టుబాట్లకు లోగే నన్నయాదులు కవిత్వం చెప్పి ఆచంద్రతారార్కమైన యశస్సు సంపాదించారు వారి ప్రయోగాల సారస్యం యెఱిగినవారు మాత్రం కవులలో విరళంగా ఉన్నారు ఎఱుగనివారు తెలిసీ తెలియని దిద్దుబాట్లు చేసి భవిష్యత్కవులకు తీరని అపకారాన్ని చేసి ఉన్నారు అది అచ్చువలన కలిగిన దోషం ప్రెస్సు వారెవరినో సంస్కర్తలుగా పెట్టుకుంటారు. ఆయన జీతం ఆయనకు రావాలి కనక లోచినట్లల్లా ఆయన సంస్కరిస్తారు యిప్పటికి అచ్చు వచ్చాక అయిదారుసార్లయినా భారతం అచ్చై ఉంటుంది చూడండి ఒక ముద్రణానికీ వేరొక ముద్రణానికీ ఎంత భేదం ఉంటుందోను తిక్కన్నగారి "నమ్మ్మా నమ్మక", జ్ఞకార కకారయతి నగయిరాలు దిద్దినారు కాని "ఏనిని" అనే ప్రయోగాన్నింకా దిద్దలేదు 'ఏనిని' తప్పన్నవారుమాత్రం బయలుదేఱినారు ఈ పైని దిద్దుతారు కాబోలు "హా సీ తే కిం భనిష్య" కవి హృదయం తెలిసికోవడం చాలా కష్టం "కాదన కిట్టి పాటి యపకారము తక్షకుడేక విప్రసంబోధన చేసి" అని నన్నయగారు దథలకు ప్రాసమైత్రిని తెల్పుడుచేస్తూ ప్రయోగిస్తే దాన్ని "ఏక విప్ర సంచోదన" అని దిద్ది యతి స్థానం కూడా వారి చిత్తం వచ్చినట్లు సవరించారు ఇంత స్వాతంత్ర్యం, సంస్కృతం సంస్కరించేవారికి ఉన్నట్లులేదు "తేనా నైహీంతి వృద్ధి రసాధు రేవ" అనే మొదలైన వాక్యాలవల్ల ఈ సంగతి అవగతమవుతుంది తెలుగు లిపిలోగాని, సంస్కృత లిపిలోగాని అవైహి, అవేహి అనే రూపద్వయానికి యెంతో భేదం ఉండదు. సాహసించి దిద్దితే దిద్దవచ్చును కాని తెలుగులో ఉన్నట్లు సంస్కృతంలో ఆపండితులు వ్యాఖ్యాతలు లేరు మాతృభాష కావడం చేత తెలుగులో చాలామంది ప్రవేశాన్ని సంపాదిండడానికి అవకాశం వుంది పూర్వజన్మవాసనవల్ల కవితాధార కూడా వుట్టవచ్చును అలాటివారు యేదో రచన చేసుకొని తృప్తిపడితే చిక్కులేదు వ్యాఖ్యానం చేయడానికి మొదలు పెడతారు అలా మొదలపెడితే వచ్చే చిక్కు కొంచెం తెల్పుతాను

"న మానినీ సంసహతే న్యసంగమం" (భట్టి కావ్యము)

ఆవ్యాఖ్యాతలను "అయ్యా! 'అన్య నంగమం' అన్న సమాసానికి విగ్రహం సెలవియ్యండి" అని అడిగి చూడండి యేవిధంగా చెపుతారోను "అన్యస్య సంగమః' అని చెపుతారు అప్పుడా శ్లోకార్థం చెడి వ్యతిరేకిస్తుంది "మానవంతురాలైన స్త్రీ (తన భర్తకు) ఇతర స్త్రీతో సంబంధంవుంటే సహించదు" అని రావలసిన దానికి యితర పురుషునితో అని తేలుతుంది శాస్త్రజ్ఞుడైతే వ్యాఖ్యాత "అన్యస్యా స్సంగమః, అన్యసంగమః" అని వ్యాఖ్యానిస్తాడు శాస్త్రవాసనలేని వ్యాఖ్యాత అంతమాత్రంతో వూరుకుంటాడా! వూరుకోక "అప్పుడు 'అన్యాసంగమ' కావద్దా? దీర్ఘం యేమయింది" అని శంకిస్తాడు ఈ చెట్టుక్రింది ప్లీడరీ పాండిత్యాల చేతుల్లోబడి తెలుగు నానావస్మారాల పాలవుతూ వుంది ఈ వ్యాఖ్యాతలకి భాషలోని లోతుపాతులు బొత్తిగా తెలియవు. తెలియనివారు వూరుకోరు యేదో తప్పుమార్గాన్ని తొక్కుతారు వారు తొక్కిన త్రోవనే మరికొందఱు (శతాంధాః కూపం ప్రవిశంతి) పోవడం ఈ దురవస్థ లేకపోతే తెలుగులో బాగుండేది

శ్లో "స్వాధీనో రసనాంచలః పరిచితా శ్శబ్దాః కియంతః క్వచిత్
క్షోణీంద్రో న నియామకః పరిషద శ్శాంతాః స్వతంత్రం జగత్"

"వయం మౌన వ్రతాలంబినః" అని ఈమధ్య వోపికలేక వ్యాసాలవని కట్టిపెడితే మా శంభుప్రసాదుగారు బలవంత పెడితే ఈ నాలుగు మాటలూ వ్రాశాను వైతండికులకు భయంపడి వున్న మాట దాస్తే యేలాగ? "దేశభాషలందు దెలుగు లెస్స" అనే మాట సత్యం ముమ్మాటికీ సత్యం ఈ భాషకు యెక్కువగా అందాన్ని కల్పించేవి లోకోక్తులు ఆ లోకోక్తులు గ్రామ్యంలోనే చాలామట్టుకు ఉంటాయి మచ్చు చూపుతాను

"పాలువిఱిగితే పెరుగగునే?" (సారంగు తమ్మయ్య)
"సయి దాటేవానికిన్ జింతయా కంతైనం గొదవైనసున్" (రావ లింగం)
"రోళ్లా రోకళ్లం బాడిన కూరుము లిపు డింత దాచికొన్నన్" (పింగళి)

ఇవి తప్పులనేవా రున్నారు అంతటి మహాకవులకు "విఱిగితే, దాటేవానికి, రోళ్ల" అనే ప్రయోగాలు గ్రామ్యాలని తెలియనే తెలియదా? (శాంతం పాపం) అన్నంతవఱకు ఆలోచన పోనేపోదు ఇది యీ భాష చేసుకున్న పాపమేమో అనుకుంటాను మనకు వున్న అజ్ఞత్వాన్ని మహాకవుల నెత్తిని రుద్దడంకంటే అపచారం యేముంటుంది? "లోకోక్తీనాం భవే ద్యోగో యథా వ్రచ్ఛతి రంజనం" అని అహోబలుడు వ్యాకర్తల సమ్మతిని ప్రకటించివున్నాడు సీతారామాచార్యులవారు ఎంతో కాలం శ ర నిఘంటు నిర్మాణానికై జీవితాన్ని ధారపోసి గణించిన అనుభవాన్ని క్రోడీకరించి 'త్రిలింగ లక్షణ శేషం' అనే పేరుతో లక్షణ గ్రంథం నిర్మించారు కూచిమంచి తిమ్మకవి 'సర్వలక్షణ సార సంగ్రహం' రచించి ప్రయోగ విశేషాలు కనపఱచి ఉన్నాడు ఇవేవీ పరిశీలించకుండా సుప్రయోగాలు, అపప్రయోగా లనడం యెంతో అపచారంగా కనపడుతుంది. నూటికి తొంబదిపాళ్లు ఆంధ్ర భాష వ్యవహారంమీద ఆధారపడి ఉంటుంది ఆనడానికి యెవరోకాదు, భారత కవులే మార్గప్రదర్శకులు వారు 'వస్తాడు, పోతాడు' అనే గ్రామ్యాలు ప్రయోగించరుగాక ఈ క్రింది ప్రయోగం చూడండి "నరునకు చుట్టమెవ్వరు"—యిందులో 'చుట్టము' ఏకవచనం, 'యెవ్వరు' బహువచనం దీన్ని చట్టస సర్వజ్ఞంమన్యులు "చుట్ట మెవ్వడు" అని దిద్దుతారు ఆ యీ పీడ మన న్నులో పెట్టుకునే అనుకుంటాను రెండోచరణంలో ప్రాసలో "ఎవ్వట" అని శంభుదానుడు ప్రయోగించి ఉన్నాడు లది దిద్దడానికి వశంకాదు ఆపైని యింకో విచిత్రమైన వాదానికే దిగుతారు వారు ఎందుకో అలా ప్రయోగించి ఉంటారు మనం మాత్రం దాన్ననుసరించి ప్రయోగించుకోకూడదని కొందఱు కొందఱో, మహాకవులకు మాత్రం ప్రమాదం రాగూడదా? అట్టి ప్రమాదాన్నె మనం వట్టుకొని ప్రేలాడడ మెందుకంటూ వాదానికి దిగుతారు ఈ చివరవారి వాదం కొంత ఆపాతరమణీయంగా కనపడుతుందిగాని ఆ మహాకవులు ప్రమాదపడి ప్రయోగించినట్లు రుజువు చేయాలా, వద్దా? తిక్కనగారు మూడుచోట్ల ప్రాసస్థానంలోనున్నా, ఇతరచోట్ల శతముల కొలది గానున్నూ వాడిన దానిని ('ఏనిని' ప్రయోగం) తప్పని తమ వాదమే నిల్పడానికి ప్రయత్నించడాన్ని యేమనాలి? న్యాయమైన కట్టుబాట్లందఱూ విశ్వసింపవలసిందే మనకు తెలియక ఏదో తప్పని తరవాత దానికోసమై పెనుగులాడడం భాషకు తీరని అపకారాన్ని కలిగిస్తుంది అప్పకవినాటికి తమకు గోచరించివున్న యతులు కొన్ని మాత్రమే లక్షణజ్ఞులు ఉదాహరించారు "పూర్వకవుల లక్ష్యములు" ఎరిశీలించి యతుల సంఖ్య అప్పకవి చాలా పెంపుచేశాడు అట్లే ప్రాసల విషయం కూడా అప్పకవి యించుగా గమయతి పూర్వలాక్షణికులకేకాక భారతాదులకు కూడా సమ్మతమైనా యెందుకో నిషేధించాడు కల్లూరివారు భారతాదులనుండి బహుప్రయోగాలు చూపి సమర్థించారు మనకు వుభయులూ ప్రాజ్ఞులే, మాన్యులే కనక మనం యిరువురినీ అనుసరించడంలో ఆక్షేపణ లేదు ఆ యీ విధంగా భాషకు కొంత స్వాతంత్ర్యం కలిగించడంలో అపచారం యేమీ వుండదు నన్నయాదులు అన్యదేశ్యాలు కొంచెమే వాడినారో, లేక వాడనే లేదో! పెద్దన్నగారు చాలా వాడినారు దిట్టకవి శరపరంపరగా వాడి మెప్పించుకున్నాడు "మాయబ్బపదమ్ములాన విజమాడిలి హైదరుజంగు సాహెబూ?" అన్నాడు. ఈ సంబోధన మార్చడానికి వీలులేదుగాక, ఎన్నో మార్చడానికి వీలున్నవే వాడినాడు

ఈ వెఱ్ఱివాదం తెలుగు కవులనే బాధించలేదు యింత కాకపోయినా యిందులో కొంతేనా సంస్కృతకవులనున్ను యేదోమాదిరిది బాధించింది కనుకనే భవభూతి మహాకవి "సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యవచనీయతా, యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" అన్నాడు అని అంతతో వూరుకున్నాడా? లేదు. "అతిదుర్జన ఇతి వక్తవ్యం" అని కూడా వార్తికం తగిల్చాడు

వ్రాస్తే చాలా వ్రాయాలి రస మెఱుగక పాడుచేసుకొనే వారిని గూర్చి చెప్పేది లేదు రసజ్ఞులైన విద్వత్కవులకు తెలుగు భాషవంటి భాష మఱివొకటి కాదు రసములేని రచన ఎంత నిర్దుష్టమైనా, స్వహస్తపాకంవలె వుంచుంది రస మెఱిగిన కవి అలాటిభాష, అనగా శుద్ధ చ్ఛాందసగ్రామ్యంలో కూడా రసం కురిపించుగలడు

శా "అస్సే చూస్సి వషే వొషే చెవుడషే అట్లాగషే యేమిషే
విస్సావఝ్ఝలవారి బుఱ్ఱినష ఆ విస్సాయి కిస్సారుషే
విస్సం డెంతటివాడె? యేళ్ళు పదిషే"

ఈ పద్యం కొంతదికాలం క్రిందట కీ శే లైన దాను శ్రీరామకవిగారిది బాగుంది కనక నాకు నోటికి వచ్చింది

"లోకుల రసనలె యాకులుగా నుండునట్టి యవివో కవితల్"

క "ఏరసము చెప్పఁబూనిన
నా రస మాలించువారి నలరింపని యా
పీరసపుఁ గావ్య శవముల
దూరమునన పరిహరింపుదురు కావ్యజ్ఞుల్"

ఇవి నా స్వంత మాటలుకావు కవికర్ణరసాయనంలోనివి యెంతసేపూ రసానికి పాటుపడడం కవి కావలక్యం కవిత్వ మనేది రసజ్ఞ లోకానికై పుట్టింది రచనలో రసమంటూ యే కొంచెమేనా ఉండనిపక్షంలో కవి ఎంత తర్కం వచ్చినవాడైనా ఎంత వ్యాకరణం నేర్చినవాడైనా యెన్ని వీసెల విభూతి ధరించి యెన్ని రుద్రాక్ష పేరుల ధరించి రచించినవాడైనా ప్రయోజనం లేదు

శ్లో. "ఘటః పట ఇతి స్ఫుటం పటు రటంతి నైయాయికాః
సరంతిచ హరాత్తరాం కఫఘటేతి పాతంజలాః,
వయం వకుళమంజరీ గళదరీణ మాధ్వీఝరీ
ధురీణ ఖభరీతిభిః ఫణితిభిః ప్రమోదామహే"

పై శ్లోకంవల్ల తర్క వ్యాకరణాది శాస్త్రాలు ఆనందం యిచ్చేవి కావనిన్నీ, కవిత్వమే ఆనందం యిచ్చేదనిన్నీ తేలుతూవుంది ఆ యీమాట ఒక్క భాషకే సమన్వయించేది కాదు చెప్పడం సంస్కృతకవి చెప్పినా అన్ని భాషలకూ మనం సమన్వయించుకోవచ్చును అందులోనున్నా—"తత్రా పిచ చతుర్థాంక" అన్నట్లు తెలుగు భాషలో ఎక్కువ సొగసులు తీసుకురావడానికి అవకాశం ఉంది కాని కవికి భాషాజ్ఞానం మాత్రమే ఉంటే చాలదు చాలా లోకానుభవం కూడా ఉండాలి అందులోనూ శృంగారరసం వ్రాసి మెప్పించడం మరీ కష్టం ఎందఱో కవులు శృంగారం వ్రాసిన్నీ మెప్పొందనివారీకాలంలోనే కాదు, పూర్వకాలంలోనూ ఉన్నట్లు వారి వారి కృతులు సాక్ష్యమిస్తాయి జయదేవుని అష్టపదులు శృంగారానికి పెట్టింది పేరు ఆ జయదేవుడు మెచ్చికొన్నవాడు అచార్యగోవర్ధనుడు గోవర్ధనుఁ డేమన్నాడో చూడండి:

"అస్వాదితదయితాధర సుధారసస్యైవ సూక్తయో మధురాః,
అదళితరసాల ముకులో న కోకిలః కల ముదంచయతి"
"అంతరమపి బహిరివ హి వ్యంజయితుం రస మశేషత స్సతతం,
అసతీ సత్కవిసూక్తిః కాచఘటీ చ త్రయం వేద"

వ్యాసం విస్తరిస్తూవుంది మరొకప్పుడు చూచుకుందాం తెలుగు కవిత్వంలో నానావిధములైన అందచందాలు ఉన్నవనిన్నీ, అవి అనుభవైకవేద్యాలనిన్నీ సారాంశం. స్వస్తి

# తంత్రశాస్త్రము-వామాచారము

"ఆనందపురి"

**[1944 తారణ సంవత్సరాదిసంచికనుండి]**

తంత్రశాస్త్రమును ఆమూలాగ్రముగా పరిశీలింపకయే దురభిప్రాయపూరితములగు సిద్ధాంతములను పెక్కుమంది ఉటంకించుచుందురు ముఖ్యముగ, వామాచారము, పంచమకారసాధనయును నిరసింపబడినంతగా ఇతర విషయములు త్రుణీకరింపడలేదు. ఆయా విషయములను గుఱించి తంత్రశాస్త్రమును, తదభిజ్ఞులను నుడువు విషయములనే ఈ వ్యాసము అభివ్యక్తమొనర్చుచున్నది

తంత్రశాస్త్రము ఉపాసనాశాస్త్రము ఇందు అధికార భేదము ననుసరించి విభిన్న పద్ధతులతో నారాధించు క్రమము ఉద్దేశింపబడినది తాంత్రిక పరిభాషలో ఈ ఉపాసనాపద్ధతులు 'ఆచారము' అనబడును కులార్ణవతంత్రము వేదాచారము, వైష్ణవాచారము, శైవాచారము, దక్షిణాచారము, వామాచారము, సిద్ధాంతాచారము, కౌలాచారము అను సప్తవిధాచారములను వర్ణించుచున్నది 1

విశ్వసారతంత్రము సంక్షేపముగ వామాచారము, దక్షిణాచారము అన్న రెండు ఆచారములనే పేర్కొనుచున్నది మద్య మాంసాదికమగు పంచమకారములతో2 నొనర్పబడు ఉపాసన వామాచారము. ఇవి లేకుండ నొనర్పబడు ఉపాసన దక్షిణాచారము 3 ప్రస్తుత మీ రెండు ఆచారములను గురించియే ఆలోచింతము ముందుగనే ఒక మాట చెప్పియుంచుట మంచిది అస్మద్దేశీయులగు పూర్వాచార్యులు స్వావలంబితములగు ఉపాసనలకు సంబంధించిన గూఢ విషయములను లోకమునకు దెల్పుటలో నత్యంతమగు జాగరూకతను, వహించెడువారు ఇట్టి విషయములనుగుఱించి నల్గురతోడను ప్రసంగించుట అత్యంతము అనుచితము అత్యంత గంభీరములును, సాధనాపేక్షితములును నగు విషయములను కేవలము గ్రంథాధ్యయనమువలననే గ్రహింపబడదగని విషయములను వెల్లడించిన యెడల అమర్యాదయే యగును అసంస్కృత బుద్ధియగు వ్యక్తికీ విషయము లేరీతిగను ఉపకరింపజాలవు విషయగ్రహణావమర్థతవలనను, విపరీత గ్రహణమువలనను శ్రద్ధావిహీనుడగును ఒకసారి అశ్రద్ధ ఆవేశించిన యెడల ఇక ఎన్నడును ఆ విషయములను గురించిన యాథార్థ్యమును గ్రహింపబోడు యావజ్జీవము అజ్ఞతనే ఆశ్రయించి, ఆ యా విషయములను గ్రహించెడు సౌకర్యములను గూడ పోగొట్టుకొనును కనుకనే సుప్రసిద్ధ వైష్ణవాచార్యుడగు జీవగోస్వామి స్వవిరచితమగు షట్సందర్భాంతర్గతమగు భక్తిసందర్భమున "సాధనా సంబంధములును, పరమ గుహ్యములును నగు విషయములను వెల్లడింపకూడదు" అని అనుశాసించినాడు అద్వైతాచార్యుడగు మధుసూదన సరస్వతి కూడ మహిమ్నస్తోత్ర వ్యాఖ్యయందు ప్రణవోపాసననుగుఱించి వివరించుచు, ఈ ఉపాసనా రహస్యమును స్వయముగనే గురునినుండి గ్రహింపనగునని నుడివినాడు

వామాచార దక్షిణాచారములు రెండును గూడ సాధనకు సంబంధించిన విషయములు సాధన పథానువర్తులు కానివారికీ విషయమున నెట్టి యభిజ్ఞతయును ఉండజాలదు గ్రంథములు తెల్పునది అత్యల్పము సాధనకు సంబంధించిన నిగూఢ తత్త్వములను గ్రంథస్థ మొనర్చు ఆచారము పూర్వమునలేదు కాని, తంత్రశాస్త్ర గ్రంథ సంకలయిత లందఱును సాధకు లగుటవలన కొంతమట్టుకు వామాచారమును గుఱించి మనము వారి రచనలనుండియే కొన్ని విషయములను గ్రహింపగల్గుచున్నారము

**2**

పండితులలో పెక్కుమంది ఉపాసనసుబోలు శ్రేష్ఠతత్త్వమునకు బాహ్యవములగు పంచమకారములతో సంబంధ ముండరాదనియే తలతురు వీరు కులార్ణవతంత్ర ప్రతిపాదితమైన ఆధ్యాత్మికార్థమునే గ్రహింపగోరుదురు ఈ అర్థము కులార్ణవ తంత్ర పంచమాధ్యాయమున ప్రదర్శితమైనది అచ్చట పంచమకారమునకు బదులుగ వాసనా శబ్దము ప్రయోగింపబడినది వాసనా శబ్దము దర్శన శాస్త్రమున 'సంస్కారము, సూక్ష్మ స్వరూపము' అను నర్థముల వాడబడుచున్నది పంచమకారముల ఆధ్యాత్మిక స్వరూప మన పంచమకారముల సూక్ష్మరూపమని పర్యవసానము

మూలాధారమున కుండలినీశక్తి వెలయుచున్నది 4 ఈ కుండలినీ శక్తిని సాధన వలన జాగరిత మొనర్చి, బ్రహ్మరంధ్రమున సహస్ర దళ పద్మమునమున్న పరమాత్మతో సంయోజిత మొనర్చి, చిన్మయుడగు పరమశివునితో కుండలినీ శక్తికి సమరసత్వమును, అనగా అత్యంతికమగు సమ్మేళనమును గూర్చవలెను అప్పు డొకానొక సుఖానుభూతి లభించును. ఆ స్థితియందు సహస్ర దళ పద్మనిఃస్రుతమగు సుధాపానమున సాధకుడు నిరతుడగును ఈ సుధయే మద్యము ఇది ప్రథమ మకారము.

జ్ఞానఖడ్గమున పాప పుణ్య రూపమగు పశువును బలియొనర్చి, పరమాత్మయందు చిత్తమును లయ మొనర్పనగును ఇట్లొనర్పగలిగినవాడే పలలాశి—మాంసభోజి ఇది ద్వితీయ మకారమగు మాంసము

మనస్సును, సమస్తేంద్రియములను విషయవర్గమునుండి మరల్చి, అంతర్ముఖత్వము నందవలెను ఇట్లొనర్పగలిగినవాడు మత్స్యాశి ఇది తృతీయ మకారము

కులకుండలినీశక్తిని ప్రబోధించి, ఆ శక్తిని సేవింపగలిగినవాడే శక్తిసేవకుడు. ఇది చతుర్థ మకారము

ప్రబుద్ధమైన కుండలినీ శక్తిని పరమాత్మతో సమ్మిళిత మొనర్చి ఆనందానుభవ మందగల్గువాడు మైథునసేవి ఇది పంచమమకారము

గురుముఖమునసుండి—గ్రంథముఖమున కాదు—ఏవంవిధములగు పంచమకారముల 'వాసన'ను గ్రహించి, పంచమకారములను సేవించినయెడల ముక్తి లభించును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రము వఱకును వ్యాపించియుండిన సుషుమ్నానాడియందున్న 'లింగత్రయము' నెఱిగి, షట్చక్రభేదన మొనర్పగలిగినవాడే పంచమకారములను సేవింప సమర్థుడగును 5 గురునినుండియు, కులశాస్త్రములనుండియు ఈ తత్త్వమును చక్కగా గ్రహించిన యనంతరమే పంచమకారములను సాధింపవలెనని నియమము లేకుండిన భ్రష్టత్వమే సిద్ధించును6

---

1 "సర్వేభ్య శ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవం పరమ్,
వైష్ణవా దుత్తమం శైవం శైవా ద్దక్షిణ ముత్తమమ్
దక్షిణా దుత్తమం వామం వామాత్సిద్ధాంత ముత్తమమ్,
సిద్ధాంతా దుత్తమం కౌలం కౌలాత్పరతరం నహి"
—కులార్ణవతంత్రమ్, 2.

2. "మద్యం మాంసంచ మత్స్యంచ ముద్రా మైథున మేవచ,
మకార పంచకం దేవి! దేవతా ప్రీతికారకమ్"
—కులార్ణవతంత్రమ్, 2.

3 "ఆచారో ద్వివిధో దేవి! వామదక్షిణ భేదతః,
పంచముద్రాది సంయుక్తో వామాచారః ప్రకీర్తితః.
పంచముద్రాది రహితో దక్షిణాచార సంజ్ఞకః"
—విశ్వసారతంత్రమ్.

4 "దేహస్య మధ్యమో భాగో మూలాధార ఇతీర్యతే,
గుదస్య ద్వ్యంగులా దూర్ధ్వం మేఢ్రాత్తు ద్వ్యంగులా దధః.
త్రికోణో ధోముఖాగ్రశ్చ కన్యకాయోని సన్నిభః,
యత్ర కుండలినీనామ పరాశక్తి ప్రతిష్ఠితా"
—మానసోల్లాస తంత్రమ్, 4—12—13.

5 "లింగత్రయ విశేషజ్ఞః షడాధార విభేదకః"
—కులార్ణవతంత్రమ్, 5

6. "శ్రీగురోః కులశాస్త్రేభ్యః సమ్యగ్విజ్ఞాయ వాసనామ్,
పంచముద్రా నిషేవేత చాన్యథా పతితో భవేత్"
—కులార్ణవతంత్రమ్, 6

ఉపర్యుక్త విషయములను వివరముగ నాలోచించి చూచిన యెడల ఈ ఆధ్యాత్మిక పంచమకారములు మహోన్నతములు [illegible] గ్రహింపవలెను. [illegible] 'పంచమకారము'ల [illegible] 'యోగసిద్ధి' [illegible] ఆధ్యాత్మిక వ్యాపారము (Practical work) [illegible] ఈ విషయమునే [illegible] గ్రహింప నుపదేశించుచున్నది.

### 3

[illegible] లో గూడ యోగ విషయము ప్రస్తావితమైన విషయము అత్యంత శాస్త్రజ్ఞులైన [illegible] ఈ వైదిక యోగమునకు [illegible] వైదికయోగ సాధనయును, తాంత్రికయోగ సాధనయును ఒకే విధముగ నవలంబించుచున్నవని చెప్పజాలము. ఉభయ యోగముల ఆదర్శము ఒక్కటియును ఉన్నను, అనుష్ఠాన పద్ధతియందు భేద మున్నది. కుండలినీశక్తిని చైతన్యవంత మొనర్చుటయే తాంత్రిక యోగమునందలి ప్రధాన వ్యాపారము. వైదిక యోగమున కుండలినీ ప్రసక్తియే లేదు. షట్చక్రభేదము కూడ ఉపనిషత్తులలోగాని, యోగసూత్రములలోగాని కానరాదు. షట్చక్రభేద మొనర్చునట్టి తాంత్రికయోగమే లేదు.

ఈ పంచమకారములను 'వాసన' అని చెప్పబడిన కులార్ణవ తంత్ర మూలకుండ లేదు. బాహ్య పంచమకారముల విషయముకూడ పంచమప్రకాశ్యములలో పర్యాలోచింపబడినది. పంచమకారముల 'వాసన'ను అనగా సూక్ష్మతత్త్వమును గ్రహింపకుండ వాని నుపయోగించినచో పాతిత్య మాపాదిల్లునను విషయము వింతపూర్వమే తెల్పితిమి. ఇక నీ ద్వివిధ విషయముల సామంజస్యము నూహింతము.

ఇంతవఱకు మనము గ్రహించిన దేమన : యోగసాధనయొక్క చరమ స్థితియే వామాచారముయొక్క లక్ష్యము, లేక గమ్యము. ఈ గమ్యమునే కులార్ణవము వాసన యనుచున్నది. ఈ లక్ష్యమును బొందజేయు నిమిత్తమే బాహ్యపంచమకారోపదేశము. ఈ అభిప్రాయమును విశదీకరించిన యెడల ద్వివిధ—పంచమకారములకును సామంజస్య మేర్పడును. యోగసాధకునకు మనస్థైర్యముతో బాటు మనఃప్రసాదము కూడ ఉండవలెను. దీని నిమిత్తమే పాతంజలదర్శనము ప్రాణాయామాదుల నుపదేశించుచున్నది. తంత్రశాస్త్రము పంచమకారములనునవి ఈ యుద్దేశ్యమును సఫల మొనర్చునన్న విషయములో ఆపాదించుట కేమియును లేదు.

కులార్ణవము కులమార్గము (వామాచారము)ను బహుళముగ ప్రశంసించియు,

"కృపాణ ధారాగమనాద్ వ్యాఘ్రకంఠావలంబనాత్,
భుజంగ ధారణా న్నూన మశక్యం కులసేవనమ్"

—కులార్ణవతంత్రమ్, 2.

అని దీని కష్ట సాధ్యత్వమును, విపత్సంకులత్వమును సూచించుచున్నది. కనుక, ఈ సాధన సామాన్యుల నిమిత్తము కాదని తేలుచున్నది. లోకోత్తరులగు వారికి కూడ ఉపద్రవపడు మనుటలో సందేహము లేదు. మఱియును, ఒకేవంశమున నందఱును అసాధారణ మహిమతో నుద్భవింపబోరు. కనుక వియ్యాది వంశ పారంపర్యముగ సాధనగ కూడ గ్రహింపతగినా యను విషయము కూడ సంశయాస్పదము. ఇందు ఇష్టసిద్ధికంటె అనిష్టమే వాటిల్లు నను భయము శాస్త్రకారులకు గూడ కలదని వారి యభిప్రాయము ను జూచిన గ్రహింపగలము.

### 4

పరశురామకల్పసూత్రము వామాచార సంప్రదాయమునకు ప్రామాణ్యమగు గ్రంథము. ఇది ఉపాసకులకు కొన్ని నియమముల నేర్పరచుచున్నది. లోకవిద్విష్టమగు కర్మము [7]నాచరింపకూడదనుట వానిలో నొకటి. వర్తమానకాలమున మద్యపానము శిష్టాచార సమ్మతము కాదు. లోక విద్విష్టము. కనుక కులశాస్త్రముల నత్యంతముగ నాదరించువారు కూడ నిప్పుడు పంచమకారముల నాదరింపరాదని తేలుచున్నది. వ్యవహార పక్షమునగూడ, అత్యంత రహస్యముగనే గ్రహింపవలయునుగాని, వెల్లడియైన నరకప్రాప్తి యని కల్పసూత్రము తెల్పుచున్నది. [8]మఱియును, సర్వక్షేత్రముల నీ వ్యవహారము శాస్త్ర సమ్మతము కాదు. అనుకల్పముగ నిర్ధారింపబడిన ద్రవ్యములనే గ్రహింపవలెనను నియమ మున్నది.

లోకాచార విరుద్ధమైన యెడలను [9]దేశాచార విరుద్ధమైనపట్లను, చిత్తశుద్ధి లేకున్నను [10]మద్యాదులను గ్రహింపకూడదు. తంత్రశాస్త్రము మద్యపాన విధానమును హోమరూపమున వర్ణించుచున్నది. [11]పూజయం దుపయోగింపబడిన మద్యము హవిస్స్వరూపము. అవశిష్టాంశమును హోమమం దుపయోగింపవలెను. ఈ హోమాగ్ని సాధారణాగ్ని కాదు. స్వాంతర్గతమగు చైతన్యాగ్ని. ఈ హోమకర్మ మొనర్చువాని ఆధ్యాత్మిక భావన మహోన్నతమై యుండవలెను. "అజ్ఞానరూపాంధకారమునకు విరోధియును, స్వయంప్రకాశమానమును నగు చైతన్య రూపాగ్ని నిత్యము నాయందు ప్రజ్వరిల్లుచున్నది. అందు నిఖిల విశ్వమును నేను ఆహుతిగ నొసగుచున్నాను. ధర్మాధర్మ రూపమగు హవిస్సును, ప్రదీప్తాత్మ రూపమగు అగ్నియందు మనస్సను స్రువమును గ్రహించి, సుషుమ్నా నాడీ పథమున నిఖిలేంద్రియ వృత్తులను ఆహుతిగ నొసగుచున్నాను"[12] ధ్యాన మొనర్చుటయగును చిత్తైకాగ్ర్య మావశ్యకము. దీనిని బొందజేయుటకే మద్యపాన విధి. చిత్తమును స్థిర మొనర్చి దేవతా ధ్యాన నిమగ్న మొనర్పనగును. మద్యపానమున చిత్తమునకు వికారము పుట్టకూడదు.[13]

### 5

పంచమకారముల తీవ్రతను సహింపజాలనివారును, రోగ పీడితులును, వృద్ధులును నగువారు గూడ వీని నుపయోగింపకూడదు. ఈ విషయముల నన్నిటిని గమనించిన యెడల ఈ సాధనకు అధికారి అత్యంతము దుర్లభుడు—లేనే లేడు—అనిపించును. పూర్ణాభిషిక్తుడగు వ్యక్తి వీనిని యథేచ్ఛగ నుపయోగింపవచ్చు నందురుకాని, అట్టి వాడు కూడ అరుదే. [14]పూర్ణాభిషిక్తుడన్నను, బ్రహ్మజ్ఞాని యన్నను ఒక్కటియే. అట్టి వాడు యథేచ్ఛగా వర్తింపవచ్చు ననుట స్తుతియేగాని అన్యము కాదు. అతడు యథేచ్ఛముగ వర్తించను వర్తింపడు; ఇట్టి సాధనతోడను ప్రయోజనము లేదు. అతడు కృతకృత్యుడు. అన్ని పూర్ణాభిషిక్తునిగ భావించు యథేచ్ఛా విహారివి తంత్రశాస్త్రవేత్తలే నిందించియున్నారు.[15]

వామాచారముకంటె దక్షిణాచారమే శీఘ్రముగ ముక్తిని ప్రసాదింపగలదని మహాపండితుడగు భాస్కరరాయలు లలితాసహస్రనామభాష్యమున స్పష్టముగ నుడివియున్నాడు. భాస్కరరాయలు స్వయముగ వామాచారము నవలంబించినవాడు. కాళికాపురాణము కూడ ఈ విషయమునే చెప్పుచున్నది. అయినను భాస్కరాదులు యథార్థాధికారిని వామాచారమును పరిగ్రహింపమని చెప్పినారు. ఇది యొక మతము.

శారదాతిలకతంత్ర సంకలయితయగు లక్ష్మణేంద్ర దేశికుడును, సౌందర్య లహరీ టీకాకారుడగు లక్ష్మీధరుడును వామాచారము నొప్పలేదు. శివార్కమణి దీపికయందు అప్పయ్య దీక్షితులవారు కూడ వ్యతిరేకాభిప్రాయమునే సూచించిరి. తంత్రసార ప్రణేతయగు కృష్ణానంద ఆగమవాగీశుడు కూడ వామాచారము అత్యంత కఠినమని అభిప్రాయ మొసగెను.[16]

ఈ విషయముల నన్నిటిని పర్యాలోచించి చూచిన యెడల అత్యంత క్లిష్టమును, ప్రతిపద భయావహమును నగు వామాచారమును పరిత్యజించి దక్షిణాచారమును గ్రహించుటయే శ్రేయోదాయకము. వామాచార సాధన కర్హుడగువాడు నూటికి కోటికి సాధకులలో నొక డుండవచ్చును. అతనికి నా నమోవాకములు.

---

7. "కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యా విహిత హింసా స్తేయ లోక విద్విష్ట వర్జనమ్"— —పరశురామకల్పసూత్రమ్ 1—19.

8. "ఆనందం బ్రహ్మణో రూపం తచ్చ దేహే వ్యవస్థితం, తస్యా భివ్యంజకాః పంచమకారాః, తైరర్చనం గుప్త్యా, ప్రాకట్యాన్నిరయః."
—అందే 1—12

9. "వ్యవహార—దేశ—స్వాత్మ్య— ప్రాణోద్వేగ— సహాయామయవయాంసి ప్రవివార్యైవ తదనుకారః పంచమాది పరామర్శః"— (పరశురామకల్పసూత్రమ్, 10—56.

10. "కులద్రవ్యం నిషేవేత యదా సత్త్వాధికా మతిః,
అన్యథా సేవనం కుర్యాత్ పతనాయైవ కల్పతే."
—కల్పసూత్రవృత్తి కారధృతమ్.

11. "అంతర్నిరంతర మనింధన మేధమానే
మోహాంధకార పరిపంథిని సంవిదగ్నౌ,
కస్మింశ్చి దద్భుత మరీచివికాసమానే
విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్ "
—వృత్తి కారధృతమ్.

12. "ద్రవ్య మాస్వాద్య విధివా మనో నిశ్చలతాం నయేత్,
తతో ధ్యాయేత్ పరంజ్యోతి రాత్మజ్యోతి స్సనాతనమ్"
—గణేశ్వర సంహితా.

13. "యావ న్న చలతే దృష్టి ర్యావ న్న చలతే మనః,
తావత్ పానం ప్రకుర్వీత పశుపాన మతః పరమ్.
యావ న్నేంద్రియవైకల్యం యావ న్న ముఖవైకృతమ్,
తావ దేవ పిబేత్ ద్రవ్య మన్యథా పతనం భవేత్."
—పరమానందతంత్రమ్.

14. పరశురామకల్ప సూత్ర వృత్తి 5—22

15. అందే, 3—11

16. "తత్సమా ప్రకృతి శ్చేత్ స్యా న్మత్సమః పురుషోయది,
తద్వైవ పరమేశాని సమర్థః కులసాధనే."

# తిక్కన

## శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

**[1944 తారణ సంవత్సరాదిసంచికనుండి]**

### నా టి క

ఇందువచ్చు పాత్రలు

మనుమసిద్ధి—రాజు
తిక్కన—మంత్రి
చిన్నకొమ్మన్న—తిక్కన కొడుకు (14 ఏండ్ల బాలుడు)
మారన్న—దళపతి
అన్నమాంబ—తిక్కనతల్లి
సీతమ్మ—తిక్కనభార్య
ప్రోలమ్మ—ఖడ్గతిక్కనతల్లి, అన్నమాంబ తోడికోడలు.



నేను రచించుచున్న 'తిక్కన' అను నవలలోని రెండవభాగమున రెండవ అధ్యాయమునకు ఇది రూపాంతరము కొద్ది మార్పుతో ఒక రంగము నాటకముగా వ్రాయబడినది అద్దంకి ప్రభువయిన మహారాష్ట్ర సారంగుడికిన్ని, నెల్లూరి ప్రభువయిన మనుమసిద్ధికిన్ని జరిగిన యుద్ధములో మనుమసిద్ధికి సంపూర్ణ విజయము కలిగినదిగాని తిక్కన తండ్రియున్ను, సర్వసేనాధ్యక్షుడును, గుంటూరి దండనాథుడును అయిన కొమ్మన్న యుద్ధములో చనిపోయినాడు ఈ సమాచారము దళపతులలో నొకడును, కొమ్మన శిష్యుడును, భావి జీవితములో మార్కండేయ పురాణకర్తయును అయిన మారన్న కొమ్మన్న భార్య అయిన అన్నమాంబకు తెలుపుటకై పంపబడ్డాడు ఆ సందర్భమునే ఈ నాటిక వివరించుచున్నది

[పాత గుంటూరులో కొమ్మనదండనాథుని గృహము చిన కొమ్మన్న, మారన్నల ప్రవేశము]

చిన్నకొమ్మన్న—ఏమి మారన్నా, అప్పుడే వచ్చావు? యుద్ధానికి పోలా?

మారన్న—(వంచిన తల ఎత్తకుండా) పోయే వచ్చారా.

కొమ్మన్న—మరి యుద్ధం చేశావా?

మారన్న—(తలఎత్తి) చేశాను

కొమ్మన—ఎవరినైనా పొడిచావా? నీవు పొడవకపోతే మానె, నిన్నెవరైనా పొడిచారా? (బాగా పరికించి) ఏదీ, ఎక్కడా కత్తి గీచుకొనిపోయినట్లుగానైనా లేదే?

మారన్న—(కొమ్మనను భుజముమీద తట్టుతూ) తీవ్రయుద్ధమే జరిగింది లేరా

కొమ్మన—(ఎగతాళిగా) యుద్ధం జరిగి ఉంటుందిలే నీవు కూడా కాస్త (తన బుజము చూపి) బుజమేశావా?

మారన్న—(కొద్ది విసుగుతో) పోట్లాడాములే, ఉండరా (ఖిన్న ముఖముపెట్టును.)

కొమ్మన—ఏం, మొగ మట్లాఉంది? మొదట బర్రట్లాడుతూ పోతివి—పారిపోయి వచ్చావా? (సాటోపంగా ఎగాదిగా చూస్తాడు) సేనాపతిగారు మిమ్మల్నందరినీ కవ్వించి పురికొల్పంగనే, ఉస్కో అంటే ఉస్కో అని వెనక్కి పిక్కబలం జూపావా? భేరీ మోగంగానే భయపడి వచ్చిన రకంలాగ కనపడుతుందే! యుద్ధంలోనుంచి పారిపోయి వచ్చిన వాండ్లకు ఎఱ్ఱి చెరువు గట్టున మఱ్ఱిచెట్టుక్రింద మెడకు ఉచ్చు తగిలిస్తారు జాగ్రత్త!

మారన్న—ఒరే కొమ్మన్నా! నీ వాగుడు కాస్త కట్టిపెట్టు మామ్మగా రెక్కడున్నారు?

కొమ్మన— (ఔత్సుక్యముతో) ఏవీ, యుద్ధపు సంగతులు చెప్పు.

మారన్న—చెపుతా లే మామ్మగా రెక్కడున్నారు ?

కొమ్మన—నాయనమ్మ వస్తే చెపుతావా? గౌరీపూజ చేసుకుంటున్నారు ఇవాళ ఉపవాసం అరుగో వస్తున్నారు (ఎదురుగా నడుస్తూ) నాయనమ్మా! మారన్న యుద్ధానికిపోయి వచ్చాడు వార్తలు చెపుతాట్ట దబ్బున రా.

మారన్న—అమ్మా! నమస్కారము.

అన్నమాంబ—ఎప్పుడు వచ్చావు మారన్నా!

మారన్న—ఇప్పుడే వస్తున్నాను తల్లీ!

అన్నమాంబ—ఎక్కడనుంచి?

మారన్న—ఒంగోలునుంచి! రణరంగంనుంచి తల్లీ

అన్నమ్మ—యుద్ధానికి తారసిల్లారా రెండు పక్షాలూ?

మారన్న—యుద్ధం పూర్తిఅయి మనకు సంపూర్ణ విజయం కలిగింది తల్లీ.

అన్నమ్మ—విక్రమసింహపుర సేనలు వచ్చి కలుసుకున్నవా ?

మారన్న—అవి రాకముందే మన ఒక్క గుంటూరుసేనే కదిసింది మన అశ్విక దళం వీరవిహారం చేసి—

అన్నమ్మ—(సంతోషంతో మెడ పొడిగించి) ఒక్క మీ తాతయ్యగారి సేనకే యావత్తు విజయమూ చెందుతుం దన్నమాట ఈసారి మరీ యుద్ధానికి పోవడమంటే స్వర్గానికి పోతున్నంత ఉత్సాహపడ్డారు

మారన్న—(చకితుడై) ఆదేమి తల్లీ అల్లా అంటిరి?

అన్నమ్మ—(పూర్వభావ ఉద్ఘాట్య కంఠముతో) అశ్లీలం ధ్వనించిందా ? పర్వాలేదు లే (ఇష్టగోష్ఠి ధ్వనితో) అంతా బాగున్నారా?

మారన్న—(తలవంచి) అంతా ఎట్లా బాగుంటారు తల్లీ!

అన్నమ్మ—అవును యుద్ధం గదా! పాపం! పదాతులే ఎక్కువ పోతారు సేనాపతులు వెనుక దూరంగా ఉంటారు గనుక వారికి అపాయం తక్కువ

మారన్న—(భావగర్భితంగా) వాండ్లుకూడ కొందరు పోతారు తల్లీ!

అన్నమ్మ—(ఆకాంక్షా స్ఫూర్తితో) కేతన కులాసాగా ఉన్నాడా?

మారన్న—ఉన్నాడు తల్లీ! సైన్యంతో వస్తాడు

అన్నమ్మ—దళపతులు కూడ దెబ్బతింటారు జనంలో ఉంటారు గనుక సేనాపతులు ఎవరు పోయినారు? అల్లాడమంత్రి కులాసాగా ఉన్నాడా? తాతగారికి క్షేమమా?

మారన్న—అల్లాడి కులాసాగానే ఉన్నాడు తల్లీ !

అన్నమ్మ—(ఆతురతతో) మరి తాతగారు?

మారన్న—తాతగారా తల్లీ!

అన్నమ్మ—(ఆవేగంతో) అవును తాతగారు ఏమిటి సందేహము?

మారన్న—(కళ్లనీరు కారుస్తూ) తలవంచి, లేరు తల్లీ!

అన్నమ్మ—లేనేలేరా?

మారన్న—లేరు తల్లీ, లేరు. యశఃకాయమాత్రం ఉంది.

అన్నమ్మ—(కంట తడి అపుకుంటూ) ఏం జరిగిందేమిటి?

మారన్న—(వీరోత్సాహంతో) తన అయిదు వందల అశ్విక దళంతో పది వేల సైన్యంపైబడి అతిభయంకరంగా ఒక జాము వీరవిహారంచేసి కఱకుటమ్ములతో పెక్కుమంది దళపతుల ప్రాణవాయువులు హరించి చివరకు సారంగుని వెన్నంటి అర్ధచంద్ర బాణప్రయోగంచేసి సారంగుని దక్షిణ బాహువును సకవచంగా ఛేదించి కొమ్మనభానుడు అస్తమించాడు తల్లీ! (అని తలవంచుకొనును )

అన్నమ్మ—(ఉత్సాహం అణచుకొని) నా నాథుని వీరకథాకథనముతో నా చెవులకు విందు చేశావోయి మారన్నా! నా నాథుని వైదిక ఇజ్యా మంత్రరవమును, ధనుర్జ్యాసవారవమును నా చెవుల మ్రోగుతున్నవోయి నా నాథుడు యుద్ధానికి బయలుదేరేముందు నామీది అపార ప్రేమచే నాకు బహూకరించిన దివ్య ధీర రూపప్రదర్శనమును మరిచిపోలేనోయి. నా మనఃఫలకంపై చిత్రించుకున్నాను అనంతకాలమూ ఆ రూపాన్ని అట్లే పట్టిఉంచుకుంటాను మారన్నా!

కొమ్మన—(ఆశ్చర్యంగా వింటూ) అయితే, తాతయ్యగారు యుద్ధంలో చనిపోయినారా బామ్మా?

అన్నమ్మ—అవును, పోయినారోయి

కొమ్మన—మనము ఏడవకూడదు గాదూ బామ్మా?

అన్నమ్మ—కూడదు బాబూ!

కొమ్మన్న—(మొగముమీద దృష్టి నిలిపి) నువ్వు కూడా ఏడువబోకు బామ్మా! తాతయ్యకు వీరస్వర్గము రాదు మనము యేడుస్తే.

అన్నమ్మ—(దుఃఖము బిగబట్టుకొని) ఏడువనులే బాబూ! (మారన్నతో) మారన్నా! నన్ను నెమ్మదిగా గౌరీమందిరంలోకి తీసికొనిపో బాబును అటూ, ఇటూ తీసుకొనిపోయి వాడివాండ్లు వచ్చేవరకు ఏమదాయించి కనిపెట్టి ఉండు

మారన్న—తల్లీ! ఇటు ఇటు

అన్నమ్మ—(కాళ్లు తడబడుతూ కొద్ది దూరం అతను దారి చూపిస్తూంటే నడుస్తుంది)

మారన్న—ఇదిగో గౌరీ మందిరం

అన్నమ్మ—నేను ఇక్కడ కూర్చుంటాను ఇక నన్ను పలకరింపవద్దు తలుపు దగ్గరదోసి పో.

మారన్న—అట్లాగే తల్లీ! (తలుపు వేసి) ఒరే బాబూ, కొమ్మన్నా, రా (చెయ్యి పట్టుకొని కొంతదూరం నడిపించును)

కొమ్మన్న—ఇక్కడ కూర్చుందాం నాకు యుద్ధపు సంగతులన్నీ చెప్పు

(ఇద్దరూ కూర్చుంటారు)

మారన్న—చెప్పనా? భయపడవు గదా?

కొమ్మన్న—నాకా భయము? సంగతులన్నీ చెప్పాలె తాతయ్య ఏం చేశాడేమిటె, వెళ్ళగానే?

మారన్న—తాతయ్య అశ్వికదళాన్ని రెండుగా చేశాడురా ముందు మధ్యలో తాను రంగరాట్టుమీద నిలవబడ్డాడు చేతులో ధనుస్సు సంధించి

కొమ్మన్న—సారంగుడో మరి?

మారన్న—అతనూ సైన్యాన్ని రెండు భాగాలు చేశాడు మధ్యలో తానూ ఇంద్ర నీలంమీద నిలువబడ్డాడు.

కొమ్మన—తరువాత?

మారన్న—తరువాత తాతయ్య కుడివైపు బలాన్ని కదిపాడు

కొమ్మన—ఇద్దరూ ఎదురుమళ్ల విలిపారు గదా బలాన్ని, సారంగుడు తన కుడి వైపు బలాన్ని కదపలా?

మారన్న—(మెచ్చుకుంటూ) నీకు యుద్ధం ఎట్లా నడుస్తుందో తెలుసురా?

కొమ్మన—నే జెప్పింది సరేనా?

మారన్న—సరే

కొమ్మన—నన్ను సైన్యంలో చేర్చుకోమంటే మొన్న తాతయ్య 'నువ్వు చిన్నవాడి' వన్నాడు లేకపోతే నేను కూడా రణరంగానికి రాకపోయినానా? ఆఁ—తరువాత ఏమి జరిగింది?

మారన్న—తాతయ్య ఎడమవైపు బలాన్ని కొద్దిగా ముందుకు నడిపాడు సారంగుడి బలం రెండడుగులు వెనుకకు వేసింది

కొమ్మన—మన కుడివైపు బలం ఏం జేసింది

మారన్న—అకస్మాత్తుగా ఒక పెట్టున శత్రు సైన్యంమీద పడ్డది. సారంగుడి ఎడమ బలమూ, మన బలమూ కదిశాయి.

కొమ్మన్న—అప్పుడే సరైన యుద్ధం మొదలన్నమాట ఆఁ.

మారన్న—తాతయ్య అల్లెతాడు ఖంగున మోగించాడు

కొమ్మన—సారంగు డేమి చేస్తున్నాడు? బాణ ప్రయోగం చెయ్యలేదా?

మారన్న—చేశాడు దాన్ని తాతయ్య మధ్యలోనే తుంచేశాడు.

కొమ్మన—బలే! అన్నీ మధ్యలో విరుగగొట్టాడుగా?

మారన్న—ఆఁ కొట్టేశాడు సారంగుడుమాత్రం వూరుకున్నాడా? . . బాబూ! అరుగోరా, బళ్ళమీద మీ అమ్మగారూ, దొడ్డ బామ్మగారూ వచ్చినట్లున్నారు పో, తీసుకురా.

(ప్రవేశము సీతమ్మ, ప్రోలమ్మ)

కొమ్మన—(పరుగెత్తుకుంటూపోయి సీతమ్మ ప్రక్కన నిలువబడి వాండ్లను నడిపించుకొని వస్తాడు)

సీతమ్మ—(పరికించి) దివాణమంతా చిన్నబోయి ఉంది.

ప్రోలమ్మ—అంత పరివారం గదా! అడుగో మిగిలాడు-కోనగావలి—దివాణంవూడ్చే ముసలి బయ్యన్న కాస్త పనికివచ్చే వాండ్లంతా యుద్ధానికి పోయినారు (కంటికి చేయి అడ్డం పెట్టుకొని చూచి) అడుగో మారన్న నీవు పోలే యుద్ధానికి?

మారన్న—పోయివచ్చాను తల్లీ!

ప్రోలమ్మ—అట్లాగా? అమ్మా యెక్కడ?

మారన్న—గౌరీ మందిరంలో ఉన్నారు.

ప్రోలమ్మ—పద.

సీతమ్మ—అత్తయ్య మొగం ఎట్లా చూడడం అత్తయ్యా!

ప్రోలమ్మ—ఏమి చేస్తామే తల్లీ! మన చేతనయినపనా? అన్నా, అన్నా!

రెంటాల వేంకటసుబ్బారావుపంతులుగారు బి ఎ, బి ఎల్

వీరి కాంగ్లేయాంధ్రభాషలయం దసర్గళపాండిత్యము గలదు వీరాంగ్లేయాంధ్ర భాషలయం దనేక గ్రంథములను రచించినారు సుప్రసిద్ధ మహాకవియగు షేక్స్పియరు కవిహృదయరహస్యములను గ్రంథరూపముగ వ్రాసి యాంధ్రులకు కీర్తిదెచ్చి వారు వీరు స్వతంత్రజీవనప్రియులు ద్రవ్యార్జనోపాయము లనేకములు వీరికి బాగుగా దెలియును. సౌహార్ద్రహృదయముతో బంధువులకు, మిత్రులకు, విద్యార్థులకు ధనసహాయము చేయుచుందురు పంతుగారాంధ్రులో విఖ్యాత పురుషులు,

[1910 సాధారణ సంవత్సరాదిసంచికనుండి]

---

సీతమ్మ—(దగ్గరకుబోయి మొగముమీద చేయిబట్టి నిమురుతూ) అత్తయ్యా! ఇదేమిటి మొగమంతా బిగుసుకపోయింది!

ప్రోలమ్మ—(ఒళ్లు పట్టి చూచి) ఒళ్లంతా అట్లాగే ఉంది మరణవార్త అకస్మాత్తుగా వినబట్టి నరాలన్నీ బిగబట్టి ఉంటవి మెల్లిగా వేళ్లతో ఒంటిమీద రాయండి. (కాసిని నీళ్లు మొగముమీద చిలకరించి) తల్లీ, అన్నా! కళ్లు తెరచి చూడు. నేను అక్కయ్యను. సీత చూడు, ఎట్లా దుఃఖపడుతున్నదో!

అన్నమ్మ—(కళ్లెత్తిచూచి, నెమ్మదిగా లేచి కూర్చున్నది దుఃఖము ఆపుకోలేక వెక్కుతూ 'అక్కయ్యా' అని కావలించుకున్నది)

కొమ్మన—బామ్మా! ఏడువకూడదు ఏడుస్తే తాతయ్యకు కష్టమవుతుంది.

ప్రోలమ్మ—(వీపు నిమురుతూ) ఎంత అణుచుకుందామన్నా ఆగదే తల్లీ! తలగాలిందే దుఃఖము, కడుపు కాలిందే దుఃఖమని ఆపితే ఆగేది కాదే తల్లీ!

సీతమ్మ—కళ్లెత్తిచూడు అత్తయ్యా. ఏదైనా మాట్లాడు నాతో నాకు భయంగా ఉంది అత్తయ్యా!

అన్నమ్మ—(కొద్దిగా తల యెత్తి, కండ్లు తెరచి) ఏముంది మాట్లాడడానికి? అంతా అయిపోయింది పెద్దవాడు వచ్చాడా?

సీతమ్మ—రాలే దింకా ఇప్పుడో, ఇంకాసేపటికో వస్తారనుకుంటున్నాము

అన్నమ్మ—రాంగానే చెప్పు అక్కయ్యా మన కీ రాత తప్పింది కాదు గదా!

ప్రోలమ్మ—తప్పదే తల్లీ! తప్పించుకోవడం మనవశమా! అమ్మా! ఇంత పసుపూ కుంకుమాతో వెళ్లిపోయే వ్రాత మనకు వ్రాయలేదు అదే పుణ్యవతులకో?

సీతమ్మ—అరుగో మీ పెద్దబ్బాయి వస్తున్నారు అత్తయ్యా!

అన్నమ్మ—వచ్చాడా నా తండ్రి?

సీతమ్మ—ఆఁ, వచ్చారు ముంగిట వున్నారు.

కొమ్మన—(గంతువేసి ముందుగా పోయినాడు)

(ప్రవేశము మనుమసిద్ధి, తిక్కన, కొమ్మన)

కొమ్మన—(దగ్గరకుపోయి) నాన్నా, తాతయ్యగారు వీరవిహారం చేసి వీరస్వర్గానికి వెళ్లారుట గాదూ?

తిక్కన—ఎవరు చెప్పారు బాబూ?

కొమ్మన—మారన్న చెప్పాడు అవునా?

తిక్కన—అవును బాబూ!

రాజు—(చిరునవ్వుతో) ఎవరండీ పిల్లపిడుగు?

తిక్కన—చిన్న కొమ్మన్నండి. బాబూ! వీరు మన రాజుగారు. వీరికి నమస్కారం చెయ్యి.

# ది ఆంధ్ర కో-ఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్,
# హైదరాబాద్.

*ఆంధ్ర ప్రజలకు 51 సంవత్సరములుగా దైనందిన వార్తలందించుచూ సేవచేయుచున్న* ఆంధ్రపత్రిక *వారి స్వర్ణోత్సవ శుభసమయమున*

మా అభినందనలు



**1965-1966** సంవత్సరములో

(1) 2,00,000 టన్నుల ధాన్య సేకరణ మరియు సరఫరా,

(2) 100 బియ్యం మిల్లుల నిర్మాణము,

(3) 15,000 టన్నుల శనగలు మరియు శనగపప్పుల సేకరణ మరియు సరఫరా,

*చేసి ఉత్పత్తిదారులకు మరియు వినిమయదారులకు సేవచేయుటకు ఈ ప్రముఖ సొసైటీవారుకూడ అంకితం చేసుకొంటున్నారు.*

పరిశ్రమలకు మరియు వ్యవసాయమునకు సహాయముచేయు మా ఉద్యమములో సహకరించుటకు ట్రాక్టర్లు, ఆయిల్ యింజన్లు, ఎలెక్ట్రిక్ మోటార్లు, స్ప్రేయర్లు, ట్రక్కులు వగైరాలు తయారు చేయువారు మాసంస్థద్వారా పంపకమునకు మాతో సంప్రదించ కోరుచున్నాము.

*తంతి :* "COMARK" *ఫోన్ : 34906*

కె. విజయభాస్కరరెడ్డి,

ప్రెసిడెంటు.

పోలమ్మ—(వీరపద్ధతిని నమస్కరించి, వీర వైఖరితో నిలబడుతారు)
రాజు—(వీరపద్ధతిని ప్రతి నమస్కారం చేశాడు)
కొమ్మన—(వెనుకడుగువేసి ప్రక్కకు తప్పుకుంటాడు)
రాజు—ఆంధ్రజాతి అంతా ఇలా తయారైతే?
తిక్కన—శ్రీ గణపతిదేవ చక్రవర్తి, శ్రీ శివదేవ మహామంత్రి ఈ కలలే కంటున్నారు
రాజు—దేశం ఉత్సాహంతో పొంగిపోతున్నది
తిక్కన—తమరిప్పటికైనా గ్రహించారు సంతోషమే
రాజు—(నాలుగడుగులు వేసి, విచారములో నిలబడుతాడు)
తిక్కన—ఏమిటి ఆలోచిస్తున్నారు?
రాజు—నా గుండె దడదడలాడుతున్నది
తిక్కన—గుర్తించాను దీర్ఘప్రయాణం చేశారు అది కొంచెము బడలిక యంతవు కూడాను
రాజు—అందుకు కాదు నేను అన్నమాంబగారి ఎదుట పడటానికి భయపడుతున్నాను దుఃఖము పట్టలేక ఏమి తీవ్రంగా మాట్లాడతారో!
తిక్కన—అమ్మగారి తండ్రి సూరన్నసోమయాజులు శాపచాపముల రెంటిని సమాన ప్రతిభతో వర్తింపచేశారు ఆమె వీరపత్ని (నవ్వుతూ) వీరమాత కూడాను ఈ చిన్న కొమ్మన్నది ఆమె తీర్పు ఈ సంగడములో అయిదు తరములనుండి మా కత్తికీ, ఘంటానికీ సీరంధార లేదు
రాజు—మామా! క్షమించు నిమిషములో వీరరసం కురిపించావు ఇకమీద నీవు కత్తిని ఒరలోబెట్టి ఘంటాన్ని బయటికిలాగి ఆంధ్రావనిని సర్వతోముఖంగా విజృంభింపజేస్తూ కవిబ్రహ్మవై ఆంధ్రజాతిని సృష్టింతువుగాని
తిక్కన—తమరు సిద్ధ సంకల్పులు కదా!
(రాజు, తిక్కన గారి మందిరములోకి వస్తారు ప్రోలమ్మ, సీతమ్మ నిష్క్రమిస్తారు.)
రాజు—అమ్మా! నమస్కారము
తిక్కన—అమ్మా! మన రాజుగారు
అన్నమ్మ—విజయవార్తలు విన్నాను వారు ప్రభువువారి సేవలో అర్ధశతాబ్దము ప్రశంసాపాత్రంగా వర్తించి చివరకు వారి సేవలోనే వీరమరణము గాంచి ధన్యులైనారు అని నా వాక్యములుగా వారితో మనవి చేయనోయి
రాజు—మా రాజకుటుంబము మీ మంత్రి కుటుంబానికి మూడు తరములనుంచి ఎంతో ఋణపడి యున్నది
అన్నమ్మ—ఈ పిల్లవాడిని కనిపెట్టి ఉండండి
రాజు—నాకు మంత్రి, సోదరుడు, తండ్రి, గురువు కూడా ఈ పిల్లవాడే.
అన్నమ్మ—చిత్తము ఇంతవరకూ మీ మా కుటుంబములకు అట్టి సంబంధమే ఉన్నది మీ క్షేమమే మా క్షేమము
నాయనా! నేను ఈ వార్త విని నీ కోసమే కని పెట్టుకొని ఉన్నాను సహగమనానికి నీవు ఏర్పాటు చేయించు.
తిక్కన—(కన్నీటితో) అమ్మా! నన్నేమి చేసిపోతావు? నాన్న వియోగమే భరించలేకుండా ఉన్నాను
అన్నమ్మ—అందరికీ భగవానుడే రక్షకుడు నీకూ అతడే భర్త పురుషుడు, భార్య ప్రకృతి పార్వతీ పరమేశ్వర దాంపత్యమే మన వంశమునకు ఆదర్శము. పురుషుడు పోయిన తరవాత జడస్వరూపమయిన స్త్రీ జీవితము నిరర్థకము
తిక్కన—"ఆత్మా వై పుత్రనామాసి" అని పుత్రుడు లేనప్పుడే శాస్త్రాలు సహగమనాన్ని అంగీకరించినవి తల్లీ!
అన్నమ్మ—పురాణదృష్టాంతములనుబట్టి ఆచారము భిన్నము భిన్నముగా నున్నదోయి
తిక్కన—ఆచారమునకు శాస్త్రాధారము లేదు తల్లీ ఇంకొక విషయము కూడ నీవు మన్నించవలసియున్నది తండ్రిగారు మరణ సమయములో నీవు సహగమనం చేయవద్దని, తన ఈ కడసారి కోరికను మన్నించవలసినదని గట్టిగా చెప్పినారట దొడ్డనాన్నగారు కూడ అటులనే తమ కోరికను వెల్లడించారు దొడ్డమ్మగారు కూడ దానిని మన్నించారు.
అన్నమ్మ—ఇది వాస్తవమా?
తిక్కన—నీ పాదాల సాక్షిగా మనవి చేస్తున్నాను.
కొమ్మన—ఎందుకు నాన్నా, మీరు ఇంత వద్దని బలవంత పెడతారు?
తిక్కన—(నిర్ఘాంతపోయి, మళ్లీ సర్దుకొని) బాబూ! తాతగారి ఆజ్ఞోయి యిది
కొమ్మన—అయితే సరే
రాజు—(కుర్రవాడిమీద చేయివేసి) భేష్! బాగుంది
అన్నమ్మ—అక్కయ్యా! నీ వేమంటావు?
ప్రోలమ్మ—నేను కొండంత ప్రభువును పోగొట్టుకొని ఒడములాగ నిత్యకృత్యాలు మింగుతూ రోజులు లెక్కబెట్టుకుంటూ జీవించడం వారి ఆజ్ఞచేతనేనే నీవు కూడా తపస్సు చేసుకుంటూ ఉండు తల్లీ!
అన్నమ్మ—సరే ఇక నిత్యకర్మకు ఏర్పాటు చేసుకోండి
తిక్కన—ప్రభూ! సెలవా యికను?
రాజు—అమ్మా! సెలవు
అన్నమ్మ—చిత్తము (అందరూ నిష్క్రమింతురు.)

# అన్నమాంబ

## శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

### [1946 వ్యయ సంవత్సరాదిసంచికనుండి]

కొమ్మనదండనాథుడు—తిక్కన తండ్రి నెల్లూరు ప్రభువగు మనుమసిద్ధి పాలనలో గుంటూరికి దండనాథుడు మహాపండితుడు అధ్యయనపరుడు వీరుడు సారంగునితో మనుమద్ధికి ఒంగోలులో జరిగిన యుద్ధములో సేనాపతిగా ఉండి విజయముగాంచి వీరమరణమును బొందినాడు.

అన్నమాంబ—కొమ్మనదండనాథుని భార్య, తిక్కనతల్లి
సీతమ్మ—తిక్కన భార్య
దోహత్తనారాయణ—ఖడ్గ తిక్కన తమ్ముడు; కొమ్మన శిష్యుడు
అన్నయమంత్రి—వరంగలు నుంచి వచ్చిన రాయబారి

ఆవేళ ఎవరెవరో ఎందరెందరో అన్నమాంబ మొగం చూడడంకోసం వస్తున్నారు సీతమ్మ కాపురానికి వచ్చిన కొత్తలో అన్నమాంబకు పెండ్లికి వచ్చిన ఒక్క ఆడపిల్లాపోయింది సీతమ్మ "అత్తయ్యా—అత్తయ్యా" అంటూ తలలో నాలుకలాగు వదలకుండా వెంటదిరుగుతూ పుత్రికా శోకాన్ని మరిపించింది చూచినవాండ్లు తల్లీ, పిల్లా అనుకుంటారుగాని అత్తా, కోడలూ అని అనుకోరు తిక్కనకు నెల్లూరిలో ఉద్యోగమయిన కొత్తలో ఒక్కని పెదరి అత్తవారింటికి పోయినట్టుగా గుంటూరునుంచి నెల్లూరు పోయింది సంవత్సరానికి ఒక పర్యాయమైనా తల్లిని చూడడానికి పోకపోయినా మర్లుబుట్టి అట్లు అత్తా, కోడలూ ఒకరి నొకరు చూచుకోకుండా ఉండలేకపోయేవారు సీతమ్మ తల్లి "నా బిడ్డకు మందుపెట్టి నాకు గాకుండా చేసిం"దని వియ్యపురాలిని హాస్యమాడేది ఈసారి వచ్చినప్పటినుంచీ అత్తను నిమిషము ఎదిరి పెట్టకుండా పక్కలోనే, మీద చేయివేసుకొని [illegible] ఎక్కన కూర్చొని, మొగమువంక చూస్తూ, ఏకధారగా కండ్లనీరు కారుస్తూ కూర్చున్నది

అన్నమాంబ—అదేమిటే పిచ్చిపిల్లా! ఒక్కతెవూ యిట్లా కండ్లనీళ్ళు పెట్టుకుంటూ కూర్చుంటావు కండ్లకు అవరోధము గాదూ?

"నీ పునిస్త్రీత్వము ఈ [illegible] అత్తయ్యా" అని సీతమ్మ పెద్ద పెట్టున ఏడ్చింది

అంతలోకే తిక్కనా, దోహత్త నారాయణా గదిలోకి వచ్చారు

అన్నమాంబ—నాయనా వచ్చావుటరా దోహత్తా! నీకు అందరికంటె రెట్టింపు పాఠాలు తీసుకొని ఎక్కడా నిట్లు పోకుండా ఒప్పచెప్పుతుంటే మురుసుకొనేవారు అనధ్యయనపు రోజుల్లో గూడా ఏవో పాఠాలిస్తుంటే 'విశ్రాంతి లేకపోతే వాడికి జబ్బు చేయదా?' అని నేనంటే, 'వాడి'కేమీ జబ్బుచేయదు అట్లా అనబోక. నిజంగా జబ్బు చేస్తుంది' అనేవారు పాఠాలు చెప్పడమంటే అలుపు ఎన్నడూలేదు ఇక్కడికి యాభై యేండ్లనుంచి విధి విరామం లేకుండా ఒక్క తీరున పాఠాలు చెప్పిన నోరు మూతబడ్డది ఆ చదువుకొన్న చదువంతా ఏ పెట్టెపాలయిందో!

కడపటిమాట తిక్కనకు ములుకై తాకింది దోహత్త తిక్కన మొగం చూచాడు తండ్రి మరణమువలన సృష్టి విధానమును గూర్చిన అతని విశ్వాసము ఎన్నిటికో పాదు కదిలిందని యెరుగడు

తిక్కన—ఒరే నారాయణా! మత సిద్ధాంతములను గూర్చి నాన్నగారు తరచుగ వెల్లడిచేస్తూ వచ్చిన అభిప్రాయాలు కొన్ని నాకు కొత్తగా కనబడేవి మీరిద్దరూ ఏకీభవిస్తుండేవాండ్లు ఈ పది రోజులలో నా యభిప్రాయాలతో నా తలవెంట్రుకలన్నీ మార్పులు వచ్చినవి ఏదో సందేహం కలగడం, నివర్తి కావడం దానంతట అదే అవుతున్నది

---

ఇది 'తిక్కన' అనుపేర శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు వ్రాసియుండు నవలలో 5, 6 అధ్యాయముల గ్రంథము

[illegible] చెప్పాడు ఎవా [illegible]

[illegible]

దౌహిత్త్రు—[illegible] ప్రతిబింబించి ఉంటాడు

తిక్కన—[illegible] చెప్పినవి?

దౌహిత్త్రు—[illegible] ఉంటిరే [illegible] వస్తుంది లేడి [illegible] వస్తుంది

తిక్కన—[illegible] చేస్తుంది

దౌహిత్త్రు—[illegible] చేస్తాడు

తిక్కన—కాళ్యరూపిణియై [illegible] చేస్తుంది

దౌహిత్త్రు—[illegible] లేకుండానా?

తిక్కన—[illegible] ద్రష్టగా ఉంటాడు [illegible] సృష్టి అయిపోతూ ఉంటుంది

దౌహిత్త్రు—[illegible] చూస్తూవుండకపోతేనో?

తిక్కన—[illegible] ఆగుతుంది

దౌహిత్త్రు—మీరు రోజా మామిడిచెట్టువంక చూస్తున్నారు అది పెరుగుతున్నది పరబ్రహ్మముకూడా చూస్తూఉన్నాడు అది పెరుగుతున్నది రెండుచూపులూ ఒకటేనా?

తిక్కన—[illegible] పట్టి చూపు

దౌహిత్త్రు—మీరు కండ్లు [illegible] చూచినా అది పెరగడంలేదు పరబ్రహ్మ [illegible] లేకుండా చూచినా అది పెరుగుతున్నది

తిక్కన—[illegible] చూస్తున్నాడని ధాతువుకు చేస్తున్నాడనే అర్థము

దౌహిత్త్రు—చేస్తున్నాడని అనకుండా ద్రష్ట అని ఇంకొకమాట ఉపయోగించి [illegible] చేసినట్లు అర్థంకాదు నా ఉద్దేశములో గౌడపాదుని అజ్ఞాతవాదానికి [illegible] ఒక వస్తువును చేయడమంటే రోట్లో వేసి దంచి చేస్తేనే చేయడంగాదు [illegible] చేసినట్లే ద్రష్టగా ఉండి చేయడం చేసే విధములలో భేదం

తిక్కన—శక్తి చేస్తుంది

దౌహిత్త్రు—ఎవరి శక్తి?

తిక్కన—శక్తికలవాడిది

దౌహిత్త్రు—[illegible] దెవరు? పరమాత్మే శక్తుడయితే శక్తి చేసిందన్నా, పరమాత్మ చేశాడన్నా ఒకటే

ఇటువంటి వాదములోకి దిగితే దౌహిత్త్రు తక్కిన విషయాలు మరచిపోతాడని తిక్కనకు తెలుసు [illegible] ఆవారినే కొంతసేపు పోయినాడు అక్కడ తిప్పుకొని తల్లి వంక తిరిగి 'అమ్మా' అని పిలిచాడు

అన్న—[illegible] మీ నాన్నగారి మాటలు వింటూ ఉన్నట్లున్నది

తిక్కన—ఈ భావాల్ని వారివే వారికి నూతన భావాలు స్థిరపడి వెల్లడించేటప్పటికి [illegible] వెళ్ళిపోయినాను బాగా ముమ్మరపు రోజులలో వీ డాయన దగ్గర [illegible] చేసుకున్నాడు వీడు మొదటినుంచీ కూడా తిక్కతర్కాలు చేస్తూనే ఉండే [illegible] ఇప్పుడు [illegible] శ్రాంతి అంటాడు మమ్ముని వాదములో నెలకట్టనీయడు

అన్న—వాడికి [illegible] మంచి ఉద్యోగము కూడ దొరికింది దేవుడిచ్చిన ఆయువు తిన్నగావుంటే వాడే ప్రభువు ఉవుతాడు

దౌహిత్త్రు—చిన్నమ్మా—ఇదంతా నీచలవేనే

అన్న—కానిమ్మా నాయనా! నా కథ ముగిసింది కదా ఇక రోజులు లెక్కబెట్టుకుంటూ కాలంకోసం కనిపెట్టుకొని ఉంటా

దౌహిత్త్రు—చిన్నమ్మా! నీవు పండిపోయినావే

అన్న—ఇక ఎండి రాలుతాను

తిక్కన విభ్రమపడి వింటున్నాడు పండి, ఎండి, రాలడమనే మాటలు అనేకభావాలు తోపిస్తూ మనస్సును తొలుస్తున్నవి

తిక్కన—అమ్మా! ఇవ్వాళ పదవరోజు జరుగవలసిన పనేమిటి?

అన్న—(కొంతసే పాలోచించి) మీ రిద్దరూ కూడ ఇక్కడే ఉన్నారు. నాకు మీ నాన్నగారు పోయినారనే భావమేలేదు సహగమనము చేయవలెనని అప్పుడు తోచింది గాని అంత తీవ్రత ఇప్పుడులేదు భగవానుని అర్ధనారీశ్వరత్వం తరుచుగా గుప్తికి వస్తున్నది. భార్యా భర్తలు రెండు వ్యక్తులుగారు. మానవునియొక్క కుడిభాగము పాదరస పదార్థము, ఎడమభాగము గంధక ద్రవ్యము పురుష స్త్రీ సమ్మేళనములో ఏ ద్రవ్యము బలవత్తరమో ఆ రూపము సువ్యక్తమవుతుంది ఏక వ్యక్తి ముఖద్వయముతో జన్మించి మార్గద్వయమున ఆత్మోపలబ్ధిని బొంది పూర్ణత్వమును బొందుతుంది వీటికి పూర్తిగా ఎడబాటులేదు ఉభయులును స్థూల శరీరములలోనే ఉండవలసిన అవసరములేదు ఆ రూపము యొక్క ఛాయే నేను నే నెల్లప్పుడును సువాసినినే వైధవ్యమే లేదు నాకు

తిక్కన—నా కందలేదే తల్లీ నీ పున్నత భావాలు!

అన్న—పురుషునికీ, ప్రకృతికీ సత్యత్వములో తేడా ఉండవచ్చునుగాని నిత్యత్వములో లేదు గదా

తిక్కన—అవును.

అన్న—సదవత్తులకు ఎడబాటు ఎక్కడ వున్నది?

దౌహిత్త్రు—సాంఖ్యదృష్టిలో చూచినా లేదు వేదాంత దృష్టితో చూచినా లేదు




# ముక్కు దిబ్బడివేస్తుంది ఎందుకు?

చలిగాలి మీ వ్యాధి నిరోధక శక్తిని తగ్గిస్తుంది ముక్కు లోపలి చర్మంలోని వ్యాధి నిరోధకాలన్నీ నీరసించి పోతాయి సాధారణ జలుబులకు మూలకారణ మనబడే విషక్రిములు నాశికా నిరోధకాలను దాటి ముక్కు లోపలి చర్మాన్ని ప్రకోపింపజేసి శ్లేష్మ ద్రవాన్ని ఎక్కువగా జనింపజేయడంవల్ల ముక్కు ఓడుతూ ఉంటుంది కాని మీరు బాధపడవలసిందేనా? సాధారణ జలుబులకు నివారణ ఇంకా కనిపెట్టలేదు. కనీసం మీరు చేయగలిగిందేమంటే చలిగాలి తగలకుండా వెచ్చని దుస్తులు వేసుకొని జలుబును ఎక్కువచేసే దుమ్ము, చలిగాలి తగలకుండా పూర్తిగా విశ్రమించడమే. ఏది ఎలాఉన్నా, పడిశం జలుబు ఉన్నప్పటికీ, ముక్కు దిబ్బడను పోగొట్టుకోవచ్చు. నాసల్-సైనస్ డీ-కన్‌జస్టెంట్ అమృతాంజన్ లిమిటెడ్‌వారి ఇన్‌హేలర్ త్వరగా గుణాన్నిచ్చే 'నాసల్-సైనస్ డీ-కన్‌జస్టెంట్' ముక్కు దిబ్బడను అమోఘంగా కుదిర్చే మందుల నన్నింటినీ కలిపి తయారు చేయబడినది ముక్కు దిబ్బడ తగ్గిపోయి హాయిగా గాలిని శ్వాసింపజేసి ప్రకోపించిన నాసికా ద్వారాలలోని చర్మానికి ఉపశమనం కలిగిస్తుంది అప్పుడప్పుడు అమృతాంజన్ లిమిటెడ్‌వారి ఇన్‌హేలర్ లోని శక్తివంతమైన మందులను పీల్చడంవల్ల హాయిగా ఉంటుంది. సరియైన జాగ్రత్త తీసుకుంటే జలుబు తగ్గిపోతుంది

చలికాలం తేమకి అమృతాంజన్ లిమిటెడ్‌వారి ఇన్‌హేలర్ అవసరానికి అందుబాటుగా ఉంచండి.

అమృతాంజన్ లిమిటెడ్‌వారి ఇన్‌హేలర్ - శీఘ్రంగా గుణాన్ని కలిగించే నాసల్-సైనస్ డి-కన్‌జస్టెంట్

అమృతాంజన్ లిమిటెడ్ మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ



JWT/AM/2810

[illegible]—[illegible]

[illegible]—[illegible]

[illegible]

[illegible]—[illegible]

[illegible]—[illegible]

తిక్కన—[illegible]

[illegible]—[illegible] మున్నదా?

తిక్కన—[illegible]?

[illegible]—[illegible]

అన్నపూర్ణమ్మ—(లోపలి నుంచి వినిపిస్తోంది)

"నేను అన్నపూర్ణను. [illegible] రావలె [illegible] నిలుచున్నాను. మీ యిద్దరి సంభాషణము విన్నాను. ఇక ఆగలేను. తలుపు తెరవండి. లోపలికి వస్తాను. నా అమ్మ దగ్గరకు నేనుమాత్ర మెందుకు రాకూడదు?"

తిక్కన తల్లివంక చూచాడు. ఆమెకు ఆక్షేపణ లేనట్లు తోచింది.

తిక్కన—అయ్యా! తమరు రావడాని కేమాక్షేపణ యున్నది? దయచేయండి లోపలికి.

అన్నయ్య—ధన్యోస్మి.

ఆవి లోపలికివచ్చి ఉత్తరీయము నడుముకు జుట్టుకొని అన్నపూర్ణకు సాష్టాంగ నమస్కారముచేసి చెంపలు వేసుకొని కూర్చున్నాడు.

తిక్కన—ఇంతవరకు సంభాషణంతా విన్నారు గనుక ఇక్కడినుంచే సాగిద్దాం.

అన్నయ్య—తమ ఎవరికో అనుమానమూ వారికేమి దౌహిత్రునకున్నారు.

అన్న—పరిపూర్ణులకు తలిదండ్రుల రాసిందముండదా?

దౌహిత్ర—ఉంటుంది. పిల్లలు వస్తే ఉండదు.

అన్న—ఒరే నారాయణా!......ఇప్పుడు దౌహిత్రుడు గనుకాలె. బాణాలు రెండు చేతులా విడిచి దౌహిత్రు డిరుడు సంపాదించావు. వాదములో గూడా అంతే నీవు. అయినా నేను ముదటి పేరుతోనే పిలుస్తాను.

సృష్టిలో చావులేదు. లయము లేనేలేదు. ఈ విశ్వ మాతాపితలు అంత తెలివితక్కువ వాండ్లూ, చేతగాని వాండ్లూకారు. అట్టి తెలివి తక్కువ పని చేయరు. సంపూర్ణదృష్టిలేక సృష్టిస్థితి లయము అని అనుకుంటాము. ఏమనుకున్నా గమ్యస్థానమువంక నడుస్తూనే ఉంటాము. మన అభిప్రాయాలనుబట్టి సృష్టిక్రమము మారదు. గమ్యస్థానము వంక నడుస్తూనే ఉంటాము పెట్టి పరుసన.

దౌహిత్ర—దీనివలన విశ్వపితలకు అనుభవ ముండదా?

అన్న—ఉంటుంది. ఆనందానుభవము. నీవే అంటివిగా!

తిక్కన—సృష్టి లేకుండా వారి కనుభవము రాదా!

అన్న—ఈ అనుభవము రాదు. అనుభవము లేకుండా ఏ అనుభవమూ రాదు. అది అనంభవము. స్వవచన వ్యాఘాతము.

తిక్కన—నిష్కామ కర్మ అయితేనో?

దౌహిత్ర—నిష్కామకర్మ విషయములో కోరికె లేదన్నారుగాని ఆనందమువల్ల అనుభవము లేదనలేదు.

అన్న—చాలా శాఖాచంక్రమణ మయింది. అసలు విషయానికి వత్తాము. నలుగురూ ఏమయినా అనుకుంటారేమోనని లోకాచారము జరుపుకొంటే జరుపుకోవచ్చును.

దౌహిత్ర—వపనము కర్మకాండలో భాగము కాదు. పూరిటియటికిపోయి మంగలికి తలయియ్యడం అసహ్యం.

తిక్కన—శ్రీమద్రామానుజులు వపనము చేయించుకొన్న స్త్రీని చూస్తే సచేల స్నానము చేయవలసిం దన్నారు.

అన్నయ్య—బసవేశ్వరులు కూడ అంగీకరించలేదు.

అన్న—ఊరిబయటికి పోకుండా యిక్కడే జరుపుకోవచ్చు. విశేష పర్వలేకుండా కానియ్యండి. నా భావములో నేను నిత్య సువాసినినే.

ముగ్గురూ బయటికి వస్తారు.

తల్లితో మాట్లాడి యివతలకు వచ్చిన తరువాత ఆమె వ్యక్తపరచిన పురుష ప్రకృతుల నిత్యదాంపత్య లీలాసిద్ధాంతము తన మనోనేత్రమునకు మఱుగుపడియున్న ఒకనూతన విజ్ఞాన ప్రపంచమునకు కవాటము బార్లా తెరచి ప్రదర్శించినట్లయింది. ఆ ప్రపంచానికి ఎటుచూచినా అంతు కనపడలేదు. "పాదోస్య విశ్వా భూతాని, త్రిపాద స్యామృతం దివి" అని పురుష సూక్తములో చెప్పినట్లు మూడు భాగములు యథాప్రకారముగానుండి నాలుగవ భాగము మాత్రము ఈ సమస్తమున్నైనది. "ఏతావా నస్య మహిమా"—ఇది ఆయన మహిమ. అని తనలో తాను పైకి వినబడేటట్లు అనుకుంటూ వస్తున్నాడు తిక్కన.

దౌహిత్ర—ఏమిటన్నయ్యా యోచిస్తున్నావు? చిన్నమ్మ చెప్పిన దానిమీదనేనా ఈ ఆలోచన?

అన్నయ్య—సృష్టి యావత్తూ పరమాత్మునియొక్క వ్యక్తఅర్ధనారీశ్వర రూపమే.

దౌహిత్ర—ఇది అంతయు ఆయనయొక్క మహిమ అని ఎందుకన్నారు?

అన్నపూర్ణాంబ—ఒరే నారాయణా! ఆ మాటలు ఇక్కడే మాట్లాడుకోరాదా? నేను కూడా వింటాను.

అన్నయ్య—అవును. వారి దగ్గరే మాట్లాడితే వారి సాయం కూడా కలిసివస్తుంది.

ముగ్గురూ మరల లోపలికిపోయి కూర్చున్నారు.

అన్నయ్య—దోహిత్రి ప్రశ్న కేమి జవాబు?

తిక్కన—ఏ హద్దులకూ లోబడనట్టియు, అమృత స్వరూపియునగు సద్వస్తువు ఇరుకులలో ఒదిగి కాలబద్ధమై జరామరణములకు లోనై యుండుటయే పరమాత్ముడు చేసిన మహాత్యాగము అందుచేతనే మానవుడు త్యాగము చేయలేక జీవింపగూడదని ఈశోపనిషత్తు చెప్పుచున్నది త్యాగమువల్లనే అమృతత్వము పొందుదురని "త్యాగే నైకేన" అను ప్రతిపిల్ల ప్రకటితమవుతున్నది ఈ త్యాగమే ఆయన మహిమ మానవుడు దాని ననుకరించవలెను

దోహిత్రి—ఎప్పుడు భోగిగాపుండి త్యాగి అయినాడని అర్థమా?

తిక్కన—ఆయన ఎప్పుడూ త్యాగే

దోహిత్రి—పరమాత్మనకు సగుణ నిర్గుణాలు రెండూ స్వభావ ధర్మములే అన్నమాట

అన్నయ్య—ఒక వస్తువు సగుణమూ, నిర్గుణమూ గా గూడా ఎల్లా ఉంటుంది? ఏదో ఒకటే సాధ్యమవుతుంది

తిక్కన—అందువల్లనే పరబ్రహ్మము ఎప్పుడూ నిర్గుణుడే అన్నారు

దోహిత్రి—అంటే పరబ్రహ్మము ఈ విశ్వమంతా కావడముగాని, సృష్టించడముగాని లేదన్నమాట. సృష్టిస్తున్నాడని అనేక శ్రుతులు చెపుతున్నవే?

తిక్కన—అవునంటే పరబ్రహ్మ మార్పుచెందినట్లు అంగీకరించవలసి వస్తుంది. అందుకని మార్పు చెందినట్లు కనపడునుగాని నిజముగా మార్పు చెంద డన్నారు

దోహిత్రి—ఎవరిని మోసగించడానికి ఈ కనపడడము? సత్యమేదో అదే కనపరచరాదా?

తిక్కన—ఆయన సత్యమునే కనుపరుస్తున్నాడు మనమే భ్రమపడుతున్నాము

దోహిత్రి—లేనిది ఉన్నట్లు కనపడి మనలను భ్రమ పెడుతున్నాడు

తిక్కన—ఆయన చేయునట్లే కనుపడుతున్నాడు. మనమే భ్రమపడుతున్నాము

దోహిత్రి—శ్రుతులు పరబ్రహ్మము చేస్తున్నాడనిగాని, అవుతున్నాడనిగాని చెప్పక పోతే మన మీ దేవుడి గొడవ లేకుండా హాయిగా ఉందుముగా అదిగాక మన నీ భ్రమతో ఎందుకు సృష్టించవలె?

తిక్కన—మీరే అయినారు ఈ భ్రమతో

దోహిత్రి—అయితే వేను ఇదంతా అయినానని సృష్టిస్థితి లయములు నావల్లనే అవుతున్నవని ఇడాయికోసము ఒక విధంగా చెప్తుతూ తను మారినానని అనుకుంటారని భయపడి తానేమియు నెరుగనని మరియొకచోట చెపితే అదే మోసమని నేనంటాను నిజమేదో అదే చెప్పుమంటాను ఆ దేవుడూ, ఆయన శ్రుతులూనూ

అన్నమాంబ—సృష్టిలోనూ, శ్రుతులలోనూ వ్యక్తమవుతున్న ఈ అద్వైత భావము భగవంతుని మోసమువల్లనని ఒకరివాదమువల్లనూ, జీవునియొక్క బుద్ధిలేనితనమువల్లనని మరియొకరి వాదమువల్లనూ తేటపడుతున్నది ఈ వాదములలో ఏది సత్యమనుకున్నా, వేదాంతముయొక్క బుద్ధిలేనితనము రుజువవుతుంది ఇప్పటి కీ వాదము చాలించండి

దోహిత్రి—భగవంతుడు వాస్తవమునకు భిన్నముగా కనుపడుతున్నాడని ఆయన అన్నాడు గనుక అది మోసమని నే నన్నానుగాని అది నా విశ్వాసముగాదు

అన్నమాంబ—విశ్వాసములేని వాదన చేయవద్దు మీ వాదనే దారి తొలిగింది ఈ [illegible] మరియొకప్పుడు యోచింతాము ముందు మీరు ప్రారంభించిన త్యాగము సంగతి [illegible]

అన్న—[illegible] హద్దులకూ లో[illegible] పరమాత్ముడు [illegible] [illegible] త్యాగము, ఆ త్యాగమే ఆయన మహిమను వెల్లడించునని నా అభిప్రాయము.

[illegible]—[illegible] లేకుండా స్వేచ్ఛగా నొక కార్యము చేయునప్పుడు [illegible] [illegible] పరమేశ్వరుని స[illegible]

తిక్క—[illegible] అదె [illegible] చేయు త్యాగము[illegible]

[illegible] ప్రేరేపింప[illegible] [illegible]

[illegible] పిల్లలకో[illegible], [illegible] స్నేహితులలో[illegible]

[illegible]

దోహిత్రి—[illegible] భగవానునికంటె [illegible]

[illegible] భగవంతుని [illegible] 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను మహావాక్యముకంటె [illegible] [illegible] ఉపనిషత్తు చెప్పుతుంది ఈ భావమునే యొక మహర్షి

"[illegible] పురాణః పరం ప్రమాణం నిహితం గుహాయాం,
[illegible] విహాంటోకథా యథా సంధుమ్మ లీలయామః"

అని అన్నారు

"పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవసోఢుం"

అని గీత చెప్తున్నది

"[illegible] బ్రహ్మేతి వ్యజానాత్" అని శ్రుతి [illegible] వాక్యము జెప్పినది

[illegible] ఇచ్ఛాశక్తి, మంత్రశక్తి, ఉత్సాహ శక్తి యని శక్తి [illegible] మంత్ర ఉత్సాహ శక్తులనుగూర్చి యోచించినాము ఇచ్ఛాశక్తి ఈశ్వరుని మూలశక్తి ప్రజ్ఞారసశక్తులు సత్తుపై సుప్రతిష్ఠితములై యున్నవి నిరంతరమును సృష్టిస్థితిలయములను గావించునదియే సంకల్పశక్తి 'ఏకం సత్' అను మహావాక్యము అతని నిజ స్వరూపమును దెలుపుచున్నది పరబ్రహ్మ అచలముగాదు అది నిత్యచలనము ఉనికి మనుకులు అతని స్వభావములు

దోహిత్రి—భగవంతుని ఉండుటలో అగుట గూడ ఇమిడియున్నది భగవంతుని యొక్క ఈ సృష్టి ప్రేరణశక్తియే జంతువులను వివిధ కార్యములకు బురికొల్పుచున్నది వృక్షములలోని కదలికయును, నదుల ప్రవాహనశక్తియు, సూదంటురాతి ఆకర్షణశక్తియు భగవానుని సంకల్పశక్తియొక్క వికాసములే

అన్నమాంబ—దానికి బృహదారణ్యకోపనిషత్తు చెప్పింది కూడ కలపండి. పరబ్రహ్మకు ఒంటరిగావుంటే తోచదుట రెండుగా ఉంటాడట విశమంతా పతిపత్నీ రూపం దాల్చింది అర్ధనారీశ్వర పాత్రను ధరించి విశ్వమంతా నాట్యరంగంచేసి నటావతంస బిరుదమును సంపాదించాడు పరబ్రహ్మ విష్ణువై లోకమంతా రసమండలము చేసి రాధామాయితో వేణుగానం చేస్తూ నిత్య లీల సల్పుతున్నాడు బ్రహ్మయై శారదా ముఖమున చౌషష్టి కళల సంయోగముచే సృష్టి కావ్యమును విరచించి మహాకవి యనిపించుకున్నాడు నదులవేగమున, అయస్కాంతముల ఆకర్షణమున, అణువుల రసాయనిక సమ్మేళనమున ఆ వేగము ప్రకటితమౌతున్నది తరుగుల్మలతాదులలో దాంపత్య ధర్మము సుస్పష్టమౌతున్నది చిగురు బొంపముల లేతదనమున, విరిగుత్తుల కమ్మతావులయందు, ఆమని విలసనమున వనములు చిప్పిలుతున్నవి రాళదంపతుల విప్రలంభము, పొట్ల దంపతుల ప్రణయ కలహము, చిక్కుడు దంపతుల సంయోగము, లతాభిసారికల గాలి బొజుంగులతోడి సైయాటలు విశ్వజననీజనకుల విలాసములను వ్యక్తపరుస్తున్నవి పికపిక శారికల వేణుగాన సరళులు, శరభ సింహ శార్దూలముల ఘోర వియోగ కల్లోలములు జగత్పితల కామ సూత్రములపై కారికలు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసములు విశ్వ దంపతుల కొక్కోకమునకు వ్యాఖ్యానములు పథ్యమును, లంఘనమును క్షుధాభోగములకు దారిదీయునుగాని వానిని నశింపజేయునట్లు వానప్రస్థ సన్యాసములు దాంపత్య విరమణమునకు గాక విరమణమునకే తోడ్పడును వియోగము సంయోగాసక్తిని తీవ్రపరచును ఆశ్రమ ధర్మములు దాంపత్య ధర్మముయొక్క అవస్థలు

ఇది సృష్టి రహస్యము భగవానుడు అణువై, వృక్షమై, జంతువై, మానవుడై విరాడ్రూపమున అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశముల నలంకరించుకొని ఆత్మోపలబ్ధిని బొందుచున్నాడు బీజరూపమున అతని యునికిని నున్న శక్తులన్నియు మనికిలో విస్తరిల్లుతున్నవి ఇదియే విరాడ్రూపమున మొలచి, పెరిగి, పూచి, కాచి, ఎండిన అశ్వత్థము బృంహతీతి బ్రహ్మ—అనంతముగ పెరిగి పోతున్నాడు ఆకాశమున నిమిషమునకు లక్షల యోజనముల వంతున విస్తరించుచు, స్ఫురణమున అన్ని వైపుల నాక్రమించుచున్నది ఇదియంతయు భగవానుని ఏకపాద్విభూతి యన్నారుగాని యది పాతమాట ఇప్పటికి బహుపాద్విభూతియై యుంటుంది ఉనికి పూర్ణమయినచో మనికి అపూర్ణము గాదు భగవానుని ఉనికి మనుకులు రెండూ ఒకటే వట్టి ఉనికి కంటే మనికే మేలయింది భగవానుని మనకి నిత్యము, సత్యము గూడాను

ఇందులో మానవుని భాగము అతిస్వల్పము మన మణువులము కాని ఈ మహా యంత్రములోని ప్రతి యణువును గూడ భగవానునితోపాటు ఆత్మోపలబ్ధిని బొందుచున్నది విశ్వ కళ్యాణము మనకును కళ్యాణమే ఇది భగవానుని త్యాగమా? ఆయనపప్పు ఏమి వినిడింది! ఇది స్వామికి నిత్యభోగము నేను నా నాథునితోజేరి పరమాత్మునితోపాటు నిత్యమును సహభోజనము గావింతును మాకు వియోగములేదు నేను నిత్య సుమంగళిని

అన్నయ్య—తల్లీ! మాకు విశ్వదాంపత్యోపనిషత్తును వినిపించిరివి

అన్న—తోచినది చెప్పితిని ప్రస్తుతావస్థలని ఒరిపిడిలో ఇది నాకు సువ్యక్తమయింది

అన్నయ్య—తల్లీ!

తిక్కన నిస్తబ్ధుడై కూర్చున్నాడు

దోహిత్రి—చిన్నమ్మా! ఎవరో అనుకుంటారని ఈ ఎదపరోన తంతు జరపడం నా కేమాత్రం ఇష్టంలేదు

అన్న—మీయిష్టము

తిక్కన—అవసరము లేదనుకుంటాను

అన్నయ్య—నా అభిప్రాయమూ అదే

తిక్కన—అన్యాయము రాత్రి నేనూ, చిన్నవాడు, రాజుగారు మాట్లాడడములో నరసింగపాటివల్ల రావలసిన రెండు లక్షల రూప్యములను విద్యకై వినియోగించవలసిందని నిశ్చయించుకున్నాము గుంటూరిలో నాన్నగారిపేర ఆయుర్వేద, ధనుర్వేద కళాశాలలు స్థాపించవలయునని తలంచితిమి ఇకమీద మన కీ వూరిలో పనిలేదు గనుక మన భవనములను కళాశాలం కిచ్చివేసిన బాగుండునని తోస్తుంది నీ అభిప్రాయమేమి?

అన్నమాంబ—నా కిక్క దేమిపని—ఇచ్చివేయవచ్చును

అన్నయ్య—చాల ఉత్తమమయిన ఏర్పాటు

దోహిత్రి—ఈ ఏర్పాటు చిన్నాన్న జీవితాదర్శమునకు అనుగుణ్యంగా ఉన్నది

తిక్కన—సరే, పొద్దెక్కింది ధర్మోదకాల పని చాలాసేపు పడుతుంది గూడాను లేవండి

అంతా లేచారు

# నేటి తెలుగు, నోటి తెలుగు

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

**[1948 సర్వధారి సంవత్సరాది సంచికనుండి]**

వెలయగలదు, నేడు కాకపోతే రేపు—వేరుగా ఆంధ్రరాష్ట్రం తప్పక వెలయగలదు

అప్పటినుండీ ఆంధ్రరాష్ట్ర పరిపాలనాతంత్రమంతా, భాషా ప్రయోజనములన్నీ ఆంధ్రభాషామూలకముగానే సాగగలవు లేఖనమూలముననేకాక వాఙ్మూలమునకూడా తెలుగు రచన పెంపొందగలదు

పరిపాలనాతంత్రమునకు ముఖ్యముగా కౌన్సిళ్ళు, డిస్ట్రిక్టుబోర్డులు, మునిసిపాలిటీలు, కలెక్టరు మొదలగువారి ఆఫీసులు, కోర్టులు, విద్యాశాలలు, అక్కడి పాఠ ప్రవచనములు అన్నీ తెలుగులో సాగితే, ఆ యా చోట్ల ఉద్యోగులు, సదస్యులు తెలుగుతోనే చర్చలు సాగిస్తే, ఆంధ్రదేశము నలుమూలలవారు, నానా జాతులవారు సమాన స్వాతంత్ర్యముతో వాగ్వ్యవహారములు ఆయా చోట్ల సాగిస్తే, వాటిని షార్టుహాండు రిపోర్టర్లు అట్లట్లే పత్రికలకు పంపితే, వారి భాషితములు మార్చ వీలులేదు గనుక వాటిని అట్లట్లే పత్రికలవారు ప్రకటిస్తే చాలామట్టుకు నేటిది కాకపోయినా రేపటిదయినా తెలుగు 'నోటి తెలుగు!' కాకతప్పదు

మాట్లాడే భాషకూ, వ్రాసే భాషకూ ఐక్యమో, కాకపోతే సాన్నిహిత్యమో అనివార్యం అవుతుంది ఈ మార్పు రాక తప్పదు

తెలుగు పుట్టిననాటినుండి నేటిదాకా తెలుగువారు భాషాప్రయోజనాలను పెక్కింటిని పరభాషల ద్వారానే పడయడం సంభవిస్తూ వచ్చింది

ఆదికాలంలో సంస్కృత ప్రాకృతములు తర్వాత తురక, ఇంగ్లీషు భాషలు తెలుగు ప్రజలమీద వెల్లివిరిసి తెలుగుకు రూపేర్పఱచి పెంపొందించి భాషాప్రయోజనములను పెక్కింటిని తమ మూలాన తెలుగు ప్రజలకు ప్రసాదిస్తూ వచ్చినవి

ఆ యా కాలములలో భాషా ప్రయోజనాలలో ఒక్కటయిన సాహిత్య ప్రయోజనానికి మాత్రమే తెలుగు కొంత ఉపయోగపడుతూ వచ్చింది కాని అందులో కూడా ఆ యా కాలాలలో సంస్కృత ప్రాకృతములయు, తురుష్కాంగ్లములయు తాకిడి తెలుగు రచనలకు తగులుతూనే వచ్చినది సర్వ స్వతంత్రతత తెలుగుకు పూర్వం కలుగనే లేదు

అయిపోయిందేదో అయిపోయింది ఇప్పుడు దేశకాలముల తీరులు మారినవి ఎప్పుడూ చవి చూచి ఎరుగని మార్పులు సమకూరినవి

భారతదేశానికంతా ఏకమొత్తాన రాజ్యాంగభాషగా, నవ్యనాగరక భాషగా నూరేండ్లపాటు తెగ వెలిగి అనేకాపూర్వప్రయోజనములనుసాధించి పెట్టిన ఆంగ్లభాష ఇక క్రమక్రమంగా తెరమరుగు కావలసిన స్థితికి వచ్చినది దాని స్థానమును కొంతవరకైనా హిందీ ఆక్రమించుకొనబోతున్నది

అయినా అది సర్వ భారతదేశ సామాన్య వ్యవహారములకే పనిగొంటుంది. కాని నేటిదాకా ఇంగ్లీషు పట్టినట్టు దేశభాషా వ్యవహారాలపై కుత్తికపట్టు పట్టదట!

రాష్ట్రపాలనవ్యవహారాలన్నీ దేశభాషలలోనే జరుగును గనుక దేశభాషలకిక కుత్తిక కోతలు కలుగవు

కౌన్సిళ్లలో, స్కూళ్లలో, ఇళ్లలో, వాకిళ్లలో, రోడ్లలో, రికార్డులలో, కోర్టులలో, ఉపన్యాసాలలో, రాజ్యశాసనాలలో, గ్రంథ పఠన రచనలలో తెలుగుదేశంవారు సర్వేసర్వత్రా తెలుగు వాడుకనే సాగించగలిగినారంటే—అహోహో! తెలుగుకు పలుకుబడీ, చెలు బడీ ఎంతో సర్వోదయంగా సాగుతుం దన్నమాట!

తెలుగు వెలుగు లెంతో దేదీప్యమానంగా వెలయగలవన్నమాట!

ఇది సర్వోదయమే సంతోషకరమే కాని—తీవ్రయోచన గొల్పుతూ కొన్ని చిక్కులు దీనినుండీ యెగరేగుతున్నవి

గ్రాంధికభాషనూ, ఇంకా ఇటీవల ప్రబలిన వ్యావహారిక భాషను కూడా ఇప్పటిదాకా ఏవో హద్దుపద్దులలో కొంతవరకైనా ఆచిపట్టుకుంటూ వస్తున్నారు—యూనివర్సిటీలవారు, గ్రంధరచయితలు, పత్రికారచయితలు, మఱీ పండితులూను

ఇక దేశం నాలుగంచులవారిదాకా సర్వతోముఖమయిన స్వాతంత్ర్యం చెలరేగినదంటే హరిజనుల దగ్గరనుండి భూసురజనులదాకా సర్వప్రజలూ సర్వ స్వదేశ వ్యవహారములలో సమాన స్వతంత్రులూ, సమాన భాగస్వాములూనయి బుజాలు కలుపుకొని వర్తిల్లనూ, వర్ధిల్లనూ సాగించినారంటే వారి వారి భాషలుమాత్రం కలగాపులగములు కాకుండా దూర దూరములుగానే ఉండిపోగలవా! 'మీజాతి తక్కువది, మా జాతి ఎక్కువది' అనరానట్టే, 'మీ పలుకుబడి తక్కువది, మా పలుకుబడి ఎక్కువది' అని యిక అనవీలుండదు

కుల్లూకభట్టీయాన్నిబట్టి వర్ణాశ్రమ ధర్మాలనూ, నన్నయభట్టీయాన్నిబట్టి ఆంధ్రభాషా వ్యవహారాలనూ, ఆచిపట్టువలె ననేవారు నాలుకలు కరచుకోవలసిన స్థితి వస్తుంది, తప్పదు

ఆది పెద్ద యుగపరిణామం వంటిది

భాషావిషయంలోనే ఆయెను, ఈ మహత్తర పరిణామంలో రేపు ఇటువంటి స్థితి ఏర్పడుతుందని నిస్సంశయంగా నిరూపించడం ఎవరితరమూ కాదు అసలు ఆంధ్రభాషావృక్షం ఎన్ని చిలవలు పలవలు వేస్తూ పెరుగుతూ వచ్చిందో, ఏ కొంతయినా దాని విజృంభణ పూర్వం ఎట్లా ఉండేదో, ఇప్పుడెంత ఉందో పరిశీలించి గుర్తించి చూచినవా రెవ్వరున్నారు?

పై పై జాతులవారి తేరుకున్నభాషల మెఱుగులే ఇంతదాక సారస్వత రచనలలో సాగుతున్నవిగాని దేశం నాలుగంచులా తిరిగి భాషను సర్వేచేసి దాని సర్వాంగ సౌందర్యమును గుర్తించినవా రెవరున్నారు?

జరిగితే ఇకమీదనే ఆ పని జరుగవలెను—ఆంధ్రులే ఆంధ్రదేశాన్ని పాలిస్తారు గనుక!

నాళ్లు, ఊళ్లు, గుళ్లు, కొండలు, నదులు, చెరువులు మొదలగువాని పేర్లు, వాని పుట్టుపూర్వోత్తరాలు, తచ్చరిత్రలు, జాతులు—తచ్చరిత్రలు, ఆ యా నాళ్లలో ఊళ్లలో ప్రఖ్యాతులైనవారి చరిత్రలు గ్రంధాలు, శాసనాలు, విగ్రహాలు—వాటి కధలు, నోటి పాటలు, పద్యాలు, నానుళ్లు, పలుకుబళ్లు, అపూర్వపదాలు, వాక్య విన్యాసాలు వగైరాలు, బహు జాతులవారి, బహు దేశభాగములవారి భాషాభేదములు, ఆచార వ్యవహారములు—అన్నీ సమాకలనంచేసి సముద్ధరిస్తూ వాటిలోని గుణాగుణాలను గుర్తించి నిరూపిస్తూ ఉంటే సర్వప్రజలలోనుండీ, వారి భాషలనుండీ, సారాంశమనదగినట్టు ప్రజలూ, వారి భాషలూ మెఱుగులు

[illegible] స్వాతంత్ర్యంలో సగ [illegible] కాని, అట్టిస్థితి యేర్పడదు. అందే, [illegible] అని [illegible]

పుస్తకం పట్టి, నోటికో [illegible] మాటాడే భాషకు పలుకు [illegible] భాషా భేదాలు [illegible].

ఒక్కదేశమూ [illegible] ఉన్నట్టే, సమయ సందర్భాలున్నట్టే గ్రాంథిక వ్యావహారిక వాదవ్యయంలో కూడా అనేకాంతరాంతర భేదములను పాటిస్తూ ఉంటాము.

[illegible] నేనే [illegible] అనేక సందర్భాలలో అనేక విధ [illegible] వాడేస్థితిలో ఉంటాను.

ఏటి పరిణామాల్ని శుభసూచకాలుగా [illegible] కాలవసే [illegible] కొన్ని సందర్భములలో విగ్రహను కూడా చెందుతూఉంటాము.

ఇప్పటికీ సంస్కృత సమాసాడంబరంబుల గుంపులలో సరసమైనం [illegible] వచన రచన చేసేవారు కొందఱు—

ముద్దులు గొలిపే పలుకులలో ఇది గ్రాంథికమునకాని, వ్యావహారికమునకాని నిర్ణయించ వీలులేనంత సున్నితముగా, సుభముగా వచన రచన చేసేవారు కొందఱు—

ఒడుపులు, ఒయ్యారములుగల నానుకథలలో [illegible] (తిప్పి [illegible] పొంకముగా వచన రచన చేసేవారు కొందఱు—

మాటాడేటప్పటికంటే కూడా పలుకులను అరగదాచి గాలికి తూలిపోయేటంత తేలికగా వచన రచన చేసేవారు కొందఱూ ఉన్నారు.

కాని వ్యావహారిక రచన పెంపొందసాగినకొద్దీ నుడికారములు, నానుడ్లు, పలుకు పొంకములు, కాకువులు తెలుగు రచనలో వెల్లివిరియ సాగినవి.

హృదయమునకు హత్తుకోజాలనివి, వ్యవహారానుసరణములేనివి, సంస్కృత పదాడంబర రచనలు సన్నగిల్లిపోజొచ్చినవి.

పుట్టుకలోనే సంగీత వాసనలో కొందఱు పాలుపొందుతూ ఉండే ఒట్టి సరసాంధ్ర రచనా స్వభావంతోనే జన్మించి చదువు సందె లంతగా లేకపోయినా అతిమనోజ్ఞ రచనలు సాగిస్తున్నవా రనేకు లున్నారు. తెలుగు తియ్యదన మట్టిది!

కష్టపడి గట్టిగా విద్యాభ్యాసాదికము కావించి కూడా, పద్యరచన లేవో వరగిస్తూ కూడా విద్వాంసులే కొందఱు అందమయిన వచన రచనల నలవరుచుకోజాలక పోతున్నారు.

'పత్రికా విలేఖరుల', 'ప్రాముఖ్యతను,' 'విభాగిత భారతదేశమును', హిందూ మహమ్మదీయ 'సఖ్యతను'—ఇక కాదన వీలులేదు కాబోలును.

ఇట్టి పదాలను పత్రికలే కొంతవఱకు పుట్టించి పోషిస్తున్నవి. 'లోకవాడుక'లోనుండి వచ్చినవి కావు పయిపలుకులు.

శయ్యలో వైవిధ్య ముండుగాక! గ్రాంథికమునగాని, వ్యావహారికమునగాని పదముల నుపయోగించుటలో భాషాలోకజ్ఞుల ననువర్తించు టావశ్యకము గదా! అవిపట్టువా రెవ్వరు?

వివిధత యింత వింతగా విజృంభిస్తున్నా, కొన్నాళ్లకు దీనిలోనుండి యింకా నిర్దుష్టమయిన రచనపు సరకు నెగడగలదు.

వైవిధ్యమే మెఱుగులు దేరితేరి తనలోనుండి హార్దమహితమయిన యైకవిధ్యము నవతరింపజేయుగలదు.

# సత్యాన్వేషణ

## శ్రీ గోపీచంద్

**[1949 విరోధి సంవత్సరాదిసంచికనుండి]**

మానవలోకంలో ధర్మానికి చోటు లేకుండాపోయిందని లోకం గగ్గోలు పెడుతూ వుంది ఇంచుమించు అన్ని దేశాలలోని మేధావులూ ఈ విషయం నొక్కి చెపుతున్నారు పరిస్థితులు ఈ విధంగానే సాగిపోతే, కొద్ది కాలంలోనే మానవుడు, యుగయుగాలనుంచీ తను సంపాదించిన జ్ఞానం, సంస్కారం కోల్పోయి జంతుజాలంలోకి దొర్లుతాడని భయపడవలసిన పరిస్థితులు కన్పిస్తున్నాయి

ఇటీవల పెచ్చు పెరిగిపోయిన దోపిడీ విధానం, దారిద్ర్యం దీనికి కారణం మనిషికి ఏదో ఒక రకంగా బ్రతకటమే ముఖ్యసమస్య అయింది బ్రతుకు దినదినగండం అయింది. అన్నమే 'పరబ్రహ్మ స్వరూపం' అయింది మనిషి 'ఆర్థికజీవి' అయ్యాడు అన్నం సంపాదించటానికి అవసరమైన విషయాలుకాక, మిగిలినవన్నీ తమ విరోధివర్గం తమను మోసం చేసి, తమను అజ్ఞానంలో, దారిద్ర్యంలో, బానిసత్వంలో అట్టిపెట్టటానికి లోకంమీద రుద్దిన 'విలువలు'గా పరిగణింపబడినై అన్నంకోసం మానవుడు తన 'ఆత్మను' చంపుకున్నాడు సహజపరిణామాన్ని అరికట్టుకున్నాడు బ్రతుకే దుర్ఘటం అయినప్పుడు అది అవసరమే అయింది సంఘంలో నైతిక విలువలకు చోటు లేకుండా పోయింది

మానవపరిణామం ప్రాణం నిలుపుకోవటంతో ఆగదు షడ్రసోపేతంగా భోజనం లభించినంతమాత్రాన మానవుడు తృప్తిపడడు నిజమే కాని జన సామాన్యానికి తిండే కరువు అయినప్పుడు, ఏదో ఒకవిధంగా తిండి సంపాదించటమే ఆదర్శం అవుతుంది తమకు తిండిని సంపాదించిపెట్టే ప్రతిసాధనం ఉత్తమ సాధనమే అవుతుంది నైతిక విలువలు నశిస్తాయి. సంఘం ఉడికిపోతుంది ప్రజాబాహుళ్యాన్ని దారిద్ర్యంలో ఉంచటంవల్ల వచ్చినపాపం, మొత్తం సంఘానికి కొడుతుంది మానవజాతి జాతే నశించే స్థితికి వస్తుంది. దారిద్ర్య నిర్మూలనమే దీనికి మందు పై పూతవల్ల ప్రయోజనం ఉండదు మానవుణ్ణి మిగిలిన విలువలను కోరగలిగిన స్థితిలో పెట్టాలి ముందు అన్నం

"అన్నమే పరబ్రహ్మం" అన్నాడు సత్యాన్వేషకుడైన శిష్యుడు

"నాయనా, అన్నాన్ని మరిగించు" అన్నాడు గురువు

శిష్యుడు మరిగించాడు సత్యాన్ని కనిపెట్టాను అనుకున్నాడు

"ప్రాణమే పరబ్రహ్మం" అన్నాడు

"నాయనా, ప్రాణాన్ని మరిగించు" అన్నాడు గురువు తొణకకుండా

శిష్యుడు మరిగించాడు ఈసారి తప్పకుండా సత్యాన్ని కనిపెట్టాను అనుకున్నాడు ఉప్పొంగిపోయాడు

"జ్ఞానమే పరబ్రహ్మం" అని చెప్పాడు

దీనికి కూడా గురువు తొణకలేదు "నాయనా, జ్ఞానాన్ని మరిగించు" అని చెప్పాడు

శిష్యుడు జ్ఞానాన్ని మరిగించాడు "ఆనందమే పరబ్రహ్మం" అని చెప్పాడు

ఆధ్యాత్మికవాదులకు 'సుఖప్రాప్తి, దుఃఖ నివృత్తి' పరమార్థం

ఆధ్యాత్మికవాదులు మానవునిలో అన్నమయ, ప్రాణమయ, జ్ఞానమయ, ఆనందమయ కోశా లున్నాయని చెపుతారు. ఇది జీవకోటి పరిణామాన్ని నిరూపిస్తుంది. కాని ఒక కోశం వృద్ధి చెందినంత మాత్రాన పూర్వకోశం రూపరహితం కాదు ఉంటూనే ఉంటుంది దానికి అవసరం అయిన పనులు జరుగుతూనే ఉండాలి. కాని మానవుణి పరిణామాన్నిబట్టి ఒక్కొక్క దశలో ఒక్కొక్క కోశం ప్రాధాన్యము వహిస్తుంది.

పరిణామం ప్రవాహం లాంటిది అంటే ఎప్పటికప్పుడు కొత్తనీరు కలుస్తున్నా పాతనీరు ఉండనే ఉంటుంది పరిణామవాదాన్నిబట్టి కదలని స్థితినుంచి కదులుతూ, ఒక చోటునుంచి కదలని ఆ స్థితినుంచి నాలుగు కాళ్లమీద నడిచే స్థితికీ, ఆస్థితినుంచి రెండు కాళ్లమీద నడిచే మానవుని స్థితికీ ప్రకృతి పరిణామం చెందినదని తెలుస్తుంది ఈ బాహ్య లక్షణాలన్నీ మానవునిలో కనిపిస్తూనే ఉన్నాయి ఈ ప్రపంచం స్థూలదృష్టికి కనిపిస్తున్నట్టు, ముక్కలు ముక్కలుగా, ఏ ముక్కకి ఆ ముక్కగా పరిణామం చెందటం లేదు ఒకే పునాదినుంచి ఒకేవిధంగా పెరుగుతున్నది

* * *

ఆధ్యాత్మికవాదులు భావానికి ప్రాధాన్యం ఇచ్చారు పదార్థం చైతన్యం వేరనీ, చేతనశక్తి అనేక రూపాలు ధరిస్తూ ఉందనీ అనుకోవటం దీనికి కారణం శక్తికి గుణం ఉండదు రూపం ఉండదు జీవకోటికి కనపడే కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలు పదార్థానికి సంబంధించినవి. వీటిని జయించాలి మానవుడు మోక్షాన్ని సాధించాలంటే త్రిగుణాతీతుడు కావాలి తత్వమసి, 'అహం బ్రహ్మాస్మి' అనే సంస్కారాన్ని పొందాలి అన్నారు

పదార్థం చైతన్యం వేరు అనుకోవటంవల్లా, చేతనశక్తి అనేక రూపాలు పొందుతూ ఉంది అని అనుకోవటంవల్లా, తనకూ మోక్షానికీ మధ్య పదార్థం నిలబడి తనను తప్పుదారులను తొక్కిస్తూవుంది అని అనుకోవటంవల్లా అనేక చిక్కులు తటస్థించినాయి శరీరంమీద ఏహ్యభావం కలగటం, భౌతికసమస్యలనుంచి వైదొలగటం, ప్రపంచాన్ని రోయటం, ఎవరికి వారే తమ ముక్తికోసం కృషి చెయ్యటం, మానవ ప్రయత్నం మీదకంటే భగవంతునిమీద భారం వెయ్యటం మొదలయినవి ఈ దృష్టివల్ల ప్రజాబాహుళ్యానికి తీరని అపకారం జరిగింది జ్ఞానంలో, దారిద్ర్యంలో మగ్గటమే వారి జీవితం అయింది తాము ముక్తిని పొంది, నిరంతరం ప్రజల సేవలో మునిగి తేలినటువంటి బుద్ధునిలాంటి మహాపురుషులు మనదేశంలో లేకపోలేదు తమకు విముక్తి లభించింది తమ మనస్సులు అతినిర్మలంగా ఉంటాయి వారు నిరంతరం కర్మలు చేస్తుంటారు కాని ఆ కర్మలు బంధాలు అవవు వారిని అంటవు ఈ స్థితికంటే పైస్థితి ఏదైనా వున్నా వారు కోరరు బుద్ధుడు ఈ విధంగానే ప్రవర్తించాడని చరిత్ర చెప్తుంది లోకంకోసం పైస్థితిని అతను నిరసించాడు

కాని ఇటువంటి దివ్య పురుషుల్ని కూడా ఆధ్యాత్మికవాదులు 'నాస్తికులు' అని నిందించారు దీనివల్ల ఆధ్యాత్మికవాదుల మనఃప్రవృత్తి అర్థం అవుతుంది. ఏదైనా భగవంతుని వాసయోగ్యమైన ఈ శరీరం, వివిధ రూపాలు, ఈ ప్రపంచం వారికి పాపభూయిష్ఠంగా కనబడటం చాలా ఆశ్చర్యం .

మన వేదాంతంలో జ్ఞాని కర్మ చెయ్యాలా, అక్కర్లేదా అనే సమస్య చాలా తీవ్రమైన సమస్య ఈ సమస్యమీద అనేక వాదోపవాదాలు చెలరేగినై సామాన్య మానవుల మాట అటు వుంచి, జ్ఞానము, కర్మ, ఈ రెండూ వేరు వేరు అయినట్లు అర్జునుడు శ్రీకృష్ణుని 'జ్ఞానకర్మలలో ఏది ఉత్తమము?' అని అడిగాడు ఇది ఉత్తమమా, అది ఉత్తమమా అని అడగటానికి ఈ రెండూ ఒకదానికి ఒకటి సంబంధంలేని విషయాలు కాదు ఒకదానిమీద ఒకటి ఆధారపడిన విషయాలు ఒకే వస్తువుయొక్క రెండురూపాలు, ఎవరికీ అకర్మ స్థితిగాని, పూర్ణకర్మస్థితిగాని సాధ్యంకాదు.

ఆలోచన కూడా ప్రకృతి చేష్టే! సంకల్పం కూడా కర్మే!

భగవంతునిమీద ఆధారపడటంవల్లగానీ, ఎవరి విముక్తికోసం వారు పాటుపడుతూ, భౌతిక సమస్యలను సామాన్యుల చేతుల్లో ఉంచటంవల్లగానీ ప్రజల స్థితి దుర్భరంఅయింది. దీనికి తోడు, అధికారంలో ఉన్నవారు ఆధ్యాత్మికవాదాన్ని తమ అధికారాన్ని నిలబెట్టుకోటానికీ, తమ సుఖాలకూ ఉపయోగించుకోవటం మొదలుపెట్టారు ప్రజలు నానాటికీ దుర్భర పరిస్థితుల్లో చిక్కుకుపోయారు వారిని రక్షించటానికి మరొక సిద్ధాంతం అవసరమయింది ఆ పరిస్థితులు మరొక సిద్ధాంతానికి దారితీసినాయి

భగవంతుడు లేడు సంఘంలోని ఈ హెచ్చుతగ్గులు భగవంతుడు సృష్టించాడని చెప్పటం మోసం ప్రజాబాహుళ్యాన్ని దారిద్ర్యంలో ఉంచి, వారి సహజ శక్తుల్ని చంపి, నిరపాయంగా దోపిడీ చెయ్యటానికి స్వార్థపరులు, ధనికవాదులు సృష్టించిన సిద్ధాంతం ఇది వర్గ సామరస్యం అబద్ధం దోచుకునే వాళ్లకీ, దోపిడీ చెయ్యబడే వాళ్లకీ సామరస్యం ఏమిటి? వర్గ కలహమే యథార్థం వర్గకలహంవల్లే సంఘం అభివృద్ధి చెందుతూవుంది

పదార్థమే అనాది పదార్థం పదార్థానికి విడిగా దానిని నడిపించే పరశక్తి లేదు పదార్థం తనకు తానే పరిణామం చెందుతూ వుంది అది దాని స్వభావం పరిణామం చెందుతూ తనలోవున్న శక్తులను బహిర్గతం చేసుకుంటూ ఉంది ఈ పరిణామాన్ని ఎవ్వరూ పైనుంచి నిర్దేశించలేదు ఎవ్వరూ పైనుంచి ఈ పరిణామానికి సహాయం చెయ్యటం లేదు అనుభవంవల్ల ప్రకృతిచేష్టలను అర్థం చేసుకొని, ప్రకృతినుంచి రక్షించుకోటానికి అవసరమైన గుణాలను తనలో తాను వృద్ధి చేసుకుంటూ జీవకోటి వృద్ధిచేసుకుంటూ ఉంది

మానవుడు ఆర్థికజీవి ఆర్థిక పరిస్థితులే అతని దృష్టిని నిర్ణయిస్తున్నాయి అని దృష్టి మాకారంటే ఆర్థిక పరిస్థితుల మానవ సంఘం రెండు వర్గాలుగా చీలి పోయింది—ధనవంతులు, బీదవాళ్లు. వాళ్ల దృష్టిని, వాళ్ల పరిస్థితిని నిర్ణయించింది వీళ్ల దృష్టిని, వీళ్ల పరిస్థితిని నిర్ణయించింది ఈ ఇద్దరికీ ఈ భిన్న పరిస్థితులు సంఘంలో ఉన్నంతకాలం సరిపడవు ధనవంతులకు 'హృదయ పరివర్తనం' కలిగి బీదవాళ్లకు సహాయం చేస్తారనుకోవటం హాస్యాస్పదం వాళ్ల ఆర్థిక పరిస్థితిని నిర్ణయించినప్పుడు ఆర్థిక పరిస్థితినిబట్టి బాధలు కలిగేటప్పుడు, ఆ పరిస్థితి యథాతథంగా ఉండగా వాళ్ల దృష్టి ఎలా మారుతుంది? ఇవన్నీ ఉద్దాల్లు బీద ప్రజలను మోసం చెయ్యటానికి చెప్పేమాటలు ఈ మాటలు నమ్మరాదు బీదప్రజలు బాగుపడటానికి విప్లవమే మార్గం అందుకు ఒక్క ఏలవామే సాధనం "ప్రపంచ కార్మికులారా, ఏకము గండు" "ఈ పోరాటంలో సంకెళ్లతప్ప మనకు పోయేది ఏమీ లేదు"

ఈ సిద్ధాంతంలో భావానికి ప్రాధాన్యంలేదు భావం ఆర్థికపరిస్థితుల చేతుల్లో కీలుబొమ్మ అయింది దానంతోపాటు మానవుని పనీ అంతే అయింది భగవంతుడు ఒకడున్నాడని అంగీకరించే ఆధ్యాత్మికవాదులు 'పురుష ప్రయత్నం అవసరం' అని చెప్పినట్లే వీరూ 'మానవ ప్రయత్నం అవసరం' అంటారు అనటమేగాని మానవుడు ఒకప్పుడు ధనవంతుని చేతుల్లోనూ మరొకప్పుడు భగవంతుని చేతుల్లోను కీలుబొమ్మ అయినప్పుడు ఎట్లా విలు? అవసరం ఎక్కడ? అంతేకాదు నైతిక విలువల కక్కడా సంఘంలో స్థానం లేకుండా పోయింది

అన్నం కావాలి ధనికవర్గం అధికారంలో ఉన్నంతకాలం బీద ప్రజలకు అన్నం దొరకటం అనేది పేరాన జరిగే పనికాదు కాబట్టి బీదప్రజలు అధికారాన్ని చేపట్టాలి అందుకు ఏ పని చెయ్యట అవసరమైతే అదే ధర్మం ఏ సాధనం ఈ ఆదర్శాన్ని నెరవేర్చ గలుగుతుందో, అదే ఉత్తమ సాధనం మిగిలినవన్నీ బూటకపు మాటలు సంఘంలో మార్పు రాకుండా ఉండటానికి ధనికవర్గం తయారు చేసిన తియ్యని మాత్రలు

ఈవిధంగా సిద్ధాంతం నిర్మింపబడింది ఉద్యమం ప్రచారంలోకి వచ్చింది బీదప్రజలు నడుం కట్టారు విప్లవాలు చెలరేగినై దయాసత్య శౌచాలు లేవు మానవుడికీ మానవుడికీ వున్న సంబంధం తెగిపోయింది ధనార్జన పరమార్థం అయింది ఏవిధంగానైనా సరే డబ్బు సంపాదించటమే ప్రయోజకత్వంగా భావింపబడింది మిగిలిన విలువలన్నీ దద్దమ్మల వ్యూహాల క్రింద జమకట్టబడినై ఒకరి నొకరు మోసం చేసుకోవటం, అబద్ధం ఆడో, అవినీతిగా ప్రవర్తించో తన పనిని నెరవేర్చుకోవటం పురుషలక్షణం అయింది మానవసంఘం దద్దరిల్లింది ఉత్తమ పురుషులు మానవులను అవహించిన ఈ పైశాచిక దృష్టికి ఆహుతి అయ్యారు. మానవులు ఏళ్లతరబడి మూటకట్టిన తమ సంస్కారాన్ని తుడిచిపెట్టి ఎనాటికివి జంతుజాలంలోకి దిగజారటానికి సిద్ధపడుతున్నారు తమ సమాధిని తాము తవ్వుకుంటున్నారు ఎవరికి వారు ఏదో ఘనకార్యం చేస్తున్నట్టు, ఏదో ఒక లోకోత్తర విషయాన్ని సాధిస్తున్నట్టు భావిస్తూ తమ శక్తినంతా ఉపయోగించి వృథా కాలయాపన అవుతుందేమో అనే భయంతో, రేపు మనది కాదు అనే ఆతురతతో తమ సమాధిని తాము తవ్వుకుంటున్నారు

ఇక గత్యంతరం ఏమిటి?

ప్రపంచానికి ఈ విషమ పరిస్థితి 'మానవుడు ఆర్థికజీవి' అనుకోవటంవల్ల వచ్చింది. ఈ సిద్ధాంతం సామాన్య ప్రజలను గర్భ దారిద్ర్యంలో వుంచి, ఉత్తమ సిద్ధాంతాలను తాము ఆచరించకుండా, ఇతరులను తమ సొంత బలుపుకి ఉపయోగించుకోటానికి గాను వాడే ధనికవర్గంవల్ల అవసరం అయింది బ్రతుకే అనిత్యంగా కనపడేటప్పుడు మిగిలిన మాటలు ఎవరి చెవులకి ఎక్కుతై. కాబట్టి, ఈ సిద్ధాంతం గాలి దుమారానికి మల్లే ప్రజల్లో వ్యాపించటానికి ముఖ్యకారకులు ప్రజలు కాదు, ఈ సిద్ధాంతాన్ని నమ్మి ప్రజలను రెచ్చగొట్టే నాయకులు కాదు ఈ సిద్ధాంతం అవసరాన్ని సంఘానికి 'తప్పనిసరి' చేసిన స్వార్థపరులు

*　　　*　　　*

జీవకోటి పరిణామం ఎక్కడో ఒకచోట ఆగదు. మానవుడు బ్రతకటానికి చేసే ప్రయత్నాన్నుంచి స్వతంత్రేచ్ఛకూ, స్వతంత్రేచ్ఛనుంచి సత్యాన్వేషణకూ పరిణామం చెందాడు కాని, మానవుని జ్ఞానం సంకుచితం అవటంవల్ల, ఒక దశలో వున్న మానవుడు ఆ దశే సత్యమనీ, నిత్యమనీ అనుకొని ఆ దశను పట్టుకొని కూర్చోవటంవల్ల అనేక చిక్కులూ, వ్యర్థ పోరాటాలూ ఏన్నున్నాయి ఎప్పటికప్పుడు పరిణామం చెందటానికి ఆ పరిణామానికి తగిన సంస్కారాన్ని సృష్టించుకోటానికీ, మానవుడు వెనుకంజ వెయ్యటానికి విజ్ఞానం, అజ్ఞానజనితమైన భయం, రెండూ కారణాలు కోతులు మానవ దశకు రావటానికి చాలా ఎదురు తిరిగి ఉంటై. ఈ పరిణామాన్ని సూచించే చిహ్నాలను నిరుపయోగమైన, తమ బ్రతుకుని అంతంచేసే చిహ్నాలుగా భావించి వాటిని నిర్మూలించటానికి ఎంతో ప్రయత్నించి ఉంటై. ఎందుకంటే తాము వున్న స్థితికి ముఖ్యావసరంగా కనపడే అనేక లక్షణాలు వచ్చే స్థితిలో ఉండవు అవి లేకుండా తా మెలా బ్రతకటం? రెండు కాళ్లమీద నడవటానికి ప్రయత్నించిన మొదటి కోతిని మిగిలినవన్నీ ఎంత ఎగతాళి చేసివుంటయో! 'దాని కేమి పోయే రోగం!' అని బుగ్గమీద వేలునేసుకొని ఉంటై

మానవునిలోనూ ఈ లక్షణాలే కనిపిస్తున్నయి ఎప్పటి కప్పుడు పైస్థితికి వెళ్లటానికి భయం. అదేదో అగాధంగా కనిపిస్తుంది ఈ స్థితికి అవసరం అయిన వాటిని వొదులుకుంటే ఏ మవుతామో అనిపిస్తుంది. దీనినే 'fear of freedom' అంటారు.

ఈ భయంవల్ల ఎదురు తిరిగి తన ప్రాణాలను కూడా లెక్కచెయ్యక పోరాడుతాడు ఉన్నచోట ఉండటమే వాంఛిస్తాడు తెలియని మిత్రుని కంటే తెలిసిన విరోధే నయం అనుకుంటాడు

ఒక దశలోవున్న మానవుడు పై దశలో వున్న మానవుణ్ణి అర్థం చేసుకోవటం కూడా కష్టమే ఎందుకంటే అతని చిత్త ప్రవృత్తి వేరు అతనిసమస్యలు వేరు అతని పరిష్కార మార్గాలు వేరు ఎవరికి వారు తమ తమ చిత్తవృత్తులనుబట్టే ఇతరులను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తారు గనుక, అపార్థం చేసుకోటానికే ఎక్కువ వీలుంది ఈ విషయం మన నిత్య జీవితంలో అనుక్షణం అనుభవానికి వస్తూనే ఉంటుంది కాని పై స్థితిలో ఉన్నవారికి కింది స్థితిలో ఉన్నవారి సమస్యలు అర్థం చేసుకోవటం తేలిక వారికి మార్గంచూపి, అంటే వారి సమస్యలను పరిష్కరించటానికి సహాయపడి, వారి అభివృద్ధికి ఆటంకం తొలగించటం వారి ధర్మం ఈ దృష్టివల్లనే 'వేదాంతం ఆకలితో మాడేవారికి గాదు', 'నా దేశంలో ఒక కుక్క ఆకలితో మాడుతున్నా, దాని ఆకలి తీర్చటమే నా ధర్మం' అనే సూక్తులు వేదాంతుల నోటినుంచి వెలువడ్డవి

కాబట్టి ఆర్థిక పరిస్థితులే మానవుని దృష్టిని నిర్ణయిస్తాయి అనుకోవటం పొరపాటు అది ఒక బలమైన శక్తి కాని మానవుని దృష్టిని నిర్ణయించే శక్తి మరొకటి కూడా ఉంది అది జ్ఞానం దీనిని సంస్కారం అనండి, భావం అనండి, మరింకేమన్నా అనండి— ఆర్థిక పరిస్థితికాక మరొక శక్తి కూడా మానవుని దృష్టిని నిర్ణయించటానికి తోడవుతూ ఉందనిమాత్రం అంగీకరించాలి ఇది అంగీకరించకపోతే, మానవుడు పరిష్కరించలేని విషమ పరిస్థితులు కలుగుతాయి భావాన్ని కూడా ఒక శక్తిగా అంగీకరించినంత మాత్రాన భావవాదుల సిద్ధాంతాన్నంతా అంగీకరించవలసిన అవసరంలేదు పదార్థం వేరు, శక్తివేరు అని ఒప్పుకోవలసిన అవసరం లేదు. ఈశక్తే వివిధ రూపాలను ధరిస్తూ ఉందని ఒప్పుకోవలసిన అవసరంలేదు ఈ శక్తి కూడా పదార్థంలోనుంచి పుట్టినదే కావచ్చు తన ప్రభావంవల్ల తాను వృద్ధి చెందగలదు తా నొక శక్తిగా వృద్ధిచెంది, మానవుణ్ణి మార్చగలదు పుట్టటం పదార్థ పరిణామంవల్ల పుట్టినా, పుట్టిన తరువాత తన కాళ్లమీద తను నిలవగలదు

"మీరు అన్నట్లు జ్ఞానం అంత శక్తి గలదైతే ఇతర వర్గాలకు చెందిన మేధావులు, మధ్యలో మోసంచేసి ధనికవాదుల్లో చేరతారు ఎందుకు?" అని అడిగాడు శిష్యుడు

శిష్యుని మనస్సులో చెలరేగుతున్న ఊహలు గురువు గమనించాడు 'మానవుని దృష్టి అచ్చగా ఆర్థిక పరిస్థితినిబట్టే ఉంటుంది' అని చెప్పేవారి వాదన ఇది ఆర్థిక పరిస్థితే కారణం అయినప్పుడు, ఇతర వర్గాలకు చెందిన మేధావులు బీద ప్రజలకు సహాయం చెయ్యటానికి పూనుకోవటంగానీ, బీదవాళ్ల అభివృద్ధికోసం పాటుపడే పార్టీలో చేరటంగానీ, ఎలా తటస్థిస్తుంది?' అనే ప్రశ్నకు 'కీర్తికోసం' అంటున్నారు ఎవ్వరైనా పరిపడక మానుకుంటే 'అదుగో చూడు' అని వేలుపెట్టి చూపుతున్నారు ఇటువంటి మేధావులు ఎవ్వరైనా అగ్రగాములుగా ఉండి విప్లవాన్ని నడిపితే ఏమీ చెప్పలేక 'declassed individuals' అని చెపుతున్నారు ఆర్థిక పరిస్థితికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, భావాల బలాన్ని అంగీకరించకపోవటంవల్ల వచ్చిన చిక్కులు ఇవి ఈ సమస్యలన్నీ శిష్యుని కలవరపరుస్తున్నాయనిగురువు గ్రహించాడు

"నాయనా, అటువంటి వాళ్లు భావాల బలంవల్ల చేరినవాళ్లుగాని ఆర్థికస్థితివల్ల చేరినవాళ్లు కాదు కష్టాలను తట్టుకునే జ్ఞానం వాళ్లకు లేనప్పుడు తమ ప్రయత్నంనుంచి విరమిస్తారు ఇది ఒక్క మేధావులకే కాదు బీద ప్రజలకు కూడా వర్తిస్తుంది. దీనజనోద్ధరణకు కంకణం కట్టుకున్న పార్టీలకు ఎంతమంది బీద ప్రజలు వ్యతిరేకంగా నిలవటంలేదు! వారికి తగిన చైతన్యం లేదని నీవు సరిపుచ్చుకుంటావు వీరిని గురించి కూడా 'కష్టాలను ఎదుర్కొనే 'భావ బలం' వీళ్లకు లేకపోయింది' అని ఎందుకు అనుకోవు? అది కాకుండా మరొక విషయం కూడా నీవు ఆలోచించాలి ఇతర వర్గాలకు చెందిన మేధావులు ఆపేక్షించేది అన్నం కాదు వారిని నడిపేశక్తి స్వతంత్రేచ్ఛ, సత్యాన్వేషణ వ్యక్తిగతంగా వారి అభిలాష ఏదైనా, దారిద్ర్యం నిర్మూలించటం ప్రథమ కర్తవ్యం గనక బీద ప్రజలకోసం, అన్నంకోసం పోరాడే ఉద్యమాలలో పాల్గొంటారు ఒళ్లు దాచుకోకుండా పాటుపడుతారు కాని వారి వ్యక్తిగతఅభిలాషలైన 'స్వతంత్రేచ్ఛ'కు, 'సత్యాన్వేషణ'కు ఈ ఉద్యమాలు అడ్డు తగిలినప్పుడు ఆ ఉద్యమాలనుంచి విరమిస్తారు అంతకంటే గత్యంతరం ఏముంది?" అన్నాడు గురువు

*　　　*　　　*

మానవుని పరిణామానికి దోహదం ఇచ్చే శక్తుల్లో భావానికి ప్రాధాన్యం ఇచ్చి తీరాలి జీవకోటికి తెలివితేటలు వచ్చినప్పటినుంచీ, ఆలోచించగలిగిన శక్తి వృద్ధిపొందినప్పటినుంచీ, భావ ప్రభావం మానవునిమీద ఎక్కువగా కనిపిస్తూవుంది ఆలోచనాపరుల సంబంధాల్లో ఆర్థికదృష్టి ఎంత తక్కువగా కనిపిస్తుందో మనకు తెలిసిన విషయమే! భావానికున్న ఈ శక్తిని మనం అంగీకరించకపోతే, స్వాతంత్ర్యంకోసం ఆస్తులను అమ్ముకున్నవారినీ, ఇతర వర్గాలకు చెందిన బీదవాళ్లకోసం సమస్తం త్యాగం చేసినవారినీ మనం అర్థం చేసుకోలేము

ప్రకృతి నియమబద్ధమైంది మానవుడు ప్రకృతిలో భాగమే అందువల్ల ఈ 'నియమ బద్ధత' ఎప్పుడూ ఉంటూనే వుంది ఇన్ని అవాంతరాలు దాటి ఎవరో ముందుండి దారి చూపుతున్నట్లు ఒక స్థితినుంచి ఒక స్థితికి పరిణామం చెందగలిగేది కాదు స్వభావసిద్ధంగావున్న ఈ నియమ బద్ధతే నీతికి దారి తీసింది



ఆంధ్రపత్రిక సంపాదకవర్గంతో శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు. వారి ఎడమ ప్రక్కన ఉన్నవారు సహాయ సంపాదకులు శ్రీ చల్లా శేషగిరిరావుగారు.

మానవజీవితంలో నీతినియమాలు ఎక్కడనుంచో వచ్చిపడినవి కాదు. ప్రకృతిలోవున్న నియమబద్ధతకు సంబంధించిందే. ఒకరి కొకరు సహాయం చేసుకోవటంవల్లా, అందరూ కలిసి బ్రతకవలసిన అవసరం ఉండటంవల్లా వొచ్చినవే. వారిపిడివల్ల పుట్టి, అవసరంకొద్దీ నిలిచినవే. కాకపోతే పరిణామ క్రమంలో జీవకోటికి ఆలోచనాశక్తి వొచ్చినతర్వాత, సాంఘికపరిస్థితులకు దూరంగా వాటంతట అవి నిలబడగలుగుతున్నై. మానవకోటిని మృగదశకు జారకుండా కాపాడుతున్నై. నీతి నియమాలు సంఘానికి ద్వారపాలకుల్లాగా ఎల్లప్పుడూ ఉండవలసిందే. వీటిని కాపాడి ఆచరించవలసిన బాధ్యత మాత్రం ముందు అన్నంకోసం తాపత్రయపడవలసిన అవసరం లేనివర్గాలది. వారే వీటిని విస్మరించి నిర్దాక్షిణ్యంగా ధనార్జనే పరమార్థంగా పెట్టుకుంటే, అన్నాతురులు తమ పొట్టకోసం వాటినీ తిరస్కరించి విజృంభించటంలో ఆశ్చర్యంలేదు. 'నీవు రేపిన సుడిగాలి నీవే అనుభవిస్తావు'. ధర్మంగా బ్రతుకుతూ, దారిద్ర్యంలో, అజ్ఞానంలో 'దినదినగండంగా'జీవితం వెళ్లబోసుకునే వాళ్ల సమస్యల పరిష్కారానికి సహాయపడి, వాళ్ళు కూడా నీతి నియమాలు పాటించటానికి వీలైన పరిస్థితులను సృష్టించటం పైవర్గాల వారి విధి. అది జరగనప్పుడు ప్రళయమే.

* * *

మానవుడు పరిణామంలోని రాబోయే దశకు వెళ్లటానికి భయపడుతున్నాడు. ఈనాడు మానవ జీవితానికి ఏవి ముఖ్యావసరం అనుకుంటున్నాడో, వాటికి రాబోయే దశలో విలువ ఉండదు. 'అవి ఊతంగా లేని స్థితిలో తను ఎలా బ్రతికేటట్లు? తను ఏమైపోతాడో?' అని విపరీతమైన భయంతో వణికిపోతున్నాడు. ఇప్పటి లక్షణాలనుబట్టి ఆ స్థితిలో ఇప్పుడున్న ఆర్థిక సంబంధాలు, ఇప్పుడున్న విలువలు అన్నీ తారుమారు అయ్యేటట్లు కనిపిస్తున్నయి. ఇప్పుడున్న మానవుని చిత్త ప్రవృత్తికి ఆస్థితి ఏమీ ఆకర్షవంతంగా కనుపించటంలేదు. పర్వత శిఖరాగ్రంనుంచి లోయలోకి దూకవలసిన మనిషికిమల్లే భయపడుతున్నాడు. కాని పరిణామశక్తి అతన్ని ముందుకు నెడుతూవుంది. అతను ఉక్కిరిబిక్కిరై ఎదురు తిరిగి పోరాడుతున్నాడు. రావలసిన స్థితికి దోహదం ఇచ్చే గుణాలను నిర్మూలించుకుంటున్నాడు. ఏ సంస్కారం, ఏ విజ్ఞానం, ఏ నైతిక దృష్టి తనను "ముందుకు వెళ్లు, ముందుకువెళ్లు" అని ప్రోత్సహిస్తూ ఉందో, బలవంతపెడుతూ ఉందో దాని గొంతు నులమటానికి పూనుకున్నాడు. అది నశిస్తేగాని తనకు రక్షణలేదు అనుకుంటున్నాడు. మృగదశకు తరలిపోవటానికి ఉవ్విళ్లూరుతున్నాడు. ఆత్మహత్య చేసుకుంటున్నాడు.

ఇదీ నేటి విషమావస్థ. ఒక్క సంఘమే కాదు, ఏ మానవుడికి ఆమానవుడే విషమావస్థలోపడి కొట్టుకుంటున్నాడు. అధోగతికి పోతున్న ప్రస్తుత పరిస్థితులలో బ్రతకడానికి అవసరం అయిన దృష్టి, ఈ దృష్టికి వ్యతిరేకంగా ముందు స్థితికి వెళ్లమని ప్రోత్సహిస్తున్న పరిణామశక్తి—ఈ రెంటికీ సమన్వయం కుదరక గగ్గోలు పడుతున్నాడు. తనలో రేగిన ఈ ద్వంద్వ సంరంభంవల్ల నిర్వీర్యుడై దిగాలుపడి కూర్చున్నాడు.

మానవుడు రక్షింపబడాలి. పరిణామం అవిఘ్నంగా ముందుకు సాగిపోవాలి. మానవుని పతనానికి కారణం అయిన దారిద్ర్యాన్ని నిర్మూలించి, పురోగమనానికి అవకాశం కలిగించే పరిస్థితులు సృష్టించాలి. మానవునిలో వున్న, వచ్చే దశను సూచించే లక్షణాలకు ప్రోత్సాహం ఇచ్చి విజృంభింపజెయ్యాలి. ఆ శక్తులను సంఘటితపరచి, ముందుకు నడవాలి. మానవునికి 'చిన్నచూపు' అలవాటైంది. స్వభావమైంది. ప్రతివస్తువునీ విభజించిగాని చూడలేక పోతున్నాడు. ఏ ముక్కకి ఆ ముక్కే పరిపూర్ణం అనుకుంటున్నాడు. వీటిని అన్నిటినీ కలిపి చూడగల శక్తి అతనికి కావాలి. భిన్నత్వంలో ఏకత్వం చూడగలగాలి. మానవుడు ముఖ్యం. మానవుని శ్రేయస్సు మనం కాంక్షించేది. మానవుని సహజ శక్తులు అభివృద్ధి చెందటానికి అవకాశం కలిగించటం లక్ష్యం. ఏ రూపంలో, ఏ పేరుతో మానవుని స్వతంత్ర పిపాసను అరికట్టటానికి ప్రయత్నించినా అది మానవుని పతనానికీ, సంఘ వినాశనానికీ దారి తీస్తుంది.

ప్రపంచపురోగమనాన్ని నిర్ణయించటానికి కొలబద్ద మానవుడే. అతన్ని వదిలి సంఘ శ్రేయస్సు అనేది ప్రత్యేకం లేదు. దేశం, సంఘం, వర్గం, పార్టీ—ఈ భిన్న దృక్పథాలకు ఆదర్శం మానవుని సహజ శక్తులు విజృంభించే అవకాశం కలుగజెయ్యటమే గాని, తమకు మానవునికి భిన్నంగా వ్యక్తిత్వం ఆపాదించుకొని, ఏదో ఒక వంకతో అరికట్టటం కాదు. ఏ దృక్పథమైనా అతని పరిణామానికి దోహదం ఇచ్చేదిగా వుండాలి. కాని, అతనిమీద పెత్తనం చెలాయించేదిగా వుండగూడదు.

"Man is the measure of things"

# స్వవిషయము

"ఆంధ్రభాషయందు సంవత్సరాది సంచికను ముద్రించుట కిదియే ప్రథమ ప్రయత్నము" అని ఆంధ్రపత్రిక స్థాపకులు నాగేశ్వరరావు పంతులుగారు 1910 సాధారణ సంవత్సరాదిని ప్రచురించిన ఆంధ్ర పత్రిక తొలి సంవత్సరాది సంచిక తొలి "విన్నపము"లో తెలిపారు.

"ఆంధ్రదేశమునందు భాషాభిమానులు, విద్యావంతులు, గ్రంథకర్తలు, సంఘ సంస్కరణ పరాయణులు మొదలగు పూజార్హు లనేకులు గలరు. ఈ మహనీయుల సౌశీల్య సద్భావన లాంధ్రలోకాభివృద్ధికి దోడ్పడుచున్నవి. ఈ సత్పురుషుల కృపా పరిచయమును దృఢపరచుటయే ఈ సంచిక ప్రధానోద్దేశము" కావడం వల్ల ఈ సంవత్సరాది సంచికలు తొలి ప్రచురణ మొదలు తడవని ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన విషయాలంటూ లేవు. వివిధ విషయాలు గురువైనవీ, గంభీరమైనవీ ఈ సంచికలలో చర్చితాలు. వాటితో ఆంధ్రావళిలో పలురీతుల ఆశలు చివురులెత్తాయి. స్వభాషాభిమానం గాఢతరమయి ప్రత్యేక విశ్వవిద్యాలయం, ప్రత్యేకరాష్ట్రం అవసరమనే తపన రగిలింది. ఆంధ్రచరిత్రకు, దేశ చరిత్రకు చరిత్ర మొదలయింది. ఆధునిక విజ్ఞానశాస్త్ర విషయావబోధకోసం జిజ్ఞాసాంకురాలు మొలకెత్తాయి. భాషలో కొత్త తీరు తీయాలు పొడగట్టాయి. భావంలో ఛవ్వరీతులు ఏర్పడ్డాయి. కవితలో కొత్త పోకడలు పొటమరించాయి. వీటివల్ల ప్రతి సంచిక ఆ యా సంవత్సరపు ఆంధ్ర సమష్టి చరిత్రకు దర్పణమైంది, తర్వాతి సంవత్సరపు ప్రగతికి దోహదమయింది.

"విద్యాపరిషత్తును స్థాపించి, గ్రంథ భాషాంతరీకరణ వ్యవహారమును జరుపుటకు, ముఖ్యావశ్యకమైన సంపూర్ణ నిఘంటువు నొక్కటికిని రచింపజేయుటకును బనిబూనవచ్చును. దీనివలన మన యాంధ్రులకు ముఖ్యపట్టణ మొకటి లేనిలోపము దొలగును. బహువిధ పరిశ్రమములవలన బహుజన జీవనోపాయమునకు మార్గము కలుగును. దీనివలన నాంధ్ర విశ్వ విద్యాలయ మొక్కటి తలసూపుటకవకాశము కలుగును." అని పంతులుగారు తొలి సంవత్సరాది సంచికలో "ఆంధ్ర మహాజనుల కొక విన్నపము"లో సూచించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపన అవసరమని అప్పుడే ఘంటాపథంగా చెప్పిన కీర్తి ఆంధ్రపత్రిక తొలి సంవత్సరాది సంచికదే.

సంవత్సరాది సంచికల ప్రచురణ ఏ రీతిగా ప్రప్రథమము, విశిష్టము, మార్గదర్శకము అయిందో ఈ స్వర్ణోత్సవ సంచిక ప్రచురణకూడా ప్రప్రథమము, విశిష్టము, పథప్రదర్శకమూను. దీనిలో ముఖపత్రం మొదలు తుదిపుటవరకు సంకలితాలైన అంశాలన్నీ పాత సంవత్సరాది సంచికలలోవే.

ఈ యాభై సంవత్సరాల చరిత్రను సింహావలోకనం చేస్తున్నట్టిది ఈ స్వర్ణోత్సవ సంచిక. ఇరవయ్యో శతాబ్దంలో తొలి సగం—యాభై సంవత్సరాలు-అవధిగా పెట్టుకొని సంవత్సరాది సంచికలలోని వివిధ విషయాలను, మణిపూసలవంటివాటిని ఈ స్వర్ణోత్సవ సంచికలో చేర్చాము. అలా చేర్చడంలో ఇతరత్రా గ్రంథరూపంలో ప్రచురితం కాని వ్యాసాలనే సాధ్యమైనంతవరకు చేర్చాము. విషయ విస్తృతిని, ఆంధ్రదేశ విస్తృతిని దృష్టిలో ఉంచుకుని ప్రాచీనాధునాతన దృక్పథాలను తెలిపే వ్యాసాలను—భావనాబలం, దూరదృష్టి, ఆధునిక వైఖరి, నిష్కం తొణికిసలాడే వ్యాసాలను ఏరాము. రచయితలలో అప్పటినుంచి ఇప్పటివరకు కలిగిన పరిణామ దశలను చూపడానికి కూడ ప్రయత్నించాము.

ఆయా రంగాలలో కృషిచేసి, ఉద్దండులని పేరుమోసిన పెద్దలను, నేటివారికి—ముఖ్యంగా యువకులకు—తెలియనివారిని, పరిచయం చేయడంకోసం వారి ఛాయా చిత్రాలు దాదాపు డెబ్బయి ప్రచురించాము. వీటిలో పెక్కు అపూర్వమైనవి, అనిదంపూర్వమైనవి, మరెక్కడా లభించనివీను. వ్యంగ్య చిత్రాలు దాదాపు నలభై అప్పటి మన స్థితిని తెలుపుతాయి.

ఈ సంచికలో రాజకీయ వ్యాసాలు కనిపించవు. దీనికి కారణం సంవత్సరాది సంచికలలోను రాజకీయ సాహిత్యం అంతగా ప్రచురితం కాకపోవడమే. రాజకీయోద్యమాలు, రాజకీయ సంఘటనలు సంభవించాయికాని, రాజశాస్త్ర సంబంధమైన పరిశోధన వ్యాసాలు ఇతర రంగాలలో వచ్చినట్టుగా రాలేదు. "రాజ్యాంగ వ్యవహారములను గురించి ఎవరును వ్రాసియుండలేదు." అని 1912 పరీధావి సంవత్సరాది సంచిక ప్రస్తావనలో పంతులుగారు వివరించారు కనుక ఈ స్వర్ణోత్సవ సంచికలో రాజకీయ వ్యాసాలు సంకలితం కాలేదు. సంస్కృతికి చరిత్రకు, సాహిత్యానికి, ఇతర శాస్త్ర విషయాలకు, కళలకు సంబంధించిన వ్యాసాలకే సంకలనం పరిమితం అయింది.

అర్ధ శతాబ్దిపైగా ధారావాహికంగా వెలువడుతున్న సంవత్సరాది సంచికలు ఆంధ్రజాతి సంస్కృతి రంగంలో చేసిన సేవ ఎలాటిదో, ఆంధ్రావళికి తెలుపుతాయి, దానికి ఆదర్శాలుగా నిలబడుతాయి; మణిదీపాలుగా వెలుగొందుతాయి. ఆమణి దీపాలవెలుగును ఎంతో కొంత ప్రతిఫలింపజేసే వెలుగురేక ఈ స్వర్ణోత్సవ సంచిక; ఆంధ్రపత్రిక చరిత్రకు జ్ఞాపికే ఈ స్వర్ణోత్సవ సంచిక. దీనిని ఆంధ్రావళికి అందజేస్తున్నాము.

"ఈ సంచికను ప్రచురించుటకుగల సామర్థ్య మాంధ్ర మహాజనుల సాహాయ్యమువలన గలిగినది......ఈ కార్య సాఫల్యమునకు దోడ్పడిన మిత్రు లనేకులు గలరు. వారల సౌహార్ద భావమునకు వందనములు" అని పంతులుగారు తొలి సంచికలో పేర్కొన్నట్టు ఆంధ్రపత్రిక తలపెట్టిన కృషికి ఇంతకాలంగా సహకరిస్తూవచ్చిన ఆంధ్రమహాజనులందరికీ ఈ స్వర్ణోత్సవ శుభ సమయంలో కృతజ్ఞత తెలుపుతున్నాము.

# INDEX TO ADVERTISERS




ఆమె ఆరోగ్యం కోరి అమ్మ చెప్పిన మాటలో ఎంత అనుభవం వుందీ! ఎందు కంటే కడుపులో బిడ్డ తల్లి నుంచే తన పోషకాహారాన్ని తీసు కుంటుంది. తల్లికీ, బిడ్డకీ కావలసిన అత్యవసర పదార్థాలు నిత్యమూ తినే తిండిలో లభించక పోవచ్చు అందుకనే రోజూ ఒక్కొ ప్రీనేటల్ కేప్స్యూల్ వేసు కోడం చాలా మంచిది

ప్రీనేటల్ కేప్స్యూల్ సుగుణాలేవిటో డాక్టర్లందరికీ తెలుసు ఎనిమిది రకాల విటమినులూ, నాలుగు రకాల ఖనిజ పదార్థాలూ సరైన పాళ్లలో కలిపి, తల్లికీ, బిడ్డకీ కావలసిన ఈ పోషకాహారాన్ని లెడర్లీ కంపెనీ ప్రత్యేకంగా తయారు చేసింది.

ఒక్క ప్రీనేటల్ కేప్స్యూల్ వేసు కుంటే చాలు. నిత్యమూ అవసరమైన పోషక పదార్థాలు లభిస్తాయి...వెల *15* పైసలు మాత్రమే.

*ప్రతి ప్రీనేటల్ కేప్స్యూల్ లోనూ బిడ్డ ఆరోగ్యానికీ, తల్లి క్షేమానికీ చాలా అవసరమైన ఎనిమిది రకాల విటమినులూ, నాలుగు రకాల ఖనిజ పదార్థాలూ వుంటా యని గుర్తుంచుకోండి. వీటివల్ల శరీరానికీ ఎముకలకే, రక్త నాళాలకే ఎంతో మేలు కలుగుతుంది; రోగ నిరోధక శక్తి కలుగుతుంది*

ప్రసవానికి ముందు తీసుకోవలసిన జాగ్రత్తను గురించి తగిన సలహాలిచ్చే ఉచిత కరపత్రం ప్రతి కావాలంటే సయానమిడ్ ఇండియా లిమిటెడ్, పోస్టు బాక్సు నెం **195**, హైదరాబాద్-**1** కు వ్రాసిగాని, మీ మందుల షాపులో గాని తీసుకోవచ్చు

శుభస్య శీఘ్రం! ఇవాళ్టి నుంచే

## ప్రీనేటల్

### కేప్స్యూల్

వేసుకోడం ఆరంభించండి రోజుకి ఒక్కటి చాలు




Lederle లెడర్లి డివిజన్. సయానమిడ్ ఇండియా లిమిటెడ్ CMCP.12-TEL

G K R pp 1—5 G No 1 & 2 INDEX

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7 Thambuchetty Street, Madras-1 Chief Editor. S. Sambhu Prasad.